ఓమ్

వాసిష్ఠ రామాయణము

అను

# శ్రీయోగవాసిష్ఠము

(తాత్పర్యప్రకాశికయను ఆంధ్రానువాద సహితము)

## మహర్షి వాల్మీకి ప్రణీతము

ఉత్తరార్ధము - చతుర్థ సంపుటము


అనువాదకులు

శ్రీ విద్యా ప్రకాశానందగిరి స్వాములవారు



సంపాదకులు - ప్రకాశకులు

శ్రీ వ్యాసాశ్రమము

వ్యాసాశ్రమము పోస్టు, (మార్గము) ఏర్పేడు, చిత్తూరు జిల్లా (ఆ.ప్ర.)

పిన్ : 517 621 ఫోన్ నెం. 08574 - 68528

1997


★

| | | | |
|---|---|---|---|
| ప్రథమ ముద్రణ | 1948 | 1000 | ప్రతులు |
| ద్వితీయ ,, | 1969 | 1000 | ,, |
| తృతీయ ,, | 1997 | 2000 | ,, |
| | మొత్తం | 4000 | ,, |

వెల రూ.



ప్రకాశకులు :

శ్రీవ్యాసాశ్రమమువారు

ధార్మికగ్రంథ ప్రచురణకు ఆర్థిక సహాయం అనే పథకం క్రింద **తిరుమల తిరుపతి దేవస్థానం వారిచ్చిన ఆర్థిక సహాయంతో ఈ గ్రంథం ప్రచురింపబడింది.**

ప్రతులకు :

**మేనేజరు - శ్రీవ్యాసాశ్రమము,**

వ్యాసాశ్రమము పోస్టు, (మార్గము) ఏర్పేడు,

చిత్తూరు జిల్లా, (ఆ.ప్ర.), పిన్ : 517 621



ముద్రణ :-

శక్తి ప్రాసెస్

నెం. 2/1 F కుంభాలమ్మన్ కోయిల్ స్ట్రీట్,

మద్రాసు - 81 ✆ 5950331

# నివేదన

శ్రీవ్యాసాశ్రమం వారు ప్రకటించిన ఆధ్యాత్మిక గ్రంథాలు ఆంధ్రదేశంలో విస్తృతప్రచారం పొందాయి. వాటిలో తలమానికంగా ఎన్నదగినది యోగవాసిష్ఠం. దీన్ని 'వాసిష్ఠ రామాయణం', 'వసిష్ఠగీత' అని కూడా వ్యవహరిస్తారు.

వాల్మీకి కృతిగా ప్రసిద్ధమైన ఈ గ్రంథంలో ముప్పది రెండువేల శ్లోకా లున్నాయి. వైరాగ్య - ముముక్షు - ఉత్పత్తి - స్థితి - ఉపశమ - నిర్వాణ ప్రకరణా లన్న పేరుతో ఆరు విభాగా లున్నాయి. అద్వైతవేదాంతం ఈ పుస్తకంలో అత్యద్భుతంగా ప్రతిపాదింపబడింది. వసిష్ఠ మహర్షి శ్రీరామ చంద్రుణ్ణి ఉద్దేశించి చేసిన తత్త్వోపదేశమే ఇందలి విషయం.

"మహాగ్రంథాలలో ఒకటైన యోగ వాసిష్ఠం నాదృష్టిలో ప్రపంచంలో వ్రాయబడిన గ్రంథాలన్నింటిలోనూ అత్యాశ్చర్యకరమైనది" (One of the greatest books, the most wonderful according to me ever written under the sun, is Yogavasistha.) అని శ్రీ స్వామి రామతీర్థులవారు ఈ గ్రంధాన్ని ప్రశంసించి వున్నారు.

దీన్ని మహర్షి సద్గురు శ్రీమలయాళస్వాములవారు సమగ్రంగా ఆంధ్రతాత్పర్యంతో సహా నలుబదేండ్ల క్రితం ముద్రింపజేశారు. అంతకు ముందెవరూ దీన్ని తెలుగులో సంపూర్ణంగా ముద్రించలేదు. శ్రీ సద్గురు స్వాములవారి ప్రోత్సాహంతో శ్రీపూర్ణానందేత్యవర నామధేయ శ్రీనిర్వికల్పానంద స్వాములవారు ఈ గ్రంథానికి చెందిన పూర్వార్ధాన్ని అనువదించారు. తరువాతి భాగాన్ని శ్రీ సద్గురు దేవుల ముఖ్య శిష్యులు శ్రీ విద్యా ప్రకాశానంద స్వాములవారు తెనిగించారు. 1936 లో ప్రారంభమైన దీని ముద్రణ 1954 లో పూర్తి అయింది. నాల్గువేల పుటలకు పైబడిన ఈ పుస్తకం మొదట నాలుగు సంపుటాలుగా రాయల్ సైజులో ప్రచురింపబడింది.

జిజ్ఞాసువులైన పాఠకుల ప్రీతికి పాత్రమై మూడుసార్లు ముద్రితమయింది.

ఇటీవల చాలాకాలం నుండి దుర్లభంగా వుండిపోయిన ఈ గ్రంథరత్నం కావాలంటూ ఆశ్రమానికి పలువురు లేఖలు వ్రాసేవారు. భగవదనుగ్రహం వల్ల, గురుకరుణవల్ల ఈ మహాగ్రంథాన్ని ఇప్పుడు మళ్లీ ప్రచురించే సదవకాశం లభించింది. పాఠకుల సౌకర్యాన్ని దృష్టిలో ఉంచుకొని దీని నిప్పుడు డెమ్మీ 1/8 సైజులో ఎనిమిది సంపుటాలుగా ప్రచురిస్తున్నాము.

ఈ గ్రంథగౌరవాన్ని గుర్తించి తిరుమల తిరుపతి దేవస్థానం వారు దీని పునర్ముద్రణకు ఉదారంగా ఆర్థిక సహాయం అందించారు. ఇందుకు దేవస్థానం పాలకమండలికి ఎంతో కృతజ్ఞులము. ఈ విషయంలో సహకరించిన ఆశ్రమపూర్వ విద్యార్థి, తిరుమల తిరుపతి దేవస్థానం ధర్మప్రచార పరిషత్ కార్యదర్శి శ్రీ సముద్రాల లక్ష్మణయ్యగారిని అభినందిస్తున్నాము.

ఈ ఉద్గ్రంథం ఇంకా విస్తృత వ్యాప్తి చెంది పాఠకులకు ఆత్మానందాన్ని ప్రసాదించుగాక!

శ్రీ వ్యాసాశ్రమం — ప్రకాశకులు

22-8-1997.

# శ్రీ యోగవాసిష్ఠము

## ( ఉత్తరార్ధము )



## విషయానుక్రమణిక

### నిర్వాణ ప్రకరణము, ( ఉత్తరార్ధము )


| సర్గ | విషయము | పుట |
| --- | --- | --- |
| 128 ,, | బ్రహ్మాకాశవిపశ్చిజ్జగద్దృష్టి దర్శనము | 3627 |
| 129 ,, | విపశ్చిన్మృగలాభము | 3634 |
| 130 ,, | మృగవహ్నిప్రవేశము | 3643 |
| 131 ,, | భాససంసారవర్ణనము | 3648 |
| 132 ,, | భాసవర్ణితస్వజన్మపరంపర | 3659 |
| 133 ,, | శవోపాఖ్యానమున మహాశవవర్ణనము | 3663 |
| 134 ,, ,, | దేవపరిదేవన వర్ణనము | 3668 |
| 135 ,, ,, | శవోపశమవర్ణనము | 3677 |
| 136 ,, ,, | మశకవ్యాధబోధనము | 3680 |
| 137 ,, ,, | జాగ్రత్స్వప్నతురీయవర్ణనము | 3685 |
| 138 ,, ,, | చిత్తసర్వాత్మకతా ప్రతిపాదనము | 3695 |
| 139 ,, ,, | జగన్నాశవర్ణనము | 3701 |
| 140 ,, ,, | హృదయకల్పనావర్ణనము | 3712 |
| 141 ,, ,, | కల్పాంతవర్ణనము | 3722 |
| 142 ,, ,, | జగద్గతకర్మనిర్ణయము | 3724 |
| 143 ,, ,, | నిర్వాణబోధోపదేశము | 3732 |
| 144 ,, ,, | పదార్థవిచారము | 3746 |
| 145 ,, ,, | జాగ్రత్స్వప్న సుషుప్త వర్ణనము | 3755 |
| 146 ,, ,, | సుషుప్తి విచారము | 3766 |
| 147 ,, ,, | స్వప్నోపలంభనము | 3771 |

| సర్గ | విషయము | పుట |
|---|---|---|
| 148 ,, ,, | స్వప్ననిర్ణయము | 3776 |
| 149 ,, ,, | కారణవిచారము | 3782 |
| 150 ,, ,, | పరమోపదేశము | 3789 |
| 151 ,, ,, | అభావదర్శనము | 3798 |
| 152 ,, ,, | మునిరాత్రి సంకథావర్ణనము | 3800 |
| 153 ,, ,, | సర్వైకాత్మ్య ప్రతిపాదనము | 3803 |
| 154 ,, ,, | యథాభూతార్థ వర్ణనము | 3807 |
| 155 ,, ,, | భావిసంపత్తి వర్ణనము | 3811 |
| 156 ,, ,, | సింధుసంబోధనము | 3819 |
| 157 ,, ,, | సింధునిర్వాణము | 3824 |
| 158 ,, ,, | శివనిర్ణయము | 3830 |
| 159 ,, | విపశ్చిత్సంసారభ్రమవర్ణనము | 3833 |
| 160 ,, | స్వర్ణనరకోపలంభ వర్ణనము | 3844 |
| 161 ,, | నిర్వాణవర్ణనము | 3853 |
| 162 ,, | అవిద్యానిరసనము | 3861 |
| 163 ,, | ఇంద్రియజయోపాయశాస్త్ర వర్ణనము | 3866 |
| 164 | జగత్పరమాత్మలఐక్య ప్రతిపాదనము | 3876 |
| 165 | జాగ్రత్స్వప్నైక్యోపదేశము | 3879 |
| 166 | శిలోపాఖ్యానము | 3882 |
| 167 | జాగ్రత్స్వప్న సుషుప్త్యభావ ప్రతిపాదనము | 3889 |
| 168 | కాలభంజకోపదేశము | 3896 |
| 169 | విశ్రాన్తచిత్తవర్ణనము | 3906 |
| 170 | తత్త్వజ్ఞ వ్యవహారవర్ణనము | 3914 |
| 171 | ద్వైతైక్యనిరామయయోగోపదేశము | 3919 |
| 172 | జగత్తుయొక్క బ్రహ్మత్వప్రతిపాదనము | 3929 |
| 173 | బ్రహ్మగీతలందు పరమార్థోపదేశము | 3938 |
| 174 ,, | నిర్వాణోపదేశము | 3944 |
| 175 ,, | పరమార్థగీతలందు అద్వైత యుక్తి వర్ణనము | 3949 |
| 176 ,, | బ్రహ్మాండోపాఖ్యానము | 3962 |

| సర్గ | విషయము | పుట |
|---|---|---|
| 177 ,, | సత్యవర్ణనము | 3967 |
| 178 ,, | ఐందవోపాఖ్యానము | 3975 |
| 179 ,, | బ్రహ్మమయత్వ ప్రతిపాదనము | 3985 |
| 180 ,, | తాపసోపాఖ్యానము | 3989 |
| 181 ,, | ,, | 3995 |
| 182 ,, | తాపసోపాఖ్యానాన్తర్గత సప్తద్వీపేశ్వరోపాఖ్యానమున సప్తద్వీపేశ్వరవర్ణనము | 4001 |
| 183 ,, | ద్వీపసప్తకాష్టకవర్ణనము | 4009 |
| 184 ,, | కుందదంతోపదేశము | 4020 |
| 185 ,, | కుందదంతప్రబోధము | 4028 |
| 186 , | "సర్వంఖల్విదం బ్రహ్మ" అను ప్రతిపాదనము | 4032 |
| 187 | జీవునియొక్క సంస్కారప్రతిపాదనము | 4047 |
| 188 | జీవరూప వర్ణనము | 4058 |
| 189 | బ్రహ్మైకతా ప్రతిపాదనము | 4063 |
| 190 | రామవిశ్రాంతి | 4066 |
| 191 | మహావాదబోధనము (తత్త్వానుసంధానము) | 4085 |
| 192 | విశ్రాంత్యుపగమ వర్ణనము | 4089 |
| 193 | విశ్రాంతి కథనము | 4093 |
| 194 | రామవిశ్రాంత్యుపగమము | 4096 |
| 195 | బోధప్రకాశీకరణ యోగోపదేశము | 4104 |
| 196 | కాష్ఠవైవధికోపాఖ్యానమున చింతామణిలాభము | 4115 |
| 197 | శాస్త్రమాహాత్మ్యము | 4119 |
| 198 | సమదృష్టి ప్రశంసావర్ణనము | 4125 |
| 199 | ముక్తపురుషస్థితివర్ణనము | 4132 |
| 200 | సాధువాదసపర్యాదివర్ణనము | 4139 |
| 201 | విశ్రాంతిప్రకటీకరణము | 4149 |
| 202 | ఆత్మవిశ్రామాంగీకరణము | 4155 |
| 203 | నిర్వాణవర్ణనము | 4157 |

| సర్గ | విషయము | పుట |
|---|---|---|
| 204 | చిదాకాశైకతా ప్రతిపాదనము | 4165 |
| 205 | సర్గకారణనిరాసము | 4169 |
| 206 | బ్రహ్మవిషయ మహాప్రశ్న | 4175 |
| 207 | మహాప్రశ్నోత్తర వర్ణనము | 4181 |
| 208 | మహాప్రశ్నోత్తర మోక్షణము | 4187 |
| 209 | మహాప్రశ్నోత్తరమున సర్వాస్తిత్వానుభూతి దర్శనము | 4192 |
| 210 | మహాప్రశ్నోత్తర వాక్యసమాప్తి | 4199 |
| 211 | పరమార్థోపదేశము | 4206 |
| 212 | పరమార్థ నిరూపణము | 4211 |
| 213 | ప్రాక్తనరామశిష్యత్వోపాఖ్యానము | 4216 |
| 214 | ఉపదేశమహోత్సవ వర్ణనము | 4225 |
| 215 | గ్రంథప్రశంసాతద్వాచనాదివిధి | 4233 |
| 216 | గురువులకొఱకు శిష్యులచే ఆత్మనివేదనము | 4237 |


ఓమ్ తత్ సత్.



## అష్టవింశాధిక శతతమః సర్గః

[ తమఃశ్వభ్రం సముత్తీర్య బ్రహ్మాణ్డావరణాని చ
విపశ్చితోఽత్ర భ్రమణమవిద్యాయాముదీర్యతే.

అంధకారరూపమగు గర్తమును, బ్రహ్మాండావరణములను దాటి విపశ్చిత్తు అవిద్య యందు, పరిభ్రమించుట యిచట వర్ణింపఁబడుచున్నది.]

శ్రీ వసిష్ఠ ఉవాచః—

అస్మదా దేర్జనస్యైతత్ప్రత్యక్షం నానుమానికమ్
శుద్ధబోధశరీరేణ నాధిభౌతికరూపిణా. 1

శ్రీవసిష్ఠుఁడు:— ఓ రామచంద్రా! పైనఁదెల్పిన జ్యోతిశ్చక్ర, బ్రహ్మాండకపాల, తత్పరిమాణాదులన్నియు మావంటియోగుల శుద్ధజ్ఞానరూపమగు సూక్ష్మశరీరముచేఁ బ్రత్యక్షముగ, గాంచఁబడినవేగాని అనుమానముచేఁ జెప్పబడినవికావు. మఱియు స్థూలశరీరముచేఁ గాంచఁబడిన వియునుగావు. (కావున నిక్కథన మనుభవపూర్వకమే యగును.)

ఏతదస్మజ్జగత్స్వప్నే నాన్యేషు కథితం మయా
అన్యేష్వస్తిజగత్స్వప్నే ష్వే వమన్యాపి చ స్థితిః. 2

ఓ రామచంద్రా! లోకాలోక, జ్యోతిశ్చక్రాదులతోఁగూడిన యే బ్రహ్మాండమును గూర్చి నీకిపుడు వర్ణించి చెప్పితినో, అయ్యది మనముగాంచు ఈ జగత్స్వప్నమున ప్రసిద్ధమైయున్నది. దానినే నేను జెప్పితినిగాని తక్కినవానినిగాదు. ఇంకను ఈ జగత్స్వప్నమున ననేకబ్రహ్మాండములు కొన్ని యిట్టి స్థితియే గల్గియు, కొన్ని విలక్షణమైన స్థితి గల్గియు వర్తించుచున్నవి.

జగత్స్వప్నేషు చాన్యేషు సంస్థానకథనేన కిమ్
నహ్యోవయోగికాదన్యా కథా భవతి ధీమతామ్. 3

ఈ జగత్స్వప్నమందలి యాతక్కిన్న బ్రహ్మాండములఁగూర్చి చెప్పుటచే నేమి ప్రయోజనము? మఱియు. బుద్ధిమంతులు ఉపయోగమైనదానికంటె నధికముగఁ జెప్పరుగదా!

సర్వేషాముత్తరేమేరుర్లోకాలోకశ్చ దక్షిణే
యేషామిత్యనుమాశేషభూతౌఘే తేన పణ్డితాః. 4

ఓ పండితులారా! బ్రహ్మాండము లన్నింటిమధ్యను. సప్తద్వీప, సముద్రముల కుత్తరమున మేరుపర్వతము గలదు; దక్షిణమున లోకాలోకపర్వతముగలదు - అని యీ ప్రకారముగ, సమస్తభూత సముదాయమందును నెవరికి జిజ్ఞాసగలదో, వారు అనుమానము చేయుదురుగాక;

ప్రత్యక్షమేతదన్యేషాం యత్ర తేఽన్యే జగద్భ్రమాః
నాస్మాకం విషయే తే హి తథా సంస్థానశోభినః. 5

ఇఁక నాయాబ్రహ్మాండములందలి తక్కిన అవాంతర విశేషములన్నియు నచటనుండు వారికే ప్రత్యక్షమైయున్నవిగాని యిచటనుండు వారికిఁగాదు.

సర్వేషాముత్తరే మేరుర్లోకాలోకశ్చ దక్షిణే
సప్తద్వీపనివాసానాం నాన్యేషామితి నిశ్చయః. 6

సప్తద్వీపనివాసులందఱికి మాత్రమే యుత్తరమున మేరుపర్వతము, దక్షిణమున లోకాలోక పర్వతము గలదుగాని బ్రహ్మాండముకంటె బాహ్యమునకేగిన తదితరులకు, గాదనుట నిశ్చయము.

ప్రకృతం శృణు హే రామ తద్బ్రహ్మాణ్డకవాటకమ్
యత్ప్రమాణం తతో వారి బాహ్యే దశగుణం స్థితమ్. 7

తద్బ్రహ్మాణ్డకవాటం తు తృణం తృణమణిర్యథా
ధత్తే వారి స్వభావేన నిత్యం కల్పకరత్నవత్. 8

ఓ రామచంద్రా! ఇఁకనిపుడు ప్రస్తుతవిషయమును గూర్చి వినుము - నూరుకోట్ల యోజనముల విస్తీర్ణముగల యేబ్రహ్మాండ కపాలములఁగూర్చి నీకు వర్ణించి చెప్పితినో, వాని కావల వానికిఁ బదిరెట్లధికమగు జలభాగము గలదు. ఆ జలమును ఆ బ్రహ్మాండ కపాలములు తమ పార్థివభాగముయొక్క యాకర్షణశక్తిచే, తృణచుంబకమణి తృణమును ధరించునట్లు, ధరించుచున్నవి.

సర్వేషామేవ భావానాం స్థితః కల్పకరత్నవత్
సర్వదా పార్థివో భాగస్తేనాత్రైతే పతన్త్యలమ్. 9

జలాది సమస్తపదార్థములందునుగూడ 'కల్పకరత్నమువలె, పృథివీసంబంధమగు భాగము సదాస్థితి నొందియున్నది. కావుననే వర్షజలాదులు ఆ పార్థివభాగముయొక్క యాకర్షణచే సముద్రనద్యాదులందుఁ బడుచున్నవి.

జలాద్దశగుణం బాహ్యే స్థితం తేజో నిరిన్ధనమ్
ఆకాశవిశదం శాన్తస్తబ్ధజ్వాలోదరోపమమ్. 10

పైన, దెల్పఁబడిన బ్రహ్మాండకపాలావరణభూతమగు జలమున కావలయద్దానికిఁబదిరెట్లధికముగ, ఆకాశమువలె నిర్మలమై, శాంత. స్తబ్ధ జ్వాలయొక్క మధ్యభాగమును బోలినదై, ఇంధన (కాష్ఠ) రహితమైనట్టి తేజము (అగ్ని) వెలయుచున్నది.

తస్మాద్దశగుణో బాహ్యే సంస్థితో వాయురాయతః
వాయోర్దశగుణం బాహ్యే వ్యోమ తిష్ఠతి నిర్మలమ్. 11

ఆ తేజమున కావల దానికిఁ బదిరెట్లధికమగు వాయువు గలదు. ఆ వాయువున కావల యద్దానికిఁ బదిరెట్లధికమగు నిర్మలమైన యాకాశము గలదు.

తతః పరతరం శాన్తం బ్రహ్మాకాశమనన్తకమ్
న ప్రకాశం నచ తమో మహాచిద్ఘనమవ్యయమ్. 12

ఆ యాకాశమున కావల శాంతమై, అనంతమైనట్టి మాయాశబలిత బ్రహ్మాకాశముగలదు. ఆ బ్రహ్మాకాశము ప్రకాశముకాదు, అంధకారముకాదు, నాశరహితమగు మహాచిద్ఘనరూపమై యున్నది.

అనాదిమధ్యపర్యన్తే తస్మిన్స్వహ్మ మహామ్బరే
మహాచిన్నామ్ని సర్వాత్మన్య యోనిర్వాణరూపిణి. 13

బ్రహ్మాణ్డానాం తాదృశానాం దూరే దూరే పునః పునః
మిథోలక్షాణి లక్షాణి కచన్త్యపరమన్తి చ. 14

ఆద్యంతమధ్యరహితమై, సర్వాత్మస్వరూపమై, లోహఘనమువలె నిర్వాణఘనరూపమై నట్టి మహాచైతన్యమను బేరుగల యాబ్రహ్మాకాశమునం బైన తెల్పఁబడిన బ్రహ్మాండమువంటి లక్షల కొలఁది బ్రహ్మాండములు దూరదూరమున, పరస్పరము మరలమరల యుత్పన్నములగుచు, లయించుచున్నవి.

న కించిత్కచయత్యత్ర సమే కచనరూపిణి
తాదృఙ్మయం తథారూపం తదాత్మన్యేవ సంస్థితమ్. 15

సమమై, స్వయంప్రకాశరూపమైనట్టి యీ బ్రహ్మాకాశమున ఈయనంతకోటి - బ్రహ్మాండముల నుత్పన్నముచేయునట్టి కారణము మఱెద్దియునులేదు. అవి యన్నియు బ్రహ్మమయములై, బ్రహ్మస్వరూపములై బ్రహ్మమందే స్థితిగల్గియున్నవి.

ఏష తే కథితః సర్వో దృశ్యానుభవన్క్రమః
అధునా శృణు కిం వృత్తం లోకాలోకే విపశ్చితః. 16

ఓ రామచంద్రా! ఈ ప్రకారముగ దృశ్యానుభవ క్రమమంతయు నీకుఁదెల్పితిని. ఇఁక నిపుడు లోకాలోకపర్వతముపైని విపశ్చిత్తుయొక్క వృత్తాంతమునుగూర్చి వినుము.

స్వాభ్యస్తపూర్వ సంస్కారో విలసన్నిశ్చయేరితః
లోకాలోకగిరేర్మూర్ధ్న స్తమః శ్వభ్రం పపాత సః. 17

పూర్వదిగంతదర్శన సంస్కారముయొక్క గొప్పయభ్యాసముచేఁ బ్రేరితుఁడై యావిపశ్చిత్తు లోకాలోక పర్వతముయొక్క శిఖరమునుండి పూర్వోక్తమగు అ యంధకార గర్తమునఁ బ్రవేశించెను,

దదర్శ తత్ర శిఖరప్రతిమైర్విహగైర్వపుః
వికర్తితం మనోదేహం ప్రసృతం చ స్వచిన్తితే. 18

అచ్చోట, పర్వతశిఖరములఁబోలిన గొప్పయాకృతిగల గృధ్రాదిపక్షులచే ఛిన్నభిన్నమొనర్పబడిన తన దేహశరీరమునాతఁడు గాంచెను. తదుపరి తాను దలంచినట్టి దిగంతదర్శనమున తన మనోమయ దేహమే ప్రవృత్తమగుటనుగూడ నాతఁడు వీక్షించెను.

దేశస్య తస్య పుణ్యత్వాద్దేహం తచ్చాతివాహికమ్
అధిభౌతికతాబోధం నానయన్నిర్మలాశయః. 19

అ విపశ్చిత్తు మరణించినచోటు (లోకాలోక పర్యంతము) పవిత్రమగుటఁబట్టి నిర్మలాంతఃకరణయుక్తుఁడగు అతడు తనసూక్ష్మదేహమును భౌతిక (స్థూల) రూపమున స్మరింపకయుండెను.

తావన్మాత్రప్రబోధోఽసౌ నాధికం బోధమాగతః
చిన్తయిత్వాపితం కార్యం బభూవ ప్రకృతేర్స్థితః. 20

కేవలము స్థూలశరీరముకంటె పరమైనట్టి సూక్ష్మశరీరమున ఆత్మబుద్ధి గల్గియుండునంత మాత్రపు జ్ఞానమే యాతని కుదయించెనుగాని, శరీరత్రయమునకుఁ బరమైనట్టి శుద్ధచిన్మాత్రమున ఆత్మబుద్ధి యాతనికుదయించలేదు. ఇక్కారణమున నాతఁడు దిగంతదర్శనమను కార్యమును నింకను అసమాప్తముగనే యెఱిఁగి తన సంచారశీలమగు స్వభావముననే మరల తత్పరుఁడాయెను గాని యుపరతిని బొందలేదు.

శ్రీరామ ఉవాచః—

అదేహం ప్రసరత్యేతచ్చిత్తం కార్యే కథం మునే
అతివాహికసంవిత్తేర్భోధః స్యాత్కిద్పృశోఽధికః. 21

శ్రీరాముఁడు:— ఓ మునీంద్రా! స్థూలదేహము లేక చిత్తము గమనాది కార్యములం దెట్లు ప్రవృత్తము కాఁగలదు? అట్లు ప్రవృత్తమైనచో నిఁక మనోమాత్రమగు సూక్ష్మదేహమునకు స్థూలదేహముకంటె నధికమగు యేమి విశేషమున్నట్లగును?

శ్రీ వసిష్ఠ ఉవాచ :—

సంకల్పపథికత్వేన యథాన్తః పురవాసినః
ఇదం మనః ప్రసరతి తథాన్య ప్రసృతం మనః. 22

శ్రీవసిష్ఠుఁడు:— ఓ రామచంద్రా! అంతఃపుర నివాసియొక్క మనస్సు దేహము లేకయే-సంకల్పమార్గమున నెట్లు గమనాదులందుఁ బ్రవృత్తమగునో, అట్లే యా విపశ్చిత్తుని మన స్సున్ను దిగంతదర్శనమునఁ బ్రవృత్తమయ్యెను.

భ్రమే స్వప్నే మనోరాజ్యే మిథ్యాజ్ఞానే కథాశ్రుతౌ
యథా మనః ప్రసరతి తథా తత్ర్పసృతం మనః. 23

భ్రమయందును, స్వప్నమందును, మనోరాజ్యమందును మిథ్యాజ్ఞానమందును, కథా శ్రవణమందును మనస్సెట్లు దేహములేకయే ప్రవర్తించునో. అట్లే యా విపశ్చిత్తుని మనస్సున్ను తద్గమనాది కార్యములందుఁ బ్రవర్తించెను

పతన్తి తు శరీరం తదాతివాహికముచ్యతే
అధిభౌతిక ధీర్భాతి విస్మృతాత్మైవ కాలతః 24

ఎద్దానియందు ఆ భ్రమ, స్వప్న, మనోరాజ్యాదులు ప్రవర్తించునో, అయ్యది సూక్ష్మ శరీరమనఁబడును. కాలక్రమమున సూక్ష్మశరీర విస్మరణముచే దానియందే స్థూలశరీరబుద్ధి యుదయించును.

తే తదాన్తర్హితాయాతే సర్పరజ్జుభ్రమోపమే
అధిభౌతికదేహేఽస్మిఞ్ఛిష్యతే త్వాతివాహికః. 25

రజ్జువునందలి సర్పభ్రమను బోలినట్టి యీస్థూలశరీరము అంతర్ధానముకాఁగా కేవలము సూక్ష్మశరీరమే శేషించును.

అతివాహిక విషోఽఙ్గ నిపుణం ప్రవిచార్యతామ్
చిన్మాత్రవ్యతిరేకేణ యావదన్త్రాస్య దస్తి నో. 26

ప్రియుఁడవగు ఓ రామచంద్రా! ఈ సూక్ష్మశరీరమునుగూర్చి నైపుణ్యముతోటి విచారింపుము. ఏలయనిన, ఇద్దానియందు చిన్మాత్రముకంటె అన్యముగ నొకింతైననులేదు.

దేశాద్దేశాన్తరప్రాప్తౌ యన్మధ్యే సంవిదో వపుః
చిన్మాత్ర స్యాన్య తద్రూపమనన్తస్యైకరూపిణః. 27

ఒకప్రదేశమునుండి మఱియొక ప్రదేశమునకు నేత్రేంద్రియముద్వారా బుద్ధివృత్తి చనునపుడు ఆ రెండు ప్రదేశముల మధ్యనుండు నిర్విషయమైన సంవిత్తుయొక్క స్వరూపమేదిగలదో, అదియే ఈ యనంతమై, ఏకమైనట్టి చిన్మాత్రముయొక్క ప్రసిద్ధమగు స్వరూపమైయున్నది.

క్వ ద్వైతం క్వచ వా ద్వేషః క్వ రాగాది తు కథ్యతామ్
సర్వం శివమనాద్యన్తం పరో బోధ ఇతి స్మృతః. 28

ఓ రామచంద్రా! సమస్తమున్ను ఆద్యంతరహితమై, శివరూపమై, పరమబోధ స్వరూపమైనట్టి పరమాత్మయేయైయుండ నిఁక ద్వైతమెచట? ద్వేషమెచట? రాగాదులెచట, చెప్పుము?

నిర్మనో మననం శాన్తమాసితం బోధ ఉత్తమః
ఆతివాహికదేహస్థో న తం బోధముపాగతః. 29

మనస్సుయొక్క మననములేని శాంతస్థితియే ఉత్తమ బోధయగును. అట్టి బోధను సూక్ష్మశరీరమాత్రమున స్థితిగల్గియుండుటచే ఆ విపశ్చిత్తు పొందజాలక యుండెను.

విపశ్చిత్తద్విబోధోఽసౌ దదర్శ విశరన్మనః
ఆతివాహికబోధేన గర్భవాసోపమం తమః. 30

కావున, అట్టిబోధలేనివాఁడై, కేవలము సూక్ష్మశరీరమాత్రమే ఆత్మయను బోధగల్గి యాతఁడు నలువైపుల ప్రసరణ శీలమగు తన మనస్సునున్ను, గర్భవాసమును బోలిన అంధకారమునున్ను నపుడు గాంచెను.

తమసోఽన్తే విరిఞ్చాణ్డకవాట చ్ఛేదభూతలమ్
వజ్రసారం హేమమయం కోటియోజన విస్తృతమ్. 31

తదన్తే ప్రాప సలిలం తస్మాదష్టగుణం తతః
కపాట భూమ్యైవ సమం స్థితమర్ణవ పృష్ఠవత్. 32

ఆ యంధకారముయొక్క చివర వజ్రమువలె దృఢమైనదియు, సువర్ణమయమై యొప్పునదియు కోటియోజనముల విస్తీర్ణము గలిగి యున్నదియునగు, బ్రహ్మాండ కవాటమును బోలినట్టి భూతలఖండమును వీక్షించెను. దానిచివర దానికంటెను నెనిమిది రెట్లధికమైనదియు, దానితోటి సమముగ ద్వీపాంతమందలి సముద్రపృష్ఠభాగమువలె స్థితిగల్గియున్నదియు నగు జలమును బొందెను.

తమతీత్య తతః ప్రాప తేజోఽర్క గణభీషణమ్
ప్రలయాగ్ని ఘనజ్వాలాపిణ్డకోటరభాస్వరమ్. 33

ఆ జలమునుదాటి సూర్యసమూహమువలె భయంకరమైనదియు, ప్రళయకాలమందలి అగ్నియొక్క ఘనీభూతమగు జ్వాలాపిండముయొక్క మధ్యభాగమువలెఁ బ్రకాశమానమైనదియు నగు తేజమున నాతఁడు ప్రవేశించెను

దాహశోకాదిముక్తేన వపుషా మానసేనతత్
తత్రగచ్ఛన్స బుబుధేవహనం పూర్వవాసితమ్. 34
ఉహ్యమానో వివేదాసావాత్మానం త్వాతివాహికమ్
చిత్తమాత్రాత్మనః స్వస్య కిమివోహ్యత ఇత్యపి. 35

దాహ, శోకాదిరహితమగు మానవశరీరముతోటి యాతైజసావరణమునఁ జనుచు ఆవిపశ్చిత్తు క్రమముగ దానికావలనున్న వాయువుయొక్క యావరణమునఁ దానేగుచుండుట నెఱిఁగెను. అట్లు, పూర్వసంస్కారములతోఁగూడి యేగుచున్న తన్ను సూక్ష్మశరీర రూపునిగ నాతఁడు తెలిసికొనెను. మఱియు చిత్తమాత్ర రూపుఁడగు తానేగుట మేమియనియు నాతఁడు తలంచెను, (తానేగుట స్వప్నకల్పనవంటిదేగాని వాస్తవముకాదని తెలిసికొనెను.)

ఇతి బోధేన ధీరాత్మా తం తతారానిలార్ణవమ్
ప్రాప తద్వితతం వ్యోమ తస్మాద్దశగుణం స్థితమ్. 36

ఇట్టి బోధతోఁగూడి ధీరుఁడగు ఆ విపశ్చిత్తు ఆ వాయురూపమగు సముద్రమునుదాటెను. తదుపరి ఆ వాయువునకుఁ బదిరెట్లధికముగ విశాలమైనట్టి యాకాశమును జేరెను

తదతిక్రమ్య సంప్రాప బ్రహ్మాకాశమనన్తకమ్
యత్ర సర్వం యతః సర్వం యన్న కించిచ్చ కించన. 37

ఆ యాకాశమునుగూడ దాటి, దేనియందు సమస్తముగలదో. దేనినుండి సర్వమావిర్భవించుచున్నదో, ఏది దృశ్యమెద్దియుఁ గాకయున్నదో, (అధిష్ఠాన దృష్టిచే) ఏది సమస్తమునై యున్నదో, అట్టి యనంతమగు మాయాశబలిత బ్రహ్మాకాశమును బొందెను.

మనసా ప్రక్రమంస్తత్ర దూరాద్దూరతరం యయౌ
తేన దృష్టం చ పృథ్వ్యాపస్తేజో వాయుస్తథా జగత్. 38
పునః సంసారరచనాః పునః సర్గాః పునర్దిశః
పునర్మహీధరా వ్యోమ పునర్దేవాః పునర్నరాః. 39
పునః పఞ్చమహాభూతపర్యన్తే బ్రహ్మ నిర్ఘనమ్
పునస్తత్ర జగన్త్యుచ్చైః పునః సర్గాః పునర్దిశః. 40
బ్రహ్మాకాశస్తతః సర్గాః పునరన్యే త్వనిష్ఠితాః
ఇత్యసౌ విహరన్దీర్ఘకాలమద్యాపి సంస్థితః. 41

ఆ యనంత బ్రహ్మాకాశమున మనస్సుతోటి సంచరించుచు నాతఁడతిదూర మేగెను. అచట పూర్వసంస్కారవశముచే మరల యాతడుఁ పృథివీ, జల, తేజో, వాయువులను. జగత్తును గాంచెను, అట్లే మరల ప్రపంచరచనలను, సృష్టులను, దిశలను, పర్వతములను, ఆకాశమును, దేవతలను, మనుష్యులను నచట వీక్షించెను, మరల పంచమహాభూతముల చివర బ్రహ్మదేవుఁడు

నిశ్చలముగ స్థితినొంది యుండుటను గాంచెను; మరల యచట గొప్పగొప్ప బ్రహ్మాండములను, సృష్టులను, దిశలను అవలోకించెను. ఆపిమ్మట మరల బ్రహ్మాకాశమును వీక్షించెను. తదుపరి మరల అవ్యవస్థితములగు అనేక సృష్టుల, గాంచెను — ఈ ప్రకారముగ దీర్ఘకాల మచట విహరించుచు నేఁటికిని నాతఁడచ్చోటనే స్థితినొందియున్నాఁడు.

స్వనిశ్చయాచ్చిరాభ్యస్తాన్నాసౌ విరతి మేతి హి
అన్తో నైవాస్త్యవిద్యాయాః సా హి బ్రహ్మైవ సత్యతాః. 42

చిరకాలాభ్యస్తమైనట్టి జగత్సత్యత్వరూపమగు స్వనిశ్చయముచే నాతడింకను వైరాగ్యమును బొందకయేయున్నాఁడు. ఈ జగద్రూపమగు అవిద్య కంతమేలేదు. మఱియు నందలి సద్రూపము లెస్సగ విచారింపఁబడినచో నది బ్రహ్మమే యగును.

వస్తుతో నాస్త్యవిద్యేహ బ్రహ్మణ్యావికలాత్మని
ఇదం దృశ్యమవిద్యేయమిత్యాత్మైష వికాసితః. 43

వాస్తవముగ వికల్పరహితమగు బ్రహ్మమందు అవిద్యయే లేదు. ఈ దృశ్య, అవిద్యా రూపములచే బ్రహ్మమే స్ఫురించుచున్నదగును.

యద్యథా జాగ్రతి స్వప్నే దృష్టం ద్రక్ష్యసి పశ్యసి
తత్తథా బ్రహ్మసద్భ్రాన్తమాసీదస్తి భవిష్యతి. 44

ఓ రామచంద్రా! పదార్థరూపమున వివర్తితమైనట్టి యేబ్రహ్మమును జాగ్రత్స్వప్నములందెట్టివాసనోత్పత్తిచే, పూర్వము నీవు గాంచితివో, ఇపుడును గాంచుచున్నావో, మున్ముందును గాంచగలవో, ఆ బ్రహ్మమట్లేయున్నది, ముందును నట్లేయుండఁగలదు.

ఘనతమః ప్రవిలోకనచక్రకం. క్రమజగత్ప్రతిభానమిదంమహత్
పరతయా ప్రతిభాత్మతయానయా నచ సదగ్గ నవాప్యసదాకృతి. 45

ప్రియుఁడవగు రామచంద్రా! ఈ భూత, వర్తమాన భవిష్యత్క్రమయుక్తమగు జగత్తెయ్యది భాసించుచున్నదో, అది ఘనీభూతమగు అవిద్యామాత్రమేయైయున్నది. మఱియు నేత్రముల రెంటిని మూయ, కానుపించు అంధకారచక్రమువలెనది మహత్తరమై భాసిల్లుచున్నది. పరమమగు చిన్మాత్రాత్మయొక్క దృష్టిచే ఈ జగత్తు సత్తుగాకయు, ప్రతిభాసాత్మరూపమగు అజ్ఞానులదృష్టిచే అసత్తుగాకయునున్నది. కావున నిది సదసద్విలక్షణమై అనిర్వచనీయమగు రూపము గల్గియున్నదగును.

తేష్వేవ తేష్వేవ చ తేషు తనూతరేషు
బ్రహ్మోదరేషు చిరదూరతరం జగత్సు
సోఽద్యాప్యసంవిదితతత్త్వతయా తయోచ్చైః
ఖణ్డేషు రజ్జురివ రాఘవ సంభ్రమీతి. 46

ఇత్యార్షే శ్రీ వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే ఉత్తరార్ధే అవిద్యోపాఖ్యానాన్తర్గత విపశ్చిదుపాఖ్యానే బ్రహ్మగీతాసు బ్రహ్మకాశ విపశ్చిజ్జగచ్చన్ద్రదర్శనం నామాష్టావింశత్యుత్తర శతతమః సర్గః ॥ 128 ॥

ఓ రాఘవా! ఆ విపశ్చిత్తు బ్రహ్మతత్త్వము నెఱుఁగకపోవుటచే, ఆ తాను బూర్వము గాంచినవియు, అటువంటివేయగు తదితరములును, వాసనామాత్రములగుటచే సూక్ష్మములును, విరాట్పురుషుల యుదరములందుఁ బ్రసిద్ధములునగు అనేక బ్రహ్మాండములందు వనఖండములందు రంకువను మృగమువలె-స్వవాసనయొక్క యౌన్నత్యముచే నేఁటికిని దిరుగాడు చున్నాఁడు.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున నుత్తరార్ధమున అవి॥ విప॥ బ్రహ్మగీతలందు బ్రహ్మకాశ విపశ్చిజ్జగచ్చంద్రదర్శనమను నూట యిరువది యెనిమిదవ సర్గము ॥ 128 ॥



## ఏకోనత్రింశదధిక శతతమః సర్గః

[ విపశ్చితోరుదస్తోఽత్ర వర్ణతే హ్యవశిష్టయోః
తత్రైకస్య మృగత్వేఽన్తే తథా రామసమాగమః.

తక్కిన విపశ్చిత్తులిరువురియొక్క వృత్తాంతము, అందొకని మృగశరీరధారణము, తుదకు శ్రీరామచంద్రునితోటి యాతని కలియిక యనువిషయము లిచటవర్ణింపఁబడుచున్నవి.]

శ్రీరామ ఉవాచ:—

తయోర్ద్వయోర్మునిశ్రేష్ఠ సంపన్నం కియతఃపరమ్
పశ్చాద్విపశ్చితోస్తస్య రుద్ధయోర్ద్వే విపశ్చితోః. 1

శ్రీరాముఁడు :— ఓ మునీంద్రా! ఒక విపశ్చిత్తైతే విష్ణుభగవానుని కృపచే ముక్తుఁడాయెను; మఱియొకఁడు నేఁటివఱకు అవిద్యయందే తిరుగాడుచున్నాఁడు; ఇఁక, శేషించిన, చంద్రలోకమున నిరోధింపఁబడినట్టి పూర్వదిశయందలి విపశ్చిత్తుయొక్కయు, శాల్మలిద్వీపమున రాజ్యభోగమందు నిరోధింపఁబడిన దక్షిణదిశయందలి విపశ్చిత్తుయొక్కయు, ఆ పిమ్మట జరిగిన వృత్తాంతమునుగూర్చి వచింపవేడెద.

శ్రీ వసిష్ఠ ఉవాచ :—

తయోరేకశ్చిరాఖ్యస్తవాసనావివశీకృతః
భ్రమన్ద్వీపేషు దేహాప్తైస్తామేవ పదవీం గతః. 2
తత్రైవావరణాంస్త్యక్త్వా పరమాకాశకోటరే
పశ్యన్సంసారలక్షాణి తత్రైవాద్యాపి సంస్థితః. 3

శ్రీవసిష్ఠుఁడు :— ఓశ్రీరామచంద్రా! అందు దక్షిణదిశయందలి విపశ్చిత్తు చిరకాలా భ్యస్తమగు వాసనకు వశుడై, మాయాశబలిత బ్రహ్మాకాశమున అనేక బ్రహ్మాండములందును, ద్వీపాదులందును బెక్కుదేహములతోటి సంచరించుచు, ఉత్తరదిశయందలి విపశ్చిత్తుయొక్క పదవినే బొందినవాఁడాయెను. బ్రహ్మాకాశకోటరమున నాతఁడు జలాద్యావరణములను దాటి లక్షలకొలఁది జగంబులను వీక్షించుచు నేటివఱకును నచటనే యున్నాఁడు.

తయోర్ద్వితీయః స్వాభ్యస్తాదాదావానంగ తేర్వశాత్
త్యక్త్వాన్న్వభ్రమద్దేహైరద్య శైలే మృగః స్థితః. 4

ఇక, పూర్వదిశయందలి విపశ్చిత్తు చంద్రుని సమీపమున నుండుటచే, చంద్రునియందలి మృగమందలి యధికస్నేహముయొక్క అభ్యాసరూపమగు సంఘముయొక్క వశముచే, ప్రతి మాసము చంద్రునితోఁగూఁడ నుత్పన్నములగు పరిభ్రమించుదేహములతోఁ గూడియుండుచు క్రమ ముగ వానిని వదలి మృగ(లేడి)రూపమునే ధరించి యిపుడొక పర్వతముపై స్థితినొందియున్నాఁడు.

శ్రీరామ ఉవాచ :—

ఏకైవ వాసనా బ్రహ్మన్యా చతుర్ణాం సదోదితా
నానాత్వాం సా కథం ప్రాప్తా హీనోత్తమ ఫలప్రదామ్. 5

శ్రీరాముఁడు:— మహాత్మా! ఆ నలుగురు విపశ్చిత్తులకును ఒకేవాసన సదాయుద యించియుండ నయ్యది యుత్తమ, అధమాది భిన్నభిన్న ఫలముల నొసంగునట్టి యనేకత్వము నెట్లు పొందినది?

శ్రీ వసిష్ఠ ఉవాచ :—

న్యథన్స్తా వాసనా జన్తోర్దేశ కాలక్రియావశాత్
తనుదార్ఢ్యాన్యతామేతి ఘనదార్ఢ్యైతి నాన్యతామ్. 6

శ్రీవసిష్ఠుఁడు :— ఓ రామచంద్రా! జీవునియొక్క బాగుగ నభ్యసింపఁబడిన వాసన అల్పదృఢమైయుండుచో నయ్యది దేశకాల క్రియావశముచే అన్యరూపమును బొందును. అధిక దృఢమైయుండుచోఁ బొందదు.

దేశకాలక్రియాద్యేతదేకతా వాసనైకతా
తయోర్వ్యేవ బలవత్తదేవ జయతి క్షణాత్. 7

భోగ్యఫలానుకూలములగు దేశకాలక్రియాప్రయత్నములయొక్క సామగ్రుల యేకత్వ ముచే భిన్నవాసనలయొక్కయు ఏకత్వము సంభవించును. అట్టి సామగ్రుల భిన్నత్వముచే ఏక రూపములైన వాసనలయొక్కయు భిన్నత్వము ఘటించును. సమానదేశకాల క్రియానుకూలమగు ఫలము నొసంగు వాసనయు, తద్భిన్నదేశకాలక్రియానుకూలమగు ఫలము నొసంగు మఱియొక వాసనయు, రెండును ఏకకాలముననే యుద్భవించుచో నందెయ్యది యధికప్రబలమైయుండునో, అదియే క్షణకాలములో జయించివైచును.

ఏవం విభాగేనైతేఽత్ర చత్వారః సమవస్థితాః
కృష్ణస్తే ద్వావవిద్యార్థమన్యో ముక్తో మృగోఽపరః. 8

ఈ ప్రకారముగ ఆనలుగురు విపశ్చిత్తులున్ను ఏకకాలమున నుద్భూతములైన విరుద్ధ దేశకాలాది భోగ్యవిభాగముచే వాసనావిభాగయుక్తులై భిన్నభిన్న ప్రవర్తనములతోను, తత్ఫలముల తోను గూడియున్నారు. అందిరువురు అవిద్యయొక్క అంతమును దర్శించుటఁగూర్చిన వాసనలచే నీడ్వబడుచున్నారు. ఒకఁడు మృగమై వర్తించుచున్నాఁడు; మఱియొకఁడు ముక్తుఁడై చెన్నొందెను.

నాద్యాపి త్రైరవిద్యాయా లబ్ధోఽన్తో భ్రాన్తిబుద్ధిభిః
అనన్తేయమవిద్యేయమజ్ఞానపరిబృంహితా. 9

భ్రాంతితోఁగూడిన బుద్ధిగల యాముప్పురును నేఁటివఱకు నింకను అవిద్యయొక్క యంతమును బొందకయేయున్నారు. ఏలయనిన, అజ్ఞానముచే వృద్ధినొందింపఁబడిన యీ అవిద్య అనంతమైయున్నది.

క్రమేణ శాన్తా భవతి విజ్ఞానాలోక ఆగతే
అమూలమేవ గలతి తిమిరశ్రీరివోదయే. 10

సూర్యుఁడుదయింప అంధకారము పూర్ణముగ శమించునట్లు, విజ్ఞానమను ప్రకాశము యొక్క రాకచే ఈ యవిద్య శీఘ్రముగ నశించిపోవుచున్నది.

కాలేనాన్యజగజ్జాతం శృణు వృత్తం విపశ్చితః
తస్మిన్దూరతరే దేశే కస్మింశ్చిత్సంసృతిభ్రమే. 11

ఓ రామచంద్రా! ఇఁకనిపుడు ఒకానొక సంసారభ్రమయందు అన్యబ్రహ్మాండమున అతిదూరమగు స్వాదూదసముద్రముయొక్క యావలిభాగమందున్న సువర్ణమయ భూప్రదేశమున పశ్చిమదిశయందలి విపశ్చిత్తుయొక్క వృత్తాంతమునుగూర్చి మరలవినుము.

క్వచిద్బ్రహ్మమహావ్యోమ్ని కస్మింశ్చిద్దృశ్యమణ్డలే
తస్య దృశ్యాత్మనా ప్రాప్తే వస్తుతో బ్రహ్మరూపిణి. 12

మహాబ్రహ్మకాశమున నొకానొకచోట అధ్యస్తమైనదియు, వాస్తవముగ బ్రహ్మ రూపమే యైనదియునగు ఒకానొక దృశ్యమండలము ఆ పశ్చిమ - విపశ్చిత్తునకు దృశ్యరూపముగ సంప్రాప్త మయ్యెను

స ఏకః శుభసంగత్యా విదుషాం మధ్యమాగతః
దృశ్యం యథావద్విజ్ఞాయ బ్రహ్మతామలమాగతః. 13

అచట నాతఁడు శమ, దమ, భగవద్భక్త్యాది శుభగుణసమూహముయొక్క సంసర్గముచే జీవన్ముక్తులగు మహాత్ములమధ్యచేరి వారివలన దృశ్యతత్త్వమును బూర్ణముగనెఱిగి నిర్మల బ్రహ్మ రూపత్వమును బడసెను.

తత్రైవాశు పరిజ్ఞానాత్సాఽవిద్యా స చ దేహకః
మృగతృష్ణామ్బువాశాన్తిమాగతౌ రాగతన్త్రితా. 14

అపుడచ్చోటనే, కామమున కఠినమగు స్థితిగల ఆ యవిద్యయు, ఆ దేహమున్ను నాతనికి బ్రహ్మజ్ఞానముచే శీఘ్రముగ మృగతృష్ణాజలమువలె శమించినవాయెను.

ఇతి తే సర్వమాఖ్యాతం విపశ్చిచ్చేష్టితం స్ఫుటమ్
అనన్తైవ మవిద్యేయం బ్రహ్మవత్తన్మయీ యతః. 15

ఓ రామచంద్రా! ఈ ప్రకారముగ ఆ విపశ్చిత్తులయొక్క చరితమును నీకు స్పష్టముగ నెఱిఁగించితిని. ఈ కార్యరూపమగు అవిద్యయొక్క యంతమును వారు నేఁటివఱకుంకను బొందకయేయున్నారు. కావున నిదియు కారణబ్రహ్మమువలె అనంతమేయైయున్నది. అట్టి కారణ బ్రహ్మముచేఁ బరిపూర్ణమైయున్నది. గావున నిదియు అనంతమై యొప్పుచున్నది;

యేన యత్రైవ వర్షాణాం లక్షలక్షాణి గమ్యతే
తత్ర తత్ర స్వభావేన చితా కిమపి లక్ష్యతే. 16

ఎచట నెవఁడు లక్షలకొలఁది వత్సరములనుగూడ లెక్కించునో, అచటను చైతన్యముయొక్క స్వభావము యొకింతమాత్రమే లక్షితమైనదగును. (చైతన్యము అనంతమని భావము.)

తదేవాశ్వపరిజ్ఞాతం మిథ్యా విద్యేతి కథ్యతే
పరిజ్ఞాతం తు తచ్ఛాన్తం తథా బ్రహ్మేతి కథ్యతే. 17

ఎఱుఁగఁబడనపుడు ఆ బ్రహ్మమే మిథ్య, అవిద్య, జగత్తు మున్నగు పేర్లచేఁ జెప్పఁబడుచున్నది. ఎఱుఁగఁబడినపు డయ్యది శాంతము, బ్రహ్మమున్నగు నామములచే బేర్కొనబడుచున్నది.

భేదో న భేద స్తత్రాయం భేదోఽయం యన్మయః కిల
తద్బ్రహ్మైవ చిదాభాసం చిద్రూపైవ హి భిన్నతా. 18

అవిద్య, బ్రహ్మములయొక్క భేదమెయ్యది భాసించుచున్నదో, అది వాస్తవముగ భేదముకాదు. ఏలయనిన, ఆ భేదము అవిద్యామయమైయున్నది; అవిద్యయో బ్రహ్మరూపమేయైయున్నది. మఱియు చిదాభాసమగుటచే, ఆ భేదమున్ను చిద్రూపమగు బ్రహ్మముకంటె వేఱుగాకయేయున్నది.

బ్రహ్మాణ్డమణ్డపస్యాస్య క్రమతేత్య విపశ్చితా
లబ్ధో యుగశతై రన్తో నావిద్యాయా విపశ్చితా. 19

జ్ఞానశూన్యుఁడగు ఉత్తరదిక్కునందలి విపశ్చిత్తు వందలకొలఁది యుగములవఱకు సంచరించినప్పటికిని, బ్రహ్మాండమండప రూపమగు అవిద్యయొక్క యంతమును నేఁటివఱకుంకను బొందకయే యున్నాఁడు.

శ్రీరామ ఉవాచ :—

స బ్రహ్మాణ్డకపాటః కిం న సంప్రాప్తో విపశ్చితా
త్వయైవ తత్కథితం బ్రహ్మన్న కథం వదతాం వర. 20

శ్రీరాముఁడు :— వక్తలలో శ్రేష్ఠుఁడవగు నో మునీంద్రా! ఉత్తర దిశయందలి విపశ్చిత్తు బ్రహ్మాండ కవాటమును బొందకయే దానినంధియందలి యాకాశమునుండి యుత్తరముగ నెట్లువెడలెను? బ్రహ్మాండ కవాటముయొక్క భేదమునుగూర్చిన ప్రసంగము తాము వచింపకయే యున్నారుగదా?

శ్రీ వసిష్ఠ ఉవాచ :—

జాతేనైవ విరిఞ్చేన పురా బ్రహ్మాణ్డమణ్డలమ్
ద్వాభ్యామధస్తాదూర్ధ్వాత్స్వభుజాభ్యాం ప్రవిదారితమ్. 21

భాగస్తేనోర్ధ్వత స్తస్మాదతిదూరతరం గతః
అన్యో భాగో గతోఽధస్తాదతిదూరతరాన్తరమ్. 22

తావివాశ్రిత్య తిష్ఠన్తి జలాద్యావరణాస్తతః
త ఏవ చ తదా ధారా లమ్బన్తే సంస్థితా స్తయోః. 23

శ్రీవసిష్ఠుఁడు:— ఓ రామచంద్రా! పూర్వము బ్రహ్మదేవుఁడు జనించినపుడు అతఁడు తన రెండు భుజములచే బ్రహ్మాండమండలమును రెండు భాగములుగఁ బైకిని, క్రిందికిని జీల్చి వైచెను. దానిచే పైభాగము పైకిని, క్రిందిభాగము క్రిందికిని నతిదూరమేగెను. అటుపిమ్మట ఆ రెంటినే యాశ్రయించి జలాద్యావరణములన్నియు స్థితినొందియున్నదాయెను. అట్టివాని కాధార భూతములగు యా రెండు కపాలములకు వ్రేలాడుచు ఆ జలాదులు వెలయుచున్నవి.

ఏతయోర్మధ్యమాకాశం విదురణ్డకపాటయోః
అపారావారమానీలమిదమాలక్ష్యతే తు యత్. 24

ఈ యపారమైన నీలవర్ణ మెయ్యది కానుపించుచున్నదో, అది యా రెండు కవాటముల యొక్క మధ్యయందలి యాకాశమని చెప్పఁబడినది.

జలాద్యావరణా స్తత్ర న లగన్తి న సన్తి చ
తద్ధి నిర్మలమాశూన్యమాలానం కల్పక్షప్తిభిః. 25

జలాద్యావరణములు ఆ యాకాశమునకు సంలగ్నములై యుండలేదు. మఱియు పర మార్థముగ నవి విద్యమానములైయులేవు. ఆ యాకాశమున్ను ప్రళయకాల కల్పనవలన నిర్మలమై మిగులశూన్యమై, ఇతరభూతముల కాధారమై యొప్పుచున్నది మాత్రమే యగును.

తేన మార్గేణ యాతోఽసౌ విపశ్చిదృక్షచక్రవత్
అవిద్యాయాః పరీక్షార్థమామోక్షమతిదీక్షితః. 26

నక్షత్రచక్రమువలెను. మోక్షపర్యంతము అవిద్యయొక్క పరీక్షార్థము దీక్షగైకొనిన వానిచందమునను ఆ విపశ్చిత్తు ఆయాకాశమార్గముగుండా జనెను,

బ్రహ్మైవానన్తరూపేయ మవిద్యా తన్మయీ యతః
అతోఽస్తి సాఽపరిజ్ఞాతా పరిజ్ఞాతా న విద్యతే. 27

బ్రహ్మమయమై యుండుటఁబట్టి ఈ అవిద్య అనంతమైయున్నది. మఱియు బ్రహ్మము నెఱుఁగనపుడే ఇయ్యది స్థితిగల్గియున్నదగును. ఎఱిఁగినపుడు లేనేలేదు. (కావుననే బ్రహ్మము నెఱుఁగనంత వరకు జనులు దీనియంతమును బొందకయు, ఎఱిఁగినపిదపఁ బొందుచునున్నారు,)

విపశ్చిత ఇతి ప్రాప్య దూరాద్దూరం పరేఽమ్బరే
జగద్రూపేష్వవిద్యాయా భ్రమ స్త్వన్యేషు కేషుచిత్. 28

ఇక్కారణమున ఆ విపశ్చిత్తులు మాయాశబలిత బ్రహ్మాకాశమున నతిదూరమేగి అవిద్యా రూపములగు యేవియో కొన్ని యితర బ్రహ్మాండములందు సంచరించుచునున్నారు.

కశ్చిన్ముక్తో మృగః కశ్చిత్కౌ చిదద్యాపి తౌ క్వచిత్
భ్రమతః ప్రాక్తనానల్పసంస్కారవివశీకృతౌ. 29

ఆ విపశ్చిత్తులలో నొకఁడు ముక్తుడాయెను. ఒకఁడు మృగరూపమును బొందెను. తక్కిన యిద్దఱు అవిద్యయొక్క యంతమును గాంచుటఁగూర్చిన పూర్వపు మహాసంస్కారముచే వశీభూతులై నేఁటికిని నింకను పరిభ్రమించుచునేయున్నారు.

శ్రీరామ ఉవాచ:—

కీదృశేషు క్వ దూరేషు తే జగత్సు విపశ్చితః
భ్రమన్తీతి మునే బ్రూహి మయి చేజ్జాయతే కృపా. 30

కియత్యధ్వని సంసారాస్తే జాతా యేషు తే మునే
మహదేత దిహాశ్చర్యమస్మాకం కథితం త్వయా. 31

శ్రీరాముఁడు:— ఓ మునీంద్రా! నాయందు దయగల్గియున్నచో నివ్విషయములను దెలుపప్రార్థన - ఎట్టివియు, ఎంతదూరమున నున్నవియునగు జగత్తులం దావిపశ్చిత్తులిపుడు సంచరించు చున్నారు? వారు జనించినట్టి య్యాప్రపంచము లిచటికి నెంతదూరపు మార్గమున నున్నవి? ఇదేమోతామిచట మాకు మహదాశ్చర్యజనకమగు వృత్తాంతమును జెప్పినవారైతిరి.

శ్రీ వసిష్ఠ ఉవాచ :—

స్థితౌ విపశ్చితౌ రామ తావుభౌ జగతోర్యయోః
తేఽస్మాకం గోచరం యాతే జగతీ యత్నతోఽపి నో. 32

శ్రీవసిష్ఠుఁడు:— ఓ రామచంద్రా! ఏజగత్తులందు ఆ అవిద్యాపారదర్శులగు ఇరువురు విపశ్చిత్తులున్ను నిపుడు స్థితినొందియున్నారో, అవి యత్నపూర్వకముగ విచారించినప్పటికిని మాబుద్ధికిపుడు గోచరమగుటలేదు.

తృతీయో మృగతాం యాతో విపశ్చిద్యత్ర తిష్ఠతి
స కదా చిత్ససంసారో గోచరే నోఽవతిష్ఠతే. 33

ఇఁక మృగరూపమును ధరించిన మూఁడవ విపశ్చిత్తు ఏ బ్రహ్మాండమున నున్నాఁడో, అయ్యదిమాత్రము తదంతర్గతమగు ప్రపంచసహితముగ మాకొకానొకపుడు బుద్ధికి గోచరమగు చుండును.

శ్రీ రామ ఉవాచ:—

విపశ్చిన్మృగతాం యాతో యస్మిఞ్జగతి సంస్థితః
తజ్జగత్క్వ మహాబుద్ధే యథావత్కథయేతి మే. 34

శ్రీరాముఁడు:- – మహాధీమంతుఁడవగు నోమునీంద్రా! మృగరూపత్వమును బొందిన విపశ్చిత్తు ఇపుడే ప్రపంచముననున్నాడో, ఆప్రపంచ మెచటనున్నదో నిక్కముగనాకు వచింపవేఁడెద!

శ్రీ వసిష్ఠ ఉవాచ:—

దూరాద్దూరతరం గత్వా పరబ్రహ్మ మహామ్బరే
మృగో విపశ్చిజ్జగతి స యస్మింస్తజ్జగచ్ఛృణు. 35

శ్రీవసిష్ఠుఁడు:— ఓ రామచంద్రా! పరబ్రహ్మమహాకాశమున నతిదూరమేగి మృగరూపియగు విపశ్చిత్తు ఇపుడేజగత్తునందున్నాఁడో దానినిగూర్చి వినుము.

తదిదం విద్ధి త్రిజగదిహాసౌ సంస్థితో మృగః
ఇదం తత్పరమాకాశం దూరాద్దూరే జగత్స్థితమ్. 36

ఓ రామచంద్రా! దీనినే నీవాత్రైలోక్యముగ నెఱుఁగుము. మఱియు యాతఁడు మృగరూపమును ధరించియున్నాఁడు. ఆతని జన్మప్రదేశమునుండి అతిదూరమున నున్నట్టి యాపరబ్రహ్మాకాశమిదియే.

శ్రీరామ ఉవాచ:—

విపశ్చిదస్మాదేవాసౌ జగతస్తాం గతిం గతః
ఇహైవాద్య మృగో జాతః కథమేతత్సమఞ్జసమ్. 37

శ్రీరాముఁడు:— ఓ మునీంద్రా! ఆ విపశ్చిత్తు ఈ జగత్తునుండి బయలుదేఱిదిగంతదర్శనమునకై అతిదూరమేగి యుండెనుగదా! అట్టిచో నిచటనే యాతఁడు మృగమై జన్మించెననుట యెట్లు సమంజసమగును?

శ్రీ వసిష్ఠ ఉవాచ:—

అవయవానవయవీ నిత్యం వేత్తి యథాఖిలాన్
తథా సర్వానహం వేద్మి బ్రహ్మాణ్యాత్మన్యవస్థితాన్. 38

శ్రీవసిష్ఠుఁడు:— ఓ రామచంద్రా! 'అతిదూరము' మున్నగు పదములన్నియు పరిచ్ఛిన్నాత్మదర్శులకే యగునుగాని, అపరిచ్ఛిన్నాత్మదర్శులకుఁగాదు, అవయవి తనహస్తపాదాద్యవయవములను గాంచునట్లు, నేనుబ్రహ్మరూపమగు నాయాత్మయందు సమస్త బ్రహ్మాండములను సమీపముననే గాంచుచున్నాను.

అనిష్ఠితాన్ప్రసంహారాన్నానాకారాంస్తు తాన్బహూన్
మిథః ప్రోతాన్మిథోదృశ్యాన్స్వరూపానివ పార్థివాన్. 39

ముందుఁ గలుగఁబోవునవియు, పూర్వము నశించినవియు, వర్తమాన మందున్నవియు, నానాప్రకారములైనవియు, బరస్పరము కానుపింపనివియు పరస్పరము గ్రుచ్చబడియున్నవియునగు అనేకబ్రహ్మాండములను వస్త్రముయొక్క దారములనువలె నేను నాయందు వీక్షించుచున్నాను.

తత్ర కస్మింశ్చిదన్యస్మిన్నాగ్రేఽస్మిన్నివ తిష్ఠతి
యద్వృత్తం కథితం రామ తదేతద్భవతే మయా. 40

ఓ రామచంద్రా! ఆ బ్రహ్మాండములం దీజగంబును బోలినట్టి యొకానొక బ్రహ్మాండమునందావిపశ్చిత్తు వర్తించుచున్నందున, పరమార్థమున దేశ, కాలభేదాభావమువలన నాతఁడిచటనే వర్తించుచున్నాఁడను విషయమును నీకు జెప్పితిని,

విపశ్చితోఽచ్యసంసారే దేహైర్భ్రాన్త్వా దిగన్తరాన్
తాననన్తామ్బరే వ్యోమ్ని తావత్కాలమఖిన్నధీః. **41**

ఇహైవ హరిణో జాతః కస్మింశ్చిద్గిరికన్దరే
కాకతాలీయయోగేన భ్రాన్త్వా భూరిజగద్భ్రమమ్. **42**

బ్రహ్మాకాశమునఁ బూర్వోక్తములగు యా దిగంతములందు స్వస్వవాసనాకల్పితములగు అనంతములైన భిన్నభిన్న ప్రపంచములందా ముగ్వురు విపశ్చిత్తులున్ను వివిధ దేహముల ధరించి నేటికిని సంచరించుచునేయున్నారు. అందు, పూర్వదిశయందలి విపశ్చిత్తు పెక్కు జగంబులందు ఖేదములేని బుద్ధితోటి బాగుగ సంచరించి కాకతాళీయ న్యాయముచే ఈ బ్రహ్మాండముయొక్క యొకానొక పర్వత గుహయందు మృగరూపముతో జనించెను.

స జగన్తి భ్రమన్దూరే యస్మిన్సర్గే మృగః స్థితః
స సర్గోఽయమితి వ్యోమ్ని కాకతాలీయవత్స్థితమ్. **43**

దూరదూరములగు అనేక బ్రహ్మాండములందు సంచరించుచు నిపుడావిపశ్చిత్తు ఏ బ్రహ్మాండమున మృగరూపమై వర్తించుచున్నాఁడో అయ్యది కాకతాళీయ యోగముచే బ్రహ్మాకాశమున ఈ జగత్తైయెయున్నది.

**శ్రీరామ ఉవాచః—**

ఏవం చేత్తద్వద బ్రహ్మన్కస్యాం కకుభి మణ్డలే
కస్మిన్కస్మింశ్చ శైలేఽసౌ వనే కస్మిన్మృగః స్థితః. **44**

కిం కరోతి కథం దూర్వాశ్చర్వయత్యుర్వరాస్పదః
జాతిం తాం జరఠజ్ఞానీ కదోదారాం స్మరిష్యతి. **45**

శ్రీరాముఁడు:— మహాత్మా ! అట్లైనచో ఏ దిక్కునందేపర్వతముపై నాతఁడు మృగ రూపమున వర్తించుచున్నాఁడో తెలుపఁగోరెద. మఱియు నాతఁడేమి చేయుచున్నాఁడో సస్య సంపన్నమగు భూమియందు తృణములనెట్లు భక్షించుచున్నాఁడో శిథిలజ్ఞాన యుక్తుఁడగు అతఁ డెపుడు తన పూర్వకాలపు జాతిని స్మరించునో, ఆ విషయములనుగూడ నెఱింగింపవేఁడెద.

**శ్రీ వసిష్ఠ ఉవాచ :—**

యోఽసౌ త్రిగర్తనాథేన దత్తః క్రీడామృగస్తవ
స్థితః క్రీడామృగాగారే విద్ధి తం త్వం విపశ్చితమ్. **46**

శ్రీవసిష్ఠుఁడు:— ఓ రామచంద్రా ! త్రిగర్తదేశపు రాజుచే కానుకగా నీకొసంగఁబడి నదియు ఇపుడు నీ క్రీడామృగనిలయమందు వర్తించుచున్నదియునగు క్రీడామృగ మెయ్యది గలదో, దానినే నీవా విపశ్చిత్తునిగ నెఱుఁగుము.

**శ్రీ వాల్మీకి రువాచః—**

శ్రుత్వేతి రాఘవస్తస్యాం సభాయాం విస్మయాన్వితః
బాలకాన్మృగమానేతుం ప్రేషయామాస భూరిశః. **47**

శ్రీవాల్మీకి:— ఓ భరద్వాజా! ఆ వాక్యమును వినగనే సభయందు శ్రీరామచంద్రుఁడాశ్చర్యసమేతుఁడై తోడనే యనేక బాలకులకు ఆ మృగము నటకుఁ గొనివచ్చుటకై యాజ్ఞాపించెను.

అథానీతో మృగో ముగ్ధః సభాం స్ఫారాం వివేశ సః
నర్వైః సభ్యగణైర్దృష్టః పుష్టిమాంస్తుష్టిమానపి. 48

అటుపిమ్మట ఆ ముగ్ధ మృగమచటికి గొనిరాబడినదై యా విశాల సభయందు ప్రవేశించెను. సభ్యులందఱును దానిని పరిపుష్టముగను, సంతుష్టముగను గాంచిరి.

తారాబిన్దుయుతం దేహబిన్దుభిః ఖం విడమ్బయన్
దృష్టిపాతోత్పలాసారైః సున్దరీః పరితర్జయన్. 49

ఆదృతానాదృతసభై ర్నీలా మరకతత్విషః
ధావంస్తృణేచ్ఛయా లోలం ముద్ధైశ్చకితవీక్షితైః. 50

ఉత్కర్ణోన్నయనోద్గ్రీవం క్షణభఙ్గావలస్థితైః
ఉత్కర్ణనయనోద్గ్రీవైః సభ్యానాకుల యఞ్జవైః. 51

తన దేహముపైఁగల తెల్లని మచ్చలచే నక్షత్రసహితమగు ఆకాశము ననుకరించుచు, నీల కమలములవంటి దీర్ఘ నేత్రములయొక్క దృష్టులచే సుందరస్త్రీల నదలించుచు సభచే ఆదరింపఁబడినదైనను స్వయముగ సభను అనాదరించునటువంటి భయయుక్తములగు ముగ్ధదృష్టులచే సభాస్తంభాదులందుఁ జెక్కఁబడిన నీలవర్ణపు మరకతమణులయొక్క కాంతులను హరిత (పచ్చని, తృణముల భ్రాంతిచే గ్రహింపనెంచి చపలత్వముతోఁగూడి పరువిడుచు. చెవులను, నేత్రములను) కంఠమును బైకెత్తి అస్థిరమై, అనివార్యమైనట్టి వేగముతోటి ఆక్రమణమును గూర్చిన భయముచే సభ్యులను వ్యాకులమొనర్చుచు ఆ మృగము (లేడి) సభయందుఁ బ్రవేశించెను.

మృగమాలోక్య తం లోకాః సరాజమునిమన్త్రిణః
అనన్తా బత మాయేతి చిరమాసన్స్మయాకులాః. 52

అపుడా సభయందలి ఋషులు, మునులు, రాజులు, మంత్రులు, పౌరులు మున్నగు వారందఱును ఆ మృగమును వీక్షించి చాల సేపాశ్చర్యము నొందినవారై 'అహా! పరమేశ్వరుని మాయ యెట్టి అనంతమైనది! ఆశ్చర్యజనకమైనది!' అని యనుకొనదొడగిరి.

ఆశ్చర్యసర్వణసువిస్మితసర్వలోకా సర్వావలోకనఘనోత్పలవర్షకృష్ణమ్
రత్నాంశుజాలకచితం మృగమీక్షమాణా సాసీత్సభా కమలినీలిపి నిర్మితేవ. 53

ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే ఉత్తరార్ధే అవిద్యోపాఖ్యానాన్తర్గత విపశ్చిదుపాఖ్యానే విపశ్చిన్మృగలాభో నామైకోనత్రింశదధిక శతతమః సర్గః ॥ 129 ॥

సభ్యులందఱియొక్క చూపులను దట్టములైన నీలకమల వర్షముచే నీలవర్ణయుతముగఁ జేయఁబడినదియు, వివిధ రత్నములయొక్క కిరణసమూహములచే నలంకరింపఁబడినదియునగు

ఆ మృగమును గాంచుచున్నట్టి యాసభ అద్భుతరసముయొక్క యాస్వాదనముచే మహదాశ్చర్యము నొందిన నిశ్చేష్టులగు సమస్తజనులతోఁ గూడినదై, చిత్రమందు లిఖింపఁబడిన కమలసరస్సువలె శోభించుచుండెను.

ఇది శ్రీవాసిష్ఠతాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున నుత్తరార్ధమున అవి॥ విప॥ విపశ్చిన్మృగలాభమను నూటయిరువదితొమ్మిదవ సర్గము ॥ 129 ॥

## త్రింశదధికశతతమః సర్గః

[వసిష్ఠధ్యానజే వహ్నౌ మృగస్యాఽత్ర ప్రవేశనమ్
విపశ్చిద్దేహలాభేన ప్రాక్స్మృతిశ్చాత్ర వర్ణ్యతే.

వసిష్ఠమునీంద్రునియొక్క ధ్యానముచే నుత్పన్నమైన అగ్నియందామృగము ప్రవేశించుట, విపశ్చిత్ - శరీరమును బొందుటవలన బూర్వవృత్తాంతమును స్మరించుట యిచట వర్ణింపఁబడుచున్నవి.]

**శ్రీ వాల్మీకి రువాచ:—**

అథ రామ ఉవాచాస్య మునే కేన విపశ్చితః
స్యాదుపాయేన దుఃఖాన్తః ప్రాక్తనాత్మోదయాదితి. 1

శ్రీ వాల్మీకి:—ఓ భరద్వాజా! అపుడు శ్రీరామచంద్రుఁడు వసిష్ఠమునీంద్రునిగూర్చి యిట్లు ప్రశ్నించెను. ఓ మునీశ్వరా! మృగరూపధారియగు ఈ విపశ్చిత్తున కేయుపాయముచేఁ దన పూర్వ శరీరలాభము ద్వారా, మఱియు ఆత్మజ్ఞానముద్వారా, దుఃఖముయొక్క అంతము కలుగఁగలదు?

**శ్రీ వసిష్ఠ ఉవాచ:—**

యేనైవాభ్యుదితా యస్య తస్య తేన వినా గతిః
న శోభతే న సుఖదా న హితాయ న సత్ఫలా. 2

శ్రీవసిష్ఠుఁడు:— ఓ రామచంద్రా! ఎవనిద్వారా (ఏ యుపాసితదేవతద్వారా) యెవనికిఁ బూర్వము తనియభిలషితము సిద్ధించియుండెనో, అతనికి మున్ముందును నాతఁడులేక స్వకీయ అభిలషితము సిద్ధింపదు; సిద్ధించినను శోభింపదు. శోభించినను పరిణామమున సుఖప్రదముకాదు; ఎట్లో సుఖప్రదమైననుగూడ పరలోకమున హితమునుగాని, సత్ఫలమునుగాని, గలుగఁజేయదు.

విపశ్చితోఽగ్నిః శరణం తత్ప్రవేశాదయం మృగః
పూర్వరూపామివాప్నోతి నిర్మలం కనకం యథా. 3

ఈ విపశ్చిత్తునకు అగ్నిదేవుఁడే శరణుఁడైయున్నాఁడు. అతనియందుఁ బ్రవేశించుటచే నీతఁడు సువర్ణమువలెఁ దన పూర్వపు నిర్మలరూపమును బొందఁగలఁడు.

కరోమ్యేతదహం సర్వం దృశ్యతాం దర్శయామి వః
అగ్నిప్రవేశం హరిణః కరోత్యేషోఽధునా పురః. 4

ఇదియంతయు నేనిపుడు మీకు చేసిచూపెదను. చూడుఁడు! ఇపుఁడే యీహరిణము మన యెదుట అగ్నియందుఁ బ్రవేశించును.

శ్రీ వాల్మీకిరువాచ:—

> ఇత్యుక్త్వా స మునిస్తత్ర వసిష్ఠః శ్రేష్ఠ చేష్టితః
> ఉపస్పృశ్య యథాన్యాయం స్వకమణ్డలువారిణా. 5
>
> దధ్యావనిన్ధనం వహ్నిం జ్వాలాపుఞ్జమయాత్మకమ్

శ్రీవాల్మీకి:— ఓ భరద్వాజా! ఉత్తమచేష్టాయుక్తుఁడగు వసిష్ఠమునీంద్రుఁడిట్లు పలికి యట విధిపూర్వకముగ అంగన్యాసమొనర్చి తన కమండలువునందలి జలముతోటి యాచమనము చేసి ఇంధనరహిత జ్వాలాసమూహమయాత్మకమైన అగ్నిభగవానుని ధ్యానించెను.

> తద్ధ్యానేన సభామధ్యే జ్వాలాజాలం సముద్యయౌ. 6
>
> అఙ్గారరహితాఙ్గారమిన్ధనేన వివర్జితమ్
> స్వచ్ఛం ధమధమాయన్తమధూమమపకజ్జలమ్. 7

ఆ ధ్యానముచే నాసభామధ్యమున అగ్నిజ్వాలాసమూహము ప్రకటమయ్యెను. అంగారము (బొగ్గులు) లేనిదియు, కాష్ఠవర్జితమైనదియు, స్వచ్ఛమైనదియు, ధూమరహితమై, వెలయునదియు, కజ్జల (మసి) శూన్యమైనదియు, ధగధగయని మండుచున్నదియునగు అగ్ని యపుడట సువ్యక్తమై తేజరిల్లెను.

> ముగ్ధముగ్ధకచత్కాన్తి హేమమన్దిరసున్దరమ్
> ఉత్ఫుల్లకింశుకాకారం సన్ధ్యాభ్రవదవుత్థితమ్. 8
>
> దూరాపసృత సభ్యం తజ్జ్వాలాజాలం విలోకయన్
> మృగః ప్రాక్ప్రభక్తిభావేన ప్రోల్లలాస విలోకితైః. 9

మిగుల యందముగఁ బ్రకాశించునట్టి కాంతిగలదియు, బంగారుమందిరమువలె రమణీయమైనదియు, వికసించిన కింశుక (మోదుగు) వృక్షమువంటి యాకృతిగలదియు, సంధ్యాకాల మేఘమువలె నావిర్భవించినదియు, తనయొక్క తేజముచే సభాసదులను దూరముగ దొలగించునదియు, జ్వాలా సమూహయుక్తమైనదియునగు ఆ యగ్నిని జూచుచు ఆ మృగము పూర్వపుభక్తి భావముచే సాదరయుక్తములగు చూపులతోఁగూడి మిగుల సంతసించినదాయెను.

> తం సమాలోకయన్వహ్నిం వివిక్షుః క్షీణదుష్కృతః
> పశ్చాదుపససారాశు దూరం సింహ ఇవోత్పతన్. 10

అటుపిమ్మట, పాపము క్షయించినట్టి యామృగరూపధారియగు విపశ్చిత్తు అయగ్నిని బాగుగ వీక్షించుచు నద్దానియందుఁ బ్రవేశింప నిచ్ఛగల్గి దూరమునుండి సింహమువలె గంతులిడుచు దానివైపునకు శీఘ్రముగ జనెను.

> ఏతస్మిన్నన్తరే ధ్యానే విచార్య మునిపుఙ్గవః
> మృగం విలోకితైః క్షీణపాపం కుర్వన్నువాచ హ. 11
>
> సంస్మృత్య ప్రాక్తనీం భక్తిం భగవన్హవ్యవాహన
> కురు కారుణ్యతః కాన్తం మృగమేనం విపశ్చితమ్. 12

ఇంతలో వసిష్ఠమునీంద్రుఁడు ధ్యానమందు విచారించి తన చూపులచే ఆ మృగమును పాప రహితముగఁ జేయుచు నయ్యగ్నిగూర్చి యిట్లుపలికెను — హవ్యవాహనుఁడవగునోదేవా! ఇద్దాని పూర్వపు భక్తినిస్మరించి దీనిపై దయగలిగి మనోహరమగు ఈ మృగమును విపశ్చిత్తునిగఁజేయుము.

వదత్యేవం మునౌ దూరాద్ధావిత్వా నృపసంసది
మృగోఽగ్నిం వేగనిర్ముక్తః శరో లక్ష్యమివావిశత్. 13

మునీంద్రుడిట్లు పలుకుచుండగనే దూరమునుండి ఆ మృగము ఆ రాజసభయందుఁ బరుగిడుచు వచ్చి వేగముగ విడువఁబడిన బాణము లక్ష్యమందుఁ బ్రవేశించునట్లుఁ అయ్యగ్ని యందుఁ బ్రవేశించెను.

జ్వాలాజాలం ప్రవిష్టోఽసావాదర్శ ఇవ బిమ్బితః
సంధ్యాభ్ర ఇవ విశ్రాన్తో దృష్టస్పష్టశరీరకః. 14

అట్లు జ్వాలాసమూహమందుఁ బ్రవేశించిన యా మృగము అద్దమందలి ప్రతిబింబము వలె నొప్పునదియు సంధ్యాకాల మేఘమువలె విశ్రమించినదియునగు విస్పష్టమైన శరీరముతో గూడినదై యా సభాసదులకుఁ గన్పట్టెను.

సపశ్యత్స్వేవ సభ్యేషు మృగోఽథ నరతామగాత్
జ్వాలోదరే నభస్యభ్రలవో రూపాన్తరం యథా. 15

సభ్యులందఱును జూచుచుండగనే — ఆకాశమున మృగరూపమగు మేఘఖండము రూపాంతరమును బొందునట్లు ఆ జ్వాలాగర్భమున అమ్మృగము మనుజాకారమును బొందెను.

అదృశ్యతాథ జ్వాలాయామన్తః కనకకాన్తిమాన్
పురుషః పావనాకారః కాన్తావయవసున్దరః. 16

పిమ్మట ఆ యగ్నిజ్వాలయందు సువర్ణకాంతివంటి కాంతితోఁగూడినవాఁడును పవిత్రా కారయుక్తుఁడును ప్రకాశవంతములగు అవయవములచే సుందరుఁడునగు పురుషుఁడు కానుపించెను.

అర్కబిమ్బ ఇవాదిత్యశ్చన్ద్రబిమ్బ ఇవోడుపః
మహామ్బుధీవ వరుణః సంధ్యాభ్ర ఇవ వా శశీ. 17

ఆతఁడు సూర్యమండలమందు సూర్యునివలెను, చంద్రమండలమందుఁ జంద్రునివలెను, సముద్రమునందు వరుణునివలెను, సంధ్యాకాలమేఘమందు చంద్రబింబమువలెను శోభించుచుండెను.

చక్షుః కనీనికాకోశే ముకురే సలిలే మణౌ
ప్రతిబిమ్బ ఇవార్కాభో భక్తినాదారపావకః 18

కనుగ్రుడ్డునందును, అద్దమందును, జలమందును, మణియందును, ప్రతిబింబించునట్టి సూర్యునివలె నొప్పుచున్నవాఁడై అగ్నియను ఆధారముగల్గియున్న భక్తియేయట్లు పురుషాకృతి వహించియున్న చందమున నాతఁడు వెలయుచుండెను.

అనన్తరం సభామధ్యాద్వాతైర్దీప ఇవాహతః
జ్వాలాజాలం యయౌ క్వాపి సంధ్యామ్బుద ఇవామ్బరాత్. 19

తదుపరి వాయువుచేఁ గొట్టఁబడినఁ దీపము అదృశ్యమగునట్లును వాయుతాడితమగు సంధ్యాకాల మేఘ మాకసమునుండి యెచటికో వెడలిపోవునట్లును ఆ సభామధ్యమునుండి యా జ్వాలాసమూహ మెచటికో పోయెను. (ఉపశమించెను)

కుటీకుడ్యేషు భగ్నేషు ప్రతిబిమ్బ ఇవామరః
అతిష్ఠత్పురుషస్తత్ర పటాన్నట ఇవోద్గతః. 20

అంత దేవాలయముయొక్క గోడలు భగ్నములుకాఁగా లోనున్న దేవతయొక్క ప్రతిమ వలెను, తెరనుండి బయల్వెడలిన నటునివలెను నచట ఆ పురుషుఁడు ప్రకటీభూతుఁడయ్యెను.

అక్షమాలాధరః శాన్తో హేమయజ్ఞోపవీతవాన్
అగ్నిశౌచామ్బరచ్ఛన్నః సద్యశ్చన్ద్ర ఇవోదితః. 21

అతఁడు రుద్రాక్షమాలను ధరించినవాఁడును, శాంతుడును సువర్ణ యజ్ఞోపవీతము గలవాఁడును అగ్నియందు శౌచమొనర్పఁబడిన నిర్మల వస్త్రములచేఁ గప్పఁబడినవాఁడును, తత్కాల మున నుదయించిన చంద్రునివలె నొప్పుచున్నవాఁడునై వెలయుచుండెను

అహో భా ఇతి సభ్యోక్త్యా తస్య వేషస్య భాసనాత్
భాస్వానివ విశాలాభో భాస ఇత్యేష శబ్దితః. 22

అతని వేషముయొక్క ప్రకాశముచే సభాసదులందఱును 'ఆహా! ఏమిదీప్తి! సూర్యుని వలె మహా ప్రకాశయుక్తుఁడై యున్నాఁడు ఈతఁడు నిక్కముగ భాసుఁడు (ప్రకాశమయుడు) అని చెప్పఁదొడగిరి

అసౌ మూర్త ఇవాభాసో భాస నామ్నా భవిష్యతి
సభాస్థైః కైశ్చిదిత్యుక్తం తేన భాసః స ఉచ్యతే. 23

మఱియు, ఈతఁడు మూర్తివంతమగు ప్రకాశమైయుండుటచే భాసుఁడను నామముచే ప్రసిద్ధికెక్కఁగలఁడని యటఁగొందఱు సభాసదులచేఁ జెప్పఁబడెను ఇక్కారణమున నాతఁడప్పటి నుండియు భాసుఁడను పేరుచేఁ బిలువఁబడఁజొచ్చెను.

అథోపవిశ్య తత్రైవ స భాసో ధ్యానసంస్థితః
ఆత్మోదన్తమశేషేణ సస్మార ప్రాక్తనం తనౌ. 24

అటుపిమ్మట నాతఁడాస్థానముననే కూరుచుండి ధ్యానస్థుఁడై యా శరీరమునఁ దన పూర్వ వృత్తాంతమునంతయు స్మరించెను.

సభాలోకే గతస్పన్దే స్మయేనాత్మని తిష్ఠతి
భాసో ముహూర్తమాత్రేణ దృష్ట్వా స్వోదన్తమక్షతమ్. 25

సభాసదులందఱును ఆశ్చర్యముచే చేష్టారహితులై యుండియుంత భాసుఁడంత నొక ముహూర్త కాలమువఱకు ధ్యానమందున్నవాఁడై తన పూర్వ వృత్తాంత మంతయును బూర్ణ ముగ స్మరించెను.



> అయయా పూర్వజన్మభ్యో ధ్యానాలోకాద్వ్యబుధ
> సభామాలోకయామాస సముత్థాయ యథాక్రమమ్ 26

అనంతరము. తనపూర్వజన్మల వృత్తాంతము గూర్చిన యాధ్యానమునుండి మేల్కొని, అతఁడు నిలబడినవాఁడై యథాక్రమముగ ఆ ముని, రాజ, సామంతాదియుక్తమగు సభనంతయు వీక్షించెను.

> స చాగత్య వసిష్ఠాయ ప్రణామమకరోన్ముదా
> జ్ఞానార్కప్రాణద బ్రహ్మన్నమస్తేఽస్త్విత్యుదాహరత్. 27

ఆ తరువాత, వచ్చి, 'జ్ఞానసూర్యునిద్వారా ప్రాణము నొసంగునట్టి యోమహాత్మా! తమకు నమస్కారము' అని చెప్పుచు వసిష్ఠమునీంద్రునకు సంతసముతోఁ బ్రణమిల్లెను.

> తమువాచ వసిష్ఠోఽపి హస్తేన శిరసి స్పృశన్
> అద్య తే సుచిరాద్రాజన్నవిద్యాయాః క్షయోఽస్త్వితి. 28

అంత నావసిష్ఠమునీంద్రుఁడును దనహస్తముతోటి యాతనిశిరంబును దాఁకుచు 'ఓ రాజా! అతిదీర్ఘకాలము నుండియుండియున్న నీయొక్క అవిద్య నేఁడు క్షయమొందుగాక!' అని నుడివెను.

> రామం జయేతి జల్పన్తం నతం దశరథోఽథ తమ్
> ఆసనాత్కించిదుత్తిష్ఠన్సమువాచ హసన్నివ. 29

'ఓ రామచంద్రా! నీకు జయమగుగాక!' అని వచించుచు నమస్కరించుచున్నట్టి యా భాసు (విపశ్చిత్తు)నితోటి యపుడు దశరథమహారాజు, తన యాసనముపైనుండి యొకింత లేచి నవ్వుచు నిట్లు పలికెను —

దశరథ ఉవాచః—

> స్వాగతం తేఽస్తు భో రాజన్నిదమాసనమాస్యతామ్
> అనేకభవసంభార భ్రాన్త విశ్రమ్యతామిహ. 30

శ్రీదశరథుఁడు:—ఓ రాజా! మీకు స్వాగతమగుగాక! ఈ యాసనముపై వేంచేయుఁడు! అనేక జన్మలందలి సంసారభ్రమణమను భారముచే మీరలసియున్నారు కావున నిట విశ్రమింపుఁడు!

శ్రీ వాల్మీకి రువాచః—

> వదత్యేవం దశరథే విపశ్చిద్భాసనామభృత్
> వివేశ విష్టరే విశ్వామిత్రాదీన్ప్రణమన్మునీన్. 31

శ్రీవాల్మీకి:— ఓ భరద్వాజా! దశరథుఁడిట్లు వచింప భాసుఁడను నామమును ధరించిన యావిపశ్చిత్తపుడు విశ్వామిత్రాదిమునులకుఁ బ్రణమిల్లుచు నయ్యాసనముపైఁ గూరుచుండెను.

దశరథ ఉవాచః—

> అహో బత చిరం కాలమాలానేనేవ దన్తినా
> వన్యేనావిద్యయా దుఃఖమనుభూతం విపశ్చితా. 32

శ్రీదశరథుఁడు:— అహా! ఎట్టి కష్టదాయకమగు విషయము! కట్టుకంబమున వనగజమువలె ఈ విపశ్చిత్తు, అవిద్యవలన చిరకాలము దుఃఖమనుభవించెను!

అసమ్యగ్బోధదుర్దృష్టే రహో ను విషమా గతిః
వ్యోమ్న్యేవ దర్శయత్యేషా సర్గాడమ్బర సంభ్రమమ్. 33

అహా! సమ్యక్ - జ్ఞానము లేకయుండుట యను ఈ అవిద్యారూపమగు దుష్టదృష్టి యొక్కగతి మిగుల భయంకరమై యొప్పుచున్నది. ఈ యవిద్య చిదాకాశమందే యనేక సృష్టుల యొక్క యాడంబరముగూర్చిన మహాభ్రమను దర్శింపఁజేయుచున్నది!

కిమన్యాశ్చర్యమేతాని జగన్తి వితతాత్మని
సంతతాని చిరం తాని విభ్రాన్తాని విపశ్చితా. 34

అహా! ఆశ్చర్యము! సర్వవ్యాపియగు ఆత్మయందెన్నియో విశాలములైన జగంబులం దీతఁడు చిరకాలమువఱకు సంచరించెను.

వ్యోమాత్మనోఽపి మహిమాయమహో ను కీదృ
గస్య స్వభావవిభవస్య చిదాత్మవృత్తేః
యః శూన్య ఏవ పరమాత్మఘనేఽమ్బరే న్త
రేవం విధాని వివిధాని జగన్తి భాన్తి. 35

ఇత్యార్షే శ్రీ వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే ఉత్తరార్ధే అవిద్యోపాఖ్యానాన్తర్గత విపశ్చిదుపాఖ్యానే మృగవహ్ని ప్రవేశో నామ త్రింశదధిక శతతమః సర్గః ॥ 130 ॥

అహా! చిదాత్మయొక్క వాస్తవముగ శూన్యమైనట్టి మాయాస్వభావవైభవముయొక్క మహిమ యెటువంటిది! శూన్యమైనను నయ్యది పరమాత్మఘనమగు చిదాకాశమున ఈప్రకారము లగుఫవివిధజగంబులయొక్క రూపమును ధరించి భాసించుచున్నదే!

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున నుత్తరార్ధమున అవి॥ విప॥ మృగవహ్ని ప్రవేశమను నూటముప్పదవ సర్గము ॥ 130 ॥



## ఏకత్రింశదధికశతతమః సర్గః

[ వటధానారాజపుత్రకథాముక్త్వా ప్రచోదితః
కౌశికేన విపశ్చిత్స్వాం భ్రాన్తిం విస్తరశోఽబ్రవీత్

విశ్వామిత్రుఁడు వటధానారాజపుత్రుల కథను జెప్పుట; ఆ పిదప విశ్వామిత్రునితోటి విపశ్చిత్తు తనభ్రాంతినిగూర్చి విస్తారముగఁ దెల్పుట ఇచట గాననగును.]

దశరథ ఉవాచః—

క్లిష్టోఽయం యదవిద్యార్థం విపశ్చిదవివశ్చితః
తదహం చేష్టితం మన్యే కష్టోఽవస్తుని కిం గ్రహః. 1

శ్రీదశరథుఁడు:— ఈ విపశ్చిత్తు దిగంతదర్శనరూపమగు అవిద్యకు వశీభూతుఁడై యే క్లేశమనుభవించునో, అదియంతయు ఆత్మజ్ఞానశూన్యుఁడగు యీతని భ్రాంతిరూపమైన వ్యర్థ చేష్టయనియే నేను నమ్మెదను. ఏలయనఁగా అవస్తువై (మిథ్యాభూతమై) నట్టి దిగంతదర్శనాది కౌతుకమునగల దురాగ్రహము (మొండి పట్టుదల) క్లేశరూప ఫలమునే కలుగఁజేయును.

శ్రీ వాల్మీకి రువాచః—

అస్మిన్నవసరే తత్ర రాజ్ఞః పార్శ్వే వ్యవస్థితః
ప్రసఙ్గపతితం వాక్యం విశ్వామిత్రోఽభ్యువాచ హ. 2

శ్రీవాల్మీకి:— ఓ భరద్వాజా! ఇయ్యవసరమున నటరాజుప్రక్కన గూరుచుండియున్న విశ్వామిత్రుఁడు ప్రసంగవశమున నీ వాక్యములఁ బల్కెను

అప్రాప్తోత్తమబోధానాం బోధవేద్యా విలక్షణాః
భవన్త్యేవం విధా రాజన్భ్రమాణాం బహవో భృశమ్. 3

ఓ రాజా! మీరు చెప్పినది సత్యము. ఆత్మజ్ఞాన రహితులగు మనుజులలో ననేకులీ ప్రకారములైన విచిత్రములగు భ్రాంతిరూపములైన వాసనామయములగు అనంతకోటి జగంబులను తలచు దర్శించుచుండుట గలదు.

అద్య సప్తదశం వర్షలక్షమక్షీణనిశ్చయాః
ఏవమేవ భ్రమన్తోఽస్యాం వటధానా భువి స్థితాః. 4

ఓ రాజా! అట్లు విపశ్చిత్తులవలెనే యీ మాయామయమగు జగత్తుయొక్క దర్శనమందు దృఢనిశ్చయులై వటధానులను పేరుగల రాజపుత్రులున్ను బదునేడులక్షల సంవత్సరములనుండియు ఈ భూతలముపైఁ దిరుగాడుచున్నారు.

భూమేరన్తావలోకార్థమద్యాప్యుద్వేగవర్జితమ్
ప్రవృత్తా న నివర్తన్తే వహనాత్సరితో యథా. 5

భూమియొక్క అంతమును గాంచుటకై నిర్భయముగఁ బ్రవృత్తులై ప్రవహించుటనుండి నదులు నివర్తింపనట్లు వారు నేఁటివఱకును నక్కార్యమునుండి నివర్తింపకయే యున్నారు.

అయం ఖలుమహాలోకో వర్తులో వ్యోమ్ని సంస్థితః
బాలసంకల్పతరువద్బ్రాహ్మసంకల్పనిశ్చయః. 6

ఓ రాజా! భూలోకాది చతుర్దశ (పదునాల్గు) లోకములతోఁగూడిన మహత్తరమైన బ్రహ్మాండము వర్తులాకారముగ నున్నదై హిరణ్యగర్భుని సంకల్పనిశ్చయముకంటె వేఱుకానిదగుచు బాలునిచే సంకల్పింపబడు వృక్షమువలె నాకాశమున స్థితినొందియున్నది.

కన్దుకే వ్యోమ్ని సంరుద్ధే దశదిక్కం పిపీలికాః
ఇత్థం భ్రమన్తి భూతాని తదాధారాణి నిత్యదా. 7

తేనెపూయఁబడిన బంతిపై దశదిశలందును చీమలు తిరుగాడునట్లు, ఆకాశమున నిరోధింపఁబడిన యీ బ్రహ్మాండము నాధారపఱచుకొని దశదిక్కులందును జీవులు నిత్యము పరిభ్రమించుచున్నారు.

భూగోలకాధో భాగాని తదఙ్గాన్యూర్ధ్వవన్తి చ
తథా భూతాని తిష్ఠన్తి తాన్యావిశ్య భ్రమన్తి చ. 8

ఈ భూలోకముయొక్క యూర్ధ్వాధో భాగములందు బ్రహ్మాండమున కంగభూతము లైనట్టి యేలోకములు గలవో, వానియందుఁ బ్రవేశించు జీవులందఱును స్థితిగల్గియున్నారు. మఱియు నటసంచరించుచునునున్నారు.

తమేవావిశ్య దూరేణ సరితశ్చర్క్షమణ్డలమ్
అసంస్పర్శా భ్రమత్యుచ్చైః సచన్ద్రార్కాది సంతతమ్. 9

ఆకాశమునఁ బ్రవహించు మందాకినీ మున్నగునదులున్ను, చంద్ర, సూర్య సహిత జ్యోతిశ్చక్రరూపమైన నక్షత్రమండలమున్ను, ఈ భూగోళమును స్పృశింపక నతిదూరముగ చాల యెత్తున నిరంతరము సంచరించుచునున్నవి.

ఇహైవ సర్వదిక్కం ద్యౌస్తామావేష్ట్య వ్యవస్థితా
సర్వదిక్కం ఖమత్యూర్ధ్వం తస్యాధస్తాన్మహీతలమ్. 10

జ్యోతిశ్చక్రసహితమగు యీ భూలోకము నావరించి యిచటనే సర్వదిక్కులను వ్యాపించి అంతరిక్షమున్ను స్థితిగల్గియున్నది. అట ఆకాశముయొక్క కల్పన సర్వదిశలందును అత్యూర్ధ్వముగను, భూతలముయొక్క కల్పన దాని కధోభాగమునను గలదు.

భావాః పతన్తో ధావన్తి తస్యాథః సర్వతోదికమ్
యత్రోత్పతన్తో గచ్ఛన్తి తదూర్ధ్వమితి శబ్దితమ్. 11

భూతలమున కధోభాగముననున్న పదార్థములు ఆ భూతలముయొక్క సర్వావయవము లను అయాప్రదేశములందుఁబొందుచు సంచరించుచున్నవి. ఏ యాకాశమునఁ బక్ష్యాదు లెగురుచు సంచరించుచున్నవో, అది యూర్ధ్వభాగమని చెప్పఁబడుచున్నది.

తత్రైకదేశే విద్యన్తే వటధానాభిధానకాః
జాతాస్తేషాం త్రయో రాజన్రాజపుత్రాః పురాభవన్. 12

ఓ రాజా! అట్టి యీ భూగోళముయొక్క ఒకానొక ప్రదేశమున వటధానులను పేరుగల యా దేశపురాజులు కొందఱు వర్తించుచుండిరి. వారికులమున ముగ్గురు రాజపుత్రులు పూర్వము జనించిరి.

తే హ్యేవమేకసంకల్పా భూమ్యాదేర్ద్రష్ట్యవర్త్మనః
కోన్తః స్యాదితి నిర్యాతా విహర్తుం దృఢనిశ్చయాః. 13

ఈ విపశ్చిత్తులవలె ఆ రాజపుత్రులున్ను, ఈ దృశ్యరూపమగు భూమ్యాది జగత్తుయొక్క అంత మేదియైయుండునో చూచెదమని దృఢనిశ్చయము గావించుకొని బయలుదేఱిరి.

పునర్వారి పునర్భూమిస్తేషామాక్రమతాం చిరమ్
నవలబ్ధశరీరాణాం దీర్ఘకాలో వ్యవర్తత. 14

వారు ద్వీప, సముద్రాదులను దాటుచు భూమియైన పిదప మరల సముద్రమును సముద్రమైనపిదపమరల భూమిని బొందుచు, త్రోవలో మరణించి మరల మరల నూతనదేహముల ధరించుచు అదేక్రమమున మరల సంచారమును కొనసాగించుచుండ అతిదీర్ఘకాలము గడచి పోయినది.

స్వచ్ఛకన్దుకవక్రమీకన్యాయేనానిశమత్ర తే
భ్రమన్తో నాప్నువన్త్యన్తమన్యత్వం సంవిదన్తి చ. 15

ఈ పృథివిపై వారు నిర్మలకందుకము (బంతి)పై సంలగ్నములైన కీటములవలె నిరంతరము పరిభ్రమించుచు నద్దానియంతమును బొందక, ఇతరఇతరదేశములను బొందుచునున్నారు.

వ్యోమస్థకన్దుకభ్రాన్త పిపీలికవదాకులమ్
అద్యాపి సంస్థితా రాజన్న చ ఖేదం వ్రజన్తి తే. 16

ఓ రాజా! ఆ కాశమందున్న బంతిపై సంచరించు చీమలవలె వారీభూతలముపై నిరంతరము సంచరించుచు నేఁటికిని స్థితినొందియున్నారు. కాని వారట్టి సంచారముచే ఖేదమును బొందకయే యున్నారు.

దేశం భూగోలకస్యాస్య యం యామాసాదయన్తి చ
ఇహైవ తత్ర తత్రోచ్చైరధశ్చోర్ధ్వం తథా దిశః. 17

ఈ భూగోళముయొక్క యూర్ధ్వాధోదిశలందలి ప్రదేశములను, ప్రక్కనున్న ప్రదేశములను వారు బొందుచున్నారు; దిక్కులను వీక్షించుచున్నారు; కాని అంతమును మాత్రము పొందుటలేదు.

తే వదన్తి మహారాజ యద్యస్మాభిరితోద్యతైః
న తావదన్తః సంప్రాప్తః సంచరామ ఇతఃపరమ్. 18

ఓ మహారాజా! వారిట్లనుచున్నారు - ప్రయత్నపరులమగు మేమెంతవఱకు దీని (ఈజగత్తుయొక్క) అంతమును బొందకుందుమో, అంతవఱకు నిఁకపైననుగూడ సంచరించెదము.

ఇత్థం న కించిదేవేదం బ్రహ్మసంకల్పడమ్బరమ్
కించిత్సంకల్పమజ్ఞానమనన్తం స్వప్నదృశ్యవత్. 19

ఈ ప్రకారముగ బ్రహ్మదేవుని సంకల్పమాత్రముయొక్క యాడంబరమైనట్టి మిథ్యయగు ఈ జగత్తు, స్వప్నదృశ్యమువలె, సంకల్పజనితమగు అజ్ఞానమువలన అనంతముగ భాసిల్లుచున్నది.

కల్పనం తత్పరం బ్రహ్మ పరం బ్రహ్మైవ కల్పనమ్
చిద్రూపం నానయోర్భేదః శూన్యత్వాకాశయోరివ. 20

బ్రహ్మదేవుని కల్పనారూపమగు ఈ జగత్తు చైతన్యమే అధిష్ఠానముగా గల్గియున్నందున చిద్రూపమగు పరబ్రహ్మమేయైయున్నది. ఆకాశ, శూన్యత్వములందువలె, చిద్రూప, జగత్తులందును భేదము లేదు.

చిన్మాత్రం యద్యదాభాతం జలవాహ ఇవ ర్తవత్
తత్తాదృక్కథమన్యాభమన్యస్యాసంభవాద్భవేత్. 21

ప్రవాహ, తరంగ, ఆవర్తాదులు జలముకంటె వేఱుకానట్లు, చిన్మాత్రము యొక్క స్ఫురణముచే నేయేరూపముగ ఈ జగత్తు భాసించుచున్నదో, అది యది మఱియొక పదార్థము యొక్క అసంభవముచే చిన్మాత్రమేయగునుగాని అన్యమెట్లు కాగలదు?

అభావః ఖే చ ఖమిదం సర్గాదౌ పరమామ్బరమ్
స్వయం జగదివాభాతి నాన్యత్ప్రలయసర్గకౌ. 22

ఈ జగత్తు సృష్ట్యాదియందు చిదాకాశమున, అభావరూపమై యున్నది గావున శూన్యమే యగును. అపుడు చిదాకాశ మొకటియేయున్నది. ఇపుడును ఆ పరబ్రహ్మ రూపమగు చిదాకాశమే స్వయముగనిట్లు జగద్రూపమువలె భాసించుచున్నది. ఏలయనిన, వాస్తవముగ సృష్టి, ప్రళయములు చిదాకాశముకంటె వేఱుగలేవు.

యథా కషతి చిద్రూపం తథైవ రతిమేత్య తత్
దృష్టాదృష్టైః స్వసంసారైశ్చిరమాస్తే యథా చిరమ్. 23

ఆ చిద్రూపము ప్రాణుల కామ, కర్మ వాసనానుసార మెచట నెట్లెట్లు కల్పన చేయుచున్నదో, అచట నట్లట్లు ఆ సక్తిఁజెంది నిజస్వరూపమున అన్యోన్యతాదాత్మ్యముచే అధ్యస్తమైనట్టి దృష్ట, అదృష్టములును, జడ, చిద్రూపములునగు జగంబులుగ ప్రథమమున నెట్లు చిరకాలముండియుండెనో, అట్లే యిపుడునునున్నది. ముందును నట్లే, యుండఁబోవును.

దృశ్యాత్మకం రూపమేకమేకమస్యైవమక్షయమ్
స్వయమేవమజం భాతి యన్న భాతీవ కించన. 24

ఈ ప్రపంచమునకు నాశశీలమగు దృశ్యరూపమొకటి, నాశరహితమగు చిద్రూపమొకటి గలవు. జనన మరణ రహితుఁడగు పరమాత్మ స్వయముగనే యిట్లు జగద్రూపముతోటి భాసించుచున్నాఁడు. కాని, వాస్తవముగ నాతఁడేరూపముతోటియు భాసించుటలేదు.

చిదణోరుదరే సన్తి సమస్తాను భవార్ణవాః
శిలాః శైలోదర ఇవ స్వచ్ఛాః ఖాత్మని ఖాత్మికాః. 25

పర్వతమందు శిలలవలెను, ఆకాశమందు నిర్మలములగు ఆకాశాణువులవలెను, చిద్రూపమగు పరమాణువునందు అయాజగదనుభవ రూపములైన పరమాణువులన్నియును స్థితినొందియున్నవి.

స్వభావనిష్ఠాస్తిష్ఠన్తి తే యదవ్యాకృతాత్మని
మా తిష్ఠన్తితు వై తే యదవ్యావృత్తాః వరే పదే. 26

మాయాశబలితమగు పరమాత్మయందు అట్టి స్వభావముతోనే గూడినట్టి యీ సమస్త జగత్తులున్ను వెలయుచున్నవి. మాయాశూన్యమగు శుద్ధచైతన్య రూపమైన పరమాత్మ పదమునసో జగత్తు లెవ్వియును లేవు.

తదేవ జగదత్యుక్తం బ్రహ్మ భారూపమాతతమ్
పూర్వాపరపరామర్శాన్నిపుణం నిపుణాశయాః. 27

నిపుణ విచారయుక్తులగు ఓ సభ్యులారా! బ్రహ్మప్రకాశరూపముచే వ్యాప్తమైనట్టి యీ పరమాత్మయే (అధిష్ఠానదృష్టిచే) జగత్తని నిపుణమగు పూర్వాపరపరామర్శచేతనే నేను జెప్పితిని.

అత్యాశ్చర్యమనష్టోఽయం పరమాత్మపదాత్స్వయమ్
నానాత్వబుద్ధ్యా నాస్త్యేవ జీవోఽహమితి తామ్యతి. 28

ఈ ప్రకారముగ పరమాత్మతో ఐక్యము నొందియుండుటవలన పరబ్రహ్మ రూపమగు నిజస్థానమునుండి చ్యుతినొందకయేయున్నను, ఈ జీవుఁడు స్వయముగ నానాత్వబుద్ధిచే 'నే నల్పజ్ఞుఁడనగు జీవుఁడను' అని తలంచి దైన్యము నొందుచు దుఃఖించుట యేదిగలదో, అది మిగుల యాశ్చర్యమైయున్నది.

ఉచ్యతాం భాస భో రాజన్విపశ్చిదపరాఖ్య హే
కియద్దృష్టం కియద్భ్రాన్తం దృశ్యం స్మరసి కించ వా. 29

ఇఁకనిపుడు, భాసుఁడను మఱియొక పేరుగల యో విపశ్చిద్రాజా! నీ చరిత్రము నొకింత సంక్షేపముగ వచింపుము. ఎంతదృశ్యమును నీవుగాంచితివి? ఎచటెచటనెంతెంత సంచరించితివి? అచటి యే యే వృత్తాంతములను నీ విపుడు స్మరించుచున్నావు?

భాస ఉవాచః—

బహు దృష్టం మయా దృశ్యం బహు భ్రాన్తమఖేదినా
బహ్వేవ బహుధా నూనమనుభూతం స్మరామ్యహమ్. 30

భాసుఁడుః— మహాత్మా! నేను దృశ్యమును జాలగాంచితిని; ఖేదరహితుఁడనై యెంతయో సంచరించితిని; బహురీతుల పెక్కు విషయముల ననుభవించితిని; దాని నంతయు నిపుడు స్మరించుచున్నాను.

మయానుభూతాని మహాన్తి రాజం శ్చిరం సుదూరే వివిధైః శరీరైః
సుఖాని దుఃఖాని జగన్త్యనన్తాన్యనన్తమాసాద్య మహామ్బరం తత్. 31

ఓ రాజా! ఆ యనంతమైన అవ్యాకృతాకాశమున చాలదూరమేగి నే ననేక శరీరముల తోటి అసంఖ్యాతములగు గొప్ప గొప్ప సుఖములను, దుఃఖములను చిరకాల మనుభవించితిని.

విచిత్రదేహైర్వరశాపయోగ దృశ్యాన్యనన్తాని మయా మహాత్మన్
జన్మాన్తరావర్తవివర్తనాని దృష్టైః కదిత్తైన వరాత్కృశానోః. 32

మహాత్మా! అగ్నిదేవుని వరదానముచే దిగంతదర్శనమున దృఢనిశ్చయుఁడనై, 'వర' శాపములవలనఁ గలిగిన విచిత్రదేహములతోటి నేననేక జన్మాంతరములను అవర్తములందనేక పరివర్తనములను అనంతవిధములైన దృశ్యములను గాంచితిని.

దృశ్యాత్మకోర్వీవపుషస్త్వవిద్యా దృశో జవేనాన్తపరీక్షణాయ
దేహేన దేహేన జగత్ప్రతి ప్రాక్ స్మృతేః సదాహం ఘనయత్నమాసమ్. 33

ప్రతిబ్రహ్మాండమందును నేననేకప్రకారములైన శరీరములనుధరించి సంచరించుచు పూర్వపు దృఢసంస్కారముయొక్క స్మరణచే, దృశ్యాత్మకమై, పృథివ్యాదిరూపమైనట్టి అవిద్యయొక్క అంతమును పరీక్షించుటకుగాను వేగముచే మహాప్రయత్న యుక్తుఁడనైయుంటిని.

సమాః సహస్రం విటపోఽహమాసమన్తర్మనాశ్చేతనభుక్తదుఃఖః
చిత్తం వినా పుష్పఫలః ప్రతానే వా కన్దవత్తత్తరసాగ్రరాగః. 34

తరుపరి యొకానొకపుడు మరణకాలమున ఆచిత్తముయొక్క వృక్షదర్శనమును గూర్చిన సంస్కారవేగముచే దేహగ్రహణమున రాగయుక్తుఁడనై వేయిసంవత్సరముల వఱకు వృక్ష రూపమున నుంటిని; ఆ వృక్షరూపమున నేను బాహ్యప్రవృత్తికి హేతువగు ప్రాణములయొక్క చేష్టలేనివాఁడనై అంతర్మనస్కుఁడనై, వృక్షదేహాభిమానియగు జీవునిద్వారా సుఖదుఃఖముల ననుభవించుచు పూర్వాపర పరామర్శ హేతువగు చిత్తములేక, పుష్పఫలాదుల నుత్పన్నము చేయుటయందు కందమువలె భూరస, కాలాదుల కధీనుఁడనై స్థితిగల్గియుంటిని.

సమాః శతం మేరుమృగోఽహమాసం సువర్ణవర్ణస్తరుపర్ణకర్ణః
దూర్వాఙ్కురాస్వాదనగీతినిష్ఠ అహంస్కనిష్ఠో వనవాసిమధ్యే. 35

మఱియు, ఓ రాజా! బంగారుకాంతివంటి కాంతిగలవాఁడనై, వృక్ష పత్రములఁ బోలిన చెవులుగల్గి, తృణాదుల యాస్వాదమందును, గీతశ్రవణమందును మిగుల యనురాగముతోఁగూడి యుండి వనమృగములమధ్య అల్పబలయుక్తుడను అల్పదేహియునై యొప్పుచు కావుననే యే ప్రాణిని హింసింపక యున్నవాఁడనై మృగ (లేడి) రూపమునుధరించి మేరుపర్వతముపై నూఱు వత్సరములవరకు వసించితిని.

పాదాష్టకైరావలితాత్మపృష్ఠో మృతేఽమ్బుసః క్లేశకృతాత్మమృత్యుః
సమాః శతార్ధం శరభోఽహమాసం క్రౌఞ్చాచలే కాఞ్చనకన్దరాసు. 36

ఎనిమిది పాదములతోఁగూడిన పృష్ఠభాగముగలదియు, మరణసమయ మాసన్నముకాఁగా, గర్జించు మేఘమునుండి పడుచుండు వడగండ్లవలన ఆ మేఘముతోటి యుద్ధమొనర్ప దలంచి పర్వతశిఖరముపైనేగి యటనుండి దుముకుటద్వారా స్వీయమృత్యువును గలుగఁజేసి కొనునదియు నగు శరభమను మృగముయొక్క శరీరమునుధరించి యేబది సంవత్సరముల వఱకు 'క్రౌంచ' పర్వతముయొక్క సువర్ణమయ గుహలందు నేను వసించితిని.

కాలాగురుద్రుమలతావలితాగిలేన విద్యాధరీసురతధర్మ కలామృతాని
పీతాని మే మలయసానుని మన్దరే చ మన్దారచన్దనకదమ్బలతాగృహేషు

అటుపిమ్మట విద్యాధర జన్మను గైకొని మలయపర్వత శిఖరము పైనను, మందర పర్వతముపైనను, కాలాగురు వృక్షములయొక్క లతలచేఁ గౌగిలింపఁబడినట్టి శీతల, మంద, సుగంధ వాయువుతోగూడి విద్యాధరస్త్రీల రతులందు వారి కళారూపమగు అమృతమును ననుభవించితిని.

హేమారవిన్దమకరన్దపిశాఙ్గితాని పీతాని పఞ్చదశవర్షశతాని మేరౌ
వైరిఞ్చహంసతనయేన మయాపయాంసి తీరాన్తరేషు రమతోపనిర్ఝరిణ్యాః. 38

బ్రహ్మదేవుని హంసకుఁ బుత్రుఁడనై జన్మించి మేరుపర్వతముపైన మందాకినీ నదీ తీరములందుఁ గ్రీడించుచు సువర్ణ కమలములయొక్క మకరందములచే పింగళవర్ణయుతములుగా నొనర్పఁబడిన జలములను ద్రావుచు బదునైదువందల సంవత్సరములవఱకుంటిని.

క్షీరోదవేలావనగన్ధవాహ విలోలనీలాలకవల్లరీణామ్
సమాః శతం శోకజరాపహారి గీతం శ్రుతం మాధవసున్దరీణామ్. 39

క్షీరసాగరతటమందలి వనముయొక్క వాయువులచే చంచలములైనట్టి నల్లని కేశములను లతలను ధరించియున్న విష్ణుభగవానుని సుందర స్త్రీలయొక్క, శోక వార్ధక్య వినాశకరమగు గీతమును నూఱు సంవత్సరములవఱకు వింటిని.

కాలఞ్జరే మఞ్జరితే కరఞ్జ గుఞ్జావనే జమ్బుకతాం గతోఽహమ్
గజేన పిష్టో హరిణా హతోఽసౌ హస్తీ మయాఽత్రార్ధమృతేన దృష్టః. 40

తదుపరి, కాలంజరమను పర్వతముపై కంటకవృక్షమయమగు వనమందు సృగాల (నక్క) జన్మను బడసితిని ఆ జన్మయందొకపుడు నన్నొక గజము మర్దించివైచెను. అపుడర్ధ మృతుఁడనగు నేనా గజమొక సింహముచే, జంపివేయఁబడుటను గాంచితిని.

సంతానక ప్రకరహాసిని సహ్యసానౌ కస్మింశ్చిదన్యజగతీన్దుముఖీ సురస్త్రీ
ఏకాకినీ కృతయుగార్ధమథాహమాసం కల్పద్రుమస్తబకసద్మనిసిద్ధశాపాత్. 41

పిమ్మట సంతానకమను కల్పవృక్ష సమూహములతోఁ గూడి నవ్వుచున్నట్లున్న సహ్య పర్వతముయొక్క శిఖరముపై నొకానొక సిద్ధుని శాపమువలన ఏకాకి యు, చంద్రముఖియునగు దేవస్త్రీయై కృతయుగముయొక్క సగము భాగమువఱకు వసించితిని.

అద్రీన్ద్రకచ్ఛకరవీర లతాలయేషు నీతం సమాశతమశఙ్కధియామయాన్యత్
అన్యత్ర దూరజగతీన్ద్రగిరౌవిరావి వాల్మీకపక్షివపుషాఽనిశమేకకేన. 42

అనంతరము, హిమాలయపర్వతముయొక్క జలప్రాయ ప్రదేశమం దుత్పన్నములైన కరవీర (గన్నేరు) వృక్షములయొక్క శాఖాంతర ప్రదేశములందు నిరంతరము ధ్వనిసల్పునట్టి వాల్మీకమను పక్షిరూపముతో నూఱు వత్సరములవఱకుంటిని. ఆ పిమ్మట నా భార్యాపుత్రాదులతో సహా యా కరవీర వనమంతయు నశింప, నేను మఱియొక దూరమందున్న ప్రదేశమునకేగి యట మహేంద్రపర్వతముపై వియోగదుఃఖముచే మిగుల పీడితుఁడనై యొంటరిగ శేషించిన యాయువు నంతయు గడపితిని.

అన్యత్ర సానుని మయా పరిలమ్బమానాః
సచ్ఛాయచన్దనవనావలితే లతానామ్
దృష్టాః స్త్రియః ఫలమివావలితా విలాసై
ర్భుక్తాశ్చ తా అపహృతా అపి సిద్ధపాన్థైః. 43

ఈ ప్రకారముగ ఆ రెండుజన్మలవలన సిద్ధుని శాపమునుండి విముక్తినొంది యా సిద్ధుని యనుగ్రహముచేతనే సిద్ధజన్మనుబడసి యా మహేంద్ర పర్వతముపైననే ఉత్తమ చ్ఛాయాయుక్తములగు చందన వనములచే నావృతమగు మఱియొక శిఖరముపై లతలయొక్క యూయెలందు వాని ఫలములవలె నూఁగులాడుచు విలాసములతోఁ గూడియున్నట్టి స్త్రీలనుజూచితిని; మఱియు సిద్ధపథికులచే నపహరింపబడిన వారైనప్పటికిని వారిననుభవించితిని.

అన్యత్ర పర్వతనితమ్బకదమ్బకచ్ఛే
నీతాని తాపసతయోత్తమయా దినాని
ప్రాప్యైకవస్త్వఖినివేశవిషూచికాత్త
చిత్తేన కాన్తమతినాఽమతినా మయాన్తః. 44

ఆపిదప, అవివేకియు, కేవలము అవిద్యయొక్క అంతమును గాంచుటయను క్రియయందలి పట్టుదలయను విషూచికచే వశీభూతమైనట్టి చిత్తముగలవాఁడను, కావుననే శ్రమనొందిన బుద్ధితోఁ గూడినవాఁడనగు నేను వైరాగ్యమునొంది మఱియొకచోట నొక పర్వతముపైన కదంబాది వృక్షసంయుతమగు జలప్రాయ ప్రదేశమున తాపసుఁడనై దినముల గడపితిని.

బ్రహ్మాణ్డసంపూరితమన్యదస్తి జలేచరాశేషదిగన్తభూతమ్
సందిగ్ధతేజోమ్బరవాతసత్తం జలస్థభూతాకృతిమాత్రభూమి. 45
ఏకత్ర దృష్టా వనితా మయైకా తస్యాః శరీరే త్రిజగన్తి భాన్తి
ప్రతిబిమ్బితానీవ సుదర్పణేఽన్తరాకాశశైలాదిదిగాదిమన్తి. 46

ఓ మునీశ్వరా ! మఱియొక అత్యాశ్చర్యమైన విషయము గలదు వినుఁడు — అనంత బ్రహ్మాండములచేఁ బూర్ణమైనదియు, జలచరజీవులవలె సమస్త దిగంతములందలి ప్రాణులతోఁ గూడినదియు, సందిగ్ధమైనట్టి అగ్ని, వాయు, ఆకాశములను మహాభూతములయొక్క సత్తగలదియు, జలమందు ప్రతిబింబించిన యాకారమువంటి యాకారముగల భూమి గల్గియున్నదియునగు యొక ఆశ్చర్యకరమగు ఆకృతిని వీక్షించితిని ఆ స్వరూపమున నొకచోట నేనొక స్త్రీని గాంచితిని. ఆమెశరీరమున నిర్మలమైన అద్దమున ప్రతిబింబములవలె ఆకాశ, పర్వత దిగాదిసహితములగు అనేకలోకములు భాసించుచుండెను

పృష్టా మయాసౌ వరగాత్రి కాసి శరీరమేతచ్చ కిమీదృశం తే
తయోక్తమస్మేహ చిదస్మి శుద్ధా మమాఙ్గమేతాని మహాజగన్తి. 47

అపుడాస్త్రీని నేనిట్లడిగితిని — 'ఉత్తమ శరీరముగల యో భగవతీ ! నీవెవతెవు ? ఈ నీ శరీర మివ్విధమున ననేక జగంబులతోఁగూడి యేల యున్నది ?' అపుడామె యిట్లు ప్రత్యుత్తర మిచ్చెను — ఓ ప్రియుడా! ఈ సమస్త పదార్థజాలమందును సర్వప్రకాశకమైనట్టి యే శుద్ధ చైతన్యముగలదో, అదియే నేను. మఱియు, ఈ మహాజగంబులన్నియు నాయొక్క శరీరమైయున్నవి.

యథాహమేవం స్మయదేహికేయం సర్వం తథైవాఙ్గ న చిత్రమేతత్
అన్యైః స్వభావో విదితో న శుద్ధో యదా న పశ్యన్తి తథేత్థమఙ్గ. 48

ప్రియుడా! ఈ నీచేఁగాంచబడిన నేను జగద్వ్యక్తనగుటచే నెట్లాశ్చర్యరూపమగు దేహము గలదాననైయున్నానో, అట్లే యీ సమస్తవస్తు సమూహమున్ను సర్వజగద్వ్యక్తమగుటచే నాశ్చర్య భూతమేయైయున్నది. కాని, అవివేకులు ప్రతివస్తువందునుగల శుద్ధ చిత్స్వభావము నెఱుఁగరు గనుక వారిట్లు గాంచజాలకయున్నారు. ఎపుడట్టి చిత్స్వభావమున దృఢత్వము కలుగునో, అపుడు వారున్ను నిట్లు గాంచఁగల్గుదురు.

అవేదశాస్త్రేణ జగత్యశేషైర్భూతైః స్వదేహాలయభిత్తిభాగాత్
ఏతద్విధేయం న విధేయమేత ద్ధ్వనిః స్వతః శ్రూయత ఏవ నిత్యమ్. 49

నీవంటి సమస్తజీవులున్ను బాహ్యజగత్తుకంటె వేఱగు శరీరాంతర్గతమగు జగత్తునందు దేహముయొక్క ఏకభాగమైన కర్ణగోళ ప్రదేశమునుండి ఇది చేయవలెను, ఇదిగూడదు, అను నీప్రకారమగు విధినిషేధమయమగు వేదశాస్త్రవాదమునంతయు, స్వయముగ ప్రతిదినము వినుచునే యున్నారు. అట్టిశ్రవణముచే తదంతర్గతమగు విధినిషేధ తదర్థభూతమగు జగత్తును దేహమునఁ గలదనియే భావింపుము.

ఈదృక్స్వభావైవ పదార్థసత్తా సా తేఽత్ర యద్భిత్త్యచలాదయోఽపి
స్వప్నాదిమాయాస్వివ మే వదన్తి వాచం న యుష్మాస్వసమఞ్జసం తత్. 50

ఇట్టి శబ్దసామాన్యస్వభావమువలె సమస్త పదార్థములందును అనుగతమైనట్టియే సత్త గలదో అది సర్వజగత్సహితమగు సత్తాసామాన్య స్వభావమేయైయున్నది. అనఁగా జగత్తుయొక్క ప్రతిపరమాణువందును సమస్తబ్రహ్మాండములును గలవు. ఏలయనిన, ఈ స్తంభ, పర్వతాదులున్ను బ్రహ్మసత్తయేయై యున్నవి. స్వప్నాదిమాయారూపములందుపలె నిపుడును నా యెదుట ఈ స్తంభాదులు భాషణాది వ్యవహారము లాచరించుచునేయున్నవి. కావున, ఈ భిత్త్యాదులు అచేతనములను భ్రమకలిగియుండరాదు. ఎపుడు, అత్యంతజడరూపముచేఁ బ్రసిద్ధములగు స్తంభాదులందును సర్వజగత్సహితమగు చేతనత్వము అసంగతము కాకయున్నదో, అపుడిఁక చేతనప్రాయులగు మీవంటివారిదేహములం దెన్నఁటికిని అసంగతము కాకయేయున్నదగును.

అస్త్రీకసంసారగతేన దృష్టం మయా క్వచిద్భావదనన్యకామమ్
భూతాని నిర్యాన్తి బహూని భూతాద్విశన్తి భూతాని బహూని భూతమ్. 51

మహాత్మా! ఇంకొక యాశ్చర్యకరమైన విషయము నవలోకించితిని. అది యేదనిన - ఒకచోట స్త్రీ రహితమగు ప్రపంచమొకదానిని బొంది యటనంతటను కామరహితులగు పురుష ప్రాణులు మాత్రమే యుండియుండుటను గాంచితిని. వారు పృథివ్యాదులనుండియే జనించుచు మరల యా పృథివ్యాదులందే లయించుచునుండిరి.

ఏకాని దృష్టాని మయాఙ్గనాని ఖేఽభ్రాణ్యదభ్రాణ్గ ఘుణఘ్నధూని
వృష్ట్యా సమం తాన్నిపతన్తి ఖణ్డైర్భువ న్తితీక్ష్ణాని జనాయుధాని. 52

మఱియొకచోట ఏ విపత్తును గలిగింపనివియు, శస్త్రసంఘర్షణధ్వనిఁ బోలినట్టి గర్జనలచే 'ఝణఝణ' మనుశబ్దమును గావించునదియునగు గొప్ప మేఘఖండములను వీక్షించితిని. వాని నుండి వర్షముద్వారా యే విద్యుదాదులంతటఁ బడుచుండెనో, అవి జనులయొక్క తీక్ష్ణములగు యాయుధములగుచుండెను.

అన్యత్ర దృష్టం గగనే న యావదిహాన్ధయా గ్రామగృహాణి యాన్తి
విశన్త్యముత్రాన్త ఇహా భవద్యో గ్రామః స ఏవాన్యత ఏవ లబ్ధః. 53

ఇంకొకచోట ఈ యాశ్చర్యకరమైన విషయమును జూచితిని - ఈ ప్రపంచమున యెన్ని గ్రామగృహములుగలవో, అవియన్నియు అంధకారాదులచే వినష్టమైనట్టి దృష్టితో ఆకాశమార్గమునఁ బోవుచు నట దూరముననున్న దిగంతమందుఁ బ్రవేశించుచుండెను. మఱియు నిచట మీ గ్రామ మెయ్యదిగలదో, దానిని మఱియొకచోట నేను గాంచితిని ఆశ్చర్యము!

నరామరాఽహిప్రవిభాగముక్తాన్యన్యత్ర భూతాని సమాని సన్తి
ఖాదేవ సర్వాణి సముద్భవన్తి తత్రైవ కాలేన లయం ప్రయాన్తి. 54

మఱియొకచోట మనుష్య, దేవ నాగాది యే భేదములును లేక జీవులందఱును సమానులుగనే యుండిరి. వారందఱును ఆకాశమునుండియే జనించుచు మరల కాలక్రమమున నద్దాని యందే విలీనులగుచు నుండిరి.

అచన్ద్రతారార్కమనన్ధకారం స్వయంప్రకాశాఖిలభూతజాతమ్
స్మరామి కించిజ్జగదేకకాన్తం జ్వాలోదరాభం దినరాత్రిముక్తమ్. 55

వేఱొకచోట, సూర్య, చంద్ర, నక్షత్రాది రహితమై, అంధకారవర్జితమై, స్వయంప్రకాశ స్వరూపులైన సమస్త ప్రాణులతోఁ గూడినదై, మనోహరమై, జ్వాలా మధ్యభాగమువలెనున్నదై రాత్రిందిన విభాగశూన్యమైనట్టి జగత్తొకటి యుండియుండుటను స్మరించుచున్నాను.

అపూర్వదైత్యాహినరామరాది భూతాన్యపూర్వద్రుమపత్తనాని
అపూర్వలోకాన్తరకార్యవన్తి స్మరామ్యనన్తాని మహాజగన్తి. 56

అపూర్వులగు అసుర, నాగ, మనుష్య, దేవతాది ప్రాణులతోఁ గూడినవియు, అపూర్వములైన వృక్ష, పట్టణాదులు గలవియు, అపూర్వములైన లోకాంతర వ్యవహారములు గల్గి యున్నవియునగు అసంఖ్యేయములైన మహాజగంబులను నేనిపుడు స్మరించుచున్నాను.

దిగస్తి సా నో విహృతం న యస్యాం న సోఽస్తి దేశః ఖలుయో న దృష్టః
యన్నానుభూతం న తదస్తి కార్యమన్యాశ్రయం నాపరమస్తి మర్శాత్. 57

వెయ్యేల! నేను విహరింపని దిక్కే లేదు. నేనుజూడని దేశమేలేదు. నేననుభవింపని కార్యమేలేదు; మఱియు ి యొక్క విమర్శచే అనుభవరూపమగు సర్వసాక్షికంటె వేఱైనట్టి అధిష్ఠాన మెద్దియనుగూర . సమస్త దృశ్య ప్రపంచమునకును లేదు.

క్షీరోదకక్రమమితమ స్వరరత్నశృఙ్గధారాగ్రనిర్దలనజాతఝణఝణానామ్
విస్త్రశ యుతనుపేన్ద్రభుజాఙ్గదానాం శబ్దం స్మరామి ఘనగర్జితశఙ్కితేన.

ఇత్యార్షే శ్రీ వాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే ఉత్తరార్ధే అవిద్యోపాఖ్యానాన్తర్గత విపశ్చిదుపాఖ్యానే భాససంసారవర్ణనం నామ ఏకత్రింశాధికశతతమః సర్గః ॥ 131 ॥

క్షీరసాగరమున మథించుటకొఱకు చలింపఁ జేయఁబడిన మందరపర్వతముయొక్క రత్నమయములైన శిఖరములయొక్క తీక్ష్ణములగు అగ్రభాగములతోటి సంఘర్షణముచే జనించిన 'ఝణఝణ' ధ్వనితోఁగూడిన భగవంతుని భుజాభరణములయొక్క — మేఘగర్జన శంకచే జనులచే వినఁబడిన — శబ్దములనుగూడ నేనిపుడు స్మరించుచున్నాను.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున నుత్తరార్ధమున అవి॥ విప॥ భాససంసారవర్ణనమను నూటముప్పదియొకటవ సర్గము ॥ 131 ॥



## ద్వాత్రింశాధిక శతతమః సర్గః

[ వర్ణ్యన్తేఽత్రాపి భాసేన భూయో జన్మపరిభ్రమాః
ఆశ్చర్యాణి చ భూరీణి నిస్సారత్వం చ సంసృతేః.

మరల భాసుఁడు తన జన్మ పరిభ్రమలనుగూర్చియు, తాను గాంచిన పెక్కాశ్చర్యములఁగూర్చియు, సంసారముయొక్క అసారత్వమునుగూర్చియు వర్ణించుట యిచట గాననగును. ]

భాస ఉవాచః—

మన్దరే మృదుమన్దారమన్దిరే మన్దరాభిధామ్
ఆలిఙ్గ్యాప్సరసం సుప్తం సరిత్తృణమివానయత్. 1

మామథాసౌ మయా పృష్టా సమాశ్వాస్య జలాకులా
బాలే కిమిదమిత్యుక్తం తయా చపలనేత్రయా. 2

ఇహ చన్ద్రోదయే ష్వేతాశ్చన్ద్రికాన్తకటప్రభాః
నద్యో మాద్యన్తి వనితాః సేష్టా ఇవ నిశాగమే. 3

త్వత్సంగమరసావేశవశాత్తన్మను విస్మృతమ్
ఇత్యుక్త్వా మాముపాదాయ సోడ్డీనా విహగీవ ఖే. 4

శృఙ్గం శృఙ్గవతః శృఙ్గే గఙ్గా కనకపఙ్కజే
అహమాసం సమాః సప్తతిత్రిఙ్కనోఽ కర్దమాప్లుతే. 5

భాసుఁడు:— ఓ మునీంద్రా! ఒకపుడు మందరపర్వతముయొక్క కోమల మందార లతా కుంజ భవనమున మందర యను అప్సరసను కౌఁగిలించుకొని నిదురించియుండ నొకనది తృణములవలె మమ్ముల గొట్టుకొనిపోయెను. ఆ పిమ్మట జలప్రవాహమునచే వ్యాకులవతియైయున్న

యా యప్సరస నూఱడించి నేనామెను బాలా! ఇదియేమి అని యడిగితిని. అంత నా చంచలనేత్ర యిట్లు పలికెను. — 'నాథా! రాత్ర్యాగమనమున తమయొక్క ప్రియుల రాకతోఁగూడుకొనిన వనితలు కామముచే మదోన్మత్తలగునట్లు, ఈ ప్రదేశమున చంద్రోదయముకాఁగా చంద్రకాంత శిలామయములగు పర్వతములపైనుండి జనించు ఈ ˘సలు మదోన్మత్తములగుచున్నవి. (ప్రవహించు జలముచే వృద్ధిబొందుచున్నవి.) ప్రియుఁడా! నీయొక్క సంగమమును అమృతరసముయొక్క ఆస్వాదమునకు వశీభూతనై నేనావిషయమును నీకు ముందుగనే చెప్పుటను మఱచితిని! అని యిట్లుపలికి ఆ యప్సరస, గంగానదియందలి సువర్ణకమలమందున్న పక్షి తన సహచరమగు తుమ్మెదతోటి యాకసమున నెగురునట్లు నన్నుఁగొని యాకాశమున నెగిరెను. అటుపిదప ఆ జలముచేఁదడిసిన శరీరముగల నేను, పంకరహితమగు నిర్మల మందరాచల శిఖరముపై నయ్యప్సరసతో ఏడు వత్సరముల పర్యంతము నివసించితిని.

అన్యన్మయా జగద్దృష్టమృక్ష చక్రవివర్జితమ్
గర్భగర్భస్థైక జాతిస్వప్రకాశ జనావృతమ్. 6

న దిగ్విభాగో న దినాని యత్ర న చైవ శాస్త్రాణి న వేదవాదాః
న చైవ దైత్యాదిసురాదిభేదో జగన్మయా తాదృగథాత్మదీప్తమ్. 7

అపిమ్మట, నక్షత్ర చక్రవర్జితమైనదియు, కదళీదళములవలె నొకరియందు మఱియొక రున్నట్టి ఒకేజాతివారగు స్వయంప్రకాశరూపులైన జనులతో గూడిఁయున్నదియు, దిక్కుల విభాగముగాని, రాత్రిందినముల భేదముగాని, శాస్త్రములుగాని, వేదవాదములుగాని, దైవాసురాది భేదముగాని లేనిదియు, స్వయంప్రకాశమానమైనదియునగు ఒక విచిత్రమైన జగత్తును గాంచితిని.

విద్యాధరామరవిహార విమానభూమా
వబ్ధింలిహాచలనితమ్బకదమ్బకచ్ఛే
ఆసం సమాః సమరసోఽమరసోమనామా
సప్తాన్యసప్త ససముద్రతటే తపస్వీ. 8

పిదప విద్యాధర - దేవతల విహారప్రదేశమున్ను, వారి విమానముల స్థలమున్నునగు సముద్రతీర సమీపమునగల యత్యున్నతములైన పర్వతములయొక్క కదంబవృక్ష సహితమగు జలప్రాయ ప్రదేశమున 'అమరసోముఁడను' పేరుగల విద్యాధరునిగ జన్మించి 'తపస్వినై' పదునాలుగు వత్సరముల వఱకచట నివసించితిని,

పవనవహన సంనివేశనానా సుహయపయోధరదేహకైరనేకైః
గజహరిణమృగేన్ద్రవృక్షవల్లీ మృగనగపన్నగపక్షిభిః పరీతమ్. 9

గగనమవనితః సమేత్య వహ్నేర్వ్యరవిభవేన జగత్యనన్తకోశమ్
క్వచిదహమభితో దిదృక్షురగ్రే స్మృత ఉరగాశనవద్బలాదవిద్యామ్. 10

క్వచిదహం జగతః పరినిర్గతః పతిత ఏకమహార్ణవవిస్తృతే
నభసి తత్ర నివాసనిభే సితః సమయమస్వభవం పతనం తథా. 11

అనంతరము, జగత్తునందు నలువైపుల అవిద్యయొక్క అంతమును జూడఁదలంచి, అగ్నిదేవుని వరప్రభావమువలనఁ ఒకచోటవాయుప్రవాహమువలె గమనము నల్పునట్టి నానాప్రకారములైన యుత్తమాశ్వ, మేఘాదులవంటి దేహముల ధరించిన ప్రాణులచేతను, గజ, హరిణ, సింహ, వృక్షలతా, మృగ, పర్వత, గరుడ, పక్ష్యాదులచేతను వ్యాప్తమైనట్టి అనంతకాశకోశమును భూమిపైనుండి పొంది గరుడునివలె వేగముగ ముందుఁ బోసాగితిని. అట్టి జగంబునుండి బయలుదేఱియొకచోట మహాసముద్రమువలె విశాలమైనట్టి యాకాశమునఁబోయి పడితిని. అచట నక్షత్రసమూహమున బద్ధుఁడనై, దినరాత్రి, మాస, ఋత్వాదిరూప సమయమునున్ను, దిక్కులందలి గమనమునున్ను ననుభవించితిని.

ఆకాశకోశపతనానుభవైకవృత్తే
శ్రాన్తస్య మే పదమకార్యథ నిద్రయాన్తః
తాదృక్ సుషుప్తవపుషాథ మయోపలబ్ధం
స్వప్నాత్మజాగ్రతి తదాత్మని తత్ర విశ్వమ్. 12

మహాత్మా! ఈ ప్రకారముగ ఆకాశకోశమందలి గమన, పతనములయొక్క యనుభవమే ముఖ్యవ్యాపారముగ గల్గినట్టియు, చిరకాలపతనముచే శ్రమనొందినట్టియు నాయొక్క యంతఃకరణమున నపుడు నిద్రప్రవేశించెను. అట్టి సుషుప్తశరీరముతోఁగూడియున్న నేనపుడు తదనంతరము ప్రవృత్తమైన స్వప్నజాగ్రదవస్థయందు నాయందే సమస్తజగత్తును గాంచితిని.

భూయో దిగన్తభువనామరమన్దరాద్రి
సంసారచఞ్చలతయా లతయేవ పక్షీ
అక్షీణవాతవలయా పరిచాల్యమాన
స్తన్మాసు తాసు పతితో హి జగద్గుహాసు. 13

ఆ నాయందుఁ గాంచిన స్వప్నజాగ్రత్ప్రపంచమందును, మరల దిగంతలోక, మందర పర్వతాదిరూప సంసారముచే క్షీణింపని వాయువుయొక్క బలమువలన చంచలమగు లతచే, బక్షివలె - చలింపఁజేయఁబడుచు నేను. పూర్వసంకల్పితములగు — దృశ్యపరిమాణముచే పరిచ్ఛేదరూపములైనట్టి - ఆ జగద్రూప గుహలందుఁ బడితిని.

విషయాశాదృశో యావత్తావద్యాతః క్షణాదహమ్
పునస్తథైవ పశ్యంస్తు దృశ్యం యాతః పునః పునః. 14

దృష్టికి విషయమైనట్టి ప్రపంచ మెంతవఱకుండునో, అంతవఱకును నేను క్షణకాలములో నేగుచు, అచటినుండి మరల దృశ్యమును గాంచుచు, మరల యట కేగుచు, ఇవ్విధమున దృశ్యమును మరల మరల పొందితిని

ఇతి దృశ్యమదృశ్యం చ గమ్యం చాగమ్యమేవ చ
వేగాల్లఙ్ఘయతో దేశం మమ వర్షగణా గతాః. 15

ఈ ప్రకారముగ జాగ్రత్తునందును, స్వప్నమందును దృశ్యమైనవియు, అదృశ్యమైనవియునగు విషయముల నుద్దేశించి గమ్య, అగమ్యస్థానముల నతివేగముగ దాటుచునున్న నాకుఁ బెక్కు వత్సరముల సమూహము గడచిపోయెను.

దృశ్యాఖ్యాయా అవిద్యాయా న త్వన్తం ప్రాప్తవానహమ్
మిథ్యైవ హృది రూఢాయాః పిశాచ్యా ఇవ బాలకః. 16

కాని, పిశాచికి వశీభూతుఁడైన బాలకునివలె, మిధ్యగనే హృదయమందారూఢమైన యీ దృశ్యమను బేరుగల అవిద్యయొక్క యంతమును నేను బొందకుంటిని.

నేదం నేదం సదిత్యేవ విచారానుభవే స్థితమ్
తథాపీదమిదం చేతి దుర్దృష్టిర్న నివర్తతే. 17

'ఇది సత్యముకాదు, ఇది సత్యముకాదు' అనియిట్లు విచారానుభవమున స్థితినొంది యున్నప్పటికిని' ఇది సత్యమే, ఇదిసత్యమే' అను నీప్రకారముగ ప్రతివిషయమందును, చిరకాలాభ్యస్తమగు ద్వైతసంస్కారముయొక్క ప్రాబల్యముచే నేర్పడిన యేదుష్టబుద్ధిగలదో, అది నాకుఁ దొలఁగుటలేదు.

ప్రతిక్షణం సుఖైర్దుఃఖైర్దేశకాలైః సమాగమైః
సరిద్వారివదాలోలా నవమాయాన్తి యాన్తి చ. 18

విచారణచే తిరస్కరింపఁబడినప్పటికిని ప్రతిక్షణము ప్రాప్తించు సుఖ దుఃఖముల చేతను, దేశకాలాదుల భేదములచేతను, ఇష్టానిష్టజనుల సమాగములచేతను, చంచలమగు నదియొక్క జలమువలె నూతన నూతన సంసారదృష్టులు నాకువచ్చుచు (కలుగుచు) పోవుచునేయున్నవి

తాలీతమాలబకులాకులతుఙ్గశృఙ్గ మున్నాదవాతజవమేకమహం స్మరామి
సూర్యాదిభిర్విరహితం ప్రకటం స్వకాన్త్యాః సస్థావరాద్రితటజఙ్గమమేవ విశ్వమ్.

మహాత్మా ! మతియొక యాశ్చర్యము నిపుడు స్మరించుచున్నాను; అదియేదనిన ఒక చోట నిరుపమానమై, అత్యున్నతమై, తాళ, తమాల, బకులాది వృక్షములచేఁ బరిపూర్ణమై మహాశబ్దయుక్తమగు వాయువుయొక్క వేగముగలదై సూర్యాదిరహితమైనప్పటికి నిజదీప్తిచేఁ బ్రకాశమానమై, పర్వత తటములను స్థావరములును, ప్రాణికోట్లను జంగమములును గల్గియుండుటచే విశ్వమునకు స్థానభూతమై యొప్పుచున్నదైనట్టి యొకగొప్ప (బ్రహ్మరూపమగు) పర్వతశిఖరమును వీక్షించితిని.

యదేతదేకాన్తవిహారహారి స్వచ్ఛన్దమేకామితమస్తశఙ్కమ్
క్వచిన్మయా చారు జగత్సు దృష్టం తుల్యా న తస్యామరరాజలక్ష్మీః. 20

ఇత్యార్షే శ్రీవాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే ఉత్తరార్ధే అవిద్యోపాఖ్యానాన్తర్గత విపశ్చిదుపాఖ్యానే భాసవర్ణితస్వజన్మపరమ్పరా నామ ద్వాత్రింశాధికశతతమః సర్గః ॥ 132 ॥

ఆ పర్వతశిఖరము ఏకాంతవిహారులగు తత్త్వవేత్తలకు మనోహరమై, స్వతంత్రమై, ఏకమై పరిమితిలేనిదై, దేశకాలవస్తు పరిచ్ఛేద శూన్యమైయుండెను. అద్దాని నొకచోట బ్రహ్మవేత్తలుండు ప్రదేశములందు నేను జూచితిని. ఇంద్రునియొక్కగాని, బ్రహ్మదేవునియొక్కగాని సంపద దానితోటి తులతూఁగనేరదు.

ఇది శ్రీవాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున నుత్తరార్ధమున అవి॥ విప॥ భాసవర్ణితస్వజన్మపరంపరయను నూటముప్పదిరెండవ సర్గము ॥ 132



## త్రయస్త్రింశాధికశతతమః సర్గః

[ ఆశ్చర్యం క్వచిద్దృష్టం భాసేనాత్రోపవర్ణ్యతే
సప్తద్వీపప్రమాణస్య శవస్య పతనం దివః

సప్తద్వీపముల పరిమాణముగల శవము స్వర్గమునుండి పడుటయను తానొకచోటఁ గాంచిన యత్యాశ్చర్యకరమగు విషయమును భాసుఁడిచట వర్ణించుచున్నాఁడు. ]

**విపశ్చిదువాచ :—**

కస్మింశ్చిదన్యత్ర జగత్యపూర్వే దృష్టం మయేదం శృణు కిం విచిత్రమ్
మహాఘవృత్తాన్తసమాన మవిద్యయాన్ధేన బలాత్కృతం యత్. 1

భాసుఁడు ఓ మునివరా! ఈ జగత్తుకంటె వేఱైనట్టి యొకానొక **అపూర్వమైన** జగత్తునందీ చెప్పఁబోవు విచిత్రమును నేను గాంచితిని, వినుడు — అయ్యది బ్రహ్మహత్యాది మహాపాతకముల ఫలభూతమైన రౌరవాది నరక వృత్తాంతదశవలె **అతి** భయంకరమైనను, అవిద్యచే అంధుఁడనైన నేను అగ్నిదేవుని వరప్రదాన బలముచే ననుభూత మొనర్చుకొంటిని.

అస్తి క్వచిత్తే భవతామగమ్యే జగజ్జ్వలద్దీప్తివిచిత్రసర్గః
ఏతాదృగవ్యమ్బరత స్తదన్యత్ స్వాప్నం పురం జాగ్రతి చేతసీవ. 2

ఓ సభ్యులారా ! మీకు అగమ్యమైనట్టి యాకాశమందలి యొకానొక **స్థానమున** జాజ్వల్యమానమగు చంద్ర సూర్యాదుల దీప్తిచే ప్రకాశమానమగు యొక **విచిత్ర** బ్రహ్మాండముగలదు. స్వప్ననగరము జాగ్రన్నగరమువలెనున్నను జాగ్రదృష్టిచే శూన్యమగుటవలన **మఱియొక**దానివలెనే చిత్తమందు భాసించునట్లు, ఆ జగత్తున్ను రచనాదులందీ జగత్తుతోటి సమముగ నున్నప్పటికిని, ఈ జగద్దృష్టిచే శూన్యమైయుండుటవలన మఱియొకదానివలెనే స్థితినొందియున్నది,

తస్మిన్మయా విహరతా హృదయస్థమర్థ
మన్వేష్టుమక్షి నిహితం కకుభాం ముఖేషు
పశ్యామి యావదచలప్రతిమా ధరాయాం
ఛాయాలిజాలమలినా పరిబంభ్రమీతి. 3

ఆ జగత్తునందు సంచరించుచు హృదయమందలి స్వాభిలషిత పదార్థమును దిగంతములందు అన్వేషించుటకుగాను దిక్కులవైపునకు దృష్టిని ప్రసరించుటతోడనే, పర్వతాకారమై, తుమ్మెదల సమూహమువలె మలినమైనట్టి గొప్పఛాయ భూమిపై మాటిమాటికి తిరుగుచుండుటను గాంచితిని.

ఆశ్చర్యమాత్రముచితం కిమిదం నిమేషా
దిత్యక్షి పై జగతి యావదహం త్యజామి
తావత్తావదద్రిమతులం పురుషాకృతిం ద్రా
గావర్తవృత్తిఖిర పశ్యమహం పతన్తమ్. 4

అపుడు 'అత్యాశ్చర్యభూతమైనట్టి యిదియేమి' అని విచారించుచు పైకిజూడ నింతలో అనేక పర్వతములవంటి మహాకారమును ధరించినదియు ఆవర్తము (సుడి) యొక్క వృత్తులతోఁ గూడి పడుచున్నదియునగు యొక పురుషాకృతిని జూచితిని.

కః స్యాదయం గిరిగురుః పురుషో విరాడ్వా
పర్యస్తపర్వతవదాశు పతచ్ఛరీరః
ఆకాశపూరకవపుః పరమ్బరోఽపి
యో నైవ భాతి విహతాఖిలవాసరశ్రీః. 5

మహాపర్వతాకారుఁడును, ఆకాశమును బూర్ణమొనర్చునట్టి శరీరము గలవాఁడును, శీఘ్రముగ బడుచున్న దేహముతోఁ గూడియున్నవాఁడునగు ఈ పురుషుఁడు - సూర్యుఁడు చిదాకాశ రూపుఁడైనను ఎవనివలన తన దివసములయొక్క శోభనువీడి ప్రకాశింపఁడో అట్టి బ్రహ్మదేవుఁడో లేక బ్రహ్మాండ శరీరధారియగు విరాట్పురుషుఁడైయుండునను సంశయమపుడు నాకుఁ గలిగెను.

ఏవంవిధా హృది మనాక్కలయామి యావ
త్తావత్ప్రపాత సహసా నభసోవివస్వాన్
కల్పాన్తవాతపరివృత్తపితామహాణ్డ
పృష్ఠావపాతఘనఘోషజుషా జవేన. 6

ఈ ప్రకారముగ మనస్సునందొకింత విచారణ చేయుచుండ నింతలో శీఘ్రముగ నాకాశమునుండి సూర్యుఁడు ప్రళయకాల వాయువులచేఁ బడగొట్టబడిన యూర్ధ్వ బ్రహ్మాండకపాలముయొక్క పతనశబ్దమువంటి గొప్ప శబ్దముతోఁగూడిన వేగముతో క్రిందఁబడెను.

తస్మిన్పతతి భీమాత్మన్యపారావారదేహిని
సప్తద్వీపాం వసుమతీం పరిపూరయతి క్షణాత్. 7
స్వాత్మనో నాశమాశఙ్క్య సద్వీపభువనైః సహ
అవశ్యభావిపార్శ్వస్థమహమగ్నిమథావిశమ్. 8

అట్లు భయంకరుఁడును, అపార శరీరధారియు, సప్తద్వీపయుక్తమగు పృథివిని క్షణకాలములో బూరించువాఁడునగు ఆ సూర్యుఁడు క్రిందఁబడ, అపుడు ద్వీపలోకాది సహితముగ స్వశరీర వినాశము తప్పదని యూహించి తోడనే ప్రక్కనున్న యగ్నియందు నేను బ్రవేశించితిని.

స జాతవేద భగవాఞ్జన్మాన్తరశతార్చితః
మా భైషీరితి దేహేన మామువాచేన్దుశీతలః. 9

జన్మాంతరము లందనేక పర్యాయములు నాచేఁ బూజింపఁబడినట్టి యా యగ్నిభగవానుఁ డంత జంద్రునివలె శీతలమగు దేహమును దరించి 'భయపడవలదని' నన్నుఁగూర్చి చెప్పెను.

జయ దేవ త్వమస్మాకం ప్రతిజన్మ పరాయణమ్
అకాల ఏవ కల్పాన్తో జాతోఽతః పాహి మాం ప్రభో. 10

ఇత్యుక్తేనాగ్నినా ప్రోక్తం మా భైషీరితి తత్పునః
ఉత్తిష్ఠ గచ్ఛ గచ్ఛావో మల్లోకమితి చానఘ. 11

అపుడు 'దేవా! తమకు జయమగుఁగాత! ప్రతిజన్మయందును తాము మాకుశరణ్యులై యొప్పుచున్నారు. ఇపుడు అకాలముననే కల్పాంతమేతెంచినది. కావున, ప్రభూ! నన్ను రక్షింప వేడెద!' అని నేనాయగ్నిదేవుని ప్రార్థింప, అంత నాఁతఁడు పాపరహితుఁడా! భయపడకుము' అని మరలచెప్పి లెమ్ము, నాలోకమునకుఁ బోవుదము రమ్ము' అనియు వచించెను.

ఇత్యుక్త్వా శుకపృష్ఠేఽసావారోప్య భగవాంస్తతః
దేహైకదేశే తత్ప్రాప్తి భూతం దగ్ధ్వా నభఃప్లుతః. 12

అట్లు వచించినవాఁడై. తన వాహనమగు చిలుకయొక్క వీపుపై నన్ను గూర్చుండఁబెట్టి యాక్రిందఁబడిన శవశరీరముయొక్క యొక ప్రదేశమున దహించుటద్వారా రంధ్రముచేసి దాని గుండా యాయగ్ని భగవానుఁడు ఆకాశమార్గమున నెగసెను.

అనన్తరం నభః ప్రాప్య దృష్టః కష్టాకృతిర్మయా
స తాదృగ్భూతసంపాతమహోత్పాతో భయప్రదః. 13

పమ్మట, ఆకాశమును బొంది యటనుండి యాకష్టప్రదమైనట్టియు. తన పతనముచే గొప్ప కీడును గలుగఁజేసినట్టియు, భయంకరమైనట్టియు, ఆ భూతమును నేనవలోకించితిని.

తస్మిఞ్జవేన పతితే వసుధా చచాల
సామ్భోధిశైలవనపత్తనజఙ్గలౌఘా
చక్రే ఖ్పగుద్వయమయాసజలప్రవన్తీ
భీమాకృతీన్వ్యధురదేహవిభేదగర్తాన్. 14

ఆ మహాశవము వేగముతోటి పడుటవలన సముద్ర, పర్వత, వన, నగర, అరణ్య సమూహయుక్తమగు భూమి కంపించెను. మఱియు, నదులయొక్క జలప్రవాహము నిరోధింపఁ బడుటచే నయ్యది రెండుతీరములందును నూతనమార్గములను జేపట్టుటఁబట్టి రెండువైపుల జల పాతము లేర్పడెను. ఆ పడుచుండు జలములు మనుష్యాదులచే నిర్మితములగు కూప, తటాకాదుల కంటె విలక్షణములై నట్టి గోతులను నిర్మింపఁదొడఁగెను.

ఊర్వీ రరాస కకుబుత్తరతో రరాస
పూర్వా రరాస విరరాస చ దక్షిణా దిక్
ద్యౌరారరాస విరరాస సశైలభూతం
సర్వం జగత్ప్రలయసంభ్రమభీతముచ్చైః. 15

ఉర్వీ రరాస ధరణే సవిరావరంహాః
సంరమ్భతర్జితసమస్తదిగన్తరాసా
వ్యోమాపి ఘుంఘుమమలఙ్ఘ్యమలం చకార
నాగారివృన్దభయవిద్రవణప్రచణ్డమ్. 16

మఱియు నపుడు, పృథివియు, పూర్వపశ్చిమ, ఉత్తర దక్షిణదిశలున్ను ఆకాశమున్ను, పర్వత ప్రాణిసహితమగు సమస్త జగత్తున్ను, ప్రళయసంభ్రమముచే భీతిల్లినవై గొప్ప శబ్దము చేయసాగెను. మఱియు, శబ్దయుక్తమగు పతనవేగముయొక్క భయముచే నదలింపఁబడిన సమస్త దిగంతరాళ సహితమగు పృథివియు, ఆకాశమున్ను ఆ పడిన శవమును ధరించుటయందు, గరుడాదులను భయముచేఁ బరువిడఁజేయు నతి ప్రచండమైనట్టియు, ఇతర శబ్దములచే నలంఘ్యమైనట్టియు గొప్ప ఘుంఘుమ శబ్దమును విస్తారముగఁ జేయఁదొడఁగెను.

నిర్ఘాతశబ్ద ఉదభూదభితో భయాయ
భీమాయ భూధరదరీదృఢదారణోత్థః
ఉత్పాతభీమజవజాలయుగాన్తవాత
సంరబ్ధకల్పఘనఘోషవితీర్ణతర్జః. 17

అపుడు, ఉత్పాతములచే భయంకరవేగయుక్తమైయుండుటచే జాలమువలె నాకర్షించునట్టి ప్రళయవాయువులచే సంక్షుభితములైన ప్రళయకాల మేఘములయొక్క శబ్దములచే సర్వుల నదల్చునట్టిదియు, పర్వతగుహలయొక్క గొప్పవిదారణముచే నుత్పన్నమైనదియునగు కంపనశబ్దము మహాభయముకొఱకే యుద్భవించినదాయెను.

తస్మిఞ్జవేన పతితే వసుధా రరాస
సారావదిఙ్ముఖతయా శతవేధమాగాత్
తత్రాస్ఫుటన్కులగిరీన్ద్రమహాతటాని
పాతాలదేశమవిశన్హిమవచ్ఛిరాంసి. 18

ఆ శవము వేగముతోఁటి పడుటవలన పృథివియు, దిక్కులున్ను ధ్వనించెను. తద్ధ్వనిపూర్వకముగ నపుడాపృథివియందు, గొప్ప పగుళ్లేర్పడెను. ఆ పగులునందు హిమాలయ కులపర్వతములయొక్క మహాశిఖరములున్ను, తటములున్ను బ్రద్దలగుచుఁ బ్రవేశించి పాతాళదేశమునకేగెను.

ఆసీత్తత్పతనం తస్య మేరుశైలశిలాకృతేః
దలనం శైలశృఙ్గాణాం విదారణకరం భువః. 19

క్షోభణం జలరాశీనామద్రీణాం భూతలార్పణమ్
పీడనం సర్వభూతానాం క్రీడనం ప్రలయార్థినామ్. 20

పాతనం భూతలే భానోః స్థగనం ద్వీపపద్ధతేః
చూర్ణీకరణమద్రీణాం దలనం మణ్డలావనేః. 21

ద్వితీయమివ భూపీఠం బ్రహ్మాణ్డార్ధమివాపరమ్
పతితం ఖమివాకృత్యా తదపశ్యన్న ఖేచరాః. 22

మేరుపర్వతశిలవంటి యాకారముగల యాశవముయొక్క యా పతనము పర్వతశిఖరములను బ్రద్దలుచేయునదియు, భూమిని బగులఁగొట్టునదియు, సముద్రములను క్షోభ పెట్టునదియు, పర్వతములను భూమికి సమముగఁ జేయునదియు, సర్వజీవులను బాధించునదియు, ప్రళయమును

వాంఛించు రుద్రగణములకు ఆటవంటిదియు, సూర్యుని భూమిపైఁ బడఁగొట్టునదియు, ద్వీపములను గప్పునదియు, పర్వతములను బెండిచేయునదియు, భూమండలమును ఖండించునదియునై యుండెను. మఱియు ఆ శవము మఱియొక భూపీఠమువలె నున్నదియు, బ్రహ్మాండముయొక్క మఱియొక అర్ధభాగమువలె నొప్పునదియు, ఆకృతిని ధరించి పడిన యాకాశమువలెఁ దోచుచున్నదియునై వెలయుచుండెను. ఈ ప్రకారముగ ఆ శవమును ఆకాశచారులు వీక్షించిరి.

అథ పశ్యామ్యహం యావదసౌ మాంసమయోఽచలః
న మాతి సప్తద్వీపాయాం భువి తస్యాఙ్గమేకకమ్. 23

పిదప ఆ మాంసమయపర్వతము తన ఒక్క అంగమైనను సప్తద్వీపములతోఁగూడిన యీ పృథివియందు బట్టజాలనంత విశాలముగ నాకుఁ జూపట్టెను.

తమాలోక్య మయా దేవః ప్రసారే సమవస్థితః
సంపృష్టో భగవాన్వహ్నిః ప్రభో కిమిదమిత్యథ. 24
కథం మాంసమయః సార్ధం సదార్కః పతితో దివః
న న మాతి హి భూపీఠే సపర్వతవనామ్బుధౌ. 25

ఈ ప్రకారముగ నేనా శవముఁగాంచి నా యెడల బ్రసన్నుఁడైయున్నట్టి అగ్నిభగవానుని నపుడిట్లడిగితిని — ప్రభూ! ఇదియేమి? ఈ మాంసమయమగు దేహమెట్లు పడినది? దానితోఁగూడ ఈ సూర్యుఁడాకసమునుండి యెట్లుపడెను? మఱియు నిది పర్వత, వన, సముద్ర సహితమగు ఈ సమస్త భూపీఠమందుగూడ నేల పట్టుటలేదు?

అగ్నిరువాచ:—

ప్రతిపాలయ కుత్ర త్వం క్షణమేకం గతత్వరః
యావచ్ఛామ్యతి దోషోఽయం కథయిష్యామి తే తతః. 26

అగ్నిదేవుఁడు :— ఈ పతనదోషము శమించుపఱకు ఉద్వేగ (భయ) రహితుడవై క్షణకాలము వేచియుండుము. ఆ పిదప సమస్తము నీకు వచించెదను.

అథ తస్మిన్వదత్యేవం సమాజగ్ముర్నభశ్చరాః
తజ్జగజ్జాలజాతీయా దిగ్భ్యో గగనజాఖిలాః. 27

ఈ ప్రకారముగ అగ్నిదేవుఁడు నాతోఁ జెప్పుచుండ నపుడు సర్వదిశలనుండియు ఆకాశ జనితములగు సమస్త వస్త్రాభరణాదులను ధరించి, నభశ్చరజాతికిఁజెందిన పెక్కురుజీవులేతెంచిరి.

సిద్ధసాధ్యాప్సరోదైత్య గన్ధర్వోరగకిన్నరాః
ఋషయో మునయో యక్షాః పితరో మాతరోఽమరాః. 28

అట్లేతెంచిన యాకాశచారులలో సిద్ధులు, సాధ్యులు, అప్సరసలు, అసురులు, గంధర్వులు, నాగులు, కిన్నరులు, ఋషులు, మునులు, యక్షులు, పితరులు, మాతరులు, దేవతలు మున్నగు వారుండిరి.

అథ సర్వేశరీం దేవీం శరణ్యాం తే నభశ్చరాః
భక్తినమ్రశిరఃకాయాః కాలరాత్రిం ప్రతుష్టువుః. 29

అటుపిమ్మట భక్తిచే వినమ్రములైన శిరశ్శరీరములతోఁగూడినవారై, ఆ యాకాశచారులందఱును సర్వేశ్వరియు, భక్తవత్సలయు, శరణాగత రక్షికయునగు కాలరాత్రి భగవతి నిట్లు స్తుతిచేయసాగిరి.

**నభశ్చరా ఊచుః :—**

> బద్ధ్వా ఖట్వాఙ్గశృఙ్గే కపిలమురజటామణ్డలం పద్మయోనేః
> కృత్వా దైత్యోత్తమాఙ్గైః స్రజమురసి శిరః శేఖరం తార్క్ష్యపక్షైః
> యా దేవీ భుక్తవిశ్వా పిబతి జగదిదం సాద్రిభూపీఠభూతం
> సా దేవీ నిష్కలఙ్కా కలితతనులతా పాతు నః పాలనీయాన్. 30

**ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే ఉత్తరార్ధే అవి॥ విప॥ శవోపాఖ్యానే మహాశవవర్ణనం నామ త్రయస్త్రింశాధిక శతతమః సర్గః ॥ 133 ॥**

**ఆకాశచారులు :—** ఏ దేవి మహా కల్పాంతమున, బ్రహ్మదేవునియొక్క కపిలవర్ణయుక్తమగు గొప్పజడల సమూహమును మంచపుకోడునకుఁ గట్టి, అసురుల శిరస్సులచేఁ గూర్పఁబడిన మాలను కంఠమున ధరించి, గరుత్మంతునియొక్క ఱెక్కలను శిరోభూషణముగా నొనర్చుకొని, ప్రాణికోటి నంతయుఁ గబళించి, పర్వతాది సహిత భూపీఠరూపమైన యీ జగత్తును బానము చేయుచున్నదో, ఈ ప్రకారముగ బ్రహ్మాండమునంతటిని సంహరించినప్పటికిని, పాపలేశముచేఁ గూడ నంటఁబడక నిష్కళంకయై, నిత్యము శుద్ధచిద్రూపిణియేయై విరాజిల్లుచు భక్తుల యనుగ్రహముకొఱకు మాత్రము శరీరలతను ధరించుచున్నదో, అట్టి దేవి, అవశ్యము పాలింపఁదగినట్టి మమ్ములను రక్షించుగాత!

**ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున నుత్తరార్ధమున అవి॥ విప॥ శవోపాఖ్యానే మహాశవవర్ణనమను నూటముప్పది మూఁడవ సర్గము ॥ 133 ॥**

---

## చతుస్త్రింశాధిక శతతమః సర్గః

[ దేవ్యాస్తదావిర్భూతాయాః శరీరమిహ వర్ణ్యతే
తత్పీతరక్తకుణపఖాదనంచ గణైరథ.

అపుడు ఆవిర్భవించిన దేవి యొక్క శరీరమును గూర్చిన వర్ణనము గణములతోఁగూడ నామె యాశవముయొక్క రక్తమునుద్రావుట శవమును భుజించుటయను విషయము లిటఁగాననగును!]

**విపశ్చిదువాచ :—**

> ఏతస్మిన్నన్తరే వ్యోమ్నః న పతన్పురుషో మయా
> స్థగితాఖిలభూపీఠః శవరూపో విలోకితః. 1

విపశ్చిత్తు:— ఓ మునీంద్రా! అట్లు దేవగణము భగవతిని స్తుతించుచుండ నింతలోనే నా యాకాశమునుండి పడినదియు, భూపీఠమునంతయుఁ గప్పివైచినదియునగుశవమును నెఱుఁగగల్గితిని.

స యావదుదరాభిఖ్యో దేహభాగోఽస్య యేన భూః
సప్తద్వీపాపి పిహితా మాతుః శైలోపమో మహాన్. 2

వహ్నినోక్తమనన్తం తత్తద్భుజోరుశిరశ్చ మే
లోకాలోకాత్పరం పారం ప్రాప్తం హ్యవిషయే నృణామ్, 3

ఎయ్యది సప్తద్వీపవతియగు భూమిని గప్పివైచెనో, అట్టి కొలవఁబడఁజాలని యా శవము యొక్క పర్వత సదృశమైనట్టి గొప్ప యుదరభాగమును మాత్రమే నేను జూచితిని. మనుజుల దృష్టికి విషయము కానివియు, లోకాలోక పర్వతముయొక్కయు నావలితటమును బొందినవియు నగు దాని యనంతములైన భుజములఁగూర్చియు, తొడలఁగూర్చియు, శిరోభాగమునుగూర్చియు అగ్నిభగవానుఁడు నాకుఁజెప్పెను.

వ్యోమవాసి చయో దేవీ మథ స్తువతి సాదరమ్
వ్యోమ్నః ప్రకటతానాగాచ్ఛుష్కానుభవతి స్వయమ్. 4

ఆ ప్రకారముగ ఆకాశచారులు దేవిని ఆదరముతోటి స్తుతించుచుండ, అపుడాదేవి శుష్కశరీరముతోటి స్వయముగ నాకాశమునఁ బ్రకటమయ్యెను.

ప్రేతవృన్దైరనుగతా మాతృమణ్డలలాలితా
కుమ్భాణ్డయక్షవేతాలజాలతారకితామ్బరా. 5

శిరాలదీర్ఘదోర్దణ్డవనీకృతనభస్తలా
కిరన్తీ శీర్ణదిగ్గాహైర్ద్రుష్టి పాత్రైర్దివాకరాన్. 6

స్ఫురన్నానాయుధాకారకచఝణఝణధ్వని
శతఖణ్డం ఖగానీకం కుర్వాణా వ్యోమకోటరే. 7

దేహజ్వాలేక్షణోష్మాఢ్యైః శరీరావయవైస్త్విషః
దీర్ఘవేణువనాకారాః కిరన్తీ కోటియోజనాః. 8

దన్తకాన్తిస్ఫువిద్యోతదుగ్ధస్నపితదిఙ్ముఖా
త్యాతిదీర్ఘవిస్తీర్ణ శరీరాపూరితామ్బరా. 9

నిరాలమ్బాస్పదా సాంధ్యా వితతేవాభ్రమాలికా
ప్రేతాసనసమారూఢా సురూఢా పరమే పదే. 10

స్ఫురన్తీ ప్రజ్వలద్రూపా సంధ్యా జలధరారుణా
దధానా గగనామ్భోధౌ వాడవజ్వలనశ్రియమ్. 11

శస్త్రైః శవాఙ్గైర్ముసలైః ప్రాసతోమరముద్గరైః
భృసికోలూఖలహలైః కిరన్తీ చఞ్చలా స్రజః. 12

ప్రవజాం కటకటాటోపైర్వ్యహస్తీ గగనాఙ్గణే
దృషదాం ఘర్ఘరారావైః ప్రావృడ్గిరిరివాచలే. 13

ఆ దేవి ప్రేతసమూహములచే ననుసరింపఁబడునదియు మాతృగణముచే లాలింపఁబడు నట్టిదియు, కుంభాండ, యక్ష, బేతాళాదుల సమూహములచే నాకసమును నక్షత్రయుక్తముగఁ గావించునదియు, నాడీయుక్తములగు దీర్ఘ భుజదండములచే నాకాశతలమును వనమువలె నొనర్చునదియు, దిక్కులందు దాహమును వెదజల్లునట్టి దృష్టిపాతములచే సూర్యులను దొలఁగఁగొట్టునదియు, దేదీప్యమానములగు పలువిధ ఆయుధములచే నుత్తమ 'ఝణఝణ' ధ్వనిపూర్వకముగ నాకాశ కోటరమునఁ బక్షిసమూహమును నూఱువక్కలుగఁ గావించునదియు, దేహజ్వాలలతోను, నేత్రాగ్నులయొక్క యుష్ణత్వముతోను, బూర్ణములైనట్టి శరీరావయవములచే దీర్ఘ వేణువనమువంటి యాకృతిగలవియు, కోటి యోజనములవఱకు వ్యాపించినవియునగు కాంతులను వెదజల్లునదియు, చంద్రప్రకాశమును బోలిన దంతములయొక్క దీప్తిచే దిక్కులన్నిఁటిని క్షీరముచే స్నానమొనర్పఁ జేయుచున్నదానివలె నున్నదియు, కృశించినట్టి అతిదీర్ఘమైన శరీరముచే నాకాశమును బూరించునదియు, నిరాలంబమగు ఆకాశము స్థానముగాఁగల్గిన సంధ్యాకాల మేఘసమూహమువలె విస్తృతమైనదియు ప్రేతాసనముపై స్థితినొందియున్నదియు, బ్రహ్మమందు బాగుగ రూఢినొందియున్నదియు, చంచలమై జాజ్వల్యమానమైనట్టి రూపముగలదియు, సంధ్యాకాల మేఘమువలె నెఱ్ఱనైనదియు, ఆకాశమను సముద్రమందు బడబాగ్నియొక్క శోభను ధరించునదియు, శవములతోను, శవముల యంగములతోను ముసల (రోఁకలి,) ప్రాస (ఈఁటె,) తోమర (చిల్లకోల,) ముద్గర (ఇనుపగుదియ,) అసన, ఉలూఖలాదుల (ఱోలు మున్నగువాని)తోను నిర్మితములగు చంచల మాలలను విస్తరింపఁ జేయునదియు, వర్షాకాలమునఁ బర్వత శిలలయొక్క మాలను ఘర్ఘర శబ్దములతోటి తనదేహముపై ధరించునట్లు ఆకాశమను ముంగిటియందు దంతములయొక్క 'కటకట' శబ్దయుక్తములగు యాడంబరములతోటి ప్రాణులయొక్క మాలను ధరించునదియునై విలసిల్లుచుండెను.

దేవా ఊచురయం దేవి ఉపహారీకృతోఽమ్బికే
సార్ధం స్వపరివారేణ శీఘ్రమాహ్రియతామితి. 14

అపుడు దేవతలు ఆ భగవతితో నిట్లనిరి. — దేవీ! ఈ శవము మాచే నీకు కానుకగఁ నొసంగఁబడినది. కావున నీవిద్దానిని నీ పరివారముతోసహా శీఘ్రముగ భుజింపుము.

వదత్యేవం సురానీకే తం శవం ప్రాణవాయునా
దేవీ ప్రవవృతే రక్తసారమాకష్టుమఞ్జసా. 15

దేవగణమిట్లు వచింప, అంత నా దేవి స్వయముగ సర్వప్రాణశక్తి యగుటఁబట్టి ప్రాణవాయువుచేతనే యా శవముయొక్క సారభూతమగు రక్తమును శీఘ్రముగ నాకర్షింపఁదొడఁగెను

ప్రాణేనాకృష్యమాణం తద్రక్తం భగవతీముఖే
అవిశత్సాంధ్యమేఘౌఘ ఇవ మేరోర్గుహాన్తరమ్. 16

అట్లు ప్రాణవాయువుచే నాకర్షింపఁబడిన యా శవముయొక్క రక్తము సంధ్యాకాల మేఘసమూహము మేరుపర్వతగుహాయందుఁ బ్రవేశించునట్లు ఆ దేవియొక్క ముఖమున బ్రవేశించెను.

తావద్రక్తం తయా పీతం ప్రాణాకృష్టం నభఃస్థయా
యావచ్ఛుష్కానతి తృప్తా పీనా సా చండికా స్థితా. 17

ఆకాశమందున్నట్టి యా చండికాదేవి పూర్వము శుష్కించియున్న తానిపుడు తృప్తి హొంది బాగుగ పరిపుష్టయగువఱకు ఆ ప్రాణవాయువుచే నాకర్షింపఁబడిన రక్తమును ద్రావెను.

తతో బభూవ సా రక్తపరిపీన శరీరిణీ
రక్తా వర్షాభ్రమాలేవ తడిత్తరలలోచనా. 18

అట్లా రక్తమును ద్రాగిన పిదప స్థూలమైనట్టి శరీరముగలదై యామె, మెఱపులను చంచలనేత్రములుగల్గియున్న రక్తవర్ణపు వర్షాకాల మేఘసమూహమువలె భాసిల్లెను.

లమ్బోదరా భగవతీ విషమాహివిభూషణా
రక్తాసవమదక్షీబా సమస్తాయుధధారిణీ. 19

వ్యోమ్ని నర్తనమారేభే స్వశరీరార్ధపూరితే
పర్యన్తగిరిమాలాగ్రస్థితామరనిరీక్షితా. 20

వ్రేలాడుచున్న యుదరముగలదియు, భయంకరములైన సర్పములు భూషణములుగాఁ గల్గియున్నదియు, రక్తమును మద్యమును ద్రావుటచే మదోన్మత్తయై విలసిల్లుచున్నదియు, సమస్తయాయుధములను ధరించినదియునగు ఆ దేవి తనశరీరముచే నర్ధభాగము పూరింపఁబడినట్టి యాకాశమున నృత్యముచేయ నారంభించెను. అట్లు నృత్యము సల్పుచున్న యా భగవతినపుడు లోకాలోక పర్వత శిఖరములపైనున్న దేవతలు వీక్షించిరి.

తతః పిశాచకుమ్భాణ్డరూపికాదిమహాగణాః
శవమావారయాంచక్రుర్మహాచలమివామ్బుదాః. 21

శవశైలో గృహీతోఽసౌ కుమ్భాణ్డైః కటిభాగతః
ఉదరాద్రూపికావృన్దైర్యక్షైః కుఞ్జరవిక్షతైః. 22

అటుపిమ్మట, పిశాచ, కుంభాండ, రూపికాది యాదేవి యొక్క యనుచర రూపములగు మహాగణములు, గొప్ప పర్వతమును మేఘములు చుట్టివైచునట్లు ఆ శవమును జుట్టివైచెను. అపుడా శవమను బర్వతము కుంభాండులచే కటిభాగము నుండియు, రూపికా సమూహముచే నుదర భాగమునుండియు యక్షులచే నేనుఁగు దంతములవంటి తమ దంతముల పోట్లచే శేషించిన పార్శ్వ, పృష్ఠభాగముల నుండియు గ్రహింపఁబడెను.

ఘటోరుకన్ధరాద్యాస్తే తస్యాన్యేఽవయవా యతః
బ్రహ్మాణ్డస్య పరం పారం ప్రాప్తాః పరమవిస్తృతాః. 23

తతస్తైర్భూతసంఘాతైః స్థితా దూరే దిగన్తరే
న ప్రాప్తా వై హి తత్రైవ కాలేన కలితా న్వయమ్. 24

మహావిశాలములగు భుజములు, తొడలు, కంఠముమున్నగు ఆ శవముయొక్క తక్కిన అవయవములు బ్రహ్మాండకపాలముయొక్క యావలిభాగమును బొందియుండెను. గనుక దిగంతములందతిదూరముననున్న యవి యా భూతగుణములచే గ్రహింపఁ బడఁజాలకుండె. అయ్యది యచ్చోటనే కాలక్రమమున స్వయముగ విలీనములైపోయెను.

నృత్యన్త్యాం చణ్డికాయాం ఖే భూతవృన్దే శవాకులే
దేవేష్వద్రిషు తిష్ఠత్సు బభూవ భువనం తదా. 25

ఆకాశమున చండికాదేవి నృత్యము సల్పుచుండ భూతగణములు శవభక్షణమున వేగిరపాటునొందుచుండ లోకాలోకపర్వత శిఖరములపై దేవతలు స్థితినొందియుండ నపుడు జగంబీ ప్రకారముగ నుండెను.

పిణ్డాహార్యామదుర్గన్ధి గుణ్ఠీకృతకకుబ్గణమ్
రక్తగర్భాభ్రనిర్వ్యూహైః ఖాదిరజ్వలనోజ్జ్వలమ్. 26

మాంసచర్వణసంరమ్భప్రోద్యచ్ఛవశవస్వనమ్
లతాస్థిఖణ్డనోడ్డీనబృహత్కటకటారవమ్. 27

భూతసంఘట్టవిశ్లేషవశాద్భీషణనిఃస్వనమ్
హిమవద్విన్ధ్యశైలాద్రి ప్రమాణాస్థ్యచలావృతమ్. 28

దేవీముఖానలజ్వాలాపక్వమాంసార్తభూతలమ్
రక్తసీకరనీహార సిన్దూరితకకుబ్గణమ్. 29

సర్వతః ప్రేక్షకైర్దేవైః సప్రాకారదిగన్తరమ్
రుధిరైకారవీ భూతనష్టద్వీపవసున్ధరమ్. 30

అత్యన్తాన్తర్హితాశేష సమస్తాచలమణ్డలమ్
రక్తప్రభాభ్ర సంభారవస్త్రావృతదిగఙ్గణమ్. 31

వృత్తాలోల భుజభ్రాన్తహేతిచ్ఛన్న నభస్తలమ్
దూరస్మృతిపథప్రాప్తపురపత్తనమణ్డలమ్. 32

అత్యన్తాసంభవద్రూపసర్వస్థావర జంగమమ్
సంపన్నానన్తకుమ్భాణ్డరూపికాద్యేక సంగమమ్. 33

అత్తఱి జగత్తు ముద్దలు ముద్దలుగఁ దినఁబడుచు నొకప్రదేశమునుండి మఱియొక ప్రదేశమునకుఁ గొనిపోఁబడుచు నున్నట్టి దుర్గంధయుక్తములైన మాంసము క్రొవ్వుమున్నగువానిచే వ్యాప్తములైన దిఙ్మండలము గలదియు, రక్తపూరితములగు మేఘసమూహములచే ఖదిర (చండ్ర) వృక్షముల అగ్నివలెఁ బ్రకాశమానమైనదియు, మాంసభక్షణమున వ్యగ్రులగు గణముల 'శవశవ' శబ్దములచే వ్యాప్తమైనదియు, లతలవంటి నారులయొక్కయు ఎముకలయొక్కయు, ఖండనములచే, నాకాశమునఁ బ్రసరించిన గొప్ప 'కటకటా' శబ్దములచేఁ బూర్ణమైనదియు, భూతగణముల సంఘట్టన, విఘటనములచే భయంకరధ్వనులతోఁగూడియున్నదియు, హిమాలయ, వింధ్యపర్వతము

లంత ప్రమాణముగలగొప్ప అస్థులను బర్వతములచేఁ గప్పబడినదియు, దేవియొక్క ముఖ మండలి యగ్నిజ్వాలలచేఁ బక్వమైనట్టి మాంసముతోఁగూడిన భూతలము గలదియు, రక్తకణ సంయుతమగు మంచుచే సిందూరవర్ణయుక్తముగఁ గావింపఁబడిన దిక్కులు గల్గియున్నదియు, సర్వత్ర ప్రేక్షకులగు దేవతలచేఁ బ్రాకారయుక్తమైన దిగంతరముతోఁ గూడియున్నట్లున్నదియు ఒకే రక్తమహాసముద్రముగ నొనర్పఁబడిన సప్తద్వీపవతియగు భూమిగలదియు, రక్తము ఎముకలు మున్నగువానిచేఁ గప్పబడుటచేతను భూమియందుఁ బ్రవేశించుటచేతను అదృశ్యరూపమును బొందిన సమస్తపర్వతములతోఁ గూడియున్నదియు రక్తకాంతులచే రంజితములగు మేఘసమూహములచే వెల్లివివస్త్రములనుధరించియున్నట్లు తోఁచుచున్న దిక్కులను స్త్రీలుగలదియు, త్రిప్పఁబడుచున్న చంచల ఘటములచే పరిభ్రమింపఁజేయ బడిన (దేవియొక్కయు ఆపె గణముల యొక్కయు) యాయుధము లచేఁ గప్పఁబడినట్టి యాకాశతలము గల్గియున్నదియు, దూరముగఁ జనినవై స్మరణదశామాత్రమును బొందినట్టి గ్రామనగరాదుల సమూహము గలదియు మిగులవిలక్షణమైనట్టి రూపమును జెందిన సమస్తస్థావరజంగమములతోఁ గూడినదియు, అనంతకుంభాండ రూపికాదులయొక్క యేక సమాజము సమకూడి యున్నదియునై యొప్పుచుండెను.

> నృత్తలోకకరాకారఖగావలనజాలకైః
> మానసూత్రైరివ విధేరన్యాద్రచయతో జగత్. 34
> భూమేరార్కగతం నీతైః పిచాచైరాన్త్రతన్తుభిః
> విమానమివ దిక్కుక్షైస్తిర్యగూర్ధ్వమధో జగత్. 35

నృత్యమందుఁ దత్పరులగు భూతగణములయొక్క అభినయాకారములను పక్షులయొక్క బంధనముకొఱకై ప్రసరింపఁబడిన వలలవలెను ఆకాశమున మఱియొక జగత్తును నిర్మించుబ్రహ్మ దేవునియొక్క కొలతదారములవలెను నున్నవియు, భూమినుండి మొదలుకొని సూర్యమార్గము వఱకు పిశాచములచేఁ బొందింపఁబడినవియునగు ప్రేవులను దారములతోడను దశదిక్కులను కుంభ ములతోడను ఈ జగత్తు ఊర్ధ్వాధోదిశలందును ప్రక్కలందును విమానమువలె భాసిల్లుచుండెను.

> జగదాలోక్య తత్త్రాదృగుదక్షోపప్లవాప్లుతమ్
> భూతపూర్వమహీపీఠస్థితి రక్తార్ణవీకృతమ్. 36
> ద్వీపసప్తక పర్యన్తే లోకాలోకాద్రిమూర్ధని
> తదఙ్గకైరనాక్రాన్తే స్థితా ఖిన్నతరాః సురాః. 37

ఆ ప్రకారమగు ఉపద్రవముచే నాక్రమింపఁబడినదియు పూర్వమున్నట్టి భూతలముపై స్థితినొందియున్న రక్తముచే మహాసముద్రముగఁ గావింపఁబడినదియునగు జగత్తునుగాంచి సప్త ద్వీపముల చివరనున్నదియు, ఆ శవముయొక్క దుష్టావయవములచే నాక్రమింపఁబడనిదియునగు లోకాలోక పర్వతముయొక్క శిఖరములపైనున్న దేవతలు మిగుల దుఃఖితులైరి.

శ్రీరామ ఉవాచః—

> బ్రహ్మాణ్డాదపి నిర్గత్య యస్య తేఽవయవా గతాః
> లోకాలోకాచలస్తేన బ్రహ్మన్న స్థగితః కథమ్. 38

శ్రీ రాముఁడు:— ఓ మునీంద్రా! బ్రహ్మాండమును దాటి ఆవల యేగినట్టి హస్త పాదాద్యవయవములుగల యాశవముచే లోకాలోకపర్వత మేల ఆచ్ఛాదింపఁబడకుండెను? *

శ్రీ వసిష్ఠ ఉవాచ:—

ద్వీపసప్తకమధ్యేఽస్మిన్నామ తస్యోదరం స్థితమ్
శిరఃఖురభుజాద్యఙ్గం బ్రహ్మాణ్డాత్పరతః స్థితమ్. 39

పార్శ్వాభ్యామూరుమధ్యాచ్చ కటిపార్శ్వద్వయాత్తథా
శిరోంసద్వయమధ్యాభ్యాం లోకాలోకః స లక్ష్యతే. 40

శ్రీ వసిష్ఠుఁడు:— ఓ రామచంద్రా! ఆశవముయొక్క యుదరభాగము ఈ సప్త ద్వీపములందున్నదనియు - శిరస్సు, పాదములు, భుజములు మున్నగు అవయవములు బ్రహ్మాండమున కావలయున్నవనియు భాసుఁడు చెప్పినది సత్యమే. కాని యద్దాని పార్శ్వభాగములకంటెను, తొడల మధ్యభాగముకంటె కటిప్రదేశముయొక్క యిరుపార్శ్వములకంటెను, కంఠభుజ శిరము (మూపు)ల రెంటిమధ్య ప్రదేశములకంటెను లోకాలోకపర్వత శిఖరములు ఊర్ధ్వముగనే కన్పట్టుచున్నవి.

తత్రోపవిష్టాస్తే దేవా లక్ష్యన్తే శృఙ్గమూర్ధను
సుశుద్ధకాన్తయస్తాపాదజలా జలదా ఇవ. 41

ఆ శిఖరములపైనున్న యాదేవతలు, సూర్యతాపముచే జలరహితములైనట్టి మిగుల శుద్ధములగు ప్రకాశవంతములైన మేఘములవలెఁ జూపట్టుచుండిరి.

ప్రసారితాఙ్గకమధో వక్త్రం తత్పతితం శవమ్
సంభక్షయతి భూతౌఘే ప్రనృత్యన్తీషు మాతృషు. 42

వహత్స్వసృక్ప్రవాహేషు మేదోగన్ధే విజృమ్భితే
దుఃఖితాశ్చిన్తయామాసుః ప్రత్యేకమమరా ఇదమ్. 43

సర్వత్ర విస్తరించినట్టి యంగములతోఁగూడి యధోముఖముగఁ బడిన యాశవమును భూతగణములు భక్షించుచుండ, మాతృగణము నృత్యము సల్పుచుండ, రక్తధారలు ప్రవహించుచుండ, క్రొవ్వుమాంసము మున్నగువాని దుర్గంధము విజృంభించుచుండ నపుడు దుఃఖితులగు ఆ దేవతలలోఁ బ్రతియొకఁడును నిట్లు చింతించెను -

హా కష్టం క్వ గతా పృథ్వీ క్వ గతా జలరాశయః
క్వ గతా జనసంఘాతాః క్వ గతా ధరణీధరాః. 44

తాదృక్చన్దనమన్దారకదమ్బవన మణ్డితః
మణ్డపః పుష్పరాశీనాం కష్ట క్వ మలయో గతః. 45

ఉచ్చావదాతా విపులా హిమవద్భూమయోఽపి తాః
నీతాః శౌక్ల్యరుషేవాశు రుధిరేణాత్మ పఙ్కతామ్. 46

* ఈ ప్రశ్న శ్రీరామచంద్రుఁడు వసిష్ఠమునీంద్రుని సర్వజ్ఞునిగ నెఱిఁగి యాతనినే యడిగెను. గాని భాసునిగాదు. కావున నాతఁడే ప్రత్యుత్తర మొసంగెను.



క్రౌఞ్చద్వీపతలే క్రౌఞ్చే యోఽభూత్కల్పద్రుమో మహాన్
బ్రహ్మలోకలసచ్ఛాఖః సోఽపి చూర్ణత్వమాగతః. 47

అయ్యో! మహాదుఃఖకరమైన విషయము! భూమి యెచటికేగినది! సముద్రము లెచటికిఁ బోయినవి! జనసమూహములన్నియు నెచటకుఁ జనినవి? పర్వతములెచటి కేగినవి? అట్టి యుత్తమ చందన, మందార కదంబాది వృక్ష సంయుతములగు వనములచే నలంకృతమైనదియు, పుష్పరాసుల మండపమువలె నొప్పునదియునగు మలయపర్వత మెక్కడికిఁ బోయినది? అయ్యో! అత్యున్నతములై, శుద్ధములై, విశాలములైనట్టి యా హిమవత్పర్వతభూములను రక్తము, శ్వేతవర్ణము పైని క్రోధముచేవలె శీఘ్రముగ స్వకీయ రక్తపంకముయొక్క రూపమును బొందించెనే! క్రౌంచ ద్వీపమున, క్రౌంచపర్వతముపై బ్రహ్మలోకమువఱకు వ్యాపించి విలసిల్లునట్టి శాఖలతోఁగూడి యున్న గొప్ప కల్పవృక్షమున్ను చూర్ణమైపోయినదే!

హా క్షీరార్ణవపారిజాత కమలాచన్ద్రామృతానాం పతే
హా దధ్యర్ణవనావనీతశిఖరి ప్రోద్భూత వేలావన
హా మధ్వర్ణవ నాలికేరగిరికే యోగేశ్వరీ సేవిత
క్వేదానీం సముపైష్యథ క్వ వనితా దిగ్దర్పణత్వం గతా. 48

హా కల్పద్రుమకాఞ్చనామలలతానిఃసన్ధిబన్ధాచల
క్రౌఞ్చద్వీపవిరిఞ్చహంసనలినీరన్ధ్రదిగ్జాలక
యాతః క్వేహ కదమ్బకాననదరీవిశ్రాన్త విద్యాధరీ
క్రీడాకోవిదనాగరామరగృహ త్వం పుష్కరద్వీపక. 49

పారిజాత, లక్ష్మి, చంద్ర, అమృతముల నుత్పన్నమొనర్చుటఁబట్టి సముద్రములకు బ్రభువగు నోక్షీరసాగరమా! నవనీతము (వెన్న)చే నిండియున్న పర్వతములపై నుద్భవించిన తీరస్థవనములతోఁగూడిన యోదధిసముద్రమా! తీరమందలి నాలికేళ (టెంకాయ) వనములు ప్రధానముగాఁగల్గిన 'అనుకంప్య' పర్వతముపై శ్రీ మహామాయమగు యోగేశ్వరిచే సేవింపఁబడు యో మధుసముద్రమా! అయ్యో! మీరందఱెట కేగిరి! దేవస్త్రీలకును దిక్కులకును దర్పణభూతమై నట్టి స్ఫటికమణిపర్వతము లెచటికిఁబోయినవి? అయ్యో! కల్పవృక్షములతోను, సువర్ణమయములై, నిర్మలములైనట్టి లతలతోను నిరంతరము సంబంధముగల క్రౌంచపర్వతము గల్గియున్నట్టి ఓ క్రౌంచద్వీపమా! బ్రహ్మదేవుని హంసలచేతను, కమలసరోవరములచేతను బూర్ణములైనట్టి దిక్సమూహము గలదియు, కదంబవనసహితములగు గుహలందు విశ్రమించు విద్యాధరస్త్రీల రతిక్రీడలందు కుశలురగు నగరనివాసులకును, దేవతలకును గృహరూపమైనదియునగు ఓ పుష్కర ద్వీపమా! మీరిరువురును నెటకేగితిరి?

స్వాదూదోదగ్రతాపావలకుసుమమహీపావనానాం వనానాం
గోమేధద్వీప కల్పద్రుమకనకలతాసున్దరీణాం దరీణామ్
శాకద్వీపాచలానామమరతరువనైర్ధంశితానాం సితానాం
స్మృత్వైవోదేతి పుణ్యం సురపదసుఖదం మానసానాం నవానామ్. 50

స్వాదూదసముద్రమునకు సంబంధించినవియు, మహాతాపములను నిరోధించునవియు, భూమిని బవిత్రముచేయునవియు, పుష్పములచేఁ గప్పఁబడినవియునగు వనములయొక్కయు, గోమేధ ద్వీపముయొక్క కల్పవృక్షముల సువర్ణలతలచే సుందరములైనట్టి గుహలయొక్కయు, కల్పవృక్షవనములతోఁ గూడినవై, వాని పుష్పములచేఁ దెల్లనైనట్టి శాకద్వీపపర్వతములయొక్కయు, (ఈ ప్రకారములగు నూతనపదార్థములయొక్క) స్మృతిచేతనే మానవులకు స్వర్గసుఖదాయకమగు పుణ్యముదయించుచున్నది.

మన్దానిలావలితపల్లవబాలవల్లీ సంతానభాసితసమస్తదిగన్తరాణి
ధ్వస్తాని తాని సకలాని వనాని కష్టమాశ్వాసమేష్యతి కథం జనతా న జానే. 51
కదాను తానీక్షురసాబ్ధితీరే వనాని ఖణ్డా చలభూమికాసు
ద్రక్ష్యేమ భూయో గుడమోదకాని తథా కుమారాణ్యపి శర్కరాయాః. 52
కదమ్బకల్పద్రుమశీతలేషు తాలీతమాలీనవనాచలస్య
కదానుతచ్చన్దనసున్దరీణాం పశ్యేమ నృత్తం కనకాలయేషు. 53
గతాని కష్టం స్మరణీయరూపతాం జమ్బుద్రుమస్యాగ్రఫలాని తాన్యపి
యేషాం నదీం ద్వీపసముద్రమేఖలా వహత్యసౌ జమ్బుమతీ రసామ్బుభిః. 54
శిలీన్ధ్రనీరన్ధ్రమహీధ్రరన్ధ్ర క్షీబామరస్త్రీకృతగీతనృత్యమ్
సంస్మృత్య సంస్మృత్య సురోదతీరం ప్రాగబ్జముర్వీవ హృదావదీర్యే. 55
పశ్యాస్పృగమ్బుని నవార్ణవమూర్ధ్ని భాసా సౌవర్ణపర్వతశతాగ్రశిఖాః కచన్తి
సంధ్యారుణా ఉదయనాస్తమయావనీనాం స్తోకోదితేన్దుకలికా ఇవ దిఙ్ముఖేషు. 56

మందవాయువులచేఁ బుట్టఁబడిన పల్లవములతోను, కోమలలతలతోను గూడిన కల్పవృక్షములచే దిగంతరాళములన్నిఁటిని బ్రకాశితమొనర్చునట్టి యా అపూర్వవనములన్నియు నిపుడు వినష్టములైపోయినవి! అయ్యో! ఇఁక మావంటి జనులెట్లు విశ్రాంతి నొందుదురో తెలియకున్నది! ఇక్షు(చెఱకు) రససముద్రముయొక్క తీరమున శిలీభూతములైన శర్కరా (చక్కెర)మయములగు పర్వతములచే భూషితములైనట్టి భూములందు మధురములగు యా గుడమోదకము (బెల్లపులడ్డులను), శర్కరాపుత్రిక (చక్కెరబొమ్మ)లను నిఁక నెపుడు చూతుమో! తాళ, తమాలవనములతోఁగూడిన పర్వతముయొక్క కదంబ, కల్పవృక్షములచే శీతలములైన సువర్ణప్రదేశములందుఁ గూర్చొని, చందనము పూసికొనియుండు అప్సరసల యా నృత్యమును మరల యెపుడు గాంచుదుమో! అయ్యో! మహాదుఃఖకరమైన విషయము! ఏ ఫలములయొక్క రసముచే నుత్పన్నమైన నదిని ద్వీప, సముద్రములు మేఖల (మొలనూలు) గాఁగల్గిన జంబూద్వీపరూపమగు ఈ పృథివిని ధరించుచున్నదో, జంబూ (నేరేడు) వృక్షముయొక్క యా ఏనుఁగువంటి ప్రమాణముగలవియు, అమృతరసయుక్తములైనవియు, జాంబూనదసువర్ణమునకు హేతువులైనవియునగు ఉత్తమ జంబూఫలము లిపుడు స్మరణదశను బొందినవాయెను; (నశించెను). పుట్టగొడుగులచే దట్టముగ వ్యాప్తములై యున్న పర్వతగుహలందు మద్యపానముచే మదోన్మత్తలైనట్టి దేవతాస్త్రీల గానయుక్తమగు నృత్యముతోఁగూడిన సురోదసముద్రముయొక్క తీరమును మరల మరల స్మరించి నా హృదయము ప్రాతఃకాలపు కమలమువలెను, ఇప్పటి పృథివివలెను విచ్ఛిన్నమగుచున్నది. మిత్రమా! రక్తమును

జలముచేఁ బూర్ణమగు ఈ నూతనసముద్రముయొక్క పైభాగమున సువర్ణమయములగు మేర్వాది అనేకపర్వతములయొక్క శిఖరములు ఉత్తరాది దిశలందు, ఉదయాచల, అస్తాచల సమీపభూముల యొక్క యిరుసంధ్యలచే నెఱ్ఱనైనవియు, ఒకింత యుదయించినవియునగు చంద్రకాంతులవలెఁ బ్రకాశించుచున్నవి చూడుము!

తాదృక్సాగరవారిరాశివలయా ద్వీపాన్తరాలంకృతా
ప్రోచ్చాద్రీద్ధ్రనివిష్టవారిదఘటానీలోత్పలానాం స్థలీ
స్రోతోజఙ్గలకాననోగ్రనగరగ్రామాగ్రహారామ్బరా
నో జానే తరుపల్లవాఙ్కురవతీ కష్టం క్వ యాతా మహీ. 57

ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే ఉత్తరార్ధే అవి॥ విప॥ శవోపాఖ్యానే దేవపరిదేవనవర్ణనం నామ చతుస్త్రింశదధిక శతతమః సర్గః ॥ 134 ॥

అయ్యో! ఎంత దుఃఖకరమైన విషయము! సముద్రరూపములగు జలరాసులను కంకణముల ధరించినదియు, అనేకద్వీపద్వీపాంతరములచే నలంకరింపఁబడినదియు, నత్యున్నత ములైన పర్వతములందు సంలగ్నములైనట్టి మేఘములను కమలమాలలచే భూషితమైనదియు, నదులు అరణ్యములు భటులచే భయంకరములై యొప్పునగరములు, గ్రామములు, అగ్రహారము లనువట్టి వస్త్రములను గట్టుకొనినదియు వృక్ష, పల్లవ, అంకురాదులను భూషణములచే వెలయు నదియునగు పృథివి యిపుడెచటి కేగినదో తెలియకున్నది

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున నుత్తరార్ధమున అవి॥ విప॥ శవోపాఖ్యానమందు దేవపరిదేవన వర్ణనమను నూటముప్పది నాల్గవ సర్గము ॥ 134 ॥

## పఞ్చత్రింశదధిక శతతమః సర్గః

[ భుక్తే మాంసేఽత్ర భూతౌఘైః పీతే రక్తే చ భూః కృతా
మేదసా మేదినీ రక్తశేషేణ మదిరార్ణవః

భూతగణములచే మాంసము తినఁబడ, రక్తము త్రావఁబడ, క్రొవ్వుతోఁగూడ శేషించిన రక్తముతో భూమి మద్యసముద్రముగాఁ జేయఁబడుట యిచట వర్ణింపఁబడుచున్నది.]

శ్రీ వసిష్ఠ ఉవాచ :—

మత్తేన భూతవృన్దేన కించిచ్ఛేషీకృతే శవే
ఇదమూచుః పునర్దిక్షు గిరా దేవాః సవాసవాః, 1

విద్యాధరామర విహార విమానభూమా
వప్యాస్తృతాన్యశిశిరీకరణాయ భూతైః
మేదోమయాని పవనప్రసృతామలాభ్ర
ఖణ్డాఞ్చ తామ్బురసమాన్యురు జాలకాని. 2

ద్వీపేషు సప్తస్వపి పశ్య మేదో జలాని భూతైః ప్రవిసారితాని
భుక్తం చ మాంసం రుధిరం చ పీతం కించిద్గతా సంప్రతి దృశ్యతాం భూః. 3

మేదఃపత్రైరావలితాఖిలాఙ్గీ కష్టం స్థితా సంప్రతి మోదనా భూః
మేదోమయైః శారదమేఘజాలైః సకమ్బలానీవ వనాని భాన్తి. 4

పశ్యైతాని తదస్థీని సంపన్నాని మహాద్రయః
హిమాద్రి శిఖరాణీవ స్థితాన్యావార్య దిక్తటమ్. 5

శ్రీ వసిష్ఠుఁడు:— ఓ రామచంద్రా! మదించిన భూతగణము శవమును భుజించి యొకింత మిగిల్చియున్నపుడు, దిక్కులందున్న లోకాలోక పర్వతముపై స్థితినొందియున్నట్టి దేవతలు మరల యిట్లనిరి - చూడుఁడు! విద్యాధరులయొక్కయు, దేవతలయొక్కయు విహారము కొఱకైనట్టి విమానములయొక్క సంచారభూమియగు ఆకాశమును గూడ తపింపఁజేయు నిమిత్తమై భూతగణములు, క్రొవ్వుచే పరిపూర్ణమైనవియు, వాయువుచే విస్తరింపఁజేయబడిన నిర్మల మేఘ ఖండములతోఁగూడిన యాకాశమును బోలినవియునగు ప్రేవులసమూహములను విస్తరింపఁజేసెను. మఱియు, సప్తద్వీపములందును క్రొవ్వుతోఁగూడిన జలములను భూతగణములు ప్రసరింపఁజేసెను. చూడుఁడు! ఆ భూతములు మాంసమును భుజించివైచిరి. రక్తమును ద్రాగివైచిరి. కావున నిపుడు భూమియొకింత కానుపించుచున్నది. అయ్యో! సర్వప్రాణులకును మహాసంతోషమును గొల్పునట్టి భూమియిపుడు క్రొవ్వుపొరలచే నావరింపఁబడిన సమస్తావయవములు గలదైయున్నది ఎట్టి ఖేద కరమైన విషయము! వనములున్ను క్రొవ్వుచే బరిపూర్ణములైనట్టి శరత్కాల మేఘసమూహములతోఁ గూడి కంబళ్ళచేఁ జుట్టఁబడినవివలె భాసిల్లుచున్నవి. ఆ శవముయొక్క అస్థులు మహాపర్వతముల వలెఁ బడియున్నవి. వీక్షింపుఁడు! మఱియు, నయ్యవి హిమవత్పర్వత శిఖరములవలె దిక్కులను నావరించియున్నవి గాంచుడు!

శ్రీ వసిష్ఠ ఉవాచ :—

దేవేషు కథయత్స్వేవం కృత్వేమాం మేదినీం ధరామ్
మేదోజాలైః న భూతౌఘో మత్తో వ్యోమ్ని ననర్త హ. 6

నృత్యత్సు భూతవృన్దేషు శిష్టం రక్తం సురైర్ధ్రువః
ఏకప్రవాహైర్జై కస్మిన్నిక్షిప్తం మకరాలయే. 7

సురార్ణవం తమేవైనం సంకల్పం విదధుః సురాః
తతః ప్రభృతి సోఽద్యాపి సంపన్నో మదిరార్ణవః. 8

శ్రీ వసిష్ఠుఁడు:— ఓ రామచంద్రా! దేవతలిట్లు చెప్పుచుండ నంత ఆ భూత గణము లీభూమిని క్రొవ్వుల సమూహములచే లిప్తమొనర్చి, మదించినవై యాకసమున నృత్యము చేయఁ

దొడఁగెను. మఱియు, భూతగణములట్లు నృత్యముసల్పుచుండ నపుడు భూమిపై శేషించినట్టి రక్త మంతయు సమస్తదేవతలయొక్క సంకల్పముచే నొకేప్రవాహముద్వారా సప్తసముద్రములందలి యొకానొక సముద్రమున, బడఁద్రోయఁబడెను. దానినే దేవతలు తమసంకల్పముచే మద్యసముద్ర ముగఁ గావించిరి. అప్పటినుండియు నేఁటివఱకది మద్యసముద్రముగనే వెలయుచున్నది.

భూతాని నృత్తమాకాశే తాని కృత్వా పిబన్తి తామ్
మదిరాం పునరాకాశే నృత్యన్త్యానన్దమన్దిరే. 9

ఆ భూతగణము లాకాశమున నృత్యముసల్పి యా సముద్రమందలి మద్యమునుద్రావి మరల ఆనందమందిరమగు ఆకాశమున నృత్యము చేయుచునుండిరి.

పిబన్త్యద్యాపి తానీవ మదిరాం మదిరార్ణవాత్
ఖే నృత్యన్తి చ భూతాని సహ యోగేశ్వరీగణైః. 10

వారివలె నేఁటిభూతగణములున్ను భగవతియగు యోగేశ్వరియొక్క గణములతో సహా యా సముద్రమందలి మద్యమునుద్రాగుచు, ఆకాశమున నృత్యము సల్పుచునున్నారు.

తేషాం తాన్యథ భూతానాం మేదోజాలాని భూతలే
విస్తృతాన్యవశుష్కాణి స్థితాతో మేదినీ మహీ. 11

ఆ భూతగణములచే భుజింపఁబడఁగా మిగిలినటువంటి శుష్క మేదస్సు (క్రొవ్వు) యొక్క సమూహములు భూతలముపై విస్తరించినందున ఈ పృథివి 'మేదిని' యనుపేరుచేఁ బ్రసిద్ధికెక్కెను.

ఇతి క్రమాద్వ్యాప్తిముపాగతే శవే పునః ప్రవృత్తే దినయామినీ క్రమే
ప్రజాః ససర్జాథ శివాః ప్రజాపతిః పునః ససర్గోఽభవదత్ర పూర్వవత్. 12

ఇత్యార్షే శ్రీవాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే ఉత్తరార్ధే అవిద్యోపాఖ్యానాన్తర్గత విపశ్చిదుపాఖ్యానే శవోపశవోపశమో నామ షట్త్రింశదధికశతతమః సర్గః ॥ 136 ॥

ఈ ప్రకారము క్రమముగ ఆ శవము క్షయింప, సూర్యాదులు తమ తమ స్థానములం దారోపింపఁబడుటవలనను మేర్వాదిపర్వతము లుద్ధరింపఁబడుట వలనను దినరాత్రిక్రమము మరల ప్రవృత్తముకాఁగా నపుడు ప్రజాపతి నూతనప్రజలను సృష్టించెను. కావున మరల భూతలమున ఆ సృష్టి యథాప్రకారముగనే వర్తిల్లెను.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున నుత్తరార్ధమున అవి॥ విప॥ శవో॥ శవోపశమను నూటముప్పదియారవ సర్గము ॥ 136 ॥



## షట్త్రింశదధికశతతమః సర్గః

[ అగ్నిర్వ్యాసేన పృష్టోఽత్ర శవవృత్తాన్తమాదితః
అసురో మశకశ్చైతా వ్యాధశ్చేత్యాద్యవర్ణయత్.

భాసుఁడుగ, అగ్నిభగవానుఁడు ఆ శవముయొక్క వృత్తాంతమును మొదటినుండియు, అసుర, మశక (దోమ), మృగ, వ్యాధ (బోయవాఁడు) వృత్తాంతములతో సహా వర్ణించుట యిచటఁ గాననగును.]

**భాస ఉవాచః—**

అథాహం తం మహాదేవం పావకం పృష్టవానిదమ్
శుకపక్షతికోణస్థః శ్రూయతామవనీశ్వర. 1

భాసుఁడు :— ఓ దశరథ మహారాజా ! వినుఁడు - ఆ సమయమున మహా దేవుఁడగు ఆ యగ్నిభగవానుని వాహనమగు చిలుకయొక్క ఱెక్కయొక్క యంచున స్థితినొందియున్న నేనా యగ్నిదేవుని నిట్లు ప్రశ్నించితిని.

భగవన్సర్వయజ్ఞేశ స్వాహాధిప హుతాశన
కిమిదం నామ సంపన్నం కథ్యతాం కిమిదం శవమ్. 2

మహాత్ముఁడవును, సర్వయజ్ఞములకు ప్రభువును, స్వాహాధిపతివియునగు నో యగ్నిదేవా! దయచేసి యీ శవమేమియో, ఏ కారణముచే నిట్లాయెనో వచింపవేడెద.

**వహ్నిరువాచ :—**

శ్రూయతామఖిలం రాజన్యథావద్వర్ణయామి తే
త్రైలోక్యథాసురానన్తశవవృత్తాన్తమక్షతమ్. 3

అగ్నిదేవుఁడు - ఓ రాజా ! ముల్లోకముల ప్రకాశింపఁజేయునదియు, అనంతమైనదియు, నాశరహితమైనదియునగు ఈ శవవృత్తాంతమునంతయు, యథారీతి నీకువర్ణించి చెప్పుచున్నాను వినుము.

అస్త్యనన్తమనాకారం పరమం వ్యోమ చిన్మయమ్
యత్రేమాన్యపసంఖ్యాని జగన్తి పరమాణవః. 4

ఎద్దానియందిట్టి అసంఖ్యాతములగు జగద్రూపపరమాణువులు గలవో, అట్టి అనంతమై, నిరాకారమై, చిన్మయమైనట్టి పరమాకాశమొందుగలదు.

శుద్ధచిన్మాత్రనభసి తస్మిన్సర్వగతే క్వచిత్
సర్వాత్మన్యుదభూత్సంవిత్సంవేదనమయీ స్వయమ్. 5

అట్టి శుద్ధచిన్మాత్రమై, సర్వవ్యాపకమై, సర్వరూపమైనట్టి చిదాకాశమున నొకచోట విషయాకారజ్ఞానమయమగు సంవిత్తు స్వయముగ జనించెను.

సా తేజఃపరమాణుత్వమపశ్యద్వేదనావశాత్
భావితార్థాత్మకతయా స్వప్నే త్వమివ పాన్థతామ్. 6

ఓ రాజా! పథికుని భావించుచు నిదురించినపుడెట్లు స్వప్నమున నీవు నిన్ను పథికరూపమునఁ గాంచుదువో, అట్లే యా సంవిత్తున్ను భావితపదార్థరూపత్వముచే తనజ్ఞాన స్వభావవశము వలననే తన్ను తేజఃపరమాణురూపముగఁ గాంచెను.

పరమాణురసంవిత్త్వాదపశ్యదణుతాం స్వయమ్
భాస్వతీం పద్మజరజస్తుల్యాం సంకల్పనాత్మికామ్. 7

అజ్ఞానావృతచిత్స్వభావమువలన ఆ పరమాణువు తనయందు, ప్రకాశవంతమైనట్టియు, కమల పరాగమును బోలినట్టియు, సంకల్పరూపమైనట్టియు, అణుత్వమును స్వయముగ వీక్షించెను.

సోచ్ఛూనతాం భావయన్తీ పునరప్యభవత్స్వయమ్
చక్షురాదీనీన్ద్రియాణి వపుష్యన్వభవత్స్వ... 8

పిమ్మట, తనయందు వర్ధనశీలత్వమును భావించుచు నయ్యది స్వయముగ నేత్రాదీంద్రియములయ్యెను. మరల ఆయింద్రియములను శరీరమున సంలగ్నములై యున్నట్లయ్యది స్వతః యనుభవించెను.

అపశ్యదగ్రే చ జగచ్చక్షురాదిస్వభావతః
ఆధారాధేయవద్భూతమయం స్వప్నపురం యథా. 9

ఆ నేత్రాదులు శబ్దస్పర్శాదిగుణముల అధార, ఆధేయరూపమగు భూతమయమైన జగత్తును స్వప్నపురమునువలెఁ దమయెదుట స్వభావముగఁ గాంచెను.

అసురో నామ తత్రాసీత్ప్రాణీమానీ బభూవ హ
అసత్య ప్రతిభాసాత్మ పితృమాతృపితామహః. 10

అట్టి జగత్తునందు, అసురజాతికిఁ జెందిన యొకానొక జీవుఁడుండెను. ...ఁడు అభిమానముతోఁగూడి వర్తించుచుండెను. అతని పితృ మాతృ, పితామహులు (విదూరథుని పిత్రాదుల వలె) మిథ్యాప్రతిభాసరూపులై యుండిరి.

దర్పోత్సిక్తతయా తత్ర కస్య చిత్సమహామునేః
యదా మృదితవానాసీదాశ్రమం శర్మభాజనమ్. 11

తన యసురస్వభావమువలన నాతఁడు మిగుల దర్పముతోఁగూడినవాఁడై యట నొకానొక మహామునియొక్క ఆనందప్రదమగు ఆశ్రమమును తన విశాలదేహముతోటి త్రొక్కివైచెను.

మునిః శాపమదాత్తస్య మహాకారతయాశ్రమః
త్వయా యన్నాశితో మృత్వా భవ త్వం మశకోఽధమః. 12

అంత నమ్మునీంద్రు డాతనిని 'నీవు, నీ అతిస్థూలశరీరముచే నియ్యాశ్రమమును నశింపఁ జేసితివి. గావున అతిక్షుద్రమగు మశకమై (దోమయై) పోవుదువు గాక! అని శపించెను.

స తచ్ఛాపహుతాశోఽథ తస్మిన్నేవ తదా క్షణే
అసురం భస్మసాచ్చక్రే జలమౌర్వ ఇవానలః. 13

బడబాగ్ని జలమును భస్మీభూతమొనర్చునట్లు, అపుడా శాపాగ్ని క్షణకాలములో నయ్యసురుని భస్మీభూతునిగఁ జేసివైచెను.

నిరాకారం నిరాధారమాకాశవలయోపమమ్
చిత్తం కించిదివాచేత్యమాసీచ్చేతనమాసురమ్. 14

అపుడాయసురుని చైతన్యము నిరాకారముగను, ఆధారరహితముగనునున్నదై ఆకాశము యొక్క వలయము (కడియము)ను బోలి యొప్పుచు, సుషుప్తి, మూర్ఛలందువలె స్థితినొంది యుండెను.

తదేకత్వం యయౌ సామ్యాద్భూతాకాశేన చేతనమ్
తదాస్పదేన తత్రాథ వాయునా చైకతాం యయౌ. 15

అంత, ఆ అవ్యాకృతరూపమగు చైతన్యము సామ్యత్వమువలన భూతాకాశముతో ఏకత్వ మొందెను(కలిసెను) ఆ భూతాకాశము తన స్థానభూతమగు వాయువుతో ఏకత్వమొందెను.

ఆసీచ్చేతనవానాత్మా భవిష్యత్ప్రాణినామకః
రజసా పయసా వ్యాప్తస్తేజసా నభసాఽణునా. 16

ఆ ప్రాణవాయువు దేహమును బొందినదై ప్రాణియను నామముగలది యాయెను మఱియు నది అపంచీకృతములగు పృథివ్యాది (నాల్గు) భూతములచే వ్యాప్తమై చెన్నొందెను.

స పఞ్చతన్మాత్రమయశ్చిన్మాత్రలవకోఽణుకః
స్పన్దమాప స్వభావేన వ్యోమ్ని వాతలవో యథా. 17

పిమ్మట, పంచతన్మాత్రమయమైనట్టి యా చిన్మాత్రాణువు, ఆకాశమున వాయులేశము వలె స్పందము (చలనము) ను బొందెను. (క్రియాశక్తి గలదాయెను.)

అథ తస్యానిలాన్తస్థం చేతనం తద్వ్యబుధ్యత
కాలానిలజలై ర్భూమౌ బీజమఙ్కురకృద్యథా. 18

తదుపరి, వర్షాదికాలములచేతను, వాయువుచేతను, వర్షాదుల జలముచేతను భూమి యందు అంకురము నుత్పన్నమొనర్చు బీజమందెట్లు వృద్ధిజనించుచున్నదో, అట్లే యా ప్రాణ వాయువు నందలి చైతన్యమునందు జ్ఞానశక్తి యావిర్భవించెను.

శుద్ధశాపవిద స్తస్థా మశకత్వవిదాస్య చిత్
వేదితా మశకాఙ్గాని విదిత్వా మశకోఽభవత్. 19

అనంతరము, శుద్ధుఁడగు ఆ మునియొక్క శాపము నెఱిఁగిన ఆ యసురుని ప్రాణ మందలి చైతన్యము మశక (దోమ) సంస్కారముచే పొడువఁబడినదై మశకముయొక్క పక్ష, పాదాద్యవయవముల నెఱిఁగి స్వయముగనే మశకరూపమును బొందినదాయెను.

స్వేదజస్యాల్పదేహస్య నిఃశ్వాసనిపత త్తనోః
ద్వే తస్యమశకస్యేహ దినే భవతి జీవితమ్. 20

చెమటనుండి పుట్టినదియు, అల్పశరీరముగలదియు, నిశ్వాసమాత్రముచేఁ బడిపోవునట్టి దేహముతోఁ గూడినదియునగు ఆ దోమయొక్క జీవితము ఈ ప్రపంచమున కేవలము రెండు దినములుమాత్రమే యైయుండెను.

**శ్రీరామ ఉవాచ :—**

**ప్రాణినామిహ సర్వేషాం యోన్యన్తరజ ఏవకిమ్**
**సముద్భవః సంభవతి కిముతాన్యోఽపి వా క్రమః. 21**

శ్రీరాముఁడు :— ఓ మునీంద్రా ! ఈ ప్రపంచమున సమస్తప్రాణులయొక్క యుత్పత్తి యేదోయొకయోనినుండియే సంభవించుచున్నదా ! లేక మఱియొక విధముగా సంభవించుచున్నదా?

**శ్రీ వసిష్ఠ ఉవాచః—**

**బ్రహ్మాదీనాం తృణాన్తానాం ద్విధా భవతి సంభవః**
**ఏకో బ్రహ్మమయోఽన్యస్తు భ్రాన్తిజస్తావిమౌ శృణు. 22**

శ్రీవసిష్ఠుఁడు :— ఓ రామచంద్రా ! బ్రహ్మదేవుని మొదలుకొని తృణమువరకుఁగల సమస్తజీవులయొక్కయు నుత్పత్తి రెండు విధములుగానున్నది - ఒకటి బ్రహ్మమయమైనది. మఱియొకటి భ్రాంతిజన్యమైనది. వానిఁగూర్చి చెప్పుచున్నాను వినుము.

**పూర్వరూఢజగద్భ్రాన్తి భూతతన్మాత్రరఞ్జనాత్**
**భూతానాం సంభవః ప్రోక్తో భ్రాన్తిజో దృశ్యసఙ్గతః. 23**

పూర్వజన్మముల యనుభవముచే బాగుగ రూఢిపడినట్టి తత్తద్దేహ తాదాత్మ్యమను దృఢ జగద్భ్రాంతిచేతను, దృశ్యముతోటి సంగమముచేతను, ఆ యా భూతతన్మాత్రల యొక్క రంజనము వలన తదాకారముగ సంభవించు ప్రాణులయొక్క యుత్పత్తియేదిగలదో, అది భ్రాంతిజన్యమైనది.

**అభాతాయాం జగద్భ్రాన్తౌ భూతభావః స్వయం భవన్**
**యః స బ్రహ్మమయం ప్రోక్తః సంభవో న స యోనిజః. 24**

నిత్యముక్తమగు బ్రహ్మమున కెన్నఁడును భాసింపనట్టి జగద్భ్రాంతియందు, బ్రహ్మము స్వయముగనే వివర్తరూపముతో సృష్ట్యాదియందు చతుర్విధ భూతసముదాయ రూపమును ధరింప, కలుగుజీవోత్పత్తి యేదిగలదో, అది బ్రహ్మమయమని చెప్పఁబడినది. అయ్యది యోనిజము కాదు.

**ఏవం స్థితే స మశకో జగద్భ్రాన్తివశోత్థితః**
**నతు బ్రహ్మోత్థిత స్తస్య రామ చేష్టాక్రమం శృణు. 25**

ఓ రామచంద్రా ! [అట్టి బ్రహ్మమయోత్పత్తియొక్క యనుభవము (కపిల, సనకాది) గొప్ప సిద్ధపురుషులకే యగునుగాని, అజ్ఞులగు మశకాదులకుఁగాదు.] ఈ ప్రకారము సిద్ధాంతీకరింపఁబడినందున, ఆ మశకము (దోమ) జగద్భ్రాంతివశముచే జనించినదేయై యున్నదిగాని, బ్రహ్మముచే జనించినదికాదు. ఇఁక నద్దాని చేష్టాక్రమమునుగూర్చి నీవు వినుము.

క్షమేక్షు శష్పశాఖాదిపుఞ్జగుఞ్జేషు గుఞ్జతా
స్వాయుషోర్ధం దినం తేన సర్వం భుక్తం వివల్గతా. 26

శాద్వలోదరదోలాయాం దోలనం బాలలీలయా
చిరమారబ్ధమేతేన సార్ధం మశికయా స్వయమ్. 27

భూమిపైగల చెఱకు, కోమలతృణసమూహము మున్నగువానిపై తక్కిన దోమలతోఁ గూడి శబ్దమొనర్చుచు, విలాసముగావించుచు నయ్యది తన ఆయువుయొక్క అర్ధభాగమంతయు (ఒకదినము) గడపివైచెను. ఇఁక రెండవదినమున, కోమలతృణమను నూయెలపై బాలక్రీడా పూర్వకముగ నదిస్వయముగ తనభార్యతోఁగూడ చిరకాలము ఊఁగఁ బ్రారంభించెను.

దోలాశ్రమార్తస్త్రాసా యావద్విశ్రామ్యతి క్వచిత్
తావద్ధరిణపాదాగ్రగిరిపాతేన చూర్ణితః. 28

పిదప, అట్లూఁగుటఁగూర్చిన శ్రమచే నలసినదై యదియొకచోట విశ్రమించుచుండ నింతలో నొక హరిణము (లేడి) యొక్క పాదాగ్రమను పర్వతముదానిపైఁ బడుటచే నయ్యది చూర్ణమైపోయెను.

హరిణాననసందర్శత్యక్తప్రాణతయా తయా
పూర్వక్రమగృహీతాక్షః స జాతో హరిణస్తతః. 29

హరిణముయొక్క ముఖమునుజూచి ప్రాణము త్యజించుటచే నామశకము పూర్వోక్త క్రమమున నింద్రియాదులను గ్రహించినదై యటుపిమ్మట హరిణమై జన్మించెను.

విహరన్హరిణోఽరణ్యే వ్యాధేన ధనుషా హతః
వ్యాధాననగదృష్టిత్వాత్సంజాతో వ్యాధ ఏవ సః. 30

అట్లు హరిణ రూపముతో అరణ్యమున విహరించుచునుండ నది యొకానొక వ్యాధుని (బోయవాని) ధనుస్సుచేఁజంపఁబడెను. వ్యాధుని ముఖమునుజూచి మరణించుటవలన నది యట్టి సంస్కారముతోఁగూడినదై వ్యాధు డేయై జనించెను.

వ్యాధో వనేషు విహరన్సంయాతో మునికాననమ్
తత్ర విశ్రాన్తవాన్ప్రాజ్ఞాన్మునినా ప్రతిబోధితః. 31

అట్లు వ్యాధరూపమున నరణ్యములందు సంచరించుచు నొకానొక మునియొక్క వన ముందుఁ బ్రవేశించియట విశ్రమించెను. ఈ ప్రకారముగ నట సత్సాంగత్యలాభమను సౌభాగ్యమును బడసినవాడై యమ్మునివర్యునిచే నాతఁడిట్లు ప్రబోధింపఁబడెను.

భ్రాన్తః కిమిదమాదీర్ఘదుఃఖాయ ధనుషా మృగాన్
హంసి పాసి న కస్మాత్త్వం తన్త్రం జగతి భఙ్గురే. 32

ధనుస్సుచే నిరపరాధులగు మృగములను మహాదీర్ఘదుఃఖముకొఱకై వధించుచు నీవిట్లేల సంచరించుచున్నావు? ఈ క్షణభంగురమగు జగత్తునందు, మహాఫలదాయకమైనట్టి 'అహింసఁ అభయదానము' మున్నగువానిరూపమైన శాస్త్రమర్యాద నేల పాలింపక యున్నావు?

ఆయుర్వాయు విఘట్టితాభ్ర పటలీలమ్బామ్బువద్భఙ్గురం
భోగా మేఘవితానమధ్యవిలసత్సౌదామనీ చఞ్చలాః
లోలా యౌవనలాలనా జలరయః కాయః క్షణాపాయవా
న్స్వాత్ త్రాసముపేత్య సంసృతివశాన్నిర్వాణమన్విష్యతాం. [illegible]

ఇత్యార్షే శ్రీ వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు
నిర్వాణప్రకరణే ఉత్తరార్ధే అవి॥ విప॥ శవో॥ మశకవ్యాధబోధనం
నామ షట్ త్రింశదధిక శతతమః సర్గః ॥ 136 ॥

పుత్రా ! ఆయువు, వాయువుచేఁ గొట్టఁబడిన మేఘ సమూహములందు వ్రేలాడు చంచల జలబిందువువలె క్షణభంగురమైనది. భోగములు, మేఘమను వితానముయొక్క మధ్యమందుఁ బ్రకాశించు మెఱపువలె చంచలములైనవి. యౌవనముయొక్క విలాసములో, జలవేగమువలె అస్థిరములైనవి. శరీరమో, క్షణకాలములో అపాయమును బొందునదైయున్నది. కావున, అనర్థ పరంపరలకు స్థానభూతమైనట్టి యీ సంసారముయెడల భీతిగలవాఁడవై, అభయఁ అహింసాద్యు పాయములచే నిత్య, నిరతిశయానంద రూపమగు బ్రహ్మమును, గురు, శాస్త్రాదులద్వారా యన్వేషింపుము.

ఇది శ్రీవాసిష్ఠతాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున నుత్తరార్ధమున
అవి॥ విప॥ శవో॥ మశకవ్యాధబోధనమను నూటముప్పది
యాఱవ సర్గము ॥ 136 ॥

## సప్తత్రింశదధిక శతతమః సర్గః

[ వ్యాధేన పృష్టోఽత్ర మునిర్ధారణాభ్యాసతః స్వయమ్
పరకాయప్రవేశేన తత్స్వప్నం దృష్టమబ్రవీత్.

వ్యాధునిచేఁ బ్రశ్నింపఁబడినవాఁడై యాముని స్వయముగ ధారణాభ్యాసముద్వారా పర కాయమును బ్రవేశించి తాను జూచిన స్వప్నమును వర్ణించుట యిచటఁ గాననగును.]

**వ్యాధ ఉవాచః—**

ఏవం చేత్తన్మునే బ్రూహి కీదృగ్దుఃఖపరిక్షయే
న కర్కశో న చ మృదుర్వ్యవహారక్రమో భవేత్. 1

వ్యాధుఁడు:— ఓ మునీంద్రా ! ఈ ప్రకారముగ హింసాదివ్యవహారము దుఃఖహేతువై వర్తిలినే, ఇఁక దుఃఖక్షయమునకై అతికఠినమైనదిగాని, అతికోమలమైనదిగాని, కానట్టి వ్యవహార క్రమమెట్టిదో వచింపఁ బ్రార్థన.

**మునిరువాచ :—**

ఇదానీమేవ సంత్యజ్య ధనుష్షా సహ సాయకాన్
మౌనమాధారమాశ్రిత్య తాస్తతోఽభ్యాసతోఽష్యతామ్. 2

మునిః— ఇపుడే నీవు ధనుస్సును, బాణములను ద్యజించివైచి, మునుల (యమనియమ విచారాది) ఆచారముల నాశ్రయించి దుఃఖముల శమింపఁజేసికొని యిచట వసింపుము.

**శ్రీ వసిష్ఠ ఉవాచః—**

ఇతి సంబోధితస్తేన పరిత్యజ్య ధనుఃశరాన్
ఆసీన్మునిసమాచారస్తత్రైవాయాచితాశనః

శ్రీ వసిష్ఠుఁడు:— ఓ రామచంద్రా! ఈ ప్రకారముగ నమ్మునీంద్రునిచే బోధింపఁబడి మీదట, ఆ వ్యాధుఁడు ధనుర్బాణములను వదలివైచి యమనియమాది (మునుల) ఆచారము నవలంబించి, అయాచితముగ లభించినదానిని భుజించుచు నయ్యాశ్రమముననే వసించుచుండెను

వివేశ మనసా మౌనీ తతః శాస్త్రవివేకితామ్
దినైరేవ యథా పుష్పమామోదేన నరాశయమ్. 4

పుష్పము వికాసక్రమముచే నుద్భవించిన సుగంధముద్వారా జనుల హృదయమును ఆహ్లాదపఱచుచుఁ అందుఁబ్రవేశించునట్లు, ఆ ప్రకారముగ మునుల యాచారముల నాశ్రయించిన యాతఁడు కొలఁది దినములలోనే సత్సంగముతోఁగూడిన శుద్ధచిత్తముద్వారా శాస్త్రప్రసిద్ధమగు నిత్యానిత్య వివేకశీలత్వమున, బ్రవేశించెను.

అపృచ్ఛన్మునిశార్దూలం కదాచిత్తమరిన్దమ
భగవన్దృశ్యతే స్వప్నః కథమన్తర్బహిఃస్థితః. 5

శత్రునాశకుఁడవగు రామచంద్రా! ఒకానొకపుడు అతఁడమ్మునీంద్రుని యిట్లడిగెను – మహాత్మా! ప్రాణుల యంతఃకరణమున నున్న స్వప్నము జాగ్రత్తువలె బాహ్యమున నెట్లు కన్పించుచున్నది.

**మునిరువాచః—**

మమాపి సాధో ప్రథమమేష ఏవ వివేకినః
పురా చిత్తే వితర్కోఽభూత్కుతోఽప్యభ్రమివామ్బరే. 6

మునిః— ఓ సాధూ! పూర్వము మొట్టమొదట నొకింతవివేకము సంప్రాప్తించినపుడు నా చిత్తమందును ఈ ప్రకారముగనే 'ఆకాశమందు మేఘమువలె ఈస్వప్న మెటనుండి వచ్చుచున్నది' అను వితర్కము జనించెను

తత ఏతద్విదృక్షార్థమహమభ్యస్తధారణః
బద్ధపద్మాసనస్తస్యాం సంవిద్యే వాభవం స్థిరః. 7

తదుపరి యద్దానినిగాంచు ఇచ్ఛచే, పరకాయప్రవేశానుకూలమగు బహిఃకుంభకధారణ నభ్యసించి, పద్మాసనము వైచికొని సర్వజీవుల ఆత్మరూపముచే, ప్రసిద్ధమగు సంవిత్తునందు సుస్థిరుండనై యుంటిని.

తత్రత్స్థో దూరవిక్షిప్తం తయైవాహృతవానహమ్
చేతః స్వహృదయం సాయం రశ్మీవ రవిరాతపమ్. 8

అట్లాసంవిత్తునందున్న నేను సాయంకాలము సూర్యుఁడు తనదీప్తిచే ఆతపము నుప సంహరించునట్లు - దూరముగ అన్యశరీరాదులందు వర్తించు చిత్తమును, ఆ సంవిత్తుద్వారా యే నిజహృదయమున నుపసంహరించితిని.

వేదనేరణయా ప్రాణస్తతశ్చిత్తాన్వితో మయా
శరీరాద్రేచితో బాహ్యే సౌరభం కుసుమాదివ. 9

అపుడు ప్రాణాంతర్గతమగు చైతన్యముయొక్క ప్రేరణ (జీవునియొక్క, ప్రాణముతో సహా బాహ్యప్రదేశ నిర్గమనానుకూలమగు యోగశాస్త్రప్రసిద్ధమైన ప్రయత్నము)చే చిత్తసహితమగు ప్రాణమును, పుష్పమునుండి సుగంధమునువలె, శరీరమునుండి బాహ్యప్రదేశమునకు రేచకము ద్వారా ప్రవహింపఁజేసితిని.

వ్యోమస్థచిత్తవలితః స ప్రాణపవనో మయా
అగ్రస్థస్య ముఖాగ్రస్థే జన్తోః ప్రాణే నియోజితః. 10

పిమ్మట బాహ్యాకాశముననున్న చిత్తసహితమగు ఆ ప్రాణవాయువును, ఎదుటనున్న యొకానొకని ముఖాగ్రభాగమందలి ప్రాణవాయువుతోటి కలిపితిని.

యః ప్రాణవలితః ప్రాణస్తేన నీతో హృదన్తరమ్
స్వేహయా స్వం స్వకః సర్పః కరభేణేవ హంసితః. 11

భల్లూకము (ఎలుఁగుగొడ్డు) బిలమందు ముఖమునుంచి బలవంతముగ ముఖవాయువు తోటి యాకర్షించుటయను నిజచేష్టచేఁ దనకాహారభూతమగు సర్పమును దన హృదయస్థానమును బొందింపఁ జేయునట్లు, అట్లు నాప్రాణవాయువుతోటి కలసినట్టి యాతని ప్రాణవాయువు నన్నా తని హృదయమందలి యంతర్భాగమును బొందింపఁజేసెను.

తతోఽహం హృదయం తస్య ప్రవిష్టః ప్రాణవాహినా
సంకటస్థః స్వయా బుద్ధ్యా తావేవానుసరోన్తరమ్. 12

తదుపరి యాతని ప్రాణమను గుఱ్ఱముద్వారా నేనాతని హృదయమందుఁ బ్రవేశించి ఆ పరస్పర మిళితములగు యుభయప్రాణముల ననుసరించుచు నాతని దేహమధ్యమును జేరి స్వబుద్ధిచే ఈ వచింపఁబోవు సంకటమునఁ బడినవాఁడనైతిని.

చరద్రసాభిర్బృహ్వీభిర్నాడీభిరభితో వృతమ్
కుల్యాభిః స్థూలతన్వీభిర్బాహ్యదేశమివాఖిలమ్. 13

పెద్దవియు, చిన్నవియునగు కాలువలచే బాహ్యప్రదేశమంతయు వ్యాప్తమైయుండునట్లు, ప్రవహించు రసములతోఁగూడిన యనేకనాడులచే ఆ యభ్యంతరప్రదేశము నలువైపుల వ్యాప్తమై యుండెను.

వర్ముకావక్షారప్లీహయకృద్రక్తాదిడిమ్బైః
సంకటం జీవనదనం భాణ్డోపస్కరకైరివ. 14

ఇరుభాగములందలి అస్థిపంజరములచేతను, ప్లీహ, యకృత్తులను మాంసవిశేషముల చేతను, రక్తాదిసహితములగు మాంసపిండములచేతను సంకటరూపమగు ఆ జీవుని, శరీరము పాత్రాది సామగ్రులచే గృహమువలె వ్యాప్తమైయుండెను.

సర్వైః శలశలాయద్భిరుష్ణైరవయవైర్వృతమ్
నిదాఘతాపసంతప్తైరూర్మిజాలైరివార్ణవమ్. 15

మఱియు గ్రీష్మఋతువందలి తాపముచే సంతప్తములైన తరంగసమూహములచే సముద్రము ఆవరింపఁబడియుండునట్లు, ఆ ప్రదేశము జఠరాగ్నివలన 'శలశల' శబ్దమొనర్చుచున్న ఉష్ణములగు అవయవములన్నిఁటిచే నావరింపఁబడియుండెను

నవం నవం బహిఃశైత్యం నాసాగ్రాచ్చేతనాత్మకమ్
జీవనాయానిశం చేతో వాతోఽన్నితమనారతమ్. 16
రక్తకుట్టరసశ్లేష్మవసానిఃస్రావ పిచ్ఛిలమ్
ఘనాన్ధకారముష్ణం చ సంకటమ్ నరకోపమమ్. 17
ఉదయావయవాశ్లేష్మస్పష్టాస్పష్టమరుద్రతైః
స్థిత్యన్తానాం తు వైషమ్యాదాగామిగదసూచకమ్. 18
దరత్పరథసచ్ఛిద్రావాతవాతేన శబ్దితమ్
పద్మనాలప్రణాలాన్తర్జ్వలదర్ణవవాడవమ్. 19
మిలత్పదార్థనీరన్ధ్రం సితమచ్ఛం సవాయుభిః
క్వచిత్సౌమ్యం క్వచిత్క్షుబ్ధం చోరైరివ పురం నిశి. 20
రసనాదపరైర్నాడీమార్గ విద్యాధరాధ్వగైః
సంచరద్భిర్వృతం వాతైరాకారార్ధార్ధగీతిభిః. 21

మఱియు, ఆ జీవుని శరీరము, జీవనముకొఱకై చిత్తముచేతను, ప్రాణాదివాయువుల చేతను నిరంతరము వహింపఁబడునదియు, బాహ్యప్రదేశమందలి చంద్రాత్మకమగు అపానము నాసికాగ్రమునుండి లోనఁ బ్రవేశించునపుడు, లోన, బ్రవేశించిన నూతన నూతన బాహ్యశైత్యము గలదియు, కావుననే చేతనాత్మకమైనదియు, నాడీమార్గములద్వారా రక్తమును ఛేదించునట్టి శ్లేష్మాద్యన్నరసముల ప్రవాహములచే స్నిగ్ధమైనదియు, గాఢాంధకారమయమైనదియు, ఉష్ణత్వము తోఁగూడినదియు, నరకతుల్యమగు సంకటముయొక్క రూపమైనదియు, డెబ్బదిరెండువేల నాడు లలో రక్తరసశ్లేష్మపిత్తములయొక్క యొకచోటనగు ఉదయములచేతను, ఒకచోటనగు అవయవము లందలి కూడికలచేతను, ఒకచోటనగు స్పష్టములైనట్టియు, ఒకచోట అస్పష్టములైనట్టియు ప్రాణాది వాయువుల క్రీడనములచేతను సప్తధాతువుల స్థితులయొక్కయు, నాశములయొక్కయు వైషమ్యము సంభవించుటవలన భావికాల రోగములను స్వప్నాదులందు సూచించునదియు, వేగముతోచలించు అపానాది ఛిద్రములందలి వాయువుయొక్క గమనాగమనములచే శబ్దయుక్తమైనదియు, హృదయ కమలముయొక్క నాళమందలి రంధ్రమందు సముద్రబడబాగ్నివలె జాజ్వల్యమానమగు ప్రకాశ ముతోఁగూడియున్నదియు, మిళితములగు పదార్థములచే దట్టమైనదియు, వాయుసహితములగు

ఇంద్రియములచే బంధింపఁబడినదియు, సాక్షియగు స్వకీయాత్మస్వభావమువలన శుద్ధమైనదియు, చిత్తవృత్తిభేదములచేతను. ప్రదేశభేదములచేతను నొకచోట సౌమ్యమైనదియు, ఒకచోట రాత్రియందు దొంగలచేవలె సంక్షుబ్ధమైనదియు, ద్విమాత్ర, ఏకమాత్ర, అర్ధమాత్రస్వరసంపన్నమగు గీతములతోఁగూడినవై, అన్నరసములయొక్క పరిపాకమున శబ్దతత్పరములై, కావుననే నాడీమార్గములందు, గానముచేయుచుండు విద్యాధరపథికులవలె సంచరించుచుండునవైనట్టి వాయువులచే నావరింపఁబడినదియునై వెలయుచుండెను.

తదహం హృదయం జన్తోరావిశం విషమాన్తరమ్
నరోఽవయవసంబాధం నరవృన్దమివాధికః. 22

ఈ ప్రకారముగ భయంకరమైనట్టి అభ్యంతరప్రదేశముతోఁగూడిన యాజీవుని హృదయమును నేను - శ్రేష్ఠుఁడగు మనుజుఁడు దట్టమైన జనసమూహమును బ్రవేశించునట్లు ప్రవేశించితిని.

అనన్తరమహం ప్రాప్తస్తేజోధాతుం హృదన్తరే
దూరస్థమివ యత్నేన రాత్రావిన్దుమివార్కరుక్. 23

తదనంతరము హృదయముయొక్క యాభ్యంతరమున, సమీపమున నున్నప్పటికిని అనేక నాడీమార్గములద్వారా పొందఁబడునదియగుటచే దూరమందున్నట్లొప్పుచున్న జఠరాగ్నిరూపమగు తేజము యొక్క సారమైన తేజోరూపమును రాత్రియందు సూర్యప్రకాశము చంద్రుని బొందునట్లు - నేను ప్రయత్నముచేఁ బొందితిని.

యస్మాత్త్రిభువనాదర్శో దీపస్త్రైలోక్యవస్తుషు
సత్తా సర్వపదార్థానాం జీవస్తత్రావతిష్ఠతే. 24

ఏలయనిన, ముల్లోకములకును దర్పణను (అద్దము)వంటివాఁడును, ముల్లోకములను తదంతర్గతములగు సమస్తపదార్థములను బ్రకాశింపఁజేయువాఁడును, సర్వవస్తువులయొక్క సత్తయునగు జీవుఁడు (తద్రూపుఁడగు పరమాత్మ) ఆ తేజమందు నెలకొనియున్నాఁడు

కాయే సర్వగతో జీవః స్వామోదః కుసుమే యథా
తథాప్యోజసి కిఞ్జల్కైర్ముఖే శైత్యం వివస్వతా. 25

సూర్యునిచే వికసింపఁజేయఁబడిన పుష్పమందు సుగంధమున్ను, శీతలత్వమున్ను నంతట నుండియున్నప్పటికిని, కేసరములతోఁగూడిన యగ్రాని ముఖప్రదేశమందయ్యవి విశేషముగ వర్తించునట్లు, శరీరమంతటను జీవుఁడు వ్యాపించియున్న - ఆ తేజమందు విశేషముగ వర్తించుచున్నాఁడు.

తజ్జీవాధారమోజస్తు ప్రవిష్టోఽహమలక్షితమ్
రక్షితం పరితః ప్రాణైర్వాతైః ప్రచ్ఛాదనం యథా. 26

ఘటాద్యాచ్ఛాదనములతోఁగూడిన దీపజ్యోతి తద్ఘటాదులయొక్క సూక్ష్మరంధ్రముల నుండి ప్రవేశించువాయువుచే రక్షింపఁబడునట్లు ప్రాణవాయువులచే నలువైపుల రక్షింపఁబడినట్టి యా జీవాధారమగు తేజమందునే అదృశ్యరూపముతో ప్రవేశించితిని.

తతోఽజ్ఞః సంప్రవిష్టోఽహమామోద ఇవ మారుతమ్
ఉష్ణాంశురివ శీతాంశు మృత్పాత్రమివ వా పయః. 27

అటు పిమ్మట, మనోమయ, విజ్ఞానమయ కోశములచేఁ జుట్టఁబడినదియు, సాక్షాత్తుగ ఆ జీవునియొక్క యుపాధిరూపమైనదియునగు ఆనందమయకోశమున నేను, వాయువందు సుగంధ మున్ను చంద్రునియందు సూర్యుఁడున్ను, మృణ్మయపాత్రయందు జలమున్ను ప్రవేశించునట్లు, ప్రవేశించితిని.

ద్వితీయేన్ద్వంశు సంకాశే శుక్లాభ్రలవపేలవే
నవనీతగుడప్రఖ్యే క్షీరబుద్బుదసున్దరే. 28

ఆ యానందమయకోశము, అమృతమయమగు రెండవచంద్రునిఁ బోలినదియు. తెల్లని మేఘఖండమువలె కోమలమైనదియు, నవనీత (వెన్న,) గుడము (బెల్లము) లవలె స్నేహ, ఆనంద యుక్తమైనదియు, క్షీరసాగరముయొక్క బుద్బుదమువలె సుందరమైనదియునైయుండెను.

తత్ర పశ్యామ్యహం తిష్ఠన్ప్రవేశవ్యగ్రయోఙ్ఘితః
స్వౌజసీవ వసన్స్వప్న ఇవ విశ్వమఖణ్డితమ్. 29

అచట పూర్వస్థానములందలి ప్రవేశముయొక్క పరిశ్రమలేనివాఁడనై, స్వకీయ హృదయ మందలి తేజమునందువలె స్వస్థముగవసించుచు నాతనిస్వప్న రూపమగు ప్రపంచమునంతయు నాయొక్క స్వప్నమువలెనే గాంచితిని.

సార్కం సపర్వతం సాబ్ధి ససురాసురమానవమ్
సపత్తనవనాభోగం సలోకాన్తరదిఙ్ముఖమ్. 30
సద్వీపసాగరామ్భోధి సకాలకరణకమమ్
సకల్పక్షణసర్వర్తు సహస్థావరజంగమమ్. 31

అచ్చోట సూర్య, పర్వత, సముద్ర, సుర, అసుర. మనుష్య సహితమైనదియు, పట్టణ, వనవిస్తారములతోఁ గూడినదియు. లోక, లోకాంతర, దిగంతరాళయుక్తమైనదియు, ద్వీప, సముద్ర, కాలక్రియాక్రమ సహితమైనదియు, కల్ప, క్షణ, సర్వఋతు సంయుతమైనదియు, స్థావరజంగమ ప్రాణికోట్లతోఁగూడియున్నదియునగు ప్రపంచమును జూచితిని.

తత్స్వప్నదర్శనం తత్ర స్థిరమేవ సమం స్థితమ్
వసామ్యత్రైవ నిద్రాన్తే నిద్రాఽన్తే నాగతా యతః 32

అట్లాతని స్వప్నమందున్న ప్రపంచమంతయు (అనాది ప్రవాహ రూపముచే) స్థిరము గను, ఈ ప్రసిద్ధమగు జగత్తుతో సమముగనునుండెను. జాగ్రత్తుయొక్క అంతమున నిద్రరాని కారణముచే నే నచట జాగ్రత్తునందే బాగుగనుండియుంటిని.

అనిద్ర ఏవ కిం స్వప్నం పశ్యామీతి మయా తతః
పరిచిన్తయతా జ్ఞాతమిదం వ్యాధవిబోధినా. 33

ఓ వ్యాధుడా! 'నిద్రారహితుఁడనైయున్నను స్వప్నమేల వీక్షించుచున్నాను' అని [illegible]మను, తదనంతరము జ్ఞానయుక్తుఁడనగు నేనిట్లెఱిఁగితిని.

నను సామాన్య చిద్ధాతోః స్వరూపమిదమైశ్వరమ్
స్వం యద్వ్యపదిశత్యేష జగన్నామ్నామ్నరాత్మకమ్. 34

ఈ చైతన్యము (ప్రత్యగాత్మ) యొక్క యిది యీశ్వరసంబంధమైన రూపమేయైయున్నది. ఏలయనిన, ఈ యీశ్వరుఁడు చిదాకాశ రూపుఁడగు తన్ను ఘటమని, పట (వస్త్ర) మని, జగత్తని, జీవుఁడని ఈ ప్రకారముగ నేయే నామరూపములతోఁటి యుక్తునిగఁదలంచునో, స్వయముగ నాయా జగజ్జీవాది రూపములే యగుచున్నాఁడు.

చిద్ధాతుర్యత్ర యత్రాస్తే తత్రతత్ర నిజం వపుః
పశ్యత్యేష జగద్రూపం వ్యోమతామేవ చాత్యజమ్. 35

ఈ చిత్స్వరూపము తన చిదాకాశత్వమును త్యజింపకయే యెచటెచట తననిజస్వరూపము నెట్లెట్లు భావించుచున్నదో, అచటచట, నట్లట్లాయా జగదాదిరూపములతోఁటి తన్ను గాంచుచున్నది.

అహో త్వద్వేదమాజ్ఞాతం యదిత్థం దృశ్యతే జగత్
తత్కథ్యతే స్వప్న ఇతి స్వ చిత్కచనమాత్రకమ్. 36

ఓహో ! ఇపుఁడు తెలిసినది ! నిజచిత్స్వరూపముయొక్క స్ఫురణమాత్రమగు ఏ జగత్తిట్లు కానుపించుచున్నదో, అదియే స్వప్నమని జనులచేఁ జెప్పఁబడుచున్నది.

చిద్ధాతోర్యత్కచనం తత్కించిత్స్వప్న ఉచ్యతే
కించిచ్చ జాగ్రదిత్యుక్తం జాగ్రత్స్వప్నౌ తు న ద్విధా. 37

చిదాకాశరూపమగు చైతన్యముయొక్క యొకింతస్ఫురణము స్వప్నమని, ఒకింత స్ఫురణము జాగ్రత్తని చెప్పఁబడుచున్నది, కావున వాస్తవముగ ఈ జాగ్రత్స్వప్నములు భిన్నములు కావు. (జాగ్రత్తున్ను విమర్శచే స్వప్నమేయని భావము.)

స్వప్నః స్వప్నే జాగరాయామేష స్వప్నే తు జాగరా
స్వప్నస్తుజాగరైవేతి జాగరైవ స్థితా ద్విధా. 38

జాగ్రదవస్థయందు స్వప్నము స్వప్నరూపముగ నెఱుఁగఁబడుచున్నది. ఇట్లే స్వప్నమందీజాగ్రత్తున్ను స్వప్నరూపమే యగుచున్నది. స్వప్నము స్వదృష్టిచే జాగ్రత్తేయైయున్నది. కావున. జాగ్రత్తే ఆయాదృష్టి భేదమునుబట్టి జాగ్రత్తుగను, స్వప్నముగను - ఇట్లు రెండువిధములుగ నగుచున్నది.

చేతనం నామ పురుషః స మృతేషు శతేష్వపి
శరీరేషు మహాబుద్ధే కథం కస్య కదా మృతః. 39

ఓ మహామతీ ! పురుషుఁడు చైతన్యరూపుఁడేయై యున్నాఁడు. కాఁబట్టి, అనేకశరీరములు మరణించినప్పటికిని అతఁడెపుడు, ఎట్లు, ఎవనికి మరణించినవాఁడగును ?

తచ్చేతనం ఖమేవాస్తి స్థితం తద్దేహవత్కచత్
అనన్తమవిభాగాత్మ ప్రతిఘాప్రతిఘాత్మకమ్. 40

ఈ చైతన్యము అనంతమై, విభాగరహితమైనట్టి శుద్ధచిదాకాశ మాత్రమేయగుచు. సాకార నిరాకారములకు విలక్షణమై యున్నప్పటికి భ్రాంతిచే దేహమువలె భాసించుచున్నది.

స్వభావస్యాప్రతిఘస్య నిత్యానన్తోదితాత్మనః
పరమాణోశ్చిదాఖ్యస్య మజ్జా జగదితి స్మృతః. 41

**అమూర్త** (పదార్థరహిత) స్వభావయుక్తమై, నిత్యమై, అనంతమై, నిత్యోదితమైనట్టి చైతన్యమను పేరుగల పరమాణువుయొక్క సారమే భ్రాంతిచే దేహమని. జగత్తని యెఱుఁగబడు చున్నది.

చిద్వ్యోమ్న ఉదరే భాన్తి సమస్తానుభవాణవః
తథా యథావయవినో విచిత్రావయవాణవః. 42

**అ**వయవియందు విచిత్రములైన అవయవాణువులు భాసించునట్లు, చిదాకాశముయొక్క యుదరమున జగద్భ్రాంతియొక్క అనుభవరూపములైన సమస్తాణువులున్ను భాసించుచున్నవి.

నివృత్తో బాహ్యతో జీవో జీవాధారే హృది స్థితః
రూపం స్వం స్వప్నసర్గోఽయమితి వేత్తి చిదాకచాన్. 43

**జీ**వుఁడు బాహ్యమునుండి, అనఁగా జాగ్రత్తుయొక్క భోగప్రదమగు కర్మనుండి మరలి జీవాధారమగు హృదయముననున్న తనరూపమునే. బాహ్యసంస్కారముయొక్క **అనురోధముచే** 'ఇది బాహ్యమగు స్వప్నసృష్టి' అని యిట్లు చైతన్యముయొక్క వివర్తములనే యెఱుఁగుచున్నాఁడు.

బాహ్యోన్ముఖం బహిర్జాగ్రచ్ఛద్భితం కచితం స్వకమ్
రూపం పశ్యతి జీవోఽయమన్తస్థం స్వప్న ఇత్యపి. 44

చిత్తమెపుడు బహిర్ముఖమగునో, **అ**పుడీ జీవుఁడు నిజ స్వరూపమునే జాగ్రత్తను పేరుచే నెఱుఁగుచున్నాఁడు. ఎపుడంతర్ముఖమగునో, అపుడానిజరూపమునే స్వప్నముగఁగాంచుచున్నాఁడు.

ద్యౌః క్షమా వాయురాకాశం పర్వతాః సరితో దిశః
[illegible]సృతో జీవ ఇత్యన్తర్బహిశ్చైకాత్మకః స్థితః. 45

ఏకరూపముగ స్థితినొందియున్న యీ జీవాత్మయే. బాహ్యాభ్యంతరములందును **ఆకా**శ, పృథివీ, జల, అగ్ని, వాయు, పర్వత. నదీ, దిగాది **అ**నేకరూపములుగ ప్రసరించుచున్నది.

అర్కోఽర్కబిమ్బసంస్థోఽపి యథేహాపి స్థితస్త్విషా
తథా జీవో జగద్రూపో బహిరన్తశ్చ సంస్థితః. 46

సూర్యుఁడు సూర్యమండలమున నున్నప్పటికిని దనదీప్తిచే నిచటఁగూడ నెటులవర్తించు చున్నాఁడో, **అ**ట్లే జగద్రూపుఁడగు ఈ జీవుఁడున్ను బాహ్యాభ్యంతరములందును స్థితిగల్గియున్నాడు.

అన్తఃస్వప్నో బహిర్జాగ్రదహమేవేతి వేత్తి చేత్
చిదాత్మకో యథాభూతం ముచ్యతే తదవాసనః. 47

లోన స్వప్నరూపముతోటియును, బాహ్యమున జాగ్రద్రూపముతోటియు చిద్రూపుఁడనగు నేనే వర్తించుచున్నాను, అను నీప్రకారమగు యథార్థజ్ఞాన మెవఁడు గల్గియుండునో, **అ**ట్టివాఁడు **క్రమ**ముగ వాసనారహితుఁడై ముక్తుఁడగును.

అచ్ఛేద్యోఽయమదాహ్యోఽయమపి జీవోఽన్యథా వదన్
ద్వైతసంకల్పయక్షేణ ముహ్యత్యేవ శిశుర్యథా. 48

ఈ జీవాత్మ ఛేదింపఁబడనిదియు, దహింపఁబడనిదియునైయున్నప్పటికిని మనుజుఁడు తన స్వరూపమునుగూర్చి తద్విరుద్ధముగఁ బలుకుచు, ద్వైత సంకల్పమను పిశాచముచే బాలకుని వలె విమోహితుఁడగుచున్నాఁడు.

అన్తర్ముఖోఽన్తరాత్మానం బహిః పశ్యన్బహిర్ముఖః
ఆస్తే జీవో జగద్రూపం యత్స్వప్నే స్వప్నజాగ్రతీ. 49

ఈ జీవుఁడు అంతర్ముఖుఁడగునపుడు తన్నే స్వప్నజాగ్రద్రూపముగను, బహిర్ముఖుఁడగు నపుడు తన్నే బాహ్యమందలి జాగ్రజ్జగద్రూపముగను గాంచుచున్నాఁడు. జీవుని స్వప్నజాగ్రత్తు లివియే.

ఇతి చిన్తయతః కిం స్యాత్సుషుప్తమితి మే మతిః
జాతా తేన సుషుప్తాంశమన్వేష్టుమహముద్యతః. 50

ఈ ప్రకారముగ జాగ్రత్స్వప్నముల తత్త్వమును విచారించుచున్న నాకపుడు 'సుషుప్తియనునది యేమియై యుండును' అను శంకపొడమెను. అంతనేను, సుషుప్తియొక్క తత్త్వము నన్వేషింపఁ బ్రారంభించితిని.

యావతిక్కం దృశ్యదృష్ట్యానస్తూష్ణీం తిష్ఠామ్యహం చిరమ్
నిశ్చిత్త ఇతి సంవిత్తిః శమా నాన్యత్సుషుప్తకమ్. 51

అత్తఱి హృదయప్రదేశమందున్న నేను 'ఈ దృశ్యదృష్టిచే నాకేమి ప్రయోజనము చిత్తరహితుఁడనై తూష్ణీంభావముతోటి చిరకాలము నసించెదను' అని యిట్లు తలంచుచుండగనే యింతలో 'చిత్తరహితముగ అభ్యంతరమునఁ బ్రశాంతముగ నుండునట్టిస్థితియే సుషుప్తిగాని యన్యముగాద'ను భావము నాకు స్ఫురించెను.

నఖకేశాదిదేహేఽస్మిన్విదితావిదితం యథా
న జడం చ జడం చైవ సుషుప్తం చేతనాత్మని. 52

అట్టి సుషుప్తిస్థితి విశేషాహంకారముతో నెఱుఁగఁబడక పోయినను, యీ దేహమందలి నఖకేశాదులవలె సామాన్యముగ నెఱుఁగఁబడుటచే విదితావిదితరూపమై చెన్నొందుచున్నది. మఱియు నయ్యది జడముగాని, చేతనముగాని కానిదై తత్సాక్షియగు చిదాత్మయందు స్ఫురించుచున్నది.

సంవిత్త్యా కిం శ్రమార్తోఽస్మి శాన్తమాసేవి మానసమ్
ఇత్యేకపరిణామత్వాన్నాన్యదస్తి సుషుప్తకమ్. 53

'జాగ్రత్స్వప్నములందలి పరిభ్రమణముయొక్క శ్రమచేఁ బీడితుఁడనైయున్నాను. కావున నాకింక విశేషజ్ఞానముచే నేమిప్రయోజనము? కొంతకాలము చిత్తరహితుఁడనై శాంతముగ నుండెదను అను నీప్రకారమగు సంకల్పముచేవలె కేవల గాఢనిద్రాకారమైన పరిణామవిశేషమే సుషుప్తిగాని మఱియొకటికాదు.

ఏతన్నిద్రాఘనం జాగ్రత్యపి సంభవతి స్వతః
న కించిచ్చిన్తయామ్యాసే శాన్త ఇత్యేకరూపకమ్. 54

ఏమియు చింతింపను, శాంతముగ ఏకరూపముతో నుండెదను, అని నిశ్చయించి చింతలను పరిత్యజించియుండు మనుజునకు జాగ్రత్తునందునుగూడ నిట్టి గాఢనిద్రారూపమగు సుషుప్తి స్వయముగ సంభవించును.

ఏషావస్థా యదా యాతి ఘనతా ముచ్యతే తదా
నిద్రాశబ్దేన తన్వీ తు స్వప్నశబ్దేన కథ్యతే. 55

ఈ సుషుప్త్యవస్థయే ఘనత్వము నొందునపుడు నిద్రయనియు, ఒకింతవిక్షేపముచే శైథిల్యము నొందునపుడు స్వప్నమనియుఁ జెప్పఁబడుచున్నది.

సుషుప్తమితి నిశ్చిత్య తురీయాన్వేషణామహమ్
ప్రవృత్తః కర్తుముద్యుక్తో యుక్తః పరమయా ధియా. 56

ఈ ప్రకారముగ సుషుప్తిని నిశ్చయించి యటుపిమ్మట మహాప్రయత్నశీలమగు బుద్ధితోఁ గూడుకొనినవాఁడనై తురీయావస్థయొక్క యన్వేషణమును నేను గావింపఁదొడఁగితిని.

యావద్రూపం తురీయస్య కించనాపి న లక్ష్యతే
సమ్యగ్బోధాదృతే శుద్ధాత్ప్రకాశ స్తమసో యథా. 57

అంధకారము నశింపనిచో ప్రకాశముయొక్క పూర్ణ స్వరూపము తెలియఁబడనట్లు, అజ్ఞాననాశకమగు శుద్ధసమ్యక్ - జ్ఞానములేనిచో, తురీయస్థితి యొక్క పూర్ణరూప మొకింతైనను లభింపదు.

యథాస్థితమిదం విశ్వం సమ్యగ్బోధాద్విలీయతే
యథాస్థితం చ భవతి న చ కించిద్విలీయతే. 58

యథారీతి స్థితిగల్గియున్నప్పటికి, ఈ ప్రపంచము సమ్యక్ - బోధచే విలీనమైపోవుచున్నది. అట్లాత్మయందు విలీనమైన యీ ప్రపంచము ఆత్మ రూపముగ నెప్పటియట్లే స్థితిగల్గియున్నదై యేమియు విలీనముకాకయే యున్నదగును.

అతః స్వప్నో జాగరా చ సుషుప్తం చ తురీయకే
స యథాస్థితమస్తీదం నూనం నాస్తి చ కించన. 59

ఇక్కారణమున జాగ్రత్స్వప్న సుషుప్తులను మూఁడవస్థలున్ను యథారీతి స్థితిగల్గియున్న యీ ప్రపంచమంతటితోఁగూడ, తురీయస్వరూపమున నెలకొనియున్నవగును. కాని, (పరమార్థమున) నిక్కముగ నేదియు నొకింతైననునందు నెలకొనియుండలేదు.

కారణాజ్జగదుత్పన్నం న బ్రహ్మైత్థమవస్థితమ్
జగత్తయా శాన్తమజం బోధ ఇత్యేవ తుర్యతా. 60

ఈజగత్తు ఏ కారణమునుండియునుగూడ నుత్పన్నము కాకయేయున్నది. శాంతమై, జననమరణరహితమైనట్టి బ్రహ్మమేయిట్లు జగద్రూపముగ స్థితిగల్గియున్నది' అనుబోధయే తురీయత్వమగును.

అసంభవాత్సంభవకారణానాం న జాయతే కించన నామ సర్గః
చిచ్చేతనేనైవ హి సర్గసంవిత్ స్వయం గృహీత ద్రవతామ్బునేవ. 61

ఇత్యార్షే శ్రీవాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే ఉత్తరార్ధే అవిద్యోపాఖ్యానాన్తర్గత విపశ్చిదుపాఖ్యానే శవోః జాగ్రత్స్వప్నసుషుప్తతురీయవర్ణనం నామ సప్తత్రింశదధిక శతతమః సర్గః ॥ 137 ॥

జన్మకారకములగు కారణములు అద్వయమగు బ్రహ్మమున అసంభవములగుటచే సృష్టి యను ద్వైతమెద్దియు వాస్తవముగ జనింపకయే యున్నది. చైతన్యముయొక్క జగదాకారమగు స్ఫురణమే, జలము ద్రవత్వమును గ్రహించునట్లు, స్వయముగ సృష్టిరూపమును గ్రహించుచున్నది.

ఇది శ్రీవాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున నుత్తరార్ధమున అవి॥ విప॥ శవో॥ జాగ్రత్స్వప్నసుషుప్తితురీయ స్వరూపవర్ణనమను నూటముప్పదియేడవ సర్గము ॥ 137 ॥



## అష్టత్రింశదధిక శతతమః సర్గః

[ మేలనే ద్విగుణం విశ్వం ప్రాణిజీవస్యజీవయోః
ఐక్యే త్వేకం మయా దృష్టమిత్యాది మునినోచ్యతే.

'ఆ ప్రాణిజీవునియొక్కయు, నాజీవునియొక్కయు మేళనముచే రెండింతలు, ప్రపంచము నున్ను, ఐక్యముచే నొకేప్రపంచమునున్ను నేను గాంచితినని' మునివచించుట యిచటఁ గాననగును.]

తాపస ఉవాచః—

గన్తుమేవం విచార్యాహం తత స్తత్సంవిదైకతామ్
ప్రవృత్తశ్చోత్తమామోదేన సౌరభేణేవ సౌరభమ్. 1

తాపసుఁడగు ముని:— ఓ వ్యాధుఁడా! ఈ ప్రకారముగ జాగ్రదాది (నాలుగు) అవస్థల యొక్క తత్త్వమునువిచారించి, ఆ పిదప, పుష్పించిన ఆమ్ర (మామిడి) వృక్షముయొక్క సుగంధము వాయువుచేఁ గొంపోఁబడి కమల సుగంధముతోఁటి ఐక్యమొందుటకై ప్రవర్తించునట్లు నే నాప్రాణి యొక్క చిదాభాసరూపుఁడగు జీవునితోఁటి ఐక్యమొందుటకుఁ బ్రవృత్తుఁడనైతిని.

యావత్తచ్చేతనం తస్య తమోజోధాతు మత్యజమ్
ప్రవృత్తం బాహ్యసంవిత్త్యా సమస్తేన్ద్రియ సంవిదా. 2

నే నాప్రాణియొక్క చిదాభాసునియందుఁ బ్రవేశించుటకై హృదయమందలి తేజమును త్యజింపగనే, ఇంతలో నాయొక్క సమస్తేంద్రియ వృత్తులున్ను బహిర్ముఖవ్యాపారమున బలాత్కారముగ ప్రవృత్తములాయెను.

సంవిదం సంవిదాగృహ్ణంస్తాన్బాహ్యోఽన్తరపి క్షణాత్
అహం ప్రసృతవాంస్తత్ర తైలబిన్దుమివామ్బసి. 3

తదుపరి, అట్లు బహిర్ముఖముగ, ప్రవృత్తములైన యింద్రియవృత్తులను అభ్యంతరమునకు మరల్చుటఁగూర్చిన ప్రయత్నవృత్తిచే వానిని బలపూర్వకముగ నిగ్రహించుచు క్షణకాలములోనే నేను, జలమందు, తైలబిందువువలె ఆభ్యంతరమున వ్యాపించినవాఁడనైతిని.

తత్సంవిది తథైవాథ యావత్పరిణమామ్యహమ్
భువనం దృష్టవాంస్తావత్సర్వం ద్విగుణీతం స్థితమ్. 4

ఈ ప్రకారముగ, ఉపాధివ్యాప్తిద్వారా నేనాప్రాణియొక్క చిదాభాససంవిత్తునందు మేళనముచే పరిణామమొందుచుండ నింతలో, ఆతని వాసనలయొక్కయు నావాసనలయొక్కయు రెంటియొక్క అంతఃప్రతిభాసముచే నేను ప్రపంచము నంతటిని ద్విగుణీకృతముగఁ గాంచితిని.

దిశో ద్విగుణతాం యాతాస్తపతస్తపనావుభౌ
భూమణ్డలే ద్వే సంపన్నే ద్వే వై ద్యావో సముత్థితే. 5

(ఎట్లనిన) దిక్కులు రెండింతలాయెను; ఇరువురు సూర్యులు ప్రకాశింపఁదొడఁగిరి; భూమండలములు రెండయ్యెను; ఆకాశములు రెండు భాసింపఁజొచ్చెను.

వదనప్రతిబిమ్బే ద్వే దర్పణప్రతిబిమ్బితే
యథా భాతస్తథా భాతే మిశ్రితే తే జగచ్చితమ్. 6

రెండద్దములందు ముఖముయొక్క రెండుప్రతిబింబములు భాసించునట్లు, ఇరువురు చిదాభాసులున్ను గలియుటచే జగత్తు రెండింతలుగ నపుడు భాసింపఁ దొడఁగెను.

తైలవద్భాతి కోశస్థం యచ్చేతనతిలద్వయే
తస్మిఞ్జగద్ద్వయం తత్ర తథా భాతి విమిశ్రితమ్. 7

ఏచైతన్యము తిలద్వయమందు తైలమువలె బుద్ధికోశమందు భాసించుచున్నదో, దానియందు మిళితములైన యుపాధులందలి చిదాభాసద్వయమున ఆ యాజగత్తులట్లు మిశ్రితములై ద్విగుణీకృతముగ భాసించుచుండెను.

సంవిద్ద్వితయకోశస్థే మిశ్రితే అప్యమిశ్రితే
తే ఉభే జగతీ భాతే సమే క్షీరజలే యథా. 8

వాస్తవముగ రెండువాసనలయొక్కయు పూర్ణమేళనము కాకయుండుటచే, బుద్ధికోశమందలి చిదాభాసులందున్న యా జగత్తులు రెండును కలియకున్నను, క్షీర, జలములవలె కలిసియున్నట్లే కానుపించుచుండెను.

నిమేషాద్దృష్టమాత్రేణ సా తత్సంవిన్మయా తతః
సకలైవాత్మతాం నీతా పరిమిత్యేవ సంవిదా. 9

అనంతర మొకనిమిషమాత్రకాలములో నేనాప్రాణియొక్క చిదాభాససంవిత్తునంతయు స్వసంవిత్తుచే, పరిచ్ఛిన్న మొనర్చి రెండుఉపాధులయొక్కయు మేళనముద్వారా నద్దానిని నాసంవిత్తు తోడ ఏకరూపత్వమును బొందించితిని.

ఋతుర్ ఋత్వన్తరేణేవ సరితేవాల్పికా సరిత్
వాతేనామోద లేఖేవ ధూమ లేఖేవ వార్ముచా. 10

ఒక ఋతువు మఱియొక ఋతువుతోను, చిన్ననది పెద్దనదితోను, వాయువు సుగంధము తోను, ధూమసమూహము మేఘముతోను గలిసి యేకమగునట్లు, అపుడు నాసంవిత్తునందాతని సంవిత్తు కలిసి యేకమయ్యెను.

ఏకత్వేనాశు సంవిత్తేర్యయా మే జగదేకతామ్
దుర్దృష్టేర్ద్వివపుశ్చన్ద్రః సుదృష్టేరేకతామివ. 11

దోషయుక్తమగు దృష్టిగలవానికిఁ గానుపించు రెండుచంద్రులున్ను ఆ దృష్టి శుద్ధమగు నపుడేకరూపత్వముఁ జెందునట్లు, వాసనలయొక్కయు, ఏకీకరణముచే రెండు సంవిత్తుల యొక్కయుఁ బూర్ణమగు యేకత్వము సంభవించుటవలన పూర్వము ద్విగుణీభూతమై కన్పట్టిన జగత్తపుడేకత్వమును బొందెను.

తతో మే తచ్చితిస్థస్య స్వం వివేకమనుజ్ఝితః
అల్పీభూతః స్వసంకల్పస్తత్సంకల్పస్థితిం గతః. 12

అటుపిమ్మట స్వకీయ పూర్వాపర విమర్శను త్యజింపకయే, ఆప్రాణియొక్క చైతన్య మందున్న నాయొక్క సంకల్పము అల్పమై యాతని సంకల్పానుసారము స్థితిఁ బొందెను.

తచ్చిత్తవృత్త్యైవ తతో బాహ్యమాలోకయ స్తతః
అభుఞ్జే తద్దినాచారం తత్ద్ధృదయమత్యజన్. 13

పిదప, అచట నేనాతని హృదయమును త్యజింపకయే యాతని భోగ్యములగు శబ్దాది విషయములను గ్రహించుచు, అతని హృదయమును త్యజింపకయే యాతని జాగ్రద్వ్యవహారరూప మగు దినాచారమునంతయు ననుభవించితిని.

తతో యదృచ్ఛయైవాసౌ శనైర్నిద్రాకులోఽభవత్
పద్మః సాయమివాపీయ పయో భుక్త్వాన్నముద్భ్రమః. 14

అటుతరువాత ఆప్రాణియన్నమును భుజించి, జలమునుద్రాగి శ్రమతోఁగూడుకొనిన వాఁడై సాయంకాలమునఁ గమలమువలె స్వేచ్ఛతోటి మెల్లగ నిద్రాయుక్తుఁడాయెను.

ప్రసృతం దిగ్నికుఞ్జేషు రూపాలోకక్రియాకరమ్
సంజహార బహిశ్చిత్తం సాయమర్కోకరుచిం యథా. 15

అత్తతి యాతనిచిత్తము, సాయంకాలమున సూర్యభగవానుఁడు తనకిరణముల నుపహ రించునట్లు, దిక్కులనుకుంజములందుఁ బ్రసరించిన రూపగ్రహణాది బాహ్యక్రియా సమూహము నంతయు నుపసంహరించెను.

సహ చిత్తేన తాస్తస్య సమస్తేన్ద్రియవృత్తయః
హృత్కోశమవిశన్నాః కూర్మస్యేవాఙ్గసంధయః. 16

అపుడు చిత్తముతోసహా యాతని యింద్రియ వృత్తులన్నియు మూయఁబడినవై, తాఁబేటి అవయవసంధులు అర్ధానిశరీరమును బ్రవేశించునట్లు, హృదయకోశమును బ్రవేశించెను,

ముద్రితా హృదయాకారాస్త అసంశ్చక్షురాదయః
లోష్టరూపా మృతావేవ లిపికర్మార్పితా ఇవ. 17

మఱియు, నేత్రాదీంద్రియములు ముకుళితములై హృదయ పద్మమువంటి యాకృతిని బొంది లోష్టము (మట్టిగడ్డ) వలెను. మరణించిన దానివలెను, చిత్రమందు లిఖింపఁబడిన దాని చందమునను వ్యాపారరహితములై యుండెను.

అహం తచ్చిత్తవృత్త్యై సహసోన్నమ్య తత్క్షితః
తచ్చిన్తానువిధాయిత్వాత్తద్ధృదయమావిశమ్. 18

నేనున్ను, ఆతనిచిత్తముననుసరించి వర్తించుటబట్టి యాతనిచిత్త వృత్తితోఁగూడ నాతని యింద్రియగోళకములను త్యజించి, అయానాడీ మార్గముఁద్వారా యాతని హృదయమును బ్రవేశించితిని.

సంహృత్య బాహ్యానుభవమన్తరేవ తదోజసి
క్షణమన్వభవం శూన్యం సుషుప్తం తల్పకోమలే. 19

బాహ్యానుభవము నుపసంహరించి, అభ్యంతరమందలి యా పూర్వోక్తమగు తేజమందు శయ్యవలెఁ గోమలమైనట్టి యానందమయకోశమున సర్వవ్యాపారశూన్యమగు సుషుప్తిని క్షణకాల మపుడు నే ననుభవించితిని.

క్లమాన్నపానబహులై ర్నిబిడాస్వపి నాడిషు
సుషిరాస్వేవ వా వాయుర్న నిర్యాత్యేవ యాతి చ. 20

ఆ సమయమున సమానమను వాయువు ఛిద్రసహితములగు నాడులందు అన్నపాన రసములయొక్క యనేక వికారములచే నచటచట విరోధింపఁబడుటచే శ్రమచే బాహ్యప్రదేశమునకు స్పష్టముగ నేగకయున్నను, సూక్ష్మతరమగుగతితో సంచరించుచునే యుండెను.

యదా తదాత్మకాత్మైకపరో హృది నహస్థితమ్
అప్రధానీ కరోత్యేతచ్చిత్తం స్వార్థస్వభావతః. 21

ఇట్టి సుషుప్తిస్థితి యెపుడు సంభవించునో, అపుడుప్రాణము, అద్వైతానంద రూపమగు ఆత్మయందు తత్పరమగుచు, హృదయమున 'పురీతతి' అను నాడియందుఁ బ్రవేశించి తనతోఁ గూడ స్థితినొంది యున్నచిత్తమును, ఆత్మయే పురుషార్థముగా గల్గియుండు స్వభావముచే. స్వాధీనపఱచుకొనును. (అట్టి స్వభావమాత్రముచే సుఖవిశ్రాంతి గలుగునుగాన.)

స్వార్థమాత్రోఽద్య తస్యాన్తః పరకృత్యం న కస్యచిత్
కచతి స్వార్థసత్తాయామేతదేవ వపుర్గతః. 22

స్వార్థమాత్రమునఁ బ్రవృత్తుఁడగు ఎవఁడును నితరుల కార్యమునుచేయఁడు. ఏలయనిన స్వార్థసత్తయొక్క రూపమిట్టిదేయగును, అనఁగా అట్టి సుషుప్తిదశయందు, ప్రత్యగాత్మయను పరమ పురుషార్థ మాత్రమునకై ఉద్యుక్తమగు అప్రాణమికమన, ఇంద్రియాది పరవస్తువుల కార్య మెద్దియుఁ జేయకుండును. ఏలయనిన, నిరతిశయానందరూపమైన స్వార్థ (ఆత్మ) సత్తామయమగ సుషుప్తికాలమున నిరతిశయానందరూపమే ప్రకాశించునుగాని విక్షేప, దుఃఖాదులొకింతైనన భాసింపవు.

శ్రీరామ ఉవాచ :—

మనః ప్రాణవశాదేవ మనుతే కిం మహామునే
స్వరూపం మనసో నాస్తి తస్మాత్తత్కేవలం చ కిమ్. 23

శ్రీరాముఁడు :— ఓ మునీంద్రా! సుషుప్తియందు ప్రాణమున కధీనములై మనస్సు, ఇంద్రియాదులు మననాది కార్యముల, జేయకయున్నచో, ఈ జాగ్రద్దశయందేల చేయుచున్నవి? ఏలయనిన, ప్రాణముకంటె వేఱుగ మనస్సుయొక్క స్వరూప మెద్దియునులేదు. కావున నది ప్రాణ శూన్యముగ నేమియును గాకయేయున్నది.

శ్రీ వసిష్ఠ ఉవాచ :—

దేహాదివేహ నాస్త్యేవ స్వానుభూతోఽప్యయం నిజః
మనసః కల్పనాత్మేదం వపుః స్వప్నే గిరిర్యథా. 24

శ్రీవసిష్ఠుఁడు :— ఓ రామచంద్రా! (అధిష్ఠానసన్మాత్రమునుండి వేఱుచేయఁబడినచో, ఈ దేహప్రాణాది జగద్రూపమేమియునులేదు. వేఱుచేయఁబడనిచో నద్దానిసత్తచే సర్వముండియే యున్నది. ఇట నిత్యమనుభూతమగు ఈ దేహమే వాస్తవముగ లేకయున్నది. స్వప్నమందలి పర్వతమువలె, ఈ దేహము మనస్సుయొక్క కల్పనారూపమేయగును కావున మనస్సుకంటె వేఱు చేయఁబడినచో, ఈశరీరమే లేదు.

తచ్చిత్తమపి నాస్త్యేవ చేత్యార్థాభావయోగతః
సర్గాదౌ కారణాభావాద్దృశ్యానుత్పత్తిహేతుతః. 25

అట్లే, సృష్ట్యాదియందు దృశ్యపదార్థముయొక్క యుత్పాదకమగు కారణములేనందున దృశ్యమే యుత్పన్నముకాకయున్నది. గావున నట్టి దృశ్యాభావముచే, ఆ చిత్తమున్ను లేకయే యున్నదగును.

అతః సర్వమిదం బ్రహ్మ తచ్చ సర్వాత్మకం యదా
తదా విశ్వమిదం విష్వగస్త్యేవ చ యథాస్థితమ్. 26

కావున, ఈ సమస్తమున్ను బ్రహ్మమేయైయున్నది. మఱియు నెపుడు బ్రహ్మము సర్వాత్మకమైయున్నదో, అపుడు యథారీతి స్థితిగల్గియున్న (మానస, ఇంద్రియాది) ఈ సమస్త ప్రపంచమున్ను నద్దాని సత్తచే నున్నదేయగును.

అస్తిచిత్తాది దేహాది తద్ద్వయ్యైవ చ తద్విదామ్
యాదృక్తత్తద్విదామేతదస్మాకం విషయే న తత్. 27

ఈ చిత్త, దేహాదులెవ్విగలవో, అవి బ్రహ్మవేత్తలయొక్క దృష్టియందు బ్రహ్మమే యైయున్నవి. బ్రహ్మవేత్తలుకాని వారిదృష్టియందవి యెట్టివో, అది మాకు (తత్త్వవేత్తలకు) విషయముకాదు.

యథేదం త్రిజగద్బ్రహ్మ యథేతి వివిధాత్మకమ్
అత్రేమం రాజపుత్ర త్వం వర్ణ్యమానం క్రమం శృణు. 28

రాజపుత్రుఁడవగు రామచంద్రా! వివిధరూపమగు ఈ త్రైలోక్యము బ్రహ్మమయ మెట్లగునో, ఆ క్రమమునుగూర్చి నీవిపుడు వినుము.

అస్తి చిన్మాత్రమమలమనన్తాకాశరూపి యత్
సర్వదా సర్వరూపాత్మ న జగన్న చ దృశ్యతా. 29

నిర్మలమై, అనంతమై, చిదాకాశస్వరూపమై, సదా సర్వరూపమైనట్టి చిన్మాత్రమొకటియే కలదు. జగత్తుగాని, దృశ్యత్వముగాని యెవ్వియును లేవు.

సర్వవిత్త్వాత్తు తేనేదం మనస్త్వం చేతితం స్వతః
రూపమత్యజతా శుద్ధం బుద్ధమాది వివర్జితమ్. 30

సర్వజ్ఞత్వకారణముచే, ఆ చైతన్యము తనయొక్క శుద్ధమై, బుద్ధమై, చింతాదిరహితమైనట్టి చిత్స్వరూపమును త్యజింపకయే ప్రప్రథమమున మనస్సుయొక్క అధ్యారోపమును స్వతఃగావించెను.

మనసాకల్పితం తేన యద్వై సరణమాత్మనః
తదేతత్ప్రాణపవనం విద్ధి వేద్య విదాంవర. 31

వేద్యము(ఆత్మ)నెఱుఁగువారిలో శ్రేష్ఠుఁడవగు నోరామచంద్రా! పిమ్మట, ఆ చైతన్యము మనస్సుచేఁ దనయొక్క సంచరణశీలత్వమును గల్పించెను. దానినే యీప్రాణవాయువుగ నెఱుఁగుము.

ప్రాణతైషా యథా తేన కల్పితేవానుభూయతే
తథైవేన్ద్రియదేహాది దిక్కాలకలనాది చ. 32

అట్లాచైతన్యముద్వారా మనస్సుచేఁ గల్పింపఁబడినదై యీ ప్రాణరూపత్వ మెట్లనుభూత మగుచున్నదో, ఆ రీతిగనే, దేహేంద్రియాదులున్ను, దిక్కాలకల్పనాదులున్నుగూడ ననుభూతము లగుచున్నవి

ఇతి విశ్వమిదం విష్వక్ చిత్తమాత్రమఖణ్డితమ్
చిత్తం తు చిత్పరం బ్రహ్మ తస్మాద్బ్రహ్మేదమాతతమ్. 33

ఈ ప్రకారముగ ఈ విశాల ప్రపంచమంతయును మనోమాత్రమైయున్నది. మనస్సో చిద్రూపమగు పరబ్రహ్మమే యైయున్నది. కావున నిదియంతయును వ్యాపకమగు బ్రహ్మ మాత్రమే యగును.

అనాకార మనాద్యన్తమనాభాసమనామయమ్
శాన్తం చిన్మాత్రసన్మాత్రం బ్రహ్మైవేదం జగద్వపుః. 34

ఈ జగద్రూపమంతయును నిరాకారమై, ఆద్యంతరహితమై, ఆభాసశూన్యమై, నిర్వికారమై, శాంతమై, సన్మాత్రమై, చిన్మాత్రమైనట్టి బ్రహ్మమేయైయున్నది.

సర్వశక్తి పరం బ్రహ్మ మనఃశక్త్యా యథా స్థితమ్
యత్ర తత్ర తథారూపం స్వమేవానుభవత్యలమ్. 35

సర్వశక్తివంతమగుటచే ఈ పరబ్రహ్మము ప్రాథమిక మనశ్శక్తిచే, పూర్వసిద్ధమగు జగత్తును జాగ్రత్తునందుగాని, స్వప్నమందుగాని యే ప్రకారముగఁ గల్పించుచున్నదో, ఆప్రకారముగ తన్నే ఆయా రూపములతోటి లెస్సగ ననుభవించుచున్నది.

సంకల్పాత్మమనో బ్రహ్మ సంకల్పయతియద్యథా
తత్తథైవానుభవతి సిద్ధమాబాలమీదృశమ్. 36

సంకల్పాత్మకమైన మనస్సను 'కార్యబ్రహ్మము' ఈ భూలోకమును, తదితరలోకములను నెట్లు సంకల్పించుచున్నదో, వాఖినట్లే యనుభవించుచుండుట ఆబాలగోపాలముప్రసిద్ధమైయే యున్నది.

ప్రాణీకృతః స్వయమయం నను చేతసాత్మా
దేహీకృతస్త్రిభువనీకృత ఏవనాద్యః
దేహీకృతః ఖ వపురేవ గిరీకృతశ్చ
స్వప్నేషు కల్పిత పురీష్వనుభూతమేతత్. 37

ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే ఉత్తరార్ధే అవి॥ విప॥ శవో॥ చిత్తసర్వాత్మకతాప్రతిపాదనం నామాష్టత్రింశదధిక శతతమః సర్గః ॥ 138 ॥

ఓ రామచంద్రా ! చిదాకాశరూపుఁడైన ఆదిపురుషుఁడగు ఈ పరమాత్మయే స్వయముగ నిజకల్పితమగు మనస్సుద్వారా మొదట ప్రాణవంతుఁడయ్యెను; పిదప దేహధారియయ్యెను; ఆ పిమ్మటఁ త్రిలోకరూపుఁడాయెను. తమతమ దేహములందు స్వప్నములలో తాము తమచేఁ గల్పింపఁబడిన పురములందుఁ బర్వతములగుట సర్వులచే ననుభవింపఁబడుచున్నదిగదా ! ఇదియే యీసమస్తమునకును నిదర్శనమైయున్నది.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున నుత్తరార్ధముఁన అవి॥ విప॥ శవోపాఖ్యానమందు చిత్తసర్వాత్మకతా ప్రతిపాదనమను నూటముప్పది యెనిమిదవ సర్గము ॥ 138 ॥

## ఏకోనచత్వారింశదధిక శతతమః సర్గః

[ ప్రాణాదపి హి చిత్తస్య ప్రాధాన్యమిహ వర్ణ్యతే
మునేః సుషుప్తాత్స్వప్నాప్తౌ ప్రలయేక్షా చ విస్తరాత్.

ప్రాణముకంటెను చిత్తముయొక్క ప్రాధాన్యము, సుషుప్తినుండి స్వప్నమును బొందటలో ముని ప్రళయమును గాంచుట, ఇచట విస్తారముగ వర్ణింపఁబడు చున్నవి. ]

శ్రీ వసిష్ఠ ఉవాచ :—

చిత్తమేవ జగత్కర్తృ సంకల్పయతి యద్యథా
అసత్సత్సదసచ్చైవ తత్తథా తస్య తిష్ఠతి. 1

శ్రీవసిష్ఠుఁడు:— ఓ రామచంద్రా! చిత్తమే జగత్తుయొక్క కర్తయైయున్నది. అది దేనినెట్లు, అసత్తు (మిథ్య)గగాని సత్తు (వ్యావహారికము)గ గాని, సదసత్తు (ప్రాతిభాసికము)గ గాని సంకల్పించుచున్నదో, అయ్యది యాప్రకారముగనే దానికి స్థితిగల్గియున్నదగుచున్నది.

తేన సంకల్పితః ప్రాణః ప్రాణో మే గతిరిత్యపి
న భవామి వినానేన తేన తత్తత్పరాయణమ్. 2

అహం కతిపయం కాలం నను ప్రాణవినాకృతః
న భవామి పునర్ధ్యానం భవామ్యేవేతి కల్పితమ్. 3

ఈ చిత్తమే మొట్టమొదట ప్రాణమును గల్పించెను; మఱియు 'ఈ ప్రాణమే నాయొక్క సమస్తవ్యవహారములను నిర్వహించునది; అదిలేక నేనుండఁజాలననియు, గూడ నయ్యది కల్పనఁ జేసెను. ఇక్కారణముననే చిత్తము ప్రాణముయొక్క యధీనమని చెప్పఁబడెను.

యత్ర తేనాఙ్గ తత్రైతత్ప్రాణేనాశు క్షణాద్వపుః
ఉదితం పశ్యతి మనో మాయాపురమివాతతమ్. 4

ప్రియుఁడవగు రామచంద్రా! ఎచటెచట ఆ మనస్సు ప్రాణముతోసహా శరీరమును గల్పించుచున్నదో, అచటచట క్షణకాలములోనే శీఘ్రముగ నద్దానిని (శరీరమును) విశాలమగు మాయాపురమును వలె నుదయించినదిగనే గాంచుచున్నది.

న భవామ్యేవ భూయోఽహం ప్రాణదేహవినాకృతః
దృఢనిశ్చయభాగిత్థం చితో భవతి నో పునః. 5

అట్లు, ప్రాణ, దేహముల కల్పనానంతరము ఆ చిత్తము (జీవుడు) మరల 'నేను, ప్రాణ, దేహములులేక యుండఁజాలనను దృఢనిశ్చయము గలదియగుచున్నది. అంతేకాని, చిత్స్వభావమును గూర్చిన ద్రృఢనిశ్చయము గల్గియుండుటలేదు.

దోలాయితుం తు సందేహాద్దుఃఖమాస్తే కునిశ్చయమ్
వికల్పేనైవమస్యైతజ్ఞ్ఞానాన్నాల్పేన యాస్యతి. 6

కావుననే, 'నేను చిద్రూపుఁడనా, శరీరాదులునా' అను నీమున్నగు సందేహములతోఁ గూడిన అల్పవిచారమువలన జనించిన జ్ఞానముచే జీవుఁడు దుఃఖితుఁడే యగుచున్నాఁడు. తత్త్వజ్ఞానముచేఁదప్ప ఇతరములైన అల్పవిచారములచే 'శరీర, ప్రాణాదులు నేన'ను దృఢమైన విపరీత జ్ఞానమెన్నఁటికిని నశింపనేరదు.

యస్యాయమహమిత్యస్తి తస్య తన్నోపశామ్యతి
వర్జయిత్వాత్మవిజ్ఞానం కేనచిన్నామ హేతునా. 7

ఎవనికి 'శరీర, ప్రాణాదులు నేన'ను మిథ్యాజ్ఞానము గలదో, ఆతనికి తన జ్ఞానజనిత మగు సంసారము, ఆత్మజ్ఞానముచేఁ దప్ప అన్యమగు ఏ హేతువుచేతను శమింపనేరదు.

నాన్యత్ర ప్రథతే జ్ఞానం మోక్షోపాయవిచారణాత్
ఋతే తస్మాత్ప్రయత్నేన మోక్షోపాయో విచార్యతామ్. 8

మోక్షోపాయమను ఈ (యోగవాసిష్ఠ) గ్రంథముయొక్క విచారణచే ఆత్మజ్ఞానమెట్లు విస్తరించునో, అట్లు తదితరగ్రంథములయొక్క విచారణచే విస్తరింపదు. కావున, ప్రయత్నము తోటి ఈ గ్రంథమునే తప్పక విచారణచేయవలయును.

కిలాహమిదమిత్యేవ నావిద్యా విద్యతే క్వచిత్
మోక్షోపాయాదృతే నైతత్కుతశ్చిదయతేఽన్యతః. 9

'ఈ శరీరాదులు నేను, ఈ గృహాదులు నావి' అను ఈ రెంటియందుఁ దప్ప 'అవిద్య' మఱియెచటను లేదు. అట్టి అవిద్య యీ మోక్షోపాయమను గ్రంథముయొక్క విచారణముచేఁ దప్ప అన్యమగు దేనిచేతను నెచటను దొలఁగనేరదు.

ఏవం యన్మనసాత్యన్తముపలబ్ధం తథైవ తత్
తేన మే జీవితం ప్రాణా ఇతి ప్రాణే మనః స్థితమ్. 10

'నాకు ప్రాణమే పరమప్రేమాస్పదమైనది, అదియే నాజీవనాధారము' అని యిట్లే ప్రకారముగ మనస్సు ఆ ప్రాణమునుగూర్చి నిశ్చయించుచున్నదో, ఆ ప్రకారముగనే దానిని బొందు చున్నది. మఱియు నట్టిభావనలయొక్క దృఢాభ్యాసమువలననే యామనస్సుప్రాణమున కధీనమై యొప్పుచున్నది.

దేహే సామ్యే స్థితే ప్రాణే మనో మననవద్భవేత్
క్షుబ్ధే ప్రాణగతం క్షోభం ప్రశ్యన్నాన్యత్ప్రపశ్యతి. 11

అట్లే, దేహము ప్రశాంతముగనుండ, ఆ దేహగతమగు శాంతిని ప్రాణగతముగనెఱిఁగి యా మనస్సు మననాది వ్యాపారములఁ జేయుచున్నది. మఱియు, దేహము సంక్షోభమొంద, ఆ దేహమందలి క్షోభను ప్రాణమందలిదిగఁదలంచి యితరమగు యే విచారమునుగాని లేక ఆత్మ తత్త్వవిచారమునుగాని యా మనస్సు చేయుటలేదు.

యథా స్వకర్మణి స్పన్దే వ్యగ్రః ప్రాణో భృశం భవేత్
తదా తదీహితవ్యగ్రః ప్రాణో నాత్మోద్యమీ భవేత్. 12

ఎపుడు ప్రాణము శ్వాసోచ్ఛ్వాసరూపమగు నిజకార్యమందు మిగుల తత్పరమై యుండునో, అపుడయ్యది మనస్సుయొక్క యభిలషితములను సంపాదించుటయందే వ్యగ్రమై యుండునుగాని ఆత్మజ్ఞానమునుగూర్చి ప్రయత్నింపదు. (దీనిచే, ప్రాణము, నిరోధాభ్యాసములేనిచో ఆత్మజ్ఞానము వైపునకు ఉన్ముఖముకాదని సిద్ధించుచున్నది.)

ఏతే హి ప్రాణమనసీ త్వన్యోన్యం రథసారథీ
కే నామ నానువర్తన్తే రథసారథినౌ మిథః. 13

ఈ ప్రాణ, మనంబులురెండును బరస్పర మొకదాని కొకటి రథ, సారథులవలె నున్నవి. ఈ ప్రపంచమున అన్యోన్యమనుసరింపనట్టి రథ, సారథు లెవరుగలరు ?

ఇత్యాదిసర్గే స్వాత్మైవ చేతితః పరమాత్మనా
తేనైషాద్యాపి నియతిర్నాబుధానాం నివర్తతే. 14

ఈ ప్రకారమగు ప్రాణమనస్సుల పరస్పర అనువర్తనమును ఆదిసృష్టియందు ప్రాణ మనోరూపమగు పరమాత్మయే సంకల్పించెను. కావున ఆ నియతి నేఁటివఱకును అజ్ఞానులకు నివర్తింపకయే యున్నది.

దేశకాలక్రియాద్రవ్యైర్మనః ప్రాణశరీరిణామ్
ప్రయాన్త్యధిగతా దేహేష్వారూఢానాం పరేపదే. 15

ఆత్మపదమున రూఢినొందని మనఃప్రాణ దేహములుగలవారి దేహములందే దేశకాల క్రియాద్రవ్యములచేఁ బొందఁబడిన వ్యవహారములు ప్రవర్తించుచున్నవి.

స్వం ప్రాణమనసీ సామ్యాత్కుర్వతీ కర్మతిష్ఠతః
వైషమ్యాద్విషమం చైకం శాన్తే శాన్తా సుషుప్తతా. 16

ప్రాణ మనంబు లెపుడు సమత్వముతోఁటి తమతమ కార్యములఁ జేయుచుండునో, అపుడు జాగ్రత్తను సమరూపమగు వ్యవహారమున్ను, ప్రాణమెపుడింద్రియ వ్యాపారమునుండి నివర్తించి విషమత్వమును ధరించునో, అపుడు స్వప్నమను కేవల మానసవ్యవహారమున్ను, మనస్సు శమింప సర్వవిక్షేపశాంతిరూపమగు సుషుప్తియున్ను ప్రవర్తించుచున్నవి.

యదాహారాదిరుద్ధాసు నాడీషు క్వాపి పిణ్డితః
శాన్తమాస్తే జడః ప్రాణస్తదోదేతి సుషుప్తతా. 17

ఎపుడు, అన్నరసములచేతను, పిత్తాదులచేతను, లేక, పరిశ్రమచేతను నాడులు నిరోధింపఁబడ, ప్రాణము దట్టముగనయి, మందసంచారముగలదై, యెచటనైన నుండునో అపుడు సుషుప్తి యుదయించును.

నాడీష్వన్నావపూర్ణాసు తథా క్షీణాసు వాక్లమాత్
నిఃస్పన్దస్తిష్ఠతి ప్రాణస్తదోదేతి సుషుప్తతా. 18

మఱియు నాడులు అన్నరసములచేఁ బూర్ణములై యుండునపుడును, లేక శ్రమచేగాని, ఆకలిచేగాని క్షీణములై యుండునపుడును, ప్రాణము మందగతి గల్గియుండుటచే నపుడున్ను సుషుప్తియుదయించుచున్నది.

నాడీనాం మృదురూపత్వాత్పూర్ణత్వాద్వా వ్రణోదరే
క్వాపి ప్రాణే స్థితే లీనే నిఃస్పన్దాస్తే సుషుప్తతా. 19

ఇంకను, మర్దనాదులచే నాడులు మృదుత్వమును జెందునపుడును, బాణాదులచేఁ గొట్టఁబడుటచే వ్రణములు రక్తాదులచేఁ బూర్ణములై యుండునపుడును ప్రాణమెచటనో లీనమై యున్నదై మందసంచారము గల్గియుండుటవలన నపుడును సుషుప్తి జనించుచున్నది.

తాపస ఉవాచ :—

అథ యస్య ప్రవిష్టోఽహం హృదయే సోఽభవన్నిశి
సుషుప్తఘననిద్రాలురాహారపరితృప్తిమాన్. 20

తాపసుఁడు:— ఓ వ్యాధుఁడా ! ఏ ప్రాణియొక్క హృదయమందు నేను ప్రవేశించితినో, ఆతఁడారాత్రియందు ఆహారాదులచే పరితృప్తుఁడై గాఢసుషుప్తిరూపమగు నిద్రను బొందెను.

తేన సార్ధమహం తత్ర తచ్చిత్తైకతాం గతః
సుషుప్తనిద్రాం సుఘనాం గుణీభూతోఽనుభూతవాన్. 21

ఆతనిచిత్తముతోఁ ఏకత్వమును బొందిన నేనపుడు నిజస్వాతంత్ర్యమునుద్యజించి యాతనితోగూడ గాఢనిద్ర ననుభవించితిని.

తతోఽన్నస్యాస్య జీర్ణేఽన్తర్నాడీమార్గే స్ఫుటే స్థితే
ప్రాకృతే స్పన్దితే ప్రాణే సుషుప్తం తనుతాం యయౌ. 22

అటుపిమ్మట, ఆ ప్రాణియొక్క యుదరమందున్న అన్నముజీర్ణముకాఁగా స్వాభావికమగు నాడీమార్గమున ప్రాణము స్పష్టముగఁ జలింపఁదొడఁగఁ అపుడు సుషుప్తి అల్పత్వముఁ జెందెను.

సుషుప్తే తనుతాం యాతే హృదయాదివ నిర్గతమ్
అపశ్యమహమత్రైవ భువనం భాస్కరాదిమత్. 23

అట్లు సుషుప్తి సూక్ష్మత్వముఁజెంద, అతని హృదయమునుండి బయల్వెడలిన దానివలె నున్నట్టి సూర్యాది సహితమగు స్వప్నమయ ప్రపంచమును నేనా హృదయమునందే విక్కముగఁ గాంచితిని.

తచ్చ క్షుబ్ధార్ణవోత్థేన పూర్యమాణం మహామ్భసా
విముక్తేనేవ కల్పాబ్దైరభ్రంకషతరంగిణా. 24

ప్రోహ్యత్పర్వతపూరేణ మహావర్తవిరావిణా
వహద్వనాలీతృణ్యాద్యైర్వ్యాప్తేనోన్మూలితాగయా. 25

పూర్వమేవావదగ్ధాయాస్త్రిలోక్యాః ఖణ్డఖణ్డకైః
పూర్ణేన పరితః ప్రౌఢైః ఖపురాద్రిమహీమయైః. 26

ఆ ప్రపంచము ప్రళయకాలమందు సంక్షోభముజెందిన సముద్రములనుండి యావిర్భవించినదియు, ప్రళయకాల మేఘములచే విడువఁబడినదియు, ఆకాశమునంటునట్టి యున్నత తరంగములతోఁ గూడినదియు, కొట్టుకొనిపోవు పర్వతముల యొక్క సమూహములు గలదియు, 'గొప్ప యావర్తములచే భయంకరమైన శబ్దముతో గూడినదియు, కొట్టుకొనిపోవు వనములను దృణ సమూహములచేఁ బూర్ణములైన పర్వతములచే వ్యాప్తమైనదియునగు మహాజలముచేఁ బరిపూర్ణమైనదియు, వృక్ష, పర్వతాదులను నిర్మూలమొనర్చునట్టి యగ్ని జ్వాలలచేఁ బూర్వమే దగ్ధములైయున్న త్రైలోక్య ఖండములతోను, దేవాసురాదుల గొప్పనగరములతోను నంతటఁగూడియున్నదియునై వెలయుచుండెను.

అహం తత్రైవ పశ్యామి యావత్కస్మింశ్చిదాస్పదే
కస్యాంచిత్పురి కస్మింశ్చిద్గృహే వధ్వా పురే స్థితః 27
సదారః సహభృత్యోఽహం సపుత్రః సహబాన్ధవః
సహభాణ్డోపస్కరణః సగృహోఽపహృతోఽమ్భసా. 28

మఱియు నట్టి ప్రళయాభిముఖమగు ప్రపంచమున నొకానొక దేశమున నొకానొక నగరమునందొకానొక గృహమున భార్యతోసహా నేనెడుటనున్నట్లు గాంచితిని. తదుపరి యానేను భార్యా, పుత్ర, బంధు, సేవకాదులతోడను పాత్రాదిసామగ్రితోడను, గృహముతోడను, అప్రళయ కాల జలప్రవాహమునఁ గొట్టుకొనిపోతిని.

ఉహ్యమానం క్షయామ్భోభి స్తద్గృహం తచ్చ పత్తనమ్
లఙ్ఘ్యమానం ద్రుమాకారైః పూర్యమాణం చ వారిభిః. 29
బృహత్కలకలారావం జేతుమబ్ధిమివోద్యతమ్
అతిక్షుభితవా స్తవ్య మనపేక్షితపుత్రకమ్. 30
ఆవర్తతరలాధ్యాభిర్వృత్తిభిర్వ్యాకులమాకులమ్
సాక్రన్దోరస్తాడనోత్క జనజమ్బాలభీషణమ్. 31
స్ఫుటత్కుడ్యత్రుటత్కాష్ఠరటచ్ఛుబ్కకృతోద్రటం
ప్రపతచ్ఛాదనచ్ఛత్ర గవాక్షస్థాఙ్గనాముఖమ్. 32

అపుడాగృహమున్ను, ఆపట్టణమున్ను ప్రళయ జలములచేఁ గొట్టుకొని పోఁబడునవియు, వృక్షాకారములగు మహాతరంగములచే దాఁటఁబడునవియు గొప్ప కలకల నాదముతోఁ గూడినవియు, సముద్రమును జయించుటకుఁ బ్రవృత్తము లైనట్లున్నవియు, పుత్రాదులనుగూడ నుపేక్షించు మిగుల క్షోభఁజెందిన నగరనివాసులతోఁ గూడియున్నవియు, గొప్పయావర్తముల చంచలజలప్రవృత్తులచే వ్యాప్తములై వ్యాకులములై పరఁగుచున్నవియు, వక్షఃస్థలమును బాదుకొనుచు నేడ్పుటయందుఁదత్పరులగు జనులనుబురదతోఁగూడి భయంకరముత్తైయున్నవియు, పగులుచున్న గోడలచేతను, విఱుగుచున్న కాష్ఠములచేతగు, తునుగుచున్న మేకులచేతను గావింపఁబడిన గొప్పధ్వనిగలవియు, పడుచున్న మిద్దెలయొక్క కిటికీలయందున్న స్త్రీలముఖములతో గూడినవియునై యొప్పుచుండెను.

ఇతి యావత్క్షణం పశ్యన్నహం తద్భావమాగతః
ప్రరోదిమి దీనాత్మా తావత్తత్సకలం గృహమ్. 33
చతుర్థా భిత్తిభేదేన వృద్ధబాలాఙ్గనాన్వితమ్
జగామ శతధా వీచ్యాం శిలాయామివ నిర్ఝరః. 34
ఉహ్యమానోఽహమభవం తతః ప్రలయవారిణి
త్యక్తసర్వ కలత్రాదిచిత్తః ప్రాణపరాయణః. 35

ఈ ప్రకారముగ వాని భావమును బొందిన నేను క్షణకాల మా యుపద్రవమును జూచుచు దీనచిత్తుఁడనై యేడ్వఁదొడఁగ నింతలో నలువైపుల గోడలు బ్రద్దలగుటచే, వృద్ధులతోడను- బాలుర

తోడను, స్త్రీలతోడను గూడిన యాగ్నహమంతయు, శిలపైఁ బడుటచే సెలయేటి జలమువలె, తరంగములచే నూఱు వ్రక్కలయ్యెను. తరువాత స్త్రీ పుత్రాది సర్వజనరహితుఁడనై కేవలము నిజ ప్రాణరక్షణమునందే తత్పరుఁడనై నే నా ప్రళయ జలమునఁ గొట్టుకొనిపోతిని.

క్షిప్తస్తరఙ్గజాలేన యోజనాద్యోజనవ్రజే
ఊహ్యమానద్రుమశిఖాజ్వాలాస్తరితజర్జరః. 36

కాష్ఠకుడ్యతటీపీఠకటుసంఘట్టఘట్టితైః
అవర్తనృత్యపాతాలతలే గత్వోత్థితశ్చిరాత్. 37

చలాచలాగమాపాయ వలద్గులుగులారవే
జలే బహులకల్లోలే మగ్నోన్మగ్నః పునః పునః. 38

సంఘట్టభగ్నశైలేన్ద్రపఙ్కిలే సలిలే క్షణమ్
పల్వలే వారణ ఇవ మగ్నః సత్ప్రయసోద్ధృతః. 39

యావదాశ్వసిమి క్షిప్రం డిణ్డీరే చాద్రిఖణ్డకే
తావదేత్య హతో వేగాద్వైరిణేవాతివారిణా. 40

నానావలన కల్లోల జలజాలజుషా తదా
న తదస్తి న యద్దృష్టం దుఃఖం దుఃఖాత్మనా మయా. 41

అట తరంగసమూహములచే ననేకయోజనముల దూరము విసరివేయఁబడినవాఁడనై, వెంటగొట్టుకొనిపోఁబడుచున్న వృక్షములందు వ్యాప్తములైయున్న యగ్నిజ్వాలల తాపముచే శిథిలీభూతుఁడనై, కాష్ఠ, కుడ్య, పర్వత తటాదులయొక్క దుస్సహములైన సంఘర్షణములచే మర్దితుఁడనై, ఆవర్తభ్రమణములందుఁ బాతాళతలమున కేగి మరల చాలసేపటికిఁ బైకివచ్చుచు, చంచల పర్వతములయొక్క గమనాగమనములచే 'గులుగులు' శబ్దముతోఁగూడినదియు, అనేకతరంగములచే వ్యాప్తమైనదియునగు జలమందు మరల మరల మునుగుచు, తేలుచు, పరస్పరసంఘర్షణములచే భగ్నములైనట్టి పర్వతములయొక్క పంకము (బురద)తోఁగూడుకొనిన జలమందు, చెఱువునం దేనుగువలె క్షణకాలము మునిఁగి మరల దైవయోగముచే నుత్తమజలప్రవాహముచే లేవనెత్తఁబడుచు నురుఁగులపైనను, పర్వతఖండముపైనను నొకింత విశ్రాంతినొందుచుండ నింతలో శీఘ్రముగ శత్రువువలెనేతెంచిన గొప్పజలతరంగములచేఁ గొట్టఁబడుచు, వివిధతరంగములచే నావరింపఁబడిన వాఁడనై జలప్రవాహమునఁబడుచునుంటిని. వెయ్యేల, దుఃఖపూర్ణుఁడనగు నేనపుడు చూడనట్టియు, అనుభవింపనట్టియు దుఃఖమేలేదు.

ఏతస్మిన్నన్తరే తత్ర తదా తత్రామ సేక్షణ
యావజ్జీవచిరాభ్యాసాద్వ్యాపాదిత్వాత్ప్ర చేతసః. 42

ప్రాక్తనం సంస్మృతం రూపం స్వం సమాధిమయం మయా

శ్యామనేత్రుఁడవగు నోవ్యాధుఁడా! ఇంతలో నపుడచట నాయా పూర్వకాలపు జీవితపర్యంతపు చిరకాలాభ్యాసమువలనను, దుఃఖపూరితచిత్తముతోఁ గూడియుండుటవలనను, ఆ నా పూర్వపు సమాధిమయస్వరూపము నాకిట్లు స్మృతికివచ్చెను.

అ అహో ను జగత్యస్యరూపేఽహం తాపసః స్థితః. 43

అహం కస్యచిదన్యస్య స్వప్నదృష్టిదిదృక్షయా
ప్రవిష్టోఽహమయం స్వప్నే పశ్యామీమం భ్రమం త్వితి. 44

'ఓహో! తాపసుఁడనగు నేను అన్యరూపమగు జగత్తునందుండియున్నాను. స్వప్నమును జూడఁదలంచి యొకానొకప్రాణియొక్క హృదయమును బ్రవేశించి యాతని స్వప్నమున నిట్టి భ్రమను వీక్షించుచున్నాను.

వర్తమానదృఢాభ్యాసమిథ్యాజ్ఞానమయాత్మని
కల్లోలైరుహ్యమానోఽపి తతోఽహం సుఖితః స్థితః. 45

అత్తఱి, వర్తమాన స్వప్నప్రపంచముయొక్క దృఢాభ్యాసముచే జనించిన మిథ్యాజ్ఞానముచే పరిపూర్ణమైనట్టి దేహమున తరంగములచేఁ గొట్టుకొనిపోఁబడుచున్నప్పటికిని నేనట్టి సమాధిమయస్వరూపముయొక్క స్మరణానంతరము సుఖముగనే యుంటిని.

ఇదం వారితయావశ్యం ప్రలయాబ్ధివివర్తనాః
ఉహ్యమానాద్రినగరగ్రామోర్వీఖణ్డపాదపాః. 46

ఉహ్యమాన మరాహీన్ద్రనారీనరనభశ్చరాః
ఉహ్యమానమహారమ్భలోకపాల పురాలయాః. 47

అపుడా కొట్టుకొనిపోఁబడుచున్న పర్వత, నగర, గ్రామ, భూఖండ, వృక్ష, దేవతా, శేష, స్త్రీ, పురుష, ఆకాశచారులతోను, ప్రవాహితములగు మహాకార్యసంయుక్తములైన లోకపాల పురములతోను, తత్స్థానములతోను గూడిన యా ప్రళయ సముద్రముయొక్క చేష్టలన్నింటిని మృగతృష్ణాజలమువలె మిథ్యారూపములుగ నేను గాంచితిని,

అథాహమద్రిమిశ్రామ్బుకల్లోలాద్రివిఘట్టనాః
ముహుః పశ్యఞ్జగన్నాశమనన్తరమచిన్మయమ్. 48

అపిదప పర్వతసహితమగు ఆ సముద్రజలముయొక్క పర్వతసదృశములైన యున్నత తరంగముల పరస్పర సంఘర్షణములను, జగత్తుయొక్క వినాశమును మరల మరల జూచుచు, తదనంతర మిట్లు చింతన చేసితిని.

చిత్రమేష త్రినేత్రోఽపి జీర్ణం తృణమివార్ణవే
ఉహ్యతే హా హతవిధేర్నాఽకార్యం నామ విద్యతే. 49

అహా! ఎట్టి యాశ్చర్యము! అవస్థాత్రయమను మూఁడు నేత్రములు గల్గియున్న యీశ్వరుఁడున్ను జీవరూపుఁడయి యీమాయామహాసముద్రమున శిథిలతృణమువలెఁ గొట్టుకొని పోవుచున్నాఁడు! అహా! ఈదుష్టదైవమునకుఁ జేయఁదగని దేదియునులేదు.

చతుర్ధా భిత్తిభేదేన ప్రకటాశయతామహమ్
పద్మానీవ గృహాణ్యప్సు దర్శయన్తి రవేః ప్రభాః. 50

చిత్రం తరఙ్గవలనాసు సముల్లసన్తి
గన్ధర్వ కింనర నరామరనాగనార్యః
భూరిభ్రమైర్భ్రమరహారమివ ప్రహదిన్యః
పద్మిన్య ఏవ సకలామల జఙ్గమాఖ్యాః. 51

విద్యాధరీభుజలతా వలితేన్దుకాన్త
కక్ష్యావిభాగ మణిజాలగవాక్షలక్ష్మ్యః
దేవాసురోరగమహాగృహభిత్తిభాగాః
సౌవర్ణనౌగణవదమ్బుభరే భ్రమన్తి. 52

మత్తేభకుమ్భపరిణాహిని కుఙ్కుమాఙ్కే
శచ్యాః పయోధరభరే రతిఖేదఖిన్నః
లగ్నః సుఖాదివ కరోతి తరఙ్గదోలాః
నంశీర్యమాణమణి గేహగతోఽత్ర శక్రః. 53

హా వాన్తి వారివలనావలితాన్తరిక్ష
మృజావధూతకుసుమప్రకారాన్కిరన్తః
వాతాః పతద్విబుధమన్దిరరత్నసానా
వుద్యానకోటరగతా ఇవ సాక్షతేన. 54

యన్త్రోత్థహేమదృషదాసదృశామ్బురూపం
క్షుబ్ధాద్రిభీమజలవీచి శిఖేరితం ఖే
వ్యావర్తతే దివి దలావృతకర్ణికాన్త
ధ్యాసైకనిష్ఠపరమేష్ఠిసరోజమేతత్. 55

ప్రాతఃకాలమున సూర్యకాంతులెట్లు జలమున వికసితకమలములను దర్శింపజేయు చున్నవో, అట్లే గృహములున్ను నాల్గుగఁబగిలిన తమ గోడలతోటి జలమున నట్టి ప్రకటితమైన యాశయముయొక్క శోభనే దర్శింపజేయుచున్నవి. అహా! గంధర్వ, కిన్నర, మనుష్య, దేవతా, నాగజాతులయొక్క స్త్రీ పురుషులున్ను. నిర్మలురగు తదితర సమస్త జంగమజాతిజీవులున్ను, అధిక భ్రమణయుక్తములగు ఆవర్తములతోఁగూడినవారును, పుష్పపరాగముచే శ్వేతవర్ణయుతములైన తుమ్మెదల సమూహమను హారమును ధరించియున్నవారునునైయుండి, ముఖహస్తపాదాదులను బద్మములతోఁగూడిన నదులఁబోలుచు. ఆ ప్రళయసముద్రతరంగ క్రీడలందు విచిత్రముగ భాసిల్లు చున్నారు! మఱియు విద్యాధర స్త్రీలయొక్క భుజములను లతలచేఁ జుట్టఁబడిన చంద్రకాంతమణు లందు వర్గవిభాగములవలె భాసించు మణిసమూహరచిత గవాక్షము (కిటికీ)ల శోభతోఁగూడిన దేవ, అసుర, నాగుల మహాగృహములయొక్క భిత్తి (గోడ) భాగములు ఆ ప్రళయసముద్ర జలప్రవాహ ములందు సువర్ణ నౌకా సమూహమువలెఁ దిరుగాడుచున్నవి! భగ్నమగుచున్న మణిరచితగృహ మును బొందిన యింద్రుఁడే ప్రళయకాలజల ప్రవాహమునఁ దగుల్కొని కుంకుముచే చిహ్నిత మైనదియు, మదపుటేనుగుయొక్క గండస్థలమువలె విశాలమైనదియునగు శచీదేవియొక్క స్తన

మండలముపై రతిఖేదముచే శ్రమనొంది తత్ఖేదనివారణము కొరకై జలక్రీడాసుఖాభిలాషచే తరంగములం దూఁగులాడుచున్నాఁడు! అహో! జలముయొక్క వేష్టనములచే నాకాశమును వ్యాప్తమొనర్చి నక్షత్రములను నట్టి కంపితపుష్పములను వెదచల్లుచున్న వాయువులు, పడుచున్న విమానములు గల మేరుపర్వతముయొక్క యుద్యానవనమునఁ బ్రవేశించినవై, మంగళముకొఱకై అక్షతలతో గూడిన పుష్పములను వర్షింపఁజేయు జనులబోలి వీచుచున్నవి! ఆకాశమున సంక్షోభమొందిన పర్వతములవలె భయంకరములైన తరంగములయొక్క శిఖలచేఁ బ్రేరితమైనదియు, యంత్రముచే విసరఁబడిన సువర్ణశిలవంటిదియునగు ఈ జలముయొక్క రూపము బ్రహ్మలోకమున పత్రములచే నావృతమగు కర్ణిక (తామరదుద్దు) యందున్న ధ్యానైకనిష్ఠుఁడగు బ్రహ్మదేవునియొక్క యాసనభూతమగు కమలమువఱకును నేగి తిరిగివచ్చుచున్నది!

మేఘా ఇవాతిఘనఘుంఘుమఘోషభీమా
వీచీచయాః కనకపత్తనవిద్యుతోఽమీ
వ్యోమ్ని భ్రమన్తి గజవాజిమృగేన్ద్రనాగ
వృక్షాద్రి కాననమహీతల తుల్యదేహాః. 56

ఉహ్యమానోద భూవీచ్యామతసీ కుసుమశ్రియామ్
యమోఽవ్యయం యమేనేవ వారిపూరేణ నీయతే. 57

ఏతే త్రుటన్తి నలితేఽఖిలలోకపాలా
నాగా నగైశ్చ నగరైః సహ లక్షసంఖ్యాః
లక్ష్మ్యైకరోదర గుహాగత వారిపూర
వ్యావర్తనాగుడగుడై రఖిలక్ష్యపూరాః. 58

దుర్వారవారివలనాపరిపూరితేషు
పాతాల భూతల నభస్తలదిక్తటేషు
మత్స్యా ఇవేన్ద్రయమయక్ష సురాసురౌఘాః
సగ్రామపత్తనవిమాననగా భ్రమన్తి. 59

మహాగంభీరములైన ఘుంఘుమశబ్దములచే భయంకరములైనవియు, సువర్ణమయములైన దేవాసురుల పట్టణములను మెఱపులుగలవియు, గజ, అశ్వ, సింహ, నాగ, వృక్ష, పర్వత, వన, భూతలములవలె విశాలదేహములను ధరించినవియునగు ఈ తరంగసమూహము లాకసమున మేఘములవలె పరిభ్రమించుచున్నవి! అతసీ (అగిసె) పుష్పమువంటి శోభనుధరించి ప్రవహించుచున్న ప్రళయసముద్ర తరంగమందు ఈ యముఁడున్ను మఱియొక యమునిచే గొనిపోఁబడుచున్నట్లు కానుపించుచున్నాఁడు! ధనమునకు స్థానభూతములైనట్టి పర్వతగుహలందుఁ బ్రవేశించిన జలప్రవాహముయొక్క నిర్గమనముకొఱకై బయలుదేఱిన వాయువుయొక్క 'గుడగుడ' శబ్దములచే నెఱుఁగఁబడిన జలపూరణముగలవారై సమస్తలోకపాలురున్ను, నాగులున్ను తమయాశ్రయములగు మేర్వాదిపర్వతములతోడను, నగరములతోడను గూడ మునుఁగుచున్నారు! నివారింపశక్యముకాని జలప్రవాహములచే పాతాళ, భూతల, ఆకాశ, దిక్తటములు పరిపూర్ణములుకాఁగా ఇంద్ర, యమ, సుర, అసురసమూహములు గ్రామ, పట్టణ, విమాన, పర్వతములతో సహా యా జలమందు మత్స్యములవలెఁ దిరుగాడుచున్నారు.

ఉహ్యామానస్య కృష్ణస్య తనురేవామ్బురూపిణీ
మాతృజఙ్ఘేవ వత్సస్య కష్టం బన్ధనతాం గతా. 60

అన్యోన్యమావలయతామహో బుడబుడారవః
శ్రూయతే దేవదైత్యానాం స్వస్త్రీహలహలాకులః 61

కోలాహలాకులపురోత్తమ వేగపాత
విక్షుబ్ధవారిపటలీ పలితామ్బరాసు
దిక్షు భ్రమజ్జలదజాల ఘనాస్వివైష
సంలక్ష్యతే జలమయః స్ఫుటకుడ్యబన్ధః. 62

హా కష్టమేష తరసా పయసాపనీత
ఆవర్తవృత్తిపరివర్తనయా స్వధస్తాత్
ఏతే కుబేరయమ నారదవాసవాద్యాః
ప్రాణాన్పయోభ్రపటలైర్విధురాస్త్యజన్తి. 63

అయ్యో! ఎంత కష్టకరమైన విషయము! దోహనకాలమున గోమాతయొక్క జంఘ (పిక్క) యే వత్సము బంధనరూపత్వమును బొందునట్లు, శ్రీ కృష్ణభగవానుని జలరూపమగు శరీరమే యాతనిని గొట్టుకొనిపోవుటయందు కారణత్వమును బొందెను. అయ్యో! పరస్పర మావరించుకొనుచునుండు సురాసురుల మునుకలయొక్క యీ 'బుడబుడ' ధ్వని వారికిఁగాని, వారి స్త్రీలకుఁగాని 'హలహలా' శబ్దముచే (ఆర్తనాదములచే) బూర్ణమైనట్లు వినిపించుచున్నది! కోలాహలములచేఁ బూర్ణములైన దేవ అసురుల యుత్తమ నగరముల వేగమువలన పతనములద్వారా సంక్షోభమొందిన జలసమూహములచే వ్యాప్తములైన దిగంతరాళములందు ఈ ప్రత్యక్షమైన జలమయమగు గృహము, సంచరించుచున్న ఘనీభూతములగు మేఘజాలములందువలె భాసించుచున్నది. అయ్యో! యెట్టి ఖేదకరమగు విషయము! ఈ ప్రసిద్ధుఁడగుసూర్యభగవానుఁడున్ను మేఘయుక్తమగు జలముయొక్క యావర్తనముల పరివర్తనముచే సంపూర్ణముగ నధోభాగమునకుఁ బొందింపఁబడిన వాఁడాయెను. మఱియు జలరూపములగు మేఘసమూహములచే బాధితులై యీ కుబేర, యమ, నారద, ఇంద్రాదిదేవతలు తమ ప్రాణములఁ ద్యజించుచున్నారు.

ప్రాజ్ఞాః ప్రశాన్తజడదేహమిహోహ్యమానం
మానోజ్ఝితాః శవతయైవ చ తద్వహన్తి
బ్రహ్మేన్ద్ర విష్ణుపురఖణ్డకసంకటామ్బు
సంఘట్టనేన కటుకుట్టనదృష్టు తేన. 64

బ్రహ్మ విష్ణు ఇంద్రాదుల నగరములయొక్క ఖండములచే వ్యాప్తమైనట్టి జలముయొక్క సంఘర్షణముచే జనించిన కటు ఛేదనమును గాంచుచున్నవారిలో ఏ తత్త్వజ్ఞానులు గలరో, వారు నిజ దేహములందు ఆత్మాభిమానము లేనివారై, ఆ తమ దేహములను మృతసదృశములుగను, జడములుగను నెంచి జలమున శవములవలెఁ గొట్టుకొనిపోవుచున్నారు. ఇక్కారణముననే వారు ఛేదన, భేదనాది దుఃఖములచే నేమియు నంటబడకయున్నారు.

స్త్రీణాం గణోఽర్ధపరిపిష్ట ఇహైతి కష్టం
క స్త్రాతుమేనమపరః కుజడం సమర్థః
నహ్యా న్తకస్య దశ నై రఖిచర్వ్యమాణా
త్రాతుం పరస్పర మియం జనతా సమర్థా. 65

అయ్యో! కష్టతరమైన విషయము! పృథివియందు అతి మూర్ఖత్వరూపమున ప్రసిద్ధమగు ఈ అర్ధచూర్ణితమైన స్త్రీసమూహమిటఁ గొట్టుకొనిపోవుచున్నది! ఇద్దానిని రక్షించుటయం దెవఁడును సమర్థుఁడుకాఁడు. ఏలయనిన యమునియొక్క దంతములచే బాగుగ నమలబడుచున్న యీ జనసమూహ మిపుడు పరస్పరము రక్షించుకొనుటయందు సమర్థము కానేరదు.

పర్వతప్రతిఘసర్పసర్పణాః సంసర న్తి విపులా జలోచ్ఛ్రయాః
తేషు నావ ఇవ దేవప త్తనాన్యున్నమయ్య వపురాశు యా న్త్యధః. 66

పర్వతములనుగూడ ఛేదించివేయునవియు, సర్పమువలె కుటిలగతి గలవియునగు ఈ విశాల జలతరంగము లతివేగముతోటి జనుచున్నవి. అందు దేవతల పట్టణములు మొట్మొదట నౌకలవలెఁ దమ దేహములను బైకెత్తినవై అనంతరము శీఘ్రముగ నధోభాగమునకుఁ బోవుచున్నవి.

ద్వీపాద్రీన్ద్ర సురాసురోరగనరై ర్నాగాప్సరశ్చారణై
ర్వ్యా ప్తం వారివిలోలితైః సరసిజై రాలూనమూలై రివ
ఏకామ్భోధిసరఃస్థితం త్రిభువనం కాలేన నిర్మూలితం
కష్టం తే క్వ గతా మహర్ద్ధి విభవా దేవా జగన్నాయకాః. 67

ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతో క్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే ఉ త్తరార్ధే అవి॥ విప॥ శవో॥ జగన్నాశవర్ణనం నామ ఏకోనచత్వారింశదధికశతతమః సర్గః ॥ 139 ॥

ఈ త్రైలోక్యము కాలముచే నిర్మూలితమైఁ జలముచే దొరలింపఁబడిన ద్వీప, పర్వత సుర, అసుర, మనుష్య, నాగ, గజ, అప్సరా, చారణులచే ఛిన్నమూలములగు కమలములచేవలెవ్యాప్తమై ఏకమగు ప్రళయకాల మహాసముద్రమను సరస్సును బోలియున్నది. అయ్యో! దుఃఖకరమైన విషయము! మహదైశ్వర్యసంపన్నులగు జగన్నాయకులైన యింద్రాది దేవతలిపుఁడు ఎచటికేగిరి!

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున నుత్తరార్ధమున అవి॥ విప॥ శవో॥ జగన్నాశవర్ణనమను నూటముప్పదితొమ్మిదవ సర్గము ॥139॥

---

## చత్వారింశదధికశతతమః సర్గః

[ ప్రలయాబ్ధేరపగమో గ్రామే ద్విజతయా స్థితిః
ము నేః ప్రాణితనోర్బాహ్యనిర్గమాద్యత్ర వర్ణ్యతే.

ప్రళయసముద్రముయొక్క వినాశము, గ్రామమున బ్రాహ్మణరూపముతోటి స్థితి ఆ ప్రాణి శరీరముం విడి ముని బయట కేతెంచుట మున్నగు విషయము లిచట వర్ణింపఁబడుచున్నవి.]

వ్యాధ ఉవాచ :—

భగవంస్త్వాదృశస్తాంతామవస్థాం చ కథం గతః
కథం ధ్యానప్రయోగేణ తదా నోపశమం గతః. 1

వ్యాధుఁడు:— మహాత్మా! తమవంటి జ్ఞానయోగసిద్ధులున్ను ఆ యా మహాకష్టప్రదము లగు జలప్రళయమునుగూర్చిన వివిధభ్రాంతిరూపములైన అవస్థల నేలపొందిరి? ధ్యానయోగము ద్వారా అపుడు సర్వభ్రాంతియొక్క యుపశమమును నేలపొందక యుంటిరి?

మునిరువాచ:—

కల్పాన్తేషు వినశ్యన్తి నాశైర్నానావిధాత్మభిః
జగన్తి భ్రాన్తిరూపాణి నభస్యాభాసరూపిభిః. 2

మునిః— ఓ వ్యాధుఁడా! ఆకాశమున అభాసరూపములేయగు వివిధ ప్రకారములైన నాశములవలన కల్పాంతమున ఈ భ్రాంతిరూపములైన జగత్తులన్నియు నశించును.

కదాచిత్క్రమశో నాశః కల్పాన్తే సంప్రవర్తతే
అశఙ్కితం కదాచిద్ద్రాగేకధాదివికారతః. 3

కల్పాంతమున జగన్నాశమొకపుడు క్రమముగ సంభవించును. మఱియొకపుడు సప్త సముద్రము లేకమగుట మున్నగు వికారములతోటి ఆకస్మికముగ నేకకాలముననే యట్టి నాశము సంభవించును. (ఇక్కారణమున, క్రమముగ ప్రళయము సంభవించుచో భూతభవిష్యద్విచారము నకు సమయము లభించును. ఆకస్మికముగ సంభవించుచో లభించదు. కాఁబట్టి, అవకాశము లభింపమి నేను విచారించలేదు.)

తదా ద్రాగిత్యేవ యదా వికృతం వారి తతస్తథా
తేన యావత్పరస్త్యాద్యం తావన్నీతా జలైః సురాః. 4

ఆ ప్రళయమెంత శీఘ్రముగను, ఆకస్మికముగను సంభవించెననఁగా దేవతలు బ్రహ్మ దేవుని ప్రార్థించుటకై పోవుచుండ నింతలో జలప్రవాహముచే వారు కొట్టుకొని పోయిరి. (ఇట్లు, దేవతలకే పూర్వాపర విచారణకు, ధ్యానమునకు నవకాశములేకయుండ నిఁక మావంటివారివిష యమై వేఱు చెప్పవలెనా?)

అన్యచ్చ విపినాధీశ కాలః సర్వంకషో హ్యయమ్
యత్ర కాలే తతః తస్మింస్త్వవశ్యంభావి తత్తథా. 5

ఇంకను, ఓ వ్యాధుఁడా! ఈ కాలము సమస్తమును నశింపఁజేయునదై యున్నది. ఏకాలమున ఏవిషయ మేప్రకారముగ అవశ్యము జరుగనున్నదో, అది యాకాలమునఁదప్పక ఆ ప్రకారమే జరిగితీరును.

బలం బుద్ధిశ్చ తేజశ్చ క్షయకాల ఉపస్థితే
విపర్యస్యతి సర్వత్ర సర్వథా మహతామపి. 6

వినాశకాలమేతెంచ, మహాత్ములయొక్కయు బల, బుద్ధి, తేజములు సర్వత్ర సర్వథా విపరీత భావమును బొందును.

అన్యచ్చ విపినాధీశ మయైత త్తవ వర్ణితమ్
స్వప్నదృష్టం కిల స్వప్నే కిం న సంభవతీహ కిమ్. 7

ఇంకను, ఓ వ్యాధుఁడా! నీకిపుడు వర్ణించి చెప్పినదంతయు మఱియొకని చిత్తము ననుసరించి యాతని స్వప్నమున నాచేఁగాంచఁబడిన వృత్తాంతమైయున్నది. మఱియు నిట, స్వప్నమున సంభవింపనిదేది కలదు?

**వ్యాధ ఉవాచ :—**

అసదేతద్యది విభో స్వప్నసంభ్రమమాత్రకమ్
కథితేన తదై తేన కోఽర్థః కల్యాణకోవిద. 8

వ్యాధుఁడు:— శుభము నెఱుఁగు వారిలో నుత్తముఁడవగు నో ప్రభూ! ఈ వర్ణించి చెప్పినదంతయు అసత్తున్ను, స్వప్నభ్రమ మాత్రకమున్నునైనచో, ఇట్టి యనర్థకమైన దానిని నాకు వచించుటవలన నేమి ప్రయోజనము?

**మునిరువాచ:—**

త్వద్బోధనాత్మకం కార్యం మహద స్త్యత్ర బుద్ధిమన్
ఏతద్దృశ్యాత్మకం వేత్తి భవాన్సత్యం తు మే శృణు. 9

ముని:— ఓ బుద్ధిమంతుఁడా! ఇది అసత్తైనప్పటికిని దీనియందు త్వద్బోధనాత్మకమైనదియు, మోక్షప్రదమైనదియునగు గొప్పప్రయోజనము కలదు. ఏలయనిన, ఈ దృష్టాంతముచే నీవీ దృశ్యమాత్రమగు ప్రపంచమునున్ను స్వప్నమువలె భ్రమాత్మకముగ నెఱుఁగఁగలవు, ఎపుడు దృశ్యమాత్రమును భ్రమరూపముగ నెఱుఁగుదువో, అపుడు దృక్ - రూపుఁడవగు సత్యమైన నీవే శేషింతువు. కావున నిపుడీ కథాశేషమునుగూడ వినుము.

అన న్తరమహం తస్మిన్మత్తైకార్ణవరంహసి
జన్తోరోజః స్థితః స్వప్నే భ్రా న్తం భ్రాన్తో వ్యలోకయమ్. 10
యావత్ప్రసకలం వారి క్వాపి నిర్గస్తముద్యతమ్
విక్షుబ్ధవజ్రవిత్ర స్తసపక్షాద్రీన్ద్రవృన్దవత్. 11

అనంతరము ఆ జీవుని హృదయ తేజమందున్న నేను, ఆ స్వప్నమందలి మదించిన ప్రళయ మహాసముద్రముయొక్క వేగమునఁ దిరుగాడుచు, ఇంద్రుని వజ్రాయుధముచే బాధితమై సంక్షోభము చెందినట్టి ఱెక్కలతోఁగూడిన మహాపర్వత సమూహమువలె ఆ యావర్తతరంగాది సహితమగు జలమంతయు నెచటికో బోవ నారంభింపనంతవఱకును ఆ భ్రాంతిని జూచుచునే యుంటిని.

లబ్ధవానుహ్యమానోఽహం కంచిద్దైవవశా త్తటమ్
అవసం తమవష్టభ్య శిఖరప్రా ప్తసంనిభమ్. 12

ఆ జలమునఁ గొట్టుకొనిపోవుచున్న నేను శిఖరప్రాంతమువంటి యొకానొక తీరమును దైవ సంయోగముచేఁ బొందినవాఁడనై యద్దాని నాశ్రయించి యచటనే యుంటిని.

అథ క్షణేన సలిలం తదశేషేణ నిర్యయౌ
వీచ్యగ్రస్ఫుటితాకారైర్దేవైస్తారకితామ్బరమ్. 13
తారాగణైశ్చ పాతాలగతైర్మణిమయోదరమ్
ఆవర్తేషు పరావృత్తైః స్ఫారమద్రిరజస్తృణైః. 14
హేమద్వీపోపమైర్వ్యాప్తం గీర్వాణపురమన్దిరైః
భ్రమత్సురాఙ్గనాలీననలినీజాలమాలితమ్. 15
మధ్యోహ్యమానకాలాభ్రనీలశైవాలజాలకమ్
విద్యుద్గోరోచనామోదనీలనీరజనిర్భరమ్. 16
స్ఫురత్పికరనీహారమేఘాద్రికృతదిక్తటమ్
ఉల్లోలద్వీచిసందిగ్ధవహత్కల్పద్రుమవ్రజమ్. 17

తదుపరి తరంగాగ్రములందు విస్పష్టములైన యాకృతులుగల దేవతలచే నాకాశమును నక్షత్రసంయుతముగ గావించునదియు, పాతాళమును బొందిన నక్షత్రసమూహములచే మణిమయముగ వెలయునదియు, ఆవర్తములందుఁ దిరుగు పర్వతములను శిథిల తృణములచేఁ బూర్ణమైనదియు, సువర్ణ ద్వీపములవంటి దేవతల పురములచేతను, మందిరములచేతను వ్యాప్తమై, పరిభ్రమించుచున్న దేవస్త్రీలను కమల సమూహముచే శోభితమైనదియు, మధ్యభాగమునఁ గొట్టుకొనిపోవుచున్న ప్రళయ మేఘములను నల్లని నాచుతోఁ గూడినదియు, మెఱపులను గోరోచనమువంటి పరాగములతోఁ గూడిన మేఘములను నీలకమలములచేఁ బూర్ణమైనదియు చంచల హిమకణ, మేఘ, పర్వతములచే దిక్కులందు తీరమును నిర్మించునదియు, చంచల తరంగములందు సందిగ్ధముగఁ గొట్టుకొనిపోవుచున్న కల్పవృక్ష సమూహము గలదియునగు ఆ జలమంతయు క్షణకాలములో నెచటికో పోయెను.

అథైకార్ణవఖాతోఽనాపథవప్పుష్కకోటరః
క్వచిద్గలితసహ్యాదిః క్వచిత్ప్రాంశీకమన్దరః. 18
క్వచిత్పఙ్కనిమగ్నేన్దుయమవాసవశక్రకః
క్వచిత్పఙ్కనిమగ్నార్కశాఖికల్పద్రుమోత్కరః. 19
క్వచిత్కవలవత్కీర్ణలోకపాలశిరఃకరః
క్వచిత్పఙ్కజవిశ్రాన్తరుధిరహ్రదపాటలః. 20
క్వచిత్పాకిణ్డనిర్యద్గక్వాణద్వ్యాధరీగణః
క్వచిత్ప్రపన్నమృతేభాభయామ్యోగ్రమహిషావృతః. 21
క్వచిత్ప్రసన్నమహాకాయగరుడామర పర్వతః
క్వచిత్కృత్తమహాసేతుర్వ్యుమదణ్డేన భూజుషా. 22

క్వచిత్ప్రమృతవైరిఞ్చహంసనస్మితపఙ్కభూః
క్వచిత్పఙ్కవినిర్మగ్నదేహార్ధామరవారణః. 23

అటుపిమ్మట, ఆ మహాసముద్రమను కందకము శుష్కకోటరము గలదియు, ఒకచోటఁ బడిపోయిన సహ్యపర్వతముతోఁ గూడినదియు, శిథిలమగుటవలన రూపాంతరమును బొందిన మందరపర్వత మొకచోటఁ గల్గియున్నదియు, ఒకచోట పంకమందు నిమగ్నులైయున్నట్టి చంద్ర, యమ, ఇంద్ర, శేషులు గలదియు, మఱియొకచోట పంకముయొక్క యధోభాగమున నిమగ్నులై యున్న శాఖాయుక్తములగు కల్పవృక్ష సమూహములతోఁ గూడియున్నదియు, ఒకచోట కమలములవలె వ్యాప్తములైయున్న లోకపాలుర శిరస్సులున్ను, హస్తపాదాదులున్ను గల్గియున్నదియు, ఒకచోట కమలమువలె విశ్రాంతి నొందియున్న రక్తపు మడుగులచే రక్తవర్ణయుక్తముగానున్నదియు, ఒకచోట కంఠమువఱకుమునిఁగి యేడ్చుచున్నట్టి విద్యాధరస్త్రీ సమూహముగలదియు, ఒకచోట స్వప్నమందువలె మృతినొందిన గజాకారములగు యముని వాహనములైన భయంకర మహిషము (దున్న) లతోగూడియున్నదియు, ఒకచోట హీనస్థితిఁబొందిన మహాశరీరధారియగు గరుత్మంతుని వంటి యాకారముగల దేవతలపర్వతము గల్గియున్నదియు, ఒకచోట భూమిపైఁబడిన యమదండ మను - జలమును నిరోధింప నసమర్థమగు - గొప్పసేతువు (కట్ట) గలదియు, ఒకచోట బ్రహ్మదేవునియొక్క మరణించిన హంసయను నొకింత హాస్యయుక్తమగు పంకసహిత భూతలము గల్గి యున్నదియు, ఒకచోట బురదయందు సగము కూరుకొనియున్న 'ఐరావత' గజముతోఁ గూడి యున్నదియునై యొప్పుచుండెను.

ఏతస్మిన్నన్తరే తత్ర సానుం ప్రాప్యాశ్రమే శ్రమాత్
విశ్రాన్తోస్మి యదా తేన భృశం నిద్రాజగామ మామ్. 24

అయ్యవసరమున నే నచట పర్వతశిఖరముపైనున్న యొకానొక మున్యాశ్రమమును బొంది, శ్రమవలన నట విశ్రాంతినొందుచుండ నింతలో నాకు గాఢనిద్రవచ్చెను.

తతః సుషుప్తనిద్రాన్తస్తయా వాసనయాన్వితః
తం తాదృగేవ కల్పాన్తమపశ్యం సౌజని స్థితః. 25
దృష్ట్వా తద్ద్విగుణం దుఃఖం చిరేణాత్తాహమాకులః
ప్రబుద్ధో దృష్టవాన్సానుం తమేవాస్య హృది స్థితమ్. 26

అటుతరువాత సుషుప్తియొక్క యంతమున నట్టివాసనతోనే కూడియుండుటఁబట్టి నే నాప్రాణితేజమునఁ గాంచిన ప్రళయమును బోలినట్టి ప్రళయమునే స్వహృదయమందలి తేజమున నున్నవాఁడనై గాంచితిని. అద్దానిఁగాంచుటచే నాకు రెండింతలు దుఃఖముకలిగెను. కావున, చిరకాలము వ్యాకులత్వముతోఁగూడియుంటిని. పిమ్మట, బాగుగ మేల్కొనిన పిదప మరల యా ప్రాణియొక్క హృదయముననున్న యా పర్వతశిఖరమునే గాంచితిని,

అథ తత్ర ద్వితీయేఽహ్ని భాస్కరోదయసున్దరమ్
సలోకాకాశభూశైలం భువనం దృష్టవానహమ్. 27
ద్యౌః క్ష్మా వాయురాకాశం పర్వతాః సరితో దిశః

ఇతి మే చేతసో జాతం తత్రాదివిటపాదివ. 28

తత్ర తస్మింస్తథా దృష్టే భూతలే తైః పదార్థకైః
వ్యవహారం ప్రవృత్తోఽహం కించిద్విస్మృతధీస్తతః. 29

అటుపిమ్మట ముఱునాఁడు సూర్యోదయముచే ప్రకాశమైనట్టి లోక, ఆకాశ, పృథివి, వర్వతాది సహితమగు ప్రపంచమును వీక్షించితిని. అత్తఱి, ఆ జనించిన వృక్షపుష్పాదులవలె, అంతరిక్షపృథివి, వాయు, ఆకాశ, పర్వత, నదీ, దిశలన్నియు నా మనస్సునుండియే సమ్ముఖమున జనించినవాయెను. అట్లాప్రకారమగు భూతలమును వీక్షించిన పిదప, పూర్వానుభూత విషయములం దొకింత విస్మృతబుద్ధి గలవాఁడనై నేనాపదార్థములతోటి వ్యవహారమాచరించుటకుఁ బ్రవృత్తుఁడనైతిని.

జాతస్య మేఽద్య వర్షాణి షోడశైష పితామమ
ఇయం మాతాస్వపం చేదమితి మే ప్రతిమోదభూత్. 30

అపశ్యం గ్రామకం కంచిత్కంచిచ్చ బ్రాహ్మణాశ్రమమ్
కించిద్గేహం తథా కశ్చిత్సమ్బన్ధుః కస్మింశ్చిదాశ్రమే. 31

అథ మే తిష్ఠతఃసార్ధం బన్ధుభిర్గ్రామమన్దిరే
అహోరాత్రేషు గచ్ఛత్సు జాగ్రదాదీంస్తదేవసత్. 32

'నేను బుట్టినేటికిఁ బదునాఱు వత్సరములాయెను. ఈతఁడు నా తండ్రి; ఈమె నా తల్లి, ఇది నా గృహము' - అను నీప్రకారమగు బుద్ధి నాకపుడు జనించెను. అచ్చోట నేనొక చిన్నగ్రామమునున్ను, ఒకానొక బ్రాహ్మణాశ్రమమునున్ను జూచితిని. ఆ ప్రదేశమున నొకానొక కుటీరము నా గృహముగను, ఒకానొకఁడు నా బంధువుగనునాయెను. అటుపిమ్మట ఆ గ్రామ గృహమున బంధువులతో సహవసించుచు జాగ్రదాద్యవస్థల ననుభవించుచునుండ నాకురాత్రిందినములు గడచిపోయెను. ఆ గ్రామ, గృహాదులన్నియు నాకపుడు సత్యములుగనే తోచెను.

తతః కాలవశాత్తత్ర ప్రాక్తనీ బోధధీర్మమ
విస్మృతా తాదృశాభ్యాసాదహో తస్యేవ మత్స్యతా. 33

అనంతరము కాలక్రమమున, అట్టి అవిద్యాజన్యములగు విషయములయొక్క యభ్యాసముచే నా యొక్క పూర్వకాలపు వివేకబుద్ధి మఱుపుఁబడెను. ఆహా! అపుడు నా స్థితి, 'దామవ్యాళకటోపాఖ్యాన'మందలి, కటుని స్థితివంటిదాయెను. ఎలయనిన, కటుఁడు వాసనా రహితుఁడైనను మత్స్యముతోటి సహవాసముయొక్క యభ్యాసముచేఁ దనపూర్వపుబోధ మఱచుటవలన మత్స్యరూపమును బొందినట్లు నేనాగ్రామ నివాసత్వమును బొందితిని.

ఇత్యహం గ్రామవాస్తవ్యః సంపన్నో బ్రాహ్మణస్తదా
దేహమాత్రకబద్ధాస్థో దూరీకృతవివేకభూః. 34

శరీరమాత్రాత్మవపుర్దారమాత్రానురఞ్జితః
వాసనామాత్రసారాత్మా ధనమాత్రైకతత్పరః. 35

జీర్ణగోమాత్రకధనః సంరోపితలతావృతిః

సంచితాగ్న్యవనిప్రాణి రుపార్జితకమణ్డలుః. 36

చలవృక్షకబద్ధాస్థో లోకాచారరతః సదా
గృహపార్శ్వగతానీలశాద్వలస్థలికాస్థితిః. 37

శాకశాకాయతారామరచనానీత వాసరః
సరిద్ధ్రదనదీతీర్థసరసి స్నానతత్పరః. 38

గోమయాన్నజలామ్బ్వగ్నికాష్ఠేష్టా కష్ట సంచయీ
ఇదం కార్యమిదం నేతి పాశాభ్యాం వివశీకృతః. 39

ఈ ప్రకారముగ నేను వివేకరహితుఁడను, కేవలము దేహమాత్రమున నాసక్తిగల వాఁడను శరీరమాత్రమున ఆత్మబుద్ధిగలవాఁడను. పత్నీమాత్రముచే సంతోషపడువాఁడను, కేవలము వాసనామాత్రస్వభావయుతుఁడను. ధనమాత్రమును సంపాదించుటయందే తత్పరుఁడను, శుష్కించిన గోవులు మాత్రమే ధనముగఁ గలవాఁడను, గృహాంగణమున లతాదులను నాటు వాఁడను, అగ్ని, భూమి, పశువులు మున్నగువానిని గూడఁబెట్టికొనువాఁడను, కమండలువును సంపాదించుకొనినవాఁడను, అల్పకాలము జీవించునట్టి వృక్షములం దాసక్తిగలవాఁడను, సదా లోకాచారతత్పరుఁడను, గృహసమీపమునగల పచ్చనిగడ్డితోఁగూడిన స్థలములం దుండువాఁడను, శాకాదులచేఁ బూర్ణములైనట్టి విశాల వాటికాదులయొక్క రచనయందు దినముల గడుపువాఁడను, నదీ, నద, హ్రద (అల్పజలాశయము) తీర్థ సరోవరాదులందు స్నానమొనర్చుటయందుఁ దత్పరుఁడను, గోమయ, అన్న, జల అగ్ని, ఇష్టక (ఇటిక), కాష్ఠాదులను కష్టముతో సమకూర్చుకొను వాఁడను, 'ఇది చేయఁదగినది, ఇది చేయఁదగనిది' అను పాశముల రెంటిచే పరవశుఁడైనవాఁడను నగు గ్రామనివాసియైన బ్రాహ్మణుఁడనైతిని.

ఇతి మే జీవిత స్తత్ర సంవత్సరశతం గతమ్
ఏకదాభ్యాగతో దూరాత్తాపసోఽతిథిరాత్మవాన్. 40

ఈ ప్రకారముగ నట నా జీవితముయొక్క నూఱుసంవత్సరములు గడచిపోయెను. అనంతర మొకనాఁడొక తపస్వియు, ఆత్మజ్ఞుఁడునగు అతిథి చాలదూరమునుండి మాగృహమున కేతెంచెను.

పూజితోఽసౌ విశశ్రామ మద్గృహే స్నానపూర్వకమ్
భుక్తవాఞ్ఛయనే స్థిత్వా రాత్రౌ వర్ణితవాన్కథామ్. 41

అతిథిసత్కారముచేఁ బూజితుఁడైన యాతఁడు స్నానసంధ్యాదులను నిర్వర్తించుకొనిన పిదప మాగృహముననే విశ్రమించెను. అనంతరము భోజనముగావించి రాత్రి శయ్యపై, గూరు చుండి ఆత్మజ్ఞానకథను వర్ణింపఁదొడఁగెను.

నానాదిగ్దేశశైలోర్వీవ్యవహారమనోహరే
కథాప్రసఙ్గే కస్మింశ్చిన్నానావిధరసాశ్రయే. 42

సర్వం చిన్మాత్రమేవేదమనన్తమవికారి చ
జగత్తయేవ కచతి యథాస్థితమపి స్థితమ్. 43

నానావిధదేశ, పర్వత, పృథివ్యాదుల వ్యవహారములచే మనోహరమై, కావ్యాది వివిధ సములచేఁ బరిపూర్ణమైనట్టి యొకానొకకథయొక్క ప్రసంగమున నాతఁడు 'ఈజగద్రూపముతో తి భాసించునది యంతయు యథారీతి స్థితిగల్గియున్నదై, వికారరహితమై, అనంతమైనట్టి చిన్మాత్ర మగు బ్రహ్మమే, అని నాకు బోధించెను.

ఇత్యహం బోధితస్తేన బోధైకఘనతాం గతః
స్మృతవాంస్తమశేషేణ వృత్తాన్తం ధారణావశాత్. 44

ఈప్రకారముగ ఆ యతిథిచే బోధితుఁడనైన నేను దృఢబోధైకరూపత్వమును బొంది తిని. మఱియు ధారణావశముచే పూర్వకాలపు ప్రాణిప్రవేశాది వృత్తాంతమంతటిని స్మరించితిని.

స్మృతవానాత్మవృత్తాన్తం యస్యాహముదరే స్థితః
తం విరాడ్రూపమాశఙ్క్య తస్మాన్నిర్గన్తుముద్యతః. 45

ఆ ప్రకారముగ నా పూర్వకాలిక వృత్తాంతమునంతయు స్మరించినవాఁడనై, ఏప్రాణి యొక్క యుదరమున నేనుంటినో, అతనిని సర్వజగన్నిలయమగుటవలన విరాడ్రూపునిగ ననుమా నించి యాతనినుండి బయటకు వెడలుటకై ప్రయత్నించితిని.

తదాస్యం నిర్గమద్వారమథ జానామి నో యదా
విస్తీర్ణే భువనే యస్మిన్భూమ్యబ్ధ్యద్రినదీవృతే. 46
తదా తమత్యజన్నేవ దేశం బన్ధుజనావృతమ్
తస్య ప్రాణం ప్రవిష్టోఽహం నిర్గన్తుం పవనం బహిః. 47

ఆ ప్రాణియొక్క యుదరమున పృథివీ, సముద్ర, పర్వత, నద్యాదులచే ఆవృతమగు విశాలమైన బ్రహ్మాండమునఁ దిరుగాడుచు నేనద్దాని నిర్గమనద్వారమగు ఆతనిముఖమును నెపు డెఱుఁగఁజాలకుంటినో, అపుడు బంధుజనులచే ఆవృతమగు ఆ ప్రదేశమును త్యజించుచు బయట కేతెంచుటకై యాతని ప్రాణవాయువునందుఁ బ్రవేశించితిని.

ఇహస్థస్య విరాజోఽస్య బాహ్యమాభ్యన్తరం తథా
అన్యజం సర్వమీక్షేఽహమితి నిర్ణీయ తాదృశమ్. 48
ధారణాం సంవిదాం బద్ధ్వా ప్రదేశం స్వం తమత్యజమ్
తత్ప్రాణైః సహ నిర్యాత ఆమోదః కుసుమాదివ. 49

'ఇటనున్న విరాడ్రూపుఁడగు ఈ ప్రాణియొక్క బాహ్యమున మఱియొక విరాట్టుచే నుత్పన్నమైన అభ్యంతరము నంతయునుగూడ నేను గాంచెదను' అని యిట్లు నిశ్చయించి తదను కూలమగు ధారణను బంధించి యాతని హృదయప్రదేశమును వీడినవాఁడనై యాతనిప్రాణము (వాయువు) లతో సహా, పుష్పమునుండి సుగంధమువలె బయటకేతెంచితిని.

పవనస్కన్ధమాసాద్య ప్రాప్య తన్ముఖకోటరమ్
బహిర్వాతరథేనాహం నిర్గతో దృష్టవాన్పురః. 50

యావ త్తత్రైవ మద్దేహో బద్ధపద్మాసనః స్థితః
క్వాపి మున్యాశ్రమః శిష్యైః పాలితో గిరికన్దరే. 51

అట్లు, వాయుసమూహమను రథముపైనెక్కి యాతని ముఖకోటరమును బొందిన వాఁడనై యటనుండి బయటికేతెంచ, అచ్చోట నొకానొక పర్వత గుహయందు వర్తించుచున్న మున్యాశ్రమమున నా యావత్తు దేహమున్ను బూర్వమువలెనే పద్మాసనస్థమై శిష్యులచేఁ భావింపఁ బడుచునుండి యుండుటను నెదుటఁ గాంచితిని.

పురో మే తిష్ఠతాం తేషాం మత్సంరక్షణకర్మణామ్
ముహూర్తమాత్రం చ గతః కాలశ్చాన్తే నివాసినామ్. 52

మఱియు నాయెదుట నా సంరక్షణాది కార్యములందు, దత్పరులైయున్న శిష్యులందఱికిని నచటికొక ముహూర్తమాత్రకాలమే నా సమాధ్యనంతరము గడచినది.

హృదయం సంప్రవిష్టోఽసౌ యస్యాహం స పుమానపి
పృష్ఠేనోత్సవలబ్ధేన శేతే తృప్తోఽన్ధసా సుఖమ్. 53

ఏ ప్రాణియొక్క హృదయమున నేను బ్రవేశించితినో, ఆ పురుషుఁడున్న గ్రామమందలి యొకానొక యుత్సవమందు లభించిన మృష్టాన్నమును భుజించి తృప్తుఁడై వెల్లకిలగాఁ బరుండి సుఖముగ నిద్రించుచుండెను.

తదాశ్చర్యం మయా దృష్ట్వా నోక్తం కించ న కస్యచిత్
పున స్తస్యైవ హృదయం ప్రవిష్టః కౌతుకాదహం. 54

ప్రాప్తోఽస్మ్యాశు ప్రదేశం తం తస్య తస్మిన్హృదన్తరే
అవేక్షితుం స్వబన్ధూంస్తాన్వ్యాప్తో వాసనయా తయా. 55

ఆ యాశ్చర్యమయమైన వృత్తాంతమును జూచి నేనద్దాని నెవనికిని నేమియుఁ జెప్పకయే యుంటిని. మరల కౌతుకముచే నాతని హృదయముననే తిరిగి ప్రవేశించితిని. ఆ పూర్వపు బంధువులను జూచుటకొఱకై యట్టి వాసనలచే వ్యాప్తుఁడనైయున్న నేను, ఆ పూర్వానుభూతమగు తేజముతోఁగూడియున్న యా ప్రాణియొక్క హృదయానంతర ప్రదేశమును నపుడు బొందితిని.

యావ త్తత్ర యుగస్యాన్తః సంప్రవృత్తోఽతిదారుణః
భువనం తద్విపర్యాసమాగతం సహ సంస్థయా. 56

అట్లాతని హృదయమును బ్రవేశించగనే యింతలో నచట భయంకరమైన యుగాంతము ప్రవృత్తమయ్యెను, ధర్మాధర్మ వ్యవస్థతో సహ యిపుడచటి ప్రపంచమంతయు విపరీతదశను బొందినదాయెను.

అన్య ఏవాచలా స్తత్ర వసుధాన్యా చ సంస్థితా
అన్య ఏవ కకుబ్భేద స్తథాన్యా భువనస్థితిః. 57

తే బన్ధవః స చ గ్రామః స భూభాగః న దిక్తటః
న జానే క్వ గతం సర్వం వ్యూహ్యా నీతమివానిలైః. 58

తదా పశ్యామి భువనం యావదన్యదవస్థితమ్
అపూర్వసంనివేశం తజ్జగదన్యదివోదితమ్. 59

తపన్తి ద్వాదశాదిత్యాః ప్రజ్వలన్తి దిశో దశ
శీతాశ్యానామ్బువచ్ఛైలాః ప్రవృత్తాగలితుం బలాత్. 60

అద్రావద్రౌ దిశిదిశి జ్వలన్తి వనపఙ్క్తయః
దగ్ధాః స్మృతిపదం యాతాః సమస్తా రత్నభూతయః. 61

సర్వ ఏవాబ్ధయః శుష్కా మహావాతాః పురః స్థితాః
అఙ్గారరాశితాం యాతం భూమణ్డలమశేషతః. 62

పాతాలతో భూతలతోఽథ దిగ్భ్యో
జ్వాలా వినిర్గన్తుమనుప్రవృత్తాః
సంధ్యాభ్రవచ్చాశు బభూవ విశ్వం
జ్వాలామయం మణ్డలమేకమేవ. 63

అచట అన్యవిధములైన పర్వతములు, అన్యవిధమగు భూమి, అన్యములగు దిశలు, అన్యవిధమగు జగత్స్థితి వర్తించుచుండెను. ఆ నా పూర్వపు బంధువులు, ఆ గ్రామము, ఆ భూభాగము, ఆ దిక్తటము, అన్నియు వాయువుచేఁ జుట్టచుట్టఁబడి గొనిపోఁబడినవాయనునట్లు, ఎచటికో పోయినవి. అపుడు ప్రపంచమంతయు మఱియొక రూపముతోటి స్థితినొందియున్నట్లును, అపూర్వమైన నూతనరచనతోఁగూడి యుదయించినట్లును గాంచితిని. అత్తఱి ద్వాదశాదిత్యులు లోకమును తపింపఁజేయుచుండిరి; దశదిశలు మండుచుండెను; శీతలత్వముచే ఘనీభవించిన జలమువలె హిమాలయాదిపర్వతములు బలాత్కారముగ కరఁగనారంభించెను. ప్రతిపర్వతముపైనను, ప్రతిదిక్కునందును వనసమూహములు జ్వలించుచుండెను; రత్నభూతములగు పదార్థములన్నియు దగ్ధములై స్మృతిపదమును బొందెను; సముద్రములన్నియు నెండిపోయెను, ప్రచండవాయువు లెదుట వీవదొడఁగెను; వెయ్యేల, భూమండలమంతయు అగ్నిరాశియయ్యెను, మొదట, పాతాళమునుండియు, పిదప భూతములనుండియు, ఆ పిమ్మట దిక్కులనుండియు నగ్నిజ్వాలలు లేవసాగెను. తదుపరి విశ్వమంతయు శీఘ్రముగ నొకేజ్వాలామయమగు మండలమై సంధ్యాకాల మేఘమువలె రక్తవర్ణమయమై యొప్పెను.

జ్వాలామయే సద్మని హేమపద్మ
కోశే భ్రమద్భృఙ్గ ఇవ ప్రవిష్టః
తతోఽహమారాచ్ఛలభక్రమేణ
న చాప్తవాన్దాహవికారదుఃఖమ్. 64

అట్టి జ్వాలామయమైన గృహమున, సువర్ణకమలకోశమున - సంచరించు తుమ్మెదవలె నేను ప్రవేశించితిని. అట్టాయగ్నియందు మిడుతవలె నేను తగుల్కొనియున్నప్పటికిని మనోమయ(సూక్ష్మ) శరీరమాత్రమున నిశ్చయము గలిగియుండుటవలన, తద్దాహజనిత దుఃఖమును బొందకయేయుంటిని.

జ్వాలామయే సాధుమహామ్బువాహే భ్రమామ్యహం విద్యుదివానిలాత్మా
జ్వాలాపరిస్పన్దవిలోలవర్ష్మా స్థలాబ్జఖణ్డభ్రమరోపమశ్రీః. 65

యావత్తథైవ మద్దేహో బద్ధపద్మాసనః స్థితః
క్వాపి మున్యాశ్రమః శిష్యైః పాలితో గిరికన్దరే. 51

అట్లు, వాయుసమూహమను రథముపైనెక్కి యాతని ముఖకోటరమును బొందిన వాఁడనై యటనుండి బయటికేతెంచ, అచ్చోట నొకానొక పర్వత గుహయందు వర్తించుచున్న మున్యాశ్రమమున నా యావత్తు దేహమున్ను బూర్వమువలెనే పద్మాసనస్థమై శిష్యులచేఁ బాలింపఁబడుచునుండి యుండుటను నెదుటఁ గాంచితిని.

పురో మే తిష్ఠతాం తేషాం మత్సంరక్షణకర్మణామ్
ముహూర్తమాత్రం చ గతః కాలశ్చాన్తేనివాసినామ్. 52

మఱియు నాయెదుట నా సంరక్షణాది కార్యములందు, దత్పరులైయున్న శిష్యులందఱికిని నచటికొక ముహూర్తమాత్రకాలమే నా సమాధ్యనంతరము గడచినది.

హృదయం సంప్రవిష్టోఽసౌ యస్యాహం స పుమానపి
వృష్టేనోత్సవలబ్ధేన శేతే తృప్తోఽన్నసా సుఖమ్. 53

ఏ ప్రాణియొక్క హృదయమున నేను బ్రవేశించితినో, ఆ పురుషుఁడున్ను గ్రామమందలి యొకానొక యుత్సవమందు లభించిన మృష్టాన్నమును భుజించి తృప్తుఁడై వెల్లకిలగాఁ బరుండి సుఖముగ నిద్రించుచుండెను.

తదాశ్చర్యం మయా దృష్ట్వా నోక్తం కించ న కస్యచిత్
పునస్తస్యైవ హృదయం ప్రవిష్టః కౌతుకాదహం. 54

ప్రాప్తోఽస్మోజః ప్రదేశం తం తస్య తస్మిన్హృదన్తరే
అవేక్షితుం స్వబన్ధూంస్తాన్వ్యాప్తో వాసనయా తయా. 55

ఆ యాశ్చర్యమయమైన వృత్తాంతమును జూచి నేనద్దాని నెవనికిని నేమియుఁ జెప్పకయే యుంటిని. మరల కౌతుకముచే నాతని హృదయముననే తిరిగి ప్రవేశించితిని. ఆ పూర్వపు బంధువులను జూచుటకొఱకై యట్టి వాసనలచే వ్యాప్తుఁడనైయున్న నేను, ఆ పూర్వానుభూతమగు తేజముతోఁగూడియున్న యా ప్రాణియొక్క హృదయానంతర ప్రదేశమును నపుడు బొందితిని.

యావత్తత్ర యుగస్యాన్తః సంప్రవృత్తోఽతిదారుణః
భువనం తద్విపర్యాసమాగతం సహ సంస్థయా. 56

అట్లాతని హృదయమును బ్రవేశించగనే యింతలో నచట భయంకరమైన యుగాంతము ప్రవృత్తమయ్యెను, ధర్మాధర్మ వ్యవస్థతో సహా యిపుడచటి ప్రపంచమంతయు విపరీతదశను బొందినదాయెను.

అన్య ఏవాచలాస్తత్ర వసుధాన్యా చ సంస్థితా
అన్య ఏవ కకుబ్భేదస్తథాన్యా భువనస్థితిః. 57

తే బన్ధవః న చ గ్రామః న భూభాగః న దిక్తటః
న జానే క్వ గతం సర్వం వ్యూహ్య నీతమివానిలైః. 58

తదా పశ్యామి భువనం యావదన్యదవస్థితమ్
అపూర్వసంనివేశం తజ్జగదన్యదివోదితమ్. 59

తపన్తి ద్వాదశాదిత్యాః ప్రజ్వలన్తి దిశో దశ
శీతాశ్యానామ్బువచ్ఛైలాః ప్రవృత్తాగలితుం బలాత్. 60

అద్రావద్రౌ దిశిదిశి జ్వలన్తి వనపఙ్క్తయః
దగ్ధాః స్మృతిపదం యాతాః సమస్తా రత్నభూతయః. 61

సర్వ ఏవాబ్ధయః శుష్కా మహావాతాః పురః స్థితాః
అఙ్గారరాశితాం యాతం భూమణ్డలమశేషతః. 62

పాతాలతో భూతలతోఽథ దిగ్భ్యో
జ్వాలా వినిర్గన్తుమనుప్రవృత్తాః
సంధ్యాభ్రవచ్చాశు బభూవ విశ్వం
జ్వాలామయం మణ్డలమేకమేవ. 63

అచట అన్యవిధములైన పర్వతములు, అన్యవిధమగు భూమి, అన్యములగు దిశలు, అన్యవిధమగు జగత్థ్సితి వర్తించుచుండెను. ఆ నా పూర్వపు బంధువులు, ఆ గ్రామము, ఆ భూభాగము, ఆ దిక్తటము, అన్నియు వాయువుచేఁ జుట్టచుట్టఁబడి గొనిపోఁబడినవాయనునట్లు, ఎచటికో పోయినవి. అపుడు ప్రపంచమంతయు మఱియొక రూపముతోటి స్థితినొందియున్నట్లును, అపూర్వమైన నూతనరచనతోఁగూడి యుదయించినట్లును గాంచితిని. అత్తఱి ద్వాదశాదిత్యులు లోకమును తపింపఁజేయుచుండిరి; దశదిశలు మండుచుండెను; శీతలత్వముచే ఘనీభవించిన జలమువలె హిమాలయాదిపర్వతములు బలాత్కారముగ కరఁగనారంభించెను. ప్రతిపర్వతముపైనను, ప్రతిదిక్కునందును వనసమూహములు జ్వలించుచుండెను; రత్నభూతములగు పదార్థములన్నియు దగ్ధములై స్మృతిపదమును బొందెను; సముద్రములన్నియు నెండిపోయెను, ప్రచండవాయువు లెదుట వీవదొడఁగెను; వెయ్యేల, భూమండలమంతయు అగ్నిరాశియయ్యెను, మొదట, పాతాళమునుండియు, పిదప భూతములనుండియు, ఆ పిమ్మట దిక్కులనుండియు నగ్నిజ్వాలలు లేవసాగెను. తదుపరి విశ్వమంతయు శీఘ్రముగ నొకేజ్వాలామయమగు మండలమై సంధ్యాకాల మేఘమువలె రక్తవర్ణమయమై యొప్పెను.

జ్వాలామయే సద్మని హేమపద్మ
కోశే భ్రమద్భృఙ్గ ఇవ ప్రవిష్టః
తతోఽహమారాచ్ఛలభక్రమేణ
న చాప్తవాన్దాహవికారదుఃఖమ్. 64

అట్టి జ్వాలామయమైన గృహమున, సువర్ణకమలకోశమున - సంచరించు తుమ్మెదవలె నేను ప్రవేశించితిని. అట్లాయగ్నియందు మిడుతవలె నేను తగుల్కొనియున్నప్పటికిని మనోమయ(సూక్ష్మ) శరీరమాత్రమున నిశ్చయము గలిగియుండుటవలన, తద్దాహజనిత దుఃఖమును బొందకయేయుంటిని.

జ్వాలామయే సాధుమహామ్బువాహేభ్రమామ్యహం విద్యుదివానిలాత్మా
జ్వాలాపరిస్పన్దవిలోలవర్ష్మా స్థలాబ్జఖణ్డభ్రమరోపమశ్రీః. 65

ఇత్యార్షే శ్రీ వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే ఉత్తరార్ధే అవి॥ విప॥ శవో॥ హృదయకల్పనావర్ణనం నామ చత్వారింశదధిక శతతమః సర్గః ॥ 140 ॥

వాయుధారణే వాయురూపమును బొందిన నేను, అపుడా జ్వాలామయమగు మహామేఘమున మెఱుపువలె బాగుగ సంచరించుచునుంటిని. అట్లు జ్వాలలయొక్క సంచలనములందు చలించుచున్నట్టి దేహముగలవాఁడనై, నేనపుడు స్థలకమలములందు చరించు తుమ్మెదలతోటి సౌమ్యత్వమును బొందితిని.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున నుత్తరార్ధమున అవి॥ విప॥ శవో॥ హృదయకల్పనా వర్ణనమను నూటనలుబదవ సర్గము ॥140॥

## ఏకచత్వారింశదధిక శతతమః సర్గః

[వహ్నిజ్వాలాకులే లోకే వాయోశ్చణ్డస్య నిర్గమః
విక్షిప్తాఙ్గారవర్షాఢ్యజ్వాలామేఘోఽ(త్ర) వర్ణ్యతే.

అగ్నిజ్వాలలచే పరిపూర్ణమగు ప్రపంచమున ప్రచండవాయువు బయలుదేఱుట, జ్వాలామయమగు మేఘమునుండి అగ్నివర్షము కురియుట, ఇచట వర్ణింపఁబడుచున్నవి.]

మునిరువాచ:—

తత్ర దంద హ్యమానోఽపి నాభవం దుఃఖభాగహమ్
స్వప్నే స్వప్నోఽయమిత్యేష జానన్నగ్నావపి చ్యుతః. 1

ముని:— ఓ వ్యాధుఁడా! అట నలువైపుల యగ్నిజ్వాలలచే వ్యాప్తుఁడనై దహింపఁబడుచున్నప్పటికిని, స్వప్నమున నగ్నియందుఁ బడినట్టి 'ఇది స్వప్నము' అని యెఱిఁగినవాని చందముననేనా యగ్నితాపదుఃఖమును బొందకనే యుంటిని.

జ్వాలజాలనవోడ్డీతిమణ్డలైరఖిలైర్నభః
అలాతచక్రవద్భ్రాన్తః కేవలం భ్రాన్తవానహమ్. 2

ఎగురుచున్న నూతన జ్వాలాసమూహములతోఁగూడ, అలాత (కొఱవి) చక్రమువలె నేనాకాశమంతయును లెస్సగ సంచరించితిని.

తం దవాగ్నిమహం యావత్తత్త్వవిత్త్వాదఖిన్నధీః
విచారయామ్యఖిన్నాత్మా మారుతస్తావదాయయౌ. 3

తత్త్వవేత్తనగుటఁబట్టి దుఃఖరహితుఁడనై, సంచరణమువలన నొకింత శ్రమనొందిన చిత్తముగలవాఁడనై యాజ్వాలాసమూహమునుగూర్చి విచారించుచుండ నింతలో ప్రచండవాయు వేతెంచెను.

సీత్కారమతిగమ్భీరం దధన్మేఘరవోపమమ్
జగత్పదార్థైరావృత్తైరుహ్యమానైః పరావృతః. 4

బృహద్ఘుంఘుమమావేగైర్ఘనే ద్విగుణితామ్బుదః
సూర్యైరావృత్తిభిర్వ్యాప్తైర్విమిశ్రాలాతచక్రకః. 5

జ్వాలాసంధ్యాభ్రనివహైర్బృహదగ్నినదీశతః
శైలద్విగుణభూఖణ్డదానవామరపత్తనః. 6

భూతైర్ద్విగుణపాత్రౌఘో భ్రాన్తైరమ్బరకుక్షిషు
దగ్ధాదగ్ధాభిరర్ధదగ్ధాభిరితరేతరమ్. 7

పతన్తీభిః సురస్త్రీభిర్ద్విగుణాగ్నిశిఖాలవః
పతదఙ్గారధారౌఘకణసీకరదన్తురః. 8

అలాతవిద్యుతో ధున్వన్స్ఫీతాఙ్గారోగ్రమణ్డలీః
ధూమాన్ధకారైః స్థగయన్నాననమూర్ధ్వదిశో ముఖమ్. 9

ఆ వాయువు, అతిగంభీరమైన మేఘశబ్దమును బోలినట్టి యగ్నిఘూత్కార శబ్దముతోఁ గూడినదియు, కొట్టుకొనిపోవుచున్న శిలాది జగత్పదార్థములచే వ్యాప్తమైనదియు, మహాఘుంఘుమ శబ్దములతోఁగూడిన వేగములవలన వనమందు రెండింతలైనట్టి మేఘముతోఁ గూడియున్నదియు, కొట్టుకొనిపోవుచున్నట్టియు, పరివర్తనము నొందుచున్నట్టియు, ద్వాదశాదిత్యులతోఁగూడ అలాత (కొఱవి) చక్రములను మిశ్రితమొనర్చునదియు, జ్వాలలను సంధ్యాకాల మేఘములద్వారా వందల కొలది గొప్ప యగ్ని నదులను ప్రవర్తింపఁజేయునదియు. పర్వతములకంటె రెండింతలైనట్టి విశాల భూఖండములున్ను, శిలలున్ను, సురాసురుల పట్టణములున్ను గలదియు, ఆకాశకోటరమున పరిభ్రమించు భూతసముదాయములచే నదులను పాత్రసమూహములను రెండింతలుగాఁ జేయునదియు, దగ్ధులును, అదగ్ధులును, అర్ధదగ్ధులును, తదితరులునగు పడుచున్న దేవతాస్త్రీలవలన ద్విగుణితములైన యగ్నిజ్వాలతోఁగూడినదియు, పడుచున్న నిప్పులను జలధారా ప్రవాహముల చేతను, అగ్నికణములను జలబిందువులచేతను ఉన్నతములైన దంతములతోఁ గూడియున్నట్లు తోచునదియు, భస్మరహితములైన శుద్ధములగు అంగారము (నిప్పుకణిక)లయొక్క భయంకర సముదాయము గలదియు, అట్టి అంగారములవలన జనించిన ఆలాత (కొఱవి) చక్రములను మెఱుపులను కంపింపఁజేయుచు దూమములను నంధకారములచే దిఙ్ముఖములను గప్పునదియునై యుండెను

భూమేర్వ్యోమ్నో దిఙ్ముఖేభ్య సమన్తా జ్జ్వాలాసంధ్యావారిదా నిర్గతాన్తైః
యైస్సైర్జ్వాలాశైలసంపిణ్డమాత్రం సవ్యోమౌకాః సంస్థితా సప్తలోకీ. 10

అపుడు భూమినుండియు, ఆకాశమునుండియు, నలువైపుల దిఙ్ముఖములనుండియు జ్వాలారూపములైన సంధ్యాకాల మేఘములు బయలుదేఱెను. వానిచే స్వర్గవాసులగు దేవతలతో సహా సప్తలోకములున్ను నొకే జ్వాలాపర్వత పిండమాత్రముగ నాయెను.

క్వాపి ప్రోత్ఫాలకీర్ణానలకణకపిలప్రోల్లసన్మూర్ధజాలిః
క్వాపి ప్రోడ్డీనకుడ్యః కటురటనపటుర్భస్మసంపిణ్డపాణ్డుః
క్వాపి జ్వాలావటాలీం పరిదధదఖిలః సంపతన్తీం గృహీతాం
రౌద్రః కర్తుం ప్రవృత్తో హర ఇవ స తదా మారుతో నృత్యలీలాః. 11

**ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే ఉత్తరార్ధే అవి॥ విప॥ శవో॥ కల్పాన్తవర్ణనం నామైక చత్వారింశదధికశతతమః సర్గః ॥ 141 ॥**

అపుడా ప్రచండవాయువు, ఒకచోట నూర్ధ్వప్రదేశమున కెగరుటచే చెదరినట్టి యగ్ని కణములను కపిలవర్ణము గలిగిన శోభాయమానములగు కేశములుగల్గి, ఒకచోట అధోభాగమున పాదములయొక్క యాఘాతముచేవలె గోడల నెగురఁగొట్టుచు, ఒకచోట దుస్సహమైన శబ్దమును గావించు భస్మములచేఁ గప్పఁబడి పాండురవర్ణముగలదై, ఒకచోట మధ్యభాగమున, అంతటఁ బడుచున్నట్టి జ్వాలాసమూహమును వస్త్రమును పరిగ్రహించి ధరించియున్నదై, ప్రళయకాలమున కాలాగ్నిరుద్రునివలె నృత్యలీల యొనర్చుటకు ప్రవృత్తమయ్యెను.

**ఇది శ్రీవాసిష్ఠతాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున నుత్తరార్ధమున అవి॥ విప॥ శవో॥ కల్పాంతవర్ణనమను నూటనలుబదియొకటవ సర్గము ॥ 141 ॥**



## ద్విచత్వారింశదధిక శతతమః సర్గః

[ఇహ స్వప్నాదిజగతస్తత్త్వం బ్రహ్మేతి కీర్త్యతే
తత్త్వదృష్ట్యా జగద్బీజ కర్మాభావశ్చ సాధ్యతే.

స్వప్నాది జగత్తుయొక్క తత్త్వము బ్రహ్మమేయని వచింపబడుచు, తత్త్వదృష్టిచే జగత్తుయొక్క బీజభూతమైన కర్మలయొక్క అభావమిచట సాధింపఁబడుచున్నది.]

**మునిరువాచ :—**

వర్తమానే తదా తస్మిన్కష్టే సంభ్రాన్తసంభ్రమే
ఉహ్యమానోఽహమత్యన్తం ఖేదమభ్యాగతోఽభవమ్. 1

అచిన్తయం తత్స్వప్నోఽయం పరస్య హృదయే మమ
తదతః పరినిర్వామి దుఃఖం పశ్యామి కిం ముధా. 2

ముని:— ఓ వ్యాధుఁడా ! అపుడా కష్టదాయకమగు మహాసంభ్రమమునఁ గొట్టుకొని పోవుచున్న నేను శ్రమచే మిగులఖేదమును బొందితిని. అత్తఱి 'ఇది మఱియొకని హృదయమందలి స్వప్నము; కావున ఈ యవస్థనుండి బయల్వెడలి జాగ్రత్స్థితిని బొందుటద్వారా శాంతిని బడసెదను; ఏల వ్యర్థముగ ఈ దుఃఖమును జూడవలెను?' అని చింతించితిని.

వ్యాధ ఉవాచ:—

కిం స్విత్స్వాప్న ఇత్యేవ కిల సందేహశాన్తయే
ప్రవృష్టో హృదయం తస్య కిం తం నిర్ణీతవానసి. 3

కిమేతద్భవతాం దృష్టం హృదయే క్వ మహార్ణవః
జఠరే కల్పవాతః కిం హృది కల్పానలః కథమ్. 4

వ్యోమ క్షమా వాయురాకాశం పర్వతాః సరితో దిశః
కథం హృది జగన్నామ కథయేతి యథాస్థితమ్. 5

వ్యాధుఁడు :– మహాత్మా! 'స్వప్నమేయైయుండును' అను సందేహము యొక్క నివృత్తి కొఱకై యాప్రాణియొక్క హృదయమునఁ దాము ప్రవేశించితిరిగదా. అట్టిచో, ఆ విషయమును గూర్చి తామేమి నిర్ణయించినవారై యాస్వప్నదర్శనమునుండి నివృత్తినిబొందితిరి? అట తాము గాంచిన దేమి? హృదయమున మహాసముద్రమెచటినుండి వచ్చినది? ఉదరమున ప్రళయవాయు, ప్రళయాగ్నులెట్లు సంభవించినవి? అంతరిక్షము, భూమి, వాయువు, ఆకాశము, పర్వతములు, నదులు దిక్కులు మున్నగువానితోఁగూడిన జగత్తు హృదయమున నెట్లేతెంచినది? అను ఈ విషయము లన్నింటిని యథార్థముగ వచింపవేడెద.

మునిరువాచ:—

అకారణత్వాత్సర్గాదావేవానుత్పాదతః స్ఫుటాత్
అజ్ఞాతో సంగశబ్దార్థావేవ న స్తో మనాగపి. 6

ముని:— ఓ వ్యాధుఁడా! సృష్ట్యాదియందు జగత్తుయొక్క కారణము అసంభవమగుట చేత సృష్టియే యుత్పన్నము కానిదగుటవలన, సృష్టియొక్క శబ్దార్థములు రెండును నొకింతైనను లేకయే యున్నవని నేను స్పష్టముగ నిర్ణయించితిని.

తచ్ఛేతౌ సర్వశబ్దార్థౌ త్వజ్ఞాతౌ పరమాత్మని
యత స్తత్పదమజ్ఞానజ్ఞానాత్మక మనామయమ్. 7

ఈ సృష్టియొక్క శబ్దార్థములు, అజ్ఞాతమగు పరమాత్మయొక్క రూపములైయున్నవి. ఆఅజ్ఞాతాత్మపదము మాయాశబలితమగుటచే జ్ఞానాజ్ఞాన రూపమై, వాస్తవముగ (పరమార్థమున) నిర్వికారమై యొప్పుచున్నది.

అతః సుభగ సిద్ధాన్తే త్వత్ప్రజ్ఞే బోధమాగతే
మౌర్ఖ్యశాన్తావనాద్యన్తే పదే పరమపావనే. 8
వచ్మీదం మూఢసంవిత్తౌ యదిదం తన్న వేద్మ్యహమ్

కావున ఓ సౌభాగ్యశీలుఁడా! నీ యొక్క యీ స్వప్నాది జగత్తత్త్వవిషయమున, జ్ఞానము కలిగినపిమ్మట, అజ్ఞానము శమింప, పరమసిద్ధాంత భూతమగు అతి పావనమైన పరమాత్మ పదమున స్థితి నొంది 'ఈ సృష్టిశబ్దార్థములు లేవను' వాక్యమును వచించితిని. ఇఁక మూఢుల యొక్క బుద్ధియందలి 'ఈ జగచ్ఛబ్దార్థములు కలవను' భావమేదికలదో, అద్దానియొక్క అత్యంతా భావమువలన నది యెట్టిదో నే నెఱుఁగను.

వ స్త్వవస్తుజమాభాతం బోధమాత్రమిదం తతమ్. 9

వస్తువునుండిగాని, అవస్తువునుండిగాని జనించినదై భాసించుచున్నట్టి యిదియంతయు వ్యాపకమైన చిన్మాత్ర బ్రహ్మమేయగును.

క్వ శరీరం క్వ హృదయం క్వ స్వప్నః క్వ జలాది చ
క్వ బోధో బోధవిచ్ఛిత్తిః క్వ జన్మమరణాది చ. 10

ఇట్లంతయు బ్రహ్మమాత్రమైయుండ నిఁక శరీరమెచట? హృదయమెచట? స్వప్నమెచట? జలాదులెచట? జాగ్రత్తుగాని, తదభావముగాని యెచట? జనన మరణాదులెచట?

స్వచ్ఛం చిన్మాత్రమస్తీహ తన్మామ యదపేక్షయా
స్థూలమేవ ఖమవ్యాదిరణూనాం నికటే యథా. 11

ఇట్లు నిర్మలమగు చిన్మాత్ర మొకటియే గలదు. పరమాణువుల కంటె పర్వతమెట్లు స్థూలమైనదో, అట్లే యా చిన్మాత్రముకంటె ఆకాశమున్ను మిగుల స్థూలమైనదైనదగును.

స్వభావాత్స చిదాకాశః కించిచ్చేతతి చిన్తయా
ఖమేవ వపురాకాశం యత్తద్వేత్తి జగత్తయా. 12

స్వభావముగనే యా చిదాకాశము సంకల్పమువలన జగద్రూపముగ నొకింత స్ఫురించు చున్నది. అపుడయ్యది తనచిదాకాశ రూపమునే జగత్తుగ నెఱుఁగుచున్నది.

యథా స్వప్నే పురతయా చిదేవాభాతి కేవలా
నతు కించిత్పురాద్యేవం జగచ్చిన్మాత్రమేవ ఖే. 13

స్వప్నమందు నిర్మలమగు చిన్మాత్రమే నగరాది రూపములుగ భాసించునట్లును, ఆ నగరాదులు నిజరూపముచే వాస్తవముగ లేనట్లును జాగ్రత్తునందునుఁ ఈ నగరాది రూపమగు జగత్తొకింతైనను లేదు; చిదాకాశమే చిదాకాశమున నిట్లు జగద్రూపముగ భాసించుచున్నది.

ఇదం శాన్తమనాభాతమనన్యన్నైతదాత్మని
చితి దృశౌ తమసి ఖే చక్రకాదీవ భాతి తే. 14

జ్ఞానియొక్క దృష్టియం దీ సమస్త జగత్తున్ను శాంతమై, ఆభాసరహితమై, చిదాత్మకంటె భిన్నముకానిదైయున్నది. తిమిరరోగముచే నాజనమున చక్రాకారములగు పదార్థములు కన్పించు నట్లు, నీ దృష్టియందు అజ్ఞానముచే జగత్తిట్లు దృశ్యాకారముగఁ గన్పించుచున్నది.

అస్మాకం తు న చాభానం న చాసన్న చ సన్న ఖమ్
అనాకారమనాద్యన్తమేకం చిద్వ్యోమ కేవలమ్. 15

మాయొక్క దృష్టియం దీజగత్తు వ్యావహారికముగాని, ప్రాతిభాసికముగాని, శూన్యముగ గాని కాదు. కేవలము నిరాకారమై, ఆద్యంతరహితమై, ఏకమైనట్టి చిదాకాశమే యైయున్నది.

భాత్యకారణకం స్వప్నే శుద్ధో ద్రష్టైవ కేవలః
తేనాత్ర కారణాభావో న ద్రష్టాస్తి న దర్శనమ్. 16

ఏ కారణముచే స్వప్నమందు కారణరహితమై, త్రిపుటీశూన్యమై, శుద్ధమైనట్టి ద్రష్టయే సర్వపదార్థరూపముగ భాసించుచున్నదో, ఆ కారణముచే జాగ్రత్తునందును, కారణాభావమువలన ద్రష్టృదృశ్యాది త్రిపుటిలేకయేయున్నది. శుద్ధమగు చిన్మాత్రమే గలదు.

శుద్ధం కిమపి తద్భాతి స్వానుభూతమపి స్ఫుటమ్
యదవాచ్యమనాద్యన్తమేకం ద్వైతైక్యవర్జితమ్. 17

శుద్ధమైనట్టి యా చిన్మాత్రము స్వానుభూతరూపముచే స్పష్టముగ భాసించినప్పటికిని, అనిర్వాచ్యమై, ఆద్యంతరహితమై, ఏకమై, ద్వైతైక్యవర్జితమై వెలయుచున్నది.

ఏకః కాలో యథా కల్పః ప్రకాశశ్చోభయాత్మకః
బీజం వా ఫలపుష్పాన్తం బ్రహ్మ సర్వాత్మకం తథా. 18

ఒకే కాలము సృష్టి, ప్రళయములను ఉభయరూపములుగను, ఒకే బీజము, అంకుర, శాఖా, పుష్ప, ఫల, పత్రాదిరూపములుగను, స్వయముగనే యెట్లు వర్తించుచున్నదో, అట్లే బ్రహ్మమున్ను స్వరూపమై వర్తించుచున్నది.

యదన్యస్య మహత్కుడ్యం తదన్యస్యామలం నభః
దృష్టమేతత్స్వరస్వప్నసంకల్పభ్రమభూమిషు. 19

స్వప్న, సంకల్ప, భ్రమాది స్థానములందు, ఏది యొకనికి గొప్పకుడ్యమై (గోడయై) యున్నదో, అదియే మఱియొకనికి నిర్మలమగు యాకాశమైయుండుట చూడఁబడినది. (ఆత్మ పరమార్థముగ ద్వైతైక్యసహితమగుచో, సర్వులకు నట్లే కానుపించవలసి యుండునుగాని, అట్లు లేదు - అని భావము)

స్వచ్ఛం తదా తదాత్మైకం భాతి చిన్మాత్రఖం యథా
స్వప్నే జాగ్రతివత్తద్వజ్జాగ్రత్స్వప్నేఽపి నాన్యథా. 20

స్వప్నమున నెట్లు నిర్మలమై ఏకమై, చిన్మాత్రాకాశరూపమైనట్టి ఆత్మ జాగ్రత్సమానముగ భాసించుచున్నదో, అట్లే జాగ్రత్తను స్వప్నమందును, ఆ యాత్మయే సర్వరూపముగ భాసించుచున్నది ఇట నొకింతైనను అది వేఱుకాదు. (ఈ ప్రకారముగ, ఆత్మయొక్క అద్వయత్వము సిద్ధించుచున్నది.)

అదృశ్యే పవనే యద్వదదృశ్యం సౌరభం స్థితమ్
చిన్మాత్రేఽప్రతిఘే తద్వజ్జగదప్రతిఘం స్థితమ్. 21

అదృశ్యమగు వాయువునందు అదృశ్యరూపముగనున్న సుగంధము నేత్రములకుఁ గానుపింపకున్నప్పటికిని, ఘ్రాణేంద్రియముచే నెట్లనుభూతమగుచున్నదో, అట్లే నాశరహితమగు చిన్మాత్రమందొకని దృష్టియందు సుషుప్తిప్రళయాదులందు దీజగత్తు అదృశ్యమైయున్నప్పటికిని, మఱియొకనిదృష్టియందు నాశరహితముగ నుండియేయున్నది. (ఆత్మ సదా ఏకస్వభావమే గలిగి యున్నదని భావము.)

నమస్తమననత్యాగే యోఽసి సోఽసి నిరామయః
బహిరన్తరనన్తాత్మా సుస్థితోఽపి నిరన్తరమ్. 22

ఓ వ్యాధుఁడా ! మనస్సుయొక్క మననరూపమగు సమస్తవ్యాపారముయొక్క త్యాగముచే, ఏ నిరాకారమై, బాహ్యాభ్యంతరములందును అనంతమై, నిరంతరము సుస్థిరమై, అద్వయమైనట్టి ఆత్మరూపముగ నీవు స్థితిగల్గియుందువో, అదియే నీవు (మనోమనన త్యాగముచే జగత్తెన్నఁడును లేదనియు ఆత్మయే సదా యుండియున్నదనియు, అదే జీవుని వాస్తవస్వరూపమనియు భావము.)

**వ్యాధ ఉవాచ :—**

> భగవన్ప్రాక్తనం కర్మ కేషామిహ హి విద్యతే
> కేషాం న విద్యతే తద్వద్వినాపి భవతః కథమ్. 23

వ్యాధుఁడు:— మహాత్మా ! పూర్వకర్మ ననుసరించియే మనస్సు మననముచేయును గాని మఱియొక విధముగ కాదుగదా ! అట్టి కర్మ యే ప్రాణులకు గలదు ఏ ప్రాణులకు లేదు ? అట్టి కర్మలేనిచో మనస్సుయొక్క మననముగాని, త్యాగముగాని యెట్లు సంభవించును.

**మునిరువాచ :—**

> సర్గాదిషు స్వయం భాన్తి బ్రహ్మాద్యా యే స్వయంభువః
> విజ్ఞప్తిమాత్రదేహాస్తే న తేషాం జన్మకర్మణీ. 24

ముని:— ఓ వ్యాధుఁడా ! సృష్ట్యాదియందు స్వయంభువులైనట్టి ఏ బ్రహ్మాదులు స్వయముగ భాసించుచున్నారో, వారు చిన్మాత్రశరీర ధారులైయున్నారు. కావున వారికి జనన మరణాదులు లేవు.

> తేషామస్తి న సంసారో న ద్వైతం నచ కల్పనాః
> విశుద్ధజ్ఞాన దేహాస్తే సర్వాత్మానః సదా స్థితాః. 25

వారి దృష్టియందు ప్రపంచముగాని, ద్వైతముగాని, తదితరములగు యేకల్పనలుగాని లేవు వారు విశుద్ధజ్ఞాన (ఆత్మ) మాత్ర దేహులగుటచే సదా సర్వరూపముతోటి స్థితిగల్గియున్నారు.

> సర్గాదౌ ప్రాక్తనం కర్మ విద్యతే నేహ కస్యచిత్
> సర్గాదౌ సర్గరూపేణ బ్రహ్మైవేత్థం విజృమ్భతే. 26

అట్టి తత్త్వజ్ఞానులయొక్క దృష్టియందు సృష్ట్యాదియందెవనికిని పూర్వకర్మలేకయే యున్నది. బ్రహ్మమే యిట్లు సృష్ట్యాదియందు సృష్టిరూపముగ విజృంభించుచున్నదగును.

> యథా బ్రహ్మాదయో భాన్తి సర్గదౌ బ్రహ్మరూపిణః
> భాన్తి జీవా స్తథాన్యేఽపి శతశోఽథ సహస్రశః. 27

సృష్ట్యాదియందు బ్రహ్మాదులెట్లు బ్రహ్మరూపులై భాసించుచున్నారో, అట్లే తక్కిన అసంఖ్యులగు జీవులున్ను భాసించుచున్నారు

> కింతు యే బ్రహ్మణోఽన్యత్వం బుధ్యన్తే స్వాత్వికోద్భవాః
> అబోధా యే త్వవిద్యాఖ్యం బుద్ధ్వాద్వైతమిదం స్వయమ్. 28

కాని, కేవల సత్వగుణరహితమగు రజస్తమోగుణ మిశ్రిత సత్వగుణ పరిణామమునుండి యుద్భవించునట్టి అజ్ఞానులెవరుగలరో, వారు తమ్ములను బ్రహ్మముకంటె వేఱుగ నెఱుగుచు,

స్వయముగ, ఈ అచిద్రూపమగు ద్వైతజగత్తును సత్యముగనమ్మి, తద్వాసనావశముచే, కర్మసహితులై జననమరణములను బొందుచున్నారు.

తేషాముత్తరకాలం తత్కర్మభిర్జన్మ దృశ్యతే
స్వయమేవ తథా భూతైస్తైరవస్తుత్వమాశ్రితమ్. 29

వారియాకర్మలచే నుత్తరకాలమున వారికి జన్మకలుగుచున్నది. ఏలయనిన వారు స్వయముగ జడదేహాదులందలి ఆత్మాభిమానముచే పరమార్థవస్తువును మఱచి మిథ్యావస్తువునే యాశ్రయించిన వారైయున్నారు.

యైస్తు న బ్రహ్మణోఽన్యత్వం బుద్ధం బోధ మహాత్మని
నిరవద్యాస్త ఏతేఽత్ర బ్రహ్మ విష్ణు హరాదయః. 30

ఏ బ్రహ్మ, విష్ణు, మహేశ్వర, సనకాది మహాత్ములు తమ్ములను బ్రహ్మముకంటె వేఱుగ నెపుడును నెఱుఁగకయున్నారో, వారు సదా బోధమయమగు పరమాత్మయందే నెలకొనియున్న వారై దోషరహితులై యిట వెలయుచున్నారు.

సర్వాత్మ సంవిదోఽచ్ఛత్వం బ్రహ్మాత్మన్యేవ సంస్థితమ్
తత్స్వభిజ్జీవవద్భానం స్వయమాత్మని పశ్యతి. 31

సమస్తజీవులకును నిర్మల చిద్రూపమాత్రమే స్వాభావికమై యున్నది. ఏలయనిన, బ్రహ్మము తన నిర్మల చిత్స్వభావమునందే సదా స్థితిగల్గియున్నది. మఱియు నయ్యది తన జీవరూపమువలె భాసించుటను మలినోపాధిచె స్వయముగ తనయందొకానొకచోటఁ గాంచుచున్నది.

యత్ర వేత్తి తు జీవత్వం తత్రావిద్యేతి తిష్ఠతి
తత్ర సంసృతినామ్నాత్మా ధత్తే రూపం తథాస్థితమ్. 32

ఆ బ్రహ్మమెచట జీవరూపముతోటి తన్నెఱుఁగుచున్నదో, అచటనే 'అవిద్య' యుండు చున్నది. మఱియు నచటనే సంసారమను పేరుచే స్థితినొందియున్న రూపమునది ధరించుచున్నది.

స్వయమేవ హి కాలేన బుద్ధ్వా స్వంరూపమాత్మనః
స్వయమేవ స్వరూపస్థం బ్రహ్మైవ భవతి స్వయం. 33

కాలక్రమమున సత్సంగశాస్త్రాదులద్వారా యది స్వయముగనే తన నిజ శుద్ధరూపము నెఱిఁగి నిజస్వరూపమందున్న బ్రహ్మము స్వయముగనే యగుచున్నది.

యథా ద్రవత్వా దమ్బ్వన్తరేతి చావర్తతామివ
బ్రహ్మచిత్వాత్తథైతీవ సర్గతామస్య సర్గకమ్. 34

ద్రవత్వమువలన జలమెట్లు స్వభావముగనే తనయందు ఆవర్తతరంగాదిరూపములను బొందుచున్నదో, అట్లే చిద్రూపత్వమువలన బ్రహ్మమున్ను తనయందు సృష్టిరూపమును బొందుచున్నది. ఏలయనిన, అజ్ఞాతబ్రహ్మమునకు సృష్టిరూపభ్రాంతి స్వభావమే యైయున్నది.

బ్రహ్మభానమయం సర్గో న స్వప్నో న చ జాగరః
కస్య కాన్యత్ర కర్మాణి కీదృశాని క్రియన్తి వా. 35

సృష్టి బ్రహ్మముయొక్క స్ఫురణమాత్రమేయై యున్నది. కావున యథార్థముగ స్వప్నము గాని, జాగ్రత్తుగాని యేవియులేవు. అవిద్యతప్ప ఈ బ్రహ్మమున కిఁక సృష్టిరూపత్వ మేమిగలదు? మఱియు, శుద్ధమైన యిద్దాని కిఁక జన్మాంతరకర్మము లేవి? ఎట్లు ఎన్నియుండగలవు?

వస్తుతః కర్మ నాస్త్యేవ నావిద్యాస్తి న సర్గధీః
స్వసంవేదనతః సర్వమసదేవ ప్రవర్తతే. 36

వాస్తవముగ, కర్మగాని, అవిద్యగాని, సృష్టిగాని యేవియునులేవు. ఆత్మయొక్క స్ఫురణమాత్రముచే నిదియంతయు మిథ్యగనే ప్రవర్తించుచున్నది.

బ్రహ్మైవ సర్గో భూతాత్మా కర్మ జన్మేతి కల్పనాః
స్వయం కుర్వదిదం భాతి విభుత్వాత్కల్పితార్థభాక్. 37

సర్వశక్తివంతమున్ను, సత్యసంకల్పయుక్తమున్ను నగుటచే బ్రహ్మము సృష్టిరూపమై, స్వయముగ కర్మయొక్కయు, తదనుసారము జన్మయొక్కయు కల్పనకావించుచు, కల్పిత పదార్థములగు జగజ్జీవాది రూపములతోటి భాసించుచున్నది.

న సంభవతి జీవస్య సర్గాదౌ కర్మ కస్యచిత్
పశ్చాత్స్వకర్మ నిర్మాయ భుఙ్క్తే కల్పనయా స చిత్. 38

వాస్తవముగ సృష్ట్యాదియందే జీవునకును కర్మసంభవింపదు. చైతన్యమే తనయందు మొదట 'అవిద్య' యొక్క స్థితినిగూర్చిన కల్పనగావించి, ఆ పిదప తనకర్మను గల్పించుకొని పిమ్మట నద్దాని ఫలము ననుభవించుచున్నది.

జలావర్తస్య కో దేహః కాని కర్మాణి చోచ్యతామ్
యథామ్బుమాత్రమావర్తో బ్రహ్మమాత్రం తథా జగత్. 39

ఓ వ్యాధుఁడా! జలముయొక్క ఆవర్తము (సుడి)యొక్క శరీరమేమియో, కర్మలెవ్వియో వచింపుము! ఆవర్తమెట్లు జలమాత్రమైయున్నదో, అట్లే జగత్తున్ను బ్రహ్మమాత్రమైయున్నది.

యథా స్వప్నేషు దృష్టానాం న ప్రాక్కర్మ నృణాం భవేత్
ఆదిసర్గేషు జీవానాం తథా చిన్మాత్రరూపిణామ్. 40

స్వప్నమందుఁ గాంచఁబడిన జీవులకు పూర్వకర్మమెట్లులేదో, అట్లే ఆది సృష్టియందు శుద్ధ సాత్త్వికశరీరులైన చిన్మాత్రరూపులగు జీవులకున్ను పూర్వకర్మ మెద్దియునులేదు.

సర్గే సర్గతయా రూఢే భవేత్ప్రాక్కర్మకల్పనా
పశ్చాజ్జీవా భ్రమన్తీమే కర్మపాశవశీకృతాః. 41

వారికి సృష్టి సృష్టిరూపముగ రూఢిపడియున్నచో పూర్వకర్మలయొక్క కల్పన యుండవచ్చును. కాని యట్లులేదు. అవిద్యచే సృష్టియొక్కయు, కర్మయొక్కయు కల్పన కావింపఁబడిన తదుపరియే యా జీవులా కర్మ పాశమునకువశులై వివిధజన్మలందుఁ దిరుగాడుచున్నారు.

సర్గ ఏవ న సర్గోఽయం బ్రహ్మైత్థం కిల తిష్ఠతి
యత్ర తత్ర క్వ కర్మాణి కాని వా కస్యతాని వా. 42

ఇట్లు, సృష్టి సృష్టిరూపముగ లేకయుండ, బ్రహ్మమే సృష్టిరూపముగ స్థితినొందియుండ నిఁక ఎచట ఎవనికి ఏ కర్మలు గలవు.

అపరిజ్ఞానమాత్రం యత్త్వయం వై పరమాత్మనః
తదేతత్కర్మ బన్ధాయ తత్తజ్జ్ఞస్యోపశామ్యతి. 43

దీనిఁబట్టి బంధనము కర్మవలనఁ గలుగునది కాదనియు, పరమాత్మనుగూర్చిన అజ్ఞానమాత్రమువలనఁ గలుగునదియనియు సిద్ధించుచున్నది. కావున, ఆ యజ్ఞానమే కర్మబంధమునకు బీజమైయున్నది. ఇక్కారణమున ఆత్మజ్ఞానికి, అజ్ఞానము నశించుటవలన తజ్జనితమగు కర్మయు నశించి పోవుచున్నది.

యావద్యావత్పరిజ్ఞానం పణ్డితస్య ప్రవర్తతే
తావత్తావత్తదైవాస్య కర్మ శామ్యతి బన్ధనమ్. 44

కాఁబట్టి జ్ఞానికి జ్ఞానమే యే ప్రకార మెంతెంత వృద్ధినొందుచుండునో ఆ యా ప్రకార మంతంత బంధదాయకమగు కర్మయున్ను నశించి పోవుచుండును.

యన్నామ కిల నాస్త్యేవ తచ్ఛాన్తౌ కా కదర్థనా
పరమార్థాదృతే బన్ధః కిం ఛిన్నామ న విద్యతే. 45

ఏ పదార్థము (కర్మ) వాస్తవముగ లేదో, అద్దాని నాశమందేమి క్లేశము గలదు? స్వప్న బంధము జాగ్రత్తుచేతను సర్పభ్రమ రజ్జుజ్ఞానముచేతను దప్ప మఱియేయుపాయములచేతను శమించనట్లు పరమార్థభూతమగు బ్రహ్మముయొక్క జ్ఞానముచేఁదప్ప యీ కర్మబంధము మఱి దేనిచేతను శమింపదు. ఏలయనిన, అట్టి బ్రహ్మమునుగూర్చిన అజ్ఞానముతప్ప వేఱుగ బంధమను నది యొకింతైనను లేదు.

తావన్మాయా భవ భయకరీ పణ్డితత్వం న యావ
త్తత్పాణ్డిత్యం పతసి న పునర్యేన సంసారచక్రే
యత్నం కుర్యాదవిరతమతః పణ్డితత్వేఽమలాత్మ
జ్ఞానోదారే భయమితరథా నైవ వః శాన్తిమేతి. 46

ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే ఉత్తరార్ధే అవి॥ విప॥ శవో॥ కర్మనిర్ణయో నామ ద్విచత్వారింశదధికశతతమః సర్గః ॥ 142 ॥

ఓ వ్యాధుఁడా ! పాండిత్య (ఆత్మజ్ఞాన) మెంతవరకు సంపాదింపఁబడదో, అంతవఱకును మాయ సంసారభయమును గలుగఁజేయుచునేయుండును. దేనిచే మరల యీ సంసారచక్రమున నీవు బడకుందువో, అదియే పాండిత్యము. కాఁబట్టి నిర్మలమై, ఉదారమైనట్టి ఆత్మజ్ఞానరూపమగు పాండిత్యమును బొందుట యందే నిరంతరము శ్రవణ మననాది రూప ప్రయత్నమును గావింపుము. ఏలయనిన, దీనిచేఁ దప్ప మఱియే యితరోపాయముచేతను నీయొక్క (సంసార)భయము శమింపదు.

ఇది శ్రీవాసిష్ఠతాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున నుత్తరార్ధమున అవి॥ విప॥ శవో॥ కర్మనిర్ణయమను నూటనలుబదిరెండవ సర్గము ॥ 142 ॥

## త్రిచత్వారింశదధికశతతమః సర్గః

[పాణ్డిత్యస్య ప్రశంసాత్ర తచ్చ చిన్మాత్రదర్శనమ్
చిదేవ జగదిత్యేతద్భూయో యుక్త్యా సమర్థ్యతే.

పాండిత్యము (ఆత్మజ్ఞానము), యొక్క ప్రశంస, అట్టి పాండిత్యము చిన్మాత్రమును దర్శింపఁజేయుట, చిద్రూపమగు బ్రహ్మమే జగత్తని మరల యుక్తిచే సమర్థింపఁబడుట ఇచటఁ గాననగును.]

**మునిరువాచ:—**

సర్వేషామేవ ధర్మాణాం కర్మణాం శర్మణామపి
పణ్డితః పుణ్డరీకాణాం మార్తణ్డ ఇవ మణ్డనమ్. 1

ముని:- ఓ వ్యాధుఁడా! కమలములను వికసింపఁజేయునట్టి సూర్యుఁడాకాశము యొక్క భూషణమై చెన్నొందునట్లు, సమస్త ధర్మ, కర్మముల నిర్ణయమందును, తదుభయ రూపములగు ఐహిక, పారలౌకిక సుఖములయొక్క తారతమ్యనిర్ణయమందును సందేహమును ఛేదించివైచుటద్వారా శ్రోతల బుద్ధిని వికసింపఁజేయునట్టి పండితుఁడు (ఆత్మజ్ఞాని) సభా భూషణమై చెన్నొందుచున్నాఁడు.

ఆత్మజ్ఞానవిదో యాన్తి యాం గతిం గతికోవిదాః
పణ్డితాస్తత్ర శక్రశ్రీర్జరత్తృణలవాయతే. 2

గతి నెఱిఁగినట్టి ఆత్మజ్ఞానులగు పండితులు ఏ గతిని (మోక్షసుఖమును) పొందుచున్నారో, అట ఇంద్రాదులయొక్క యైశ్వర్యమున్ను శిథిలతృణముయొక్క లేశము వంటిదే యగును. (ఆత్మ జ్ఞానముచే లభ్యమగు బ్రహ్మానందముయొక్క లవలేశముచేతనే తక్కిన జీవులందఱును ఆనందమును బొందుచున్నారు. కాఁబట్టి తక్కిన సుఖములన్నియు నట్టి బ్రహ్మానంద మహాసముద్రముయొక్క బిందుమాత్రముకంటెను నత్యల్పమైనవేయగును.

పాతాలే భూతలే స్వర్గే సుఖమైశ్వర్యమేవ వా
న తత్పశ్యామి యన్నామ పాణ్డిత్యాదతిరిచ్యతే. 3

పాతాళమునగాని, భూతలమునగాని, స్వర్గమందుగాని, ఆత్మజ్ఞానమను పాండిత్యము కంటె నధికమైనట్టి సుఖమునుగాని, ఐశ్వర్యమునుగాని నేను జూచుటలేదు.

పణ్డితస్య యథాభూతా వస్తుదృష్టిః ప్రసీదతి
దృగివేన్దౌ నిరమ్భోదే సకలామలమణ్డలే. 4

శరత్కాలముయొక్క మేఘశూన్యమైన నిర్మల, సంపూర్ణ చంద్రమండలమున నేత్రమానంద మును బొందునట్లు సచ్ఛాస్త్రవిచారముచే నుత్పన్నమైన ఆత్మజ్ఞానముగల పండితునియొక్క పరమార్థవస్తురూపమగు బ్రహ్మమయమైన దృష్టి(బుద్ధి) స్వాత్మయందే యానందమును బొందుచున్నది.

ఇదం దృశ్యమవిద్యాత్మ బ్రహ్మసంపద్యతే క్షణాత్
బుధస్య బోధాత్స్వప్నాద్గామ సర్పత్వమివ శామ్యతి. 5

రజ్జు జ్ఞానముచే సర్పత్వము నశించునట్లు, ఆత్మజ్ఞానికి బోధచే ఈ అవిద్యారూపమగు దేహసృష్ట్యాది దృశ్యసమూహమంతయును క్షణకాలములో శమించిపోయి అధిష్ఠానమగు బ్రహ్మముగనే శేషించుచున్నది.

యత్ప్రితం బ్రహ్మణి బ్రహ్మ కృతాస్తేనైవ సత్యతా
స్వభావై కాత్మికాః సంజ్ఞా దేహసర్గక్షయాదికాః. 6

ఏ బ్రహ్మము స్వతత్త్వజ్ఞానముతోటి స్వస్వభావమున స్థితిగల్గియున్నదో, దానిచేతనే నిజరూపమున నిజస్వభావరూపములేయగు శరీర, సృష్టి, ప్రళయాది సంజ్ఞలు గావింపఁబడినవనుట పరమార్థసత్యమైయున్నది కాఁబట్టి. దేహ. సృష్ట్యాదుల శమనము బ్రహ్మస్వభావముకంటె వేఱను యభిప్రాయము సరికాదు.

సర్గో విద్యత ఏవాయం న యత్ర కిల కించన
తస్య ధర్మాణి కర్మాణి న చైవాక్షరమాలికా. 7

ఏ బ్రహ్మమున ఈ సృష్టియే యొకింతైనను లేకయున్నదో, అట్టి బ్రహ్మమున నిఁక ఆ సృష్టియొక్క ధర్మములుగాని కర్మములుగాని, తద్బోధకమైన పదవాక్యాదిసమూహముగాని యెట్లుండును?

పృథ్వ్యాది సంభవతి చేత్తత్కారణమస్తు తత్
తదేవ యత్ర నాస్త్యేవ తత్ర కిం తస్య కారణమ్. 8

పృథివ్యాదులు వాస్తవముగ నుండియున్నచో వానికి కారణము గలదని చెప్పవచ్చును. కాని యా పృథివ్యాది పదార్థములే యెచట లేకయున్నవో, అచట నిఁక నేది దేనికిఁ కారణమగును?

బ్రహ్మణః ప్రతిభాతం యత్తదిదం జగదుచ్యతే
తేనైవ కుత ఏతాని పృథ్వ్యాదీని క్వ కారణమ్. 9

బ్రహ్మముయొక్క బ్రతిభాసమేదిగలదో, అదియే యీ జగత్తని చెప్పఁబడుచున్నది. కావున నిఁక ఈ పృథివ్యాదు లెచట? వాని కారణమెచట?

స్వప్నద్రష్టుర్దృశ్యనృణామస్తి కాల్పనికం యథా
న వాస్తవం పూర్వకామం జాగ్రత్స్వప్నే తథా నృణామ్.* 10

స్వప్నద్రష్టయొక్క దృశ్యరూపులగు మనుజులకు పిత్రాదికారణమెట్లు కల్పనారూపమై వాస్తవముగాకయున్నదో, అట్లే యీ జాగ్రత్తను స్వప్నమందలి జనులయొక్కయు పిత్రాది కారణము వాస్తవము కానిదేయై యున్నది

యథా ప్రాక్కర్మ పుంస్త్వే చ స్వప్నే పుంసాం న విద్యతే
ఇహ జాగ్రత్స్వప్ననృణాం భాతానామపి నో తథా. 11

స్వప్నముననెట్లు పురుషత్వప్రాప్తియందు పురుషులకు పూర్వకర్మ యెట్లులేదో, అట్లే యిట జాగ్రత్తను స్వప్నమందు భాసించు మనుజులకును వాస్తవముగ పూర్వకర్మములేదు. (అది మిథ్యయైయున్నదని భావము.)

జీవాః సర్వేషు సర్గేషు స్వప్నార్థాన్నిఖిలాన్మిథః
ప్రాక్కర్మసత్వం మిథ్యాత్మ యథావాసనమేషు చ. 12

ఈ సృష్టులన్నింటియందును, వాసనానుసారము మిథ్యగ ప్రవర్తించునట్టి సర్వ జగద్వ్యవహారమున జీవులు స్వప్నతుల్యములగు పదార్థములన్నింటిని వాసనానుసారము పరస్పరము గాంచుచున్నారు. మఱియు, ఆ జీవుల పూర్వకర్మముయొక్క సత్తయు వాసనానుసారము మిథ్యగనే ప్రవర్తించుచున్నది.

సర్గాదావథ దేహాన్తే భాన్తి స్వప్నార్థవన్మిథః
యథా సంవేదనం జీవాః సన్తోఽసన్తశ్చ తేన తే 13

భూతభువనాది సృష్టి మొదలుకొని దేహసిద్ధిపర్యంతముగల యీ ప్రపంచమునఁ దమతమ వాసననుసరించి స్వప్నపదార్థములవలె జీవులు పరస్పర మొకరికొకరు భాసించుచున్నారు. కావున స్వప్నపదార్థములవలె వాసనామాత్రాంశమున వారు విద్యమానులుగను, తదితరాంశములందు అవిద్యమానులు (లేనివారు)గను, అసద్రూపులుగను నున్నారు.

యథా సంవేదనం సర్వే భాన్తి భావయతస్తతః
తే సన్త్యాత్మన్యపి స్వప్నే జాగ్రతీవార్థదా మిథః. 14

తమతమ వాసననుసరించి భావించుచు జీవులందఱు పరస్పరము భాసించుచున్నారు. కావున ఆత్మయందు, స్వప్నమునందువలె జాగ్రత్తునందును వారు పరస్పరము అర్థక్రియా సమర్థులగుచు వెలయుచున్నారు.

సంకల్ప సంవిదగ్రస్థవస్తు నిష్ఠతయాఽ స్ఫుటమ్
ఫలం దాప్నోతి తే స్వప్నే లోకనిష్ఠతయాస్ఫుటః. 15

ఓ వ్యాధుఁడా! నీయొక్క స్వప్నమున బాహ్యపదార్థములులేకున్నను భోజనాదులయొక్క సంకల్పమును గూర్చిన సంవిత్తే పాకాదిక్రమముచే నెదుటనున్న అన్నాదులద్వారా తృప్తిరూప ఫలమును బొందుచున్నదో, అట్లే జాగ్రత్సంకల్ప సంవిత్తున్ను బొందుచున్నది. అయితే, జాగ్రత్తు స్పష్టము, స్వప్నము అస్పష్టము — కేవల మింతమాత్రమే భేదము

శుద్ధా సంవిత్స్వభావస్థా యత్స్వయం భాతి భాస్వరా
తస్యా భానస్య తస్యాన్య జాగ్రత్స్వప్నాభిధాః కృతాః. 16

నిజస్వభావస్థమగు శుద్ధమై, ప్రకాశశీలమైనట్టి సంవిత్తెయ్యది స్వయముగ భాసించుచున్నదో అద్దాని స్ఫురణమునకే జాగ్రత్తనియు, స్వప్నమనియు సంజ్ఞలు లోకమునఁ గావింపఁబడినవి.

సర్గాదావథ దేహాన్తే భాతం యద్వేదనం యథా
తత్తథాఽమోక్షమేవాస్తే తదిదం సర్గ ఉచ్యతే. 17

సృష్టిమొదలుకొని దేహపర్యంతముగల యేపదార్థము లెట్లు భాసించుచున్నవో, అవి మోక్షపర్యంతము ప్రవాహరూపముచే నట్లే యుండును దీనిపేరే సృష్టి.

జాగ్రత్స్వప్నార్థసార్థస్య సంవిదశ్చ న భిన్నతా
అస్త్యప్రతిఘరూపాయాః ప్రకాశాలోకయోరివ. 18

ప్రకాశ ఆలోకములందు భేదములేనట్లు, జాగ్రత్స్వప్నపదార్థములందును, వాని నాశ రహితమగు సంవిత్తునందును భేదమేమియును లేదు.

అగ్న్యౌష్ణ్యయోరివ తథా వాతస్పన్దనయోరివ
ద్రవామ్బుసోరివా ఒవీచి వా శైత్యానిలయోరివ. 19

మఱియు, అగ్ని, ఉష్ణత్వములందును, వాయు చలనములందును, తరంగములందు వ్యాపించియుండు జల, ద్రవత్వములందును, శీతలత్వ, వాయువులందును భేదములేనట్లు, ఆ జాగ్రత్స్వప్నముల సంవిత్తునందును, వాని పదార్థములందును భేదములేదు.

సర్వమప్రతిఘం శాన్తం జగజ్జాతమసన్మయమ్
ఇత్థం సన్మయమేవాస్తి నాస్త్యర్థే న చ సంయుతమ్. 20

ఈ సమస్తమున్ను నిరాకారమై, శాంతమైనట్టి బ్రహ్మరూపమేయైయున్నది. ఈ జగత్సమూహమంతయు నిజ (దృశ్య) రూపముచే అసత్తున్ను, అధిష్ఠాన చిద్రూపముచే సన్మయమున్ను నైయున్నది మఱియు 'నేతి నేతి' మున్నగు శ్రుతివాక్యములచే నిషేధింపఁబడుటఁబట్టి యీ జగత్తు (దృశ్యము) నిషేధార్థముతోను గూడియున్నది

బ్రహ్మప్రోద్యోయ మృత్వా చ దృశ్యానుభవరూపి చ
చిన్మాత్రమజరం శాన్తమేకమేవామలం స్థితమ్. 21

వ్యవహారదశయందు బ్రహ్మము జగద్రూపముగ నుద్భవించుచు, ప్రళయరూపముగ నశించుచు దృశ్యానుభవరూపమై వర్తించుచున్నది. కాని పరమార్థదశయందో, కేవలము చిన్మాత్రమై అజరమై, శాంతమై, ఏకమై, నిర్మలమై చెన్నొందుచున్నది.

కార్యకారణతార్థానాం యా యథా హృదికల్పితా
బ్రహ్మణా పురుషేణేవ నగర్యన్తస్తథైవ సా. 22

ఒకానొక నగరమందు మనుజునిచేఁ గల్పింపఁబడునట్టి మృత్తికా, కుడ్యాది పదార్థము లెప్పటియట్లు, వర్తించు విధమున, సృష్ట్యాదియందు బ్రహ్మదేవునిచే తన హృదయమునఁ గల్పింపఁబడిన ఆకాశవాయ్వాదులయొక్క కార్యకారణత్వమున్ను నేఁటికిని నట్లే వర్తించుచున్నది

బ్రహ్మణా హృది సర్గోఽయం హృది తే స్వప్నపూర్యథా
కార్యకారణతా తత్ర తథా స్థితాఽభిహితా యథా. 23

ఓ వ్యాధుఁడా ! నీయొక్క హృదయమున స్వప్ననగరమెట్లుగలదో, అట్లే బ్రహ్మదేవుని యొక్క హృదయమున ఈ సృష్టియున్నుగలదు మఱియు ఈ సృష్టియొక్క కార్యకారణ భావమున్ను, ఆ స్వప్నపదార్థములయొక్క కార్యకారణభావము వంటిదే యైయున్నది.

సంవిద్ఘనోదరే సర్గే కార్యకారణతాస్థితా
తథా యథోహితా తేన త్వయా వా కల్పనాపురమ్. 24

సృష్ట్యాదియం దు బ్రహ్మదేవుఁడే ప్రకారముగ సంకల్పించునో, లేక, నీవు నీ స్వప్నావస్థయందు నగరాదులనెట్లు కల్పింతువో, ఆట్లే చిద్ఘనమగు పరబ్రహ్మముయొక్క యుదరమందున్న సృష్టియొక్క కార్యకారణ భావము (కల్పితరూపము చే) స్థితిగల్గియున్నది.

చితా సంకల్పరూపిణ్యా సర్గే సంకల్ప పత్తనే
త్వయైవ స్థాపితా సంస్థా కార్యకారణరూపిణీ. 25

నీయొక్క సంకల్ప నగరమున సంకల్ప రూపమగు చైతన్యముద్వారా నిజేచ్ఛానుసారము కార్యకారణరూపమగు వ్యవస్థను నీవెట్లు స్థాపింతువో, అట్లే యీ సృష్టియందును నట్టి వ్యవస్థ స్థాపింపబడియున్నది.

ఆకాశ ఏవ కచనం యచ్చిత్తే స్వాత్మరూపిణీ
నియతం సంనివేశత్వాత్తదన్తః సర్గ ఉచ్యతే. 26

సంకల్పనగరమున్ను, తదంతర్గతమగు వ్యవస్థయు స్వాత్మరూపమగు చిదాకాశముయొక్క స్ఫురణమేయైనట్లు, యీ సృష్టియున్ను హిరణ్యగర్భుని సంకల్పాంతర్గమగుటచే చిదాకాశముయొక్క స్ఫురణమే యైయున్నది

యా సంవిద్దవ్యవస్థాస్తే హృదిసంకల్ప పత్తనే
సైషాస్వభావసంసిద్ధిః కార్యకారణతార్థతా. 27

నీయొక్క హృదయమందలి సంకల్పనగరమున చిద్రూప సూర్యునియొక్క స్వప్రకాశరూపమగు ఏ స్థితి సదా నెలకొనియున్నదో, అదియే యీ సృష్టియొక్కయు పదార్థములందలి స్వభావసిద్ధమగు కార్యకారణత్వమై యొప్పుచున్నదేగాని యొకింతైనను తద్వ్యతిరిక్తముకాదు.

ప్రథమం యద్యథా భాతి చిత్త్వమస్తి తథేహ తత్
తస్యైవ నియతిః కాలో దేశాదీత్యభిధా కృతా.

సృష్ట్యారంభమున హిరణ్యగర్భుని చైతన్యము పృథివ్యాదుల రచనయందు గంధ, కాఠిన్యాది నియతిరూపమున నెట్లు స్ఫురించెనో, అది నేఁటికిని నట్లే భాసించుచున్నది. మఱియు పృథివియందు గంధ, కాఠిన్యాది నియతిరూపముతోడను, జలమందు రస, ద్రవత్వాది నియతిరూపముతోడను, అగ్నియందు రూప, ఉష్ణత్వాది నియతిరూపముతోడను, వాయువునందు స్పర్శ, చలనాది నియతిరూపముతోడను, ఆకాశమందు శబ్ద, శూన్యత్వాది నియతిరూపముతోడను, భూత భవిష్యదాది కాలరూపముతోడను, పూర్వ పశ్చిమాది దేశాది రూపముతోడను నున్నట్టి యా చైతన్యమునకే ఆయా పేర్లు పెట్టబడినవి.

యా నామాసు యథా భాతి చేతనాకాశ శూన్యతా
తయా తథా వస్తుతయా కార్యకారణతాశ్రితా. 29

యథార్థముగ సర్వ (పదార్థ) శూన్యమగు, చిదాకాశము ఎట్టిచట నిజకల్పనద్వారా శీఘ్రముగ భాసించుచున్నదో, అచట నట్లే కార్యకారణత్వము యొక్క వ్యవస్థ స్థితినొంది యుండుచున్నది. (గోవునందు క్షీరముయొక్కయు ఘటమునందద్దాని ధారణయొక్కయు కారణత్వ ... స్థితిగల్గియున్నట్లు)

చిచ్చమత్కారమాత్రేఽస్మిన్సర్గాభే భావరూపిణి
పూర్వం భావాః ప్రవర్తన్తే పశ్చాత్సర్గాభిధా విదః. 30

చైతన్యముయొక్క చమత్కారమాత్రమున్ను, సృష్టివలె భాసించునదియు, సంకల్పరూపమున్ను నగు ఈ హిరణ్యగర్భుని మనస్సునందు ప్రథమమున భావములు (రూపములు) ప్రవర్తించుచున్నవి. ఆ పిమ్మట సృష్ట్యాది నామములయొక్క కల్పన గావింపఁబడుచున్నది

శూన్యతాస్త్రిజగద్రూపా స్తథా చిద్వ్యోమని స్థితాః
అనన్యాః పవనే సౌమ్యే స్పన్దసత్తా యథా నిజాః. 31

వాయువుయొక్క స్పంద (చలన) సత్త వాయువుకంటె భిన్నముగ శూన్యరూపమైయు, వాయువుకంటె అభిన్నమైన రూపముగల్గియు నెట్లున్నదో, అట్లే చిదాకాశమున త్రైలోక్యమున్ను, తచ్చిదాకాశవ్యతిరిక్తముగ శూన్యరూపమైయు, చిదాకాశముకంటె అభిన్నమైన రూపముగల్గియు వర్తించుచున్నది.

వ్యోమ్ని సౌషిర్యనైబిడ్యం యథా నీలమితి స్థితమ్
చితి చేతన నైబిడ్యం తథా సర్గ ఉపస్థితమ్. 32

శూన్యమై, నిర్మలమైనట్టి యాకాశమున భ్రమచే నీలత్వమెట్లు భాసించుచున్నదో, అట్లే చిద్ఘనమైనట్టి చిదాకాశమున భ్రమచే సృష్టి సంప్రాప్తమైయున్నది.

ఆభాత ఏవ భాతేఽస్మిన్కృత్స్నాత్సర్గే విసర్గతా
బుధ్యతే రజ్జుభుజగే రజ్జురూపం యథా పునః. 33

భ్రమ నశింప రజ్జు సర్పమందు శూన్యత్వమున్ను మరల రజ్జురూపమున్ను నెట్లెఱుఁగఁబడుచున్నవో, అట్లే, ఆభాసరూపమగు ఈ సృష్టి యెపుడు శ్రవణమననాది సాధనాభ్యాస వశముచే దేశకాలవస్తు పరిచ్ఛేదశూన్యమైనట్టి చిన్మాత్ర స్వభావయుక్తముగ భాసించునో, అపుడు బ్రహ్మమందు సృష్టియొక్క శూన్యత్వ మెఱుఁగఁబడుచున్నది.

మృతః స స్వప్నవత్సర్వః సంపశ్యతి పృథగ్జగత్
తద్వాన్యదిదమన్యచ్చ నిత్యాప్రతిఘమమ్బరమ్. 34

నిజస్వప్నతుల్యమగు మరణానంతరము జీవులందఱును వారివారి వాసనల ననుసరించి వేఱ్వేఱు జగంబులను గాంచుచున్నారు. కాని, వాస్తవముగ ఇహలోకమున్ను, పరలోకమున్ను గూడ నిరాకారమగు చిదాకాశరూపములే యైయున్నవి.

వ్యాధ ఉవాచ:—

పరతః సుఖదుఃఖార్థం దేహః సంపద్యతే కథమ్
కిమస్య హేతుః కే వాస్య హేతవః సహకారిణః. 35

వ్యాధుఁడు:—మహాత్మా! ఈ దేహము నశించినపిదప మతియొక్క దేహ మెట్లుత్పన్నమగును? అద్దానికి ఉపాదానకారణమేమి? మఱియు నిమిత్తసహకారి కారణములెవ్వి?

కుర్వన్తి ధర్మాధర్మాశ్చేత్తేన ప్రతిఘరూపిణా
తదస్యాప్రతిఘం రూపం కుర్వన్తీత్యసమఞ్జసమ్. 36

ధర్మాధర్మములే స్వభోగార్థము సమస్తమును చేయుచున్నవని తలంచుచో సాకారమగు ఈ శరీరముచేఁ గావింపఁబడిన యా ధర్మాది కర్మలచే తత్కర్మ నివృత్తి రూపమగు నిరాకారమైన మోక్షముయొక్క ప్రాప్తియగుట అసమంజసమైయున్నది. ఏలయనిన, కర్మ నిర్మితమైన దానిచే కర్మనివృత్తి యెట్లు కాఁగలదు ?

**మునిరువాచ :—**

ధర్మాధర్మౌ వాసనా చ కర్మాత్మా జీవ ఇత్యపి
పర్యాయశబ్దభారోఽత్ర కల్ప్యతే నతు వాస్తవః 37

ముని :— ఓ వ్యాధుఁడా ! సంస్కారరూపముతోనున్న విహితనిషిద్ధాచరణరూపములగు ధర్మాధర్మములు, అట్టి సంస్కారసమూహ రూపమగు మనస్సు, అందున్నవాసన, చిదాభాసవ్యాప్తమగు ఆ మనంబను జీవుఁడు, కర్మాత్మ (ప్రాణాది చేష్టాప్రధానత్వముతోఁగూడిన జీవుఁడు) ఈ మున్నగు శబ్దములన్నియు పర్యాయవాచకములేయగును అవి యన్నియు చైతన్యమునఁ గల్పింపఁబడినవేగాని వాస్తవములు కావు.

చిత్వాత్కల్పితచిత్తేన స్వయం చిన్నభవాత్మని
కృతాని నామాన్యేతాని కశ్చిద స్తీతి చేతసా. 38

'దేహాదిదృశ్యప్రపంచ మొకానొకటి కలదు' అని చిత్తముచేఁగల్పించి, చిదాభాస రూపముతోటి చిదాకాశమగు స్వాత్మయందు నెలకొనియున్న హిరణ్యగర్భుడు స్వయముగనే యీ ధర్మాధర్మ సుఖదుఃఖాది నామములను కల్పించెను.

సంవిదాత్మా స్వయం చిత్త్వాద్దేహం వేత్తి ఖమేవ ఖే
మృత్వా సన్తం నన్తమివ సంకల్పస్వప్నయోరివ 39

సంకల్ప, స్వప్నములందువలె, మరణించిన పిదప సంవిద్రూపమగు ఆత్మ నిజ చిదాకాశమున చిదాకాశమునే దేహరూపముగ స్వయముగ నెఱుఁగుచున్నది.

స్వయం స్వప్న ఇవాభాతి మృతస్య పరలోకధీః
తమేవ పశ్యతి చిరం న తత్రాప్యస్తి సత్యతా. 40

మరణించిన వానికి పరలోక బుద్ధి స్వప్నమువలె స్వయముగనే భాసించును. దానినే యాతఁడు చిరకాలముగాంచును. అంతేగాని యందు సత్యత్వ మేమియును లేదు.

మృతం నిర్మాతి చేదన్యః కథం వాస్య స్మృతిర్భవేత్
కథం వా స్యాత్ప ఏవాసౌ చేతనత్వం తమేవ ఖమ్ 41

'తత్సృష్ట్వా తదేవాను ప్రవిశత్' - (పరమాత్మ దేహాది జగత్తును నిర్మించి స్వయముగ నద్దానియందుఁ బ్రవేశించెను.) - అను నీ మున్నగు శ్రుతివాక్యములఁబట్టి నిర్మించువానికే ప్రవేశము కానఁబడుచున్నది. మరణించినవానికి తిరిగి మఱియొకఁడు నిర్మించునేనిచో, అట్లు నిర్మింపఁబడిన

వానికి స్తన్యపానాది ప్రవృత్త్యనుకూలమగు స్మృతి యెట్లు కలుగును? మఱియు నపుడు 'అతఁడే యీతఁడు' ఎట్లగును? ఆఁతడే యీతఁడని నమ్మనిచో, ఆ పూర్వసిద్ధమగు ఆత్మనాశ్రయించి జనించిన యాతనియందు నిరూఢమైనట్టి చైతన్యమున్ను శూన్యమేయగును.

మృతో న జాయతే తస్మాచ్చేతస్యైవ స కేవలమ్
ఇహాయమిత్థమేత్యేవ వేత్తి ఖే వాసనాత్మకమ్. 42

కావున యథార్థముగ జీవుఁడు మరణించిన పిదప జనించుటలేదు. కేవలము చిత్తము చేతనే స్వవాసనావశమున నే నిచట నిట్లు జనించితిని అని వ్యర్థముగ, జన్మాది సర్వవికారశూన్య మగు చిదాకాశమున (స్వాత్మయందు) కల్పనచే నెఱుఁగుచున్నాఁడు.

స్వ మేవ భావమభ్యస్తమాస్తే సోఽనుభవంశ్చిరమ్
స్ఫుటప్రత్యయవాంస్తత్ర సత్యమిత్యేవ వేత్త్యలమ్. 43

తనయొక్కయే అభ్యస్తమగు భావనను ఈఁతడు చిరకాల మనుభవించుచున్నాఁడు. మఱియు నద్దానియందు స్పష్టమగు విశ్వాసముగలిగియుండుటచే దానిని పూర్ణసత్యముగ నెఱుఁగు చున్నాఁడు.

భాత్మా ఖమేవ తత్రైవ స్వప్నాభం దృశ్యమాహరన్
పునః స్వమరణం వేత్తి పునర్జన్మ పునర్జగత్. 44

చిదాకాశరూపమగు స్వాత్మ తనయందే స్వప్నతుల్యమగు దృశ్యమును అభ్యాసము గావించుచు మరల మరల నిజమరణమును, జన్మను, జగత్తును ననుభవించుచున్నది.

అలీకజాలమేవం ఖే పశ్యన్వ్యక్త్యైకమాస్థితః
పశ్యత్యాధారయత్యత్తి కించిత్కశ్చిన్న కస్యచిత్. 45

ఈ ప్రకారముగ, ఆత్మచిదాకాశముననే వ్యష్టి (జీవ)భావముచే మిథ్యాజగజ్జాలమును వీక్షించుచు, తన సన్నిధానమాత్రముచే, తనయందు అధ్యస్తములైన కార్యకారణములను జాగ్రత్స్వప్నము లందుఁ బ్రవర్తింపఁజేయుచున్నది. మఱియు సుషుప్తి ప్రళయ మోక్షములందు వానిని భక్షించుచు నున్నది. కాని యథార్థముగ నయ్యది దేనిని వీక్షించుటలేదు. భక్షించుటలేదు.

ఇత్యేవం జగతాం సన్తి కోటీనాం కోటికోటయః
పరిజ్ఞాతాస్తు తా బ్రహ్మ కేవలం దృశ్యమన్యథా. 46

ఈరీతిగ ప్రతిజీవుని ననుసరించియు కోట్లకొలఁది జగంబులు వర్తించుచున్నవి. ఎఱుఁగబడినచో నవియన్నియు కేవలము బ్రహ్మరూపములే యగుచున్నవి. ఎఱుఁగఁబడనిచో దృశ్యరూపములేయై యుండుచున్నవి.

తాభిర్న కస్యచిత్కించిదావృతం నచ సన్తి తాః
తాసాం చ వేత్తి ప్రత్యేకమిదమేవ జగత్త్వితి. 47

ఆ యనేకకోట్ల జగత్తులు దేనిని నొకింతైనను కప్పుటలేదు. అవి యథార్థముగ, విద్యమానములైయు లేవు. కాని ప్రతిజీవుఁడున్ను అందు 'ఈ నాజగత్తే కలదు, మఱియొకటి లేదు' అని తలంచుచున్నాఁడు.

భూతాని తాసాం ప్రత్యేకం తథైవాన్యోన్యమాస్థితే
సత్యాన్యేవాసత్యదృష్ట్యా సత్యదృష్ట్యా త్వజం పదమ్. 48

ఆ యనంతకోటి బ్రహ్మాండములయొక్క పృథివ్యాది పంచభూతములు, అండజాది చతుర్విధ భూతసముదాయము, ప్రత్యేకముగనున్నట్టి, ఆ యా జీవునియొక్క జగత్తునందు ఆ ప్రకారముగనే అన్యోన్యముగ వర్తించుచున్నవేగాని మఱియొక విధముఁగగాదు. అయ్యవి వ్యవహారదృష్టిచే సత్యములును పరమార్థదృష్టిచే బ్రహ్మపదరూపములును నైయున్నవి.

సద్యద్విదితవేద్యస్య తదజ్ఞస్యాసదక్షయమ్
అసద్యత్ప్రంప్రబుద్ధస్య తత్పదజ్ఞస్య సుస్ఫుటమ్. 49

జ్ఞానియొక్క దృష్టియందు నాశరహితమగు ఏ బ్రహ్మరూపమైన సత్తుగలదో, అది అజ్ఞానియొక్క దృష్టియందు కేవలము అసత్తున్ను ఏ జగత్తు జ్ఞానియొక్క దృష్టియందు అసత్తై యున్నదో, అది అజ్ఞానియొక్క దృష్టియందుఁ బ్రత్యక్షమగు సద్రూపమున్నునైయున్నది.

చితేర్యద్యద్యథా భానం తత్తత్సత్యం యథా యతః
సద్రూపాణి సమగ్రాణి భూతానీమాన్యతో మిథః. 50

లేక ఈ చిద్రూపమున నేదేది యెట్లెట్లు భాసించునో, అదియంతయును చిద్రూపదృష్టిచే సత్యమైయేయున్నది. ఈ ప్రకారముగ ఈ సమస్తభూతములున్ను పరస్పరము సద్రూపములేయగును.

నిత్యమన్యోన్య సత్యాని తాని తాన్యేవ వాప్యతః
కిల సంవిద్వినిర్ణేయం రూపమప్రతిఘం యతః. 51

లేక, ఏ యే జగత్తులు ఏ యే సంవిత్తునకు భాసించునో, అవియవి పరస్పరము ఆ యా సంవిత్తునకు నిత్య సత్యములే యైయున్నవి. ఏలయనిన, జగత్తు సత్యమో, అసత్యమో! సత్యమై, నాశరహితమైనట్టి యా సంవిత్తే నిర్ణయించవలసియున్నది.

సంవిన్మాత్రవినిర్ణేయం కాన్యతా నాన్యతా కథా
యథా సంవేదనం భాతే వస్త్వౌఘే క్వ ద్విత్వైకతే. 52

ఎపుడంతయును సంవిత్తుచేతనే నిర్ణయింపఁబడుచున్నదో, అపుడెచట నేప్రకారముగ దానికి భాసించునో యచట నాప్రకారముగనే యున్నదగును. ఇట్టి స్థితియందిఁక ఆ వస్తుసమూహమున భేద, అభేద, ద్విత్వ, ఏకత్వములఁగూర్చిన ప్రసంగమే యెచట?

తదేవేదమిదం జ్ఞప్తేస్తదేవేదం భవత్యలమ్
తదేవైతత్తదేవేతి భవే జ్ఞప్తేరసత్యతః. 53

ఈ జ్ఞేయము (దృశ్య సమూహము) ఆ జ్ఞానమే అయియున్నదను ఈ ప్రకారమగు జ్ఞానజ్ఞేయములయొక్క అభేదమునుగూర్చిన బోధచే ఈ సమస్త దృశ్యమున్ను బూర్ణముగ జ్ఞానరూపమే యగుచున్నది. ఆ జ్ఞానమే యీ జ్ఞేయమను బోధయొక్క అసత్యత్వముచే జ్ఞానరహితమగు జ్ఞేయ (దృశ్యసమూహము) యొక్క సత్తయే సంభవింపనేరదు.

తచ్చేదర్థస్తతో జ్ఞప్తేర్నాయం తస్యాఃపృథక్స్థితః
స్థితే జ్ఞస్యాత్మని త్వర్థే త్వజ్ఞప్త్యాయం తతో వ్రజేత్. 54

ఈ ప్రకారముగ నెపుడే పృథ్వ్యాది సమస్త పదార్థములున్ను జ్ఞానస్వరూపములే యైయున్నవో, అపుడయ్యవి జ్ఞానస్వరూపమగు ఆత్మ (ద్రష్ట) కంటె వేఱుగ లేకున్నవేయగును. ఇట్లు సర్వపదార్థములు జ్ఞానస్వరూపములుగనేయుండ, ఈ ద్రష్ట ఆత్మనుగూర్చిన అజ్ఞానముచేతనే జ్ఞానస్వరూపమగు ఆ యాత్మనుండి స్ఫుతినొందుచున్నది. గాని వాస్తవముగఁగాదు.

జ్ఞానం యదేవ తజ్జ్ఞేయం జ్ఞేయస్యాసంభవాత్పృథక్
యథా జ్ఞానమతో జ్ఞేయం తనోత్యాత్మానమాత్మనా. 55

జ్ఞానముకంటె వేఱుగ జ్ఞేయము (దృశ్యసమూహము) అసంభవమగుటఁబట్టి, జ్ఞేయము జ్ఞానరూపమేయైయున్నది. కావున నిజస్వరూపమును గూర్చిన అజ్ఞానముతోఁ గూడిన జ్ఞానమే (ఆత్మయే) జ్ఞేయజగద్రూపమునఁ దన్ను తనచేతనే విస్తరింపఁజేయుచున్నదని తేలుచున్నది.

పశ్యన్తోఽపి విలన్తోఽపి పృథక్స్రగ్గా న కించన
సత ఏవాసతో జ్ఞస్య మూర్ఖజ్ఞాతాంస్తు వేద్మి నో. 56

ఇక్కారణమున జ్ఞానరూపమగు ఆత్మకంటె వేఱుగలేనివియు, జ్ఞానరూపముతోనే వెలయుచున్నవియునగు సృష్టులను గాంచునట్టి తత్త్వజ్ఞునకు నేత్రాదిసృష్టులు గ్రహించుచున్నను, వానితోడ రూపాదిసృష్టులు కలియుచున్నను, జ్ఞానరూపమగు ఆత్మకంటె వేఱుగ నొకింతైనను లేకయేయున్నది. ఇఁక మూర్ఖులచే (ఆత్మ భిన్నముగ) నెఱుఁగబడినట్టి సృష్టులవిషయమై నేనెఱుఁగను

ఏకం ప్రబోధతః సర్వే చిన్మాత్రం తావదాత్మఖమ్
తదేవానేకసంవిత్త్యా సహస్రం చిజ్జడాత్మనామ్. 57

ఆత్మజ్ఞానముచే ఈ సమస్తజగత్తున్ను ఏకమై, చిన్మాత్రమైనట్టి చిదాకాశమేమైయున్నది. ఆత్మ నెఱుఁగనట్టి అజ్ఞానులకు ఆ యేకమగు ఆత్మయే అనేకజగద్రూపములుగ భాసించుచున్నది.

ఏకం తథా చ చిన్మాత్రం స్వప్నే లక్ష్యాత్మ తిష్ఠతి
పునర్లక్షాత్మ తత్స్వప్నాదేకమాస్తే సుషుప్తకే. 58

ఒకే చిన్మాత్రమగు ఆత్మస్వప్నమున లక్షలకొలఁది ఆత్మ రూపములను ధరించి వర్తించుచున్నది. ఆ లక్షాత్మరూపధారియగు చిదాత్మయే తిరిగి సుషుప్తియం దొకేయాత్మరూపమై యొప్పొందుచున్నది.

చిద్వ్యోమ్ని స్వప్నసంవిత్తిర్యా సైవ జగదుచ్యతే
సుషుప్తం ప్రలయఃప్రోక్తస్తస్మాన్న్యాయోఽయమేవ సన్. 59

చిదాకాశమున ఏ స్వప్నసంవిత్తు గలదో, అదియే జగత్తని చెప్పఁబడుచున్నది. సుషుప్తి ప్రళయమని పేర్కొనఁబడినది. స్వప్న సుషుప్తులయొక్క పూర్వోక్తమగు న్యాయము జగత్తుయొక్క సృష్టి, ప్రళయములందును సమానమేయైయున్నది.

ఏకైవ సంవిన్నానాత్వం స్వలక్షత్వం చ గచ్ఛతి
శూన్యత్వం చ తథార్థత్వం స్వప్న సంకల్పయోరివ. 60

ఒకే సంవిత్తు (చైతన్యము) స్వప్న, సంకల్పములందువలె వివిధభోగ్యరూపములను, లక్షలకొలఁది భోక్తృలగు మనుష్యాదిరూపములను బొందుచున్నది. సుషుప్తియందువలె మరల యదియే పదార్థ శూన్యత్వస్థితినిన్ని బడయుచున్నది.

ఇదమప్రతిఘం సర్వం కిల వేదనమాత్రకమ్
శుద్ధం తద్వద్యథా యత్ర భాతి తత్ర తథా భవేత్. 61

ఈ సమస్తదృశ్యసమూహమున్ను కేవలము నాశరహితమై, శుద్ధమైనట్టి చిన్మాత్రమేయై యున్నది. ఆ చిన్మాత్రమెచట నేరూపముతోటి భాసించునో, అచట నాప్రకారముగనే వర్తించుచుండును.

ఏకైవ సంవిత్సర్గాదౌ భవత్యగ్న్యమ్బుఖాదికమ్
పృథ్వ్యాది తావత్సర్గార్థం స్వప్న సంకల్పయోరివ. 62

స్వప్న, సంకల్పములందువలె, సృష్ట్యాదియందు ఒకే నిర్వికారమగు సంవిత్తే సృష్టి యొక్క సిద్ధికొఱకై పృథివీ, జల, అగ్ని, వాయు, రాకాశాది నానారూపములగుచున్నది.

సంవిదాకాశరూపైవ భాతి పృథ్వ్యాదినామికా
యత్తదేవ ఖమేవేదం జగదిత్యేవ భాసతే. 63

చిదాకాశరూపమగు సంవిత్తే పృథివి మున్నగు నామములతోటి వెలయుచున్నది. ఏలయనిన, చిదాకాశరూపమగు సంవిత్తే యీ జగద్రూపముగ భాసిల్లుచున్నది

సంవిత్ప్రతిఘం భాతి భాతి చాప్రతిఘం తథా
న వస్తుతస్తు ప్రతిఘా సంవిత్సాన్తే నివర్తతే. 64

ఈ చిద్రూపమగు సంవిత్తే నాశవంతమగు సాకారరూపముగను, నాశరహితమగు నిరాకారరూపముగనుగూడ భాసించుచున్నది కాని, వాస్తవముగ దానికి నాశమనునదియే లేదు. ఏలయనిన, అ నాశమున్ను తుదకు నివృత్తమై కేవలము చిన్మాత్రమగు సంవిత్తే శేషించుచున్నది.

యాసి పూర్వాం పశ్చిమాం చ దిశం వేత్సి చిరం విదన్
ప్రతిఘం నామ తే నాస్తి నచ సప్రతిఘా క్వచిత్. 65

ఓ వ్యాధుఁడా! నీవు మనస్సుతో పూర్వ, పశ్చిమదిశలఁగూర్చి చిరకాలమేగుచు ఆ యా చోట్ల చూడఁబడినట్టియు, వినఁబడినట్టియు, అనుమానింపఁబడినట్టియు, (ఇత్యాది) పదార్థముల నెఱుఁగుచు నిన్ను (నీ చిత్స్వరూపమును) నీవెఱుఁగుచున్నావు. అట సంవిద్రూపుఁడవగు నీకు నాశమనునదిగాని, ఆకారమనునదిగాని లేనేలేదు. కాఁబట్టి సంవిత్తెచటను గూడ సాకారముగ గాని, నాశయుక్తముగఁగాని లేదనియే సిద్ధించుచున్నది.

దృష్టం సంకల్పితం చార్థం సహాభ్యస్యతి యశ్చిరమ్
సోఽవశ్యం తదవాప్నోతి న చేచ్ఛాన్తో నివర్తతే. 66

ప్రమాణసిద్ధమైన సంకల్పితపదార్థము నెవఁడు చిరకాలము నిరంతర మభ్యసించునో, అతఁడు శ్రమచే నద్దానినుండి నివర్తింపకున్నచో, తప్పక దానిఁబొందఁగలఁడు.

యాసి పూర్వాం పశ్చిమాం చ దిశం వేత్తి చిరం విదన్
య ఆస్తే యాత్యసౌ తత్తామన్యత్త్యక్త్వా తు నేతరామ్. 67

లేక నీవు పూర్వ పశ్చిమదిశలఁగూర్చి మనస్సు చేజనుఁనపుడు, అచట ఆయాపదార్థములను చిరకాల మెఱుఁగుచు నున్నట్టి సంకల్పయిత (సంకల్పించువాడు) సంకల్పితదిగంత మనోరూపత్వమును, అచటనున్న పదార్థరూపత్వమును, తన సంకల్పముయొక్క దృఢత్వము ననుసరించి పొందుచున్నాఁడు. అట్టి సంకల్పమును త్యజించిన మఱియొకఁడు ఇతరమగు దిక్కును గూర్చి మనస్సుచేనైనను బోవుటలేదు,

దృష్టః సంకల్పితశ్చార్థః స్యామిత్యచలసంవిదః
ద్వయం భవేద్ద్వయం నశ్యత్యన్యస్యాచలసంవిదః. 68

'నేను సంకల్పితపదార్థము నగుదును' అను నీప్రకారమ సంకల్పమున స్థిర సంవిత్తుగల మనుజునకు ప్రథమమున ప్రాతిభాసిక పదార్థప్రాప్తి పిమ్మట సంకల్పముయొక్క దృఢత్వముచే వ్యావహారిక పదార్థప్రాప్తి ఇట్లు రెండునుగూడ కలుగుట (ఐందవోపాఖ్యానాదులందు) గాంచఁబడినది. సంకల్పరహితునకును, లేక విషయాంతరమున స్థిరసంవిత్తుగల మఱియొకనికిని ఆ రెండును గూడ నశించుచున్నవి.

దక్షిణాదుత్తరాం వాశాం యామీత్యచలసంవిదః
ద్వయం భవేద్ద్వయం నశ్యత్యన్యస్యాచలసంవిదః. 69

'దక్షిణదిక్కునుండి యుత్తరదిక్కునకుగాని లేక మఱియొకదిక్కునకు గాని పోవుదును' స్థిరసంవిత్తుగల మనుజునకు ఆ మానసిక, శారీరిక = ఉభయార్థములును సిద్ధించును. సంకల్పరహితునకును, లేక విషయాంతరమున స్థిరసంవిత్తుగల మఱియొకనికి ఆ రెండును నశించును.

ఖే పురం స్యాం భువి మృగః స్యామిత్యచలసంవిదః
ద్వయం భవేద్ద్వయం నశ్యత్యన్యదన్యత్తు తజ్జగత్. 70

అట్లే, 'ఆకాశమున నగరమగుదును, భూమిపై మృగమగుదును' అను స్థిరమైనధారణ గలవానికి ఆ రెండును సిద్ధించుచున్నవి. సంకల్పరహితునకును, లేక విషయాంతరమున స్థిరసంవిత్తు గల మఱియొకనికిని ఆ రెండును నశించుచున్నవి. వీలయనిన, వారిజగత్తు, అన్యమైనదే యగును.

ఏకం ప్రబోధతః సర్వం చిన్మాత్రం తావదాత్మకమ్
తదేవానేకసంవిత్త్యా సహస్రం చిజ్జడాత్మనామ్. 71

ఈ ప్రకారముగ, ఆత్మజ్ఞానముచే ఈ సమస్త జగత్తున్ను నేకమైనట్టి చిన్మాత్రరూపమగు చిదాకాశమేయైయున్నది. అదియే అజ్ఞానముచే అనేక సంవిత్తుల వలన వేలకొలఁది రూపములుగ జీవుల కగుచున్నది.

శరీరమస్త్వప్రతిఘమథ సప్రతిఘం చ వా
స్వప్నాత్మకోఽయం సంసారో జీవస్యేహ పరత్ర చ. 72

జీవునియొక్క యీ ఐహిక, పారలౌకిక ప్రపంచము స్వప్నరూపమే యైయు[illegible] కావున, ఈ శరీరము చిద్రూపముచే నాశరహితమున్ను, నిరాకారమున్ను నైనను, లేక, అస్థిర[illegible] ముచే నాశవంతమున్ను, సాకారమున్ను నైనను, దానిచే చిద్రూపమున కేహానియున్ను లేదు [illegible] యనిన, మిథ్యాపదార్థముయొక్క గుణదోషములచే అధిష్ఠానమున కేసంబంధమున్ను లేదు.

ఏతన్మ్లేచ్ఛాదిదేశేషు మృతానాం దర్శనాత్పునః
స్మృతిపూర్వం చ కథనాత్ప్రత్యక్షమనుభూయతే. 73

దేహముయొక్క నాశముచే జీవచైతన్యము నశింపదు. ఈ విషయము, మ్లేచ్ఛాదిదేశము లందు మరణించి పిశాచదేహముతోటి మరల యిచటికేతెంచు వారిని భూతవిద్య [illegible] ప్రత్యక్షముగ గాంచుటవలనను, పూర్వజన్మలందలి తమ గృహ, వ్యాపారాదుల, గూర్చి యా[illegible] ములు స్మృతిపూర్వకముగ వచించుటవలనను ప్రత్యక్షముగ ననుభవింపబడుచున్నది.

యే మృతా భస్మసాజ్జాత మ్లేచ్ఛ దేశేషు తే పునః
ఆగత్య కథయిత్వార్థం గచ్ఛన్త్యప్రతిమాత్మరాః. 74

మ్లేచ్ఛాదిదేశములం దెవరు మరణించి భస్మీభూతులగు చున్నారో, వారు మరల పిశాచాది రూపములతో నిటకేతెంచి, తమ పూర్వజన్మముయందలి పదార్థముల గూర్చి వచించి, లోకాంతరముల కేగుచున్నారు. అటుపిమ్మట నిరాకారరూపముతో లోకాంతరముల కేగుచున్నారు.

ఏష చేజ్జీవతో ధర్మస్తద్దేశాన్తరగే జనే
మృత ఇత్యేష బుద్ధేఽర్థే కస్మాన్నైవ ప్రవర్తతే. 75

ఈ పిశాచాదుల గూర్చిన దర్శన, సంభాషణాది భ్రమ జీవించియుండు భూతవైద్యుల యొక్కయు ధర్మముగాని మరణించి యేతెంచువారియొక్క ధర్మము కాదని చార్వాకులనినచో, ఆ దర్శన, సంభాషణాది వ్యవహారము, అన్యదేశమును బొందినట్టియు, వాస్తవముగ మరణి[illegible] కున్నను, మరణించితినని భ్రాంతిచే దలచినట్టియు మనుజునియందేల ప్రవర్తించుటలేదు ?

జీవ ధర్మః సోఽపి సంశ్చేన్మృతధర్మోఽపి కిం స సన్
యాదృగనుభవస్త్వస్మిన్సమే న్యాయద్వయే స్థితే. 76

ఆ భాషణాది 'వ్యవహారభ్రమ' జీవితుని ధర్మమేయని అన్నచో. అనుభవమును ప్రమాణముగ నమ్మినట్టి మనుజున కెట్టి యనుభవ మీ జీవితునియందుఁగలదో, అట్టి యనుభవమే మృతునియందును గల్గియుండుటఁబట్టి, జీవిత, మృతు లిరువురియందును సమానమగు న్యాయము వర్తించుటవలన నది మృతుని ధర్మమేల కాఁగూడదు ?

స్వప్నవజ్జగదాఖ్యానమిత్యేవం సత్యఖణ్డితమ్
అర్థ్యానుభవశాస్త్రాణామనేనాస్త్యేకవాక్యతా. 77

ఈ ప్రకారముగ, అనుభవముయొక్క అర్థసాధకత్వమువలన, మేల్కొనిన పిదప స్వప్న పదార్థములయొక్కబాధవలె ఆత్మజ్ఞానానంతరము జాగ్రత్పదార్థములయొక్కబాధయు అనుభవముచే

సమానమేయైయున్నది. కావున స్వప్నమువలెనే యీ జాగ్రత్తున్ను భాసించుచున్నదను విషయము దృఢపడినదై యొప్పుచున్నది. ఇక్కారణముననే, ఆర్యుల యనుభవమున్ను 'వాచారంభణం వికారో నామదేయం' - (ఈ జగద్రూప వికారమంతయు కేవలము వాక్కుయొక్క విషయము మాత్రమై యున్నది,) 'నేహ నానా స్తి కించన' (ఇట అనేకత్వ మొకింతైనను లేదు. చిద్రూపము మాత్రమే గలదు. అనునీమున్నగు శాస్త్రములున్ను నొకేయర్థమును బోధించుట సంభవించుచున్నది.

దృష్టికాలం జనౌఘానాం పశ్యతామిన్దుమణ్డిరే
యాదృగప్రతిఘం తాదృగ్జగత్సదసదాత్మకమ్. 78

చంద్రబింబమును జూచునట్టి మనుజుల దృష్టిసమూహమెట్లు పరస్పరము అవిరుద్ధమై, (ఒకదానికి సత్తుగను, మఱియొకదానికి అసత్తుగను దోచుటవలన) సదసద్రూపమై వర్తించుచున్నదో, అట్లే యీ జగత్తున్ను పరమార్థమున నాశరహితమై జనులదృష్టియందు కొందఱికి సత్తుగను, మఱికొందఱికి అసత్తుగను నుండుచున్నది.

సన్మాత్రమాత్రానువిధమద్వానుభవమాత్రకమ్
చిన్మాత్రం భానమాత్రాత్మ సర్వార్థా త్మార్థవర్జితమ్. 79

గ్రాహ్యపదార్థములన్నిఁటియందును సన్మాత్రాంశముచే నెఱుఁగఁబడునదియు, నిర్మలమైనదియు, అనుభవ మాత్రరూపమైనదియు, చిన్మాత్రమై యొప్పునదియు, ప్రకాశమాత్ర స్వరూపమైనదియు సర్వపదార్థవర్జితమైనను సర్వపదార్థమయమైనదియునగు ఆత్మయొక్క రూపమే యీ జగత్తు.

సర్వమప్రతిఘం శాన్తం జగదేకం చిదమ్బరే
అనిఙ్గనమనా భాసమాత్మన్యేవాత్మనాస్యతామ్. 80

ఓ వ్యాధుఁడా! ఈ సమస్త జగత్తున్ను చిదాకాశమున నిరాకారమై, నాశరహితమై, శాన్తమై నిర్మలమై, ఆభాసవర్జితమై వెలయుచున్నది. కావున, అట్టి నిజచిదాత్మరూపముతో నియందే నీవు సుస్థిరుఁడవైయుండుము.

అచలా సంవిదేవాస్తే స్థిరం కృత్వా యథా యథా
తథా తథా భవత్యాశు కిమసత్కిం చ వాపి సత్. 81
శరీరాణ్యథ కర్మాణి దుఃఖాని చ సుఖాని చ
యథాస్థితాన్యుపాయాన్తు యాన్తు వా కస్య కిం గ్రహః. 82

నిశ్చలమగు సంవిన్మాత్రము మనస్సును స్థిరమొనర్చి యే యే ప్రకారముండునో, ఆ యా ప్రకారమయ్యది శీఘ్రముగనగుచున్నది. కాఁబట్టి యిఁక సత్తేమి, అసత్తేమి? ఇక్కారణమున, యథారీతి స్థితిగల్గియున్నట్టి శరీర, కర్మ, సుఖ, దుఃఖాదులు ప్రాప్తించుగాక, లేక వెడలిపోవుగాక! ఇందెవని కేమి పట్టుదల గలదు?

ఇత్థమస్తు సదథాన్యథాస్తు వా మైవ భూద్భవతు కోఽత్ర సంభ్రమః
ముఞ్చ ఫల్గుని ఫలే ఫలావహాం బుద్ధవానసి కృతం పరిభ్రమైః. 83

ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే ఉత్తరార్థే అవి॥ విప॥ శవో॥ నిర్వాణబోధోపదేశో నామ త్రిచత్వారింశదధికశతతమః సర్గః ॥ 143 ॥

ఓ వ్యాధుఁడా! ఈ ప్రకారముగ, ఈ జగత్తు సత్తైయుండుగాక, లేక, అసత్తైయుండుగాక, దీనియందెవనికిని నేవిధమగు భ్రమయులేకుండుగాక. మఱియు నీవిఁక తుచ్ఛఫలములఁ గూర్చిన ప్రయత్నమును విడువుము. ఏలయనిన, నీ విపుడు నీ ఆత్మస్వరూపమును నెఱిఁగితివి. కావున నిఁక ఈ సంసారమునఁ దిరుగాడుట వ్యర్థమైయున్నది.

**ఇది శ్రీవాసిష్ఠతాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున నుత్తరార్ధమున అవి॥విప॥శవో॥ నిర్వాణబోధోపదేశమను నూటనలుబదిమూఁడవ సర్గము ॥143॥**



## చతుశ్చత్వారింశదధికశతతమః సర్గః

[ చిదేవ జగదాభాతి జగదేవ చ చిద్యథా
యుక్తయోఽత్ర తథా బ్రహ్మ సర్వశక్తి సమర్థ్యతే.

చైతన్యమే జగద్రూపముగ భాసించుచున్నది; జగత్తు కేవలము చిద్రూపముగనే వెలయుచున్నది - అను నివ్విషయమున యుక్తులు వచింపఁబడుట బ్రహ్మముయొక్క సర్వశక్తిత్వము సమర్థింపఁబడుట యుచటఁ గాననగును. ]

**మునిరువాచ :—**

సర్వథాభావభావేషు స్వప్నసంవేదనాత్మసు
నిత్యాప్రతిఘరూపేషు కిం బద్ధం కిం విముచ్యతే. 1

ముని:— ఓ వ్యాధుఁడా! సమస్త భావాభావ పదార్థములున్ను స్వప్నాను భవసదృశరూపములై, (అధిష్ఠానదృష్టిచే) సదా నాశరహితములై, కేవలము చిన్మాత్రస్వరూపములైయుండ నిఁక బంధింపఁబడునదేది ? ముక్తినొందునదేది ?

ఖే దృష్టిభాసాం స్ఫురణం యాదృశం తాదృశం జగత్
విపర్యస్యత్యవిరతమబోధాల్లక్ష్యతే స్థిరమ్. 2

దృష్టియొక్క అస్థిరత్వముచే నాకాశమున నేత్రకిరణములకు కేశ, సూత్ర, ముక్తాదులెట్లు స్ఫురించునో, స్థిరత్వముచే నెట్లు స్ఫురింపవో, అధిష్ఠానమగు ఆత్మనుగూర్చిన అజ్ఞానముచే ఈ జగత్తు నిరంతరము పరిణామమువలన వికారవంతమై చూపట్టును. కాని ఆత్మజ్ఞానముచే నిశ్చలచిద్రూపముగ భాసించును.

యద్యథా పురసంస్థానం చిరై రేతి తదన్యతామ్
జగదప్యేవమనిశం వార్యావర్తవివర్తవత్. 3

జలముయొక్క అవగ్రముయొక్క పరిణామమువలె నగరస్థానము చిరకాలమునకు మఱియొక రూపమును బొందునట్లు ఈ జగత్తున్ను నిరంతరము పరిణామమును బొందుచున్నది.

భూమ్యమ్బ్వమ్బరశైలాది భవత్యసదిదం క్షణాత్
తస్మిన్నేవ క్షణోద న్తైర్యుగకల్పాభిధాః కృతాః. 4

ఏకాలమున ఈ భూమి, జల ఆకాశ, పర్వతాదిరూపమగు జగత్తు క్షణములోనే అ సద్రూపమగుచున్నదో, ఆ కాలముననే క్షణ, లవాద్యవయవములచే విద్వాంసులు యుగ, కల్పాది సంజ్ఞలను గావించిరి.

జగత్స్వప్న ఇవాశేషమసదప్యనుభూయతే
యన్నాస్తి చేత్తన్నిః శేషం చిదేవేత్థం కచత్యలమ్. 5

ఈ జగత్తంతయు స్వప్నమువలె అసద్రూపమైనను అనుభూతమగుచునేయున్నది. ఎపుడీ జగత్తు లేకయేయున్నదో అపుడే సమస్తరూపముచే చైతన్యమే స్ఫురించుచున్నదగును.

యథేదం నో జగత్తద్వచ్ఛతానాం ఖే శతాని హి
నృణాం పశ్యన్తు తేషాం తు నాన్యోన్యమనుభూతయః. 6

ఓ వ్యాధుఁడా! మనకీ ప్రసిద్ధమగు జగత్తెట్లు కలదో, అట్లే యాకాశమున నితరమను ష్యులకును లక్షలకొలఁది జగంబులు కలవనియే నిశ్చయింపుము. కాని, అవియన్నియు అయోగ్య త్వముచే జనులకుఁ బ్రత్యక్షముగ పరస్పర మనుభూతము లగుటలేదు.

సరోబ్ధికూపభేకానాం దృష్టాః ప్రత్యేక మాస్పదే
న తేఽన్యోన్యం విదన్త్యన్యాం దృశ్యాదినియతిం క్వచిత్. 7

తటాక, సముద్ర, కూపాదులందలి మండూకాది (కప్పలు మున్నగు) ప్రాణులు ప్రత్యే కముగ తమతమ స్థానములందుఁ జూడఁబడుచున్నవి. కాని యవి పరస్పరము ఒకదాని దృశ్యాది రూపనియతిని మఱియొకటి ఎచటను నెఱుఁగుటలేదు. (మనుష్యాదుల) స్థితియు నట్టిదియేనని గ్రహింపుము.)

యథా జనశతస్వప్ననగరాణ్యేకమన్దిరే
తథా జగన్తి ఖే భాన్తి భాని నో సన్త్యసన్తినో. 8

ఒకే గృహమున నిదురించుచున్న యనేక మనుజులయొక్క స్వప్నములందలి వివిధ నగరాదులు పరస్పర మెట్లెఱుఁగఁబడకయుండునో, అట్లే యాకాశమున ననేక జగత్తులు భాసించు చున్నను, అవి యెవని కనుభూతములగునో, వానికి సత్యములుగను, తదితరుల కసత్యములుగను నున్నవి.

కచన్తి నృశతస్వాప్నపురాణ్యేకగృహే యథా
నచ నామ కచన్త్యేవం సన్త్యసన్తి జగన్తి ఖే. 9

ఒకే గృహమున నిదురించుచున్న యనేక మనుజులయొక్క స్వప్నములందు భాసించు వివిధనగరాదులు, ఆ యా స్వప్నద్రష్టలకు సత్యములుగను, తదితరులకు అసత్యములుగను నున్నట్లే, ఆకాశమందును అనేక బ్రహ్మాండములు సదసద్రూపముతోటి స్ఫురించుచున్నవి.

చిచ్చమత్కారమాత్రం స్వం స్వాత్మాఙ్గం దృశ్యమద్వయమ్
సరూపమేవ నీరూపం సకారణమకారణమ్. 10

ఈ అద్వయమగు జగత్తు స్వాత్మయొక్క అవయవరూపమువంటిదై, నిజచైతన్యము యొక్క చమత్కార మాత్రమేమైయున్నది. ఇది యొకనికి సాకారముగను, మఱియొకనికి నిరాకారముగను, ఒకనికి కారణసహితముగను, మఱియొకనికి కారణరహితముగను నున్నది. కాని తత్త్వదృష్టిచే సదా నిరాకారమై, కారణరహితమై వెలయుచున్నది

దధత్యాశ్చిత్స్వభావాయాః సంస్కారాద్యభిధాః కృతాః
ప్రతిమాయాః ప్రభావిన్యా న సంస్కారాదయః పృథక్. 11

జీవులయొక్క యీ జగత్సంస్కారములు కేవలము చైతన్యమునందుగాని, కేవలము దేహమునందుగాని ప్రత్యేకముగలేవు ఆ యా దృశ్యాకార పరిణామమును ధరించునదియు, చిదాభాస వ్యాప్తమైనదియు, చిత్స్వభావము గలదియునగు బుద్ధికి జగత్తు సంస్కారము మున్నగు పేర్లు పెట్టఁబడినవి.

అపూర్వత్వాత్స్మృతిః స్వప్నః సంకల్పార్థానుభూతిషు
స్వమృత్యనుభవాద్యాస్తు దృష్టార్థసదృశీషు చ 12

పూర్వము గాంచఁబడిన పదార్థములను బోలినట్టి సంకల్పిత పదార్థములయొక్క యనుభవములందలి స్మృతియే, అపూర్వత్వమువలన స్వప్నమగుచున్నది. అందు, స్వమరణాదుల యొక్క యనుభవము లీజన్మయందనుభూతములు గాకయున్నను, జన్మాంతరములం దనుభూతములైయేయున్నవి. గావున అట్టి మరణాదుల సంస్కారములతోఁగూడిన స్మృతిరూప బుద్ధియే స్వప్నజగద్రూపమునంతయు ధరించుచున్నదని నిశ్చయించుచున్నది.

ఇదం సర్గాత్మ సర్గాదౌ ప్రకాశస్వప్నవజ్జృమ్భతే
చిద్భామాత్రాత్మకా స్వచ్ఛా నాన్యన్నామోపపద్యతే. 13

ఈ బాహ్యజగత్ జగత్తున్ను సృష్ట్యాదియందు స్వప్నమువలెనే విజృంభించుచున్నది. ఇది వాస్తవముగ చైతన్యముయొక్క నిర్మలప్రకాశ మాత్రస్వరూపమేయగును గాని మఱియొక రూపము దానికి తగదు.

బ్రహ్మైవ భాతి జగదిత్యుక్తముక్త్యానయా భవేత్
నచ భాతం నవం తచ్చ బ్రహ్మైవేదమతః స్థితమ్. 14

ఈ జగత్తు బ్రహ్మ రూపముగనే భాసించుచున్నది. మఱియు నియ్యది పూర్వము భాసింపక యిపుడు నూతనముగ భాసించుచున్నదికాదు. అనాదిప్రకాశరూపమైనట్టి, బ్రహ్మముతోటి యైక్యమును బొందియుండుటవలన ఈ జగత్తున్ను అనాదియగు బ్రహ్మమేయను తాత్పర్యము తేలుచున్నది

కారణం కార్యమిత్యుక్తః స పూర్వః స విశిష్యతే
సంస్కార ఇతి తేనైష సంస్కారః కృతిరుచ్యతే. 15

ఆ పరమాత్మయే కారణమని, కార్యమనికూడ జెప్పఁబడినది. ఏలయనిన, ఆ సామాన్య రూపమగు కారణమే విశేషరూపమగు కార్యముగనున్నది. కర్మసంస్కారములయొక్క ఆధారభూత

మగు బీజరూపమైన కారణము సమ్యక్ – రీతి (చక్కగ) కార్యము నాచరించుటవలన 'సంస్కార' మనఁబడుచున్నది. ఇట్టి వ్యుత్పత్తిచే, ఈ యాత్మయే సంస్కారమనియుఁ జెప్పబడినది. మఱియు, కార్యానుకూలమగు యత్నము అను అర్థముగల 'కృతి' రూపమైన సంస్కారమున్ను, ఈ ఆత్మయే యని చెప్పఁబడుచున్నది.

తత్స్వప్నాదావపూర్వోఽర్థో దృష్టాన్త ఇతి భాతి యః
నసంస్కారాదినామోక్తో న బాహ్యోఽర్థోస్తి చేతసి. 16

స్వప్నాదులందు జాగ్రద్దృష్ట పదార్థములకు విలక్షణమైనట్టి యే పదార్థములు, జాగ్రత్పదార్థ దృష్టాంతముల చందమున భాసించుచున్నవో, అవియే సూక్ష్మరూపములగుటచే సంస్కార, వాసనాది నామములచేః జెప్పఁబడు చున్నవేగాని సంస్కారమను బేరుగల మఱియొక బాహ్య పదార్థమెద్దియు చిత్తమందుఁ బ్రవేశించియుండలేదు.

వస్తు దృష్టం న దృష్టం చ సద్భాస్తే చేతనేవ ఖే
స్వభావాద్భాతి భాత్మాపి దృష్టవద్భాతిజ్ఞ్మృతే. 17

ఆ సంస్కారమను వస్తువు స్వప్నమందు గాంచఁబడినదై, జాగ్రత్తునందుఁ గాంచబడక యున్నప్పటికిని. జాగ్రత్తునందదిలేదని తలంపరాదు. ఏలయనిన, చిత్తాకాశమున నది చైతన్యమువలె సదా విద్యమానమైయేయున్నది. చిదాకాశరూపమగు ఆత్మ సాక్షిస్వభావమువలన స్వప్నమందును భాసించుచున్నది. మఱియు జాగ్రద్దృష్టపదార్థములవలె మిగుల విస్తరించుచున్నదానివలె నున్నది.

వేదాన్తార్థాత్మకం పూర్వసర్గాభావం ప్రవర్తతే
తతో వేద్యవ్యవస్థాజ్ఞైః క్రియతే స్వార్థసిద్ధయే. 18

సాధనచతుష్టయసంపత్తిసహిత శ్రవణాదులచే నిశ్చయింపఁబడు అద్వితీయ సాక్షిరూప బ్రహ్మమను వేదాంతార్థరూపమైన ఆ యాత్మయే సత్యమైనది. అయ్యది పూర్వప్రసిద్ధమగు ద్వైత సృష్టియొక్క బాధకరూపమగుచు యథారీతి స్థితిగల్గియున్న తన ఆత్మ స్వభావమున బ్రవర్తించు చున్నది. ఇట్టి యా బ్రహ్మస్వభావమును నిశ్చయించి తత్త్వజ్ఞులు శిష్యులందును పరమపురుషార్థము యొక్క సిద్ధికొఱకై, పూర్వము అజ్ఞాతమగు ఆత్మయే జగత్తు, సంసారమనియు, పిదప సమ్యక్ - విచారముచే నెఱుఁగఁబడిన ఆ యాత్మయే అద్వయమగు బ్రహ్మము, మోక్షమనియు ఈ ప్రకారమగు వ్యవస్థను శాస్త్రములందు, గావించిరి.

స్వప్నే తు జాగ్రత్సంస్కారో యస్తజ్జాగ్రత్కృతం నవమ్
అజాగ్రజ్జాగ్రదాభాసం కృతమిత్యేవ తద్విదః. 19
తతో వాయావివాస్పన్దశ్చిత్తే భావాః స్థితాః స్వతః
తే స్వతః సంప్రవర్తన్తే క్వాత్ర సంస్కారకర్తృతా. 20

స్వప్నమందలి యే జాగ్రత్సంస్కారముగలదో, అది జాగ్రత్తువలననే యేర్పడినదనియు, అటు జాగ్రద్విలక్షణమైనటి అపూర్వమైనరూపమేదిగలదో, అది జాగ్రత్తుకంటె భిన్నమైనను జాగ్రత్తు

యొక్క ఆభాసమై, జాగ్రదనుభవముచేతనే యేర్పడినదైయున్నదనియు, అవ్విషయము నెఱిగిన కొందఱు తలంచుచున్నారు. గాని యది సరికాదు. ఏలయనిన వాయువునందు చలనమువలె స్వప్నాది రూపపదార్థములు చిత్తమందు స్వతఃయుండియున్నవి. అవి స్వయముగనే స్వప్నాద్యాకారములఁ బ్రవర్తించుచున్నవి ఇట జాగ్రత్సంస్కారముయొక్క కర్తృత్వమేమి గలదు ?

ఏకం తథా చ చిన్మాత్రం స్వప్నే లక్షాత్మ తిష్ఠతి
పునర్లక్షాద్యతః స్వప్న ఏకమాస్తే సుషుప్తకమ్. 21

ఒకే చిన్మాత్రము స్వప్నమున లక్షలకొలఁది రూపములను ధరించుచున్నది. మరల ఆ యనేక లక్షరూపధారియగు స్వప్నమే ఏకమగు సుషుప్తిరూపముగ శేషించుచున్నది.

చిద్వ్యోమ్ని స్వప్నసంవిత్తిర్యా సైవ జగదుచ్యతే
సుషుప్తం ప్రలయః ప్రోక్తస్తస్మాన్న్యాయోఽయమేవ సన్. 22

చిదాకాశమున ఏ స్వప్నసంవిత్తు గలదో, అదియే జగత్తని చెప్పఁబడుచున్నది. మఱియు సుషుప్తి ప్రళయమని వచింపఁబడినది కాఁబట్టి సమాన యీ న్యాయమే సత్యమైనది.

ఏకమేవ చిదాకాశం సాకారత్వమనేకకమ్
స్వరూపమజహద్ధత్తే యత్స్వప్న ఇవ తజ్జగత్ 23

ఏకమగు చిదాకాశము తనస్వరూపమును త్యజింపకయే సాకారములగు అనేకరూపములను ధరించుట యేదిగలదో, అదియే స్వప్నమువంటి జగత్తై యొప్పుచున్నది

ఏవం చిత్పరమాణ్వన్తర్జగద్భావమిదం స్థితమ్
తదనన్యాత్మ బాహ్యోఁగి స్వప్నాదర్శలవేష్వివ. 24

ఈ ప్రకారముగ చైతన్యపరమాణువునందు ఏ యీ విస్తారమగు జగద్రూపము వర్తించుచున్నదో, అది స్వప్న, దర్పణతలములందలి నిజముఖ, వన నగరాదులవలె, ఆత్మకంటె వేఱుకానిదై యున్నది.

చిద్వ్యోమ సంవిన్మాత్రం యత్పరమాణువదాతతమ్
అనాదిమధ్యపర్యన్తం తదేవ జగదుచ్యతే. 25

పరమసూక్ష్మమై, వ్యాప్తమై, కాలతఃకూడ ఆదిమధ్యాంత రహితమైనట్టి చిదాకాశముయొక్క స్ఫురణమాత్రమెయ్యదిగలదో, అదియే జగత్తని చెప్పఁబడుచున్నది.

తస్మాద్యత్ర చిదాకాశమనన్తం సతతం స్థితమ్
తత్రాస్తీతి జగద్భానం తదజ్ఞానస్వరూపి యత్. 26

కాఁబట్టి యెచట అనంతమై, సద్రూపమై, వ్యాప్తమైనట్టి చిదాకాశముగలదో, అచట దానియంగముపగిది యద్దానికంటె వేఱుకానిదైనట్టి జగత్తుయొక్క స్ఫురణమున్నుగలదు

చిన్మాత్ర ఏవ భువనం త్వమహం చిన్మయం జగత్
ఇతి న్యాయాజ్జగద్భాతి పరమాణావదరేఽవ్యజమ్. 27

'ఈ జగత్తు చిన్మాత్రమే; నీవు, నేను, సమస్తమున్ను చిన్మయ స్వరూపమే' అను ఈ ప్రకారమగు గురు శాస్త్రోక్తయుక్తి సమూహముచే చిన్మాత్రపరమాణువుయొక్క యుదరమున ఈ జగత్తు ప్రవేశించుచున్నది. (తన స్థూలత్వమును త్యజించి జనన మరణ రహితమగు చిద్రూపత్వ మును బొందుచున్నది.

తస్మాదహం పరాణ్వాత్మా సమస్తజగదాకృతిః
సర్వత్రైవ చ తిష్ఠామి పరమాణావదేఽపి చ. 28

కావున నేను పరమసూక్ష్మమైనట్టి ఆత్మయొక్క స్వరూపము గలవాఁడనైయున్నను, సమస్తజగదాకారముగఁగూడ వెలయుచున్నాను. మఱియు సర్వత్ర స్థితి గల్గియున్నాను; పరమాణువునందును విలసిల్లుచున్నాను.

చిన్మాత్ర పరమాణుః సఞ్జగదాత్మాప్యయం నభః
యత్ర తిష్ఠామ్యహం తత్ర పశ్యామి భువనత్రయమ్. 29

చిదాకాశరూపమగు చిన్మాత్రపరమాణువై యున్నప్పటికిని నీ విశాల జగదాకారముగఁ గూడ స్థితి గల్గియున్నాను. మఱియు నేనెచట నుండుచున్నానో, అచట ముల్లోకములను గాంచు చున్నాను.

అహం చిత్పరమాణ్వాత్మా తేన చిత్పరమాణునా
ఏకతామాగతో వారి వారిణేవ తదీక్షణాత్. 30

బ్రహ్మమును గాంచుటఁబట్టి, చైతన్యపరమాణు (శోధిత 'త్వం' పదార్థ) రూపుఁడగు నేను ఆ చైతన్యపరమాణువగు (శోధిత 'తత్' పదార్థమగు) బ్రహ్మముతోటి. జలమందుంచఁబడిన జలమువలె నైక్యమొందితిని.

తదోజః సంప్రవిశ్యాహం స్థిత స్తదనుభూతివత్
అన్తస్త్రిజగద్రూపో యథాబ్జే బీజమఙ్కురే. 31

కమలముయొక్క అంకురమున భావికాలపు అనేకవైచిత్ర్యములతోఁగూడిన బీజముండు నట్లు అభ్యంతరమున ముల్లోకములను ధరించియున్నట్టి నేనపుడాప్రాణియొక్క తేజమందుఁ బ్రవే శించి, అతని వాసనామయమగు జగత్తుయొక్క యనుభవరూపమువలె నచట నుంటిని.

తత్ర మే త్రిజగద్రూపమన్తః కచితమాత్మని
తథా తన్నతు తద్బాహ్యే విద్యతే కేనచిత్క్వచిత్. 32

అట నా ఆత్మయందే సర్వులయొక్క వాసనామయమగు త్రైలోక్యరూపము భాసిల్లెను. ఆ జగద్రూప మొకింతైనను బాహ్యమున లేదు. (ఆత్మయందు బాహ్యప్రదేశముయొక్కయే అత్యంతా భావమువలన)

యత్ర యత్ర యదా భాతి స్వప్నే జాగ్రదితీహ వా
నబాహ్యాభ్యన్తరం దృశ్యం నిజం చిద్భానమేవ తత్. 33

స్వప్నమందుగాని, జాగ్రత్తునందుగాని యెప్పుడెచటెచట బాహ్యమందును అభ్యంతర మందును నేయే దృశ్యము కానుపించుచున్నదో, అది యంతయు నిజచైతన్యముయొక్కయే స్ఫుర

భాతి స్వప్నే యదా జన్తోర్జగదానన్దమాతతమ్
చిదణోరేవ తద్భానమాత్మనస్తత్ప్రదాత్మనా. 34

జీవునకు స్వప్నావస్థయందు ఏ ఆనందవ్యాప్తమగు జగత్తు భాసించుచున్నదో, అది చిద్రూపాణువుయొక్కయే స్వప్నస్థానరూపముతోటియైన స్ఫురణమగును.

వ్యాధ ఉవాచ :—

అకారణం చేద్దృశ్యం తత్కథమేతత్ప్రసిధ్యతి
సకారణం చేద్దృశ్యం తత్స్వప్నే సర్గాదిధీః కుతః. 35

వ్యాధుఁడు:— ఓ మునీంద్రా! ఈ దృశ్యజగత్తు కారణరహితమైనచో, దీని ప్రసిద్ధియే యెట్లగును? కారణసహితమైనచో స్వప్నమందు దండ, చక్రాది కారణములు లేకయే ఘటాది సృష్టినిగూర్చిన బుద్ధి యెట్లు కలుగుచున్నది.

మునిరువాచ :—

అకారణక ఏవాయం సర్గ ఆదౌ ప్రవర్తతే
సమస్తకారణాభావాద్యతః సర్గాత్మ చిన్నభః. 36

ముని:— ఓ వ్యాధుఁడా! ఈ సృష్టి కారణరహితముగనే మొట్టమొదట ప్రవర్తించుచున్నది. ఏలయనిన సమస్తకారణములయొక్క అభావమందును చిదాకాశము సృష్టిశక్తిమయమై యున్నది.

అకారణానాం భావానామత్యన్తా సంభవాదిహ
క్వచిత్ప్రతిఘః సర్గో న సంభవతి కశ్చన. 37

మఱియు, కారణరహితములగు పదార్థములయొక్క అత్యంతాభావమువలన, ఇట కారణరహితముగ స్థూలసృష్టి యెచటను సంభవింపనేరదు (ఇక, ప్రాతిభాసికసృష్టి మిథ్యాభూతమగుటచే దానికి సకారణత్వనియమములేదు.)

బ్రహ్మేదమిత్థమాభాతి భాస్వరం చిత్స్వభావతః
సర్గాదిశబ్దపర్యాయమాద్యంతపరివర్జితమ్. 38

ఆద్యంతరహితమై, సృష్ట్యాదిశబ్దపర్యాయరూపమై, ప్రకాశమానమైనట్టి బ్రహ్మమే తన చిత్స్వభావముచే నిట్లు జగద్రూపమున భాసిల్లుచున్నది.

ఇత్యకారణకే సర్గే కచతి బ్రహ్మరూపిణి
పరస్యావయవాభాసే నిత్యాత్మావయవాత్మనా. 39

అనానాత్వేఽపి నానాత్వే బ్రహ్మణ్యా బ్రహ్మరూపిణి
అనాకారేఽపి సాకారే కచత్యప్రతిఘం ప్రతి. 40

తద్బ్రహ్మైవ నిరాకారం చిద్రూపత్వాత్స్ఫురద్వపుః
సాకారమివ భాతాత్మ భూత్వా స్థావరజంగమమ్. 41

దేవర్షిముని భారూపం కరోతి నియతిం క్రమాత్
విధీంశ్చ ప్రతిషేధాంశ్చ దేశకాల క్రియాదికాన్. 42

ఈ ప్రకారముగ సృష్టి మిగుల అసంభవమైయుండ, బ్రహ్మరూపమగు మాయా ప్రతిబింబ చైతన్యమున నిత్యమై నాశరహితమైనట్టి ఆత్మ ఔపాధికమగు అవయవరూపముచే, ఏకమైనను, అనేకముగను, బ్రహ్మరూపమైనను, అబ్రహ్మరూపముగను. నిరాకారమైనను సాకారముగను స్ఫురించుటచేబట్టి, నిరాకారమగు ఆ బ్రహ్మమే చిద్రూపత్వమువలన ప్రకాశమానమగు శరీరము గలిగి, సాకారమువలె నయి, భాసమానరూపముతో వెలయుచు దేవర్షి, మున్యాదులతోడ చెన్నొందు స్థావర జంగమ జగత్తును క్రమముగనద్దాని నియతిని, శాస్త్రీయ విధినిషేధాదులను, దేశకాల క్రియాదులను నిర్మించెనని తేలుచున్నది.

భావాభావ గ్రహోత్సర్గ స్థూలసూక్ష్మచరాచరాః
అర్థా వ్యభిచరన్త్యేతే నియతిర్నాఖిలాస్తతః. 43

అట్లు బ్రహ్మనిర్మితములగుటచేతనె భావ, అభావ, గ్రహణ, త్యాగ, స్థూల, సూక్ష్మ, చరాచరాది సమస్త పదార్థములయొక్క వ్యభిచారము(మార్పు) సంభవించినను, వానినియతియొక్క వ్యభిచారముమాత్ర మెచటను సంభవింపక యున్నది

తతః ప్రవృత్తి భావానాం సకారణకతాం వినా
సైకతాదివ తైలానాం న సంభవతి సంభవః. 44

అట్టి నియతియొక్క కల్పనానంతరము ఇక కారణము లేకుండ పదార్థములయొక్క యుత్పత్తి ఇసుకనుండి తైలముయొక్క యుత్పత్తివలె నెన్నటికిని సంభవింపనేరదు.

నియతిర్నాయకశ్చైవ బ్రహ్మతశ్చాఙ్గమాత్మనా
స్వాఙ్గేన సంయమయతి కరేణేవ నిజం కరమ్. 45

అట్టి నియతియు, దానిభోక్తయగు జీవుడును రెండును బ్రహ్మమునుండియే స్వయముగ అంగములపగిది ప్రవృత్తములాయెను. ఆ బ్రహ్మము తన యొకయంగముచే మఱియొక యంగమును - హస్తముచే హస్తమునువలె - నియమన మొనర్చుచున్నది.

అబుద్ధిపూర్వం దానిచ్ఛమేవమేవ ప్రవర్తతే
కాకతాలీయవత్స్పన్దాదావర్తా ఇవ వారిణి. 46

కావుననే జీవున కీప్రకారముగ జాగ్రత్స్వప్నరూప సృష్టి, అబుద్ధి, అనిచ్ఛాపూర్వకముగ స్పందముచే జలమందు దావర్తమువలె, కాకతాలీయముగ బ్రవర్తించుచున్నది.

సంనివేశో హి నియతిస్తాం వినా ప్రతిఘోదయమ్
బ్రహ్మ స్థాతుం న శక్నోతి తచ్చ సర్వాత్మతా క్షయమ్. 47

కారణకృతమగు కార్యమునగల సంనివేశ (ఆకార, రచనా) విశేషమునుగూర్చిన నియమమే నియతియనబడును. అట్టి సంనివేశరూప నియతిలేక అజ్ఞాతమగు నాశరహిత బ్రహ్మము క్షణకాలమైనను నుండజాలదు (చూర్ణ, పింత, ఘటాదులం దేవోయొక సంనివేశ [illegible]

యుండజాలనట్లు,) మఱియు, ఆ సంనివేశరూప నియతియొక్కధారణము జ్ఞానముచే సర్వపదార్థ క్షయరూపమగు మోక్షము కలుగనంతవఱకు అనువర్తించుచునే యుండును

ఏవం సకారణం సర్వం సర్వదా దృశ్యమణ్డలమ్
యస్య సర్గే యతః కాలాత్తతః ప్రభృతి తం ప్రతి. 48

ఈ ప్రకారముగ నియతికల్పనానంతరము, ఏ జీవున కేసమయమునుండి యే సృష్టిని గూర్చిన నియతి ప్రవృత్తమగునో, ఆ జీవున కాసమయమునుండియే యాదృశ్యమండల మంతయును సదా గారణసహితమైయే యున్నదగును. అంతేగాని మఱియొకనికిగాని, కాలాంతరమునగాని, భావికాల పదార్థమును గూర్చిగాని కాదు.

భాత్యకారణకం బ్రహ్మ సర్గాత్మావ్యబుధం ప్రతి
తం ప్రత్యేవ చ భాత్యేష కార్యకారణదృగ్భ్రమః. 49

కారణరహితమగు బ్రహ్మము, అజ్ఞానికి సృష్టిరూపముగ భాసించుచున్నది. మఱియు నాతనికే యీ కార్యకారణ దృష్టినిగూర్చిన భ్రమయు భాసిల్లుచున్నది.

కాకతాలీయవత్సర్గే స్థితే త్వావృత్తివృత్తివత్
ఇదమిత్థమిదం నేత్థమితీయం నియతిః స్థితా. 50

వివేకియొక్క దృష్టియం దీసృష్టి కాకతాళీయముగను, ఆవర్తముయొక్క పరివర్తనము వలెను నుండియుండును. ఇతరునకు పూర్వాపరనియమమాత్రదర్శనముచే 'ఈ ఘటాదు లీమృత్తికాదులనుండి జనించినవి' ఈ పటాదులు తద్విరుద్ధముగ ఈ తంత్వాదులనుండి జనించినవి - అను నీప్రకారమగు పర్యాలోచనవలన ఈ సృష్టియొక్క నియతి, వేదముయొక్క పదవాక్య వ్యాకరణ నియతివలె నున్నదగును.

సకారణత్వం భావానామవశ్యం భావిని క్రమే
జాగ్రత్స్వప్నదృశో నేహ సంభవన్త్యపకారణాః. 51

ఉత్పన్నములగు పదార్థములయొక్క అవశ్యము సంభవించు పూర్వాపరక్రమమున సకారణత్వమే కలదని యెవఁడు తలంచునో, ఆతనికి జాగ్రత్స్వప్నములు కారణరహితములుగ సంభవింపనేరవు. కాని వాస్తవముగ స్వప్న, సుషుప్తుల యనంతరము జాగ్రత్ప్రపంచముయొక్క యుత్పత్తియందుగాని జాగ్రత్, సుషుప్తులయనంతరము స్వప్నప్రపంచముయొక్క యుత్పత్తియందుగాని కారణములెవ్వియు సంభవింపవు.

యథా స్వప్నేఽఖిలామమ్బు సంక్షోభాత్ప్రలయభ్రమాః
దృశ్యతే కారణం తత్ర శ్రూయతామనుభూయతామ్. 52

ఓ వ్యాధుఁడా! నేనా ప్రాణియొక్క హృదయతేజమందుఁ బ్రవేశించి యాతని స్వప్నమున భూతలమంతయును వ్యాపించినట్టి జలముయొక్క సంక్షోభముతోఁగూడిన యే ప్రళయ భ్రమలను గాంచితినో, అట నీవేమైనకారణమును గాంచుచున్నావా? లేక శ్రుతులద్వారా వింటివా? లేక యనుభవించుచున్నావా? (ఏకారణమున్ను సంభవింపదని భావము.)

సర్వవస్తుషు కచన్తి సర్వదా యుక్తయః స్ఫటిక శుక్తయో యథా
భావనానుభవ ఏవ స స్వయం శక్తిమాజ్ఞయతి, జీవితాత్మకః. 53

ఇత్యార్షే శ్రీ వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే ఉత్తరార్ధే అవి॥ విప॥ శవో॥ పదార్థవిచారో నామ చతుశ్చత్వారింశదధికశతతమః సర్గః ॥ 144 ॥

ఈ ప్రకారముగ బ్రహ్మముతోడ ప్రపంచముయొక్క ఐక్యమును బ్రతిపాదించునట్టి యుక్తులు బుద్ధిమంతులకు సదా సర్వవస్తువులందును, స్ఫటికమణులవలెను, ముత్తెపుచిప్పలవలెను స్వయముగనే స్ఫురించుచున్నవి. ఆ కారణముచే శాస్త్రానుసారమగు యుక్తియొక్క భావనానుభవమే సుప్రసిద్ధమై, స్వయముగ సర్వతత్త్వనిర్ణయమున శక్తివంతమై, సర్వప్రమాణములకును జీవనరూపమై సర్వోత్కృష్టమగు ప్రమాణమై విలసిల్లుచున్నది.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున నుత్తరార్ధమున అవి॥ విప॥ శవో॥ పదార్థవిచారమను నూటనలుబదినాల్గవ సర్గము ॥ 144 ॥

---

పఞ్చచత్వారింశదధికశతతమః సర్గః

[శ్లేష్మ పిత్తానిలాపూర్ణ జీవస్యౌజసి కల్పితాః
స్వప్నభేదా ఇహోచ్యన్తే తథా క్షైర్బాహ్య విభ్రమాః

శ్లేష్మ, పిత్త, వాయువులచేఁ బూర్ణమగు జీవుని హృదయతేజమున కల్పితములగు స్వప్నములయొక్క భేదములును, ఇంద్రియములద్వారా గల్గు బాహ్యపదార్థముల విభ్రమములును నిచట వర్ణింపఁబడుచున్నవి.]

మునిరువాచ :—

బహిస్థైర్బాహ్యమేవాన్తరన్తస్థైః స్వప్నమిన్ద్రియైః
జీవో వేత్తి ద్వయస్థాతి తీవ్రసంవేగిభిర్ద్వయమ్. 1

ముని:— ఓ వ్యాధుఁడా! జీవుఁడు బాహ్యేంద్రియములచే బాహ్యస్వప్నమునున్ను అంతరేంద్రియములచే అంతః స్వప్నమునున్ను నెఱుఁగుచున్నాఁడు. బాహ్యాభ్యంతరములందుభయత్రయున్నవైన అతితీవ్ర సంవేగయుక్తములగు ఇంద్రియములచే బాహ్యాంభ్యంతరజగంబుల రెంటినిగూడ నెఱుఁగుచున్నాఁడు.

యదేన్ద్రియాణి తిష్ఠన్తి బాహ్యతశ్చ సమాకులమ్
తదామ్లానాను భవనః సంకల్పార్థోఽనుభూయతే. 2

ఎపుడింద్రియములు బాహ్యవ్యవహార నిమగ్నములైయుండునో, అపుడు జీవుఁడు సంకల్పిత పదార్థములను అస్పష్ట అనుభవముతోడ ననుభవించును.

యదా త్వన్తర్ముఖాన్యేవ సన్త్యక్షాణి తదా జగత్
అణుమాత్రం స్వవపుషి జీవస్తేనాతివేత్తి తత్. 3

ఎపుడింద్రియములు అంతర్ముఖములగునో అపుడు అతి సూక్ష్మమైనట్టి జగత్తునుగూడ స్థూలముగ తనశరీరమున విస్పష్టముగఁ గాంచును

జగత్ప్రతిఘం నాస్తి కించిదేవ కదాచన
జీవేక్షణానామక్షాణాం దృష్టిరప్రతిఘా జగత్. 4

వాస్తవముగ బాహ్యజగత్తుగాని, అంతరజగత్తుగాని యొకింతైనను స్థూలమెన్నటికిని గాదు. జీవునియొక్క దర్శనమున కరణభూతములగు ఇంద్రియములయొక్క స్థూలత్వకల్పన యందలి యే సూక్ష్మదృష్టిగలదో, అదియే స్థూలజగత్తైయున్నది

జీవనేత్రాణీన్ద్రియాణి యదా బాహ్యమయాన్యలమ్
తదా బాహ్యాత్మకం వేత్తి చిత జీవో జగద్వపుః. 5

ఎపుడు జీవునియొక్క నేత్రాదింద్రియములు పూర్ణముగ బాహ్యజగన్మయములగునో, అపుడు జగచ్ఛరీరధారియగు యాతఁడు చిదాకాశమునందే బాహ్యజగత్తును వీక్షించును.

శ్రోత్రం త్వగీక్షణం ఘ్రాణం జిహ్వా చేతీహితాత్మకః
సంఘాతః ప్రోచ్యతే జీవశ్చిద్రూపోఽనిలమూర్తిమాన్. 6

త్వక్చక్షుశ్శ్రోత్రజిహ్వాఘ్రాణములను పంచజ్ఞానేంద్రియములు వాగాది పంచకర్మేంద్రియములు ఇచ్ఛాప్రధానమగు అంతఃకరణచతుష్టయము పంచప్రాణములు - వీనియన్నింటియొక్క సంఘాతరూపమగు ఏ సూక్ష్మశరీరముగలదో అదియే (చిదాభాసునియొక్క కూడికవలన) చిద్రూపుఁడగు జీవుఁడని చెప్పఁబడుచున్నది

సర్వత్ర సర్వదా జీవః సర్వేన్ద్రియమయః స్థితః
చిచ్చిద్వ్యోమావ్యయస్తేన సర్వః సర్వత్ర పశ్యతి. 7

నాశరహితమైన కూటస్థము చిదాకాశమే [illegible] జీవుఁడు సమష్ట్యాకాశరూపమొంది సర్వత్ర సర్వదా సర్వేంద్రియమయమై యున్నది కావుననే యా జీవుఁడు సర్వత్ర (బాహ్యమునగూడ) నిజవాసనామయములగు జగత్తుల గాంచుచున్నాఁడు.

శ్లేష్మాత్మనా రసేనాన్తర్జీవ ఆపూర్యతే యదా
తేఽక్షాణుకేఽణురూపాత్మా తదా తత్రైవ విన్దతి. 8

ఓ వ్యాధుఁడా! ఎపుడు నీయొక్క జీవుఁడు బాహ్యేంద్రియవ్యాపారరహితుఁడై సూక్ష్మములగు నాడులందు ప్రవేశించి శ్లేష్మరూపమగు అన్నరసముచే పరిపూర్ణుఁడగునో, అపుడా అతి సూక్ష్మములగు నాడులందే యాతఁడే [illegible] స్వప్నప్రపంచమును స్వయముగ ననుభవించును.

క్షీరార్ణవ ఇవోర్మీణో నగశ్చన్ద్రోదయాన్వితమ్
సరాంసి [illegible] 9

పుష్పాభ్రప్రతిధానాని పరిగీతాని షట్పదైః
వసన్తాన్తఃపురాణ్యన్తరుద్యానాన్యుదితాని ఖే. 10

ఉత్సవాన్మఙ్గలాకీర్ణాంల్లీలాలోలాఙ్గనాగణాన్
భక్ష్యభోజ్యాన్నపానశ్రీపరిపూర్ణగృహాజిరాన్. 11

సపుష్పాః ఫేనహసనాస్తరలాతరలేక్షణాః
విలాసేనామ్బుధిం యాన్తి సరితో మత్తయౌవనాః. 12

హిమవచ్ఛుభ్రశృఙ్గాణి సౌధాని శిశిరాణ్యలమ్
సుధావధౌతభిత్తీని కృతానీన్దుతలైరివ. 13

శిశిరాసారహేమన్త ప్రావృణ్మేఘవృతాని చ
స్థలాని నీలనలినీలతాశాద్వలవన్తి చ. 14

పుష్పప్రకరసంఛన్నా విశ్రాన్తహరిణాధ్వగాః
స్నిగ్ధపత్రతరుచ్ఛాయాః పురోపవనభూమికాః. 15

కదమ్బకున్దమన్దారమకరన్దేన్దుకాన్తిభిః
భాసమానాసనస్థానసంస్థానాః కుసుమస్థలీః. 16

స్వయముగ క్షీరసముద్రమున నెగురుచున్నవానివలెనయి చంద్రోదయ సహితమగు ఆకాశమును గాంచును. మఱియు వికసితకమల, కల్హార (కలువ) పుష్పములచే శోభించుచు, పుష్పమయ మేఘములయొక్క ప్రతినిధులవలె నొప్పుచు, తుమ్మెదలయొక్క గానములతోఁగూడి యున్నట్టి సరస్సులను వసంతరాజుయొక్క అంతఃపురరూపములగు ఉద్యానములను ఆకాశమున నుదయించినట్లుగ నపుడా జీవుఁడవలోకించును. ఇంకను, మంగళములచేఁ బూర్ణములగు ఉత్సవములగను, క్రీడించు చంచలస్త్రీ సమూహములను, భక్ష్యభోజ్య, అన్న, పానాది వివిధపదార్థ ములచేఁ పరిపూర్ణములగు గృహ, అంగణము (ముంగిలి)లను, పలువిధపుష్పములు గల్గి నురుఁగను హాస్యముతోఁగూడినవై మత్స్యములను చంచల నేత్రములచే శోభించుచు, మదించిన యౌవనముతో గూడి విలాసపూర్వకముగ సముద్రమునుగూర్చి యేగుచున్న నదులను, మంచువలెఁ దెల్లనైనట్టి శిఖరములుగలవియు, మిగుల శీతలములును, సున్నము పూయఁబడినగోడలు కలవియు చంద్రతల ములచే నిర్మింపఁబడినవానివలెఁ దోచునవియునగు ఎత్తైన మేడలను, శీతలజలకణములతోఁగూడిన హేమంతాది ఋతువులచే శోభితములై, వర్షాకాల మేఘములచే నావృతములై, నీలకమల, లతా, తృణాదులచేఁ బూర్ణములైనట్టి యనేక స్థలములను, పుష్పసమూహములచేఁ గప్పఁబడినవై, విశ్ర మించు లేళ్లు, బాటసారులు గలవై, మిగుల దట్టముగ వ్యాపించియున్న ఆకులుగల వృక్షముల యొక్క నీడలుగల్గియున్నవైనట్టి నగరోద్యానభూములను, కదంబ, కుంద, మందారాది పుష్పముల యొక్క రసముల చంద్రసమానకాంతులచే భాసించు ఆసనము వంటి రచనతోఁగూడిన - పుష్ప స్థలములను జీవుఁడపుడు తనయందు వీక్షించును.

నలినీజాలినీర్నీలాః పుష్పకస్థలధారిణీః
వనావలీర్వీలీనాభ్రనిర్మలాకాశకోమలాః. 17

కదలీకన్దలీకున్దకదమ్బకృతశేఖరాః
గిరిమాలాశ్చలచ్చారులీలాపల్లవ పేలవాః. 18

హేలావలితధమ్మిల్లముక్తమాలతికాలతాః
ఇవ బాలాఙ్గనానృత్యం తన్వానా స్తనుగాత్రికాః. 19

ఉత్ఫుల్లశ్వేతనలినీనిభా నరపతే, స భాః
చారుచామరభృఙ్గారవితానకశతావృతాః. 20

వల్లీవలయవిన్యాస విలాస వలితాఙ్గికాః
వనమాలావిలోలామ్బుప్రణాలీకాకలీకలాః. 21

ధరాధరకరాలాబ్ధిధారాధరధరాధరాః
దిశః సీకరనీహార హారోదరధరా దశ. 22

మఱియు, కమలసమూహములచేఁ బూర్ణములై, నీలవర్ణయుక్తములై, పుష్పమదు స్థలములచే శోభించుచు, లయించిన మేఘములుగల శరత్కాలాకాశమువలెఁ గోమలములైయున్నట్టి వనపంక్తులను, కదళీ, కందలీ, కుంద, కదంబాది వృక్షములను శిరోభూషణములు గలవియు, చంచల, సుందర, లీలాయుక్తములైన పల్లవములతోఁగూడినవియునగు పర్వత సమూహములను, వినోదముగఁ జుట్టఁబడిన కేశములు వీడినవారై, విస్తరించిన మాలతీలతఁబోలుచునుండి నృత్యము నల్పుచున్నట్టి కోమలశరీరులగు బాలవనితలను వికసించిన శ్వేతకమలముల బోలునవియు, అనేకములగు మనోహరములైన చామర, వితాన, సువర్ణపాత్రాదులచే నావరింపఁబడినవియునగు రాజసభలను, లతలయొక్క వలయాకార రచనా విలాసముచే ఆవేష్టితములగు శరీరములు గలవియు, చంచలజలముతోఁగూడిన కాలువలయందలి పక్షుల మధురధ్వనులచే గంభీరములైనవియు నగు వనపంక్తులను, వర్షముచే పృథివిని పరిపూర్ణ మొనర్చునవియు భయంకరాకృతిగలవియునగు మేఘములచేఁ గప్పఁబడిన పర్వతములుగలవియు, జలకణయుక్తహిమ (మంచు) రూపహారములను నుదరమున ధరించినవియునగు దిక్కులను జీవుఁడపుడు తనయందుఁ జూచును.

పిత్తాత్మనా రసేనా స్తర్జీవ ఆపూర్యతే యదా
టటో న్తరణుమాత్రాత్మాతదాతత్రైవ విన్దతి. 23

ఎపుడు నాడులు పిత్తరసముచేఁ బరిపూర్ణములగునో, అపుడు బాహ్యేంద్రియ వ్యాపార రహితుఁడై హృదయస్థతేజమున సూక్ష్మరూపముతోనుండు జీవుఁడు పిత్తరసముచే, పరిపూరితుఁడు కాఁగా, ఈ వచింపఁబోవు స్వప్నభ్రమలనచ్చోటనే (ఆ హృదయతేజమందే) యాతఁడు గాంచును.

పవనస్పన్దనంశుష్క కింశుకద్రుమశోభనాః
జ్వాలాలీరుజ్జ్వలామ్భోజదలపల్లవపేలవాః. 24

సంతప్త సికతా సేకసనీహారసరిచ్ఛిరాః
దావానలశిఖాశ్యామధూమశ్యామలదిఙ్ముఖాః. 25

కృశానుకర్కశానర్కాంశుచక్రధారాశితత్విషః
దావదాహ విషావేశవిపరీతరసాకరాన్. 26

స్వేదముష్టీకృతాబ్ధిం వా స్విన్నం త్రైలోక్యమణ్డలమ్
క్షరత్తారాణ్యరణ్యాని ప్రతర్ధగహనాన్యపి. 27
ప్రతరన్మృగతృష్ణామ్బుసరత్సారసరూపి చ
స్థలాన్యదృష్టపూర్వాణి భూతపూర్వేతరాణి చ. 28
అధ్వగం సంభ్రమవశాత్తప్తధూలివిధూసరమ్
దూరాదమృతవద్దృష్టం స్నిగ్ధచ్ఛాయాధ్వపాదపమ్. 29
జ్వరజ్వాలితమాకారం భువనం తప్తమగ్నివత్
పాంసూపహతదేశాని దిఙ్ముఖాని చ ఖాని చ. 30
గృహగ్రామార్ణవాద్ర్యబ్ధివనవ్యోమాగ్నికా దిశః
తుహినాహారహానన్తాసంఖ్యామ్బుదఘటోద్భటాన్. 31
శరద్గ్రీష్మ వసన్తాంశ్చ తాపానాతపదాయినః
తృణపత్రలతౌఘాభ్రరాశ్యాష్మ పిహితావనీః. 32
సౌవర్ణమమ్బరతలం భూతలం దిక్తటాని చ
తప్తాన్యద్రభసరసీ హిమశైల స్థలాని చ. 33

వాయువుయొక్క చలనముచే మిగుల శుష్కించినట్టి కింశుక (మోదుగు) వృక్షమువలె శోభించునవియు, ప్రకాశమానములగు కమలదళపల్లవమువలె మృదువైనవియు, కాలిన యిసుకను తడుపుటచే బాష్పసహితములై యొప్పు నదులవంటి నాడులుగలవియు, దావాగ్నియొక్క శిఖలనుండి జనించిన నల్లనిపొగచే దిక్కులను నలుపువర్ణముగా జేయునవియునగు జ్వాలాసమూహములను, అగ్నివలె కర్కశములై చక్రధారవలె తీక్ష్ణములైన కాంతులుగలవై దావాగ్నియొక్క దాహమను విషముయొక్క ఆవేశముచే జలాశయములను విపరీత (వృష్టగుణయుక్త) ముగఁ గావించునవైనట్టి సూర్యులను, బాష్పయుక్తమై ఉష్ణత్వముతోఁగూడియున్న సముద్రమును, చెమటచేఁ దడుపఁబడిన త్రైలోక్యమండలమును, ఉష్ణత్వమువలన నష్టప్రాయములై వాడియున్నట్టి వృక్షలతాదులచే దట్టములైన వనములను, చంచలసారసపక్షులచే శోభించుమృగతృష్ణాజల ప్రవాహములుగలవియు, ఇదివఱకు తాను జూడనివియునగు అనేకస్థలములను ఇదివఱకుఁ జూచిన వృక్షాదులను, భయ వశమున మార్గములందు బరువిడుచు సంతప్తమైన ధూళిచే మలినవర్ణయుక్తమై ఛాయాసహితమైనట్టి మార్గస్థవృక్షమును, అమృతమువలె దూరమునుండి గాంచు పథికుఁడగు తన్నును, జ్వరగ్రస్తమగు ఆకారముగలదియు, అగ్నివలె సంతప్తమైనదియునగు జగత్తును, ధూళిచే మలినములైన దేశములను దిక్కులను, ఆకాశమును, ప్రజ్వలించు అగ్నితోఁగూడిన గృహగ్రామ సముద్ర పర్వత వన ఆకాశయుక్తములగు దిశలను, అగ్నిని వర్షించునట్టి అసంఖ్యాతములైన మేఘ సమూహములుగల్గి యుష్ణాధిక్యతచే అతిసంతాపమును గలుగఁజేయు గ్రీష్మవసంత శరదృతువులను, తృణపత్ర లతా సమూహములచేతను మేఘరాసులచేతను ఆవిరిచేతను గప్పఁబడిన భూప్రదేశములను, సంతప్త సువర్ణమువలె భాసించు ఆకాశతల భూతల దిక్తటములను, సంతప్తములైన యనేకసరస్సులను, హిమయుక్త పర్వతప్రదేశములను జీవుఁడపుడు తనయందుఁ గాంచును.

రసానురిక్తే వాతేన జీవ అపూర్యతే యదా
ఓజో న్తరణుమాత్రాత్మా తదా తత్రైవ విన్దతే. 34

శ్లేష్మపిత్తాది రూపములన్న రసములచే ననుసరింపఁబడి యెపుడు కేవలము వాయువు (వాతము)చేతనే నాడులు పూర్ణములైయుండునో, అపుడందుఁ బ్రవేశించు సూక్ష్మరూపుఁడగు జీవుఁడు వాతముచేఁ బరిపూరితుఁడై ఆ హృదయమందలి తేజమందే యీ వచింపఁబోవు స్వప్నభ్రమలను వీక్షించును.

వాతవిక్షుబ్ధసంపత్త్యాస పూర్వం వసుధాతలమ్
అపూర్వాః నగరగ్రామశైలాబ్ధివనమణ్డలీః. 35
ఉడ్డీయమానమాత్మానం శిలాః శైలస్థలానివ
ఘనఘుంఘుమసారావానచక్రభ్రమణాది చ. 36
హయోష్ట్రగరుడామ్భోదహంసయానావరోహణమ్
యక్షవిద్యాధరాదీనాం గత్యాగమనసంచరమ్. 37
సాబ్ధిద్యుర్వీనదీశానాం వనభూగ్రామపూర్ధిశామ్
కమ్పం భయోన్ముఖాఙ్గానాం బుద్బుదానామివార్ణవే. 38
అన్ధకూపే నిపతితం విపులే సంకటేఽథవా
అథవా రూఢమాత్మానం ఖమాలం పాదపం గిరిమ్. 39

అత్తఱి బుద్ధి వాయువుచే సంక్షుబ్ధమగుటవలన జీవుఁడు పూర్వము గాంచినవానికంటె విలక్షణములైనట్టి నగర గ్రామ పర్వత సముద్ర వనమండలములను గాంచును మఱియు ఎగురుచున్న శిలలను పర్వతస్థలములను, ఆ ప్రకారమే యెగురుచున్నట్టి తన్నునుగూడ జూచును. మేఘగర్జనలచే శబ్దయుక్తములగు దేశములను కులాల (కమ్మరివాని) చక్రాదులు లేకయే సంభవించు ఘటాదుల భ్రమణములను అశ్వ ఉష్ట్ర (ఒంటె) గరుడ మేఘ హంసాదివాహనములపై నెక్కుటను వానిమూలకముగ సంచరించుటను యక్ష విద్యాధరాదులయొక్క గమనాగమన సంచరణాది వ్యవహారములను, సముద్రమందలి బుద్బుదములయొక్క కంపమువంటి పర్వత ఆకాశ పృథివీ నదీసమూహములయొక్కయు వృక్షాదులయొక్కయు గ్రామ నగర దిశలయొక్కయు భయగ్రస్తులు మనుష్యాదులయొక్కయు కంపమును, అంధకారావృతమగు కూపమందుగాని గొప్ప సంకటమందుగాని పడినట్టియు లేక ఆకాశమును పరిచ్ఛిన్న మొనర్చునట్టి శోభగల గొప్పవృక్షమును, వాని పర్వతమునుగాని యెక్కినట్టియు తన్నును, అపుడు జీవుఁడవలోకించును.

వాతపిత్తశ్లేష్మయుక్తో జీవ ఆపూర్యతే యదా
భాగైర్వాతవశం ప్రాప్తై రార్తోఽసౌ విన్దతే తదా. 40

వాత, పిత్త, శ్లేష్మముల మూఁడింటిచేతను బూర్ణములైయున్నట్టి నాడులందు జీవుఁ డెపుడు ప్రవేశించునో, అపుడు వాతమునకు వశీభూతములైన భాగములచేఁ బీడితుఁడై యాతఁడే చెప్పఁబోవు స్వప్నములను గాంచును.

పత న్తీం పార్వతీం వృష్టిం సుశిలావృష్టిసంకటమ్
స్ఫుటొట్టకటకారావ భ్రమత్పాదపమణ్డలమ్. 41

భ్రమద్విర్వనవిన్యాసైః సందిగ్ధామ్భోధరోత్కటమ్
సింహవారణవర్షాభ్ర నిరన్తరదిగన్తరమ్. 42

తాలీ తమాల హింతాలమాలాజ్వలనసంకులమ్
గుహాఘుంఘుమ నిర్హ్రాదభాంకార ఘనఘర్ఘరమ్. 43

మన్ద్రమన్దరమన్థాన శబ్దసందర్భసున్దరీమ్
దరీం దలనదుర్వారమిథః సంఘట్టఘట్టితామ్. 44

శృఙ్గసంఘట్టనద్వ్యాశాః క్రేంకారోత్కరకర్కశాః
నదీర్ముక్తాలతాపాత సస్రగ్దామ నభస్తలాః. 45

శిలాశకలపూర్ణాగ్రపూర్ణామ్బర మహార్ణవమ్
వహద్వనఘనోద్ఘాతఘట్టిత బ్రహ్మమణ్డలమ్. 46

పరస్పరవినిర్ఘృష్టదశదర్శన దన్తురమ్
చటత్కటకటారావస్ఫుటత్కట కటజ్కృతమ్. 47

ఖపాతపవనాధూత వనవాతలతోదయమ్
రణదాత్మద్రుషచ్చూర్ణకర్పూరామ్బుజ ధారిణమ్. 48

ప్రాగ్ఫటోద్ఘట భేదోత్థైర్మన్ద్రైర్మరమరారవైః
క్రూరాక్రన్దైరివాభాతి విరాజితజగత్త్రయమ్. 49

పడుచున్న పర్వతములయొక్క వర్షమును, గొప్ప శిలావర్షమునుగూర్చిన సంకటమును, విచ్ఛిన్నములగు సౌధ, పర్వతతటములయొక్క శబ్దములతోఁగూడ పరిభ్రమించు వృక్షసమూహమును, తిరుగుచుండు వనస్థలములతోఁగూడి భయంకరమేఘమండలమును, సింహములచేతను, గజములచేతను, వర్షించు మేఘములచేతను నిరంతరము కప్పఁబడియుండునదియు, తాళ, తమాల, హింతాల (గిజకతాడు) వృక్షసమూహములందుఁ బ్రజ్వలించు నగ్నిచేఁ బూర్ణమైనదియు, గుహలయొక్క ఘుంఘుమ, భాంకార, మహాఘర్ఘర శబ్దములతోఁగూడినదియునగు దిక్కుల మధ్యభాగమును, గంభీరమైన మందరపర్వతమను గవ్వముయొక్క శబ్దముచే సుందరమైనదియు, ఖండనమున నివారింపశక్యముగానట్టి పరస్పర సంఘట్టముచే మర్దింపఁబడినదియునగు గుహను రెండుపర్వత శిఖరముల మధ్యయందలి ప్రవాహధ్వనులచే శిఖరద్వయ సంఘట్టనమువలె నున్నవియు, చక్రవాకాది పక్షులయొక్క క్రేంకార శబ్దసమూహములచే కర్కశములైనవియు, ముత్తెముల తీగెలబోలిన పతనములచే పుష్పమాలాసహితము గావలె నాకాశతలమును గావించునవియునగు నదులను, శిలాఖండములచే వ్యాప్తమగు జలముచే బరిపూరితమైనదియు, ప్రవహించు వన, మేఘములయొక్క యాఘాతములచే సప్తర్షిలోకమును గొట్టునదియు, పరస్పరము తరంగములయొక్క సేచనము (తడుపుట)లచేఁ గడుగ బడినదంతపంక్తుల యొక్క దర్శనముచే నవ్వుచున్నట్లున్నదియు, దిక్కులను

నావరించునట్టి కటకటాశబ్దములతోటి ఛిన్నములగు పర్వతములచే టంకాఘాతము (ఉలిదెబ్బ)ల పంటి ధ్వనిని గలుగఁజేయునదియు, అకాశమునఁబడునట్టి వాయువుచేఁ గంపితమగు వనమండలి వాయువునను సరించి గావింపఁబడు లతలయొక్క నృత్యము గలదియు, శబ్దించు నిజకృత్యములగు శిలాచూర్ణములచే విచిత్రవర్ణయుక్తములుగ నొనర్పఁబడిన కమలములు, నాచుమున్నగువానిని ధరించునదియునగు ఆకాశమను మహాసముద్రమును సముద్రముల యాక్రమణమునకుఁ బూర్వము యుగాంతమునఁ బ్రవృత్తములగు ప్రచండ శూరవీరుల పరస్పర విచారణములందువలె నుత్పన్నములైన గంభీరములగు తాళవనాదుల మరమర ధ్వనులచే, క్రూరులగు ప్రాణుల యఱపులచేవలె విరాజిల్లు త్రైలోక్యమును, జీవుఁడపుడు వీక్షించును.

> ఇతి తైః కాష్ఠపాషాణమృద్వ్యగ్రావతటైర్వృతః
> పరిపీడిత ఏవాస్తే యదా జీవో జడీకృతః. 50

ఈ ప్రకారముగ వాత, పిత్త, శ్లేష్మముల మూఁడింటిచేతను నాడులు పూర్ణములుకాఁగా, జీవుఁడు స్వప్నమున కాష్ఠ, శిలా, మృత్తికాసహితములగు వాయువులను భటులచే నావృతుఁడై, జడునివలెఁ గావింపఁబడినవాఁడై పరిపీడితుఁడై యుండును.

> మృద న్తఃకీట కణవచ్ఛిలా న్తర్గత భేకవత్
> గర్భస్థాపక్వశిశువత్ఫలా న్తర్గత-బీజవత్. 51
> బీజోదరస్థాఙ్కురవద్ధ్వ్యపిణ్డోదరాణువత్
> అశ్రా న్త స్తమ్భకోశస్థదారుపుత్రకదేహవత్. 52

మఱియు, మృత్తికయందు అల్పకీటమువలెను, శిలయందు 'గప్పవలెను, గర్భమందు ఆ పరిపక్వ శిశువువలెను, ఫలమందు బీజమువలెను, బీజమందు అంకురమువలెను, పదార్థపిండమున అణువువలెను, శుద్ధమైన స్తంభమందు కొయ్యబొమ్మయొక్క శరీరమువలెను నున్నవాఁడై జీవుఁడానాడులందు స్వప్నానుభవమును బొందును.

> సౌసిర్యాసంభవాత్ప్రాణపవనస్పన్దవర్జితః
> ప్రోన్నమత్పర్శుపూరేణ శిలాపూరేణ తర్జితః. 53
> తదా నిబిడతేజో న్తరేవానుభవతి స్వయమ్
> సుషుప్తం శైలకోశాభమన్ధకూపోదరోపమమ్. 54

ఎపుడీజీవుఁడు 'పురీతతి'యను నాడీపంజలమున సర్వభాగములందలి అస్థుల యగ్రభాగములచే ఘటితమగు హృదయాస్థియందుఁ బ్రవేశించునో అపుడటుపిమ్మట సంచారముచేయుటకు రంధ్రములేనందుచే నచట ప్రాణవాయువుయొక్క చలనము లేనివాఁడైయుండి, ఎత్తుగనున్న పార్శ్వభాగస్థులయొక్క గ్రంథిచే శిలాఖండముచే బిలమందు నిరోధింపఁబడినవాని చందమున నున్నవాఁడై వ్యాపారా సమర్థుఁడుగఁ గావింపఁబడినవాడై యుండునో, అపుడు పూర్వోక్తమగు దట్టమైన హృదయతేజమునకే, శిలామధ్యభాగమువంటిదియు గాఢమైన అజ్ఞానమువలన అంధకూపముయొక్క యుదరమును బోలినదియునగు సుషుప్తిని స్వయముగ ననుభవించెను.

> యదా పరిణతం యత్నం పునః సౌషిర్యమాగతమ్
> పువర్వ్యేత్తి తదా జీవః స్వప్నం ప్రాణావబోధితః. 55

భుజింపఁబడిన యన్న మెపుడు పరిపాకముచే పరిణామమొందినదగునో, మఱియు నెపుడు అన్నరసజనితమగు మార్గనిరోధము తొలగుటచే మరల అవకాశయుక్తమగు రంధ్ర మేర్పడునో, అపుడు ప్రాణసంచారముచే నిస్సరణమును గూర్చిన యత్నమును బొందినవాడై, మరల ప్రాణముచే ప్రబోధితుడై జీవుఁడు స్వప్నమును గాంచును.

యదా తస్మిన్ప్రదేశేఽన్తర్నాగాభాగాన్వ్రతన్తి తే
దేహే పరిణమన్తోఽన్నన్దేవాత్మాద్రివర్షణమ్. 56

దేహమున పరిణామమును బొందుచున్న యీ యన్నరసము లెపుడే ప్రదేశమున జీవునితోఁ గూడ కొన్నినాడీభాగమునుండి మఱికొన్ని నాడీభాగములందుఁబడునో, అపుడా జీవుడాహృదయ తేజముననే పర్వత వృష్టి ననుభవించును.

బహ్వ్యేవ వహ్ని బహునా స్వల్పేనాల్పం ప్రపశ్యతి
వాతపిత్తాదియోగేన బహిరన్తశ్చ సంభ్రమమ్. 57

అధిక జఠరాగ్నివ్యాప్తమగు వాతపిత్తాదుల సంయోగముచే అధిక స్వప్నసంభ్రమమును అల్పజఠరాగ్నివ్యాప్తమగు సంయోగముచే అల్పస్వప్న సంభ్రమమును బాహ్యాభ్యంతరములందును జీవుఁడవలోకించును.

పశ్యత్యేతద్యథైవాన్తరేష జీవో వశీకృతః
వాతపిత్తాదివలితో బహిర్వే త్త్యేవమేతి వా. 58

వాతపిత్తాదులచే పరివేష్టితుఁడును, వశీకృతుఁడునగు ఈ జీవుఁడు తనయందు, బూర్వోక్తములగు పదార్థములనట్లు జ్ఞానేంద్రియములచే ననుభవించును. లేక కర్మేంద్రియములచేఁ బొందును.

క్షుబ్ధైరన్తర్బహిశ్చైవ స్వల్పైః స్వల్పం ప్రపశ్యతి
సమైః సమమిదం దృశ్యం వాతపిత్తకఫాదినా. 59

వాతపిత్తకఫాదులచే నధికసంక్షుబ్ధములగు అన్నరసములచే బాహ్యాభ్యంతరములందును అధిక దృశ్యమును, అల్పసంక్షుబ్ధములగువానిచే అల్పదృశ్యమును, సమసంక్షుబ్ధములగువానిచే సమదృశ్యమును జీవుఁడు భ్రాంతిచేఁ జూచును.

బహిః పశ్యత్యయం జీవః కుపితైరేఖిరావృతః
స్పన్దం భూమ్యద్రినభసాం జ్వలనంవానలోచ్చయైః. 60

ప్రకోపమొందిన వాతపిత్తాదులచే సంక్షుబ్ధములైనట్టి అన్నరసములచే నావృతుఁడగు ఈ జీవుఁడు పృథివీ, పర్వత, ఆకాశాదులయొక్క చలనమునుగాని, లేక గొప్ప యగ్నిసమూహములచేఁ బదార్థములయొక్క యధికజ్వలనమునుగాని యనుభవించును.

ఆకాశగమనం చైవ చన్ద్రోదయహిమాచలాన్
గహనం వృక్షశైలానాం నభఃప్లవనమర్ణసామ్, 61

మజ్జనోన్మజ్జనం వాబ్ధౌ సురతం సురసద్మసు
శైలోపవనశుభ్రాభ్రపీఠవిశ్రమణోచ్చయమ్. 62

బృహత్కక చనిష్పేషం నరకానుభవభ్రమమ్
తాలీతమాలహింతాలమాలావలనమమ్బరే. 63

చక్రవృత్తైశ్చ పతనం ఝగిత్యుత్పతనం దివి
శూన్యేఽపి జనతావృన్దం స్థలేఽప్యబ్ధినిమజ్జనమ్. 64

విచిత్రం విపరీతం చ వ్యవహారం మహానిశి
అహ్నీవ భాస్కరాలోకం దుర్భేద్యం చాహ్ని వా తమః. 65

స్వాద్రిభూతలమాకాశే కుడ్యబన్ధే ఘనే స్థలమ్
కుడ్యబన్ధాంశ్చ గగనే మిత్రభావం చ విద్విషి. 66

స్వజనే పరతాబుద్ధిం సుజనత్వం చ దుర్జనే
సుసమస్థలతాం శ్వభ్రే శ్వభ్రత్వ సుసమే స్థలే. 67

ఉద్గీతాలాపమసృణాన్సుధాధౌతాన్సుచిత్రితాన్
అద్రీన్స్ఫాటికమయాన్వాపి నవనీతమయాంశ్చ వా. 68

కదమ్బనీపజమ్బీర పత్ర స్తబకసద్మసు
సుఖవిశ్రమణం స్త్రీభిః సాకం పద్మేష్వివాలినః. 69

మఱియు వాతపిత్తాదుల వైషమ్యముచే జీవుఁడు తనయందాకాశగమనమును, చంద్రోదయమును, హిమవత్పర్వతములను, వృక్ష, పర్వతాదులచే వ్యాప్తమగు అరణ్యమును, సముద్రము లాకసమున నెగురుటను, సముద్రమందు మునుఁగుట, తేలుటలను, దేవమందిరములందలి సురతమును, పర్వత, ఉపవన, నిర్మలమేఘములపై విశ్రమించుటను, నిర్మలమేఘాదుల సమూహములను, గొప్పరంపముచేఁ గోయఁబడుటను, నరకానుభవభ్రమను, తాళ, తమాల, హింతాలాది వృక్ష సమూహము లాకాశమున దిరుగాడుటను, చక్రవృత్తులతోటి యాకసమునుండి పడుటను, మరల శీఘ్రముగ నాకాశమున కెగయుటను, శూన్యస్థానమును, జనసమూహమును, స్థలమందును సముద్రమున మునుఁగుటను, విచిత్ర, విపరీత వ్యవహారములను, రాత్రియందును బగటియందువలె సూర్య ప్రకాశమును, పగటియందును గాఢాంధకారమును, పర్వత, భూతల, గృహాదులచే ఘనీభూతమగు ఆకాశమున విశాలమైదానమును, శూన్యాకాశమున గృహములను, శత్రువులందును మిత్రభావమును, స్వజనులందును పరత్వబుద్ధిని, దుర్జనులందు సౌజన్యమును, గర్తమందు (గోతియందు) సమభూమిని, సమభూమియందు గర్తమును, బిగ్గరగాఁపాడఁబడు గీత, ఆలాపములచే మనోహరములైనవియు, సున్నముపూయఁబడినవియు, బాగుగ చిత్రింపఁబడినవియునగు స్థానములను, స్ఫటికాదిమయములను, నవనీతము (వెన్న) వలెఁ దెల్లనైనవియునగు పర్వతములను, కదంబ, నీప (కడిమి) జంబీర (నిమ్మ) వృక్షములచేఁ బూర్ణములైనట్టియు, వివిధపత్ర, లతా, పుష్పగుచ్ఛాదులచే శోభించునట్టియు, స్థానములందు కమలములందు తుమ్మెదలవలె, స్త్రీలతోఁగూడి సుఖముగ విశ్రమించుటను గాం చును.

అ న్తర్నిమీలితా హ్యేతాః పశ్యన్త్యున్మీలితా బహిః
ధాతూనామితి వైషమ్యాద్భ్రాన్తిమిన్ద్రియవృత్తయః. 70

వాతపిత్తాదిధాతువుల విషమత్వమువలన ఈ ప్రకారములగు భ్రమలను అభ్యంతరమున నిద్రచే నిమీలితములగు (మూయఁబడిన) ఇంద్రియవృత్తు లనుభవించును మఱియు జాగ్రత్తుచే ఉన్మీలితములగు (తెఱవఁబడిన) ఇంద్రియవృత్తులు ఇంద్రజాలాదులందలి భ్రమననుభవించును.

ఏవంవిధాన్యనేకాని పశ్యన్త్యనుభవన్తి చ
బహిరేవ యథా స్వప్నే వస్తున్యసమధాతవః. 71

వాతపిత్తాది ధాతువుల విషమత్వముతోఁగూడిన మనుజులు స్వప్నమునందువలె బాహ్యవస్తువులందును ఈ ప్రకారములగు అనేకవిధములైన భ్రమలను జూచుచున్నారు. అనుభవించుచునున్నారు.

బహిశ్చాన్తశ్చ దృశ్యన్తే విపరీతాన్యనేకశః
కార్యాణ్యతికరాలాని జీవైరసమధాతుభిః. 72

విషమధాతువులతోఁగూడిన జీవులు బాహ్యాభ్యంతరములందును అనేక విపరీత, మహాభయంకర కార్యములను జూచుదురు.

సమేషు ధాతుష్వేషోఽన్తర్జీవోఽనుభవతి స్వయమ్
తేజోఽన్తర్గత ఏవేమాం వ్యవహారస్థితిం సమామ్. 73

వాతపిత్తాదిధాతువు లెపుడు సమరూపమునసుండునో, అపుడీజీవుఁడు తన హృదయతేజమున సమానమగు లౌకిక, శాస్త్రీయవ్యవహారస్థితిని స్వయముగ ననుభవించును.

యథాస్థితాం పురగ్రామపత్తనారణ్యసంతతిమ్
సౌమ్యవారితరుచ్ఛాయాదేశాధ్వగ గమాగమమ్. 74

మఱియు నట్టిధాతువుల సమత్వమందు, జీవుఁడు, యథారీతి స్థితిగల్గియుండు నగర, గ్రామ, పట్టణ, అరణ్యసమూహమును. శాంతః నిర్మల జలయుక్తములై. వృక్షముల ఛాయచేఁ బరిపూర్ణములైనట్టి ప్రదేశములందు పథికుల గమనాగమనములను తనయందనుభవించును.

సుఖాతపమయేన్ద్వర్కతారాహోరాత్రమణ్డితమ్
ఏవమేతదసద్భూతం సద్భూతమివ భాసతే. 75

సుఖదాయకమగు ఆతపముచేఁ బూర్ణమై. చంద్ర, సూర్య, నక్షత్ర, దినరాత్రులచే శోభితమై వెలయునట్టి యీ జగత్తు, అసద్రూపమైనను, సద్రూపమువలె భాసించుచున్నది.

దృశ్యోపలమ్భం చిత్తత్త్వే స్పన్దనం పవనే యథా
అసదేవ సదాభాసమభిన్నం భిన్నవత్స్థితమ్. 76

చైతన్యవస్తువునందు ఈ దృశ్యప్రాప్తి వాయువునందు స్పందము (చలనము) వలె, అసత్తయైనను సత్తుగను, అభిన్నమైనను భిన్నముగను స్థితినొందియున్నది.

శాన్తాదుదేతి సకలం జగదమ్బరాత్మ శాన్తం న కించన న నామ సదిత్యుదేతి
తద్వ్యోమనీ దృశమనన్తచితేః శరీరే భామాత్ర మాతతమనన్తవపుర్విభాతి.77

ఇత్యార్షే శ్రీ వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు
నిర్వాణప్రకరణే ఉత్తరార్ధే అవి॥ విప॥ శవో॥ జాగ్రత్స్వప్నసుషుప్తివర్ణనం
నామ పఞ్చచత్వారింశదధిక శతతమః సర్గః ॥ 145 ॥

ప్రపంచరహితమగు బ్రహ్మమునుండియే వాస్తవముగ చిదాకాశరూపమేయగు ఈ సమస్తజగత్తున్ను ఉత్పన్నమగుచున్నది. అయినను అట్టి శాంతమై, నిష్ప్రపంచమైనట్టి బ్రహ్మమొకింతైనను మఱియొకరూపము కాజాలదు. ఏలయనిన, ఏది సత్తైయున్నదో, అది యీ దృశ్యమానమగు అన్యరూపముగ నుత్పన్నము కానేరదు. అక్కారణమున, ఆకసమువలె అనంతమైనట్టి చైతన్యముయొక్క శరీరమున నద్దాని ప్రతిభాసమాత్రమేయై, అనంతశరీరధారియైన యీ వ్యాప్తమగు జగత్తు భాసించుచున్నదేగాని, ఇది మఱియొకవస్తువు కాదు.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున నుత్తరార్ధమున
అవి॥ విప॥ శవో॥ జాగ్రత్స్వప్న సుషుప్తివర్ణనమను
నూటనలుబదియైదవ సర్గము ॥ 145 ॥

## షట్ చత్వారింశదధిక శతతమః సర్గః

[ప్రస్తుతస్వప్నవీక్షాన్తే సుషుప్తిః స్వస్య వర్ణ్యతే
పునః స్వప్నప్రసఙ్గేన బ్రహ్మాద్వైతం చ విస్తరాత్.

ప్రస్తుతస్వప్నదర్శనముయొక్క చివర తనయొక్క సుషుప్తినిగూర్చి వర్ణించుట, మరల స్వప్నప్రసంగముచే అద్వైతబ్రహ్మమును విస్తారముగఁ దెలుపుట యుచటఁ గాననగును.]

వ్యాధ ఉవాచః—

అనన్తరం మునిశ్రేష్ఠ తస్మిన్హృది తదోజసి
స్థితస్య తవ కిం వృత్తం నామతో భ్రాన్తిరూపిణి. 1

వ్యాధుఁడు:— ఓ మునివర్యా! ఆ ప్రాణియొక్క హృదయమందలి తేజమున నున్న భ్రాంతిరూపులును, నామమాత్రులునగు తమయొక్క ఆ పిదప స్వప్నదర్శనాది వృత్తాంత మేమి సంభవించెనో వచింపవేడెద.

మునిరువాచః—

అనన్తరం తదా తత్ర శ్రృణు కింవృత్తమఙ్గ మే
తేజోధాతునిషణ్ణస్య తజ్జీవావలితాత్మతేః. ౧

ముని:– ప్రియుఁడవగు నో వ్యాధుఁడా! ఆ ప్రాణియొక్క తేజోమయధాతువునందున్నట్టియు, ఆ జీవునితోటి కలిసిన లింగశరీరము గలిగినట్టియు నాయొక్క ఆ పిదప యేమి వృత్తాంతము సంభవించెనో వినుము.

తస్మింస్తదా వర్తమానే ఘోరే కల్పాన్తసంభ్రమే
తృణవత్ప్రోథశైలేన్ద్రే వహతి ప్రలయానిలే. 3

గిరివృష్టిర్ఘటిత్యేవ కుతోఽపి సముపాయయౌ
ఉహ్యమానవనాభోగశిఖరగ్రామపత్తనా. 4

ఆ వర్తమానమగు భయంకర ప్రళయసంభ్రమమున తత్ప్రళయ వాయువునందెపుడు గొప్ప గొప్ప పర్వతములున్ను తృణమువలె నెగిరిపోవుచుండెనో, అపుడు శీఘ్రముగ విశాలవన, శిఖర, గ్రామ, పట్టణాదులఁగూడ, గొట్టుకొనిపోవునట్టి పర్వతవృష్టి యెటనుండియో యేతెంచెను.

తస్యాన్తస్త్రత సంప్రాప్తం తదా పరిణతం యదా
తదా తదేవ సూక్ష్మోఽహమపశ్యం శైలవర్షణమ్. 5

ఎపుడు నేనా ప్రాణియొక్క హృదయతేజమునందాతని సూక్ష్మజీవరూపముగ పరిణామ మొందితినో, అపుడచట సంప్రాప్తించినట్టి యీ పర్వతవర్షమునే నేను గాంచితిని.

తేనాన్నలవశైలోచ్చపూరేణ ప్రతిపిణ్డితః
సుషుప్తఘన్దతామిస్రమహమన్వభవం ఘనమ్. 6

ఆ ప్రాణియొక్క నాడులందలి అన్నరసలేశమను గొప్పపర్వతప్రవాహముచే నేను ముద్దగాఁ జేయబడిన యాకారముగలవాఁడనై, నిశ్చేష్టుఁడనై, అజ్ఞానమను అంధతమస్సుతోఁగూడిన గాఢ సుషుప్తి ననుభవించితిని.

అథ కించిత్తదా కాలమనుభూయ సుషుప్తతామ్
తదా పద్మాకర ఇవ శనైర్బోధోన్ముఖోఽభవమ్. 7

అట్లచట నొకింతకాలము సుషుప్తిననుభవించి యాపిమ్మట, నిర్గమనమార్గనిరోధకమగు యన్నరసము జీర్ణముకాఁగా నత్తఱి, ప్రాతఃకాలమున కమలసరోవరమువలె మెల్లగ ప్రబోధము వైపునకు ఉన్ముఖుడనైతిని.

యథా దృష్టిశ్చిరాద్ధ్వాన్తే భాతి చక్రకరూపిణీ
సుషుప్తమేవ తత్రాసీత్తథా స్వప్నత్వమాగతమ్. 8

అంధకారమున చిరకాలము మూయబడియుండు దృష్టి యెట్లు చక్రాకారతేజోరూపముగ భాసించునో, అట్లే యా సుషుప్తియునట క్రమముగ స్వప్నరూపత్వమును బొందినదైయుండెను.

తథా సుషుప్తవిశ్రాన్తేః స్వప్నే నిద్రామహం విశమ్
అపశ్యం దృశ్యమోజోఽన్తః స్వమూర్మిత్వమివార్ణవః. 9

ఆ ప్రకారముగ నేను, సుషుప్తివిశ్రాంతినుండి స్వప్ననిద్రయందుఁ బ్రవేశించితిని. మఱియు శాంతమగు సముద్రము తరంగాద్యనేక విక్షేపములతోఁగూడి తనరూపమును గాంచు నట్లు, నేనున్ను ఆ తేజమందలి యనేకవిక్షేపములను గాంచితిని

> సంవిత్కోశాత్మకం దృశ్యం తత్తథా మాముపాగతమ్
> అస్పన్దస్యానిలస్యాన్తరనస్యత్స్పన్దనం యథా. 10

స్పందరహితమగు వాయువును, తదభిన్నరూపమగు స్పందము పొందునట్లు, అపుడు చిదాకాశరూపుడగు నన్ను నాకంటె వేరుకానట్టి దృశ్యముపొందెను.

> అగ్న్యాదౌ చ యథోష్ణత్వం జలాదౌ ద్రవతా యథా
> మరిచాదౌ యథా తైక్ష్ణ్యం చిద్వ్యోమ్నశ్చ జగత్తథా. 11

అగ్నిమున్నగువానియందు ఉష్ణత్వమున్ను, జలము మున్నగువానియందు ద్రవత్వమున్ను, మిరియములు మున్నగువానియందు కారమున్ను నెట్లుండునో, అట్లే చిదాకాశమందీజగత్తున్ను గలదు.

> చిత్స్వభావైకరూపత్వాజ్జగద్దృశ్యం తదాతతమ్
> తత్సుషుప్తాత్మనో దృశ్యాత్ప్రసూతం బాలపుత్రవత్. 12

చిత్స్వభావముతోడ ఏకరూపత్వము గలిగియుండుటవలన విశాలమగు ఆ స్వప్నదృశ్య జగత్తు అపుడా సుషుప్తిరూపదృశ్యమునుండి, తల్లిగర్భమునుండి బాలకుఁడగు పుత్రునివలె జనించిన దాయెను.

**వ్యాధ ఉవాచ:—**

> తత్సుషుప్తాత్మనో దృశ్యాదితి తద్వ్యపదేశతః
> సుషుప్తదృశ్యం కిం వక్షి వద మే వదతాం వర. 13

వ్యాధుఁడు:— వక్తలలో శ్రేష్ఠుఁడవగు ఓ మునీంద్రా! 'ఆ సుషుప్తిరూపదృశ్యమునుండి' అని తాము వచించుటవలన సుషుప్తియందుఁగూడ నొకింత దృశ్యముగలదని తెలుచున్నది. కావున నద్దానిని నాకుఁ దెలుపవేడెద.

> తత్సుషుప్తాత్మనో దృశ్యాత్త్వత్సుషుప్తాత్మనోఽపి చ
> కిమన్యజ్జాయతే జన్యమథవాన్యసుషుప్తతా. 14

మఱియు, ఎవనిహృదయమందు తాము ప్రవేశించితిరో, ఆతనియొక్కయు, తమ యొక్కయు సుషుప్తిరూపదృశ్యమునుండి మఱియొక జగద్రూపదృశ్యమేది జనించుచున్నది? లేక మఱియొక సుషుప్తిరూపమేది యుత్పన్నమగుచున్నది?

**మునిరువాచ:—**

> జాయతే భాతి కచతి ఘటాది జగదాది చ
> ఇతి ద్వైతోపతప్తానాం ప్రలాపః కల్పనాత్మకః. 15

ముని:—ఓ వ్యాధుఁడా! దృశ్యము, అది జనించుట మున్నగు వానిగూర్చి పరమార్థమున ప్రశ్నించుచున్నావా? లేక వ్యవహారముననా? పరమార్థముననైనచో, దృశ్యము ఆ వస్తు

వగుటచే నేదియు నుత్పన్నమగుటలేదనునదియే ప్రత్యుత్తరము. వ్యవహారదృష్టిననుసరించియే 'నేను' ఘటజగదాదిదృశ్యము జనించుచున్నది. భాసించుచున్నది. ప్రకాశించుచున్నది. యను నీప్రకారమగు ద్వైతసంతాపముచే పరితప్తులగు మూర్ఖుల కల్పనామయమగు ప్రలాపమును నీకు వచించినవాఁడనైతిని.

జాతశబ్దో హి సన్మాత్రపర్యాయః శ్రూయతాం కథమ్
ప్రాదుర్భావే జనిస్తూక్తః ప్రాదుర్భావస్య భూర్వపుః. 16

పండితుల యభిప్రాయమందు 'జాత' శబ్దము సన్మాత్రముయొక్క పర్యాయపదమైయున్నది. అది యెట్లో వినుము—— (పాణినిమున్నగు మునులచే) 'జనిప్రాదుర్భావే' అనునీప్రకారముగ 'జని' ధాతువుయొక్కయర్థము 'ప్రాదుర్భావ' మని చెప్పఁబడెను. అందు 'ప్రాదుర్' అను అవ్యయము. ప్రకటత్వమును మాత్రము సూచించునదై అప్రధానమైయున్నది. 'సత్తా' మాత్రమను నర్థముగల 'భూ' ధాతువే దాని ప్రధానశరీరమైయున్నది.

సత్తార్థ ఏవ భూః ప్రోక్తస్తస్మాత్సంజాతముచ్యతే
సర్గతో జాత ఇత్యుక్తే సంసృష్ట ఇతి శబ్దితమ్. 17

(భూ సత్తాయాం అనునట్లు) 'భూ' ధాతువు 'సత్త' యను అర్థముననే వచింపఁబడినది. కావున 'ప్రాదుర్' అను ఉపసర్గతోఁగూడిన సన్మాత్ర 'భావ' శబ్దమే 'సంజాత' మని చెప్పబడినది. 'ప్రాదుర్' అను శబ్దమునకు 'సర్గము (సృష్టి) నుండి అను అర్థమైనను ఏ హానియులేదు. ఏలయనిన, 'సర్గ' శబ్దమున్ను భావ (సత్తా) రూపార్థప్రతిపాదకమగు 'ఘఞ్' ప్రత్యయమునుండి యేర్పడుటచే సన్మాత్రమే 'సర్గ'మైయున్నది. గాని మఱియొకటికాదు.

బుధానామస్మదాదీనాం న కించిన్నామ జాయతే
నచ నశ్యతి వా కించిత్సర్వం శాన్తమజం చ సత్. 18

కాఁబట్టి మావంటి విజ్ఞులదృష్టియం దొకింతైనను నుత్పన్నమగుటలేదు. నశించుటలేదు. అంతయు శాంతమై అజమైనట్టి సన్మాత్రబ్రహ్మమేయైయున్నది

సర్వసత్తాత్మకం బ్రహ్మ సర్వసత్తాత్మకం జగత్
విధయః ప్రతిషేధాశ్చ వద తత్ర లగన్తి కే. 19

ఓ వ్యాధుఁడా! బ్రహ్మము సర్వసత్తాస్వరూపమైయున్నది అందుస్ఫురించు జగత్తున్నునట్లే సర్వసత్తాత్మకమైయేయున్నది. అట్టిచో నిఁక ఆ బ్రహ్మమందు 'కలదు లేద'నునవిగాని విధినిషేధములుగాని యెవ్వియెట్లుండగలవు?

యా నామ శక్తిః కాచిత్స్యాత్తత్రైవాస్తి చ నాస్తి చ
యస్మాత్తదాత్మ తద్బ్రహ్మ తథైవాత్మ తదాత్మకమ్. 20

ఆ బ్రహ్మమందు ఏ మాయాశక్తి గలదో, దానియందే 'కలదు. లేదు.' అనునీమున్నగు వ్యవహారములుగలవు. ఏ కారణముచే ఆ బ్రహ్మము మాయాశబలితమైయున్నదో. ఆకారణముచే నయ్యది అజ్ఞానులకు తన్మాయారూపముగనే గన్పట్టుచున్నది. ఆ యా మాయాశక్తి యెట్లెట్లు విజృంభించుచున్నదో. అట్లట్లా సర్వశక్తిస్వరూపమైన ఆత్మరూపమగు బ్రహ్మమున్ను తద్రూపముగ స్ఫురించుచున్నది.

జాగ్రత్స్వప్న సుషుప్త్యాదిపరమార్థవిదాం విదామ్
న విద్యతే కించిదపి యథాస్థితమవస్థితమ్. 21

పరమార్థము నెఱిగిన తత్త్వవేత్తలకు జాగ్రత్స్వప్న సుషుప్త్యాదు లెవ్వియును నొకింతైనను లేవు. యథారీతి స్థితిగల్గియున్న బ్రహ్మమే సర్వత్ర గలదు.

స్వప్నసంకల్పపురయోర్భ్రాన్త్యప్యనుభవస్థయోః
మనాగపి యథా రూపం సర్గాదౌ జగత స్తథా. 22

జీవులయనుభవమందలి స్వప్నసంకల్పపురముల కొకింతైనను రూపమెట్లు లేదో అట్లే సృష్ట్యాదియందు జగత్తునకును రూపమేమియును లేదు.

ద్రష్టాస్యాః స్వప్నదృష్టేస్తు జీవః సంభవతీహ హి
చిద చేత్యా తు సర్గాదౌ భాత్యచ్ఛా గగనాదపి. 23

జీవోపాధియొక్క సృష్ట్యనంతర మేర్పడుటవలన, ఆ స్వప్న, సంకల్పపురములయొక్క ద్రష్ట ప్రాణాదిసహితుఁడగు జీవుఁడగుట సంభవించుచున్నది. కాని ప్రాణాదుల యుత్పత్తికి బూర్వము సృష్ట్యాదియందా సృష్ట్యాదులయొక్క ద్రష్ట నిర్విషయమై, ఆకాశముకంటె నిర్మలమైనట్టి చైతన్యమేయై భాసించుచున్నది.

నేహ ద్రష్టాస్తి నో భోక్తా సర్వమస్తీహ తాదృశమ్
యన్న కించిచ్చ కించిచ్చ మౌనమేవాతివాగపి. 24

ఈ ద్రష్టసుగూర్చిన కథనమున్ను సృష్టినిబట్టియేయైయున్నది. వాస్తవముగ నిట ద్రష్టగాని, భోక్తగాని, తత్సంబంధమగు త్రిపుటిగాని యెవ్వియును లేవు. అంతయు చిదేకరసమేయైయున్నది. ఏది యెద్దియుఁగాకున్నను సమస్తమున్ను నైయున్నదో, ఏది మహావాగ్రూపమైనను మౌనాత్మకమైయున్నదో, అట్టి చిన్మాత్రమే యీ సర్వమున్ను నగును.

సర్గాదౌ కారణాభావాద్యద్యథా కచితం చితౌ
తత్తథాస్తే చిరం రూపం స్వప్నసంకల్పపూర్యథా. 25

స్వప్న, సంకల్పపురమువలె, సృష్ట్యాదియందు కారణాభావముచే చైతన్యమున ఏ వస్తువెట్లు స్ఫురించెనో, అది ప్రళయమువఱకు నట్లేయుండును.

తథాస్మాచ్చేతనాద్ద్వైతాద్బిభేతి న బిభేతి వా
అజ్ఞసంస్థాద్యథా చిత్రాత్స్వరూపాత్పురుషః స్వయమ్. 26

తనయొక్క అవయవాదులందు లిఖింపఁబడిన వ్యాఘ్రసర్పాది చిత్రములఁజూచి బాలుఁడు స్వయముగ భీతిల్లునట్లును, ప్రౌఢవయస్కుఁడు భీతిల్లనట్లును, ఆత్మరూపమేయగు ద్వైతమును జూచి అజ్ఞాని భయపడును. జ్ఞానిభయపడడు.

అనాదిమధ్యాన్తమనన్తమేక మత్యచ్ఛమేవాతివికారి నానా
యథాస్థితం భాస్వరమప్యభాన్నమిదం సమస్తం పరిశాన్తమేవ. 27

ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే ఉత్తరార్ధే అవి॥ విప॥ శవో॥ సుషుప్తవిచారో నామషట్ చత్వారింశదధికశతతమః సర్గః ॥ 146 ॥

పరమార్థమున ఆదిమధ్యాంత రహితమై, అనంతమై, ఏకమై, అతి నిర్మలమైనట్టి బ్రహ్మమే భ్రాంతిచే మహావికారవంతముగను, నానారూపములుగనునయి, తన నిజస్వరూపమును దృశింపకయే యట్లు భాసించుచున్నది. కాఁబట్టి, ఈ జగత్తు అజ్ఞానముచే అశాంతముగ గన్పట్టినను, బోధచే సర్వదా మహాశాంతమై, ప్రకాశరూపమేయై చెన్నొందుచున్నది.

ఇది శ్రీవాసిష్ఠతాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున నుత్తరార్ధమున అవి॥ విప॥ శవో॥ సుషుప్తవిచారమను నూట నలుబది యాఱవ సర్గము ॥146॥



## సప్తచత్వారింశదధికశతతమః సర్గః

[సుషుప్తాదత్ర దృష్టాన్తైః స్వప్ననిర్గమనక్రమః
తత్రపూర్వకుటుమ్బాది వీక్షాతత్త్వం చ వర్ణ్యతే.

సుషుప్తినుండి స్వప్నమున కేతెంచుటఁగూర్చిన క్రమమును దృష్టాంతములతో వర్ణించుటయు, అట తనపూర్వకుటుంబాదులను దర్శించుటఁగూర్చిన తత్త్వమును వివరించుటయు నిచటఁ గాననగును.]

**మునిరువాచ:—**

అనన్తరం మహాబాహో సుషుప్తాన్నిర్గతస్య మే
స్వప్నే జగద్దృశ్యమిదం సాగరాదివ నిర్గతమ్. 1

ముని:— గొప్ప బాహువులుగల ఓ వ్యాధుఁడా! అనంతరము సుషుప్తినుండి వెలువడిన నాకు, సముద్రమునుండి తరంగ, మణి. ముక్తాదులవలె, స్వప్నమందీజగద్దృశ్యము సంప్రాప్తమయ్యెను.

ఆకాశాఙ్గాదివోత్కీర్ణముత్కీర్ణ మవనేరివ
ఉత్కీర్ణమివ వా చిత్తాదుత్కీర్ణమివ వా దృశః. 2

ఆకాశముయొక్క అంగమునుండిగాని, భూమినుండిగాని, చిత్తమునుండిగాని, లేక దృష్టినుండిగాని ప్రకటితమైనదానిచందమున నపుడు సుషుప్తినుండి యా స్వప్నజగత్తు నాకు ప్రకటితమయ్యెను.

ప్రపుల్లమివ వృక్షేభ్యః సర్గః పూర్వమివోత్థితః
తరఙ్గజాలం రోధోఽబ్ధేరివ వా కచనం దృశామ్. 3

నభస్తలాదివాయాతం కకుభ్య ఇవ చాగతమ్
సర్వతేభ్య ఇవోత్కీర్ణం భూమేరివ సముత్థితమ్. 4

హృదయాదివ నిష్క్రాన్తం సంప్రవిష్టమివామ్బుదైః
ప్రసూతమివ వృక్షేభ్యో జాతం వా సస్యవద్భువః. 5

అఙ్గేభ్య ఇవ నిర్యాతం సముత్కీర్ణమివేన్ద్రియైః
పటాదివ ప్రకటితం మన్దిరాదివ నిర్గతమ్. 6

కుతోఽప్యాగత్య పతితముడ్డీయ గగనాదివ
ఉపాయనం పరే లోకే గృహీతమివ వా భువః. 7

ప్రసూనం బ్రహ్మవృక్షస్య తరఙ్గమివ వామ్బుధేః
అనుత్కీర్ణ ప్రకటనాచ్చిత్స్తమ్భే చారుపుత్రికా. 8

ఆకాశమృన్మయానన్త కుడ్యమాకాశ పత్తనమ్
మనో మత్తో గజమయో మిథ్యా జీవస్య జీవితమ్. 9

అభిత్తికమరఙ్గం చ విచిత్రం చిత్రమమ్బరే
శమ్బరేశస్య సర్వస్వమ విద్యాఖ్యస్య కస్యచిత్. 10

లేక, వృక్షములనుండి వికసించిన పుష్పములవలెను, పూర్వసిద్ధమగు (అపుడుత్పన్నము కానట్టి) సృష్టివలెను, తీరసమీపమందలి సముద్రముయొక్క తరంగసమూహమువలెను, దోషయుక్తములగు నేత్రములయొక్క కేశ, ద్విచంద్రాది రూపముతోటియైన భాసనమువలెను, ఆకాశతలమునుండిగాని, దిక్కులనుండిగాని యేతెంచినదానివలెను, పర్వతములనుండి ప్రకటితమైన దానివలెను, భూమినుండి యుత్పన్నమైన దానివలెను, హృదయమునుండి, బయల్వెడలిన దాని చందమునను, మేఘములచే నాకాశమునఁ బ్రవేశింపఁజేయఁబడినదానివలెను, వృక్షములనుండి జనించినదానివలెను, భూమినుండి సస్యమువలె నుత్పన్నమైనదానివలెను, అవయవములనుండిపుట్టిన వికారాదులవలెను, ఇంద్రియములచే దిక్కులందుఁ బ్రసరింపఁబడిన దానివలెను, వస్త్రమునుండి ప్రకటితమైన చిత్రమువలెను, గృహమునుండ వెలువడిన. వస్తువువలెను, ఎటనో యాకాశమునుండి యెగిరివచ్చి పడినదానివలెను, ప్రజలనుండి రాజుకొఱకై తేఁబడిన కానుకవలెను, ఇహలోకమున నంచితమొనర్పఁబడిన పుణ్యముయొక్క పరలోకమున వ్యక్తమైన ఫలరూపమువలెను, భూమినుండి గ్రహింపఁబడిన నిధివలెను, బ్రహ్మమను వృక్షముయొక్క పుష్పమువలెను, సముద్రముయొక్క తరంగమువలెను, చిత్స్వరూపమను స్తంభమునందుఁ జెక్కఁబడకయే ప్రకటమైనట్టి సుందర విగ్రహమువలెను, ఆకాశమగు మృత్తికయొక్క వికారభూతములైన అసంఖ్యాతములగు కుడ్యము (గోడ)లవలెను, ఆకాశమందలి గంధర్వనగరమువలెను, మనస్సను మదగజముయొక్క క్రీడవలెను, మిథ్యారూపుఁడైన జీవునియొక్క సర్వస్వమువలెను, భిత్తి, రంగులు మున్నగునవిలేకనే యాకాశమునఁ జిత్రింప బడిన విచిత్రచిత్రమువలెను, మాయాసమర్థుఁడగు 'అవిద్య' యను నొకానొక యింద్రజాలకునియొక్క మాయాసర్వస్వమునలెను. ఆ స్వప్నదృశ్యమపుడు సుషుప్తినుండి ప్రకటమయ్యెను.

సుహారమ్యం స్థిరమపి దేశకాలవివర్జితమ్
నానార్థ్యమపి చాద్వైకం నానాత్మాపి న కించన. 11

గన్ధర్వపురదృష్టాన్తస్యావ్యవస్తుతయా సమమ్
తా? రాయాం హి కిల తద్ద్వాన్తమప్యుపలభ్యతే. 12

? వ్యాప్తిమాత్ర మనారబ్ధ మప్యారబ్ధమివ స్థితమ్
దేశకాలక్రియాద్రవ్య సర్గసంహారసంయుతమ్. 13

సురాసురనరాధారగర్భగర్భమనోహరమ్
పృథక్కోశస్థబీజౌఘ సంపూర్ణమివ దాడిమమ్. 14

నదీశైల వనాదిస్థ వ్యోమతారాభ్ర సంకులమ్
గీతాబ్ధిరణ పాఠాఢ్యపవనారావ ఘర్ఘరమ్. 15

మఱియు, ఆ స్వప్నదృశ్యము గొప్ప ప్రయత్నములతోఁగూడినదియు, స్థిరమైనను దేశకాలవర్జితమైనదియు, వివిధపదార్థములచేఁ బరిపూర్ణమైనను అద్వైతరూపమైనదియు, నానారూపాత్మకమైనను రూపరహితమైనదియు, గంధర్వనగరతుల్యమైనను. అవస్తువుతో సమానమైనదియు, జాగ్రత్తునందు లభించు రజ్జు, సర్ప, మృగతృష్ణాజలాదులవంటిదియు, చైతన్యముయొక్క ప్రకాశమాత్రమున్ను, ఆరంభరహితమైనను, ఆరంభసహితముగానున్నదియు, దేశ, కాల, క్రియా, ద్రవ్యములసృష్టి, సంహారములతోఁ గూడినదియు, సుర, అసుర మనుష్యాదియుక్తమగు త్రైలోక్యమునకాధారభూతములైన గర్భములతోడను, మఱల వాని గర్భములతోఁడను, కదళీస్తంభమువలె మనోహరమైనదియు. ఆ గర్భములయొక్క, అవాంతర గర్భములందు అనంతకోటి బ్రహ్మాండములయొక్క కల్పనలచే, వేఱు వేఱు గదులందున్న బీజసమూహములచేఁ బూర్ణమగు దానిమ్మపండువలెనున్నదియు, నదీ, పర్వత, వనాది సంయుక్తమున్ను, ఆకాశమందు నక్షత్ర మేఘాదులచే వ్యాప్తమైనదియు, గాన సహితమగు సముద్రముయొక్క శబ్దరూపమగు పాఠముచేఁ బరిపూర్ణమైనదియు, వాయువుయొక్క ఘర్ఘరశబ్దముతోఁ గూడినదియునైయుండెను.

తతో విలోకితం తత్ర తన్మయా దృశ్యమణ్డలమ్
యావత్తమేవ పశ్యామి గ్రామం ప్రాక్తనమాస్పదమ్. 16

అటు పిమ్మట నేనా దృశ్యమండలమును జూచుటకై ప్రవృత్తుఁడను కాఁగా నింతలో నచట నాపూర్వ పరిచితమగు (ఇదివఱకు స్వప్నమందు గాంచినదేయగు) గ్రామమునున్ను, అందలి యా పూర్వపు గృహమునున్ను నవలోకించితిని.

తానేవ సకలాన్బన్ధూం స్తథా సంస్థానసంస్థితాన్
తాన్పుత్రాంస్తాం మహేలాం చ తదేవ చ సదా గృహమ్. 17

మఱియు, అ యా పూర్వపు స్థానములం దాయా యాకారవయస్సులతోనే గూడియున్నట్టి యా సమస్తబంధువులను, పుత్రులను, భార్యను, గృహమునే మరల యటఁజూచితిని.

తాం దృష్ట్వా ప్రాక్తనీం గ్రామ్యామాహరద్వాసనాం బలాత్
తటస్థం ముహ్యమానాఙ్గమివ వీచిర్మహార్ణవే. 18

అథాహమభవం తత్ర తదాలిఙ్గననిర్వృతః
గృహీతవాసనో నూనం విస్మృతప్రాక్తనస్మృతిః. 19

మహాసముద్రమున తీరమందలి తరంగమువలెను, వ్యాకులమగు నిజావయవమువలెను నున్నట్టి యా పూర్వకాలపు గ్రామసంబంధమైన గృహ, క్షేత్ర, పుత్ర, బంధ్వాదులందలి యభిమాన రూపమగు, వాసనను చిత్తము బలాత్కారముగ నాకర్షించుటను జూచి, తదనంతరము నేనా వాసన యందు నిక్కముగ బద్ధుఁడనై, పూర్వకాలికస్మృతిని మఱచి యా బంధుస్త్రీ పుత్రాదులయొక్క యాలింగనముచే సుఖవంతుఁడనైయుంటిని

బిమ్బం తత్తదుపాదత్తే యద్యదగ్రేఽవతిష్ఠతి
యథా దర్శశ్చిదాదర్శస్తథైవాయం స్వభావతః. 20

అద్దము తనయెదుట నే యే వస్తువుండునో, దాని ప్రతిబింబమును స్వయముగనే గ్రహించునట్లు, చైతన్యమను అద్దమున్ను వాసనచేఁ దనయెదుట నే యే వస్తువు స్థాపింపఁజేయఁబడి యుండునో, అద్దాని యాకారమును స్వభావముగనే గ్రహించును.

యస్తు చిన్మాత్రగగనం సర్వమిత్యేవ బోధవాన్
ద్వైతేన బోధ్యతే నేహ సోఽగ్ని తిష్ఠతి కేవలః. 21

ప్రియుఁడవగు నో వ్యాధుఁడా ! ఈ సమస్తమున్ను చిదాకాశమాత్రమే యను బోధగలవాఁ డిట ద్వైతవాసనచే నెన్నఁడును బోధితుఁడు కాఁడు. కేవలము శుద్ధచిద్రూపముతోనే సదా స్థితిగల్గి యుండును.

న నశ్యతి స్మృతిర్యస్య విమలా బోధశాలినీ
అయం ద్వైతపిశాచస్తం మనాగపి న బాధతే. 22

నిర్మలమైనదియు, ఆత్మబోధస్వరూపమైనదియునగు స్మృతి యెవనికి నశింపకయుండునో, అట్టివానిని ఈ ద్వైత పిశాచ మొకింతైనను బాధింపనేరదు.

యేషామభ్యాసయోగేనసాధుసచ్ఛాస్త్రసంగమైః
ఉదేతి బోధధీర్భూయో యా విస్మరతి నోదయమ్. 23

ఏ మహాత్ములకు శ్రవణమననాదుల యభ్యాసముచేతను, సాధు, సచ్ఛాస్త్రముల సంసర్గము చేతను, ఆత్మబోధముగూర్చిన బుద్ధి ఎయ్యది యుదయించుచున్నదో, అది మరల ఎన్నఁటికిని తన యుదయమును మఱువకయుండును. సదా బ్రహ్మానుసంధానముచేతనే పరిపూర్ణమైయుండును.

అప్రౌఢా మే తదా సాసీద్బోధధీర్యా తయా హతా
అద్య శక్నోతి మే బుద్ధిం హన్తుం క ఇవ దుర్గ్రహః. 24

అపుడు నాబుద్ధి ప్రౌఢమగు ఆత్మజ్ఞానముతోఁ గూడియుండలేదు. కనుక నే బంధ్వాదులఁ గూర్చిన వాసనచే నది హతమయ్యెను. ఇపుడో, నా బుద్ధిని ఏ వాసనా సమూహము నశింపఁజేయఁ గలదు ?

తవాపి వ్యాధ విద్ధీదం బుద్ధిః సత్సఙ్గవర్ధితా
ద్వైతబోధేన కష్టేన కృచ్ఛ్రాద్భ్రాన్తిముపైష్యతి. 25

ఓ వ్యాధుఁడా! నీయొక్క బుద్ధియు సత్సంగాదిరహితమైయున్నది గావున నిపుడే శాంతిని బొందదు. తపస్సు, రాజ్యపాలన మున్నగు కష్టములచేతను, ద్వైతబోధచేతను, సాధనాభ్యాస పరిశ్రమ ద్వారాను జ్ఞానమును బొంది శాంతి నొందఁగలదు.

**వ్యాధ ఉవాచః—**

ఏవమేతన్మునే సత్యం పావనై స్త్వద్విబోధనైః
ఈదృశై రపి మే బుద్ధిర్న విశ్రామ్యతి సత్పదే. 26

వ్యాధుఁడు:—ఓ మునీంద్రా! తాము చెప్పినది సత్యమే. ఏలయనిన, తమయొక్క యిటువంటి పవిత్రబోధలచేఁగూడ నాబుద్ధి సద్రూపమగు బ్రహ్మపదమున విశ్రాంతి నొందకున్నది.

స్యాదీదృశమథో న స్యాదితి సందేహజాలికా
నైతస్మిన్స్వానుభూతేఽపి వస్తున్యద్యాపి శామ్యతి. 27

తాము సెలవిచ్చినది యట్లేయుండునో, లేక మఱియొక విధముగ నుండునో యను నీ ప్రకారమగు సందేహసమూహము నన్ను బాధించుచున్నది. ఇకారణమున స్వానుభూతమగు ఆత్మవస్తువునందు నాబుద్ధి నేఁటివఱకింకను శాంతినొందకయేయున్నది

అహో బత దురన్తేయ మభ్యాససుదృఢీకృతా
అవిద్యా విద్యమానైవ యా శాన్తైవ న శామ్యతి. 28

ఆహా! అనేక జన్మలందలి యభ్యాసముచే బాగుగ దృఢపడినట్టి యీ 'అవిద్య' అనంతమైనది! వాస్తవముగ లేనిదేయైనను, ఇది ప్రకటమగుచున్నది! నశించినదేయైనను నశింపకున్నది

సత్సఙ్గతైః పదపదార్థవిబుద్ధబుద్ధేః సచ్ఛాస్త్ర సత్క్రమ విచార మనోహరాఙ్గైః
అభ్యాసతః ప్రశమమేతి జగద్భ్రమోఽయం నాన్యేన కేనచిదపీతి వినిశ్చితిర్మే. 29

ఇత్యార్షే శ్రీ వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే ఉత్తరార్ధే అవి॥ విప॥ శవో॥ స్వపోన్ప పలమ్భనం నామ సప్తచత్వారింశదధిక శతతమః సర్గః ॥ 147 ॥

మహాత్మా! సచ్ఛాస్త్ర, సద్గురు సంప్రదాయ, తత్త్వవిచారణాదులను మనోహరములైన అంగములతోఁగూడిన సత్సాంగత్యములచే జనించి పదపదార్థవివేక బుద్ధియొక్క అభ్యాసముచే నుత్పన్నమైన ఆత్మజ్ఞానముద్వారా యే భూమికాక్రమమున ఈ జగద్భ్రాంతి నశించునుగాని ఇతరమగు మఱియే యుపాయముచేతను నశింపదని నా నిశ్చయము.

**ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున నుత్తరార్ధమున అవి॥ విప॥ శవో॥ స్వపోన్ప పలంభనమను నూటనలుబదియేడవ సర్గము ॥147॥**

## అష్ట చత్వారింశ దధిక శతతమః సర్గః

[ స్వప్నాసత్యత్వసత్యత్వ హేతురత్ర నిరూప్యతే
జాగ్రత్స్వప్నసుషుప్త్యైక్యం చిత్సార్వాత్మ్యైక్యశుద్ధియుక్.

స్వప్నముయొక్క సత్యత్వ, అసత్యత్వములకు హేతువున్ను, సర్వాత్మయగు చైతన్యము యొక్క ఏకత్వరూపశుద్ధితోఁగూడ జాగ్రత్స్వప్న సుషుప్తులయొక్క ఏకత్వమున్ను నిచట నిరూపింపఁబడుచున్నవి. ]

**వ్యాధ ఉవాచ:—**

ఏవం చేత్తన్మునిశ్రేష్ఠ సత్యతా సత్యతా కథమ్
స్థితః స్వప్నదృశాం చైష సుమహాన్సంశయో మమ. 1

**వ్యాధుఁడు :—** ఓ మునీంద్రా! స్వప్నము వాసనానుసారమేయైనట్లైన, మఱియు, **జాగ్రత్తున్ను** స్వప్నతుల్యమేయైన పక్షమున, ఒకానొక స్వప్నము ప్రాతఃకాలమున జరుగఁబోవు **గజారోహణాది** ఫలములను సూచించుటవలన సత్యమున్ను, మఱియొక స్వప్నము, అట్లు జరుగఁ **బోనట్టి అరణ్య**సంచారాది ఫలమును సూచించుటవలన అసత్యమున్ను నెట్లగుచున్నది? ఇట్లు స్వప్నజగత్తునందు సత్యత్వాసత్యత్వములేల వర్తించుచున్నవి? అట్లే బ్రహ్మదేవునియొక్క సంకల్ప **జనితసృష్టి అర్థక్రియా**సమర్థ మగుటచే సత్యమున్ను, మనయొక్క సంకల్పజనితసృష్టి **అసత్య మున్ను** నగుటచే జాగ్రజ్జగత్తునందును ఈ సత్యత్వాసత్యత్వము లేలయున్నవను ఈ గొప్ప సంశ**యము** నాకుఁగలదు. అధిష్ఠాన చైతన్యముయొక్క సత్యత్వముచే, అధ్యస్తమైన దానియందు సత్య**త్వము, స్వతః అసత్యత్వ**మను విషయము జాగ్రత్స్వప్నముల రెంటియందును సమానమేయై యున్నది. గావున నీఁక నీపైన దెల్పిన వైషమ్యమునకు హేతువేమియో వచింపవేడెద!

**మునిరువాచ:—**

దేశకాలక్రియాద్రవ్యైర్యా సంవిన్నిశ్చితోదితా
కాకతాలీయవద్భాతి సా సత్యస్వప్ననామికా. 2

ముని:— ఓ వ్యాధుఁడా! ఏ స్వప్న సంవిత్తు, స్వప్నస్థ దేశకాల క్రియాద్రవ్యములచే **శాస్త్రాది**ప్రమాణమువలన, 'ఇట్టి స్వప్నమున కిట్టి ఫలము తప్పకఁ గలుగునని' నిశ్చయింపబడినదై **యుదయించుచున్నదో**, అయ్యది కాకతాళీయముగ ఫలించు శకునాదులవలె తప్పక భావికాలమున **ఫలమును** గలుగఁజేయునదగుటచే సత్యస్వప్నమను పేరుగలదియగుచున్నది.

మణిమన్త్రౌషధిద్రవ్యైః క్వచిదవ్యభిచారిణీ
క్వచిత్ప్రవ్యభిచారా చిత్సత్యస్వప్నాభిధా స్మృతా. 3

**మణిమంత్రౌషధాది** ద్రవ్యములచేఁ గలుగునపుడు ఆ స్వప్నసంవిత్తు ఒకానొకచోట **యోగ్యపురుషుని**యందు సత్యముగను, ఒకానొకచోట అయోగ్యునియందు **అసత్య**ముగను నగు**చున్నది. అయినను, శాస్త్రమర్యాద** నుల్లంఘింపనందున నయ్యది యీ రెండుచోట్లను సత్యస్వప్న **మనియే** పేర్కొనఁబడుచున్నది.

సత్యస్వప్నస్థితిర్లోకేష్వీదృగ్రూపా యదా స్థితా
తదైషా కాకతాలీయన్యాయాదన్యా న లభ్యతే. 4

ఆ రెండుచోట్లను స్వప్నస్థితి 'కాకతాళీయన్యాయము', (ఆకస్మికఘటన) చేతనే సత్యమై యున్నదిగాని మరియొకరీతిచేఁగాదు.

యం యం నిశ్చయమాధత్తే సంవిత్స్వదృఢనిశ్చయా
తథా తథా భవత్యేషా ఫలయుక్తస్వభావతః. 5

హిరణ్యగర్భాదుల సంవిత్తు పూర్వకాలపు ఉపాసనాదులపరిపాకముచే జనించినదగుట వలన సత్యసంకల్ప రూపమగు దృఢనిశ్చయముతో. గూడియుండుటచే, ఏయే నిశ్చయమును గ్రహించుచున్నదో, ఆయా రీతిగనే యగుచున్నది. ఏలయనిన ఫలయుక్తమగుట దృఢసంవిత్తు యొక్క స్వభావమేయై యున్నది.

తమేవ నిశ్చయం త్వస్యా అన్యః ప్రతినిహన్తి చేత్
తత్రాసౌ నిశ్చయః ప్రౌఢః స కథం లక్ష్యభాగ్భవేత్. 6

అట్టి యా హిరణ్యగర్భాదుల సంవిత్తుయొక్క దృఢనిశ్చయము తద్విరోధియగు మతి యొక్క ప్రబలనిశ్చయముచే నశింపఁజేయఁబడఁదాయనిన, అట్లు చేయఁబడినచో నిఁక 'నేను జగత్తుయొక్క సృష్టికర్తను' అను ఈ ప్రకారమగు ఉపాసనాకాలమందలి యద్దాని శ్రుతిప్రసిద్ధమగు దృఢనిశ్చయము ఫలభాగి యెట్లగును? కావున, ఇతరసిద్ధుల సంకల్పములు బ్రహ్మాదుల నిశ్చయము నగు అవిరోధులుగ నుండునేకాని విరోధులుగఁగాదు.

న బహిర్నాన్తరే సన్తి పదార్థాః కేచన క్వచిత్
సంవిదేకా జగద్రూపైర్యథేచ్ఛతి తథా స్థితా. 7

వాస్తవముగ బాహ్యమునగాని, అభ్యంతరమునగాని జగదాది పదార్థము లెవ్వియును నెచటను లేవు; ఒకేస్వతంత్రమైన సంవిత్తెచట నెట్లిచ్ఛగించుచున్నదో, అచటనట్లే జగదాది రూపములుగ స్థితినొంది యున్నది.

స్వప్నోఽయం సత్య ఇత్యన్తర్నిశ్చయేన తథోదితా
తథైవాశు భవత్యేషా సంశయాత్సంశయం వ్రజేత్. 8

కాఁబట్టి దృఢనిశ్చయముచే 'ఈ స్వప్నము సత్యమైనది' అను నీ ప్రకారమగు సంవిత్తెచట నంతరంగమున నుదయించుచున్నదో, అచట నట్లే యా సంవిత్తు సత్యమగుచున్నది. సంశయము గలిగియున్నచో. ఫలముయొక్కయు సంశయము సంప్రాప్తించుచున్నది

అన్యతోఽపి ఫలం ప్రాప్తం స్వప్నసత్యత్వకల్పనాత్
స్వప్నేన సూచితమిదం ఫలమిత్యేవ వేత్త్యయమ్. 9

మతియొకకారణముచే ఫలము సంప్రాప్తించినప్పటికిని, స్వప్నముయొక్క సత్యత్వ కల్పనవలన, 'స్వప్నముచే సూచింపఁబడిన యీ ఫలము నాకుఁ బ్రాప్తించినది' అని లోన సంవిత్తు స్వయముగనే యనుభవించుచున్నది.

సర్వ ఏవ నిజయా జగ త్త్రయే సంవిదాతిశయితా దృఢా అపి
కాలతో వ్యభిచర న్తి దేశతో యత్నతశ్చ చిరతోఽచిరేణ వా. 10

ముల్లోకములందును జాగ్రత్తుయొక్కయు సమ స్తఘటాది పదార్థములు, ఆ యా మనుజుల నిజసంవిత్తుచే చిరకాలమనుభవింపఁబడుటవలన దృఢీకృతస్వభావము గలదైనప్పటికిని, దేశ, కాల, యత్నాదులవలన శీఘ్రముగనో, లేక, విలంబముగనో అన్యథాభావమును బొందుచున్నవి.

సర్గాదావేవ చిద్వ్యోమ భానమప్రతిఘం జగత్
వస్తుసత్తాం చిదేవాతో యథేష్టం తనుతే తనుః. 11

కాని చైతన్యముమాత్రము అన్యథాభావమును బొందదు. సత్యసంకల్పయు క్తమగుటచే, నాశరహితమగు ఆ చిదాకాశసంవిత్తు సృష్ట్యాదియందుఁ దనయిచ్ఛ ననుసరించి, అసత్యమైనదియు నాశయుక్తమైనదియునగు జగద్వేషమును ధరించుచున్నది

చిన్మాత్రం వర్జయిత్వైకం బ్రహ్మన్యత్సర్వదాఖిలమ్
విద్ధి సత్యమసత్యం చ నియతానియతం స్థితమ్. 12

ఓ వ్యాధుఁడా! కావున. కేవలమొక చిన్మాత్ర బ్రహ్మముతప్ప. తక్కిన సమ స్తజగత్తున్ను (సంవిత్తుయొక్క దృఢత్వ. అదృఢత్వముల ననుసరించి) సత్యముగను, అసత్యముగను, నియతముగను అనియతముగను సదా స్థితినొందియున్నదని యెఱుఁగుము.

యస్మాద్బ్రహ్మైవ సర్వాత్మ సదేకమేవ నేతరత్
తస్మాత్కిం నామ తత్సత్యం కిమసత్యం చ వా భవేత్. 13

ఎపుడు సద్రూపమై, ఏకమైనట్టి బ్రహ్మమే యీ సమ స్తమున్ను నైయున్నదో, మఱియొకటి కాదో. అపుడిఁక నద్దానికి భిన్నముగ సత్యముగాని, అసత్యముగాని యేది యుండఁగలదు.

అతః స్వప్నః క్వచిత్సత్యః క్వచిచ్చాసత్య ఏవ వా
అప్రబుద్ధానాం ప్రబుద్ధానాం నాసద్రూపో న సన్మయః. 14

అట్లే స్వప్నమున్ను అజ్ఞానులయొక్క దృష్టియం దొకచోట (సంవిత్తుయొక్క దృఢత్వముగ) సత్యముగను, మఱియొకచోట (సంవిత్తుయొక్క అదృఢత్వముగ అసత్యముగను నున్నది. జ్ఞానులయొక్క దృష్టియందలి సద్రూపముగాని, అసద్రూపముగాని గాక, అనిర్వచనీయమై యొప్పుచున్నది.

సంవిద్భ్రా న్తిరియం భాతి జగన్నామ్నీ స్వరూపిణీ
స్వయం చ భ్రా న్తిరస్మీతి వాదినీ క్వాత్ర నిశ్చితా. 15

సంవిత్తుయొక్క భ్రమయే ఈ యాకారవంతమగు జగత్తుగ భాసించుచున్నది. 'స్వయముగనే నేను భ్రాంతిరూపుఁడను, అని సంవిత్తు (చిత్తము) యెపుడు వచించుచున్నదో, అపుడిఁక ఈ జగత్తునందేమి యాథార్థ్యము గలదు ?

చితిరేవ చిరాయేదం చిత్తం చిమచిమాయతే
యదాత్మన్యేవ సలిలం ద్రవవత్తదిదం జగత్. 16

చైతన్యమే చిరకాలమునకు చిత్తముఁ, తనయందు, జలముయొక్క ద్రవమువలె ఆభాసయుక్తముగ చలించుట యేదిగలదో, అదియే (అట్టి స్పందమే) యీ జగత్తైయున్నది.

యథా స్వప్నం సమాలోక్య సుషుప్తమనుభూయతే
తథా జాగ్రత్వమాలోక్య నిద్రా సమనుభూయతే. 17

స్వప్నము గాంచినపిదప సుషుప్తి యెట్లనుభవింపఁబడుచున్నదో, అట్లే జాగ్రత్తుగాంచిన పిదప స్వప్నమున్ను అనుభవింపఁబడుచున్నది.

అత స్త్వం జాగ్రదేవేదం స్వప్నం విద్ధి మహామతే
స్వప్నం చ విద్ధి జాగ్ర త్త్వమేకమేతదజం ద్వయమ్. 18

కాఁబట్టి, ఓ మహామతీ! ఘనీభూత, (ద్రవీభూత ఘృతములవలె) నీవు జాగ్రత్తును స్వప్నముగను, స్వప్నమును జాగ్రత్తుగను నెఱుఁగుము. ఏలయనిన, ఈ రెండును, ఏకమై, అజమైనట్టి బ్రహ్మరూపములే యైయున్నవి.

వ్యోమైవాచేత్య చిన్మాత్ర ఘానమేకమిదం తతమ్
జాగ్రత్స్వప్న సుషుప్త్యాఖ్యాః పర్యాయరచనా ఇహ. 19

విషయశూన్యమై, చిన్మాత్రమై, ఏకమైనట్టి చిదాకాశముయొక్క ప్రకాశమాత్రమేయై యీ సమస్తమున్ను వ్యాపించియున్నది. అవిద్యచే ఆవృతమగు చిన్మాత్ర మొకదానియొక్కయే (ఘృతముయొక్క ద్రవత్వాది భేదములవలె) జాగ్రత్స్వప్నసుషుప్త్యాది నామరూపభేదములన్నియు నిట పర్యాయరచనలై యున్నవి.

నేహ నామాస్తి నియతిర్న చానియతిరస్తి చ
నియత్యనియతీ బ్రూహి కీదృశే స్వప్నసంవిది. 20

ఓ వ్యాధుఁడా! వాస్తవముగ నిచట నియతిగాని, అనియతిగాని లేవు. మిథ్యాభూతమగు స్వప్నసంవిత్తునందు నియతియేమియో, అనియతియేమియో చెప్పుము?

యావద్ధ్యానం కిల స్వప్నే తావత్త్రైవ నియన్త్రణా
స ఏవ సంవిద్ధ్యానస్య కుర్యాన్నియమనం మునిః. 21

చైతన్యమే జాగ్రత్స్వప్నసుషుప్తుల రూపమున వర్తించుచున్నది. అదియే శ్రవణమనన నిదిధ్యాసనాదిరూప ప్రయత్నముచే సమాధిరూపమున వెలయుచున్నది. మఱియు అజ్ఞాననాశముచే ముక్తిరూపమగుచున్నది (ఇఁక జాగ్రత్సంవిత్తుయొక్క నిరోధముచే మనోవ్యాపారమాత్రరూపమగు స్వప్నసంవిత్తుయొక్క స్ఫురణమగును. జాగ్రత్స్వప్నముల రెంటి సంవిత్తులయొక్క నిరోధముచే సుషుప్తిరూప సంవిత్తుయొక్క స్ఫురణమగును. ఆ మూఁడింటియొక్క నియమనముచే సర్వశోక రహితమగు సమాధి స్ఫురించును. ఇట్లెఱింగి దుఃఖరహితమగు సమాధిసుఖవిశ్రాంతినిగోరు ముని యితర సమస్తవృత్తులను నియమనముచేసి, ఆత్మాకారవృత్తి (సమాధి)నే సంపాదింపవలయును.

స్వచ్ఛన్దం వాతలేఖాయాః స్ఫురన్త్యాః సంవిదస్తథా
అకారణక మేవాఙ్గ నియతిః కేవ కీదృశీ. 22

ప్రియుఁడవగు నో వ్యాధుఁడా! స్వతంత్రమగు వాయుపంక్తివలె కారణరహితముగ స్ఫురించునట్టి సంవిత్తునకు స్వప్నాది విషయాకార స్ఫురణరూపమగు నియతి స్వభావముకాదు. ఏలయనిన, సుషుప్తియందట్టి దెద్దియును గానుపించుటలేదు. కావున స్వతంత్రమై, కారణరహితమైనట్టి చిద్రూపమునకు నియతియెది యెట్లుండగలదు?

అథాకారాదియన్నామ కల్ప్యతే కారణం విదః
తదకారణకం సర్గః స్యాదనన్యన్న వై చితేః. 23

బాహ్యఘట, పటాద్యాకారములే సంవిత్తుయొక్క కారణమనిన, అట్లుకాదు ఏలయనిన, సృష్టి కారణరహితమైయున్నది. గావున, చైతన్యముకంటె వేఱుకానట్టి ఆ యాకారాదులు చైతన్యముయొక్క కారణము కాఁజాలవు.

ఏతావత్యేవ నియతిరత్ర యన్నామ యద్యథా
యావత్ప్రస్ఫురితం భానం తత్తథా న తదన్యథా. 24

చైతన్యము ఏయుపాధియం దెంతకాలము ఏ రూపముతోటి స్ఫురించునో, అంతకాలమయ్యది యచట ఆ రూపముతోటి పారమార్థికముగనో, వ్యావహారికముగనో, లేక ప్రాతిభాసికముగనో వ్యవహరింపబడుచుండును. ఇదియే నియతిగాని మఱియొకటేదియుగాదు.

కదా చిత్సత్యతా స్వప్నే కదా చిచ్చాప్యసత్యతా
అథావాన్నియతేరేవ కాకతాలీయమేవ తత్. 25

నియతియొక్క అభావముచేతనే స్వప్నమందొకపుడు సత్యత్వము, మఱియొకపుడు అసత్యత్వము వర్తించుచున్నవి. అదియంతయును కాకతాళీయ న్యాయముగనే సంభవించునదగును.

యత్స్వైనైవాత్మనా భాతి మణిమన్త్రౌషధాత్మనా
యన్నామ నియతం తత్తు జాగ్రత్యపి హి దృశ్యతే. 26

మణిమంత్రౌషధాదులచే గలుగు సత్యత్వనియతి జాగ్రత్తునందును సమానమేయైయున్నది.

జాగ్రత్స్వప్నశ్చ చిద్భానమాత్రమేవాన్యతాత్ర కా
జాగ్రతి స్వప్ననగరే వేదనాత్వదృశాత్మకమ్. 27

జాగ్రత్స్వప్నములు రెండును చిత్ప్రకాశమాత్రములేయగుటచే ఆ రెంటియందును భేదములేదు. జాగ్రత్స్వప్ననగరములయొక్క వేద్య, వేదన స్వరూపములు అనుభవమందు సమానముగనే యున్నవి.

జాగ్రన్న సంభవత్యేవ యజ్జాగ్రదితి శబ్దితమ్
స్వప్న ఏవ జగద్రూపం నిర్నిద్రస్యైవ చాత్మనః. 28

జాగ్రత్తు వాస్తవముగ లేదు. ఏది జాగ్రత్తని చెప్పఁబడినదో, అట్టి జగద్రూపము స్వప్నమే యైయున్నది. నిద్రారహితమగు ఆత్మయందా జాగ్రత్స్వప్నములు రెండునుగూడ లేవు.

స్వప్నో వా నామ నాస్త్యేవ యః స్వప్న ఇవ శబ్దితః
సుప్తాసుప్తైకరూపస్య బ్రహ్మణో బోధరూపతా. 29

స్వప్నమున్ను వాస్తవముగ లేనిదేయగును. స్వప్నమని యేది చెప్పఁబడినదో, అది సుషుప్త అసుషుప్తరూపమగు బ్రహ్మముయొక్క బోధరూపత్వమేయైయున్నది.

జాగ్రత్స్వప్నాదయో వై తేన కేచన కదాచన
దృశ్యం పశ్యతి సత్తాశు మృతిభ్రాన్తేరనన్తరమ్. 30

వాస్తవముగ జాగ్రత్స్వప్న సుషుప్తులెవ్వియు ఆత్మయందెప్పుడునులేవు. అలుప్తరూపమగు చిత్సత్తయే మరణమను భ్రాంతియనంతరము మఱియొక దృశ్యమును శీఘ్రముగ ననుభవించు చున్నది.

యథా నవరతం కాలమనన్తం సీకరోర్మయః
త ఏవాన్యవదభ్రాశావదనన్యాః స్ఫురన్త్యలమ్. 31

అనంతసముద్రముయొక్క తరంగములు, దిగ్భ్రమయందలి దిక్కులు, వేఱుగాకున్నను సదా వేఱుగనున్నట్లే తోచువిధమున, జాగ్రత్స్వప్నసుషుప్త్యాదులు, వానివిషయములు బ్రహ్మము కంటె వేఱుగాకున్నను వేఱుగనున్నట్లు స్పష్టముగ స్ఫురించుచున్నవి.

తథా నన్యే పరే సర్గాః స్ఫురన్త్యస్ఫురితా అపి
శిలాకోశాన్తలేఖావజ్జాగ్రత్స్వాపాది తత్ర కిమ్. 32

శిలాకోశమందలి రేఖవలె, సృష్టులన్నియు పరమాత్మయందు భిన్నరూపములుగ స్ఫురించుచున్నను, వాస్తవముగ అభిన్నరూపములేయైయున్నవి. అట్టిచోనిఁక ఆ పరమాత్మయందు జాగ్రత్స్వప్నాదులేమి ?

జాగ్రత్స్వప్నసుషుప్తతుర్యకవపుః సాకారతావర్జితం
సర్వాకారమపి వ్యతీతకలనం సర్గం శరీరం దధత్
వ్యాప్తం చిద్వపుషా తథాపి సుషిరం శూన్యేన దృశ్యాత్మనా
చిన్మాత్రం ఖమిదం మనాగపి నభోమాత్రాన్న భిన్నం పునః 33

ఈ ఆత్మస్వరూపము జాగ్రత్స్వప్న సుషుప్త్యవస్థారూపమున్ను తద్విరుద్ధమగు తురీయావస్థారూపమున్ను వహించినదై ఆకార రహితమైనను సర్వాకారయుక్తమై, కాలకల్పనా రహితమైనను సృష్ట్యాత్మకమగు కాలముచే పరిచ్ఛిన్నమైనట్టి శరీరమును ధరించినదై, దృశ్యరహితమైన చిచ్ఛరీరము గలిగియున్నను, దృశ్యమైన యాకాశమను ఛిద్రమును వ్యాపించియున్నదై వెలయుచున్నది. అట్లున్నను, మరల యది నిజ, శుద్ధ చిదాకాశమాత్రముకంటె నొకింతైనను భిన్నముకాకయే యున్నది.

సాకాశానిలవహ్నివారిధరణీలోకాన్తరామ్భోధరం
సర్గాదావపి కారణాననుభవాచ్చిత్త్వాత్మకం కేవలమ్
నామ్నా వర్జితమేవ బోధవపుషా సంయుక్తమేవాన్తతః
శుద్ధం వేదనమాత్రమేవ సకలం దృశ్యం న వస్త్వన్తరమ్. 34

ఇత్యార్షే శ్రీవాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే ఉత్తరార్ధే అవి॰ విప॰ శవో॰ స్వప్ననిర్ణయో నామాష్ట చత్వారింశదధిక శతతమః సర్గః ॥ 148 ॥

ఆకాశ, వాయు, అగ్ని, జల, పృథివీ, లోకాంతర, మేఘాదిసహితమగు దృశ్యజగత్తం తయు సృష్ట్యాదియందును కారణరహితమైయుండుటచే కేవలము హిరణ్యగర్భుని చిత్తరూపమే యైయున్నది. మఱియు నది చిత్తమయమగు మనోరాజ్యమందలి నామరూపములయొక్క అభావముచే నామవర్జితమైనదియు, జ్ఞానశరీర ధారియగు మనస్సాక్షితోఁ గూడినదియు, తుదకు మనోలయముచే కేవలము శుద్ధజ్ఞానమాత్రమే యగునదియు, మఱియొకవస్తువు కానిదియునై వెలయుచున్నది.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున నుత్తరార్ధమున అవి॥ విప॥ శవో॥ స్వప్ననిర్ణయమను నూటనలుబది యెనిమిదవ సర్గము ॥148॥

---

## ఏకోన పఞ్చాశదధిక శతతమః సర్గః

[ఇహ తత్స్వప్నవృత్తాన్తే గృహాగతమునేర్ముఖాత్
బహూనాం తుల్యదుఃఖాదినిమిత్తం శ్రుతమీర్యతే.

ఆ స్వప్నవృత్తాంతమున గృహమున కేతెంచిన మునియొక్క ముఖమునుండి వినినట్టి - అనేకప్రాణుల సమాన దుఃఖాదులయొక్క కారణము ఇచట వచింపఁబడుచున్నది.]

**వ్యాధ ఉవాచః—**

అనన్తరం మునే బ్రూహి తత్త్వం తాగతస్య తే
కిం వృత్తమురువృత్తాన్తశతనిర్వాణసంసృతేః. 1

వ్యాధుఁడు:— ఓ మునీంద్రా! ఆ ప్రాణియొక్క హృదయమున ప్రళయాది అనేక గొప్ప గొప్ప వృత్తాంతములతోఁగూడ శమించినట్టి సృష్టిగల తాము గృహమున కేతెంచి భార్యా పుత్రాదులతోటి వసించుచుంటిరిగదా! ఆ పిదప యట తమచే ననుభవింపబడిన జగద్వృత్తాంత మేమియో, దాని తత్త్వమునుగూర్చి వచింపవేడెద.

**మునిరువాచః—**

తతః శృణు తదా సాధో తస్మిం స్తద్ధృదయాఽజని
అపూర్వ ఏవ వృత్తాన్తః కోప్వత్తో వృత్తసస్పృహ. 2

ముని:— వృత్తాంతశ్రవణాభిలాషివియు, సాధుపురుషుఁడవునగు ఓ వ్యాధుడా! అటుపిమ్మట, ఆ ప్రాణియొక్క హృదయతేజమున అపూర్వమైనట్టి యే వృత్తాంతము సంభవించెనో, దానిఁగూర్చి వినుము.

తథా మమ చ తత్రస్థ విస్మృతాత్మచమత్కృతేః
అత్యవరతపై కాల ఋతుసంవత్సరాత్మకః. 3

కలత్ర రఞ్జితమతేర్మమ వర్షాణి షోడశ
తత్ర తాని వ్యతీతాని గృహస్థాశ్రమతోఽమతేః. 4

అపుడు, ఆత్మయొక్క చమత్కారమును మఱచి యటనున్నయా నాకు ఋతు, సంవత్సరరూపమగు కాలము క్రమముగ గడచిపోయెను. గృహస్థాశ్రమమున వసించుచు భార్య యందనురక్తమైన బుద్ధితోఁ గూడియున్నట్టి ఆత్మజ్ఞాన రహితుఁడనగు నాకపుడచట పదునాఱు వత్సరములు గడచిన వాయెను.

కదా చిచ్చా జగమాథ గృహమ్మగతపా మమ
మునిర్మాన్యో మహాబోధో బుధోఽతిథితయా తథా. 5

సోఽత్ర సంపూజితస్తుష్టః సుప్తవాన్భుక్తవాంస్తతః
ఇదమగ్ర్య మయా పృష్టో విమృశ్య జనతాక్రమమ్. 6

పిమ్మట నొకపుడు మా గృహమున కొక గొప్ప తపస్వియు, పూజనీయుఁడును, మహా బోధజ్ఞుఁడునగు ముని అతిథిగనేతెంచెను. అంత నే నతిథిసత్కారముచే నాతనిని బూజింపదానిచే నాతఁడు సంతుష్టుఁడాయెను. ఆటుపిదప భోజనముచేసి యచటనేపరుండెను. ప్రియుఁడవగు నో వ్యాధుఁడా! అనంతరము జనసమూహముయొక్క సమానసుఖ ప్రాప్తి క్రమమునుగూర్చి విచారించి నే నాతని నిట్లడిగితిని.

భగవన్భూరిబోధోఽసి జానాసి జగతో గతిః
యస్మాదదృష్టక్రోధోఽసి సుఖే గృహ్ణాసి నో రతిమ్. 7

మహాత్మా! తాము క్రోధరహితులును, విషయసుఖమందాసక్తి లేకయున్నందున మహా జ్ఞానులునై తనరుచున్నారు. మఱియు జగత్తుయొక్క స్థితిగతులను బాగుగ నెఱిఁగియున్నారు.

సుఖదుఃఖాన్యుపాయాన్తి కర్మభిః కర్మశాలినామ్
శుభాశుభైః శరత్కాలే సస్యానీవ ఫలార్థినామ్. 8

మహాశయా! ప్రయత్నశీలురైన ఫలాభిలాషులగు మనుజులకు శరత్కాలమున ధాన్యాదులు లభించునట్లు, కర్మయుక్తులగు జీవులకు శుభాశుభకర్మలచే సుఖదుఃఖములు సంప్రాప్తించుచున్నవి.

సమమేవాశుభం కర్మ కిమిమాః సకలాః ప్రజాః
కుర్వన్త్యాసాం యదా యాన్తి దోషాః సర్వాదయః సమమ్. 9

ఎచట దుర్భిక్షాదిదోషము లేకకాలముననే సర్వులకు సంప్రాప్తించుచున్నవో, అచట సర్వ జనులున్ను తత్కారణభూతమగు అశుభకర్మను సమముగనే (ఏకకాలముసందే) చేసియుండిరా యేమి?

దుర్భిక్షావగ్రహోత్పాతం సర్వాది సమమేవ కిమ్
జనజాలస్య ఫలతి సమానా కస్య దుష్క్రియా. 10

ఏచే భక్ష్య, అభక్ష్యాదులఁగూడ దినిపించు దుర్భిక్షయు, అనావృష్టియు, తదితరము లగు ఉపద్రవములున్ను ఏకకాలముననే జనసమూహమునకుఁ బ్రవర్తించుచున్నవో, అట్టి దుష్కర్మ యేది యెవనికి సమముగనున్నది? (ఏకకాలముననే సర్వులకు తదనుకూలమగు దుష్కర్మాచరణ అప్రసిద్ధము గనుక ఏకకాలమున నట్టి సమానదుఃఖమేల కలుగుచున్నది? - అని భావము.)

ఇత్యాకర్ణ్య సమాలోక్య స్మయమాన ఇవోన్మనాః
స ఉవాచ వచోవన్ద్యమమృతస్యన్దసున్దరమ్. 11

అది విని యమ్మునిసత్తముఁడాలోచించి చిఱునవ్వునవ్వుచు, అమృతప్రవాహమువలె సుందరములైనవియు, దోషరహితములైనవియునగు వాక్యముల నిట్లు పలికెను.

**అన్య మునిరువాచః—**

సాధో సాధువివిక్తాన్తఃకరణే యత్తు కారణమ్
సద్వాసద్వాస్య దృశ్యస్య కస్మాజ్జానాసి కథ్యతామ్. 12

రెండవ ముని:— ఓ సాధూ! అంతఃకరణము చిత్తుయొక్కయు, **అచిత్తుయొక్కయు** వివేకముతోఁగూడినదికాఁగా, ఈ దృశ్యముయొక్క కారణము సత్తా? అసత్తా? ఏది సరియని తలంచుచున్నావో, అది దేనివలన నెఱిఁగితివో చెప్పుము?

సంస్మరాత్మానమఖిలం క స్త్వం క్వేహ స్థితోఽసి చ
క్వాహం వా కిమిదం దృశ్యం కిం సారం కించిదేవ చ. 13

వివేకముయొక్క అభావమువలన నన్ను మౌనముగనుండియుండుటఁ జూచి అమ్ముని యిట్లనెను — నీవు నీ సమస్తపూర్వవృత్తాంతములతోఁగూడ వానిసాక్షియగు ఆత్మను స్మరింపుము. **మఱియు.** నీ వెవరవో, ఎటనున్నావో, నేనెవరనో, ఈ దృశ్యమేమియో, దీని సారమెద్దియో, **అసారమెద్దియో** కూడ యోచింపుము.

స్వప్నమాత్రమిదం భాతి కిల కస్మాన్న వేత్సి భో
అహం స్వప్ననరో య త్తే త్వం స్వప్నపురుషో మమ. 14

ఈ దృశ్యమంతయు స్వప్నమాత్రమే అయి భాసించుచున్నది. ఈ విషయమును నీవేల యెఱుఁగుటలేదు? నేను నీ స్వప్నమందలి మనుజుఁడను, నీవు నా స్వప్నమందలి మనుజుఁడవు.

అనాకారమనాఖ్యేయమనాద్యమపకల్పనమ్
ఇదం చిన్మాత్ర కాచస్య కాచకచ్యం జగత్స్థితమ్. 15

పరమార్థముగ నిరాకారమై, అనిర్వచనీయమై, ఆదిమధ్యాంతరహితమై, సర్వకల్పనా వర్జితమైనట్టి యీ జగత్తు చిన్మాత్రమను గాజుయొక్క కాంతివిశేషమే యైయున్నది

రూపసదృశమేవామ్యే చిన్మాత్రస్యాస్య కృత్రిమమ్
సర్వగస్య యదేతద్యద్యత్ర వేత్యస్తి తత్ర తత్

సర్వవ్యాపకమైనట్టి యీ చిన్మాత్రమునకు, తానెచట నెట్లు తలంచునో, అచట అరూప మేయైయుండుట, స్వాభావికలక్షణమైయున్నది.

సకారణత్వకలనాత్సర్వమస్య సకారణమ్
అకారణత్వకలనాదస్య సర్వమకారణమ్. 17

దీనిచే రచితమగు సమస్తమున్ను సకారణత్వకల్పనచే కారణసహితముగను, అకారణత్వకల్పనచే కారణరహితముగను నున్నది.

ఆసాం ప్రజానాంత్వస్మాకం విరాడాత్మా స ఆతతః
వయం హృది స్థితా యస్య స చాస్మచ్చిద్వశాదితః. 18

ఏ ప్రాణియొక్క హృదయతేజమున మనమందరమునున్నామో, అతఁడు మనయందఱికిని విరాడ్రూపుఁడై వ్యాపించియున్నాఁడు. మఱియు నాతఁడు మనయొక్క చైతన్యకల్పనావశముచేతనే విరాడ్భావమును బొందియున్నాఁడు. (స్వకల్పనచే సామాన్యవ్యష్టిరూపుఁడే యనిభావము.)

భవిష్యత్యపరోఽన్యాసాం విరాడాత్మా స ఏవ చ
కారణం సుఖదుఃఖానాం భావాభావాత్మ కర్మణామ్. 19

ఈ ప్రాణివలె మఱియొక ప్రాణియు మఱికొందఱు మనుజులకు విరాడ్రూపుఁడైయుండుట సంభవించుచున్నది. మఱియు నాతఁడే వారియొక్క సుఖదుఃఖములకును సంపద్విపత్తులకును సుకృత దుష్కృతములకును భోక్తృత్వముచే కారణమున్నగును.

విరాడ్ధాతువికారేణ విషమస్పన్దనాదినా
తదఙ్గావయవస్యాస్య జనజాలస్య వై సమమ్. 20

ఆ విరాడ్రూపునియొక్క కఫపిత్తాదిధాతువుల విషమగతిచేఁ గలుగు వికారమువలన నుత్పన్నమగు దుర్భిక్షాది సాధారణదుఃఖము, ఆ విరాడాత్మయొక్క అవయవ రూపమగు జన సమూహమునకు సమానముగనేయుండును.

దుర్భిక్షావగ్రహా భీతమాయాతి శమమేతి వా
యస్మాద్విరాజో యా సత్తా సా సర్గస్యాన్య సర్గతా. 21

దుర్భిక్ష (కఱవు) వర్షాభావము, ప్రళయము మున్నగునవిగాని, వాని శమనముగాని, ఆ విరాట్టుని సృష్టియందున్న జనసమూహమునకంతయు నొకేసారి సంభవించును. ఏలయనిన, ఆ విరాట్టుని సత్తయేదిగలదో, అదియే యాతనిసృష్టియొక్క సృష్టిరూపత్వమైయున్నది.

కాకతాలీయవత్సాధో కేషుచిద్దుష్టకర్మసు
సమం పతతి దుఃఖాది పాదపేష్వశనిర్యథా. 22

ఓ సాధూ! కాకతాళీయన్యాయముగ నొకేకాలమున పరిపక్వమైన దుష్టకర్మగల్గినట్టి ఆ ప్రాణులందు వృక్షములపై పిడుగువలె, దుఃఖాదులు సమానముగ వచ్చిపడుచున్నవి.

కర్మకల్పనయా సంవిత్స్వకర్మఫలభాగినీ
కర్మకల్పనయోన్ముక్తా న కర్మఫలభాగినీ. 23

కర్మను తాను పూర్వము కల్పించుటచేతనే, సంవిత్తు (ఉపాధియందున్న చైతన్యము) తన యా కర్మయొక్క ఫలము ననుభవించుచున్నది. అట్లు కల్పించనిచో నయ్యది కర్మ ఫల భాగి యెన్నఁటికిని గానేరదు.

యా యా యత్ర యథో దేతి కల్పనాల్పాథవాధికా
సా సా తత్ర తథైవాస్తే సహేతుకమహేతుకమ్. 24

సహేతుకముగగాని, అహేతుకముగగాని, అల్పముగగాని, అధికముగగాని యేయే కల్పన యెచటెచట నేయేరీతియుదయించునో, అచటచట నాయారీతిగనే ఆ యాకల్పన వర్తించును.

నాస్త్యేవ స్వప్నమయే కారణసహకారి కారణాదిపురే
తస్మాత్తదనాదిశివం చేతనమజరం పరం బ్రహ్మ. 25

స్వప్నపురమున కారణముగాని, సహకారికారణాదులుగాని యెవ్వియునులేవు. కావున నది యంతయు అనాదియై, శివరూపమై, అజరమైనట్టి చిద్రూపమగు పరబ్రహ్మమేయైయున్నది.

ఏష స్వప్నభ్రమో నామ భాతికశ్చిదకారణమ్
కశ్చిత్సకారణో భాతి శూన్యః సదసదాత్మకః. 26

సదసదాత్మకమై, కావుననే మిథ్యాభూతమైనట్టి యీ స్వప్నభ్రమ యొకానొకటి అకారణముగను, ఒకానొకటి సకారణముగను భాసించుచున్నది.

కాకతాలీయవద్భాన్తి స్వప్నాః సకలసంవిదః
తాభ్యస్తుల్యోపలమ్భత్వాన్నాన్యజ్జగదిదం తతమ్. 27

స్వప్నముయొక్క సకలవృత్తులును కాకతాళీయన్యాయముగ భాసించుచున్నవి. జాగ్రత్తునందును నద్దానితో సమమగు అనుభవముండుటంబట్టి యీ వ్యాప్తమగు జగత్తంతయు స్వప్నముకంటె భిన్నముకానిదేయగును.

సకారణతయా రూఢమిహ యత్తత్సకారణమ్
అకారణతయా రూఢమిహ యత్తదకారణమ్. 28

స్వప్నమందువలె నిచటను, ఏది సకారణత్వముతోటి రూఢమైయున్నదో, అది సకారణముగను. ఏది యకారణత్వముతోటి రూఢమైయున్నదో, అది అకారణముగను ప్రసిద్ధమైయున్నది.

కార్యకారణమయక్రమోదితం స్వప్న ఏష చితి భానమాత్రకమ్
జాగ్రదాఖ్య మహతః స్వభావకం తేన శాన్తమఖిలంపరంవిదుః. 29

స్వప్నమున కార్యకారణక్రమముతో నుదయించిన స్వరూపమేదిగలదో, అది చైతన్యముయొక్క ప్రకాశమాత్రమే యైయున్నది. ఇట్టి నిర్ణయము జాగ్రత్తను స్థూలప్రపంచమునకు సమానమైయేయున్నది. ఇక్కారణమున ఈ సమస్తమున్ను శాంతమైనట్టి పరబ్రహ్మమేయని బ్రహ్మజ్ఞులు నుడివిరి.

సత్యకారణకా భావాః కే తే శ్రృణు మహామతే
కారణం కిం స్వభావానాం కిమిహాకాశకారణమ్. 30

ఓ మహామతీ ! ఎపుడు సమస్తపదార్థములకును సత్యమగు బ్రహ్మమే కారణమైయున్నదో, అపుడా పదార్థములన్నియునుగూడ సత్యములే కావలసియుండునుగదా యనిన వినుము— బ్రహ్మము సత్యపదార్థములయొక్క కారణమూ లేక మిథ్యాపదార్థములయొక్కయూ, లేక, సజాతీయ

పదార్థములయొక్కయా, లేక విజాతీయ పదార్థములయొక్కయా? ఇందు మొదటి, మూడవ పక్షమునందు, బ్రహ్మమునుండి బ్రహ్మమే యుత్పన్నమగునుగాని జగత్తుకాదు ఇక రెండవ, నాల్గవపక్షములందు, బ్రహ్మమునుండి జనించునది అసత్య మెన్నటికిని కానేరదు. ఇట్లు జగత్తునకు అకారణత్వమే సిద్ధించుచున్నది అట్లు కాకున్న, ఇట, ఆకాశమునకు కారణమేమియో చెప్పుము ?

పృథ్వ్యాదేర్ఘనపిణ్డత్వసర్గాదేః కిం చ కారణమ్
కిం కారణమవిద్యాయాః కారణం కిం స్వయంభువః. 31

సర్గాదౌ కారణం కిం స్యాద్వాయూనాం తేజసాం చ కిమ్
కిమపాం వేదనామాత్రరూపాణాం గగనాత్మకమ్. 32

అట్లే, ఘనీభూతపిండయుక్తమగు ఈ పృథివ్యాది సృష్టికిని, అవిద్యకును, బ్రహ్మదేవునకును కారణమేమియో వచింపుము? సృష్ట్యాదియందు అనుభవమాత్రరూపములగు వాయు, తేజ, జలముల కేమికారణమో చెప్పుము? ఈ ప్రకారముగ కారణము సిద్ధింపనందున ఈ సమస్తమున్ను శూన్యమే (మిథ్యయే) యైయున్నది.

పిణ్డగ్రహే దేహలాభే మృతానాం కిం చ కారణమ్
ఏవమేవ ప్రవర్తన్తే సర్గాః ప్రథమతోఽఖిలాః. 33

అట్లే, మరణించినవారియొక్క మఱియొక దేహగ్రహణమున కారణమేమిగలదు? కావున ఆరంభమునుండియు సృష్టులన్నియు నిట్లు కారణరహితలుగనే ప్రవర్తించుచున్నవి.

ఏవమేవ ప్రవర్తన్తే జగత్యావలయన్తి చ
చక్రకాణీవ నభసి చిరసంప్రేక్షణా దృశా. 34

చిరకాలము ఆకాశమునఁ జూచుటచే చక్రాకారము లుత్పన్నములై, నశించునట్లు, ఈ ప్రకారముగ కారణరహితములై, కావుననే మిథ్యాభూతములైనట్టి యీ జగత్తులన్నియు భ్రాంతిచే నుత్పన్నములై, విలీనములగుచున్నవి.

ఏవమేవ ప్రవృత్తేన సర్గేణ బ్రహ్మరూపిణా
పశ్చాత్స్వస్యైవ రూపస్య సంజ్ఞాః పృథ్వ్యాదికాః కృతాః. 35

ఇట్లు నిష్కారణముగ ప్రవృత్తమైన హిరణ్యగర్భరూపమగు సృష్టి, పిమ్మట తన స్వరూపమునకే పృథివ్యాది సంజ్ఞలను గావించెను.

వాతస్పన్దవదాభాన్తి సర్గాః పూర్వం చిదమ్బరే
స్వయమేవ చ కుర్వన్తి దేహకారణకల్పనాః. 36

ప్రథమమున చిదాకాశమున సృష్టులన్నియు వాయువునందు చలనమువలె మనోరాజ్యసదృశముగ అతిసూక్ష్మములై భావించుచున్నవి. పిమ్మట, చిరకాలాభ్యాసముచే స్థూలభావమును, బొంది స్వయముగనే యవి దేహ, కర్మాదికారణములను కల్పించుచున్నవి.

యద్యథా కల్ప్యతే దత్తే తత్తథా నియతిర్వపుః
కల్పితాయాశ్చితేర్యస్మాదేవమేతన్నిజం వపుః. 37

ప్రథమమున చైతన్యమెచట నెట్లు కల్పన గావించుచున్నదో, అచట నట్లే నియతిస్వరూపమును స్వయముగ ధరించుచున్నది. ఇయ్యది స్వకల్పితపదార్థములందు స్వానుభవసిద్ధమే యైయున్నది. ఈ నిజశరీరమున్ను కల్పితమగు చైతన్యముయొక్కయే కల్పితరూపమైయున్నది.

యద్యద్భావనాత్మకం రూపం ప్రథమం చేతితం చితా
స్వతోఽహమివ చిత్యేవ తదద్యాపి తథా స్థితమ్. 38

సృష్టియెడల అభిముఖమైనట్టి హిరణ్యగర్భచైతన్యము 'నేనీనిజ చిద్రూపముననే స్వయముగ ఈ ప్రకారమగు రూపమును ధరించెదను' అని తలంచి యే యే ప్రకాశాత్మకమగు రూపమును మొట్టమొదట ధరించుచున్నదో, అది నేఁటివఱకట్లే స్థితినొందియున్నది.

పునరన్యేన యత్నేన తదుత్కృష్టేన సైవ చిత్
శక్తా తదన్యథా కర్తుం యత్నేన మహతా పునః 39

మరల యాకల్పనను ఆ చైతన్యమే అతిమహత్తరమైన యుత్కృష్టప్రయత్నము (తపశ్చర్య ఆత్మజ్ఞానము మున్నగువాని)చే మఱియొక విధముగఁ గావించుటయందు సమర్థమగుచున్నది.

కల్ప్యతే కారణం యత్ర తత్ర కారణసారతా
న కల్ప్యతే చిదా యత్ర కారణం తదకారణమ్. 40

ఎచట చైతన్యము కారణమును కల్పించుచున్నదో అచట కారణముయొక్క సఫలత్వము సంభవించుచున్నది. ఎచట కల్పింపదో, అచట కారణమున్ను అకారణమగుచున్నది.

వాత్యావర్తవదాభాతమిదం ప్రథమమాతతమ్
అసదేవ యథా భాతం తథైవాద్యాపి సంస్థితమ్. 41

ప్రథమమున వాయువుయొక్క ఆవర్తమువలె ఈ వ్యాప్తమగు సమస్తమున్ను భాసించెను. అసద్రూపమేయగు ఇది యపుడేరీతి భాసించెనో ఆ రీతిగనే నేఁటివఱకును స్థితిగల్గియున్నది.

సంభూయ కేచన శుభాశుభమాత్మ కర్మ కుర్వన్తి తస్య సదృశం ఫలమాప్నువన్తి
సంప్రాప్నువన్తి చ శిలాశనివచ్చ కేచిద్దుఃఖం త్వకారణకమేవ సహస్రసంఖ్యాః. 42

ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే ఉత్తరార్ధే అవి॥ విప॥ శవో॥ కారణ విచారో నామైకోన పఞ్చాశదధికశతతమః సర్గః ॥ 149 ॥

కొందఱు జీవులు కలిసియే శుభాశుభకర్మలఁ జేయుదురు. అట్టి వారాకర్మలయొక్క ఫలమునున్ను కలిసియే యనుభవింతురు. మఱికొందఱు వేలకొలఁది జీవులు (జీవన్ముక్తులు) కర్తృత్వాభిమాన రాహిత్యముచే అకర్తలైయున్నప్పటికిని పర్వతశిఖరమందలి శిలవజ్రపాతాది (పిడుగుమున్నగు) వానిఁగూర్చిన దుఃఖముల ననుభవించునట్లు (ప్రారబ్ధకర్మానుసారము) నిష్కారణముగనే దుఃఖముల ననుభవించుచున్నారు.

ఇది శ్రీవాసిష్ఠతాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున నుత్తరార్ధమున అవి॥ విప॥ శవో॥ కారణ విచారమను నూటనలుబది తొమ్మిదవ సర్గము ॥149॥



## పఞ్చాశ దధిక శ త త మః స ర్గః

[తద్వాక్యైః స్వాత్మబోధోఽత్ర తత్సహస్థితిరాత్మనః
ప్రాగ్దేహగమనాశక్తేః ప్రశ్నే దాహాది చోచ్యతే.

ఆ మునివాక్యములచే తానాత్మజ్ఞానము నొందుట, ఆతనితోటి తనస్థితి, పూర్వదేహమున కేగుటయందు అశక్తుఁడై యమ్మునిని ప్రశ్నింప, ఆ దేహాదుల దహనమునుగూర్చి వచింపఁబడుట మున్నగు విషయములను ముని వర్ణించుట యిచటఁ గాననగును.]

**మునిరువాచ:—**

ఏవం ప్రకారయా యుక్త్యా తేనాయం మునినా తదా
తథాహం బోధితో యేన గతో విదితవేద్యతామ్. 1

ముని:— ఓ వ్యాధుఁడా! ఈ ప్రకారములగు యుక్తులద్వారా నేనామునివర్యునిచే ప్రబోధితుఁడనుకాఁగా, అట్టి యా బోధచే నే నపుడు ఆత్మజ్ఞానమును బొందినవాఁడనైతిని.

తతోఽసౌ న మయా త్యక్తశ్చిరప్రార్థనయా తయా
అవసత్తేన తత్రాసౌ మృతస్యాపి తథైవ చ. 2

తదుపరి నే నామునిని వదలకయేయుంటిని నాయొక్క యనేక ప్రార్థనలచేతను, సేవాదులచేతను సంతుష్టుఁడై యాతఁడు పూర్వము ఆత్మజ్ఞానశూన్యుఁడనగుటచే మృతప్రాయుఁడనై యుండి యున్నప్పటికిని నాగృహమున నట్లే వసించుట కియ్యకొనెను.

యేనైతన్మునినా ప్రోక్తమిన్దూదయశుభం వచః
సోఽయం పశ్య మునిశ్రేష్ఠస్తవ పార్శ్వే వ్యవస్థితః. 3

ఓ వ్యాధుఁడా! ఏ ముని సత్తముఁడు చంద్రోదయమువంటి శీతల, శుభవచనముల నపుడు నాతోఁబల్కెనో, ఆ దయాళువగు మహాత్ముఁడిపుడు నీ సమీపముననే యున్నాఁడు చూడుము!

అనేనోక్తమనుక్తేన మమైతన్మోహఘాతినా
దృశ్యపూర్వాపరజ్ఞేన యజ్ఞేనేవాత్తమూర్తినా. 4

పూర్వాపరముల నెఱిఁగినవాఁడును, మోహవినాశకుఁడును, శరీరమును ధరించివచ్చిన నాయొక్క యజ్ఞాది సుకృతములవలె నొప్పుచున్నవాఁడునగు, యీ దయాళువైన మునీశ్వరుఁడే నాకపుడు ఉపదేశించెను; అట్టి యాతనిని గాంచుము!

**అగ్నిరువాచ:—**

తదాకర్ణ్య వచస్తస్య మునేర్వ్యాధోఽభవత్తదా
ప్రత్యక్షః స్వప్నసర్గః కిమితి ఖిన్న ఇవ స్మయాత్. 5

అగ్ని:— ఓ విపశ్చిద్రాజా! మునియొక్క యీ వాక్యములను విని వ్యాధుఁడంత "స్వప్నసృష్టియందలి యీ యుపదేశకుఁడిపుడు నాకు ప్రత్యక్షముగ ఏల యున్నాఁడు? అని తలంచి యాశ్చర్యముచే ఖిన్నుఁడాయెను.

వ్యాధ ఉవాచః—

అహోమహచ్చిత్రమిదం మునే మనసి దుఃసహమ్
కథితం మేఽద్య భవతా భవతా పాపహారిణా. 6

వ్యాధుఁడు:— సంసారతాపమును నశింపజేయునట్టి యో మునీంద్రా! తామిపుడు అత్యాశ్చర్యకరమైనదియు, మనస్సునకు అవిశ్వసనీయమైనదియునగు ఇట్టి విషయమును నాకు తెలియజేసితిరి.

యత్స్వప్న కథిత స్యేయం జాగ్రత్ప్రత్యక్షతోచ్యతే
లభ్యతేఽపి చ తన్నామ వేద చిత్రమిదం మునే. 7

స్వప్నమందలి తమ యుపదేశకుఁడు జాగ్రత్తునందు ప్రత్యక్షముగ నున్నాఁడని తాము వచించుటయు, నేనున్ను నాకని నిపుడు ప్రత్యక్షముగఁ గాంచుటయు మహాచిత్రముగా నున్నది.

కథమేష మహాన్స్వప్న పురుషః స మునీశ్వర
జాగ్రత్యపి స్థిరీ భూతో భూతో బాలమతేరివ. 8

ఓ మునీశ్వరా! బాలుని బుద్ధియందు బేతాళమువలె, స్వప్నమందలి యీ మహాపురుషుఁడు జాగ్రత్తునందును నెట్లు స్థిరముగ వెలయుచున్నాఁడు?

ఏవమాశ్చర్యమాఖ్యానముచ్యతాం మే యథాక్రమమ్
కుతః కస్య కిమేతద్వా పరమో హి స విస్మయః. 9

మునీంద్రా! ఈ ప్రకారముగ ఆశ్చర్యకరమైనట్టి యీ ఆఖ్యానమునంతయు నాకు యథాక్రమమున వచింపఁగోరెద — ఈ స్వప్నపురుషునియొక్క దర్శన మిపుడేకారణముచే నాయెను? ఇది దేనియొక్క దర్శనము? స్వప్నముయొక్కయా? జాగ్రత్తుయొక్కయా? ఇవ్విషయమున నాకు పరమాశ్చర్యము కలుగుచున్నది,

మునిరువాచః—

తతః శృణు మహాభాగ వృత్తం చిత్రం కిమిత్ర మే
కథయామి సమాసేన సహసా మాం కురు త్వరామ్. 10

ముని:— సౌభాగ్యశీలుఁడవగు నో వ్యాధుఁడా! ఈ యాశ్చర్యమయమైన వృత్తాంతమునంతయు సంక్షేపముగ వచించుచున్నాను వినుము. త్వరపడకుము

అనేనైత త్తదా తత్ర వర్ణితం బోధనాయ మే
బుధోఽహమభవం చాశు మహాతోఽస్య తయా గిరా. 11

ఓ వ్యాధుఁడా! నీ ప్రక్కనున్న యీ మునియే నాకపుడచట నుపదేశించిన యాతఁడు ఈ మహాత్ముని వాక్కుచేతనే నేను శీఘ్రముగ ఆత్మజ్ఞానినైతిని.

తత ఏతద్గిరా పూర్వః స్వస్వభావః స్మృతో మయా
అవదాతోఽవదాతేన నభసేవ తపాత్యయే. 12

హేమంతర్తువు గడచినమీదట, ఆకాశము తన నిర్మలస్వభావమును స్మరించునట్లు, నే సీతని యుపదేశవాక్యములచే నాయొక్క అనాదిసిద్ధమగు సన్మాత్రస్వభావమును స్మరించితిని.

అహో ను సోఽహమభవం మునిరిత్యుదితాశయమ్
అహమాసం హృదా స్ఫీతాత్స్నాతోఽవస్థితవిస్మయాత్. 13

'ఓహో! నేను పూర్వము శుద్ధాంతఃకరణయుక్తుఁడగు మునినైయుంటిని.' అని యిట్లు అపుడాముని స్వభావమునుగూడ నేను స్మరించితిని. మఱియు విస్మయయుక్తమగు శుద్ధహృదయముచే స్నానమొనర్చినవాని చందముననైతిని.

ఇమాం భోగాస్థయావస్థాం ప్రాప్తోఽస్మ్యజ్ఞ ఇవాధ్వగః
ధావఞ్ఛ్రమార్తిరమ్యర్థీ వ్యర్థయా మృగతృష్ణయా. 14

(అపుడాముని తనపూర్వ, ప్రస్తుతస్థితులగూర్చి యిట్లు చింతించెను) శ్రమచేఁ బీడితుఁడై పరుగిడునట్టి జలార్థియగు పథికుఁడు వ్యర్థమగు మృగతృష్ణచే అతిదీనదశనొందునట్లు, నేను సాంసారిక భోగములందు విశ్వాసము గల్గియుండుటవలన అజ్ఞానివలె నిట్టి దీనస్థితిని బొందితిని

కష్టం దృశ్యోపలమ్భేన భ్రాన్తిమాత్రాత్మనా నతా
బాలో వేతాలకేనేవ ప్రాజ్ఞోఽపి చ్ఛలితో హ్యహో. 15

అహా! ఎట్టి కష్టకరమైన విషయము! బాలుఁడు బేతాళముచే మోసగింపఁ బడినట్లు, ప్రాజ్ఞుఁడనైనను నేను భ్రమమాత్రరూపమై, అసత్తైనట్టి యీ దృశ్యముయొక్క ప్రాప్తిచే మోసగింపబడితినే!

అహో ను చిత్రమేతేన మిథ్యాజ్ఞానేన వల్గతా
నీతః సర్వార్థశూన్యేన పదవీం కామిమామహమ్. 16

అహా! ఆశ్చర్యము! సర్వప్రయోజనశూన్యమై, విజృంభించునట్టి యీ మిథ్యాభూతమగు దృశ్యముచే నేనిట్టి శోచనీయస్థితిని బొందితినే!

అథవా యః సోఽహమపి భ్రాన్తిమాత్రం న సన్మయః
తథాపి చిత్రశతతా యన్నామాసద్విడమ్బ్యతే. 17

లేక, 'అదియే నేను' అను ఈ ప్రకారమగు ప్రత్యభిజ్ఞానమునకు విషయమైనట్టి 'తత్త్వము, అహంత్వము' (అది నేనను భావములు) మున్నగునవి యేవికలవో, అవియు భ్రాంతిమాత్రములేకాని, సన్మయములుకావు. ఈ విచిత్రమంతయు దేనిదో చెప్పఁజాలము. అయినను సాక్షిచైతన్యము ఏ అసద్రూపముయొక్క విడంబనము (నటన) గావించుచున్నదో, అందనేకయాశ్చర్యములు కలిగియే యున్నవి.

నాహమస్మి న చైవేయమిదం నాయమపి భ్రమః
చిత్తం సర్వమిదం మిథ్యా సర్వం చ నదివ స్థితమ్. 18

'ఈ శరీరాదులు నేనుగాను, ఈ మాయగాని, దృశ్యముగాని లేదు' అను విచారమున్ను భ్రమయే యైయున్నది. ఆహా! విచిత్రము! ఈ సమస్తమున్ను మిథ్యయై యున్నప్పటికిని సత్తువలె స్థితి నొందియున్నది.

కిమిదానీం మయా కార్యమిహ బన్ధభిదాన్తరః
విద్యతే మేఽఙ్కురచ్ఛేద్యం తత్తావత్సంత్యజామ్యహమ్. 19

ఇపుడు నాకు కర్తవ్యమేమిగలదు? బంధమును ఛేదించివేయునట్టి జ్ఞానాభ్యాస రూపమగు వృత్తివిశేషమను అంకుర మెయ్యది నా అంతఃకరణమున గలదో, అదియు (బంధనివృత్త్యనంతరము) ఛేదింపఁదగియేయున్నందున దానిఁగూడ నేనిపుడు త్యజించుచున్నాను. (సమస్త దృశ్యవృత్తిరహితమగు కేవలజ్ఞేయైక ఆత్మస్థితియందు వర్తించుదును.)

ఆస్తామేతదవిద్యైషా వ్యర్థరూపా కిమేతయా
భ్రాన్త్యా భ్రాన్తిరసద్రూపా త్యక్తైవైషా మయాధునా. 20

ఈ జగద్భ్రాంతి అవిద్యయు, మిథ్యారూపమున్ను నగుటచే భ్రాంతిసిద్ధమగు ఇయ్యది విద్యావృత్తిచే ఛిన్నమైయేయున్నది. గావున నిపుడు మరల త్యజింపఁబడ నక్కఱలేదు. అట్లే యుండుగాక.

ఉపదేష్టా మునిరయమేషోఽత్ర భ్రాన్తిమాత్రకమ్
బ్రహ్మైవాహమివాభాతి రూపమేతద్దివాభ్రవత్. 21

ఈ ముని నా యుపదేశకుఁడు, నే నీతని శిష్యుఁడను, అనునదికూడ భ్రాంతి మాత్రమే యైయున్నది. దినమందుఁ గాంచఁబడిన మేఘముయొక్క పురుషాకారమువలె, బ్రహ్మమే నాయొక్కయు ఈ మున్యాదులయొక్కయు రూపముచే భాసించుచున్నది.

తదేవం తావదుదితజ్ఞానం వక్ష్యే మహామునిమ్
ఇతి సంచిన్త్య స మునిస్తత్ర ప్రోక్త ఇదం మయా. 22

కావున, ఎవనివలన నాకు జ్ఞానముదయించినదో, అట్టి యీ మహామునికి నా యభిప్రాయమును దెలిపెదను - అని యిట్లు చింతించి యమ్మునీంద్రునిగూర్చి నేనిట్లు పలికితిని.

మునినాయక గచ్ఛామి తచ్ఛరీరమిదం నిజమ్
ద్రష్టుం యచ్చ ప్రవృత్తోఽస్మి శరీరం తదపేక్షితుమ్. 23

ఓ మునీశ్వరా! ఆశ్రమమందున్న యీనా నిజశరీరమును ఎవనిహృదయమున స్వప్న ప్రపంచమును జూచుటకై నేను ప్రవృత్తుఁడనైతినో, ఆ ప్రాణియొక్క శరీరమునుగూడ వీక్షించుటకై బయటకు వెడలుచున్నాను.

ఇత్యాకర్ణ్య స మామాహ హసన్మునివరస్తదా
కుతస్తౌ భవతో దేహౌ తౌ సుదూరతరం గతౌ. 24

ఆ నా వాక్యములను విని యా మునివర్యుఁడపుడు నవ్వుచు నాతో నిట్లనెను. నీయొక్కయు ఆ ప్రాణియొక్కయు దేహము లిపుడెచట! ఆ రెండును దహింపఁబడుటచే భస్మీభూతములై అతిదూరమేగినవి.

గచ్ఛాత్మనైవ వా పశ్య వృత్తాన్తం వృత్తకోవిద
పశ్యతావద్యథావృత్తం దృష్టాన్తం జ్ఞాస్యసి స్వయమ్. 25

లేక, వృత్తాంతముల నెఱుఁగుటయందు చతురుఁడవగు నో భాగ్యశీలుఁడా! నీవే యటకు స్వయముగఁ బోయిచూడుము. అట్లు చూచుటచే ఆ వృత్తాంతమంతయును నీవు స్వయముగనే పూర్ణరూపముగ నెఱుఁగఁగలవు.

ఇతి సంచిన్త్య తం దేహం విదం భాసత్త్రయాఽస్మికమ్
త్యక్త్వా చిదాత్మ తత్ప్రాణాత్పవనే యోజితో మయా. 26

అది విని నేను నా పూర్వదేహమునుగూర్చి చింతించియటకేగుటకై 'నేను స్వప్నదేహుఁడను' అను విచారముతోసహా యాకల్పితమగు స్వప్నరూపముఁద్యజించి నా జీవుని (ప్రాణోపహిత చిదాత్మను) యా ప్రాణియొక్క ప్రాణముద్వారా వాయుసమూహమున నియోజించితిని.

ప్రాక్తనం దేహమాలోక్య యావదాయామ్యహం మునే
ఇహైవ తావత్స్థాతవ్యమిత్యుక్త్వాహం గతోఽనిలమ్. 27

అట్లు చేయుటకు ముందుగానే నా మునీంద్రునితో నిట్లు చెప్పితిని. ఓ మునీశ్వరా! నేను నా పూర్వశరీరమునుజూచి వచ్చునంతవరకును దామిచటనే యుండుఁడు' అని యిట్లుపలికి నే నా ప్రాణియొక్క వాయుసమూహమునఁ బ్రవేశించితిని.

అథ వాతరథారూఢో గగనం భ్రాన్తవానహమ్
పుష్పామోద ఇవానన్తం గత్వా చ త్వరయా చిరమ్. 28

పిమ్మట, వాయువను రథమెక్కి శీఘ్రముగఁబోయి అనంతాకాశమునఁ బుష్పముయొక్క సుగంధమువలె పరిభ్రమించితిని,

తతశ్చిరమపి భ్రాన్త్వా యదా గలబిలం చలన్
అహం న ప్రాప్తవాంస్తస్య కిం చిదస్యాశయస్థితః. 29
తదా ఖేదముపాయాతః పరమం పునరాగతః
ఇదమేవ జగజ్జాలమహమాలానమాత్మనః. 30
ఇహేమం లబ్ధవానగ్రే తతో మునిమనుత్తమమ్
పృష్టవానహమేకాగ్రస్తత ఏవమిదం గృహే. 31

అట్లు చిరకాలము పరిభ్రమించినను బయటకు వెడలుటకుగాను నెపుడా ప్రాణియొక్క కంఠబిలమునుగాని, మఱియేద్వారమునుగాని పొందకయేయుంటినో, అపుడావాతాశయమందున్న నేను మిగుల దుఃఖము నొందితిని. పిమ్మట, నిజాత్మయొక్క బంధనస్తంభరూపమైన యీ జగజ్జాలమునకే మఱియు స్వగృహమునకే తిరిగివచ్చిచేరి యటసమ్ముఖమున ఈ మునిశ్రేష్ఠుని బొందితిని. అటుపిమ్మట గృహమందీమునీశ్వరుని నే నేకాగ్రచిత్తుఁడనై యిట్లు ప్రశ్నించితిని.

కిమేతద్భగవన్బ్రూహి పూర్వాపరవిదాంవర
త్వం పశ్యసి యథావృత్తముత్తమజ్ఞానచక్షుషా. 32

'పూర్వాపరముల నెఱుఁగువారిలో నుత్తముఁడవగు ఓ మహాత్మా! ఇదియేమి? ఉత్తమ జ్ఞాననేత్రముచే తామీవృత్తాంతము నెట్లు గాంచుచున్నారో వచింపవేడెద?

యస్య దేహం ప్రవిష్టోఽహం స చ మద్వపురేవ చ
క్వ తావుభౌ గతౌ దేహౌ న లబ్ధౌ కేన హేతునా. 33

ఎవనియందు నేను ప్రవేశించితినో ఆ ప్రాణియొక్క దేహమున్ను నాదేహమున్ను రెండును నెటకేగినవి? వానిని నే నేల పొందకుంటిని

మయాతిచిరమాభోగి భ్రాన్తం సంసారమణ్డలమ్
స్థావరాదాత్మనః కస్మాత్ప్రాప్తం గలబిలం న తత్. 34

నేను స్థావరములనుండి మొదలుకొని యీ విశాలమగు ప్రపంచమండలమునంతయుఁ దిరిగితిని. కాని, ఆ ప్రాణియొక్క కంఠబిలమను బహిర్నిర్గమనద్వారమును ఏల పొందకుంటిని.

గత్వేతి పృష్టః స మునిః సముపాచ మహాశయః
జానాసి తత్త్వయం కస్మాదితి తామరసేక్షణ. 35

నే నిట్లడుగనంత నా మహాశయుఁడగు ముని నాతో నిట్లనియె - ఓ కమలసదృశనేత్రధారీ! నే నేయుపాయమును వచింపకనే నీవు స్వబుద్ధిచే ఆ వృత్తాంతము నెట్లెఱుఁగఁగలవు?

ఏతదాలోకయసి చేత్త్వయం యోగైకసంవిదా
తత్పశ్యస్యేవ నిఃశేషం యథా కరతలామ్బుజమ్. 36

నీ వావృత్తాంతమును జూడఁదలంచినచో, యోగముచే ఏకాగ్రమైనట్టి చిత్తముతోఁ జూడుము. అపుడు జ్ఞాననేత్రముచే దీనినంతయు సంపూర్ణముగ కరతలమందలి కమలమువలె ప్రత్యక్షముగ స్వయముగనే యెఱుఁగఁగలవు.

తథాపి యది శుశ్రూషా తవాస్తి వచసా మమ
తదిదం శృణు వక్ష్యామి యథావృత్తమఖణ్డితమ్. 37

అయినను, నా వాక్కులద్వారానే దానిని వినఁగోరుచో, యథారీతి దానినంతయు వచించెదను వినుము.

తపస్తామరసోష్ణాంశుః కల్యాణకమలాకరః
జ్ఞానాబ్జస్య హరేర్నాభిర్నాస్తి తావదయం భవాన్. 38

నీ పూర్వదేహ వృత్తాంతమునుగూర్చి వినుటకుఁ బూర్వము మొదట నీ జీవతత్త్వమును గూర్చి యొకింతవినుము. నీవు నీచే ననుభూతమగుచున్నట్టి వ్యష్టిజీవరూపముగలవాఁడవుకావు. సర్వప్రాణులయొక్క పుణ్యమను కమలములకు ఫలప్రదానముద్వారా వికసింపఁజేయుటఁబట్టి - సూర్యుడును సమస్తసుఖములకును నిలయుఁడును, జ్ఞానస్వరూపుఁడగు విష్ణుభగవానునియొక్క నాభికమలమునందాసీనుఁడగు సర్వజీవసృష్ట్యాత్మయునగు హిరణ్యగర్భుఁడవే నీవు.

స త్వం కదాచిత్తపసి స్థితః స్వప్నదిదృక్షయా
కస్యచిద్ధృదయం జన్తోః ప్రవిష్టః పుష్టసంవిదా. 39

అట్టి హిరణ్యగర్భుఁడవగు నీ వొకపుడు వ్యష్టిరూప స్వప్నమును జూడగోరి తపస్సునందు మనోరాజ్యరూపమగు ఆలోచనయం దొకానొక యాశ్రమమున తాపసుఁడవై యుంటివి. అట పరిపుష్ట మైనట్టి వ్యష్టిభావజ్ఞానమువలన, మఱియొకని శరీరమందలి స్వప్నాది కౌతుకమును వీక్షింపదలఁచి యొకానొక ప్రాణియొక్క హృదయమునఁ బ్రవేశించినవాఁడవైతివి.

యత్త్వం ప్రవిష్టో హృదయం తత్రేదం భువనత్రయమ్
దృష్టవానసి విస్తీర్ణం రోదసీ విపులోదరమ్. 40

అట్లాతని హృదయమునఁ బ్రవేశింపగనే యచట విస్తీర్ణమైనదియు, మిగుల విశాలము లగు పృథివ్యాకాశములతోఁగూడినదియునగు ఈ త్రైలోక్యమును గాంచితివి.

ఇతి త్వయి చిరం వ్యగ్రే దేహస్తస్య తథాపి చ
స సంసుప్తాకృతిర్యత్ర స్థిత స్తత్ర మహావనే. 41

ఈ ప్రకారముగ నీవా ప్రాణియొక్క హృదయమున చిరకాలము స్వప్నదర్శనమున వ్యగ్రుఁడవైయుండ, మఱియు నిద్రించినట్లున్నట్టి నీయొక్కయు, నీవు ప్రవేశించిన యా ప్రాణి యొక్కయు శరీరములపుడా మహావనమందలి యా నీయాశ్రమమందే యుండియుండ నింతలో నవ్వనమున దావాగ్ని దగుల్కొనెను.

లగ్నో ఒగ్నిర్ధూమధ్రూమాభ్ర సామ్బరామ్బరడమ్బరః
వలద్జ్వలచలాలాతచక్రసూర్యేన్దుమణ్డలః. 42
దగ్ధాభ్రభస్మసంపూర్ణధూమాభ్రాసితకమ్బలైః
ఆవీలాకాశదలపైరివ సంఛాదితామ్బరః. 43
దరీగృహవినిష్క్రాన్తసింహనిర్హ్రాదతర్జితైః
స్ఫుటైశ్చటచటాస్ఫోటైర్బధిరీకృతదిగన్తరః. 44
తాలీతమాలమాలానాం గతానామగ్నివృక్షతామ్
పాతై రుత్పాతవహ్న్యభ్రకవత్కరకరైర్ఘనః. 45
దూరదేశగతై ర్దృష్టస్థిరసౌదామనీధియా
ద్రవత్కనకనిష్యన్దకుట్టిమం వ్యోమ దర్శయన్ 46
కణైస్తారాగణం కాన్తైర్వ్యోమ్ని ద్విగుణతాం నయన్
వక్షఃస్థ బాలవనితా నయనానన్దనన్దనః. 47
జ్వాలాధమధమాశబ్దప్రధ్మాతగగనోదరః
దరీగృహవినిష్క్రాన్తత్రస్తోన్నిద్రవనేచరః. 48
అర్ధదగ్ధద్రవత్సింహమృగవ్యాధ విహంగమః
క్వథత్సరః సరిత్స్రోతోరన్ధ్రతోగ్రవనేచరః. 49
వలజ్జ్వాలాజ్జ్వలద్బాల చమరీచారు చఞ్చురః
దహ్యమానవనప్రాణి మేదోగన్ధావృతామ్బుదః. 50

ఆ దావాగ్ని ధూమమను మహామేఘములచే నాకసమున శంబరాసురుని యాడంబరము వలె నొప్పుచున్నదియు, చంచలములును, బలపూర్వకముగఁ జనునవియునగు అలాత (కొఱవి) చక్రములచే సూర్యచంద్రమండలములను నిర్మించునదియు, దగ్ధములైన మేఘములందు భస్మ సంపూరితములైనట్టి ధూమములను నల్లని కంబళ్ళచేతను, అతినీలములగు దిక్కులను ఆవరణముల చేతను, ఆకాశమును గప్పునదియు, గుహలను గృహములనుండి బయల్వెడలిన సింహముల గర్జనలచే నదలింపఁబడిన స్ఫుటములగు చటచటాశబ్దములచే దిగంతరాళములందలి జనులను బధిరులు (చెవిటివారు)గ, గావించునదియు, అగ్నిరూపత్వమును బొందిన తాళ, తమాలాది వృక్షసమూహములయొక్క పతనములచే అగ్ని, మేఘముల యుత్పాతములవలె ధ్వనించు కలకల శబ్దములచే దట్టమైనదియు, దూరదేశములందలి మనుష్యులచే స్థిరమైన విద్యుత్తను బుద్ధితో గాంచఁ బడినదియు, అకాశమున ద్రవీభూతమగు సువర్ణముచేఁ బూయఁబడిన నేలవలెఁ బ్రదర్శింపఁ జేయునదియు, మనోహరములగు అగ్నికణములచే నాకాశమున నక్షత్రసమూహమును రెండింతలుగఁ గావించుచు, ఆకాశముయొక్క వక్షఃస్థలముపైనున్న యగ్నిజ్వాలయను బాలవనిత యొక్క యగ్నికణములను క్రేగంటిచూపులచే నేత్రముల కానందమును గొల్పునదియు, జ్వాలల యొక్క ధమధమశబ్దములచే నాకాశముయొక్క యుదరమును శబ్దపూర్ణముగఁ గావించునదియు, గుహాగృహములనుండి బయల్వెడలిన భ్రాంతినొందినట్టియు, నిద్రను గోల్పోయినట్టియు వనచరములు గలదియు, సగము కాలి పరుగిడుచున్నట్టి సింహ, హరిణ, వ్యాధపక్షులు గలిగియున్నదియు, కాఁగిన జలముతోఁగూడిన తటాక, నద్యాదులందు పక్వముకాఁబడిన భయంకర వనచరములు గలదియు, నలువైపుల చుట్టియుండు అగ్నిజ్వాలలచే బాలచమరీమృగములను దహింపఁజేయుట యందు అతినిపుణమైనదియు, దహింపఁబడుచుండు వనవాసులగు ప్రాణులయొక్క క్రొవ్వునుండి బయల్వెడలిన గంధముచే మేఘముల నావరించునదియునై యొప్పుచుండెను

తేన కల్పాగ్ని కల్పేన వల్గతా వనవహ్నినా
స యుష్మదాశ్రమో దగ్ధః సర్పేణేవ ప్రసర్పతా. 51

ప్రళయాగ్ని సదృశమైనదియు, విజృంభించుచున్నదియునగు అట్టి దావాగ్నిచే నీ యాశ్రమముతోఁగూడ నీయొక్కయు, ఆ ప్రాణియొక్కయు శరీరములు, పరుగిడు సర్పముచే వలె దగ్ధములయ్యెను.

వ్యాధ ఉవాచః—

తత్ర తస్యాగ్నిదాహస్య హేతుః కః ప్రాకృతో మునే
తద్వనం తే వటువరాః సర్వం నష్టం కథం సహ. 52

వ్యాధుఁడు: — ఓ మునీంద్రా! అచట ఆ యగ్నియొక్క దహనమునకు కారణమేమి! మఱియు ఆవనమున్ను, తాము ప్రవేశించినట్టి యా బ్రహ్మచారియొక్కయు, తదితరులయొక్కయు దేహములున్ను ఆ సమస్తమున్ను నొకేపర్యాయ మెటుల నశించినవి?

మునిరువాచః—

సంకల్పకమనస్పన్దః సంకల్పాదిక్షయోదయే
యథా హేతునిరాస్పన్దోఽచిరాద్ధి త్రిజగత్తథా. 53

ముని:— ఓ వ్యాధుఁడా! సంకల్పాదుల క్షయ, ఉదయములందెట్లు సంకల్పకుఁడగు మనుజుని మనస్సుయొక్క స్పందము (చలనము) హేతువైయున్నదో, అట్లే ముల్లోకములయొక్క సంకల్పకుఁడగు బ్రహ్మదేవునియొక్క శీఘ్రముగ ప్రవృత్తమగు మనఃస్పందమే యాత్రైలోక్యము గనుక, అద్దాని క్షయ, ఉదయములందును నాతని మనఃస్పందమే హేతువైయున్నది.

హృదయే చ వనాన్తే చ క్షోభాక్షోభేషు కారణమ్
యథా స్పన్దోఽచిరాత్ప్రన్దస్తథా త్రిజగతామిహ. 54

హృదయమునఁ గలుగుక్షోభ, అక్షోభము (శాంతి) లందు మనస్సుయొక్క చలనమే కారణమై యున్నట్లు, ముల్లోకములయొక్కయు, అవ్వనాంతము యొక్కయు క్షోభ, అక్షోభము లందు బ్రహ్మదేవుని మనస్సుయొక్క శీఘ్రచలనమే కారణమైయున్నది.

ధాతుః సంకల్పనగరం జగత్తత్ప్రన్దనం త్విహ
ప్రజోదయక్షయక్షోభ వర్షావర్షాది కారణమ్. 55

బ్రహ్మదేవుని సంకల్పనగరమే యీ జగత్తు; కావున ఆతని మనఃస్పందమే ప్రజల యొక్క యుత్పత్తి, క్షయములకును, క్షోభములకును వర్ష, అవర్షాదులకును కారణమైయున్నది.

బ్రహ్మాదిమానసోఽప్యస్య సోఽప్యన్యత్ర చిదమ్బరే
ఇత్యపర్యవసానేయం శాన్తైకా చిన్నభోగతిః. 56

బ్రహ్మాదుల మనస్సే యీ జగత్తునకు కారణము. ఈ జగత్తున్ను మాయాశబలిత చిదాకాశమున అన్యత్రకల్పితమై యున్నది. మరల అదియు (మాయా శబలిత చిదాకాశమున) అన్యత్ర కల్పింప బడియున్నది. ఈ ప్రకారముగ ఈ మాయాశబలిత చిదాకాశముయొక్క కల్పనాపరంపర అనవస్థితమై యున్నది.

ఛితి నభసి చిన్నభ శ్రీః కచతీతి విరామయా విదుషామ్
మూర్ఖాణాం తు యథైషా యాదృగ్వా తన్మయీహా న సత్. 57

ఇత్యార్షే శ్రీ వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు
నిర్వాణప్రకరణే ఉత్తరార్ధే అవి॥ విప॥ శవో॥ పరమోపదేశోనామ
పఞ్చాశదధిక శతతమః సర్గః ॥ 150 ॥

వాస్తవముగ 'చిదాకాశమున చిదాకాశమే యీ జగద్రూపముగ స్ఫురించుచున్నదను' నియ్యది నిర్దుష్టమగు తత్త్వజ్ఞులయొక్క దృష్టియైయున్నది. ఇఁక, ఈ జగత్తు ఏ విధముగఁ గన్పించు చున్నదో, అదియే సత్యమగు జగద్రూపమనుట, మూర్ఖుల (అజ్ఞానుల) యొక్క దృష్టియైయున్నది. అయ్యది పరమార్థమున సత్యముకాదు. మిథ్యయేయగును.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున నుత్తరార్ధమున
అవి॥ విప॥ శవో॥ పరమోపదేశమను నూట యేబదవ సర్గము ॥ 150 ॥



## ఏకపఞ్చాశదధిక శతతమః సర్గః

[దగ్ధాశ్రమతనోర్వహ్నేః ప్రశమో భస్మనోఽనిలైః
వర్ణ్యతేఽయం నయస్తస్మాత్స్వప్నే జాగరితస్థితిః.

ఆశ్రమ, శరీరాదులను దగ్ధమొనర్చిన యా యగ్నియు, భస్మమున్ను వాయువుచే శమించుట, తద్ద్వారా 'స్వప్నమున జాగ్రత్తుయొక్క స్థితి' అను న్యాయము వచింపఁబడుట యిచటఁ గాననగును. ]

**అన్యమునిరువాచః—**

తత్ర తే నగరం తాని గృహాణి తరవశ్చ తే
క్షిప్రేణ శుష్కతృణవత్సర్వం భస్మత్వమాగతమ్. 1

రెండవముని:— అచట ఆ యగ్నిచే కేవలము ఆశ్రమాదులేకాదు, నగర, గృహ, వృక్షాదులన్నియుఁగూడ శుష్కతృణమువలె శీఘ్రముగ భస్మీభూతములై పోయెను.

తత్రైవం భస్మతాం ప్రాప్తే సుప్తే తే భవత స్తవ
తనూ తథాతి సంతాప విదారిత మహాశివే. 2

అట్లే అతివేడిమిచే నీ యాశ్రమమందలి రెండుశిలలు బ్రద్దలైపోయెను. మఱియు నిద్రించు నీయొక్కయు, ఆ ప్రాణియొక్కయు శరీరములు రెండునుగూడ దగ్ధములయ్యెను.

స శశామ శనైర్వహ్నిర్నిః శేషీకృతకాననః
పరిపీతార్ణవోఽగస్త్య ఇవాస్తం సముపాయయౌ. 3

అట్లా యరణ్యమునంతయు భస్మమొనర్చి ఆ యగ్ని యటుపిమ్మట, అగస్త్యునిచేఁ ద్రాగఁబడిన సముద్రమువలె, మెల్లగ శమించినదై తుదకు సంపూర్ణముగ రహితమయ్యెను.

తస్మిన్నస్తంగతే వహ్నౌ తద్భస్మేద్ధం సుశీతలమ్
దుధావ కణశో వాయురశేషం పుష్పరాశివత్. 4

ఆ ప్రకారముగ నయ్యగ్నియంతయు శమింప తదుపరి మొమ్మొదటఁ బ్రదీప్తమై, పిదప మిగుల శీతలమైయున్నట్టి యా భస్మమునంతయు వాయువు పుష్పరాశినివలె కొంచెము కొంచెముగ నెగురఁగొట్టసాగెను.

తతో న జ్ఞాయతే నాసీత్క్వాశ్రమః క్వ తనూ తథా
క్వ పేటకం బహూనాం తత్స్వప్నపూర్ణాగతో యథా. 5

ఇక్కారణమున, ఆ యాశ్రమముగాని, ఆ రెండు శరీరములుగాని యెచటనున్నవో తెలియుటలేదు. మఱియు మేల్కొనినవానికి స్వప్ననగర మెటనున్నది. తెలియనట్లుఁ అనేకజనుల యొక్క పేటికవంటి యా నగరమున్ను నిపుడెచటనున్నది. తెలియుటలేదు.

అభావముపయాతే తే యద్దైవం భవత స్తనూ
స్వపత స్తే భ్రమవతః సంవిదేవ విజృమ్భతే. 6

ఈ ప్రకారముగ నెపుడు మీ యిరువురి శరీరములను, అభావమును బొందినవో అపుడు నీవు స్వప్నభ్రమయందే వర్తించుచుంటివి. కావున నిపుడీ స్వప్నమయ శరీరముతో కేవలము నీయొక్క సంవిత్తే స్ఫురించుచున్నది.

తస్మాత్క్వ తద్గలబిలం విరాడాత్మా స చ క్వ తే
దగ్ధో దగ్ధస్య సౌజన్యః సౌజన్యస్యేవ దేహకః. 7

ఇట్లా శరీరములు దగ్ధములగుటఁబట్టి యిఁక ఆ ప్రాణియొక్క కంఠబిలమెచట? నీయొక్క యా విరాడ్రూపుఁడగు ప్రాణియెచట! ఏలయనిన, హృదయ తేజోయుక్తుఁడగు ఆ ప్రాణియొక్క శరీరమిపుడు దగ్ధమైపోయెను.

లబ్ధవానసి నో తస్మాద్ద్వితో ర్దేహద్వయం మునే
అనన్తే స్వప్నసంసార జాగ్రతీహావతిష్ఠసే. 8

కావుననే ఓ మునీ! నీవా దేహముల రెంటిని బొందకయుంటివి, మఱియు అనంతమైనట్టి స్వప్న ప్రపంచరూపమగు జాగ్రత్తునందిచట వర్తిల్లుచున్నావు.

తదేవం స్వప్న ఏవాయం జాగ్రద్భావముపాగతః
సర్వే వయమిహ స్వప్నపురుషాస్తవ సువ్రత. 9

సువ్రతుఁడవగు మునీ! ఈ ప్రకారముగ, ఆ స్వప్నమే యిట్లు జాగ్రద్భావమును బొందినదైయున్నది. మఱియు నిట మేమందరమును నీయొక్క స్వప్నపురుషులమై యున్నాము.

అస్మాకం త్వం స్వప్ననరస్తవ స్వప్ననరా వయమ్
అయమేవ చిదాకాశః సర్వదాత్మాత్మని స్థితః. 10

నీవు మాయొక్క స్వప్నపురుషుడవు; మేము నీయొక్క స్వప్నపురుషులము. కాని వాస్తవముగ జాగ్రత్స్వప్నాది మూడవస్థలయందును, ఈ చిదాకాశము తన అద్వయ స్వరూపముననే సదా స్థితిగల్గియున్నది.

తతః ప్రభృతి సంపన్నో భవాన్స్వప్ననరో భవన్
జాగ్రత్ప్రత్యయవాఞ్జాగ్రన్నరో గార్హస్థ్యసుస్థితః. 11

మొదట స్వప్నపురుషుఁడవైయున్నను నీవటుపిమ్మట జాగ్రత్పురుషుఁడవై గృహస్థ ధర్మమున నెలకొనియున్నావు.

ఏతత్తే కథితం సర్వం యథావృత్తమశేషతః
అనుభూతం సదృశ్యం చ ధ్యానేనైతచ్చ పశ్యసి. 12

ఇట్లా యనుభూతమైనట్టి దృశ్యరూపమగు వృత్తాంత మంతటిని యథారీతి నీకు వర్ణించి చెప్పితిని. సందేహమున్నచో నీవున్ను ధ్యానముచే నేను వచించినదంతయును స్వయముగఁ గాంచగలవు.

ఇత్యాది మధ్యరహితోఽయమనన్తరూపః సంవిద్ఘనః కచతి కాఞ్చనతాపవత్తే
తత్పాలలోలవపురాత్మని చిన్మయాత్మా సర్గాత్మభిర్వికసితైరసితైః సితైశ్చ. 18

ఇత్యార్షే శ్రీ వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు
నిర్వాణప్రకరణే ఉత్తరార్ధే అవి॥ విప॥ శవో॥ అభావదర్శనం
నామైకపఞ్చాశదధిక శతతమః సర్గః ॥ 151 ॥

ఈప్రకారముగ, ఆదిమధ్యాంతరహితమై, అనంతమై, చిద్ఘనమైనట్టి పరమాత్మయే ఆకాశమందలి సువర్ణకాంతిమయమగు ఆతపమువలెఁ బ్రకాశించు నిజ విశాల స్ఫురణశక్తిచే చంచలమైనట్టి శరీరమును ధరించి సత్కర్మలయొక్కయు, అసత్కర్మలయొక్కయు, సదసద్రూప కర్మలయొక్కయు, ఫలభూతములైన వికసితములగు సృష్టిరూపములచే స్ఫురించు చున్నది.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున నుత్తరార్ధమున
అవి॥ విప॥ శవో॥ అభావదర్శనమను నూట యేఁబది యొకటవ సర్గము ॥ 151 ॥

## ద్విపఞ్చాశదధిక శతతమః సర్గః

[ స్వప్నార్థసత్యతాశఙ్కాం నివార్యాన్యమునిర్మునేః
ఇహ వ్యాధగురుత్వస్య హేతూక్తిముపచక్రమే.

స్వప్నపదార్థములయొక్క సత్యత్వమునుగూర్చిన సంశయమును నివారించి రెండవ ముని మొదటిమునియొక్క వ్యాధ - గురుత్వమందు హేతువు వచించుట యిటఁ గాననగును. ]

మునిరువాచ:—

ఇత్యుక్త్వా స మునిస్తత్ర తూష్ణీం స్వశయనే నిశి
ఆసీద్విస్మయతశ్చాహమథాసంప్రోహ్యమానవత్. 1

మొదటిముని:— ఓ వ్యాధుఁడా ! ఇట్లు వచించి యా ముని రాత్రియంత తన శయ్యపై నూరక యుండెను. నేనున్ను ఆశ్చర్యచకితుఁడనై ప్రచండవాయువుచేఁ గొట్టుకొనిపోఁబడుచున్నవాని చందముననైతిని.

తతశ్చిరేణ కాలేన మయోక్తం తస్య సన్మనే
ఏవం స్వప్నో విభోః సర్వః సద్రూప ఇతి మే మతిః 2

పిమ్మట చాలసేపటికి నేనమ్మునీంద్రునితో నిట్లంటిని — ప్రభూ ! ఈ రీతిగ స్వప్నమంతయు యథార్థమనియే నా తలంపు.

అన్య మునిరువాచ:—

సత్యంభవతి యత్రాన్యత్తత్రేదం సదితి స్మయః
యుక్తో యత్ర త్వేతదేవ సత్తాల్పం తత్ర కా ప్రమా. 3

రెండవముని:— ఓ మునీ! జాగ్రద్వస్తువు సత్యమైనచో నపుడీ స్వప్నాదులున్ను సత్యములేయను విస్మయము నీకుఁదగును. కాని యెపుడీజాగ్రద్దృశ్యమే మిథ్యాభూతమై యున్నదో, అపుడిఁక స్వప్నముయెక్క సత్యత్వమందేమి ప్రమాణముగలదు? (అనగా జాగ్రత్తెపుడు మిథ్యయై యున్నదో అపుడు స్వప్నముయొక్క మిథ్యాత్వము స్వయముగనే సిద్ధించుచున్నదని భావము.

యథా స్వప్నస్తథైవాయమాదౌ సర్గోఽవభాసతే
పృథ్వ్యాదిరహితోఽప్యేష పృథ్వ్యాదిభిరవస్థితః. 4

స్వప్నమెట్టిదో, అట్లే యీ జాగ్రజ్జగత్తున్ను సృష్ట్యాదియందు భాసించుచున్నది. యథార్థముగ పృథివ్యాదిరహితమైనప్పటికి ఈ జగత్తు పృథివ్యాది సహితముగనే యొప్పుచున్నది.

ఇత్థమద్యతనాత్స్వప్నాత్సర్గస్వప్నోఽమలాత్మకః
శృణు పుష్కరపత్రాక్ష మునే వ్యాధ మహాగురో. 5

ఈ ప్రకారముగ దృశ్యమానమగు యీ మన వర్తమాన స్వప్నసృష్టికున్నంత సత్తయైనను జాగ్రద్రూపముచేఁ బ్రసిద్ధమగు స్వప్నమయసృష్టికి పరమార్థముగ అది నిర్మల చైతన్యమాత్రాత్మకమైనను లేకయేయున్నది. కమలపత్రములవంటి నేత్రములు గల్గినట్టియు, వ్యాధుని మహాగురువైనట్టియు ఓ మునీ! ఇవ్విషయమున నీవు కారణమును వినుము.

అద్య దృష్టపదార్థాభ్యాం స్వప్నం స్వప్నవతోఽభవత్
సర్గస్వప్నస్తు దృష్టార్థ ఏవాదౌ ఖే విరాజతే. 6

ఇపుడు జాగ్రత్తునందుఁ జూడబడిన శబ్ద, తదర్థములచే బుద్ధియందేర్పడిన స్వసంస్కారమువలన రాత్రియందు నీకు స్వప్నమున శబ్ద, అర్థముల యనుభవమగుచున్నది. దీనిచే సంస్కారాది సామగ్రివలన స్వప్నముయొక్క సత్యత్వము సంభవించుచున్నదని తేలుచున్నది. కాని, సృష్ట్యాదియందుఁ బ్రసిద్ధమైన స్వప్నరూపమగు జాగ్రజ్జగత్తు పూర్వానుభూతములగు శబ్దార్థరూపమై చిదాకాశమున విరాజిల్లుచున్నది. అట, చిర ప్రళయకాల వ్యవధిచే పూర్వానుభవ సంస్కారాదులు చాలవఱకు నశించుటబట్టి, ఇప్పటి స్వప్నముకంటెను నయ్యది తుచ్ఛమైయున్నది; స్వప్నముతో సమమైన సత్తగూడ దానికిలేదు

ఏవం సత్స్వప్న ఇత్యేవ సందిగ్ధమివ వక్షి కిమ్
స్ఫుటమప్యనుభూతం సత్స్వప్నధ్యానోద్యమః కథమ్. 7

ఈ ప్రకారముగ జాగ్రత్ప్రపంచముయొక్క అధిక మిథ్యాత్వము సంభవించుటచే, 'స్వప్నమంతయు యథార్థమని నా తలంపు' అని యిట్లు సందిగ్ధవచనముల నేలపలుకుచున్నావు? ఈ నిజగృహాదులను స్పష్టముగ ననుభవించుచున్నను నా యుపదేశాదులను బాగుగ గ్రహించినను మరల స్వప్నధ్యానమున నీకుఁ బ్రయత్నమేల జనించినది? స్వప్నదర్శియగు ఎవఁడును 'ఈ స్వప్నము మిథ్య' అని యా సమయమున ననుభవింపఁడుగదా!

ఇదమిత్థం యదా భోగి స్ఫుటం స్వప్నజగన్మునే
సదేవానుభవత్యేవ తత్ర సందిగ్ధతా కథమ్. 8

ఓ మునీ! ఇట్లే విశాలమైన స్వప్నజగత్తు స్పష్టముగ సత్యరూపముగనే యనుభవింపఁబడుచున్నది. అట్టిచో దీనియొక్క అసత్యత్వమునుగూర్చిన సందేహము నీకేల జనించినది?

అథైవం వాదినస్తస్య వాక్యమాక్షిప్తవానహమ్
పృష్టవాన్వ్యాధగురుతా కాసౌ మే కథ్యతామితి. 9

ఈప్రకారమాముని చెప్పుచుండగనే నాతని వచనముల నర్థగించి యిట్లంటిని. మహాత్మా! తాము నన్ను వ్యాధుని గురువని చెప్పితిరి. ఆ వ్యాధ - గురుత్వమేమియో వచింప వేడెద.

**అన్య మునిరువాచ:—**

శ్రూయతామిదమాఖ్యానమపరం కథయామి తే
సంక్షేపేణ మహాప్రాజ్ఞ నాస్త్యన్తో విస్తరస్య మే. 10

రెండవముని:— మహాప్రాజ్ఞుఁడవగు నో మునీ! ఈ మఱియొక చరిత్రను సంక్షేపముగ జెప్పుచున్నాను వినుము. ఏలయనిన నా విస్తారమునకంతులేదు.

అస్మ్యహం తావదాదీర్ఘతపాస్త్వమతిధార్మికః
శ్రుత్వేదం మద్వచః సత్యమిహైవ రతిమేష్యసి. 11

ఓ మునీ! నీవు వ్యాధగురువగునంతవఱకు దీర్ఘతపస్వినగు నేనున్ను నిచటనే యుందును. నీవు గొప్ప ధార్మికుఁడవు. ఈ నా వాక్యములను విని నీవీ గృహముననే నిక్కముగఁ బ్రసన్నతను బొందఁగలవు.

ఇహస్థం మామిమం త్వం చ న త్యక్ష్యసి సపర్యయా
అహం భవద్భిః సహితో నివత్స్యామీతి నిశ్చయః. 12

మఱియు, ఇటనున్న నాకు పూజాసత్కారాదులఁ గావించుచు నీవున్ను నన్ను వ్యతింపకయే యుందువు. నేను నీతో వసించెదననుట నిశ్చయము.

సాధో యాతేషు వర్షేషు తతః కతిపయేష్విహ
సర్వబన్ధు వినాశస్తే దుర్భిక్షేణ భవిష్యతి. 13

ఓ సాధూ! కొలదివత్సరములు గడచినపిదప యిట దుర్భిక్ష (కఱవు)చే నీయొక్క బంధువులందఱును నశించుదురు.

మత్తసీమాన్తసామన్తవిగ్రహేణ తథైవ చ
సర్వో గృహాత్తమప్రాణిర్గ్రామకోఽయం వినఙ్క్ష్యతి. 14

మఱియు నపుడు మదోన్మత్తులగు సరిహద్దుప్రాంతములందలి క్షుద్రభూపాలురయొక్క పరస్పర యుద్ధముచే ఈ గ్రామస్థులు బాధితులై గృహములనుండి పరుగిడిపోవుదురు.

తతో దుఃఖమహానన్తౌ చిరమాశ్వసితౌ మిథః
శాన్తౌ విదితవేద్యత్వాత్స్పృహౌ సర్వార్థనిస్పృహౌ. 15

ఇహైవైకత్ర కస్మింశ్చిత్తరుఖణ్డకజాలకే
సమాచారౌ నివత్స్యావః శూన్యే చన్ద్రరవీ యథా. 16

అత్తఁజీ మనమిరువురమును పరస్పర మొకరికొకరు ధైర్యము గొల్పుకొనుచు వేద్యవస్తు వగు ఆత్మ నెఱిఁగినవారమగుటచే శాంతులమై, సమరూపులమై, దుఃఖము నెఱుఁగనివారమై, ఏ పదార్థమందును గోర్కెలేక సమమైన యుత్తమ యాచరణగల్గి యిచటనే యొకానొక వృక్షసమూహము క్రింద, ఆకాశమునఁ జంద్రసూర్యులవలె, నివసింతుము.

ఉత్పత్స్యతే త్వరణ్యేఽస్మిన్కాలేన వనముత్తమమ్
శాలతాలలతాజాలవలితాఖిలభూతలమ్. 17

మన యిరువురి నివాసమువలన కాలక్రమమున ఈ యరణ్యమున శాల, తాళాది వృక్షముల చేతను, వివిధలతాదులచేతను సర్వత్ర పరివేష్టింపఁబడినట్టి భూతలముగల యుత్తమ వన మేర్పడును.

తాలీతమాలదలతాణ్డవమణ్డితాశం వ్యాకోశపద్మవనవన్ద్యవికాసివృక్షమ్
కూజచ్చకోరచయచారులతానికుఞ్జముద్భాసినన్దనమివాగతమన్తరిక్షాత్. 18

ఇత్యార్షే శ్రీ వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే ఉత్తరార్ధే అవి॥ విప॥ శవో॥ మునిరాత్రిసంకథావర్ణనం నామద్విపఞ్చాశదధిక శతతమః సర్గః ॥ 152 ॥

ఓ మునీ! తాళ తమాలాది వృక్షములయొక్క పత్రముల నృత్యముచే దిక్కుల నలంకరించునదియు, వికసించిన కమలవనములచే సర్వులకు వందనీయమైనదియు, వికసితపుష్పములచే శోభిల్లు వృక్షములు గల్గియుండునదియు, కూయుచుండు చకోరాది పక్షిసమూహముచేఁ బూర్ణములైనట్టి లతాకుంజములతోటి యలరారునదియునగు ఆ వనమపుడు, స్వర్గమునుండి యేతెంచిన నందనవనమువలె భాసిల్లును.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున నుత్తరార్ధమున అవి॥విప॥శవో॥ మునిరాత్రిసంకథావర్ణనమను నూటయేబదిరెండవ సర్గము॥152॥

---

## త్రిపఞ్చాశదధిక శతతమః సర్గః

[ ఇహ వ్యాధాగమాద్యుక్త్యా తద్గురుత్వ సమర్థనమ్
కాలే వివేకాద్విజ్ఞానం సర్వైకాత్మ్యం చ వర్ణ్యతే.

వ్యాధునియొక్క యాగమనాదులఁ గూర్చిన కథనముద్వారా ముని యొక్క 'వ్యాధ గురుత్వము' సమర్థింపఁబడుట, కాలక్రమమున వివేకముచే నమ్మునికి విజ్ఞానము కలుగుట, సమస్త పదార్థములయొక్క ఆత్మతోటి యేకత్వము వర్ణింపఁబడుట యిచటఁ గాననగును. ]

**అన్య మునిరువాచః—**

అవయోశ్చరతోస్తస్మిన్వనే చిరతరం తపః
మృగానుసరణశ్రాన్తో మృగవ్యాధ ఉపైష్యతి. 1

రెండవముని:— ఓ మునీ! ఆ వనమున దపమొనరించుచునుండు మనకుఁ గాల కాలము గడచినమీదట నొకపుడొక వ్యాధుఁడు మృగమును వెన్నంటుచు నలసినవాఁడై యచటి కేతెంచును.

తం త్వం స్వభావపుణ్యాభిః కథాభిర్బోధయిష్యసి
తప స్తత్రైవ విపినే స విర క్తశ్చరిష్యతి. 2

అతనికి నీవు స్వభావముగనె పవిత్రపుణ్యకథలతో బోధించెదవు అతఁడున్ను నీయా బోధలచే విరక్తుఁడై యా వనమందే తపంబాచరించును.

తత స్తపస్విచర్యాణా మాత్మజ్ఞానబుభుత్సయా
మధ్యే స స్వప్నజిజ్ఞాసుః ప్రక్ష్యతి స్వప్నసంకథామ్. 3

అటుపిమ్మట, తపశ్చర్యయొక్క యభ్యాసమువలన శమదమాది సాధనసంపత్తిని జేకూర్చు కొని, తదుపరి ఆత్మజ్ఞానముయొక్క యభిలాషచే మధ్యస్వప్న కథనుగూర్చి నిన్ను బ్రశ్నించును.

కథయిష్యసి తస్మై త్వమాత్మజ్ఞానమఖణ్డితమ్
స్వప్నాఖ్యేన ప్రసఙ్గేన జ్ఞాతో యోగ్యో భవిష్యసి. 4

అపుడు నీవు స్వప్నప్రసంగముద్వారా ఆత్మజ్ఞానమును బూర్ణరీతియాతని కుపదేశించె దవు, దానిచే నాతఁడు యోగ్యుఁడగును.

ఇత్యనేన ప్రకారేణ గురు స్తస్య భవిష్యసి
తేన తాత మయోక్తోఽసి గిరా వ్యాధగురో ఇతి. 5

ప్రియుఁడవగు నో మునీ! ఈ ప్రకారముగ నీ వాతని గురువగుదువు. అందుచేతనే నిన్ను 'వ్యాధగురువని' సంబోధించితిని.

ఇతి తే సర్వమాఖ్యాతం యథాయం సంసృతిభ్రమః
యథాహం యాదృశశ్చ త్వమిహ య త్తే భవిష్యతి. 6

ఓ మునీ! ఇవ్విధముగ, ఈ సంసారభ్రమయెట్టిదో, నే నెట్టివాఁడనో, నీ వెటువంటి వాడవో ముందు నీకేమికలుగునో, అదియంతయును నీకుఁ జెప్పితిని.

ఇతి తేనాహము క్తః సన్విస్మయాకులయా ధియా
తేన సార్ధం విమృశ్యైతత్పరం విస్మయమాగతః. 7

(మొదటిముని:—) ఓ వ్యాధుఁడా! ఇట్లా ముని వచింపనంత నేనాశ్చర్యముచే వ్యాకుల మైనట్టి బుద్ధితోటి యా మునివర్యునితో సహా యీ దృశ్యసమూహమునంతయు విచారించి మహా విస్మయమును బొందితిని.

అథ రాత్ర్యాం వ్యతీతాయాం స ప్రభాతే మహామునిః
తథా సంపూజితో యేన త త్రైవ రతిమా ప్తవాన్. 8

అనంతర మారాత్రి గడచినమీదట ప్రాతఃకాలమున మరల అట్లే నేనా మునీంద్రుని బూజించి సత్కరించితిని. దానిచే నాతఁడచ్చోటనే ప్రీతిగలవాఁడాయెను.

అనన్తరం గృహీతస్మిం స్తస్మిన్గ్రామగృహే తథా
స్థితావావాం స్థిరమతీ కృతభావౌ పరస్పరమ్. 9

తదుపరి యా వనమందలి గ్రామగృహమునఁ బరస్పరము స్నేహబద్ధులమై, స్థిరచిత్తులమై మేమిరువురమును నివసింపఁదొడఁగితిమి.

తతో వహతి కాలోఽయమృతు సంవత్సరాత్మకః
స్థితోఽహమాగతాన్భావాం స్త్యజన్గృహ్ణన్గిరిర్యథా. 10

పిమ్మట ఋతు, వత్సరాదిరూపమగు ఈ కాలము గడువసాగెను. నేనున్ను పర్వతము దావాగ్ని, వృష్ట్యాదులను త్యజించుచు, గ్రహించుచు నుండునట్లు సంప్రాప్తించిన యిష్టానిష్ట పదార్థములను గ్రహించుచు, త్యజించుచునుంటిని.

నాభివాఞ్ఛామి మరణం నాభివాఞ్ఛామి జీవితమ్
యథా స్థితోఽస్మి తిష్ఠామి తథైవ విగత జ్వరమ్. 11

మఱియు, మరణమునుగాని, జీవితమునుగాని కోరకయేనుంటిని. ఏ స్థితియందుంటినో, ఆ స్థితియందే సంతాపరహితుఁడనై వర్తించుచుంటిని.

తతో విచారితం తత్ర తన్మయా దృశ్యమణ్డలమ్
కిం కారణమిదం తు స్యాత్కిమయం వేత్తి చేతసా. 12

అటుపిమ్మట నేనట ఆ దృశ్యమండలమునుగూర్చి యిట్లు విచారింపఁదొడగితిని. ఇది యేమి? దీని కారణమేమి? ఆత్మ దీనిఁగూర్చి చిత్తముతోటి యేమెఱుఁగుచున్నది?

కోఽయం పదార్థ సంఘాతః కిం నామైతస్య కారణమ్
అన్త్యస్మిన్స్వప్న సందర్శే చిద్వ్యోమైక స్వరూపిణి. 13

ఈ పదార్థ సమూహమేమి? దీనికిఁ గారణమేమి? పరమార్థమున కేవలము చిదాకాశ స్వరూపమైనట్టి స్వప్నమయమగు ఈ దృశ్యమున నేమి గలదు?

ద్యౌః క్ష్మా వాయురాకాశం పర్వతాః సరితోదిశః
చిన్మాత్ర నభ ఏవైతే కచన్త్యాత్మ న్యవస్థితమ్. 14

అంతరిక్ష, పృథివీ, వాయు, అగ్ని, ఆకాశ, పర్వత, నదీ, దిగాదిరూపములతోటి చిన్మాత్రాకాశమే నిజచిద్ఘనస్వభావమున స్ఫురించుచున్నదగును.

చిచ్చన్ద్రికాచతుర్దిక్కమవభాసం తనోతి యత్
తదిదం జగదాభాతి చిత్రమప్రతిఘాత్మకే. 15

చైతన్యమను చంద్రిక నలుదెసల తన స్వరూపముయొక్క ప్రకాశము నెద్దానిని విస్తరింపఁజేయుచున్నదో, అట్టి చిత్ప్రకాశమే చిదాకాశమున నాశరహితమగు ఈ జగద్రూపముగ భాసించుచున్నది.

నేమేఽద్రయో న చేయం భూర్నేదం ఖం నాయమప్యహమ్
చిన్మాత్ర వ్యోమ కచనమిద మాభాతి కేవలమ్. 16

వాస్తవముగ, ఈ పర్వతములుగాని, భూమిగాని, ఆకాశముగాని, శరీరేంద్రియాది రూపుఁడనగు నేనుగానిలేము; ఇదియంతయు కేవలము చిన్మాత్రాకాశముయొక్క స్ఫురణ మాత్రమేయై ప్రకాశించుచున్నది

పదార్థజాతస్యాస్యస్యాత్కిం నామ బత కారణమ్
పిణ్డగ్రహే హేతునా తు వినా కోఽప్యర్థసంభవః. 17

ఇట్టిదియంతయు చిన్మాత్రముయొక్క స్ఫురణమాత్రమేయైనపుడిఁక ఈ పదార్థ సమూహమునకు కారణమేముండును! (ఏమియులేదని భావము) ఏలయనిన, పిండగ్రహణము, అర్థాని కారణము లేక యే పదార్థమున్ను సంభవింపదు. అట్టి పిండగ్రహణ, తత్కారణములలో చైతన్యమున లేవు.

భ్రాన్తిమాత్రమిదం చేత్స్యాద్భ్రాన్తేః కిం నామకారణమ్
ద్రష్టా మన్తా చ కో భ్రాన్తేః కారణం వా క్వ కీదృశమ్. 18

ఇదియంతయు భ్రాంతిమాత్రమే యనినచో, ఆ భ్రాంతికి కారణమేమి? ఆ భ్రాంతియొక్క ద్రష్టయు, మననముచేయుకర్తయు నెవఁడు? మఱియు దానికారణమెట్టిది? అది యెచటనున్నది?

యస్యాహమవసం సంవిన్మాత్రకం హృదయో జసి
అసౌ మయా సహ గతః శిలాశేషేణ భస్మసాత్. 19

సంవిన్మాత్రుఁడనగు నేను ఏ ప్రాణియొక్క హృదయతేజమున వసించుచున్నానో, ఆ ప్రాణియు నా దేహముతోఁగూడ భస్మీభూతుఁడాయెను.

తస్మాది దమనాద్యన్తం చిదాభామాత్రమమ్బరమ్
అకర్తృకర్మకరణం రూపం చిద్ఘనమక్రమమ్. 20

ఇక్కారణమున, ఆ ప్రాణియొక్కయు, నాయొక్కయు, దేహాదులు లేనందున, ఈ దృశ్యమండలమంతయు, కర్తృకర్మ కరణవర్జితమై, క్రమశూన్యమై, అద్యంతరహితమై, చిద్ఘనమై నట్టి చైతన్యముయొక్క స్ఫురణమాత్రమగు ఆకాశమేయైయున్నది.

ఇదం చిద్వ్యోమకచనం ఘటావటపటాదికమ్
స్ఫుటం కుత ఇవాకారి ఘటావటపటాద్యతః 21

ఈ ఘట, పట, వటాదులు చిదాకాశముయొక్క స్ఫురణరూపములేయగును. ఏలయనిన, అట్లుకానిచో (సత్తులేనిచో) నయ్యది యెచట స్పష్టాకారములు ధరించినవి కాఁగలవు ?

నాపి చిన్మాత్రకచనం చిన్మాత్రం వ్యోమ కేవలమ్
తస్య కిం కచనం కీదృక్ కథం కచతి కిం నభః. 22

మఱియు, 'చిన్మాత్రముయొక్క స్ఫురణము, అనుభేదబుద్ధియు 'రాహువుయొక్క శిరస్సు' అనుదానివలె వికల్పమాత్రమైయున్నది. కావున సర్వము కేవలచిదాకాశమేయగును. ఏలయనిన, 'చైత

న్యముయొక్క స్ఫురణము' అనుషష్ఠీసమాసప్రయోజక భేదమున్ను, తత్సంబంధమున్ను అద్వయ మగు చిదాకాశమందు అసంభవమగుటచే నిఁక ఆ చిదాకాశముయొక్క 'స్ఫురణ' మనునది యేమి? ఎట్టిదిఁ చిదాకాశమెట్లు స్ఫురించఁగలదు.

అయం ఫేనశ్చిదామ్భోధేః కిమస్య కచనం నవమ్
కచత్స్వభావ ఏవాయమనన్తశ్చిద్ఘనః స్థితః. 23

ఈ జగత్తు చిద్రూపమను సముద్రముయొక్క నురుఁగు అయియున్నది. దీనికిఁక నూతనమగు స్ఫురణ (ప్రకాశ) మేమి? ఇది అనంత చిద్ఘనమగు పరబ్రహ్మమే అయి ప్రకాశ స్వభావముగనే స్థితి నొందియున్నది.

చిన్మాత్రకచనం శుద్ధం బ్రహ్మ బృంహితచిద్ఘనమ్
ఇదం జగదివాభాతి క్వ దృశ్యం ద్రష్టృతా కుతః. 24

శుద్ధమై, మహాచిద్ఘనమై, చిన్మాత్రమైనట్టి బ్రహ్మముయొక్క స్ఫురణమే యీ జగత్తువలె భాసించుచున్నది. కావున నిఁక దృశ్యమెచట? ద్రష్టృత్వమెచట!

ఆద్యన్తవర్జితమమేయమనాదిమధ్య
మేకం విభుం విగతకారణకార్యసత్త్వమ్
సత్తామయం భువనశైలదిగన్తనానా
ఽనానాత్మకం కిమపి చేతనమేవ సర్వమ్. 25

ఇత్యార్షే శ్రీవాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే ఉత్తరార్ధే అవి॥ విప॥ శవో॥ సర్వైకాత్మ్యప్రతిపాదనం నామ త్రిపఞ్చాశదధికశతతమః సర్గః ॥ 153 ॥

దేశకాల వస్తుపరిచ్ఛేదశూన్యమై, అప్రమేయమై, ఆదిమధ్యాంత రహితమై, ఏకమై, సర్వ వ్యాపకమై, కార్యకారణవర్జితమై, సత్తామయమైనట్టి పరబ్రహ్మము నిజసత్తచేతనే భువన, పర్వత, దిగంతాదుల సత్తను నిర్వహించుచు, ఏకమైనను నట్లనేకరూపములతో స్ఫురించుచున్నది. కావున వాస్తవముగ ఈ సమస్తమున్ను వాఙ్మనస్సులకు విషయము కానట్టి చిన్మాత్రమేగాని తద్వ్యతిరిక్తముగ నేమియునుగాదు.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున నుత్తరార్ధమున అవి॥విప॥శవో॥సర్వైకాత్మ్యప్రతిపాదనమనునూటయేబదిమూఁడవసర్గము॥153॥

## చతుఃపఞ్చాశదధికశతతమః సర్గః

[ విచారజా నిజా జీవన్ముక్తస్థితిరిహోదితా
మునినాభ్యాసహీనస్య వ్యాధస్య త్వనవస్థితిః.

తత్త్వవిచారణచే నుత్పన్నమైన మునియొక్క జీవన్ముక్తస్థితి, అభ్యాసహీనుఁడగు వ్యాధునియొక్క అనవస్థితి యిచట వర్ణింపఁబడుచున్నవి. ]

మునిరువాచ:—

ఇతి నిర్ణీయ దృశ్యేఽస్మిన్స్థితోఽస్మి విగతజ్వరః
వీతరాగో నిరాశఙ్కో నిర్వాణో నిరహంకృతిః. 1
నిరాధారో నిరాధేయో నిర్మానో నిరుపాశ్రయః
స్వభావస్థః స్వయం శాన్తః సర్గాత్మా సర్వతోదితః. 2

ముని:— ఓ వ్యాధుఁడా! ఇట్లు నిర్ణయించి యీ దృశ్యమున నేను సంతాప రహితుఁడనై యున్నాను. మఱియు రాగవర్జితుఁడనై, శంకాశూన్యుఁడనై అహంకార విరహితుఁడనై, నిర్వాణ (శాంత) రూపుఁడనై, ఆధారాధేయరహితుఁడనై, అభిమానవర్జితుఁడనై, ఆశ్రయశూన్యుఁడనై, నిజ చిత్స్వభావమున నున్నవాఁడనై, స్వయముగ శాంతుఁడనై సర్వథా యుదయించిన సృష్ట్యాత్మ స్వరూపుఁడనై వెలయుచున్నాను.

యథా ప్రాప్తస్య కర్తాస్మి న కర్తాస్మి కదాచన
స్వయమేవ హి యో వ్యోమ కర్తృతా తస్య కీదృశీ. 3

యథాప్రాప్తములగు కార్యములయొక్క కర్తనైనను, వాస్తవముగ నెపుడును నేకార్యముయొక్కయు కర్తనుగాకయేయున్నాను. ఏలయనిన, ఏది స్వయముగనే నిష్క్రియమైనట్టి చిదాకాశమైయున్నదో, అద్దానికిక కర్తృత్వమెచట ?

ద్యౌః క్షమా వాయురాకాశం పర్వతాః సరితో దిశః
ఇత్యేకాత్మ నఖః సర్వం భూతజాలైక చిద్వపుః. 4

అంతరిక్ష, పృథివీ, వాయు, ఆకాశ పర్వత నదీ దిగాదులున్ను, సమస్త ప్రాణి సమూహమును, ఏకమైనట్టి ఆత్మరూపముగు చిదాకాశమేయైయున్నవి.

శామ్యామి పరినిర్వామి సుఖమాసే చ కేవలమ్
న విధిప్రతిషేధౌ మే న మే బాహ్యం న మేఽన్తరమ్. 5

నేను శాంతుఁడనై, సర్వవిధముల తృప్తుఁడనై, కేవలము నిజ సుఖస్వరూపముననే స్థితిగల్గియున్నాను. నాకు విధి నిషేధములుగాని, బాహ్యాభ్యంతరములుగాని లేవు.

ఇతి మే తిష్ఠత ఇహ యథా సంస్థానసంస్థితేః
అద్యాయం త్వమనుప్రాప్తః కాకతాలీయవత్పురః. 6

ఇట్టిస్థితియందున్న నా యెదుట నీవు నేఁడిచట కాకతాళీయన్యాయముగ సంప్రాప్తించినావు

ఇతి తే సర్వమాఖ్యాతం యథా స్వప్నో యథా వయమ్
యథా జగద్యథా చ త్వం యథా దృశ్యమిదం తథా. 7

ఓ వ్యాధుఁడా! ఈ ప్రకారముగ స్వప్నమెట్టిదో, మనమెటువంటివారమో, జగత్తెట్టిదో, నీవెటువంటివాఁడవో, ఈ దృశ్యమెట్టిదో అంతయును నీకు వచించితిని.

త్వం చ యాదృగ్దృశ్యమిదం యథా దృశ్యమిదం పురః
యథా భావా యథా బ్రహ్మ యథేమా జనతాః పురః. 8

ఏతద్బుద్ధ్వా భవాశ్చాన్తో మిథ్యా లుబ్ధక లుబ్ధక
శాన్తైవైవమియం సత్తా చిన్మాత్రవ్యోమరూపిణీ. 9

మఱియు, ఓ వ్యాధుఁడా! ద్రష్టయగు నీవున్ను, ఈ దేహేంద్రియాది ఆధ్యాత్మిక దృశ్యమున్ను, ఈ యెదుట గన్పించు ఆధిభౌతిక దృశ్యమున్ను, వానియందలి రాగ ద్వేష, గ్రహణ త్యాగాది భావములున్ను, బ్రహ్మదేవుఁడున్ను, ఈ యెదుటనున్న జనసమూహమున్ను నెట్టివో బాగుగ నెఱిఁగి, ఈ సమస్త దృశ్యమునున్ను మిథ్యగఁదెలిసికొని శాంతుఁడవైయుండుము. ఏల యనిన, ఈ ద్రష్ట్రాదులసత్త కేవలము చిన్మాత్రాకాశరూపమేయై స్వయముగ శాంతముగనే భాసించుచున్నది. గాని అశాంతముగగాదు.

స్వయమాభాతి నిర్వాణా నైవ వా భాతి కించన

ఈ చిత్సత్త శాంతరూపమేయై స్వయముగ భాసించుచున్నది. లేక, ఒకింతైనను (దృశ్య రూపముగ) భాసించుటయులేదు. (దృశ్యమేమియు భాసింపకుండుటయే ఆ శాంతియని భావము.)

లుబ్ధక ఉవాచ:—

ఏవం చేత్తదహం త్వం చ సర్వే వా విబుధాదయః.  10
సర్వ ఏవ మిథః స్వప్నపురుషాః సదసన్మయాః

వ్యాధుఁడు:— ఓ మునీంద్రా! అట్లైనచో, తమరు, నేను, సమస్తదేవ, మనుష్యాదులు, అందఱున్ను పరస్పరము సదసద్రూపులైనట్టి స్వప్నపురుషులే యగుదురుగదా!

మునిరువాచ:—

ఏవమేతదిదం సర్వమన్యోన్యం స్వప్నవత్థ్సితమ్. 11

ముని:— అవును. ఇది యంతయు పరస్పరము స్వప్నమువలెనే స్థితినొందియున్నది.

అన్యోన్యమాత్మని తథా సదసచ్చాను భూయతే
దృశ్యం యేన యథా బుద్ధం తథా తేనానుభూయతే. 12

సర్వులకు పరస్పరము ఆత్మవిషయమున సత్తున్ను అన్యపదార్థ విషయమున అసత్తున్ను అను భూతమగుచున్నది. మఱియు, ఈ దృశ్యమెవనిచే ఏ ప్రకారమెఱుఁగఁ బడుచున్నదో, ఆ ప్రకారమే యాతనిచే ననుభవింప బడుచున్నది.

నానైకం వస్త్వతోఽనేకం న సన్నాసన్న మధ్యగమ్
జాగ్రతి స్వప్ననగరమివ వేదనమాత్రకమ్. 13

ఈ జగత్తు, అనేకముకాదు, ఏకమున్నుగాదు, ఏకానేకమున్నుగాదు; ఎట్లనిన, ఒకే ఘటము కపాలము మొదలు పరమాణుపర్యంతముగల తన వివిధావయవములతో అనేకముగను, ఏకత్వ భావనచే ఏకముగను భాసించుచున్నది. అట నానారూపములను గాంచువారికి ఏకత్వము అసత్తున్ను, ఏకరూపమును గాంచువారికి అనేకత్వము అసత్తున్ను అయియున్నది. తత్త్వవేత్తల కీజగత్తు జాగ్రత్తునందును స్వప్ననగరమువలె అనుభవమాత్రమై యొప్పుచున్నది.

అదృష్టపూర్వదూరస్థదృశ్యమానపురోపమమ్
ఇతి తే సర్వమాఖ్యాతం బోధితోఽసి నిరన్తరమ్. 14

స్వయం ప్రాజ్ఞోఽసి జానాసి యథేచ్ఛసి తథా కురు

మఱియు తత్త్వజ్ఞులకీజగత్తు పూర్వము గాంచనట్టి దూరమందున్న నగరమువలె భాసించును. ఓ వ్యాధుడా! ఈ ప్రకారముగ నీకు నేను సమస్తమును వచించితిని. మఱియు నిరంతరము బోధించితిని. నీవు స్వయముగ ప్రజ్ఞావంతుడవైయు, బాగుగ నెఱుఁగగల్గియు నున్నావు. కావున నిపుఁడిక నీ యిచ్చవొప్పున యాచరింపుము.

ఏవం ప్రబోధితస్యాపి తవ వ్యాధమతే మతిః 15
క్షణం ప్రబోధవిశ్రాన్తా న విశ్రాన్తా పరే పదే

ఓ వ్యాధుడా! ఈప్రకారముగ నేను బోధించినప్పటికిని నీయొక్కబుద్ధి స్వాభిమతమగు జగత్సత్యత్వ భ్రమయందే విశ్రాంతినొందియున్నదిగాని, పరమపదమగు ఆత్మయందు క్షణకాలమైనను విశ్రాంతినొందకయే యున్నది.

నాభ్యాసేన వినా బోధ ఏష యాతి మనోహృది. 16
పరాం పరిణతిం ప్రాజ్ఞ దారుణీవామ్బుధారణే

ఏలయనిన, ఓ ప్రాజ్ఞుడా! జలధారణమను కార్యమున కొయ్యయందు కమండలువు. మున్నగు ఆకారములయొక్క రూపమైన ఛేదన భేదనాదులచేఁ గావింపబడిన పరిణామము లేనిచో, నీరు ప్రవేశించనట్లు, ఈప్రకారమగు ఆత్మబోధ. అభ్యాసముచేనగు గొప్ప పరిణామము లేనిచో మనస్సునందుఁ బ్రవేశింపదు.

అభ్యాసాద్బోధవిశ్రాన్తౌ గురుశాస్త్రైకసేవనాత్
ద్వైతాద్వైతదృశోః శాన్త్యా నిర్వాణం చిత్తముచ్యతే. 17

కేవలము గురు, శాస్త్రాదులయొక్క సేవనమువలనను అభ్యాసముయొక్క దార్ఢ్యము వలనను బోధ చిత్తమందు స్థిరపడ ద్వైత, అద్వైతదృష్టులు శమింప, అట్టి చిత్తమే నిర్వాణ (మోక్ష) మని అనుభవజ్ఞులచేఁ జెప్పఁబడుచున్నది.

నిర్మానమోహా జితసఙ్గదోషా అధ్యాత్మనిత్యా వినివృత్తకామాః
ద్వన్ద్వైర్విముక్తాః సుఖదుఃఖసంజ్ఞైర్గచ్ఛన్త్యమూఢాః పదమవ్యయం తత్. 18

ఇత్యార్షే శ్రీ వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే ఉత్తరార్ధే అవిః విపః శవోః యథాభూతార్థవర్ణనం నామ చతుఃపఞ్చాశదధిక శతతమః సర్గః ॥ 154 ॥

అభిమాన, మోహ (అవివేక) రహితులును, విషయసంపర్క దోషములను జయించినవారును, నిరంతరము ఆత్మయందు స్థితిగలవారును, (పూర్ణానందాత్మలాభముచే) విడువఁబడిన సమస్త కోరికలు గలవారును, సుఖదుఃఖాది ద్వంద్వరహితులునునగు తత్త్వజ్ఞులు, అట్టి నిర్వాణమను ఉత్తమపదము ననుభవించుచున్నారు.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున నుత్తరార్ధమున అవిః విపః శవోః యథాభూతార్థవర్ణనమను నూటయేఁబది నాల్గవ సర్గము ॥ 154 ॥



## పఞ్చపఞ్చాశదధిక శతతమః సర్గః

[ వ్యాధస్య మూఢతపసా చిరక్లేశాద్విధేర్వరాత్
నభోఽగతిః కాయవృద్ధిర్మృతిశ్చ మునినోచ్యతే.

వ్యాధునకు మూఢతపస్సుచే, చిరకాలక్లేశమువలన బ్రహ్మదేవుని వరముద్వారా సంభవించిన యాకాశగమనమున్ను, ఆతని శరీరవృద్ధియు మరణమున్నుగూడ నిచటమునిచేఁజెప్పఁబడుచున్నవి.]

**అగ్నిరువాచ:—**

ఇత్యాకర్ణ్యాథ స వ్యాధ స్తదా తస్మిన్వనాన్తరే
ఆసీచ్చిత్రకృతాకార ఇవ విస్మయమన్థరః. 1

అగ్ని: — ఓ విపశ్చిద్రాజా ? అట్లా మునివాక్యములను విని యావ్యాధుఁడపుడా వన మధ్యమున నాశ్చర్యముచే జడభూతుఁడై ప్రతిమవలె నిశ్చలముగ నుండెను.

న విశశ్రామ చేతోఽస్య స్వాభ్యాసేన వినా పదే
ఆసీదుద్భ్రాన్త ఇవ స ప్రోహ్యమాన ఇవార్ణవే. 2

అభ్యాసము లేనందున ఆతని చిత్తము ఆత్మపదమున విశ్రాంతిని బొందకుండెను. మఱియు సముద్రమందుఁ గొట్టుకొనిపోఁబడు దానివలె మహాచంచలమై యుండెను.

ఆరూఢ ఇవ వా చక్రే చక్రేణ తపసా హృతః
నక్రేణేవ సమాక్రాన్తః పరాక్రమవివర్జితః. 3

చక్రముపై ఆరూఢుఁడైనవానివలెను, ఒకానొకసిద్ధుడు తపోబలముచే జనించిన చక్రాకార వాయువుచే నపహరింపఁబడిన వానిచందమునను, జలాశయమున మొసలిచేఁ బట్టుకొనఁబడినవాని వలెను నాతఁడపుడు పరాక్రమరహితుఁడయ్యెను.

కిమేతత్స్యాదుతాన్యత్స్యాన్నిర్వాణమితి సంశయాత్
నాధ్యగచ్ఛదసౌ శాన్తిం మూర్ఖో యౌవనవానివ. 4

'ఈ ముని చెప్పినదే నిర్వాణమా ? లేక మఱియొకటియా ?' అను సంశయముచే ఆ మూర్ఖుఁడు యువకునివలె, శాంతిని బొందకయేయుండెను.

అవిద్యాకృతమేవేదం దృశ్యమిత్యేవ చిన్తయన్
అవిద్యా జగదిత్యేషా నాయాతి నిపుణం హృది. 5

ఈ జగత్తు, అవిద్యయేయను విషయమాతని హృదయమున బాగుగఁ బ్రవేశింపని కారణ ముచే నాతఁడీజగత్తు—అవిద్యయను బ్రహ్మశక్తిచే నుత్పన్నముకాఁబడినదై సత్యమేయైయున్నదని తలంచు చుండెను.

కియదన్తమిదం దృశ్యం స్యాత్పశ్యామ్యేతదాదితః
దూరతోఽర్థప్రమాణేన తపోలబ్ధశరీరకః. 6

భావాభావాత్మనో నిత్యమస్యాన్తే స్థీయతే సుఖమ్
తస్మాదాకాశమప్యస్తి యత్ర నో తత్ర యామ్యహమ్. 7

'ఈ దృశ్యమెంతవరకు, గలదు' అను విషయమును తపస్సుచే లభించిన మహా ప్రమాణముగల దేహముతోటి ఈ పృథివినుండి మొదలుకొని యూర్ధ్వమున నతిదూరమువఱకుఁ జూచెదను. మఱియు భావ, అభావరూపమగు ఈ దృశ్యముయొక్క యంతమున నెచట ఆకాశమున్ను లేదో, అట్టి ఆ ప్రపంచప్రదేశమున నేను నిత్యము సుఖముగ నుండెదను.'

ఇతి నిర్ణీయ హృదయే మూర్ఖ ఏవ బభూవ సః
గతం కాద్పశమప్యుక్తం వినాభ్యాసేన తస్మని. 8

ఈ ప్రకారముగఁ దనహృదయమున నిర్ణయించి యాతఁడు మూర్ఖుఁడుగనేయుండి యుండెను. ఏలయనిన, దృష్టాంతసహితముగ మహత్తరమైన బోధ ముని గావించినప్పటికి, అభ్యాసములేని కారణముచే నాతనికి జ్ఞానముదయింపకుండెను. కావున నమ్మునివాక్యములన్నియు నాతనియెడ 'బూడిదలోఁబోసిన నన్నీరు'వలె వ్యర్థములైపోయెను.

తతస్తతః ప్రభృత్యేవ తేనైవ మునిభిః సహ
లుబ్ధకత్వం పరిత్యజ్య తపశ్చరితుముద్యతః. 9

అట్టి నిర్ణయముచే నాతఁడదిమొదలు తన వ్యాధత్వమును బరిత్యజించి తక్కిన మునులతోఁగూడ తపంబాచరింపదొడఁగెను.

తస్మిఞ్జగతి త్రైర్స్యావైస్తైః సమం నివసన్సదా
బహూన్యబ్దసహస్రాణి చకార సుమహత్తపః. 10

ఆ ప్రపంచమున ఆ తాపసులు యుత్తమలక్షణములతోఁ గూడినవారై సదా యామునులతోటి సమముగ వసించుచు నాతఁడనేకవేల సంవత్సరములు మహాతపంబొనర్చెను.

తపః కుర్వన్కదాచిత్స పునః పప్రచ్ఛ తం మునిమ్
కదా స్యాదాత్మవిశ్రాన్తిర్మమేత్యాహ మునిస్తతః. 11

అట్లు తపంబొనర్చుచు నాతఁడొకపు డమ్మునివర్యుని యిట్లు ప్రశ్నించెను. 'మహాత్మా! నిరుపద్రవమగు ఆత్మయందు నాకు విశ్రాంతి యెపుడు కలుగును? అంత నమ్ముని యిట్లు పలికెను.

మునిరువాచ:—

జ్ఞానం తదుపదిష్టం తే జీర్ణదార్వల్పకాగ్నివత్
సంస్థితం హృదయే కిం తు దాహ్యమాక్రమ్య నోచితమ్. 12

ముని:— ఓ వ్యాధుఁడా! నీకు నేజ్ఞానముపదేశించితినో, అది శిథిలమైన యింధనము కట్టె) నందలి అల్పమగు యగ్నివలె నీ హృదయమునందు స్థితినొందియున్నది. అది దహింప సమర్థమైయున్నను, దాహ్యమగు దృశ్యము నాక్రమింపకయేయున్నది. (జన్మాంతరమున ప్రదీప్తమై దృశ్యమును భస్మీభూత మొనర్చునని భావము)

నాభ్యాసేన వినా జ్ఞానే శివే విశ్రాన్తవానసి
అభ్యాసేన తు కాలేన భృశం విశ్రాన్తిమేష్యసి. 13

అభ్యాసము లేనందువలన శివరూపమగు ఆత్మయందు నీవు విశ్రాంతిని బొందకున్నావు. అభ్యాసముచే కాలక్రమమున నీవు పూర్ణముగ విశ్రాంతి నొందగలవు.

భవిష్యదిదమాత్మీయమథాకర్ణయ నిర్ణయమ్
మమ వర్ణయతః కర్ణభూషణం భూతలాద్భుతమ్. 14

ఇక నీవిపుడు అత్యద్భుతమైనదియు, వినుట కింపైనదియునగు నీయొక్క భవిష్యద్వృత్తాంతమును నావలన వినుము. వర్ణించిచెప్పెదను.

సంస్తుతానపబుద్ధాత్మా జ్ఞానసారతయానయా
దోలాయమానసంవిత్త్వం న మూర్ఖో న చ పణ్డితః. 15

జ్ఞానులందు ప్రసిద్ధమైనదియు, ఉత్తమ సారభూతమైనదియునగు తత్త్వజ్ఞానముద్వారా నీవు సర్వులచే స్తుతింపఁబడినట్టి ఆత్మ నెఱుగకయున్నావు. కావుననే సందిగ్ధచిత్తుడవై యొప్పుచున్నావు. నీవిపుడు కేవలము పండితుఁడవుగాకయు, కేవలము మూర్ఖుడవుగాకయునున్నావు.

అవిద్యారూపమాభోగి కిం ప్రమాణమిదం జగత్
స్యాదిత్యాత్మవికల్పేన తపస్త్వం కర్తుముద్యతః. 16

'అవిద్యారూపమైనట్టి యీ విశాల జగత్తుయొక్క పరిమాణమెంత? అను ఈ నిజమనోరథముయొక్క కల్పనామాత్రముచే నీవు తపమాచరించుట కుద్యుక్తుఁడవైతివి.

ఇత్థం తపస్త్వయా ఘోరం కార్యం యుగశతం పృథు
పరమేష్ఠీ తతస్తుష్టస్త్వాముపైష్యతి సామరః. 17

ఈప్రకారముగ నీవు వందలకొలఁది యుగములవఱకు (అనేకజన్మలు) ఘోర తపం బొనరింతువు. అపుడు దేవతాసమేతుఁడై బ్రహ్మదేవుఁడు నీవద్దకరుగుదెంచును.

మార్గయిష్యసి తస్య త్వం వరదస్య వరం వర
ఇదముద్దామదౌరాత్మ్యాన్నిజం సందేహసంచయమ్. 18

శ్రేష్ఠుఁడవగు ఓ వ్యాధుఁడా! అత్తఱి నీవావరప్రదాయకుఁడగు బ్రహ్మదేవునిగూర్చి నిజప్రచండ దుష్టస్వభావముచే స్వమనోరథకల్పితమగు వరము నిట్లు ప్రార్థించెదవు.

దేవాయం దృశ్యరూపేఽస్మిన్దృష్టేఽవిద్యాభ్రమే సతి
క్వచిదాదర్శవన్నాస్తి ప్రతిబిమ్బమలోజ్ఝితః 19

దేవా! ఈ దృశ్యము అవిద్యాభ్రమరూపమని యెఱుఁగఁబడినమీదట అద్దమువలె నున్నట్టి బ్రహ్మమందలి ప్రతిబింబరూపమలముచే త్యజింపఁబడినట్టిదియు, కావుననే నేను విక్షేపరహితముగ నుండదగినట్టిదియునగు ప్రదేశమిట నెచటనులేదు.

చిద్వ్యోమదర్పణస్యాస్య పరమాణ్వాకృతేరపి
అన్తస్థస్యైవ వా యత్ర తత్రేదం ప్రతిబిమ్బతి. 20

ఏలయనిన, పరమాణువుయొక్క యాకారమందునుగూడ వర్తించునట్టి యీ చిదాకాశమను నద్దమెచ్చోటనుండునో, అచ్చోట ఈ జగత్తున్ను ప్రతిబింబించుచున్నది.

తస్మాత్కియదనన్తం స్యాదిదం దృశ్యమనర్థకృత్
తస్య పారే కియద్వాస్యాదాకాశం దృశ్యమేవ తత్. 21

దేవా! అవిద్యాసహితమగు చైతన్యముయొక్క స్థితి యీవిధముగ నున్నందువలన అవిద్యాజనితమగు ఈ యనర్థకరమైన దృశ్యమెంత దూరమువఱకు గలదు? ఆ దృశ్యమునకావల బ్రహ్మ మెంతదూరమువఱకుఁ గలదు? ఈ ప్రకారముగ ఆకాశమువలె సూక్ష్మమైనదియు, జగద్రహిత మైనదియునగు బ్రహ్మమును నేనవశ్యము చూడదలంచుచున్నాను.

ఏవమర్థమహం జ్ఞాతుమిమం సంప్రార్థయే వరమ్
శృణు దేవేశ్వరా విఘ్నం తచ్చైవాశు ప్రయచ్ఛ మే. 22

ఓ దేవేశ్వరా! ఇవ్విషయమును ప్రత్యక్షముగ నెఱుగుటకొఱకై తమ్ముల నేనీ వరమును బ్రార్థించుచున్నాను. ఈ నా వరమును తాము నిర్విఘ్నతాపూర్వకముగ విని యద్దానిని శీఘ్రముగనే నాకొసంగవేడెద.

ఇయం స్వచ్ఛన్దమృత్యుర్మే నీరోగాస్తు తనుశ్చిరమ్
గారుడేన చ వేగేన సంయుతా వ్యోమగామినీ. 23

ప్రతినాడీకమేషా తు వృద్ధిం గచ్ఛతు యోజనమ్
క్రమేణ జగతో బాహ్యే భవత్వాకాశరూపిణీ. 24

సాకాశస్యాస్య దృశ్యస్య లభేయ పరమేశ్వర
అన్తమిత్థమనన్తస్య పరమోఽస్త్వితి మే వరః. 25

దేవా! ఈ నాశరీరము స్వేచ్ఛామరణముగలదియు, రోగరహితమైనదియు, గరుత్మంతుని వేగమువంటి వేగముతోఁగూడినదియు, ఆకాశమందు సంచరించునదియు నగుగాక! మఱియు దీనియొక్క ప్రతి అవయవమున్ను ప్రతిక్షణము యోజనమువఱకు వృద్ధిపొందుగాక! ఈ ప్రకారముగ వృద్ధినొందుచు కాలక్రమమున నిది ముల్లోకములయొక్క బాహ్యమునకేగుగాక! మఱియు ఆకాశమువలె విశాలరూపముగలది యగుగాక! ఓ పరమేశ్వరా! ఇవ్విధముగ ఆకాశసహితమగు ఈ యనంతమైన దృశ్యసమూహముయొక్క యంతమును నేను బొందుదునుగాక!' ఇదియే నాయొక్క యుత్తమ వరము. ఇద్దానిని నాకు దయచేయ వేడెద.

ఇతి సాధో త్వయా ప్రోక్తే దేవదేవో వరం ప్రభుః
ఏవమస్త్వితి వేత్యుక్త్వా యాస్యత్యన్తర్ధిమీశ్వరః. 26

ఓ సాధూ! ఎపుడు నీవిట్లడిగెదవో, అపుడు దేవదేవుడును, సర్వులకు ప్రభువును ఈశ్వరుండునగు బ్రహ్మదేవుఁడు 'అట్లేయగుగాక!' అని వచించి యంతర్ధానమగును.

గ తే త స్మిన్మహాదేవే దేవైః సహ దివస్పతా
తపసా తే కృశో దేహశ్చన్ద్రికా న్నిర్భవిష్యతి. 27

అట్లు మహాదేవుఁడును, దేవతలకు ప్రభువునగు బ్రహ్మదేవుఁడు దేవతలతోసహా వెడలఁగా అపుడు తపస్సువలన కృశించినట్టి నీదేహము చంద్రకాంతివంటి కాంతిగలదై ప్రకాశించును.

మామాపృచ్ఛన్నమస్కృత్య తస్మిన్నేవ క్షణే తతః
ప్లుతిమేష్యతి స వ్యోమ్ని చిత్తస్థార్థదిదృక్షయా. 28

ఆ వరప్రాప్త్యనంతరము నాకు నమస్కరించి నీ దేహము ఆ క్షణముననే మనంబునందలి యభిలషితపదార్థములను గాంచుటకై నా యాశ్రమమునుండి యాకసమున కెగిరిపోవును.

ద్వితీయ ఇవ శీతాంశుర్ద్వితీయ ఇవ భాస్కరః
ద్వితీయ ఇవ వౌర్వాగ్నిశ్చన్ద్రార్కస్పర్ధయోత్థితః. 29

చంద్ర, సూర్యులతోటి స్పర్ధచే నుత్పన్నమైనదానివలె నీశరీరమపుడు రెండవ చంద్రునివలెను రెండవసూర్యునివలెను, రెండవ బడబాగ్నివలెను జెన్నొందును.

తతో గరుడవేగేన దృశ్యస్య నభవ స్తథా
అన్తం ప్రాప్తుం వహన్వేగాజ్జగతః సరితామివ. 30

జగతోన్తే తతోఽజస్రం తతో వర్ధిష్యతే వపుః
కల్పాన్తమత్తార్ణవవన్నిష్పారామ్బర పూరణమ్. 31

ద్రక్ష్యస్యథ మహావ్యోమ్ని వర్ధమానో బృహద్వపుః
సర్గాన్నిరర్గలాధార నిరన్తగగనక్రమాత్. 32

తదుపరి దృశ్య, ఆకాశములయొక్క యంతమును బొందుటకొఱకై నీశరీరము గరుడవేగముతో జనుచు నదులయొక్క యంతముపలె, ముల్లోకములయొక్క యంతమునఁ బ్రతిక్షణము వృద్ధిని బొందఁగలదు. ఆ సమయమున, ప్రతిబంధ రహితమైనట్టి సర్వాధారమగు అనంతమైన యాకాశమును నాక్రమించునదియు కల్పాంతమునాటి మదించిన సముద్రమునుబోలు నదియు, అపారమైన యాకాశమును బూరించుచు వృద్ధినొందునదియునగు గొప్పశరీరముగలవాడవై నీవు మహాకాశమున ననేక సృష్టులను వీక్షించెదవు.

పరమార్థ మహాకాశ శూన్యతావాత చక్రకాన్
స్వభావద్రవతోద్దేశాచ్చిదర్ణవ తరఙ్గకాన్. 33

పరమార్థరూపమగు మహచ్చైతన్యమను ఆకాశముయొక్క శూన్యత్వమునుండి జనించిన వాయుచక్రములవంటివియు, అజ్ఞానస్వభావముచే నావిర్భవించిన — చైతన్య సముద్ర తరంగములఁ బోలినవియునగు అనేక సృష్టులను నీవపుడు గాంచుదువు.

సంవిద్ఘనే యథా స్వప్నే పురాద్యా భాన్తి భాత్మకాః
తథా తదా తవైష్యన్తి సర్గవర్గా నిరర్గలాః. 34

స్వప్నమున చిద్ఘనమగు ఆత్మయందు చిదాకాశరూపములేయగు నగరాదులెట్లు భాసించునో అట్లే యపుడు ప్రతిబంధరహితములగు అనేక సృష్టిసమూహములు నీ దృష్టిపథమును బొందఁగలవు.

విస్ఫురన్తి మహావ్యోమ్ని పర్ణౌఘాః క్షుభితానిలైః
తథా సర్గాననన్తాంస్త్వం ద్రక్ష్యస్యక్షీణనిశ్చయః. 35

ప్రచండవాయువుచే మహాకాశమునఁ జలింపఁబడు పత్రసమూహములవలె, అనంతములైన సృష్టులను దృఢనిశ్చయయుక్తుఁడవగు నీవపుడు గాంచుదువు

సభాసత్మ్యేక్షణరుచాం యథా జాలం సదప్యసత్
జగదాత్మ తథాకాశ సంవిదాం ఖే సదప్యసత్. 36

మేడపైనుండి కిటికీలయొక్క విచిత్ర జాలము (వల)లద్వారా బయట జరుగుచుండు నృత్యసభ నవలోకించుచున్నవారును, తత్సభయందే రుచిగలవారునగు స్త్రీలకు, (దృష్టియంతయు సభయందే కేంద్రీకరింపఁబడియుండుటవలన) ఆ విచిత్రజాలము ఉన్నప్పటికిని లేనివాని చందముననే యుండునట్లు, చిదాకాశరూపులగు తత్త్వవేత్తల దృష్టియందీజగద్రూప వైచిత్ర్యము చిదాకాశమున విద్యమానమైయున్నను లేనిదేయగును.

సర్వోర్వీజనదృష్టానాం లగ్నానామిన్దుమణ్డలే
యాదృగ్జాలం జగత్తాదృక్ప్రతేఽనన్యత్వమాత్మనః. 37

భూమిపైనున్న జనులందఱిచేతను ధూళి, ధూమము (పొగ), నీహారము (మంచు) మున్నగువాని సమూహము చంద్రమండలమునందున్నట్లు గాంచఁబడినను, చంద్రమండలము నందున్న వారి దృష్టియందది యెట్లు కేవలము అసత్తైయున్నదో, అట్లే జగత్తున్ను, ఆత్మతోటి అభేదరూపమున స్థితి నొందియుండు తత్త్వవేత్తయొక్క దృష్టియందు కేవలము అసత్తైయున్నది

పునః సర్గః పునర్వ్యోమ పునః సర్గః పునర్నభః
ఇత్యేవం పశ్యతస్తేఽత్ర దీర్ఘకాలః ప్రయాస్యతి. 38

అత్తఱి నీవొకపుడు సృష్టినిగాంచుదువు, మరల యాకాశమునుగాంచుదువు; మరల సృష్టిని వీక్షించుదువు. మరల యాకాశమును జూచుదువు. ఈ ప్రకారముగ సృష్టి, ఆకాశములను మరల మరల గాంచుచునుండు నీకిచట దీర్ఘకాలము గడచిపోయెను.

అథ దీర్ఘేణ కాలేన ప్రవస్ఫురత్సర్గపర్ణకే
ఉద్వేగమేష్యసి వ్యోమ్ని మహామహిమని స్వయమ్. 39

అట్లు సృష్టిరూపపత్రములచేఁ బూర్ణమైనట్టి గొప్పమహిమగల అవ్యక్తాకాశమునఁ జిరకాలము సంచరించుచుండు నీవు, అటుపిమ్మట స్వయముగ వైరాగ్యమును బొందెదవు.

ఉద్వేగమేష్యసి తతస్తపసోఽనుభవత్ఫలమ్
నిర్ద్రేక్ష్యసి తదా దేహమనన్తామ్బరపూరకమ్ 40

తదుపరి తపస్సుయొక్క ఫలము ననుభవించుచు నీవు వైరాగ్యమును బొందినవాఁడవై, అనంతాకాశమును బూరించునట్టి నీ దేహమును జూచి యిట్లు పలికెదవు —

కిమిదం కుశరీరం మే భారభూతమివ స్థితమ్
మేర్వాదిభూభృతాం లక్షమపి యస్మిం స్తృణాయతే. 41

ఎద్దానియందు లక్షలకొలఁది మేరువుమున్నగు పర్వతములుగూడ తృణములవలె నుండునో, అట్టి యీ నా దుష్టశరీరము భారభూతమైనవానివలె నేలయున్నది?

దేహో మమాప్రమాణోఽయం వ్యాప్తం వ్యోమ మయాఖిలమ్
పూరయామి ఖమద్యాపి భావి నైవోపగమ్యతే. 42

ఈ నా శరీరము అపరిమితమైయున్నది. నేనిద్దానిచే నాకాశమునంతయు వ్యాపించి యున్నాను; ఇంకను వ్యాపించుచునేయున్నాను. భవిష్యత్తున నేమిజరుగునో తెలియకున్నది!

అవిద్యా బత ఘోరేయమనన్తా చ ప్రమీయతే
మీయతే న చ కేనాపి బ్రహ్మజ్ఞానం సమం వినా. 43

అహా! ఈ భయంకరమైనట్టి అవిద్యారూపమగు దృశ్యమనంతమైనది. సమమగు బ్రహ్మజ్ఞానములేక యిది యెవనిచేతను బూర్ణముగ ననుభూతముకాదు, పరిచ్ఛిన్నమొనర్పఁబడదు, బాధితమున్ను గానేరదు.

తమిమం సంత్యజామ్యేవ దేహమావి వృతాన్తరమ్
నానేన కించిదాప్నోమి సాధు సచ్ఛాస్త్ర సంగమమ్. 44

కావున, ఆకాశమునంతయుఁ గప్పునట్టి యీ నా విశాలదేహము నిపుడు నేను త్యజించుచున్నాను. ఏలయనిన, ఈఅపారదేహముతోటి నేను సాధుసంగము, సచ్ఛాస్త్రాభ్యాసాది మోక్షసాధనములను బడయఁజాలను.

అనన్తాపారపర్యన్తం నిరాలమ్బామ్బరాస్పదమ్
కిం నామేదం శరీరం మే సుదుష్ప్రాపార్థసంగమమ్. 45

అనంతమై, అపారప్రదేశమువఱకు వ్యాప్తమై, నిరాధారమైన యాకాశమున స్థితిగలదై, తత్త్వవేత్తల సాంగత్యమును బొందజాలనిదైనట్టి యీ నా శరీరమెందులకు?

ఇతి సంచిన్త్య తం దేహం ధారణాం ప్రాణరేచనీమ్
కృత్వా త్యక్ష్యసి సంభుక్తాత్ఫలాచ్ఛుష్కం యథా ఖగః 46

ఇట్లు చింతించి ప్రాణరేచకరూపమగు ధారణనుగావించి పక్షి దాడిమాదిఫలములందలి రసమును భుజించి నీరసమగు బీజత్వగాదిభాగమును త్యజించునట్లు, నీవాదేహము నపుడు త్యజించి నైతువు.

కృత్వా దేహపరిత్యాగం జీవః ప్రాణసమన్వితః
వ్యోమ్ని స్థాస్యతి తే తస్మిన్వాతాత్సూక్ష్మోఽపి వాతవత్. 47

అట్లు దేహమును త్యజించి వాయువుకంటెను సూక్ష్మమైనట్టి నీయొక్కజీవుఁడు ప్రాణసమేతుఁడై ఆ యాకాశమందు వాయువుచందమున నుండును.

ఛిన్నపక్షో మహామేరురివ దేహః పతిష్యతి
తత్ర భూలోక శైలాది సర్వం చూర్ణీకరిష్యతి. 48

అపుడు ఱెక్కలు ఛేదింపఁబడిన మేరుపర్వతమువలె నీ యాదేహము క్రిందఁబడిపోవును. అత్తఱి యట భూతలమందలి పర్వతాదులన్నిఁటిని నయ్యది చూర్ణమొనర్చివేయును.

శుష్కా భగవతీ దేహం తత్తదా భక్షయిష్యతి
సమాతృమణ్డలా తేన నిర్దోషా భూర్భవిష్యతి. 49

మఱియు నపుడు శుష్కశరీరియగు భగవతి మాతృమండల సమేతముగ నేతెంచి నీయా దేహమును తన గణములతోఁగూడ భక్షించును. దానిచే భూమి దోషరహితమగును.

ఇత్యాత్మోదన్తమఖిలం శ్రుతవానసి సువ్రత
తపస్తాలీవనే కృత్వా యథేచ్ఛసి తథా కురు. 50

ఓ సువ్రతుడా! ఈప్రకారముగ నీయొక్క వృత్తాంతమంతయును నేను నీకు విని పించితిని. ఇఁక నీవిపుడు తాళవనమునకేగి తపంబాచరించి తదుపరి నీకెట్లిష్టమో యట్లుచేయుము.

వ్యాధ ఉవాచః—

అహో ను భగవన్దుఃఖం పరిభోక్తవ్యమక్షయమ్
మయా వ్యర్థమనర్థాయ యదరేన దురర్థితమ్. 51
విద్యతే కిం విభో కాచిద్యుక్తిః సైషా స్థితిర్వర
అన్యథా భవితవ్యోఽర్థో యది నాస్తితదుచ్యతామ్. 52

వ్యాధుఁడు! అయ్యో! మహాత్మా! నేనింకను మహాదుఃఖ మనుభవింపవలసియున్నదే! ఏలయనిన, నేను వ్యర్థముగ అనర్థముకొఱకు పురుషార్థభ్రమచే దుఃఖమునే నిజసంకల్పముచేఁ గలుగజేసికొంటిని. శ్రేష్ఠుఁడవగు ప్రభూ! తమరు వచించిన యీ నా భావికాలస్థితి దేనిచే మఱియొకవిధముగ నగునో అట్టియుక్తి యేదేని గలదా, లేదా వచింప ప్రార్థన.

మునిరువాచః—

అవశ్యం భవితవ్యోఽర్థో న కదాచన కేనచిత్
విధాతుమన్యథా శక్యస్తన్న క్షరతి యత్నతః. 53

ముని:— అవశ్యముగ సంభవింప నున్నట్టి భవిష్యత్తెచటను, ఎవనిచేతను, ఏప్రకార ముగఁగూడ మఱియొకవిధముగఁ జేయఁబడజాలదు మఱియు, అది వర్తమానకాలపు ఏ ప్రయత్న ముచేఁగూడ నశింపనేరదు.

వామావామశిరః పాదవిపర్యయ విధౌ యథా
పుంసో న విద్యతే శక్తిస్తథా భావాన్యథా స్థితౌ. 54

తన దేహముననే యున్నవైనప్పటికిని మనుజునకు తన (దేహముయొక్క) కుడి ఎడమ భాగములనుగాని, శిరఃపాదములనుగాని మార్చుటగుందెట్లు శక్తిలేదో, అట్లే తన భవిష్యత్తునుగూడ మఱియొకవిధముగాఁ జేయుటకాతనికి శక్తిలేదు.

జ్యోతిః శాస్త్రార్థవిజ్ఞానైరిహ భావ్యర్థవేదనమ్
భవత్యన్యదపూర్వం తు న కించ న కదా చ న. 55

జ్యోతిశ్శాస్త్రముయొక్క విజ్ఞానములచే నిట భవిష్యత్తును గూర్చిన పరిజ్ఞానముమాత్రము మనుజునకుఁ గలుగునేకాని ఆ భవిష్యత్తునందు మార్పుమాత్ర మొకింతైనను నెప్పుడును గలుగనేరదు.

జయన్తి కర్మాణి హి వేదనాని యైః ప్రాకృతైరద్యతనాన్యుపేత్య
శరీరదాహైరపి నిర్వికార సంవిన్మయైర్బ్రహ్మతయైవ సుప్తమ్. 56

ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే ఉత్తరార్ధే అవి॥ విప॥ శవో॥ భావిసంపత్తివర్ణనం నామ పఞ్చపఞ్చాశదధికశతతమః సర్గః ॥ 155 ॥

కాని ఓ వ్యాధుఁడా! ఏ శ్రేష్ఠులగు మనుజులు స్వాభావికములగు సుకృత కర్మలచే వర్తమానకాలమున శమదమాది సాధనములనుబొంది బ్రహ్మజ్ఞాన ప్రదాయకములగు శ్రవణాద్యుపాయములద్వారా తత్త్వజ్ఞానమునుబడసి బ్రహ్మరూపులై జగద్దర్శన విషయమున నిదురించుదురో, మఱియు శరీరాదులు దహింపఁబడుచున్నను నిర్వికారులైయుందురో, అట్టి మహాత్ములే మహాదుఃఖదాయకములగు సమస్తకర్మములను, దుస్సంకల్పాదులనుగూడ సమూలముగ ఛేదించివైచి సర్వోత్కృష్టులై వెలయుదురు. గాని తదితరులుగాదు. (ఆత్మజ్ఞానులే భావికాల కర్మములను, వానిచే నుత్పన్నములగు సుఖదుఃఖాదులను జయింపఁగలరుగాని తక్కినవారెవరును గాదని భావము.)

ఇది శ్రీవాసిష్ఠతాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున నుత్తరార్ధమున అవి॥ విప॥ శవో॥ భావిసంపత్తివర్ణనమను నూటయేబదియైదవ సర్గము ॥ 155 ॥

---

## షట్పఞ్చాశదధికశతతమః సర్గః

[వాయౌ స్థితో వ్యాధజీవః సింధుర్భూత్వా విదూరథమ్
హత్వా మన్త్రిముఖాచ్ఛ్రుత్వా స్వతత్త్వమిహ వర్ణ్యతే.

వాయువునందు స్థితిగల్గియున్న వ్యాధునియొక్క జీవుఁడు సింధురాజై, విదూరథుని జంపి, మంత్రి, ముఖతః తన రహస్యతత్త్వమును వినుట యిచట వర్ణింపఁబడుచున్నది.]

వ్యాధ ఉవాచః—

అనన్తరం హే భగవన్వితతాకాశవాసినః
కిం భవిష్యతి మే తత్ర దేహేఽధః పాతిని క్షితౌ. 1

వ్యాధుఁడు:— మహాత్మా నా శరీరము క్రిందభూమిపైఁబడినపిదప, అట విశాలాకాశమున నున్నట్టి నా జీవుని దశ యేమగును?

మునిరువాచః—

శృణుష్వావహితస్తస్మిన్దేహే తవ పరిక్షతే
కిం భవిష్యతి భవ్యాత్మం స్తస్మిన్పరమకామ్బరే. 2

ముని:— భవ్యుఁడవగునో వ్యాధుఁడా! ఆ శరీరము నశింప, అవ్యక్తాకాశమున నున్నట్టి నీ జీవునియొక్క దశ యేమగునో చెప్పెద, సావధానముగ వినుము.

దేహే తస్మిన్పరిభ్రష్టే జీవస్తు ప్రాణసంయుతః
భవిష్యత్యమ్బరే వాతలవో వ్యాతతరూపిణి. 3

ఆ దేహము నశింప, ప్రాణసహితుఁడగు నీయొక్క జీవుఁడు విశాలమైనట్టి అవ్యక్తాకాశమున సూక్ష్మమగు వాయుకణమువలె నుండును.

తస్మిన్వాతలవే చేతో దృశ్యం హృత్ స్థం స్థితం పురః
స్ఫారం ద్రక్ష్యతి భూపీఠం భవాన్స్వప్నే జగద్యథా. 4

ఆ సూక్ష్మవాయుకణమువంటి జీవునియందు నీయొక్క చిత్తము తనయందున్న వాసనామయమగు విశాలభూపీఠమును, జగత్తును, స్వప్నమందువలెఁ గాంచును.

మహత్త్వాచ్చిత్తవృత్తేస్తు జీవో ద్రక్ష్యతి తేతతః
రాజాహమస్మి భూపీఠ ఇతి సంకల్పితార్థభాక్. 5

నీయొక్క చిత్తవృత్తియే జగదాకారముగ మహత్త్వమునొందుటవలన, సంకల్పితపదార్థమును బొందునట్టి నీయొక్క జీవుఁడపుడు ఈ భూమండలముపై నేను రాజును అను విషయము గాంచును.

తత్రాస్య సహసైవాశు ప్రతిభోదేష్యతి స్వయమ్
అహమస్మి నృపః శ్రీమాన్సిన్ధురాన్యాతిమానితః. 6

అపుడచట స్వయముగనే నీకు శీఘ్రముగ 'నేను సామంతాదులచే మిగుల సన్మానింపఁబడిన 'శ్రీమాన్ సింధురాజును' అను బుద్ధి యుదయించును.

అష్టవర్షాయ మే రాజ్యం గతే పితరి కాననమ్
భవశ్చతుః సముద్రాయాః పిత్రా దత్తముపాగతమ్. 7

సీమాన్తే భూపతిః శత్రుర్విదూరథ ఇతి శ్రుతః
విద్యతే యః ప్రయత్నేన వినా నామ న జీయతే. 8

ఇదం మే కుర్వతో రాజ్యం సంవత్సరశతం గతమ్
అహో భృత్యకలత్రాఘైః సహ భుక్తం మయా సుఖమ్. 9

కష్టమేష ప్రవృద్ధో మే సీమాన్తవసుధాధిపః
అనేన సహ సంగ్రామో దారుణః సముపస్థితః. 10

మఱియు 'నా తండ్రి వనమున కేగినపిదప, అతనిచే నొసంగఁబడిన చతుస్సాగర పర్యంతమగు రాజ్యము నాకెనిమిది వత్సరముల ప్రాయముననే లభించెను. సరిహద్దు ప్రాంతమున విదూరథుఁడని ఖ్యాతిగాంచిన యొక మహాశత్రురాజు గలఁడు. అతఁడు ప్రయత్నముచేత జయింపబడడు. రాజ్యమొనర్చుచు నాకిప్పటికి నూఱుసంవత్సరములు గడచినవి. ఆహా! సేవక, పత్నీ

సమూహములతోటి నేను సుఖము ననుభవించితిని కాని యిదియొకటిమాత్రము నాకు గష్ట ముగా నున్నది — నా రాజ్యముయొక్క సరిహద్దునందలి రాజు చాల వృద్ధికెక్కియున్నాఁడు. అతనితోటి యిపుడు భయంకరయుద్ధము సంప్రాప్తమయ్యెను. అని నీవు తలంచెదవు

ఇతి చిన్తయత స్తత్ర విదూరథమహీభుజా
భవిష్యతి మహద్యుద్ధం చతురఙ్గబలక్షయి. 11

ఈ ప్రకారముగ జింతించుచుండు నీకచట విదూరథరాజుతోటి చతురంగసేనా నాశక మగు మహాయుద్ధము తటస్థించును.

మహతా తేన యుద్ధేన హనిష్యసి విదూరథమ్
కరవాలలతాలూనజఙ్ఘం త్వం విరథోఽపి సన్. 12

ఆ గొప్పయుద్ధమున ఖడ్గమను లతచే ఛేదింపఁబడిన జంఘు(పిక్క)గల విదూరథుని, రథహీనుఁడవైనను నీవు చంపఁగలవు

చతుః సాగరపర్యన్తే భూతలే భూపతి స్తతః
భవిష్యసి భయాక్రాన్తదిక్పాలాదృతశాసనః. 13

తదుపరి, భయముచే నాక్రాంతులగు దిక్పాలురచేతను నాదరింపఁబడినట్టి శాసనము గలవాఁడవై నీవు చతుస్సాగర పర్యంతమగు భూమండలమునకుఁ జక్రవర్తియగుదువు.

స త్వం సిన్ధుర్నృపవ్యాప్త ప్తసకలావనిమణ్డలః
పణ్డితైర్మన్త్రిభిః సార్ధం కరిష్యసి కథా ఇమాః. 14

అట్లు సింధురాజగు నీవు సమస్తభూమండలమును బొందినవాఁడవై శాస్త్రతత్త్వజ్ఞులగు మంత్రులతోఁగూడ ఈ ప్రసంగములను గావింతువు—

మన్త్రీ వదిష్యతిః—

అత్యాశ్చర్యమిదం దేవ యదేవం స విదూరథః
దేవేన విజితో యుద్ధే నీతశ్చ యమసాదనమ్. 15

మంత్రి:— దేవా! ఇట్టి ప్రతాపవంతుఁడగు విదూరథునిగూడ తాము జయించి యమలోకమునకు బంపితిరి! అత్యాశ్చర్యము!

త్వం వక్ష్యసి:—

భోః సోఢో నధనస్యాస్య కల్పాన్తార్ణవరంహసః
వైరీ విదూరథో రాజా కిమర్థం వద దుఃసహ. 16

నీవు:— సాధూ! మహదైశ్వర్య, సేనా, బల, ధనయుక్తుఁడను, ప్రళయసముద్ర వేగముతోఁగూడినవాఁడనునైయున్నప్పటికిని నాకు ఆ విదూరథరాజు ఏకారణముచే జయించుటకుఁ గష్టసాధ్యుఁడాయెనో వచింపుము?

మన్త్రీ వదిష్యతిః—

లీలా నామాస్య భార్యాస్తి తయాతితపసార్జితా
మాతా సరస్వతీ దేవీ జగద్ధాత్రీ నిరఞ్జనా. 17

మంత్రి:— ప్రభూ! ఆ రాజునకు లీలయను భార్యగలదు. ఆమె తనతపస్సుచే, జగత్తును ధరించునదియు, నిష్కళంకస్వరూపిణియునగు సరస్వతీదేవిని మాతృభావముద్వారా తనవశము చేసికొనెను.

గృహీతాయాః సుతాత్వేన సాస్యా భువనభావినీ
సంసాధయతి కార్యాణి మోక్షాదీన్యపి హేలయా. 18

అనేక బ్రహ్మాండములను రచించునట్టి యాదేవి తన కొమరితగాఁ గ్రహింపఁబడినట్టి యా లీలకు మోక్షాదికార్యములనుగూడఁ బ్రయాసములేకయే సిద్ధింపఁజేయుచున్నది.

వరేణ శబ్దమాత్రేణ జగదప్యజగత్క్షణాత్
కరోతి సా భవన్నాశే తస్యాః క్వైవ కదర్థనా. 19

తన శబ్దమాత్రరూపమగు వరదానముచే జగత్తునంతయు క్షణకాలములో నశింపఁ జేయఁగల యాభగవతికి నిన్ను నశింపజేయుటయందేమి క్లేశముగలదు?

సిన్ధుర్వదిష్యతి:—

త్వయా వై యుక్తం కథితం యద్యేవం తద్విదూరథః
అశక్యో జేతుమాశ్చర్య మేతస్య సమరే వధః. 20

సింధురాజు:— నీవు చెప్పినది యుక్తమే. కాని, అట్లైనచో ఆ విదూరథుఁడు జయించుట కశక్యుఁడేయగునుగాన, యిపుడు యుద్ధమందాతని వధ యాశ్చర్యముగనేయున్నది ?

తదేవం సంప్రసాదేన భగవత్యా సమన్వితః
కిమిత్యస్మిన్రణే తస్మిఞ్జయం రాజా న లబ్ధవాన్. 21

మఱియు, అట్లైనచో భగవతియొక్క యనుగ్రహముతోఁగూడియున్న యారాజు యుద్ధమున జయము నేల పొందకయుండెను?

మన్త్రీ వదిష్యతి:—

తేన సంప్రార్థితా దేవీ సర్వకాలమఖేదినా
మోక్షోఽస్తు మమ సంసారాదితి తామరసేక్షణ. 22

మంత్రి:— కమలనేత్రుఁడవగు ఓ రాజా! దుఃఖరహితుఁడగు ఆ విదూరథుఁ డాదేవిని 'నాకు సంసారమునుండి మోక్షము (విముక్తి) కలుగుగాక!' అనియే సదా ప్రార్థించుచుండెడివాఁడు.

తయా తేన విభో తస్య స ఏవావన్ధ్యసంవిదా
సంపాదితస్తేన తదాశ్రిత ఆజౌ పరాజయః. 23

ప్రభూ! ఇక్కారణమున సత్యసంకల్పయగు ఆదేవి యారాజునకు మోక్షరూపకార్యమును సిద్ధింపఁజేసెను. కావుననే యాతఁడపుడు యుద్ధమున స్వయముగనే పరాజయము నాశ్రయించెను.

సిన్ధుర్వదిష్యతి:—

యద్యేవం తన్మయా దేవీ సదైవైషా ప్రపూజ్యతే
మోక్షం కిమితి మే వైషా దదాతి పరమేశ్వరీ. 24

సింధురాజు:— మంత్రీ! అట్లైనచో, నే నాదేవిని సదా పూజించుచున్నానుగదా; ఆ పరమేశ్వరి నాకేల మోక్షము నొసంగకయున్నది?

**మన్త్రీ వదిష్యతి:—**

> ఏషా హి జ్ఞప్తిరాస్తేఽన్తః సర్వస్య హృదయే సదా
> సంవిద్రూపా భగవతీ సైవ ప్రోక్తా సరస్వతీ. 25

మంత్రి:— ఓ రాజా! ఏ చిద్రూపిణియగు భగవతి సర్వుల హృదయమందును జ్ఞప్తి రూపమున వసించుచున్నదో, ఆమెయే సరస్వతియని చెప్పఁబడుచున్నది.

> యేన యేన యథాత్మీయా ప్రార్థ్యతే స్వయమేవ సా
> ప్రయచ్ఛతి తథైవాశు తస్మాచ్చిదనుభూయతే. 26

ఎవరెవరిచే నెట్లెట్లు స్వాత్మహితకారిణియైన యా భగవతి స్వయముగ ప్రార్థింపఁబడు చున్నదో, వారి వారి కాయావిధముగనే యామె శీఘ్రముగ వరము నొసంగుచున్నది. మఱియు, ఆ వరప్రదానముచే నామెయొక్క సత్యసంకల్పరూప చైతన్యమే తద్వరఫలరూపముగ ననుభవింపఁ బడుచున్నది.

> న ప్రార్థితైషా భవతా మోక్షార్థమరిమర్దన
> ప్రార్థితైవ త్వయా సంవిదాత్మీయా శత్రుశాన్తయే. 27

శత్రునాశకుఁడవగు నో రాజా! నీవీ భగవతిని మోక్షముకొఱకై ప్రార్థింపలేదు. శత్రు నాశముకొఱకే ప్రార్థించితివి.

**సిన్ధుర్వదిష్యతి:—**

> న ప్రార్థితా మయా కస్మాదనేనైషా సరస్వతీ
> సంవిచ్ఛుద్ధా మయా కస్మాత్ప్రార్థితా నేహ ముక్తయే. 28

సింధురాజు:— ఓ మంత్రీ! ఈ విధూరథరాజు నావలె ఈ శుద్ధచిద్రూపిణియగు సరస్వతీదేవిని రాజ్యముకొఱకై యేల ప్రార్థింపలేదు? మఱియు నే నాతనివలె నద్దేవిని మోక్షము కొఱకై యేల ప్రార్థింపకుంటిని.

> మదాశయగతాప్యేషా జ్ఞప్తిం దత్త్వా సరస్వతీ
> మన్మోక్షాయ కిమిత్యజ్ఞ సద్రూపాపి న చేష్టతే. 29

ప్రియుఁడవగు నో మంత్రీ! నా చిత్తమందున్నదియు, నా ఆత్మరూపిణియై వెలయు చున్నదియు నైనప్పటికి, ఈమె నాకు మోక్షేచ్ఛారూపమగు జ్ఞప్తినొసంగి సాధనసంపత్తిద్వారా నా మోక్షమునకై యేల ప్రయత్నింపకున్నది?

**మన్త్రీ వదిష్యతి:—**

> అశుభః ప్రాక్తనోఽభ్యాసస్తవాస్తి రిపుఘాతినః
> తేనైషా ముక్తయే నత్వా త్వయా న ప్రార్థితా విభో. 30

మంత్రి:— ప్రభూ! శత్రుసంహారకుఁడవగు నీకుఁ బూర్వజన్మలయొక్క శుభమైన అభ్యాసము గలదు దానిచే నీవాదేవికి నమస్కరించి ముక్తికొఱకై ప్రార్థింపలేదు.

యచ్చిత్తస్తన్మయో జన్తుర్భవతీత్యాజగత్స్థితేః
ఆబాలమేవ సంసిద్ధం కర్తుం శక్నోతి కోఽన్యథా. 81

సృష్ట్యారంభమునుండియు, చిత్తమేవిధముగ వాసనారహితమైయుండునో, ఆ విధముగనే జీవుఁడు తన్మయుఁడైయుండును. మఱియు, భక్తుని చిత్తము ననుసరించియే దేవతలున్ను వానిపై ననుగ్రహము జూపుదురుగాని స్వతంత్రముగఁగాదు. కావున భక్తుని చిత్తవృత్తికన్యముగ నెవఁడును నేమియు జేయజాలఁడు. ఇవ్విషయము ప్రపంచమున ఆబాలగోపాలము ప్రసిద్ధమైయున్నది

యదేవ యేనామలయామలాత్మ సంవేద్యతేఽభ్యాసమయం విదాన్తః
సర్వోపమర్దేన తదేవ సోఽఙ్గ సదస్త్వసద్వాస్తు భవత్యవిఘ్నమ్. 82

ఇత్యార్షే శ్రీవాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే ఉత్తరార్ధే అవి॥ విప॥ శవో॥ సిన్ధుసంబోధనం నామషట్ పఞ్చాశదధిక శతతమః సర్గః ॥ 156 ॥

ప్రియుఁడవగు నో రాజా! ఎవఁడు నిర్మలబుద్ధితోటి తన చిత్తమున రాజ్యమునుగాని, మోక్షమునుగాని, లేక మఱిదేనినైనగాని నిర్మల, దృఢాభ్యాసము గావించి యనుభవించునో, అయ్యది సత్తైనను, అసత్తైనను, అట్టి యభ్యాసమయమగు రూపమే యాతఁడు శీఘ్రముగ నితరవాసనల నన్నింటిని నణగద్రొక్కి స్వయముగనే తప్పక యగును.

ఇది శ్రీవాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున నుత్తరార్ధమున అవి॥ విప॥ శవో॥ సింధుసంబోధనమను నూటయేబది యాఱవ సర్గము ॥ 156 ॥

## సప్తపఞ్చాశదధిక శతతమః సర్గః

[ వర్ణ్యతే సిన్ధుజీవస్య జాతిస్తామసతామసీ
సిన్ధోశ్చ త్యజతో రాజ్యం వివేకాన్ముక్తిరన్తతః

సింధురాజును జీవునియొక్క తామస తామసజాతి, రాజ్యమును వీడిపోవు ఆ సింధురాజు యొక్క తుదకు వివేకమువలన గలుగుముక్తి, అను విషయములిచట వర్ణింపఁబడుచున్నవి.]

అథ సిన్ధుర్వదిష్యతి:—

ఆర్యానార్యవపుః కోఽహమభవం విమతిః పురా
యద్వశాన్మే కుసంస్కారః ప్రాక్తనోఽస్తి భవప్రదః. 1

సింధురాజు:— ఆర్యా! ఎద్దానివశముచే నాయొక్క పూర్వకాలపు దుష్టసంస్కారము జన్మప్రదమైయొప్పినదో, అట్టి, అనార్యశరీరము గలవాఁడను, బుద్ధిహీనుఁడనునగు నేను బూర్వ మెవరనై యుంటిని?

మన్త్రీ వదిష్యతి:—

రహస్యం శృణు భో రాజన్నావధానపరః క్షణమ్
చోదితః సందధాసీదమద్య మాన్ద్య వినాశనమ్. 2

మంత్రి:— ఓ రాజా! ఈ తమరహస్యమును సావధానచిత్తులై యొకింతసేపు వినుడు ఇపుడు నాచేఁ బ్రేరితులై తాము, అజ్ఞానవినాశకరములగు యీ నావాక్యములను హృదయమును ధరింపఁగలరు.

కిమప్యాద్యన్తరహితమస్తీహ సదనామయమ్
స్థితం త్వమహమిత్యాదిరూపేణ బ్రహ్మశబ్దితమ్. 3

ఓ రాజా! అద్యంతరహితమై, నిర్వికారమై, బ్రహ్మమని చెప్పఁబడునట్టి యొకానొక వస్తువే 'నీవుఁనేను' ఇత్యాదిరూపముతోటి వర్తించుచున్నది.

తద్బ్రహ్మ స్వయమేవాహం చిచ్చేతామీతి సంవిదమ్
జీవతామివ గత్వాస్తే చిత్తితాయాత్యజద్వపుః. 4

ఆ బ్రహ్మమే, 'నేను చిద్రూపమును; కాఁబట్టి ప్రకాశింపఁజేసెను' అను నిట్టి సంకల్ప సంవిత్తును స్వయముగ ధరించి. సమష్టి. వ్యష్టి చిత్తరూపమై. ఆ యుపాధియందు జీవదశను బొందిన దానివలె నున్నదై యద్దానిని (ఉపాధిని) త్యజింపక వర్తించుచున్నది.

చిత్తం తు గగనాచ్ఛాత్మ వపుర్విద్ధ్యాతివాహికమ్
తదేవ వాస్తి నేహాన్యదాధిభౌతికతాదికమ్. 5

ఓ రాజా! చిత్తము ఆకాశమువలె నిర్మలమైనట్టి 'అతివాహిక' (సూక్ష్మ) శరీరమని యెఱుఁగుఁడు. వాస్తవముగ నిటనదియే కలదుగాని, ఇతరములగు 'అధిభౌతిక (స్థూల) శరీరాదులెవ్వియునులేవు.

చిత్తమేతదనాకారమపి సాకారవత్ స్థితమ్
సంకల్పైః పరలోకాద్యైః స్వప్నాద్యైరేతదేవ సత్. 6

ఆ చిత్తమే నిరాకారమైనను ఇహపరలోక, జాగ్రత్స్వప్న, జీవనమరణ, భోగమోక్షాది సంకల్పములవలన సాకార జగత్తువలె స్థితినొందియున్నది. ఇట నిరాకారమగు యీ చిత్తమే గలదుగాని. సాకారాది పదార్థము లేవియును లేవు

అనాకారమపిస్ఫారం చిత్తం జగదిదం విదుః
య ఏవ పవనో నామ స ఏవ స్పన్దనం యథా. 7

ఏది వాయువో, అదియే స్పందమైనట్లు తత్త్వవేత్తలు నిరాకారమైన చిత్తమునే యీ విశాలజగత్తుగ నెఱుఁగుచున్నారు.

యథా గగనశూన్యత్వే జగచ్చిత్తే తథైకకమ్
భ్రాన్తాప్రతిఘరూపేఽస్తి న మనాగపి భిన్నతా. 8

ఆకాశ, శూన్యత్వము లొకేపదార్థమైయున్నట్లు, చిత్త జగంబులున్ను నొకేపదార్థమై యున్నవి. జగదాకారకలనయందు నిరంకుశ సామర్థ్యముగల యీ చిత్తమందును, జగత్తునందును నొకింతైనను భేదములేదు.

హృదయస్థం జగజ్జాలం న కించిత్కించిదాస్థితమ్
జగద్విద్ధి నిరాకారం చిత్తమేవ న వాస్తవమ్. 9

ఓ రాజా! మిథ్యయగుటచే, అవస్తురూపమైనట్టి హృదయస్థమగు వాసనయే బాహ్యమున వస్తురూపమగు జగజ్జాలమువలె వర్తించుచున్నది. ఇట్లు జగత్తు వాస్తవముగ నిరాకారమగు చిత్తమనియే యెఱుంగుము. ఆ చిత్తమున్ను పరమార్థదృష్టియందు సత్యముకాకయే యున్నది.

సత్యమేవ వపుః పూర్వముదితం బ్రహ్మణః పదాత్
అయమేవ స సంపన్నో యోఽద్య తామసతామసః. 10

ప్రథమ సృష్టియందు తాము బ్రహ్మపదమునుండి సాత్వికరూపులగు హిరణ్యగర్భుండను పేరుగల సమష్టిశరీరులుగ నుదయించిరి. ఆ సమష్టి సాత్వికరూపులగు తామే క్రమముగ వ్యష్టిభావమునొంది, తామస విషయసంగముచే నిపుడు తామసరూపులై వర్తించుచున్నారు.

సిన్ధుర్వక్తి:—

కిముచ్యతే మహాభాగ వద తామసతామసః
క్రియన్తే పూర్వమేవైతాః కేన సంజ్ఞాః పరే పదే. 11

సింధురాజు:- — మహాభాగ్యవంతుఁడవగు ఓమంత్రీ! 'తామసతామస'మన నేమి? సృష్ట్యాదియందు పరబ్రహ్మపదమున ఈ తామసతామసాది సంజ్ఞల నెవరు రచించుచున్నారు?

మన్త్రీ వదిష్యతి:—

జన్తోః సావయవస్యేహ హస్తాద్యవయవా యథా
తథా నవయవస్యైవమాతివాహికతాత్మనః. 12

మంత్రి.— ఓ రాజా! ఈ ప్రపంచమున, అవయవసహితుఁడగు జీవునకు హస్తపాదాద్యవయవము లెట్లుగలవో అట్లే అవయవరహితమగు ఆత్మకు 'ఆతివాహిక' (సూక్ష్మశరీర) రూపత్వముగలదు.

పశ్చాదాత్మని సైవాత్మా నానాసంజ్ఞాః కరిష్యతి
ఆధిభౌతికతానామ్ని పృథ్వ్యాద్యా ఆతివాహికే. 13

అపరిచ్ఛిన్న దశనుండి పరిచ్ఛిన్నదశను బొందినట్టి హిరణ్యగర్భుఁడను సమష్ట్యాత్మయే 'ఆతివాహిక' రూపమగు తన సమష్టిదేహమున పంచీకరణముద్వారా 'ఆధిభౌతికత్వ' నామమును గల్పించిపిదప యద్దాని అవయవరూపములగు తన వ్యష్టి దేహములందు పృథివ్యాది సంజ్ఞల నొనర్చును.

స్వప్నాభేఽస్మిఞ్జగద్భానే సంకల్పేనాత్మరూపిణా
సంజ్ఞాశ్మనాత్మనైవేహ స్వేచ్ఛయా వ్యవహరిష్యతి. 14

ఇట్లు నామరూపములను గల్పించి ఆ సమష్టిరూపాత్మ స్వప్నమువంటి యీ జగత్తునందు నిజసంకల్పము వ్యష్టిరూపముతోటి స్వయముగనే వ్యవహరించును.

త్వామాతివాహికాకారా యత్తత్స్ఫురితవాన్నవమ్
జాతిర్మహాతమస్యోఽయమితి తత్రాభిధా కృతా. 15

అట నూతనవ్యష్టిభావకల్పనమందు తమ్మల నుద్దేశించి హిరణ్యగర్భుఁడు సృష్టిసంకల్పముచే వ్యష్టిరూపముతోటి మహాతామసరూపముగ స్ఫురించెను. గావున తనయొక్క అతివాహిక శరీరజాతికి 'తామసతామసీ' అను పేరుపెట్టఁబడెను.

బ్రహ్మణో నిర్వికారస్య వికారిణ ఇవ ప్రభో
జాతయో జీవితా వత్తా కలితా వివిధాభిధాః. 16

ప్రభూ! నిర్వికారమగు బ్రహ్మముయొక్క వికారియొక్కవలె జీవభావప్రాప్తియందు ఆ యా యుపాధులయొక్క గణముల ననుసరించి సాత్వికసాత్వికాది త్రయోదశ (పదమూఁడు) సంజ్ఞలుగావింపఁబడినవి.

ప్రాథమ్యేనైవ యద్బ్రహ్మ జీవితామివ గచ్ఛతి
తదైవ బుద్ధ్యా భోక్త్రా తజ్జాతిః సాత్వికసాత్వికీ. 17

ఏది కల్పాదియందు ప్రథమముననే బ్రహ్మమందు జీవరూపమును బొందినదానివలెనగునో, అది యా జన్మయం దుత్పత్తిమాత్రముచేతనే జ్ఞానైశ్వర్యయుక్తమగు బుద్ధితోఁగూడి విషయముల ననుభవించి తిరిగి యా జన్మయందే ముక్తినొందును. అట్టి జాతి 'సాత్వికసాత్వికీ' అనబడును.

వర్తమానే భవే భవ్యగుణైర్యుక్తా తు మానద
కేవలా సాత్వికీ ప్రోక్తా జాతిర్జాతవిదాం వరైః. 18

మానప్రదుఁడవగు నో రాజా! ఎయ్యది కొంతకాలము సంసారహేతువగు అజ్ఞానమందున్నదై మరల యా జన్మయందే జ్ఞానైశ్వర్యాది యుత్తమగుణములతో గూడుకొని ముక్తినొందునో, అట్టి జీవజాతి జాతులనెఱిఁగినవారిలో శ్రేష్ఠులగువారిచే 'సాత్వికీ' అని చెప్పఁబడెను.

నవా భవైశ్చేద్బ్రహ్మాభిర్భోగమోక్షైకభాగినీ
జాతిస్తత్రోచ్యతే తజ్జ్ఞైః నద్భి రాజసరాజసీ. 19

ఎయ్యది కల్పాదియందు నూతనరూపముతో వ్యక్తమైనప్పటికిని, అనేక జన్మలందు భోగముల ననుభవించినపిదప క్రమముగ మోక్షభాగియగునో అట్టి జీవజాతి 'రాజసరాజసీ' అనఁబడును.

వర్తమానే భవే భవ్యగుణైర్ముక్తా తు మానద
కేవలా రాజసీ ప్రోక్తా జాతిః స్వల్పభవే భవేత్. 20

మానప్రదుడవగు నో రాజా! ఎయ్యది వర్తమానకాలమున వివేకాది భవ్యగుణ పాపరహితమైయుండునో అనేకజన్మ పరంపరలైనపిదప భవ్యగుణములను బొంది మోక్షమును బడయునో ఆ జాతి 'కేవలరాజసీ' అని చెప్పఁబడును.

ప్రథమాత్యన్తబహుభిర్భవైశ్చేన్మోక్షగామినీ
జాతిస్తత్రోచ్యతే తత్ జ్ఞైః సద్భిస్తామసతామసీ. 21

ఏది కల్పాదినుండి మొదలుకొని యనేక స్థావర, కీట, పశు, కిరాతాది జన్మలందు భోగముల ననుభవించి తుదకు మోక్షభాగియగునో, అట్టి జీవజాతి యుత్తమజాతివేత్తలచే 'తామస తామసీ' అని చెప్పఁబడినది.

సామాన్యేనైవ బహుభిర్జన్మభిర్మోక్షభాగినీ
కేవలా తామసీ ప్రోక్తా జాతిర్జాతివిశారదైః. 22

ఉత్కృష్టములు కానట్టి రాక్షస పిశాచాది యనేక జన్మల ననుభవించి తుదకు మోక్షము నొందునట్టిజాతి జాతివిశారదులచే 'కేవలతామసీ' అని చెప్పఁబడినది.

క్రమేణానేన జాతీనాం వివిధా భేదకల్పనా
తాసాం తామసతామస్యాం జాతో జాతోఽసి మానద. 23

మానప్రదా! ఇట్టి క్రమమున జాతులయొక్క అనేక భేదములు కల్పింపఁబడినవి. వానియందుఁ దాము 'తామసతామసీ' జాతియందుత్పన్నులైరి.

బహూని తవ జన్మాని సమతీతాని తాన్యహమ్
వివిధాని విచిత్రాణి వీర జానామి నో మహాన్. 24

వీరుఁడవగు నో రాజా తమ కనేక విచిత్రములైన జన్మలు గడచిపోయినవి. వాని నన్నింటిని నే నెఱుఁగుదును; తామెఱుఁగరు

విశేషేణ త్వనేనైష వ్యర్థం కాలోఽతివాహితః
మహాశవశరీరేణ త్వయాసన్తఖగామినా. 25

ముఖ్యముగ మహా శవశరీరధారియై ఆకాశగామిగ తాము చాలకాలమును వ్యర్థముగ గడిపితిరి.

ఏవం తామసతామస్యా జాత్యాసి జనితో యదా
తదా దుర్లభమోక్షస్త్వం సంసారకుహరాదితి. 26

ఈప్రకారముగ తాము 'తామసతామసీ' జాతియం దుత్పన్నులగుటఁబట్టి యీ సంసార కుహరము (గోతి)నుండి మోక్షమొందుట తమకు దుర్లభమాయెను

సిన్ధుర్వదిష్యతి:—

ఆర్యోదాహర కేనైషా ప్రాగ్జాతిర్జీయతేఽధమా
యావత్తత్రైవ తిష్ఠామి స్యాచ్చేత్తద్వద పావనమ్. 27

సింధురాజు:— ఆర్యా! పూర్వకాలపు అధమ (తామసతామసీ) జాతి ఏ యుపాయముచే జయింపఁబడునో, అద్దానిని వచింపఁగోరెద. అట్టి పవిత్రమైన యుపాయమేదేని యుండుచో దానిని యావజ్జీవితము నీవు పచించురీతి యనుష్ఠించుచునుండెద.

**మన్త్రీ వదిష్యతి:—**

న కించన మహాబుద్ధే తద స్తీహ జగ త్త్రయే
యదనుద్వేగినా నామ పౌరుషేణ న లభ్యతే. 28

మంత్రి:— ఓ మహాబుద్ధీ! ఈ ముల్లోకములందును ఉద్వేగరహితుఁడగు (వేగిరపాటు లేని) మనుజుఁడు తన పురుషప్రయత్నముచే బొందని పదార్థమెద్దియునులేదు.

హ్యస్తనీ దుష్క్రియాభ్యేతి శోభాం సత్క్రియయా యథా
అద్యైవ ప్రాక్తనీం తస్మాద్యత్నాత్సత్కార్యవాన్భవ. 29

నిన్నటిదినము గావింపఁబడిన దుష్క్రియ నేటి సత్క్రియచే నెట్లు శోభను బొందునో, అట్లే తాము పూర్వపు అధమజాతిని యిప్పటి సత్క్రియా రూపయత్నముచే జయించి సత్కార్యవంతులుకండు!

యో యమర్థం ప్రార్థయతే తదర్థం యతతే తథా
సోఽవశ్యం తదవాప్నోతి న చేచ్ఛ్రాన్తో నివర్తతే. 30

ఎవఁడే పదార్థమును గోరునో, ఆశఁదద్దానికొఱకై యట్లే ప్రయత్నమున్ను జేయును. మఱియు అలసినవాఁడై ప్రయత్నమును మధ్య విరమింపనిచో దానిని తప్పక పొందియేతీరును.

నా యథా యతతే నిత్యం యద్భావయతి యన్మయః
యాదృగిచ్ఛేచ్చ భవితుం తాదృగ్భవతి నాన్యథా. 31

మనుజుఁడు తాను నిత్యమెట్లు ప్రయత్నించుచుండునో, దేనిని భావించుచుండునో ఎద్దానియందు తన్మయుఁడైయుండునో, ఏప్రకారముగ నగుటకు కోరుచుండునో అట్లేయగునుగాని మఱియొక విధముగఁగాదు.

**మునిరువాచ:—**

ఏవముక్తః స తేనాథ సిన్ధురుద్ధురయా ధియా
తదా తత్ర తథా నామ రాష్ట్రం త్యక్ష్యత్యశేషతః. 32

గమిష్యతి వనం దూరం ప్రార్థితోఽపి హిమన్త్రిభిః
నాశ్రయిష్యతి తద్భూయో రాజ్యముచ్ఛిన్నశాత్రవత్. 33

ముని:— ఓ వ్యాధుఁడా! మంత్రి యిట్లుపచింప, అంత నా సింధురాజు ఉత్తమబుద్ధితోటి తన రాజ్యమునంతయు నట త్యజించివైచి యతిదూరమందలి వనమునకేగును. మంత్రులచేఁ బ్రార్థింపబడినప్పటికిని మరల యాతఁడు తనయాశత్రురహితమగు రాజ్యమును స్వీకరింపకనే యుండును.

తిష్ఠతః సాధుమధ్యేఽస్య తద్వివేకకథావశాత్
పుష్పాసఙ్గాదివామోదో వివేకః సముదేష్యతి. 34

అటుపిమ్మట సాధువులమధ్య వసించుచుండు ఆ రాజునకు వారి వివేకప్రసంగముల వలన, పుష్పసంగముచే తైలాదులందు సుగంధము జనించునట్లు బాగుగ వివేకముత్పన్నమగును.

తతః కథమిదం జన్మ కుతః సంసార ఆగతః
ఇత్థం విచారసాంతత్యాత్ప్రయాన్యతి విముక్తతామ్. 85

తదుపరి 'ఈ జన్మ యెట్లు కలిగినది? జగత్తెటునుండి యేతెంచినది!' అను నీప్రకారమగు నిరంతర విచారణచే నాతఁడు జీవన్ముక్తుఁడగును.

నిత్యం విచారణపరోఽథ భవన్ప్రసిన్ధుః
సత్సఙ్గమేన పదమాప్స్యతి పావనం సః
తద్యత్ర పత్రమివ పాతవిధూయమానం
నో వస్తుతాం వ్రజతి కాచన నామ లక్ష్మీః. 86

ఇత్యార్షే శ్రీవాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే ఉత్తరార్ధే అవి॥ విప॥ శవో॥ సిన్ధునిర్వాణం నామ సప్తపఞ్చాశదధిక శతతమః సర్గః ॥ 157 ॥

ఆ సింధురాజు సత్సాంగత్యవశమున నిరంతరము విచారణపరుడయి, అటుపిమ్మట, ఎచట బ్రహ్మాదుల యైశ్వర్యము వఱకుగల యైశ్వర్యమున్ను వాయువుచే గంపితమగు శుష్కపత్రమువలె గ్రాహ్యత్వమును బొందనిదై, తుచ్ఛమేయగునో, అట్టి పవిత్రమగు మోక్షపదమును బడయును.

ఇది శ్రీవాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున నుత్తరార్ధమున అవి॥ విప॥ శవో॥ సింధునిర్వాణమను నూట యేబది యేడవ సర్గము ॥ 157 ॥

---

## అష్టపఞ్చాశదధిక శతతమః సర్గః

[ శ్రుత్వా మునివచో వ్యాధస్తపః కృత్వా వరాద్విధేః
ఖమాప్లుతః శవీభూతః పపాతేత్యాది వర్ణ్యతే.

మునివాక్యములను విని వ్యాధుఁడు తపస్సుచేసి బ్రహ్మదేవునివలన వరముబడసి, ఆకాశమున నెగురుట, మఱియు విశాలశవమై క్రిందపడుట మున్నగు విషయము లిచట వర్ణింపఁ బడుచున్నవి. ]

**మునిరువాచః—**

ఏతత్తే కథితం సర్వం భవిష్యద్భూతవత్తవ
యథేచ్ఛసి తథేదానీం వ్యాధ సాధు విధీయతామ్. 1

ముని:— ఓ వ్యాధుఁడా! ఈప్రకారముగ నీ భవిష్యద్వృత్తాంత మంతయును భూతకాలికమువలె నేను నీకు తెలియజేసితిని. ఇఁక నిపుడేది యుక్తమమని తలంచుచున్నావో దాని జేయుము.

**అగ్నిరువాచః—**

ఇతి తస్య వచః శ్రుత్వా విస్మయాకులచేతసః
క్షణం స్థిత్వా జగామాశు స్నాతుం వ్యాధస్తథా మునిః. 2

అగ్ని:— ఓ విపశ్చిద్రాజా! ఇట్లాముని వాక్యములనువిని వ్యాధుఁడంత నాశ్చర్యముచేఁ బరిపూర్ణమైనట్టి చిత్తముగలవాఁడాయెను. మఱియు క్షణకాలమువిమర్శించి యటుపిమ్మట శీఘ్రముగ నమ్మునీశ్వరునితోఁగూడ స్నానమాచరించుటకుఁబోయెను.

ఇతి తౌ చేరతుస్తత్ర తపః శాస్త్రవిచారణైః
అకారణసుహృద్భూతావుభౌ వ్యాధమహామునీ. 3

అకారణముగనే మిత్రభూతులైనట్టి యా వ్యాధ మహామును లిరువురును నీ ప్రకారముగ నచట శాస్త్రవిచార పూర్వకముగఁ దపం బొనరించుచునుండిరి.

అథాల్పేనైవ కాలేన మునిర్నిర్వాణమాయయౌ
దేహం త్యక్త్వా పదే శాన్తే పరే పరిణతిం గతః. 4

తదుపరి కొలదికాలముననే యాముని దేహమును వీడినవాఁడై నిర్వాణమును బొంది శాంతమగు బ్రహ్మపదమున విలీనుఁడయ్యెను.

కాలేన బహునాన్యేన తతో యుగశతాత్మనా
వ్యాధస్య కామనాం దాతుం పద్మజన్మా సమాయయౌ. 5

అటుపిమ్మట వందలకొలఁది యుగములవఱకు ఆ వ్యాధుఁడు దీర్ఘతపంబాచరించెను. తదుపరి యాతనికోర్కెను బూర్ణమొనర్చుటకై బ్రహ్మదేవుఁడాతని వద్దకువచ్చెను.

వ్యాధః స్వవాసనావేశం నివారయితుమక్షమః
తానన్నపి వరం పూర్వం వర్ణితం సమయాచత. 6

వ్యాధుఁడు తనవాసనా వేగమును నివారింప నసమర్థుడై యున్నందున, పూర్వము మునిచే వ్యర్థత్వరూపముగ వర్ణింపఁబడిన వరము నెఱిఁగియున్నప్పటికిని దానినే (శరీరవృద్ధి. ఆకాశగమనము) మున్నగువానినే తిరిగి యా బ్రహ్మదేవునిగూర్చి ప్రార్థించెను.

బ్రహ్మైవమస్త్వితి ప్రోచ్య యయావభిమతాం దిశమ్
వ్యాధస్తపః ఫలం భోక్తుం ఖగవద్వ్యోమ పుప్లువే. 7

బ్రహ్మదేవుఁడున్ను 'అట్లే యగుగాక!' అని చెప్పి, తన యభిమతమగు దిశ కేగెను. అంత వ్యాధుఁడు తన తపస్సుయొక్క ఫలము ననుభవించుటకై పక్షివలె నాకాశమున నెగిరెను.

వర్ధమానేన దేహేన జగత్పారే మహానభః
వేగాదగణితం కాలం పూరయామాస శైలవత్. 8

తన వృద్ధినొందు దేహముచే నాతఁడు ముల్లోకములకావల మహాకాశమును బర్వతము వలె శీఘ్రముగఁ బూరించి చాలకాలముండెను.

మహాగరుడవేగేన తిర్యగూర్ధ్వమథ స్తథా
వ్యోమ పూరయత స్తస్య కాలో బహుతరో యయౌ. 9

మహాగరుడుని వేగముచేఁ గ్రిందను, ప్రక్కలను నాకాశమును బూరించుచునుండు నాతనికిఁ జాలకాలము గడచిపోయెను.

అథ దీర్ఘేణ కాలేన యదా విద్యాభ్రమస్య సః
అన్తం న సమవాప్నోతి తత్రోద్వేగముపాయయౌ. 10

పిదప దీర్ఘకాలమునకుఁగూడ నాతనికి 'అవిద్యా' భ్రమయొక్క యంతమెపుడు లభింపలేదో అపుడాతఁడచట వైరాగ్యమును బొందినవాఁడాయెను

ఉద్వేగాదథ బద్ధ్వాసౌ ప్రాణరేచనధారణామ్
ప్రాణాంస్తత్యాజ నభసి శవీభూతమధోవపుః. 11

పిమ్మట ఆ వైరాగ్యముచే నాతఁడు ప్రాణరేచకరూపమగు ధారణను బంధించి యాకాశమునఁ బ్రాణములఁద్యజించి, మృతశరీరుఁడై క్రిందకుఁబడెను.

చిత్తం ప్రాణాన్వితం వ్యోమ్ని యయౌ తత్రైవ సిన్ధుతామ్
విదూరథారిరూపాం తామఖిలావనిపాలినీమ్. 12

అపుడాయాకాశమునఁ బ్రాణసహితముగనున్న యాతని చిత్తమచటనే విదూరథుని శత్రువున్ను, సమస్తభూమండల పరిపాలకుఁడునగు సింధురాజయ్యెను.

దేహో మేరుశతాకార మహాశవ ఇవాభవత్
ద్వితీయోర్వీనిభో వ్యోమ్నః పపాతాశనివజ్జవత్. 13

ఆతనిదేహము వందలకొలఁది మేరుపర్వతముల యాకారమును బోలినట్టి మహాశవమాయెను. మఱియు రెండవపృథివివలెఁ జూపట్టుచున్న యామహాకాయమపుడు పిడుగువలె నాకసమునుండి క్రిందబడెను.

పిధానమివ కస్యోర్వీవీథీ కస్మింశ్చిదమ్బరే
కేశోణ్డ్రకవదాభాతే కస్మింశ్చిజ్జాగతే భ్రమే. 14
ఆకార పూరితాశేషవసుధాచలమణ్డలః

ఆ మహాశవము – బ్రహ్మదేవున కొకానొక జగద్భ్రమ ఆకాశమండలి కేశములవలె భాసింప అటనొకానొక ఆకాశమున పృథివియొక్క విశాలమైన ఆచ్ఛాదనమువలెఁ గన్పట్టుచుండెను. మఱియు. అయ్యది తన యాకారముచే భూమండలమునంతయు పరిపూర్ణమొనర్చియుండెను.

విపశ్చిచ్ఛ్రేష కథితమేతత్తే తన్మహాశవమ్. 15

శ్రేష్ఠుఁడవగు నో విపశ్చిద్రాజా ! ఈ ప్రకారముగ ఆ మహాశవముయొక్క వృత్తాంతమంతయును నీకుఁ జెప్పితిని.

యస్మిఞ్ఛవం సంపతితం జగత్యవనిమణ్డలే
తదిదం జగదాభాతమస్మాకం స్వప్నపూర్వ్యథా. 16

ఏ ప్రపంచమున భూమండలముపై ఆ శవము పడెనో, ఆ ప్రపంచము మన చిత్తమున స్వప్నపురమువలె ప్రత్యక్షముగ భాసించుచున్నది.

తదేతచ్ఛవమాసాద్య శుష్కా పూర్ణా మహోదరీ
సంపన్నా చణ్డికా దేవీ రక్తారక్తాన్త్రపూరితా. 17

ఆ మహాశవమును భక్షించి శుష్కశరీరియు, పూర్ణమైనట్టి గొప్ప యుదరముగలదియు నగు చండికాదేవి రక్తముతోను ప్రేవులతోను బూరింపఁబడినదై రక్తవర్ణయై యొప్పుచున్నది.

మేదినీ మేదినీ జాతా శవస్యైతస్య మేదసా
పూరితాఽపూర్వరూపేణ హిమవద్గిరిరూపిణా. 18

హిమాలయపర్వతమును బోలినదియు, ఆశ్చర్యభూతమైనదియునగు ఆ శవముయొక్క మేదస్సు (క్రొవ్వు)చేఁ బూరింపఁబడినదై యీ పృథివి 'మేదినీ' అను పేరుగలదియాయెను.

తద్వై వైతన్మహామేదో మృద్ధాతుత్వముపాగతమ్
కాలేన వసుధా భూయో భూత్వా మృన్మయతాం గతా. 19

ఆ శవముయొక్క మహామేదస్సే కాలక్రమమున మృత్తికారూపమును బొందెను. కావున ఈ మేదిని (భూమి)యు కాలక్రమమున మరల మృత్తికామయమయ్యెను.

భూయః ప్రజాతాని వనాని భూమౌ గ్రామాః కృతాః పత్తనసంయుతాశ్చ
పాతాలతః సాధుసముత్థితాస్తే శైలాః ప్రవృత్తా వ్యవహారలక్ష్మ్యః. 20

ఇత్యార్షే శ్రీవాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు
నిర్వాణప్రకరణే ఉత్తరార్ధే అవి॰ విప॥ శవో॥ శవనిర్ణయో
నామాష్టపఞ్చాశదధిక శతతమః సర్గః ॥ 158 ॥

ఓ రాజా! ఆ మహాశవముచే నశించినట్టి వనములు కాలక్రమమున మరల యుద్భవించెను. భూమిపై నగర గ్రామాదులు మరల నిర్మింపఁబడెను. చూర్ణీభూతములైన యా పర్వతములున్ను దిరిగి పాతాళమునుండి పూర్వమువలెనే లేచెను. జనులయొక్క వ్యవహారములున్ను యథారీతి మరల ప్రవృత్తములయ్యెను.

ఇది శ్రీవాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున నుత్తరార్ధమున అవి॰ విప॰ శవో॰ శవనిర్ణయమను నూట యేబది యెనిమిదవ సర్గము ॥ 158 ॥

## ఏకోనషష్ట్యధిక శతతమః సర్గః

[ ఇహాగ్నేరిన్ద్రగమనముపదిశ్య విపశ్చితే
ఆశ్చర్యాణి బహూన్యన్తే బ్రహ్మతత్త్వం చ వర్ణ్యతే.

అగ్నిభగవానుఁడు విపశ్చిత్తునకు తా నిన్ద్రునివద్ద కేగుటఁగూర్చి వచించుట, తుదకనేకములైన యాశ్చర్యములు, బ్రహ్మతత్త్వము విపశ్చిత్తునిచే వర్ణింపఁబడుట యిచట గాననగును. ]

అగ్నిరువాచః—

విపశ్చిచ్ఛ్రేష్ఠ భో సాధో త్వం గచ్ఛాభిమతాం దిశమ్
స్థిరం భూమణ్డలం భూయః ప్రకృతవ్యవహారవత్ 1

అగ్ని:— శ్రేష్ఠుఁడవును సాధువునగు విపశ్చిద్రాజా! ఇఁక నిపుడు మరల ప్రస్తుత వ్యవహారమునకు యోగ్యమై స్థిరత్వమును బొందినదై యలరుచున్నట్టి భూమండలమునకుఁ జని యటనుండి నీ కభిమతమగు దిశకు నేగుము.

యష్టుం యష్టుం ప్రజౌఘస్య శక్రః శతతమం దివి
తత్రాహూతోఽస్మి మన్త్రేణ గచ్ఛామి గతికోవిద. 2

ప్రజాసమూహమునకు ప్రభువగు ఇంద్రుఁడిపుడు స్వర్గమున నూఱవ యజ్ఞమును జేయుటకుఁ బ్రవృత్తుఁడైయున్నాఁడు. అటకు మంత్రముల ద్వారా నే నాహ్వానింపఁబడితిని. కావున ఓ గతికోవిదా! నే నచటి కేగుచున్నాను.

భాస ఉవాచః—

ఇత్యుక్త్వా భగవానగ్నిస్తత్రైవాన్తరధీయత
గగనే నిర్మలే యాతి అనలో వైద్యుతో యథా. 3

భాసుఁడు:— ఓ సభ్యులారా! భగవంతుఁడగు అగ్ని యిట్లుచెప్పి యచటనే మూర్త్యాకారముతో నంతర్ధానమై, నిర్మలమగు ఆకాశమున విద్యుదగ్నివలె వెడలిపోయెను.

తథాహమపి చిత్తేన ప్రాక్తనాంశ్చ స్వయం వహన్
పునః స్వకర్మ నిర్ణేతుం భ్రమన్వ్యోమని సంస్థితః. 4

అట్లే నేనున్ను అవిద్యాంతదర్శనముగూర్చిన సంస్కారములను చిత్తమందు స్వయముగ ధరించి మరల నాయొక్క దిగంతగమనమను కర్మయొక్క సిద్ధికొఱకై యాకసమున పరిభ్రమించుచు నుంటిని.

భూయోఽపి దృష్టవానస్మి జగన్త్యగణితాని ఖే
నానాచారవిచారాణి నానాసంస్థానవన్తి చ. 5

తిరిగి యనేకవిధములగు ఆచార విచార, రచనాదులతోఁగూడిన అసంఖ్యాతములగు జగత్తులను నే నాకాశమందపుడు చూచితిని.

క్వచిచ్చిత్రమయాఙ్గాని ఏకీభూతాని భూపతే
భాన్తి చేతన్తి చోపన్తి హ్లాదయాని హరన్తి చ. 6

క్వచిన్మృన్మయదేహాని సర్వభూతాని రాఘవ
భాన్తి చేతన్తి చోపన్తి పర్వతప్రతిమాని చ. 7

క్వచిద్దారుమయాఙ్గాని భాన్తి భూతాని కుత్రచిత్
క్వచిత్పాషాణదేహాని సన్తి భూతాని భూరిశః. 8

క్వచిదాజీవమేకత్ర స్థితాన్యుపలదేహవత్
వాఙ్మాత్రవ్యవహారాణి భూతాన్యాలోకితాని ఖే. 9

ఓ దశరథమహారాజా! ఆ జగత్తులం దొకచోట పరస్పరము సంలగ్నములైనట్టి ఛత్రాకారములైన అవయవములుగలవారు భాసించుచు, వ్యవహరించుచు, మెల్లగఁ జనుచు, చూపరుల చిత్తములను హరించుచుండిరి. ఓ రామచంద్రా! ఒకచోట, ప్రాణులందరును మృణ్మయశరీరులై, పర్వత సమానమగు ఆకారము గలవారై భాసించుచు, వ్యవహరించుచు, మందగమనము సల్పుచు నుండిరి. వేఱొకచోట దారు (కొయ్య) మయములైన అవయవములుగల ప్రాణులు వెలయుచుండిరి. ఒకానొక జగత్తునందు శిలామయములైన దేహములుగల యనేక జీవులు వసించుచుండిరి. ఇంకొక జగత్తునందు శిలాప్రతిమలవలె జీవు లొకేస్థానమున నున్నవారై, గమనాది వ్యాపారరహితులై, వాఙ్మాత్ర వ్యవహారముగలవారై యుండియుండుట ను స్వచిత్తాకాశమున వీక్షించితిని.

ఇత్యహం సుచిరం కాలం పశ్యన్నశ్యన్మన నయా
అవిద్యాన్తమపశ్యంశ్చ తత్రో ద్విగ్నోఽభవం దృశామ్. 10

ఈ ప్రకారముగ, చిరకాలము స్వప్నమందువలె చిరకాలము మనోమాత్రదేహముతో జగత్తులను జూచుచు, పుట్టుచు, నశించుచునుంటిని. కాని ఎంతకాలమునకుఁగూడ అవిద్యయొక్క యంతమును గాంచమి, ఆ దృశ్యదర్శన విషయమై మనంబున మిగుల దుఃఖ మొందితిని.

తపః కర్తుం సముద్యుక్తః కస్మింశ్చిన్మోక్ష సిద్ధయే
ప్రాహేన్ద్రో మమ చైవేదం మృగయోన్యన్తరం హి ఖే. 11

అనంతర మొకానొక యేకాంతస్థానమున మోక్షసిద్ధికొఱకై తపంబొనరింప నుద్యుక్తుఁడ నైతి. అత్తఱి యింద్రుఁడు నాతో నిట్లనియె — ఓ రాజా! నీకును, నాకును ఇపుడు చిత్తాకాశమున మృగజన్మ సమీపించియున్నది.

ప్రవృత్తః స్వర్గసంమోహే పూర్వాభ్యాస వశీకృతః
మన్దారకాననే తత్ర భ్రమతో వై మమాప్సరే. 12

స్వర్గభోగములచే మోహితుఁడనై నేను కల్పవృక్షమున సంచరించుచు, పూర్వాభ్యాసముచే వశీకృతుఁడ నగుటఁబట్టి దుర్వాసునియెడ నపరాధము గావించుటచే, తత్ఫలరూపముగ నిపుడు నా చిత్తాకాశమున మృగజన్మయొక్క సంస్కార మావిర్భవింపనున్నది.

తేనేత్యుక్తే మయా ప్రోక్తం దేవ ఖిన్నోఽస్మి సంసృతేః
ముచ్యేయం శీఘ్రమిత్యుక్త శ్రుత్వోవాచ తతో మమ. 13

ఇంద్రుఁడిట్లు వచింపనంత నే నాతనితో నిట్లంటిని — 'దేవా! నే నీ సంసారమువలన ఖిన్నుఁడనైతిని. కావున శీఘ్రముగ ముక్తిని బడయఁజాలునట్టి వరమును దయచేయుఁడు.' అది విని మరల యాతఁడిట్లు వచించెను.

విశుద్ధాత్మా త్వరూపోఽహమితి చైవ హంతాశనాత్
వరం గృహాణేత్యుక్తేన తతోఽన్యం యాచితో మయా. 14

శీఘ్రముక్తియైతే 'రూపరహితమై, శుద్ధచిత్స్వరూపమైనట్టి ఆత్మయే నేను' అను జ్ఞానము చేతనే యగును (వరముచేతగాదు) అను విషయమును నీవు పూర్వము అగ్నిదేవుని ముఖమునుండి వినియుంటివిగదా! కావున మఱియొక వరమును గోరుకొనుము—ఇంద్రుఁడిట్లు పలుక, అపుడు నేను 'మృగరూపమును ధరించిన పిదప నాకేమి సంభవించును? అను విషయముయొక్క పరిజ్ఞానమను వరమును గోరితిని.

ఇన్ద్ర ఉవాచః—

తవేయం మృగయోన్యన్తశ్చిరం సంసరతే చితిః
అవశ్యం భవితవ్యోఽర్థ ఇతి దృష్టో మయా తవ. 15

ఇంద్రుఁడు:— ఓ రాజా! మృగ (లేడి) జన్మయొక్క సంస్కారము నీయొక్క యంతఃకరణమున చిరకాలము నుండియుఁ దిరుగాడుచున్నది. అది యవశ్యము సంభవింపనున్నదనియే నీ విషయమున నేను నిశ్చయించితిని.

మృగో భూత్వా మహాపుణ్యాం తాం సభాం సమవాప్తవాన్
యస్యాం తదహతం జ్ఞానం మదుక్తం బోధమేష్యతి. 16

అట్లు మృగమై యెపుడు నీవు మహాపవిత్రమగు యా దశరథుని సభను బొందుదువో, అపుడు నేను వచించినట్టి యా 'నిరాకారమైన విశుద్ధ చిద్రూపాత్మయే నేను' అనునట్టి అక్షయ జ్ఞానము నీకుదయించును.

తదేవం తత్ర హరిణో భవార్తస్త్వం భవావనౌ
ఆత్మోదన్తమిదం వన్ద్యం సకలం సంస్మరిష్యసి. 17

ఇట్లు, సంసారతాపతప్తుఁడవగు నీవీపృథివిపై హరిణమైజన్మించి యా ప్రకారముగ దశరథుని సభనుబొంది, అటవసిష్ఠుల యనుగ్రహముచే, నిష్ఫలవంతమగు నీ యీ స్వవృత్తాంతమంతయును స్మరింపఁగలవు.

స్వప్నభ్రమమివాశేష సంకల్పరచితోపమమ్
పరలోకానుభూతార్థకథాయాతార్థ సంనిభమ్. 18

అపుడే నీ పూర్వవృత్తాంతమంతయును నీకు స్వప్న భ్రమవలెను, సంకల్ప నిర్మిత పదార్థమువలెను, పరలోకమున ననుభూతమైన విషయమువలెను కథయొక్క అర్థమువలెనుదోఁచును.

యదా తు మృగతోన్ముక్తః పురుషస్త్వం భవిష్యసి
జ్ఞానాగ్నిదగ్ధదేహాన్తే తదా హృత్ స్థం స్ఫురిష్యతి. 19

ఎపుడు నీవు మృగశరీరమునుండి విముక్తుఁడవై పురుష రూపమును ధరించెదవో, అపుడు జ్ఞానాగ్నిచే, దేహపర్యంతముగల అజ్ఞానజనితమను సమస్తమును భస్మీభూతమైపోవ నీ హృదయస్థమగు ఆత్మస్వరూపము తెల్లగ స్ఫురింపగలదు.

తేన తాం త్వమవిద్యాఖ్యాం భ్రాన్తిం త్యక్త్వా చిరం స్థితామ్
భవిష్యసి వినిర్వాణో గతస్పన్ద ఇవానిలః.

అట్టి ఆత్మస్వరూపముయొక్క స్ఫురణముచే, నీవపుడు చిరకాలము నీయందున్నట్టి అవిద్యయను భ్రాంతిని త్యజించివేసి నిశ్చలవాయువువలె నిర్వాణ (శాంత) రూపుఁడవగుదువు. (ముక్తుఁడవగుదువని భావము.)

ఇత్యుక్తే తేన దేవేన తథైవ ప్రతిబోధభూత్
మమాయం హరిణోఽస్మీతి వనేఽస్మిన్నితి నిశ్చితా. 21

ఇంద్రుఁడిట్లుపచింప, అపుడు 'నేను హరిణమును' అను నీ ప్రకారమగు ఆపూర్వపు బుద్ధివ్యవహారసమర్థమై యవ్వనమున నాకుద్భవించెను.

తతః ప్రభృతి సంపన్నస్తత్రావాన్తరకోణకే
హరిణోఽహం గిరివరే తృణదుర్వాఙ్కురాశనః. 22

అప్పటినుండియు నేన్రాశ్రేష్ఠమగు పర్వతముపై మందారవనమున నొకమూల తృణ, దూర్వ (గఱిక) అంకురాదులను భక్షించునట్టి హరిణము (లేడి) అయితిని.

తతః సీమాన్తసామన్తమాగతం మృగయార్థినమ్
దృష్ట్వాహమేకదా భీతః పలాయనపరోఽభవమ్. 23

అటుపిమ్మట నొకనాఁడు సరిహద్దుప్రాంతమందలి సామంతరాజు వేటకై యటకేతెంచ, నే నాతనినిజూచి భీతిల్లి పరుగిడ జొచ్చితిని.

తతస్తేన సమాక్రమ్య గృహం నీత్వా దినత్రయమ్
సంస్థాప్య తవ లీలార్థమిహానీతో రఘూద్వహ. 24

రఘుకులోత్తముఁడవగు నో రామచంద్రా! అపుడాతఁడు నన్నుబట్టుకొని తన గృహమునకు దీసికొనివచ్చి మూడుదినములటనుంచి, ఆ పిదప నీయొక్క క్రీడార్థమిచటికిఁ గొనివచ్చెను.

ఏషతే కథితః సర్వ ఆత్మోదన్తో మయానఘ
సంసారమాయాప్రతిమో నానాశ్చర్యరసాన్వితః. 25

పాపరహితుఁడవగు రామచంద్రా! ఈ ప్రకారముగ, జగత్ప్రసిద్ధమగు ఇంద్రజాలిక మాయవంటిదియు, పలువిధములగు ఆశ్చర్యములతోఁ గూడినదియునగు ఈ నావృత్తాంతమంతయును నీకు వచించితిని.

అవిద్యైవమనన్తేయం శాఖాప్రసరశాలినీ
ఆత్మజ్ఞానాదృతే నైవ కేనచిన్నామ శామ్యతి. 26

ఇట్లు, అనేకశాఖలయొక్క విస్తారములతోఁగూడినట్టి యీ అవిద్య యనంతమైనది. ఆత్మజ్ఞానముచేఁదప్ప యిది మఱిదేనిచేతనుగూడ శమింపనేరదు.

శ్రీ వాల్మీకి రువాచః—

యదా విపశ్చిదిత్యుక్త్వా తత్ర తూష్ణీం స్థితః క్షణాత్
సమవోచ తదా రామస్తమనిద్వమతి స్త్విదమ్. 27

శ్రీ వాల్మీకి:— ఓ భరద్వాజా! ఇట్లుపలికి విపశ్చిద్రాజచట క్షణకాలము మౌనము వహించియుండనంత శ్రేష్ఠమతియగు శ్రీ రామచంద్రుడిట్లు పలికెను.

**శ్రీరామ ఉవాచ:—**

ఏవం పశ్యత్యసంకల్పో యోఽన్య సంకల్ప ఆత్మని
మృగశ్చేద్దృశ్యతాం యాతః కథం సర్గే వద ప్రభో. 28

శ్రీరాముడు:— ప్రభూ! అన్యుని సంకల్పరూపమగు ఈ మృగమెపుడు మాకు దృష్టిగోచరమైనదో, అపుడు సంకల్పరహితుడైనను మనుజుడు, అన్యుని సంకల్పసృష్టియందున్న పదార్థములను గాంచునని సిద్ధించుచున్నది. అది యెట్లు తగును?

**విపశ్చిదువాచ:—**

మహాశవం యత్పతితం యస్మిఞ్జగతి భూతలే
తాం భువం పూర్వమిన్ద్రేణ యజ్ఞగర్వేణ: గచ్ఛతా. 29
పాదేనాభిహతో వ్యోమ్ని దుర్వాసా ధ్యానసంస్థితః
గతాసురిత్యవిజ్ఞానా త్తేనాసౌ కుపితోఽశపత్. 30
శక్రశక్రావనితలం బ్రహ్మాణ్డప్రతిమం శవమ్
అచిరేణ మహాఘోరం తవ చూర్ణీకరిష్యతి. 31
మామిమం శవబుద్ధ్యా త్వం యదతిక్రాన్తవానతః
శాపేన మమతాం పృథ్వీం శీఘ్రమాసాదయిష్యసి. 32

విపశ్చిత్తు:— ఓ రామచంద్రా! ఏ జగత్తునందు భూతలముపై, ఆ మహాశవముపడెనో, ఆ భూతలమునుగూర్చి పూర్వమింద్రుడు యజ్ఞయజమానత్వ గర్వముతోగూడి జనుచుండ, అప్డాకాశమున ధ్యానమందుండియున్నట్టి దుర్వాసమునిని, 'ఈతడెవడో మృతుడని తలంచి తెలియక పాదముతోటి తన్నగా, అంత నా మహర్షి 'ఓ యింద్రుడా! ఏ భూతలమునుగూర్చి పోవుటకు నీవిష్టపడుచున్నావో, దానిని శీఘ్రముగ బ్రహ్మాండసదృశమగు మహాభయంకరమైన శవము చూర్ణముచేసివేయును. ఈ నన్ను శవమనియెంచి పాదముతోటి తన్నితివిగనుక నా శాపముచే నట్టి చూర్ణీభూతమగు పృథివినే శీఘ్రముగ నీవు పొందుదువుగాక! అని శపించెను.

మృగార్థం తేన మునినా తథా దేవేతి సద్యథా
తత్తయా కథయా యాతం తద్దైవ విషయం దృశామ్. 33

మఱియు విపశ్చిత్తుతోగూడ నీవున్ను ఏకకాలముననే మృగరూపమును బొందుదువుగాక యనియు, మృగరూపము విపశ్చిత్తుయొక్క మనస్సంకల్పితమైన దైనప్పటికిని, ఇతరులకుగూడ గానుపించుచు, అర్థక్రియా సమర్థమగుగాక యనియుగూడ ఆ ముని శపించెను. కావున, ఆయింద్ర శాపప్రసంగమువలన ఆ ముని వాక్యబలముచే (అన్యుని) సంకల్పరూపమైనను విపశ్చిత్తుయొక్క మృగత్వము మీ కందఱికిని సత్యరూపముగ దృష్టికి గోచరమయ్యెను.

వస్తుతస్తు న చైకం సన్న ద్వితీయం న చాప్యసత్
సా తథా ప్రతిభోదేతి కిం సత్కిమథవాప్యసత్. 34

వాస్తవముగ (తత్త్వవిచారమున) వ్యావహారిక జగత్తు సత్తుకాదు, సాంకల్పిక జగత్తు, అసత్తున్నుగాదు. ఆ యుభయరూపములకు లోటి చిత్ప్రకాశమే యుదయించుచున్నది. కావున నిఁక సత్తేమి, అసత్తేమి?

అన్యచ్చ రాఘవేమాం తాం యుక్తిం త్వమపరాం శృణు
ఏతస్మిన్నయసంచర్భే సుస్ఫుటప్రతిపత్తయే. 35

మఱియు, ఓ రాఘవా! ఈ యుక్తుల సందర్భమున స్పష్టబోధకొఱకై యీ మఱియొక యుక్తినిగూడ వినుము.

యస్మిన్సర్వం యతః సర్వం యత్సర్వం సర్వతశ్చ యత్
బ్రహ్మ తస్మిన్మహాభాగ కిం న సంభవతీహ హి. 36

మహాభాగ్యశీలుఁడవగు రామచంద్రా! దేనియందు సమస్తమున్నుగలదో, దేనినుండి సమస్త ముద్భవించుచున్నదో, ఏది సర్వరూపమై వెలయుచున్నదో, ఏది సర్వత్ర వ్యాప్తమైయున్నదో, అట్టి సర్వశక్తియుతమగు బ్రహ్మమున నిట నేది సంభవింపదు?

సంకల్పజాతం నాన్యోన్యం మిలతీత్యుపపద్యతే
సంకల్పజాతమన్యోన్యం మిలతీత్యుపపద్యతే. 37

సంకల్పజనితములగు పదార్థములు పరస్పరము కలియును, కలియకుండును, అను నీ రెండు విధములుకూడ సర్వశక్తిమంతమగు బ్రహ్మమందు తగియేయున్నవి.

సంకల్పజాతమన్యోన్యం మిలతీత్యవగమ్యతే
సర్వాత్మని హి యత్రైవ చ్ఛాయా తత్రైవ చాతపః. 38

సర్వాత్మరూపమగు బ్రహ్మమున సంకల్పజనితములగు పదార్థములు పరస్పరము కలియునను విషయ మీ మృగదర్శనాదులందుఁ బ్రత్యక్షముగ దెలియుచున్నది. ఎచట ఛాయ గలదో, అచట తద్విరుద్ధమగు ఆతపము (ఎండ) కూడ కలదుగదా!

న సంభవతి చేత్తత్తత్కథం సర్వాత్మతామియాత్
కస్మాత్సంకల్పనగరం న మిథః శ్లిష్యతీతి సత్. 39

పరస్పర విరుద్ధములైనవి యొకచోట సంభవింపనిచో నిఁక పరబ్రహ్మము సర్వాత్మ రూపమెట్లగును? మఱియు సంకల్పనగరములు పరస్పరము కలియవను విషయమున్ను, ఏల సత్యముకాదు?

మిథశ్చ శ్లిష్యతీత్యేవమపి సత్సర్వరూపిణి
న తదస్తి న యత్సత్యం న తదస్తి న యన్మృషా. 40

అట్లే సంకల్పజనిత వస్తువులు పరస్పరము కలియునను విషయమున్ను సత్యమైనదే. ఏలయనిన సద్రూపమున్ను, సర్వస్వరూపమున్ను నగు పరమాత్మయందు సత్యముకానిదిగాని, మిథ్యకానిదిగాని యగు పదార్థమెద్దియును లేదు.

సర్వత్ర సర్వథా సర్వం సర్వదా సర్వరూపిణీ
అహో ను విషమా మాయా మనోమోహవిధాయినీ. 41

అహా! సర్వత్ర, సర్వదా సర్వవిధముల, సర్వరూపమైనట్టి పరబ్రహ్మమందలి యీ అఘటిత ఘటనాసమర్థమగు మాయ అతి భయంకరమైనదియు మనస్సును మోహపెట్టునదియునైయున్నది.

విధయః ప్రతిషేధాశ్చ యదేకత్ర స్థితిం గతాః
ఈదృశీ బ్రహ్మసత్తైషా యదేవాత్మానమాత్మనా. 42

విధి నిషేధములున్ను నొకేచోట స్థితిఁబొందియున్నవి. బ్రహ్మసత్తయొక్క మాహాత్మ్యమిట్టిదేయైయున్నది! ఇప్పుడది తనచే తన్నే యనేకరూపముల సృజించుకొనుచున్నది.

తయా అనాదిః సాదిశ్చేత్యవిద్యేత్యనుభూయతే
న జ్ఞప్తిమాత్రకచనం యది స్యాద్భువనత్రయమ్. 43

తన్మహాకల్పనష్టానాం సృష్టిః స్యాత్కథమఞ్జసా
కథమగ్నేః కథం వాయోః సత్తా భూమేః కథం భవేత్. 44

ఆ బ్రహ్మసత్తచేతనే యీ అవిద్య అనాదిగను, (జ్ఞానముచే నశించుటఁబట్టి) సాది (ఆదిగలది)గను — ఇట్లు ఉభయరూపముల ననుభూతమగుచున్నది. మఱియు ఈ త్రైలోక్యము జ్ఞప్తి (చైతన్య) మాత్రముయొక్క స్ఫురణము కానిచో, మహాకల్పమున నశించినట్టి యీ పదార్థముల యొక్క సృష్టి మరల శీఘ్రముగ (ప్రయాసములేకయే) నెట్లు సంభవించును? అగ్నియొక్కయు వాయువుయొక్కయు, భూమియొక్కయు సత్త మరల యెట్లు సంభవమగును.

తస్మాత్స్వభావకచనమాత్రాన్నాన్యద్గతే జగత్
శాస్త్రాణ్యనుభవాలోకా ఆమహాకల్పవాదినామ్. 45
యేషాం ప్రమాణం నో సర్వం ప్రవశస్తైస్తైరలం సతామ్

కాఁబట్టి చిత్స్వభావముయొక్క స్ఫురణమాత్రముకన్న భిన్నముగ ఈ జగత్తు ఒకింతైనను లేదు. వేదాంతాది శాస్త్రములు మహాకల్పము మొదలుకొని గల విజ్ఞుల యనుభవములు, లోకప్రసిద్ధ దృష్టాంతములు మున్నగునవి యన్నియు నెవరికి ప్రమాణములుకావో, అట్టి నింద్యులగు మూర్ఖులతోటి సజ్జనులకేమియు పనిలేదు.

జ్ఞప్తిదృష్టానయా సర్వం ప్రమాణీ భవతి క్షణాత్. 46
నాన్యయా తనుతే నైవమేవ సారం విదుర్బుధాః

ఇట్టి చైతన్యదృష్టిచే సమస్తమున్ను క్షణకాలములో, ప్రమాణీభూత (సారయుక్త) మగుచున్నది. తదితరమగు దృష్టిచే నిస్సారమగుచున్నది. కావున విజ్ఞులీ జ్ఞానదృష్టినే సారభూతముగ నెఱిఁగిరి.

శుద్ధా జ్ఞప్తిర్బ్రహ్మసత్తా త్వవిద్యాస్మీతి చేతనాత్. 47
స్ఫురతీయం జగద్రూపా వాతశ్రీః స్పన్దనాదివ

శుద్ధజ్ఞానరూపమగు బ్రహ్మసత్తయే 'నేను అవిద్యను,' అను భావనచే చలనముచే వాయువువలె — ఈ జగద్రూపముగ స్ఫురించుచున్నది.

న కశ్చినేహ మ్రియతే జాయతే న చ కశ్చన. 48
స్ఫురతోఽహమిదమస్తీతి ప్రతిభైవ చిదాత్మికా

ఇక్కారణమున వాస్తవముగ ఈ ప్రపంచమున నెవడును మరణించుటలేదు, జన్మించుటలేదు. 'నేను మరణించితిని' అను నివ్విధముగ చిద్రూపముయొక్క ప్రకాశమే యుదయించుచున్నది.

మృతిరత్యన్తనాశశ్చేత్తత్స్వా నిద్రా సుఖోపమా. 49
పునర్దృశ్యోపలమ్భశ్చేన్నను జీవితమేవ తత్

దృశ్యముయొక్క అత్యంతనాశము మరణమనినచో, ఆ నిద్ర సుషుప్తిసుఖమువంటిదే యగును. మరల దృశ్యము ప్రాప్తించుచో, అది జీవితమేయగును.

తస్మాన్నేహాస్తి మరణం తన్నైవేహాస్తి జీవితమ్. 50

కస్మింశ్చిన్మాత్రకచనే ద్వయం వాప్యస్తి నైవ వా
చేతితం ద్వయమప్యస్తి నాస్తి ద్వయమచేతితమ్. 51

కావున నిట వాస్తవముగ మరణముగాని, జీవితముగాని లేకయేయున్నవి. ఒకే చిన్మాత్రమున ఆ రెండును గలవు, లేవుకూడను. దృశ్యరూపముగ ప్రకాశితమైనచో కలవు. లేనిచో లేవు.

చేతితం చైకమేవాస్తి స్వన్యన న్తమతశ్చితః
చిన్మాత్రవ్యతిరేకేణ కిం నామ వద జీవనమ్. 52

ఓ రామచంద్రా ! ఎద్దానియందు ద్వైత, అద్వైతములయొక్క స్ఫురణమగునో, అట్టి చైతన్యము ఏకమేయైయున్నది కావున సర్వసాక్షియగు ఆ చైతన్యము సదా అనంతమై, క్షేమస్వరూపమై వెలయుచున్నది. అట్టి చిన్మాత్రముకంటె నన్యముగ నిక జీవితమేమియో చెప్పుము ?

అదుఃఖమక్షయత్వాత్తదతో దుఃఖం క్వ కస్యచిత్
వాచ్యం సవాచకం సర్వం యత్ర చిద్వ్యోమమాత్రకమ్. 53

ఆ చైతన్యము దుఃఖరహితమై, అక్షయమై యొప్పుచున్నది. కావున నిక నెవని కెచట దుఃఖము కలదు ? తత్త్వదృష్టియందు వాచ్య(రూప), వాచక(నామ) సహితమగు సమస్తమున్ను చిదాకాశమాత్రమే యైయున్నది.

తదన్యత్తదనన్యచ్చ కేతే తత్ర కతాద్వితే
ఆవర్తాది యథా తోయే శరీరాది తథా పరే. 54

ఆ చైతన్యమున నద్దానికి అన్యమైనదిగాని, అన్యముకానిదిగాని, ద్వైతముగాని, ఏకత్వముగాని యేమిక లదు? జలమందావర్తము లెట్లుగలవో, అట్లే యా పరబ్రహ్మమందీశరీరాదులున్ను గలవు.

తత్పృత్రాసంనివేశాత్మకారజానన్యథాత్మ చ
చిద్ధ్యానమాత్రమవ్యగ్రం ఖమేవాప్రతిఘం జగత్. 55

కారణసత్తకంటె వేఱుగాకుండుటవలన జగద్రూపము చిదాకాశమాత్రమే యైయున్నది. మఱియు ఈ జగత్తు చైతన్యముయొక్క ప్రకాశమాత్రమై శాంతరూపమై, నాశరహితమై వెలయుచున్నది.

ఆశ్చర్యం సుఘనం వ్యగ్ర ప్రవ్య స్వప్రతిమం స్థితమ్
తథేతే భూతిభూర్భాన్తి వర్తమానానుభూతి భూః. 56

వాస్తవముగ నిరాకారమైయున్నను, ఈ జగత్పదార్థము సాకారముగను, అశాంతముగను, నాశవంతముగను భాసించుట ఆశ్చర్యమగుచున్నది. (పరమార్థమున) పూర్వకాలమందీ ప్రపంచమెట్లనుభవమునకు విషయముకాకయుండెనో, అట్లే వర్తమాన కాలమందును విషయము కాకయే యున్నదగును.

తత్ర భ్రాన్త్యా పిశాచోఽయం భాతి భాత్మేతి బుధ్యతామ్
తథైతత్ఖం తథైతత్థమేతత్థమితి ఖం స్థితమ్. 57

ఓ రామచంద్రా! భ్రాంతిచే వర్తమానకాలముయొక్క యనుభవమందు (పదార్థ) శూన్యమగు చిదాకాశమే యిట్లు దృశ్యపిశాచ రూపమునుధరించి భాసించుచున్నదని యెఱుగుము. మఱియు, ఈ యనుభూతమగు భూతాకాశమెట్లుగలదో, అట్లే చిదాకాశమున్నుగలదు. ఏలయనిన చిదాకాశమే యీ భూతాకాశరూపమున శూన్యముగ స్థితినొందియున్నది.

తథేతో భూరితో భూతమితోఽన్యదితి ఖం పరమ్
యైవ చిద్భా జగత్త్వైవ నైకతాత్ర న చ ద్వితా. 58

ఈ చిదాకాశమే యూర్ధ్వమున నాకాశరూపముగను, అధోభాగమున, పృథివీ రూపముగను తదితరప్రదేశములందు వాయు అగ్ని, జలరూపములుగను, దిక్కులుగను, వృక్షాదిరూపములుగను, ఇట్లనేకాకారములుగ నుండియున్నది. ఏలయనగా, ఏది చిత్ప్రకాశమో, అదియే జగత్తైయున్నది. ఇట ఏకత్వముగాని, ద్వైతముగాని లేదు.

న చ ప్రతిఘతా కాచిన్న చాప్రతిఘరూపతా
సర్వమప్రతిఘం దృశ్యం యథా భూతార్థదర్శినః. 59

తత్త్వవేత్తయొక్క దృష్టియందిట సాకారత్వముగాని, నిరాకారత్వముగాని యెద్దియును లేదు. దృశ్యమంతయు నాశరహితమగు చిదాకాశమేయైయున్నది.

తత్ జ్ఞతాతత్ జ్ఞతే చేహ న సతీ నాప్యసత్ స్థితీ
సత్యే సదసతే చైకం కాష్ఠమౌనమతోఽఖిలమ్. 60

పూర్ణదృష్టియందిచట జ్ఞాన, అజ్ఞాన, సత్, అసత్తుల భేదమేమియును లేదు. సత్యస్వరూపమగు చిద్రూపాత్మయందు సదసత్తులు రెండును సమానమేయైయున్నవి. కాబట్టి యంతయు 'కాష్ఠ మౌనము' వంటి చిద్రూపపరబ్రహ్మమేయగును.

యద్దృశ్యం బ్రహ్మతాన స్తం తదేవ పరమం పదమ్
ఇదం సర్వం పరం బ్రహ్మమాత్రమిత్యేవ సంస్థితమ్ 61

ఈ దృశ్యమెద్దిగలదో, అది యనంతమగు బ్రహ్మమేయైయున్నది. అదియే పరమపదమున్ను నగును. ఈ సమస్త దృశ్యరూపముతోటి బ్రహ్మమాత్రను స్థితిగల్గియున్నది.

ఏవం నామైష చిద్ధాతుః కచత్యేవం యదాత్మని
యస్యేదం కచనం వ్యోమ్నో రూపమప్రతిఘం జగత్. 62

ఈ ప్రకారముగ ఆ చైతన్యము తనయందిట్లు జగద్రూపముగ స్ఫురించుచున్నది. ఆ చిదాకాశముయొక్క స్ఫురణమే (అధిష్ఠానదృష్టిచే) నాశరహితస్వరూపమగు జగత్తైయున్నది.

సర్గాద్యా మృతజీవానాం సర్వత్రైవాణు లేణులే
అసంఖ్యాః సన్త్యసంఖ్యానామదృశ్యాప్రతిఘామిథః. 63

అసంఖ్యలగు మృతజీవులకున్ను ప్రతిఅంగుళమందును సర్వత్ర అసంఖ్యాతములగు సృష్టులు గలవు. అవిపరస్పరము అదృశ్యములై, నాశరహితములై యున్నవి.

అన్యోన్యం సిద్ధలోకాస్తే స్వయం యత్ర ప్రాప్య సంగతాః
పరస్పరం న పశ్యన్తి మిథః ప్రోతా అపి స్థితాః. 64

పరస్పరము ఉత్తరోత్తర సూక్ష్మతరములైనట్టి సిద్ధలోకములు తమస్వరూపమును బొందినవై బ్రహ్మమందుఁ గూడియున్నవి. అయ్యవి పరస్పరము ఓతప్రోతములై యున్నప్పటికిని, ఒకదానినొకటి గాంచఁజాలకనే యున్నవి.

భవత్యాకాశ ఏవైషా దృశ్యశ్రీర్గగనాత్మికా
అనన్యదృష్టా చిద్రూపా స్వప్నవత్స్వాత్మద్రష్టృకా. 65

వాస్తవముగ ఈ దృశ్యము ఆత్మరూపమగు చిదాకాశమేయైయున్నది. గావున స్వప్నమందువలె స్వాత్మకంటె వేఱైనట్టి ద్రష్టృత్వమున్ను నిట లేకయేయున్నది.

ఏషా హి సంపరిజ్ఞాతా తిష్ఠత్యపి యథా స్థితమ్
భామాత్రరూపనిర్వాణా నిశాన్తా ప్రతిభాకృతిః. 66

ఈ దృశ్యము చిదాకాశరూపముగ నెఱుఁగఁబడినచో అట్లే యథారీతి చిదాకాశముగనే వెలయుచుండును. అట్లు పరమార్థమున నియ్యది ప్రకాశమాత్రస్వరూపమై, నిర్వాణరూపమైనప్పటికిని, మేల్కొననివానికి, ప్రాతఃకాలమందును నంధకారము గోచరించునట్లు, అజ్ఞానముచే దృశ్యరూపముగనే కానుపించుచున్నది.

శాన్తాశేషవిశేషాత్మ యథా స్థిత మవస్థితమ్
సదసద్వా జగజ్జాలం పరిజ్ఞానేన శామ్యతి. 67

జ్ఞానముచే ఈ జగత్తు యథారీతి అధిష్ఠాన చిద్రూపముగ వర్తింపఁగా నపుడయ్యది శమించిన సమస్తవిశేషములు గలదగుటచే సత్తైనను, అసత్తైనను, ఏ హానియులేదు, ఏలయనిన, ఆత్మజ్ఞానముచే ఈ (నామరూపాత్మక) జగజ్జాలమంతయు శమించిపోవుచున్నది.

యథాబ్ధిజలబిన్దూనాం క్షణవిశ్లేషసంగమమ్
చిదణూనాం తథా బ్రహ్మ వారిధౌ స్ఫురతాం మిథః. 68

సముద్ర జలబిందువులు క్షణకాలము వియోగము నొందుచు, మరల క్షణకాలము కలియుచు నుండునట్లు చిద్రూపబ్రహ్మము సముద్రమందు స్ఫురించుజీవులున్ను అజ్ఞానముండు నంతవఱకు పరస్పరము సంయోగ, వియోగములను పొందుచునుందురు.

స్వప్నవద్భాతి సర్గశ్రీః సర్గాదౌ చిన్నభోమయీ
అతః సర్వమిదం బ్రహ్మ శాన్తమిత్యుపపద్యతే 69

చిదాకాశమయమగు ఈ సృష్టి సృష్ట్యాదియందు స్వప్నమువలె భాసించుచున్నది. కాబట్టి యీ సమస్తమున్ను శాంతమగు బ్రహ్మమేయనుట తగుచున్నది.

దృష్టాన్యనన్తవిభవాని మయా జగన్తి
భుక్తాని కార్యపరిణామవిజృమ్భితాని
భ్రాన్తా దిశో దశ బహూని యుగాని యావత్
జ్ఞానాదృతే క్షయముపైతి న దృశ్యదోషః. 70

ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే ఉత్తరార్ధే అవి॥ విప॥ శవో॥ విపశ్చిత్సంసారభ్రమవర్ణనం నామైకోనషష్ట్యధికశతతమః సర్గః ॥ 159 ॥

ఓ రామచంద్రా! అనంతవైభవములతోఁ గూడిన జగత్తులను నేను జూచితిని. నిజ కర్మలయొక్క పరిణామముచే విజృంభించినట్టి అనేక సుఖదుఃఖరూప ఫలముల ననుభవించితిని; అనేక యుగములవఱకు దిక్కులందంతట సంచరించితిని; కాని జ్ఞానముచేఁదప్ప ఈ దృశ్య — దోషము మఱిదేనిచేతను గూడ శమింపకయున్నది.

ఇది శ్రీవాసిష్ఠతాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున నుత్తరార్ధమున అవి॥ విప॥ శవో॥ విపశ్చిత్సంసారభ్రమ వర్ణనమను నూట యేబది తొమ్మిదవ సర్గము ॥ 159 ॥

---

## షష్ట్యధికశతతమః సర్గః

[ఇహ సాయం సభోత్థానం పరేద్యుః పునరాగమః
భాసస్య జీవన్ముక్తత్వమవిద్యా చోపవర్ణ్యతే.

సాయంకాలమున సభవిరమింపఁబడినదై మరల మఱుసటిదినము ప్రాతఃకాలమున ప్రారంభింపఁబడుట, భాసుని అవిద్య, జీవన్ముక్తి వర్ణింపఁబ్డుట యిచటఁ గాననగును.]

**శ్రీ వాల్మీకి రువాచ:—**

విపశ్చితి వదత్యేవం తద్వృత్తాన్తమవేక్షితుమ్
ఇవ లోకాన్తరం భానుః పాహైర్ధారాయుతైర్యయౌ.

శ్రీ వాల్మీకి :— ఓ భరద్వాజా! ఈ ప్రకారముగ విపశ్చిత్తెపుడు చెప్పుచుండెనో అపుడా వృత్తాంతమును ప్రత్యక్షముగఁ జూచుటకాయ ఘనట్లు సూర్యభగవానుఁడు తన దీర్ఘ కిరణములను పాదములతోటి లోకాంతరమునకుఁ జనెను

ఉదభూత్పూరయన్నాశా దిన పర్యన్తదున్దుభిః
తుష్టాభిరివ నిర్ముక్తో దిగ్భిర్జయ జయారవః. 2

కథార్థముచే సంతుష్టములైన దిక్కులచేఁ గావింపఁబడిన జయ జయ ధ్వనులవలె నపుడు దివసముయొక్క యంతమును సూచించు దుందుభులు దిక్కులను బూరించుచు మ్రోగసాగెను.

విపశ్చితే దశరథో గృహదార ధనాదికమ్
రాజ్యానురూపం విభవం ప్రోత్తస్థౌ కల్పయన్క్రమాత్. 3

దశరథుఁడంత విపచ్చిత్తునకు గృహ, ధన, వనితాదులను రాజ్యమున కనురూపమగు ఐశ్వర్యమును నొసంగుచు క్రమముగ లేచెను.

రాజరామవసిష్ఠాద్యా మిథః కృత్వా విసర్జనమ్
యథాక్రమం పూజనం చ ప్రయయుః స్వాస్పదాని తే. 4

అపుడు దశరథమహారాజు, శ్రీరామచంద్రుఁడు, వసిష్ఠమునీంద్రుఁడు మున్నగువారు యథాయోగ్యమగు ఆదరసత్కారముతోటి పరస్పర మొకరినొకరు వీడి వారి వారి గృహముల కేగిరి.

స్నాత్వా భుక్త్వా నిశాం నీత్వా ప్రభాతే పునరాయయుః
తేనైవ సంనివేశేన సా సభా సంస్థితాఽభవత్. 5

పిమ్మట సభ్యులెల్లరు స్నాన, సంధ్యాదులను నిర్వర్తించుకొని, భోజనముచేసి, ఆ రాత్రి గడపి మరల ప్రాతఃకాలమున స్నానసంధ్యాద్యనంతరమటకుఁ గ్రిందటిదినమువలెనే విచ్చేసిరి.

క్రమాన్మునిరువాచాథ తాం యథా ప్రస్తుతాం కథామ్
శశీవామృతమాహ్లాదముద్గిరన్ముఖదీప్తిభిః. 6

అనంతరము క్రమముగ వసిష్ఠమునీంద్రుడు, చంద్రుఁడమృతమును వెళ్ళగ్రక్కునట్లు తన ముఖకాంతులచే నానందము గొల్పునట్టి వచనములను వెళ్ళగ్రక్కుచు ప్రస్తుత ప్రసంగము ననుసరించి యిట్లు వచింపఁదొడఁగెను.

రాజన్నేయమవిద్యేయమసత్యేవ సతీ స్థితా
నేదృశేనాపి యత్నేన నిర్ణీతైషా విపశ్చితా. 7

ఓ దశరథ మహారాజా! సత్యమైనదివలెనున్నట్టి ఈ యసత్యమగు అవిద్యయొక్క యంతమును ఈ ప్రకారములగు ప్రయత్నములచేఁగూడ విపశ్చిత్తు నిర్ణయింపఁజాలకుండెను.

అవిద్యైవమవిజ్ఞాతా చిరానన్తావభాసతే
పరిజ్ఞాతా తు నాస్త్యేవ మృగతృష్ణానదీ యథా. 8

ఈ అవిద్య యెఱుఁగఁబడనిచో దేశకాలములచే అనంతముగ భాసించును. ఎఱుఁగఁబడినచో మృగతృష్ణానదివలె లేనిదేయగును.

మన్త్రిణస్తే మహాబుద్ధే భాసస్యాన్య విపశ్చితః
ఇతివృత్తం త్వమిత్యస్య స్వయమేవ హి దృష్టవాన్. 9

మహాబుద్ధివగు నో రాజా ! భాసుఁడను పేరుగల యీ విపశ్చిత్తుయొక్క యీ మంత్రులు మీరు గాంచిన యీ విషయమును స్వయముగనే వీక్షించిరి.

సదృశోఽయమితస్త్వాభిః కథాభిర్జ్ఞాతతత్త్వదః
అవిద్యాయాం ప్రశాన్తాయాం జీవన్ముక్తో భవిష్యతి. 10

ఇఁక నిపుడిట్టి యుత్తమకథలద్వారా ఆత్మతత్త్వము నెఱిఁగి అవిద్య శమింప మీ వలెనే యీ విపశ్చిత్తున్ను జీవన్ముక్తుఁడు కాఁగలఁడు.

అవిద్యేతి ధృతా సంవిద్బ్రహ్మణాత్మని సత్తయా
తద్భ్రమేణాసదప్యస్యాః సద్రూపమివ లక్ష్యతే. 11

బ్రహ్మము తనయందవిద్యయను సంవిత్తును ధరించిన కారణముచే, భ్రమచే అసత్తగు ఈ అవిద్యయొక్క రూపము సత్తువలె గోచరించుచున్నది.

యదా బ్రహ్మాత్మికైవేయమవిద్యా నేతరాత్మికా
తదాస్త్యేషాఽపరిజ్ఞాతా పరిజ్ఞాతా న విద్యతే. 12

ఈ అవిద్య బ్రహ్మస్వరూపమేగాని, ఇతర స్వరూపముకాదని యెఱుఁగఁబడ నంత వఱకును ఇది భిన్నసత్తగలిగి వర్తించుచునేయుండును. ఎఱుఁగఁబడినపిదప బ్రహ్మముకంటె భిన్నముగ భాసింపకుండును.

అవిద్యైవమనన్తేయం నానాప్రసవశాలినీ
జడా హృద్యా రసమయీ మోహమాధవమఞ్జరీ. 13

ఈ 'అవిద్య' అనంతమైనదియు, వివిధశాఖాసమూహముల నుత్పన్న మొనర్చునదియు, జడమైనదియు, మనోహరమై యొప్పునదియు, ఆసక్తియనురసముచేఁ బూర్ణమైనదియు, మోహమను వసంతకాలమున వికసించునదియునై లతవలె శోభించుచున్నది.

అన్తఃశూన్యా గ్రన్థిమతీ శ్లక్ష్ణా స్వఙ్కురకణ్టకా
జడా రసమయీ దీర్ఘా లతేవ వనవైణవీ. 14

మఱియు, ఈ అవిద్య, అభ్యంతరమున శూన్యమైనదియు, గ్రంథియుక్తమైనదియు, పైకి జూచుటకు నునుపుగా నుండునదియు, కాని కంటకసహితములగు అంకురములతోఁ గూడినదియు, జడమైనదియు, రస (ఆసక్తి) పూర్ణమైయొప్పునదియు, దీర్ఘమైనదియు నగు వనమందలి వేణు (వెదురు) లతను బోలియున్నది.

ఫలాశఙ్కా ముధైవాతినిష్ఫలా చిత్తహారిణీ
అకాలపుష్పమాలేవ శ్రేయసా నాభినన్దితా. 15

మిగుల నిష్ఫలమైనను వ్యర్థముగ ఫలమునుగూర్చిన సందేహమును గలుగఁజేయునదియు, చిత్తమును హరించునదియునగు అకాలమందలి పుష్పమాలవలె ఈ అవిద్య తత్త్వజ్ఞులచేఁ బ్రశంసింపఁబడకున్నది.

న కించిద్రూపిణీ పీనా నానా భువన పూరిణీ
భూతాకులా నిరాలోకా సుదీర్ఘేవ తమోమయీ. 16

రూపరహితమైనను మిగుల స్థూలమైనదియు, అనేక బ్రహ్మాండములను బూరించునదియు ప్రాణులచే వ్యాప్తమైనదియు, ప్రకాశ (జ్ఞాన)రహితమైనదియు, అతిదీర్ఘమైనదియునగు ఈ అవిద్య అంధకారమయమగు రాత్రివంటిదే యగును.

కేశోణ్డ్రకభ్రాన్తిరివవిచిత్రగ్రన్థివేష్టనా
మిథ్యైవ దృశ్యమానా ఖేఽదృశ్యమానా న కించన. 17

విచిత్రగ్రంథిమయమగు ఆవరణముతోఁ గూడియున్నట్టి యీ అవిద్య, అవస్తువైనను, ఆకాశమందలి కేశాదుల భ్రాంతివలె, మిథ్యగనే చిదాకాశమున భాసించుచున్నది.

విచిత్రవర్ణా విగుణా శూన్యే చ వితతాకృతిః
జడస్పన్దోత్పాతమయీ శక్రచాపలతేవ ఖే. 18

మఱియు ఈ అవిద్య విచిత్రవర్ణయుక్తమైనదియు, గుణరహితమైనదియు, శూన్యమున విశాలాకారమును ధరించినదియు, జడ (జల)స్పందముచే ననేక కీడులను గలిగించునదియునగు ఆకాశమందలి యింద్రధనుస్సును బోలియున్నది.

జడ కల్లోల బహులా కలుషోల్లాస ఫేనిలా
చక్రావర్తాక్షయమయీ ప్రావృషీవ తరఙ్గిణీ. 19

ఇంకను, ఈ అవిద్య జడ (జల) తరంగములచేఁ బూర్ణమై, మలినవిలాసమను నురుఁగుతోఁ గూడినదై, ఉత్పత్తిక్షయములను చక్రావర్తములు గల్గియున్నట్టి వర్షాకాలపు నదివలె నొప్పుచున్నది.

అనారతవహచ్ఛూన్య జగన్మృగనదీశతా
రజోరాశిమయీ రూక్షా శవభూరివ దుర్భగా. 20

మఱియు, ఈ అవిద్య, నిరంతరము ప్రవహించు శూన్యములైన జగత్తులను అనేక మృగతృష్ణానదులు గలదియు, ధూళి (రజోగుణ) రాశిచేఁ బూర్ణమైనదియునగు కర్కశమైన శ్మశానభూమివలె అశుభమై వెలయుచున్నది.

అన్తం ప్రాప్నోతి న యథా చిరం స్వప్నపురే చరన్
జాగ్రదాఖ్యే స్వప్నపురే తథైవాస్మింశ్చిరం చరన్.

స్వప్నపురమున జిరకాలము సంచరించినప్పటికిని మనుజుఁ డద్దాని యంతము నెట్లు పొందజాలఁడో అట్లె యీ జాగ్రత్తను స్వప్నపురమున చిరకాలము సంచరించినప్పటికిని దీని యంతమును బొందఁజాలఁడు.

యాని సంకల్పజాలాని ప్రతిష్ఠామాగతాన్యలమ్
త్యక్తైతద్దృశ్యజాలస్థదేహానాం దృఢచేతసామ్. 22

దృశ్యప్రపంచమునం దున్న దేహములను మరణకాలమునఁ ద్యజించునట్టి జీవుల కట్టి మరణసమయమున ఈ జగదాకారముగ నుండు దృఢచిత్తమందు దృఢీభూతములగు ఏ దృఢసంకల్ప సమూహములు గలవో, అవియే యీ సిద్ధదేహాది రూపములుగ లెస్సగ బ్రతిష్ఠను బొందియున్నవి.

స్థితాని తాని చిద్వ్యోమ కోశరత్నాన్యసంకటమ్
విమానపుర భూమ్యాదిరూపేణేత్థం స్థితాత్మనా. 23

మనస్సుయొక్క సంకల్పములై చిదాకాశమను కోశమందు రత్నములవలెనున్న యీ విమాననగర, భూమ్యాదిరూపములతోటి యిట్లు స్థితి నొందియున్నవి.

తాన్యేవ సిద్ధసద్మాని వ్యోమ్ని భాన్తి పరస్పరమ్
అదృష్టాన్యప్యసంఖ్యాని సూపలబ్ధాన్యసన్త్యపి. 24

మఱియు, ఆ మనస్సంకల్పములైన అసంఖ్యాతములును కానుపింపకయున్నను విద్యమానములైయే యున్నవియు, గాంచఁబడినప్పటికిని వాస్తవముగ లేకయేయున్నవియునగు సిద్ధలోకముల రూపమున అకాశమునఁ బరస్పరము భాసించుచున్నవి.

సువర్ణమణిమాణిక్యముక్తావనిమయాని చ
భక్ష్యభోజ్యాన్నపానాఢ్యరసాయనసరాంసి చ. 25

మధుమద్యదధిక్షీరఘృతకుల్యాకులాని చ
రసాయనమయాకారవనితావలితాని చ. 26

సర్వర్తుపుష్పఫలపల్లవపూర్ణవన్తి లీలావిలోలలలనాకులితాలయాని
సంకల్పమాత్రరచనేన చ సిద్ధకాలం సంపన్నసర్వవిభవోత్కరసంకులాని. 27

సహస్రచన్ద్రబిమ్బాని శతసూర్యాణి కానిచిత్
సువర్ణాభ్రవిశేషాభ్రమయభూతాని కానిచిత్. 28

స్వచ్ఛాతపః ప్రకాశాని నిత్యానన్దమయాని చ
కానిచిన్నిమ్నహీనాని తనుతూలలఘూని చ. 29

క్షణోత్పత్తివినాశాని కానిచిత్కలనావశాత్
అనన్తస్వప్నపానాని నిర్జరామరణాని చ. 30

విచిత్రసంనివేశాని విచిత్రవిభవాని చ
సర్వర్తుగుణరమ్యాణి సర్వకామమయాని చ. 31

ఆ సిద్ధలోకములు సువర్ణ మణి, మాణిక్య, ముక్తామయమైన భూమిచేఁ బరిపూర్ణములైనవియు, భక్ష్య, భోజ్య, అన్న, పానాదులచేఁ బూర్ణములై, అమృతరసస్రవంతులతోఁ గూడినవియు, మధు, మద్య, దధి (పెరుఁగు), ఘృతాదులచేఁ బూర్ణము లగు వాపికలచే శోభించునవియు, చంద్రబింబమువంటి యాకారముగల స్త్రీలు గల్గియున్నవియు, సమస్త ఋతువులందును సర్వవిధ పుష్ప, ఫల, పల్లవయుక్తములగు నదీప్రవాహములతోఁ గూడియున్నవియు, పలువిధ లీలలచేఁ జంచలలగు వనితలచేఁ బూర్ణములైనట్టి గృహములు గలవియు, సంకల్పమాత్రముచే బ్రార్థించునట్టి సమస్తైశ్వర్య సమూహములచే వ్యాప్తములైనవియునై వెలయుచున్నవి. మఱియు కొన్ని సిద్ధలోకములనేక సూర్య, చంద్రబింబములవలెఁ బ్రకాశమానములైనవియు, మఱికొన్ని సువర్ణమువలెను, అమృతమువలెను దేదీప్యమానమగు రూపముగలదియు, జలమందుండు ప్రాణులు గల్గియున్నవియునై యలరారుచున్నవి. అట్లే కొన్ని సిద్ధప్రదేశములు స్వతంత్రముగ అంధకార, ప్రకాశములతోఁ గూడినవియు, నిరంతరము ఆనందమయములై యొప్పువియు, మఱికొన్ని దూదివలె తేలికగనుండుటచే వాయువుద్వారా అభీష్టస్థానమునకుఁ గొనిపోఁబడునవియు, కొన్ని కల్పనానుసారము క్షణములోనే యుత్పత్తి, వినాశములు గలవియు, కొన్ని అనేక రుచులుగలవైన అన్నపానములతోఁ గూడినవియు, వార్ధక్య మరణరహితములైనవియునై వర్తించుచున్నవి. మఱియు ఆ సిద్ధస్థానములు విచిత్ర రచనలచేతను విచిత్ర వైభవములచేతను పరిపూర్ణములై సమస్త ఋతువులయొక్క గుణములచే రమ్యములై, సమస్తకామములతోఁ గూడియున్నవై వెలయుచున్నవి.

> తాని సంకల్పజాలాని కిల కల్యాణరూపిణః
> స్థిరాణాం మనసాం భిత్తిః కథమేవం భవేత్తు సా. 32

అవి యన్నియును సంకల్ప సమూహములే యగును. శుభకారకములగు శాస్త్రోక్త సత్కర్మ ఉపాసనాదుల ఫలరూపములందు ఆయా లోకములుగను, ఆయా భోగ్యాకారములుగనైన, స్థిరమైన మనస్సుయొక్కయే పరిణామమైయున్నవి. కానిచో ఈ స్థూలమగు భిత్తి (గోడ)కి ఇట్టి విచిత్ర పరిణామ మెట్లు సంభవించును?

> నాన్యత్కించన నామేహ బ్రహ్మమాత్రమయాత్మని
> సంభవత్యగ్ని తేనైతదుచ్యతాం మస్తు కిం మయమ్ 33

ప్రియుఁడవగు నో రాజా! స్వప్న, మనోరథాదులందు సమస్తపదార్థములున్ను మనస్సుయొక్క పరిణామములే యగును. చిన్మాత్ర సత్తారూపములై కానఁబడుచున్నందున, ఈ సమస్త జగత్తున్ను బ్రహ్మమాత్రమయమే తప్ప అన్య మొకింతైనను గాకయున్నది. అట్లు బ్రహ్మమయము గానిచో ఈ జగత్తు మఱిదేనిచే పరిపూర్ణమై యున్నదో వచింపుము.

> సర్గాదావేవ సర్గాది కించనాపి న మస్తి నో
> కారణాభావతస్తేన జగత్కిం మయమస్త్విదమ్. 34

ఇప్పుడీ సృష్టి పంచభూతమయముగ భాసించుచున్నప్పటికిని, సృష్ట్యాదియందు సదేవసోమ్యేదమగ్ర ఆసీదేకమేవాద్వితీయమ్ ... ఈ జగత్తు పూర్వ మేకమై, అ... [illegible]

వేఱుగ నెద్దియు లేనందున, కారణముయొక్క భావముచే ఈ జగత్తింక దేనిచే పరిపూర్ణమై యుండఁగలదు ?

సంకల్ప్యన్తే నిరస్తాని కిల తాని యథా యథా
చితౌ తథా తథా భాన్తి కేవాత్ర వద చిత్రతా. 35

అత్యంత అసద్రూపములైనప్పటికిని, ఏయే ప్రకారముగ ఈ యనంత జగత్తులున్ను, వానియందలి భోగ్యపదార్థములున్ను మనస్సుచే సంకల్పింపఁబడుచున్నవో, ఆయా ప్రకారముగనే యవి యన్నియును చైతన్యమందు బాసించుచున్నవి. అట్టిచో నిఁక నిచట విచిత్రమేమిగలదో వచింపుఁడు. ఏలయనిన స్వప్నాదులందు మిగుల అసత్తైనదియుఁ గానఁబడుచున్నదిగదా !

ఇదానీమపి హే సాధో త్వమప్యన్యోఽపి కేపి వా
తీవ్రసంవేదసంకల్పనగరాణ్యేవమేవ ఖే. 36

కుర్వన్త్యేకరసాభ్యాసాద్యది నామ యదృచ్ఛయా
తత్తానీదం వపుస్త్యక్త్వా ప్రాప్నువన్త్య చిరేణ ఖే. 37

ఓ సాధూ! ఇపుఁడున్ను మీరైనను లేక మఱియెవరైనను తీవ్రసంవేగయుక్తమగు సంకల్పముచేతను, ఏకరసాభ్యాసము (ఒకేపదార్థమందలి చిత్తైకాగ్ర్యతారూపమగు అభ్యాసము) చేతను, (ఐందవన్యాయము ననుసరించి తమతమ ఇచ్ఛానుసారము ఆకాశమున నగరములను నిర్మింపఁగలరు. మఱియు ఈ శరీరమును త్యజించి యా తమ సంకల్పిత పదార్థమును శీఘ్రముగ చిదాకాశమునఁ బొందగలరు.

యస్త్విదం కల్పితం చ ద్వే వస్తునీ అనువర్తతే
స్వర్గాదివదవాప్నోతి ప్రాప్నోత్యేవైకమేకధీః. 38

ఎవఁడు పూర్వకాల ఉపాసనాసిద్ధమైనట్టి యీ ప్రపంచమున్ను, స్వసంకల్పిత ప్రపంచమున్ను రెండును గలవనియే దృఢబుద్ధి గలిగియుండునో, అతఁడు — యజ్ఞకర్త స్వర్గమును బొందునట్లు క్రమముగ రెంటినిగూడఁ బొందఁగలఁడు. అట్లుగాక, ఆ రెంటిలో నొకటియే సత్యమను దృఢబుద్ధిగలవాఁడా యొకదానినే పొందును.

సిద్ధాః సదా విభాన్త్యేవం యథాన్తః కల్పనావశాత్
నరకాదీని దుఃఖాని తథైవాభాన్తి కల్పనాత్. 39

పూర్వోక్తములగు సిద్ధాదిలోకములు మనస్సుయొక్క దృఢసంకల్పముచే సదా యెట్లు భాసించుచున్నదో, అట్లే నరకాది దుఃఖములున్ను కల్పనచేతనే భాసించుచున్నవి. కాని, ఉపాసనాఫలము, దానియందలి సత్యత్వబుద్ధివలనను, దృఢాభ్యాసమువలనను జనులకు సత్యముగ భాసించుచున్నది; పుణ్యఫలమో, అభ్యాసములేకున్నను ఆస్తిక్య బుద్ధివలనను, అనుష్ఠానమువలనను సత్యముగ దృఢపడుచున్నది. పాపఫలమో ఆస్తిక్య అభ్యాసము లేకున్నను, పాపాచరణమాత్రముచే సత్యముగ దృఢపడుచున్నది. ఇంతియే వానియందలి భేదము.

యద్యత్సంవేద్యతే కించిత్తత్తథాప్యనుభూయతే
సతి వాఽసతి దేహేఽస్మిన్నేహ ఏవ మనోమయః. 40

మనుజుఁడు దేని దేనిని సంకల్పించునో, దానిదానిని ఈ దేహ మున్నను, లేకున్నను తప్పక యనుభవించును. ఏలయనిన, ఈ దేహమంతయు మనోమయమై యున్నది.

> జీవ స్త్యజతి యద్భావే ఏకాం దేహమయీం ధియమ్
> తద్భావైక మయీ మన్యామాశు త త్రైవ పశ్యతి. **41**

జీవుఁ డేభావములతోటి యొక దేహమును త్యజించునో, ఆ భావములతోటియే మఱియొక దేహమును ఆ చిదాకాశముననే శీఘ్రముగఁ గాంచును.

> శుభా సంవిచ్ఛుభాల్లోకాన్సంపశ్యత్యశుభాఽశుభాన్
> భాత్మికా భాత్మకానేవ చిరంవానుభవత్యపి. **42**

పుణ్య మొనర్చునట్టి చిదాకాశమయమగు జీవసంవిత్తు చిదాకాశమయములగు శుభలోకములను, అట్లే పాపమొనర్చునట్టి జీవసంవిత్తు చిదాకాశమయములగు అశుభలోకములను జూచుచున్నది. మఱియు, చిరకాలము అనుభవించుచును నున్నది.

> శుద్ధా సిద్ధపురాణ్యేవ పశ్యత్యనుభవత్యపి
> చిదశుద్ధాని రూపాణి దుఃఖాని నరకేష్వతి. **43**

కర్మ, ఉపాసనాదులచే శుద్ధమైనట్టి జీవచైతన్యము సూక్ష్మములగు సిద్ధపురములను గాంచుచున్నది. అనుభవించుచును నున్నది. అట్లే పాపాచరణముచే అశుద్ధమైన అట్టి జీవచైతన్యము నరకాదిదుఃఖములను గాంచుచు, అనుభవించుచు నున్నది.

> ఘూర్ణత్పాషాణయమలగిరి చక్రక పేషణమ్
> తత్రాన్ధ కూప పతనం పునరుద్ధార వర్జితమ్. **44**
>
> దారుణేనాతిశీతేన దేహం పాషాణతాం గతమ్
> భూతాఙ్గారమయాన న్తమరుమార్గాస్పదం వపుః. **45**
>
> పూతాఙ్గారమయామ్భోదసరదఙ్గారవర్షణమ్
> త ప్తనారాచనికరపరుషాసారదారుణమ్. **46**
>
> వహత్పాషాణ చక్రాసిసరిదాకాశ సంచరమ్
> వక్షో ముక్తామ్బుదాకారకుఠారాఘాత భేదనమ్. **47**
>
> తప్తాయః పరుషాశ్లేషచ్ఛమిచ్ఛమితి మజ్జనమ్
> బృహత్కటకటాశబ్దశస్త్ర యన్త్రనిపీడనమ్. **48**

పాపాచరణముచే అశుద్ధమైనట్టి జీవచైతన్యము నరకములందు, తిరుగలివలెఁ దిరుగుచుండు పర్వతాకారమువంటి రెండు చక్రములమధ్య నలుగుటను, అంధకారమయములగు నూతులందుఁ బడి మరల యటనుండి లేవఁదీయబడకుండుటను ననుభవించును. మఱియు అతి భయంకరమైన శీతలముచే శిలారూపమును బొందినట్టియు, దేహమును భూత, పిశాచాదులచేతను, నిప్పులచేతను బరిపూర్ణమైనట్టి జలరహితమగు అనంత మరుప్రదేశమునందు పడియుండుటను బొందినట్టియు

తన శరీరమును, మిగుల సంతప్తములైన బాణసమూహములయొక్క కఠోరవర్షమువలె భయంకరమైనట్టి, భస్మరహితములైన అంగారము (నిప్పు)లచేఁ బూర్ణములైన మేఘములనుండి పడుచుండు నిప్పుల వర్షమును, ప్రవహించుచుండు శిలా, చక్రా, ఖడ్గమయ నదులుగల యాకాశమందలి సంచారమును, వక్షఃస్థలముపైఁబడిన మేఘాకారములగు గంధ్రగొడ్డళ్ళచే నొనర్పబడిన తద్వక్షస్థల ఛేదనమును, కాలిన లోహ (ఇనుప) విగ్రహములను కౌఁగిలించుకొనుటను, సలసలకాగుచుండు ద్రవీభూతమైన యినుమునందు శబ్దసహితముగ మునుఁగుటను, మహా కటకటా శబ్దములతోఁగూడిన శస్త్ర యంత్రములచే బాధింపబడుటను, అశుభసంవిత్తుగల పాపులు నరకములం దనుభవింతురు.

చక్రవజ్రగదాప్రాస శూలాసి శరవర్షణమ్
శాల్మలీగ్రహణం పాశం కుశక్తిశతతోదనమ్. 49

తప్తసైకతసంభారపాత పాతాల మజ్జనమ్
దీపచ్ఛన్నానలభయం బృహద్వాయసచర్వణమ్. 50

నిర్నిర్గమాక్ష్ణశాఙ్గార మహాఙ్గార ప్రవేశనమ్
శరశక్తిగదాప్రాసభుశుణ్డీచక్రవేధనమ్. 51

క్షుత్క్షోభపరుషప్రేతవ్రాతాన్యోన్యాఙ్గచర్వణమ్
తాలోత్తాలాతిపరుషశిలాతలనిపాతనమ్. 52

రుధిరామేధ్యపఙ్కాఢ్య పూయనద్యాది సంకటమ్
శిలాశస్త్రమయాశ్వేభపాదపాషాణపేషణమ్. 53

శ్వభ్రాభోలూకలిఖితం జనౌఘముసలాహతమ్
శిరః కరఖురస్కన్దఖణ్డోత్కగృధ్రమణ్డలమ్. 54

ఇంకను సట్టిపాపులు నరకములందు. చక్ర, వజ్ర, గదా, ప్రాస (ఈఁటె) శూల, ఖడ్గ, బాణముల వర్షమును కంటకవృక్షములను కౌఁగిలించుకొనుటను, పాశముచే బంధింపఁబడుటను, భయంకరములైన యనేక శస్త్ర్యాద్యాయుధములచే చెదింపఁబడుటను, కాఁగినయిసుకను మోయుచు, ఆ భారముచేఁ గ్రిందఁబడుటను, పాతాళమున మునుఁగుటను, దీపాకారమున ప్రచ్ఛన్నమైనట్టి కొఱవియొక్క యగ్నివలనఁ గలుగు భయమును, గొప్ప కాకులచే బాదింపఁబడుటను, శరీరమును ఛేదించివైచునట్టి భయంకరములైన నిప్పుకణికలందుఁ బ్రవేశించుటను, బాణ, శక్తి, గదా, ప్రాస, భుశుండీ, చక్రాద్యాయుధములచేఁ బీడింపఁబడుటను. ఆఁకలిచే క్షోభనొందిన క్రూరప్రేత సమూహములచేఁ బరస్పరము గావింపఁబడిన అవయవముల చర్వణమును, తాళవృక్షములకంటెను నెత్తైనట్టి యున్నత ప్రదేశములనుండి కఠినశిలాప్రదేశములపైఁ గ్రిందఁబడఁ ద్రోయఁబడుటను, రక్తము. మలము, చీము మున్నగువానియొక్క అపవిత్రపంకము (బురద)తోఁగూడిన నదులందలి సంకటమును, శిలా, శస్త్రమయములైన అశ్వ, గజాదుల పాదములను శిలలచేఁ ద్రొక్కఁబడుటను, గోతుల వంటి ప్రదేశములందు గుడ్లగూబలచే నొనర్పబడిన దేహవిదారణమును, జనసమూహముచేత రోఁకళ్ళచే గొట్టఁబడుటను, శిరోహస్తపాదాదుల ఖండములందు అత్యాసక్తములైన గృధ్రపక్షులచే పీడింపఁబడుటను ననుభవించుచుందురు.

ఏతస్మాత్సుకృతాదేతత్ఫలమిత్యేవ భావనాత్
పశ్యత్యేవం దేశదృఢాదవిసంవాదివిస్తృతః. 55

ఈ యాదృష్టకర్మలవలన ఈ యానరకఫలములు లభించును' అనునిట్టి శాస్త్ర నిర్ణయము చేతను, పూర్వజన్మలం దనేకపర్యాయము లనుభవించిన నరకఫలములయొక్క దృఢభావన చేతను దుష్టకర్మలచే నిజాత్మయే యానరకరూపముగ విస్తరించినదై వానినట్లు గాంచుచున్నది.

యన్నామ కించన కదాచన చేతనం ఖే
భాతం న భాతమథవా యదపూర్వమేవ
తత్కల్పనాద్భవతి తన్మయమేవ తద్ధి
తస్మాచ్చిరం చ చలతీతి యదృచ్ఛయైవ. 56

ఇత్యార్షే శ్రీ వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే ఉత్తరార్ధే అవి॥ విప॥ శవో॥ స్వర్గనరకోపలమ్భవర్ణనం నామ షష్ట్యధిక శతతమః సర్గః ॥ 160 ॥

చిదాకాశమున దేహాదులెయ్యవి పూర్వము భాసించియుండెనో, లేక భావికాల పదార్థము లెయ్యవి భాసింపకయున్నవో, లేక. అపూర్వమైనది యెద్దిగలదో, అదియంతయును భ్రాంతిరూపమగు కల్పనచేతనే సంభవించుచున్నది. మఱియు నదియంతయును మనోమయమైయున్నది. ఇక్కారణమున చిరకాల మనుభూతమగు భావనచే జీవుఁడు అప్రయత్నముగనే సంసారమునఁ దిరుగాడు చున్నాఁడని నిశ్చితమగుచున్నది

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున నుత్తరార్ధమున అవి॥ విప॥ శవో॥ స్వర్గనరకోపలంభవర్ణనమను నూటయఱువదవసర్గము ॥160॥

---

## ఏకషష్ట్యధిక శతతమః సర్గః

[ అనన్యకారణం చిత్రం చిన్మాత్రప్రతిభాత్మకమ్
అబోధాజ్జగదాభాతి బోధే బ్రహ్మేతి వర్ణ్యతే.

విచిత్రమైనదియు. చిన్మాత్రముకంటె వేఱైన కారణము లేనిదియు చిన్మాత్రముయొక్క ప్రతిబింబ రూపమైనదియునగు ఈ జగత్తు, అజ్ఞానమువలన భాసించుచున్నదనియు, జ్ఞానముచే బ్రహ్మరూపమేయనియు నిట వచింపఁబడుచున్నది ]

శ్రీరామ ఉవాచః—

యన్మునివ్యాధయోరేతద్వృత్తం నానాదశాశతమ్
అన్యకారణకం కిం స్యాదేతత్కిం వా స్వభావజమ్. 1

శ్రీరాముఁడు:— ఓ మునీంద్రా! భాసునిచే వర్ణింపఁబడినదియు, అనేక సుఖదుఃఖాది దశలతోఁ గూడుకొనియున్నదియునగు ఈ మునివ్యాధుల వృత్తాంతము, ప్రతిదినము గానుపించు

స్వప్నాదులవలె చైతన్యముకంటె భిన్నమగు కారణములేనిదా, లేక, లవణుఁడు గాధి మున్నగువారి యొక్క చండాలరూపాదులు, ఐంద్రజాలిక, భగవద్వరాది కారణములవలన గల్గినట్లుగ, కారణాంతర స్వభావమువలన గలిగినదా వచింప ప్రార్థన?

**శ్రీ వసిష్ఠ ఉవాచః—**

> ఈదృశాః ప్రతిభావర్తాః పరమాత్మ మహామ్బుధౌ
> అనారతం ప్రవర్తన్తే స్వతః స్వాత్మని భాత్మకాః. 2

శ్రీ వసిష్ఠుఁడు:— ఓ రామచంద్రా! కారణాంతరముండినను, లేకుండినను, ముక్తి కలుగనంతవఱకు స్వాత్మయను మహాసముద్రమున చైతన్యప్రతిబింబరూపములును చిదాకాశమయములునగు ఇట్టి ఆవర్తములు స్వయముగ నిరంతరము ప్రవర్తించుచునే యుండును.

> యథా స్పన్దాత్మనో వాయోరజస్రం స్పన్దలేఖికాః
> ఉద్యన్త్యేవ సతశ్చిత్త్వాచ్చిద్వ్యోమ్ని ప్రతిభాయుతాః. 3

వ్యజనము (విసనకఱ్ఱ) మున్నగు కారణాంతరములున్నను, లేకున్నను వాయువునందు మంద మంద చలనములు నిరంతరము కలుగుచునేయుండునట్లు, సచ్చిత్పరమాత్మ రూపమగు చిదాకాశమున తత్ప్రతిబింబరూపములగు పదార్థాకారములు సదా యుదయించుచునేయుండును.

> యా యథా స్వాఙ్గభూతాస్మాదుదితా ప్రతిభా ప్రభా
> తావత్సేహ తథైవాస్తే న హతా యావదన్యయా. 4

ఈ పరమాత్మనుండి తదంగభూతమగు ప్రతిబింబరూపపదార్థ మెయ్యది యేరీతి యుదయించునో, అది మఱియొక ప్రతిబింబరూప పదార్థముచే నశింపఁబడనంతవఱ కారీతిగనే యుండియుండును.

> నానావయవవానేక ఏవేహావయవీ యథా
> చిద్వహ్న్యేకమిదం వ్యోమ తథైవం ప్రతిభాత్మకమ్. 5

పత్ర, పుష్ప, శాఖాద్యవయవములందు ఏకమగు 'అవయవి' యైన వృక్షమెట్లుగలదో అట్లే చిత్ప్రతిభాసమయములగు దేహ, జగదాద్యనంతములైన అవయవములందు ఏకమగు అధిష్ఠాన సన్మాత్రరూప బ్రహ్మముగలదు.

> బ్రహ్మ కాశ్చిచ్చిరాః కాశ్చిదస్థిరాః ప్రతిభార్థవత్
> దేహావస్థా ఇవాత్మస్థాః స్థితమాత్మని భాత్మని. 6

దేహమందలి హస్తపాదాదులెట్లు చిరకాలస్థములో, నిమేష, ఉన్మేషములు (కను ఱెప్పల మూయుట, తెఱచుటలు) అల్పకాలస్థములో, అట్లే బ్రహ్మమందును భూమ్యాకాశాదులు దీర్ఘకాలస్థములును, శరీరాదులు అల్పకాలస్థములునై యున్నవి.

> స్వాత్మని స్వప్నపురవద్భానం చితి చమత్కృతిః
> కిం సారం కిమసారం వా కిం సత్కిం వాప్యసద్భవేత్. 7

స్వప్ననగరమువలె స్వాత్మయందీ జగత్తు చైతన్యముయొక్క చమత్కారమాత్రమై యున్నది. అట్టిచోఁ నిక నిద్దానియందు సారముగాని, అసారముగాని, సత్తుగాని, అసత్తుగాని యేమియుంతగలదు?

పరిజ్ఞాతమిదం యావత్సర్వం చిద్వ్యోమమాత్రకమ్
దృశ్యం జగద్యవద్బుద్ధం న సన్నాసత్కిముచ్యతే. 8

(ఆత్మరూపముగ) ఎఱుఁగఁబడినచో (జ్ఞానియొక్క దృష్టియందు) ఈ సమస్తదృశ్య జగత్తున్ను చిదాకాశమాత్రమేయగును. ఈ జగత్తును మీరు (అజ్ఞులు) ఎపుడెఱుఁగుదురో, అపుడిది సత్తనిగాని అసత్తనిగాని ఏమియు చెప్పజాలకయేయుందురు.

చిద్వ్యోమమాత్ర కచనం సంసారః సర్వతః శివే
ఆస్థానాస్థాది కిం తత్ జ్ఞా యథా సంస్థానమాస్థిత. 9

మంగళమయమైన బ్రహ్మరూపమగు ఈ ప్రపంచమున సంతతను కేవలము చిదాకాశమాత్రముయొక్క స్ఫురణమేగలదు ఓ విజ్ఞులారా! అట్టి యిద్దానియందిఁక ఆసక్తి, అనాసక్తి మున్నగునవి యేమి? ఎట్టిరూపములతో వాస్తవముగ నిది స్థితిగల్గియున్నదో, అట్టి బ్రహ్మస్వరూపము నాశ్రయించి యుండుఁడు.

సముద్యన్తి స్వతోఽమ్భోదేర్వీచివత్ప్రతిభాకృతాః
స్వాత్మికాః స్వాత్మనో దేహాత్కార్యకారణదృక్తయా. 10

స్వాత్మరూపుఁడగు పరమాత్మదేవునినుండి స్వాత్మరూపములేయగు ఈ దేహ, జగదాది ప్రతిబింబాకారములు సముద్రమునుండి తరంగములవలె స్వయముగనే యుత్పన్నములగుచున్నవి.

స్ఫారం యత్పరమం వ్యోమ్నః స్వసంకల్పస్వసర్గవత్
తత్తేనైవ జగద్బుద్ధం కుతః పృథ్వ్యాదయోఽత్ర కే. 11

చిదాకాశరూపుఁడగు పరమాత్మయొక్క స్వసంకల్పసదృశమైనదియు నిజస్వప్నసృష్టి వంటిదియునగు విశాలమైన ప్రతిభాసమెయ్యదిగలదో, దానినే యా పరమాత్మ జగత్తుగ నెఱిఁగెను. కావున నిట పృథ్వ్యాది పదార్థములేవి యెచటగలవు?

భాత్యేనమయనాభాసో నైవ భాతి చ కించన
బ్రహ్మణ్యేవ స్థితం బ్రహ్మ తద్ధవిద్యాభిదం స్వతః. 12

చైతన్యముయొక్క అభాసమే యిట్లు జగద్రూపముగ భాసించుచున్నది. కాని యథార్థముగ నట్లు భాసింపకయేయున్నది. కాఁబట్టి అవిద్యయను పేరుగల బ్రహ్మరూపమగు ఈ జగత్తు స్వయముగనే బ్రహ్మమందు స్థితిగల్గియున్నదగును.

ఘనతా చిద్ఘనేనేహో చిద్వ్యోమైవాఖిలం జగత్
ఇత్యేవ పరమో బోధ పీతత్ప్రోఢిస్తు ముక్తతా. 13

ఈ ప్రపంచమున ఏ ఘనత్వముకలదో, అది వాస్తవముగ చిద్ఘనమగు పరమాత్మచేతనే కలిగినదిగాని పృథ్వ్యాదిరూపములచేఁగాదు 'ఈ జగత్తంతయు చిదాకాశమేయైయున్నది.' అను బోధకలుగుటయే పరమజ్ఞానమైయున్నది. మఱియు, భూమికాభ్యాసముద్వారా యట్టి జ్ఞానము దృఢపడుటయే ముక్తియగును

చిద్వ్యోమశూన్యతారూపమాత్ర మాభాస ఆతతః
ఇదమప్రతిఘం శాన్తం జగదిత్యేవ భాసతే. 14

ఆకాశమందు నీలత్వము భాసించునట్లు, చిదాకాశముయొక్క నిరాకారమై సర్వవ్యాపకమై శాంతమైనట్టి రూపమే భ్రమచే (అజ్ఞానము వలన) ఈ జగత్తుగ భాసించుచున్నది.

ధ్యాయినః క్షీణదేహస్య ధ్యానే దృష్ట్వే క్షణం స్థితే
చిన్మాత్రవ్యతిరేకేణ శక్తత్వం స్యాత్కిముచ్యతామ్. 15

ఓ రామచంద్రా! దేహభావము నశించినట్టి నిర్వికల్పసమాధిస్థుడు తత్సమాధిస్థితియందు క్షణకాలము దృశ్యాభావమున సాక్షి చిన్మాత్రస్వరూపమందుండియుండ నపుడాతనికి చిన్మాత్రము తప్ప అన్యముగ జగద్దర్శనము నొనర్చు శక్తి యేమున్నగలదో వచింపుము ? (కావున, అజ్ఞాన దృష్టిచేతనే యట్టి శక్తియుండగలదని భావము.)

చిద్ధాతువ్యోమభాగో యో భాతి యత్ర యథా యథా
తథా తథా స తత్రాస్తే యావదిత్థం స్వభావతః. 16

చిదాకాశరూపముయొక్క ఏయే భాగము ఎచటెచట నెట్లెట్లు భాసించునో, అచటచట నట్లట్లు స్వభావముగనే వర్తించును అనగా అజ్ఞానియొక్క చిత్తరూపోపాధియందు జగత్తుగను, జ్ఞానియొక్క చిత్తరూపోపాధియందు కేవల చిన్మాత్రముగను వర్తించును

అవిచారవతో దృశ్యభా నిర్గగనమయ్యపి
జాతితైమిరికద్వీన్దుదోషవన్నోపశామ్యతి. 17

ఈ దృశ్యము చిదాకాశమయమైనప్పటికిని తత్త్వవిచారములేని అజ్ఞునకు దృశ్యరూపముగనే కన్పట్టును. మఱియు, పుట్టుకతోనే యున్న తిమిరరోగముతో గూడిన నేత్రములుగలవానికి రెండుచంద్రులు కన్పించుటయను దోషము శమించనట్లు అట్టి యజ్ఞానికి దృశ్యభ్రాంతి శమింపకయే యుండును.

యదిదం దృశ్యతే కించిత్తద్బ్రహ్మైవ నిరామయమ్
చిదాకాశమనాద్యన్తం తత్కథం కిం ప్రశామ్యతి. 18

ఈ కానుపించునదంతయు ఆద్యంతరహితమై నిర్వికారమైనట్టి చిదాకాశ రూపమగు బ్రహ్మమేయైయున్నది. అట్టి బ్రహ్మరూపమగు ఈ జగత్తెట్లు నశించును.

స్వమనస్త్యజతో రూపం స్వచ్ఛసంవేదనాత్మకమ్
స్వప్నవత్కచనం స్వస్య యన్నామ తదిదం జగత్. 19

తనయొక్క నిర్మలజ్ఞాన రూపమును త్యజింపకయే చైతన్యముయొక్క స్వప్న తుల్యమగ స్ఫురణమేదిగలదో, అదియే యీ జగత్తైయున్నది

శాస్త్రైరేస్తీక్ష్ణయా బుద్ధ్యా స్థితో యన్నవికల్పనైః
కృత్వా సుప్తమివాత్మానం కించిద్బుద్ధేన బోధ్యతే. 20

వికల్పరహితములగు వేదాంత శాస్త్రార్థములవలన తీక్ష్ణమైనట్టి బుద్ధితో (సంపూర్ణదృశ్యమును రహితమొనర్చుట ద్వారా) తన్ను సుషుప్తిని చెందమున గావించుకొనినపుడు విజ్ఞునిచే ఏచిత్స్వరూపము (దృక్కు) అనుభవింపఁబడుచున్నదో అదియే, ఆత్మ లేక పరబ్రహ్మము.

రూఢా యేయమవిద్యేతి సంవిదవ్యభిచారిణీ
భవతాం నను నాస్త్యేవ సా సరిత్స్వివ పాంసుభూః. 21

ఓ జనులారా! మీకు, ఏ అవిద్యారూపమగు స్థిర జగదాకారబుద్ధి బాగుగ రూఢిపడి యున్నదో, అది నదులందు ధూళివలె, మా యందు లేకయున్నది.

యథా స్వప్నేఽవనిర్నాస్తి స్వానుభూతాపి కుత్రచిత్
తథేయం దృశ్యతా నాస్తి స్వానుభూతాప్యసన్మయీ. 22

స్వానుభూత మైనప్పటికిని స్వప్నమందెచటను వాస్తవముగ భూమిలేనట్లు స్వానుభూత మైనప్పటికిని అసద్రూపమగు ఈ దృశ్యము వాస్తవముగ లేకయేయున్నది

చిద్వ్యోమమాత్రమేవార్థాఽనలవద్భాసతే యథా
స్వప్నే తథైవ జాగ్రత్త్వేఽనలం స్వస్యైవ లక్ష్యతే. 23

స్వప్నమందు చిదాకాశమే పదార్థరూపముగను, తత్ప్రకాశముగు తేజోరూపముగను భాసించునట్లు, జాగ్రత్తునందున జాగ్రత్సాక్షియగు చిదాకాశముయొక్క స్వప్రకాశమే అపూర్వ రూపముగ భాసించుచు జగత్తు గోచరించుచున్నది.

ఇదం జాగ్రదయం స్వప్న ఇతి నాస్త్యేవ భిన్నతా
సత్యే వస్తుని నిఃశేషసమయోర్వ్యానుభూతితః. 24

తత్త్వజ్ఞులయొక్క యనుభవమందు సమరూపములేయైనట్టి జాగ్రత్స్వప్నములందు 'ఇది జాగ్రత్తు, ఇది స్వప్నము' అను ఈ భిన్నత్వమేది భాసించుచున్నదో, అది సత్యవస్తువగు బ్రహ్మమందొకింతైనను లేదు.

నైతదేవమితి స్వప్నప్రభోధాత్ప్రత్యయో యథా
మృత్వాముత్ర ప్రబుద్ధస్య జాగ్రతి ప్రత్యయస్తథా. 25

స్వప్నమునుండి మేల్కొనినవానికి స్వప్నానుభవము బాధితమగునట్లు, మరణించిన పిదప మఱియొకచోట శరీరాంతమున ప్రబుద్ధుఁడగు గర్భస్థమనుజునకు ఈ జాగ్రత్ప్రసిద్ధమగు యనుభవమున్ను బాధితమగును.

కాలమల్పమనల్పం చ స్వప్నజాగ్రదితీహ ధీః
వర్తమానానుభవనసామ్యాత్తుల్యే తయోర్ద్వయోః. 26

'స్వప్నము అల్పకాలముండునది, జాగ్రత్తు దీర్ఘకాలముండునది' అను బుద్ధియు వర్తమానకాలమందా రెంటియొక్క యనుభవమున్ను సమానమేయైయున్నందువలన, సమమే యగును.

బాహ్యే తదేవమిత్యాది గుణసామ్యాదశేషతః
న జాగ్రత్స్వప్నయోర్భేదో మనాగేకోఽపి యుమయోరపి. 2?

జాగ్రత్తు బాహ్యప్రదేశమున ననుభూతమగుచున్నది. స్వప్నమంతఃకరణమున ననుభూతమగుచున్నది. అను ఈ భేదముకూడ లేదు. ఏలయనిన, జాగ్రత్తువలెనే స్వప్ననగరాదులున్ను స్వప్నమందు బాహ్యప్రదేశముననే యనుభూతమగుచుండుటవలనను. అన్ని విషయములందును సుభయత్ర గుణసామ్యముండుటవలనను ఒకేకాలమున జనించిన యిరువురు (కవల) శిశువులవలె జాగ్రత్స్వప్నములందేదియు పెద్దదికాదు.

యదేవ జాగ్రత్స్వప్నోఽయం యః స్వప్నో జాగ్రదేవ తత్
నైతదేవం కిలేత్యస్తి ధీః కాలేనోభయోరపి. 28

ఏది జాగ్రత్తో, అదియే స్వప్నము; ఏది స్వప్నమో, అదియే జాగ్రత్తు; ఏలయనఁగా, స్వప్నమునుండి మేల్కొనినపుడు జాగ్రద్దశయందు స్వప్నపదార్థములెట్లు బాధితములగుచున్నవో, అట్లే జాగ్రద్దశనుండి ప్రబుద్ధుఁడైనవానికి జ్ఞానరూప జాగ్రత్తునందు జాగ్రత్పదార్థములయొక్కయు బాధబుద్ధి యుదయించుచున్నది.

ఆజీవితాన్తం స్వప్నానాం శతాన్యనియతం యథా
అనిర్వాణ మహాబోధే తథా జాగ్రచ్ఛతాన్యపి. 29

జీవితపర్యంతము సంభవించు అనేక స్వప్నములయొక్క అంతమెట్లు లేదో, అట్లే నిర్వాణ (మోక్ష) రహితుఁడగు మనుజునకు మహా అజ్ఞానమున సంభవించు అనేక జాగ్రత్తులయొక్కయు నంతములేదు

ఉత్పన్నధ్వంసినః స్వప్నాః స్మర్యన్తే బహవో యథా
తథైవ బుద్ధైః స్మర్యన్తే సిద్ధైర్జన్మశతాన్యపి. 30

ఉత్పత్తి. వినాశయుక్తములగు అనేక స్వప్నములెట్లు మనుజులచే స్మరింపఁబడుచున్నవో, అట్లే ప్రబుద్ధులగు (జాతి స్మరణానుకూలమగు యోగసిద్ధిగల) సిద్ధులున్ను అనేక జన్మలను స్మరించుచున్నారు.

ఏవం సమస్తసాధర్మ్యే సమస్తానుభవాత్మని
కచతి స్వప్నవజ్జాగ్రజ్జాగ్రద్వత్స్వప్నవేదనమ్. 31

ఈ ప్రకారముగ సమస్తానుభవరూపమగు సాక్షియందు జాగ్రత్స్వప్నములు సర్వవిధముల సమములగుటచే నిఁక జాగత్తుస్వప్నమువలెను, స్వప్నము జాగ్రత్తువలెను స్ఫురించుచున్నదే యగును.

యథా దృశ్యం జగచ్చేతి నిత్యమేకార్థతాం గతౌ
ఉభౌ శబ్దౌ తథైవైతజ్జాగ్రత్స్వప్నాత్మకౌ స్మృతౌ. 32

దృశ్యము, జగత్తు, అను ఈ రెండు శబ్దములున్ను వేఱువేఱుగనున్నను, నిత్య మొకే యర్థస్వరూపమును బొందియున్నట్లు, జాగ్రత్స్వప్నములను రెండుశబ్దములున్ను వేఱువేఱుగ నున్నను, ఒకే అర్థరూపమునే బొందియున్నవి

ఏవం స్వప్నపురం స్ఫారం యథా వ్యోమైవ చిన్మయమ్
తథైవేదం జగదతః క్వావిద్యా దృశ్యతే కుతః. 33

ఇవ్విధముగ. విశాల స్వప్ననగరమెట్లు చిన్మయాకాశమై స్ఫురించుచున్నదో, అట్టి యీ జాగ్రజ్జగత్తున్ను చిన్మయాకాశమేయై స్ఫురించుచున్నదగును. అట్టిచో నిక 'అవిద్య' యెచట ?

తదేవాకాశమాత్రాత్మ యద్యవిద్యేతి కథ్యతే
తద్యదాస్తే సదేవాహం బన్ధః స్వకలనాత్మకః. 34

'నహిస్వప్నో భూత్వా' ఆ పరమాత్మయే స్వప్నమయి స్ఫురించుచున్నాఁడు ) ఇత్యాది శ్రుతులంగు స్వప్నశబ్దముచేవలె 'అవిద్యా' శబ్దముచేతను, ఆ బ్రహ్మమే చెప్పఁబడుచో, శబ్దవిషయమున మాకు వివాదములేదు. 'భ్రమయంతయు శమింప ఎది శేషించునో, అదియే సచ్చిద్రూపమగు మాయొక్క స్వరూపము, మఱియు, ఆత్మజ్ఞానమునకుఁ బూర్వము జీవునకు నిజకల్పనారూపమే బంధము' అనునదియే మా సిద్ధాంతము.

తస్మైవం క్రియతామేతచ్చబన్ధస్యైవ బన్ధనమ్
కాన్యతా అమలవ్యోమ్నశ్చిన్మయస్య నిరాకృతేః. 35

ఓ రామచంద్రా ! కాఁబట్టి బంధనరహితమై చిన్మయుఁడైనట్టి చిదాత్మకు బంధనమును గల్పింపకుము. ఏలయనిన, నిర్మలమగు ఆకాశమునకును నిరాకారమగు చిన్మయాత్మకున్ను నేమి భేదముగలదు ? ఏ భేదమునను సరించి, ఆకాశమునకు బంధరాహిత్యమున్ను, చిదాత్మకు బంధమున్ను జెప్పఁబడుచున్నది ? రెండును నిరాకారములున్ను, నిర్లేపకములున్ను సూక్ష్మతమములున్ను నగుటచే బంధనరహితములే యైయున్నవి

చిన్మయాకాశకచనే క్వాస్మిన్కిల నిరాకృతేః
దృశ్యనామన్యవిద్యాఖ్యే బన్ధో మోక్షోఽథవా కుతః. 36

ఎపుడు, అవిద్యయను బేరుగల యీ దృశ్యము చిన్మయాకాశముయొక్క స్ఫురణమాత్రమే యైయున్నదో, అప్పుడిక నిరాకారమగు ఇద్దానికి బంధముగాని మోక్షముగాని యెట్లుండగలదు ?

నావిద్యా విద్యతే నామ బన్ధో బన్ధో న కస్యచిత్
మోక్షో న కస్యచిన్మోక్షశ్చాస్తి నాస్తీతి నాస్త్యలమ్. 37

ఎపుడు అవిద్యయనునదియే లేదో, అపుడిఁక నెవనియొక్కయు బంధము బంధము కాదు, మోక్షము మోక్షముకాదు. ఎలయనఁగా, బ్రహ్మముకంటె వేఱుగ నేదేనికలదు, లేదను వ్యవహారముకూడ బొత్తిగా సంభవింపనేరదు

నాస్త్యేవ విద్యాఽవిద్యా వా చిదేవేయం కచత్యజా
ఖ ఏవ ఖాకృతిః స్వప్న ఇవ సర్గస్వదేహినీ. 38

విద్యకాని, అవిద్యగాని యిుంయిుటలవు జననరహితమైన చిదాకాశరూపమగు చైతన్యమే నిజ చిదాకాశమున సృష్ట్యాకారమును దేహమును వహించి స్వప్నమందువలె స్ఫురించుచున్నది.

దేశాద్దేశాన్తరప్రాప్తౌ యన్మధ్యే సంవిదో వపుః
తజ్జాగ్రత్స్వప్నదృశ్యస్య రూపమిత్యేవ నిశ్చయః. 39

ఒకప్రదేశమునుండి దూరముననున్న మఱియొక ప్రదేశమునకు నేత్రేంద్రియముద్వారా బుద్ధి వృత్తి చనునపుడు, ఆ రెండుప్రదేశముల మధ్య యే నిర్విషయమగు సంవిత్తుయొక్క స్వరూపముగలదో, అదియే జాగ్రత్స్వప్న రూపమగు దృశ్యముయొక్క వాస్తవ స్వరూపమని నిశ్చయింపవలయును.

సబాహ్యాభ్యన్తరే దృశ్యే శాన్తనిద్రస్య యద్వపుః
ఏకస్య నిశి తద్రూపం జాగ్రత్స్వప్నదృశామిహ. 40

బాహ్య అభ్యంతర దృశ్యములందును, నిద్రయొక్క అభావదశయందును నిద్రాస్థితియందును, ఇంద్రియ మనంబులను, తద్వికారాదులను, విషయములను, విషయాభావమును ప్రకాశింపజేయుచు సదా జాగరూకమైయుండునట్టి ఏకమగు స్వయంజ్యోతిరాత్మయొక్క స్వరూపమేదిగలదో, అదియే ఇట జాగ్రత్స్వప్నములయొక్క పారమార్థికరూపమై యున్నది

విద్ధి తద్రూపమేవేదం భేదవేదనమిత్యపి
చిత్యన్తమాగతః కోఽన్యో నామ స్యాద్భేద భేదనే. 41

ఓ రామచంద్రా! కావున, జాగ్రత్స్వప్నముల భేదజ్ఞానమున్ను, ఆ రెంటియొక్క సాక్షియైన చైతన్యముయొక్క రూపమేయైయున్నది. ఏలయనిన (జాగ్రదాది) మూండవస్థలయందును అనుగతమైయున్న సాక్షి చైతన్యమున అద్దానియందలి భేదమును గాంచునట్టి యెవడేతెంచెను?

చిద్వ్యోమైవాభేదబుద్ధిశ్చిద్వ్యోమైవ చ భేదధీః
ద్వైతాద్వైతే చైకమేవ తథా శాన్తమఖణ్డితమ్. 42

భేదబుద్ధియు, అభేదబుద్ధియుగూడ చిదాకాశమేయైయున్నవి. అట్లే ద్వైత అద్వైతమున్ను నట్టి యేకమగు చిన్మయాకాశమేయై యొప్పుచున్నవి. కాఁబట్టి అంతయును శాంతమై అఖండితమైనట్టి చిద్రూపబ్రహ్మమే యగును,

సదంశో బోధతద్గ్రాహ్యమయ ఏవ యథా తథా
ద్రష్టా య ఏవ దృశ్యం తద్ద్వైత వేదన మేకకమ్. 43

బ్రహ్మముయొక్క సత్, చిత్, ఆనందములను అంశములందు సదంశము బోధ (జ్ఞాతృ) మయమైయున్నది. మఱియు బోధగ్రాహ్య (దృశ్య)మయమై యున్నది. ఇట్లు జ్ఞాత, జ్ఞేయము అను రెండుస్థలములయందును సదంశము అభిన్నరూపమై యొప్పుచున్నది. మఱియు విషయమ (దృశ్యమును) సాక్షాత్కరించు ద్రష్ట యెవఁడుకలఁడో. అతడే దృశ్యమున్ను నగును. విషయము విషయి చైతన్యముకంటె వేఱని నిరూపించుట కెవనికిని శక్యముగాదు. కాబట్టి ద్వైతమున్ను అద్దాని జ్ఞానమున్ను నొకటియేయైయున్నవి. ఇట్లు జ్ఞాత, జ్ఞేయము అను రెండుస్థలములందున చిదంశమున్ను, అభిన్నమైయున్నది.

తద్ద్బహ్మ ఖం విదుర్ద్వైతమద్వైతాద్వైతమేవ చ
సర్గ ఏవ పరం బ్రహ్మ ద్వైతమద్వైతమేవ సత్. 44

ఎపుడు ఏకమగు సద్వస్తువైన బ్రహ్మమే సమస్త ద్వైతరూపముగ ప్రతిభాసించుచున్నదో అపుడిక ద్వైత, అద్వైత, అద్వైతాభిన్న రూపములు చిదాకాశమగు ఆ బ్రహ్మమేయగును.

నేతి నేతి వినిర్ణీయ సర్వతోఽఖి భవత్యపి
పశ్చాత్త్యక్త్వా చిదాకాశే శిలాం కృత్వాస్యతామిహ. 45

ఓ రామచంద్రా! 'నేతినేతి' (ఇదికాదు, ఇదికాదు) అను వేదవాక్యములద్వారా సమస్త నామరూపాత్మక ద్వైతమును మిథ్యయని నిశ్చయించి, అటుపిమ్మట అద్దానినంతయు త్యజించివైచి, సర్వవ్యాపకమగు ప్రత్యగాత్మరూపమైన చిదాకాశమందు, ఉత్తరోత్తరభూమికాభ్యాసము ద్వారా ఆనందైకరసఘనమగు శిలను నిర్మించి వర్తిల్లుము.

యథాక్రమం సుభగ యథా స్థితి స్థితి
యథోదయం వ్రజ పిబ భుంక్ష్వ భోజయ
అభీప్సితం గతమననో నిరిఙ్గనః
సుచిన్మయే పరమపదోపలో భవాన్. 46

ఇత్యార్షే శ్రీవాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే ఉత్తరార్ధే అవి॥ విప॥ శవో॥ నిర్వాణవర్ణనం నామైక షష్ట్యధిక శతతమః సర్గః ॥161॥

సౌభాగ్యవంతుడవగునో రామచంద్రా! ఈ ప్రకారముగ నీవు మహాచిన్మయమగు బ్రహ్మమందు పరమాత్మపదమను శిలవై, మనోమనన రహితుఁడవై, అభిమానశూన్యుఁడవై, యథాక్రమముగ లోకమర్యాద ననుసరించి స్వవిభవానుసారముగ నీకభీష్టమగు ప్రదేశమున విహరింపుము, అభీష్టమగు దానిని భుజింపుము, త్రాగుము. మిత్రాదులను భుజింపఁజేయుము.

ఇది శ్రీవాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున నుత్తరార్ధమున అవి॥ విప॥ శవో॥ నిర్వాణవర్ణనమను నూటయఱువదియొకటవ సర్గము ॥161॥

## ద్విషష్ట్యధిక శతతమః సర్గః

[ఇహ ద్వైతస్య కృత్స్నస్య బ్రహ్మమాత్రత్వవర్ణనైః
హితోక్తిభిరవిద్యాయా నిరాస ఉపపాద్యతే.

సమస్తద్వైతముయొక్క బ్రహ్మమాత్రత్వము, హితోక్తులద్వారా అవిద్యయొక్క నిరసనము, ఇచట ప్రతిపాదింపబడుచున్నవి.]

శ్రీ వసిష్ఠ ఉవాచ:—

చిద్వ్యోమార్థతయార్థానాం యథా స్థితమిదం జగత్
సరూపాలోకమననమపి చిద్వ్యోమ కేవలమ్. 1

శ్రీవసిష్ఠుఁడు:— ఓ రామచంద్రా! గోవులు మున్నగువాని యుపభోగముకొఱకై నట్టి తృణాదులు, ఆ గోవులు మున్నగువాని రూపమున పరిణతములై తద్రూపముగనే శేషించునట్లు, బాహ్యమందలి రూప, ప్రకాశాదులతోను, అభ్యంతరమందలి సంకల్పాదులతోను గూడియున్న

యథాస్థితమగు ఈ దృశ్యజగత్తంతయును చిదాకాశముయొక్క యుపభోగముకొఱకే యగుచు, కేవలము చిదాకాశముగనే శోభించుచున్నది.

స్వప్నచిత్పురరూపత్వాదన్యద్యస్మాన్న విద్యతే
జగత్తస్మాన్నభః శాన్తం నేహ నానాస్తి కించన. 2

స్వప్నమందలి నగరాదులు ద్రష్ట (సాక్షి)యగు చైతన్యముయొక్క భోగ్యమగుటఁబట్టి యద్దానికంటె వేఱుగ నెట్లు లేవో జాగ్రజ్జగత్పదార్థములున్ను చైతన్యముయొక్క భోగ్యము లగుటఁబట్టి చిద్రూపముకంటె వేఱులేకున్నవి కావున జాగ్రజ్జగత్తున్ను శాంతమగు చిదాకాశమేయైయున్నది. ఇట నానాత్వ మొకింతైనను లేదు.

చిద్భానమనానైవ నానేవ పరిలక్ష్యతే
అనాత్మైవాత్మనాత్మానం స్వప్నాకాశపురేష్వివ. 3

చైతన్యము ఏకరూపమేయైనను నానారూపమువలె స్ఫురించుచు నేది కన్పట్టుచున్నదో, అది వాస్తవిక చిత్స్వరూపముకాదు. అనాత్మయేయగును. చైతన్యము తన చిత్స్వరూపమునే యిట్లు అసత్యములగు నానారూపములతోటి దర్శింపఁజేయుచున్నది. ఎట్లనిన, స్వప్న, సంకల్ప, గంధర్వ నగరాదులందు సాక్షియగు నిజాత్మ తన చిత్స్వరూపమునే అసత్యములగు నానారూపములతోటి దర్శింపఁజేయుచు మరల స్వప్నాంతమున కేవలము అద్వైతరూపముగనే వెలయుచున్నదిగదా.

సర్గాదావివ చిద్వ్యోమ స్వప్నాకాశపురం జగత్
అభాతమేవా సత్యం చ నూనం సత్యమివ స్థితమ్. 4

ప్రళయకాలమందువలె నిపుడును, ఈ జగత్తు లేకయేయున్నది. ఇది స్వప్నాకాశపురమువలె ఆభాసమాత్రమేయగుచు నిక్కముగ అసత్యమైయున్నను సత్యమైనదానివలె స్థితినొందియున్నది.

తజ్జ్ఞాజ్ఞాతో న మూర్ఖాణామజ్ఞాజ్ఞాతో న తద్విదామ్
విద్యతే సర్గశబ్దార్థః సత్యాసత్యమయాత్మకః. 5

సత్య, అసత్యమయమగు ఈ సృష్టియొక్క శబ్దార్థమెయ్యది జ్ఞానులచే నెఱుఁగఁబడియున్నదో, అది అజ్ఞానులకులేదు; ఏది అజ్ఞానులచే నెఱుఁగఁబడియున్నదో, అది జ్ఞానులకు లేదు.

తజ్జ్ఞాజ్ఞయోస్తయోరన్తః ప్రతిపత్తౌ తు యత్స్థితమ్
న బోద్ధుం న చ వక్తుం తే జానీతస్తౌ పరస్పరమ్. 6

ఏలయనిన, జ్ఞానులు కేవలము అంతర్దృష్టిగలవారును, అజ్ఞానులు కేవల బాహ్యదృష్టిగలవారునైయున్నారు. జగత్తో, రెంటిమధ్యను బుద్ధివృత్తియందు స్ఫురించియున్నది. కావున, ఇరువురును దాని నెఱుఁగుటకుగాని, నీకు వచించుటకుగాని లేక పరస్పరము వచించుకొనుటకుగాని శక్యులు గాక యున్నారు.

స్వబుద్ధౌ స్వర్గశబ్దార్థో మిథోऽన్తస్తత్కిలానయోః
స్థైర్యాస్థైర్యే జాగ్రతో ద్వే అక్షిబక్షిణయోరివ. 7

జగత్తుయొక్క శబ్దార్థ మిరువురియొక్క వారివారి బుద్ధియందు స్థితినొందియున్నది. అందొకరు భ్రాంతిరహితులు, మరియొకరు భ్రాంతిసహితులు. మఱియు జ్ఞానియొక్క బుద్ధి సదా స్థిరమై ఆత్మవిషయమున మేల్కొనియుండును గావున నది స్థిరమగు ఆత్మతత్త్వమునే వీక్షించును. అజ్ఞానియొక్క బుద్ధి సదా అస్థిరమైయుండును గావున నది అస్థిరమగు బాహ్యరూపమునే గాంచును. ఇఁక రెంటియొక్క మధ్యయందలి బుద్ధియందున్న ప్రపంచముయొక్క స్వరూపము కేవలము అభ్యంతరముగాకయు, కేవలము బాహ్యముగాకయు నున్నది. కాఁబట్టి యిరువురికిని నద్దాని పరిజ్ఞానము లేకయున్నది.

ద్రవస్థితిమితా యద్వత్సరిద్వారిణి వీచయః
చితౌ స్థితిమితా స్తద్వచ్చేతనాత్సర్గవీచయః. 8

జలముయొక్క ద్రవత్వస్వభావము నవలంబించి నదీజలమందు తరంగములు స్థితి బొందునట్లు అజ్ఞాతచిత్స్వభావము నవలంబించి చైతన్యమున ఈ సృష్టిరూప తరంగములున్ను స్థితిబొందియున్నవి.

చిద్రూపం యన్న కించిత్తదిదం కించిదవస్థితమ్
భాతి దృశ్యమివాదృశ్యమపి స్వప్నపురేష్వివ. 9

వాస్తవముగ పదార్థరహితమై, అదృశ్యమైయున్నప్పటికిని చిద్రూపము స్వప్నపురములందు వలె నిట్లు పదార్థసహితముగను, దృశ్యరూపముగను వర్తించుచున్నది.

చిచ్ఛాయేయం ప్రకటతి జగదిత్యఖిళద్ధితా
నన్వమూర్తైవ మూర్తేవ ద్రవ్యచ్ఛాయేవ వై తతా. 10

అద్దమందు ఘటాదిపదార్థములయొక్క ప్రతిబింబమువలె చైతన్యముయొక్క విశాల ప్రతిబింబము. వాస్తవముగ నిరాకారమైనను నిట్లు జగదాకారముగ స్ఫురించుచున్నది.

కాయమాత్రకమేవేదం భ్రాన్తిమాత్రమసన్మయమ్
పిశాచవిభ్రమమాలోక ప్రాయమాయాసనం దృఢమ్. 11

పిశాచమునుగూర్చిన భ్రమవంటిదియు భ్రాంతిమాత్రాత్మకమైనదియు, అసద్రూపము నగు దేహమాత్రమందలి ఆత్మత్వభ్రాంతి (దేహమే నేనను భ్రాంతి) యేదిగలదో, అదియే సమస్త క్లేశములకు మూలమైయున్నది.

మనోరాజ్యమివాసత్యం లోలం లమ్బామ్బుబిన్దువత్
ద్వాభ్యామిత్యనుభూతిభ్యాం యదసత్తత్ర కాత్మతా. 12

ఏది మనోరాజ్యమువలె అసత్యమైనదో, వ్రేలాడుచుండు చంచల జలబిందువువలె క్షణికమైనదో జ్ఞానియొక్కయు, అజ్ఞానియొక్కయు నిరువురి యనుభవమునుబట్టియు అసత్తైనదో, అట్టి యీ దేహమందిక ఆత్మత్వమేమి ? (అభిమానమేల ?)

విదార్యదారురవవత్తరగ్గానిలశబ్దవత్
ఖే శబ్దాః పవనస్ఫోటా భాన్త్యర్థా వాసనోదయాః 13

చిల్లుఁబడు వెదళ్ళనుండియు లేక ఇతరములగు కాష్ఠములనుండియు జలమందలి తరంగములనుండియు, అగ్నియందలి జ్వాలలనుండియు, ఆకాశమందలి వాయువుయొక్క చలనమునుండియు వాక్యము ఉచ్చరించునపుడు కంఠమునుండియు ధ్వనులు బయల్వెడలునట్లు తోచునేగాని వాస్తవముగ నయా కాష్ఠాదులలోపల ఆ ధ్వనులు లేనట్లు వాసనామయములగు పదార్థములున్ను జాగ్రత్స్వప్నములందు ఆత్మనుండి బయల్వెడలునట్లు తోచునేగాని వాస్తవముగ నవి ఆత్మయందు లేవు.

సర్గాదితః స్వపరిభా కచతి స్వప్నశైలవత్
వస్తుతస్తు న శబ్దోఽస్తి నార్థోఽస్తి న చ దృశ్యతా. 14

సృష్ట్యాదినుండియు కేవలము స్వాత్మచైతన్యమే స్వప్న పర్వతమువలె ఈ జగద్రూపముగ స్ఫురించుచున్నది. వాస్తవముగ శబ్దముగాని, అర్థముగాని, దృశ్యత్వముగాని లేవు.

యదిదం చాస్తి చాభాతి తత్సర్వం పరమార్థసత్
అన్యాదృక్కారణాభావాత్సర్గాదావేవ నోదితమ్. 15

ఈ కలదియు భాసించునదియు నంతయు పరమార్థసత్తగు ఆత్మచైతన్యమే యైయున్నది. ఏల యనిన, సత్తుకంటె వేఱైనది కారణాభావముచే సృష్ట్యాదియందే యుత్పన్నము కాకయున్నది.

నిరస్తశబ్దభేదార్థమనిరస్తాఖిలార్థకమ్
శామ్యామి పరినిర్వామి వ్యోమైవాస్మీతి బుద్ధ్యతామ్. 16

ఓ రామచంద్రా! సమస్తపదార్థ భేదరహితమైనదియు, అధిష్ఠానదృష్టిచే సమస్తపదార్థ సహితమైనదియునగు శుద్ధ చిదాకాశమే నేను, నేను సర్వవిధముల శాంతుఁడను, సుఖస్వరూపుఁడను అని యిట్లెఱుగుము.

త్యజ్యతామాత్మవిశ్రాన్త్యా శుద్ధబోధైకరూపయా
జీవేఽజవం జవీభావస్త్వసదుత్థిత ఆత్మనా 17

ఓ రామచంద్రా! జీవునియందు అసద్రూపముగ నావిర్భవించినట్టి తమస్సును మనోవిక్షేపమును, శుద్ధబోధైక స్వరూపముగు ఆత్మయందలి విశ్రాంతిచే త్యజించివేయుము.

ఆత్మైవ హ్యాత్మనో బన్ధురాత్మైవ రిపురాత్మనః
ఆత్మాత్మనా న చేత్త్రాతస్తదుపాయోఽస్తి నేతరః. 18

ఆత్మజ్ఞానముకొఱకై దృఢ ప్రయత్నముచేయుచో తానే తనకు బంధువగును. అట్లు చేయకున్న తానే తనకు శత్రువగును. తనచేతనే తానుజ్ఞాన సంపాదనముద్వారా రక్షింపఁబడనిచో నిఁక తన రక్షణమందు మఱియొక యుపాయమెద్దియునులేదు.

తర తారుణ్యమస్తీదం యావత్తే తావదమ్బుధేః
నను సంసారనామ్నోఽస్మాద్బుద్ధ్యా నావా విశుద్ధయా. 19

ఓ రామచంద్రా! యౌవనమున్నపుడే శుద్ధబుద్ధియను నౌకద్వారా సంసారమను సముద్రమును దాటివేయుము.

అద్యైవ కురు యచ్ఛ్రేయో వృద్ధః సన్కిం కరిష్యసి
స్వగాత్రాణ్యపి భారాయ భవన్తి హి విపర్యయే. 20

ఆత్మజ్ఞానము శ్రేయస్సు నిపుడే సంపాదింపుము. ఏలయన వృద్ధుడవైనచో నిక నేమి చేయఁగలవు? అపుడు హస్తపాదాది నిజశరీరావయవములే భారభూతములై యుండును.

శైశవం వార్ధకం జ్ఞేయం తిర్యక్త్వం మృతిరేవ చ
తారుణ్యమేవ జీవస్య జీవితం తచ్చివేకి చేత్. 21

బాల్య, వార్ధక్యములు జ్ఞానసాధకములు గానందున పశు, పక్షిత్వ సదృశములును, మరణతుల్యములునై యున్నవి. కేవలము యౌవనావస్థ యొకటియే, వివేకయుక్తమగుచో, జీవుని యొక్క జీవనమై తనరుచున్నది. (అట్లు వివేకయుక్తముగానిచో నది పశుత్వ, మరణములకంటెను అధమమని భావము.)

సంసారమిమమాసాద్య విద్యుత్సంపాతచఞ్చలమ్
సచ్ఛాస్త్రసాధుసంపర్కైః కర్దమాత్సారముద్ధరేత్. 22

మెఱపుయొక్క పతనమువలెఁ చంచలమైనట్టి యీ సంసారమును బొందిన మనుజుఁడు సచ్ఛాస్త్ర, సాధుసంపర్కములచే తన ఆత్మను అజ్ఞాన పంకమునుండి బయటకుఁ దీయవలెను.

అహో బత నరాః క్రూరా గతిః కైషాం భవిష్యతి
కుర్వన్తి కర్దమోన్మగ్నే నాత్మన్యపి నిజోదయమ్. 23

అజ్ఞానమను పంకమున ఆత్మ మునిఁగియుండ శాస్త్రాద్యుపాయములచే నెవరు తమ్ముల నుద్ధరించుకొనరో, అట్టివారు మహాక్రూరులును, అధములు నగుదురు. అయ్యో! అట్టివారి కేగతి లభించునో!

యథా మృన్మయవేతాళసభా గ్రామ్యస్య భీప్రదా
యథా భూతార్థవిజ్ఞానాన్మృణ్మయ్యేవ సుఖప్రదా. 24
తథా బ్రహ్మమయీ దృశ్యలక్ష్మీరజ్ఞస్య దుఃఖదా
యథా భూతార్థవిజ్ఞానే బ్రహ్మైవాస్తే న దుఃఖదా. 25

మృత్తికామయమగు బేతాళసభ అది మృత్తికామయమని యెఱుఁగనపుడు గ్రామికునకు భయజ్వరాది దుఃఖము నెట్లు కలిగించునో, దాని యథార్థస్వరూపము నెఱుఁగునపుడు భయ్యాది యెట్లు దుఃఖమును గలిగింపదో, అట్లే బ్రహ్మమయమగు దృశ్యము గూడ, అది బ్రహ్మమయమని యెఱుఁగని అజ్ఞానికి దుఃఖప్రదమైయుండును. కాని యథార్థజ్ఞానము కలుగునపు డిది బ్రహ్మముగనే యుండును గాని దుఃఖప్రదముగఁ గాదు.

శామ్యత్యశాన్తమేవేదం స్థితమేవ విలీయతే
దృశ్యం తత్త్వపరిజ్ఞానాద్దృశ్యమానం న దృశ్యతే. 26

తత్త్వజ్ఞానముచే ఈ దృశ్యము అశాంతముగ నున్నదైనను శాంతినొందును, స్థితి నొందియున్నదైనను విలీనమైపోవును, గోచరమానముగ నున్నదైనను అదృశ్యమగును.

స్ఫుటానుభవనస్యాపి స్వప్నకాలే నిజే యథా
పరిజ్ఞానాదసత్యత్వమేవ సత్యపదం గతా. 27
తథానుభూయమానాపి సర్గసంవేదనామ్బరే
చిన్మయే తత్త్వవిజ్ఞానాచ్ఛూన్యతైవావశిష్యతే. 28

స్వప్నపదార్థములు స్వప్నకాలమున ప్రత్యక్షముగ ననుభూతములైనను, 'ఇది స్వప్నముగ అని యెఱుఁగఁబడినపిదప యెట్లు అసత్యము లగుచున్నవో, అట్లే యీ సృష్టియు స్పష్టముగ ననుభూతమై, సత్యముగఁ దోఁచుచున్నను, తత్త్వజ్ఞానముచే చిన్మయాకాశమున శూన్యరూపముగనే శేషించుచున్నది.

జాతిజ్వరజ్వలితజీవితజఙ్గలేషు
శీర్ణాని వాతహరిణాహరిణక్రమేణ
మాద్యన్మనః పవనపాతయుజాన్యమూని
జిత్వేన్ద్రియాణి జయమేహి జహీహి జన్మ. 29

ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే ఉత్తరార్ధే అవి॥ అవిద్యానిరసనో నామ ద్విషష్ట్యధికశతతమః సర్గః ॥ 162 ॥

ఓ రామచంద్రా! జన్మ — జ్వరరూపములగు కామ, క్రోధ, లోభ, మోహాది దావాగ్నులచే ప్రదీప్తములగు జీవితమను అరణ్యములందు హరిణములవలె నొకప్పుడు ఇష్టవస్తువు సంప్రాప్తించుటచేతను ఒకప్పుడు సంప్రాప్తింపకుండుటచేతను శిథిలములైనవియు, మదించిన మనస్సుద్వారా, మఱియు ప్రాణవాయువుద్వారా బాహ్య విషయప్రదేశమున సంచరించునవియునగు ఈ యింద్రియములను జయించి జ్ఞానముద్వారా అవిద్యాజయమును బడసి, దానిచే ముక్తుఁడవై జననమరణములను త్యజించివేయుము.

ఇది శ్రీవాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున నుత్తరార్ధమున అవి॥ అవిద్యానిరసనమను నూటయఱువది రెండవ సర్గము ॥ 162 ॥

## త్రిషష్ట్యధికశతతమః సర్గః

[ఇహేన్ద్రియజయోపాయ శ్చిత్తరోధశ్చిదద్వయే
అభ్యాసశ్చాస్య శాస్త్రస్య కీర్తితా బోధహేతవః

ఇంద్రియములను జయించుట కుపాయములు, చిత్తనిరోధము, ఈ యోగవాసిష్ఠ శాస్త్రముయొక్క అభ్యాసము అద్వైత చిద్రూపసాక్షాత్కారమును గలుగఁజేయుననుట, ఇచట నిరూపింపఁబడుచున్నవి.]

శ్రీరామ ఉవాచ:—

వినేన్ద్రియజయేనేదం నాజ్ఞత్వముపశామ్యతి
తదిన్ద్రియాణి జీయన్తే కథం కథయ మె మునే. 1

శ్రీరాముఁడు:— ఓ మునీంద్రా! ఇంద్రియజయము లేకున్న ఈ అజ్ఞానము శమింపదు గదా! అట్లైన యీ యింద్రియము లెట్లు జయింపఁబడునో తెలుప ప్రార్థన!

శ్రీ వసిష్ఠ ఉవాచ:—

న చ ప్రభూతభోగేషు న పుంస్త్వే న చ జీవితే
న చేన్ద్రియజయోన్ముక్తా దీపస్తనుదృశో యథా. 2

శ్రీవసిష్ఠుఁడు:— ఓ రామచంద్రా! ఈ నీ ప్రశ్న మేల యోగ్యముగనున్నది. ఏల యనిన, మందదృష్టిగలవానికి ప్రజ్వలించు దీపమున్ను సూక్ష్మపదార్థదర్శనమున నుపయోగకర మెట్లుకాదో, అట్లే, అనేక విషయభోగములం దాసక్తుఁడును, తనయొక్క గొప్పతనమును సంపాదించుటయందుఁ గోర్కెగలవాఁడును, ధనార్జనాదులం దాసక్తిగలవాడును, ఇంద్రియజయము లేనివాఁడు నగు మనుజునకు శాస్త్రాదిసాధనములున్ను బ్రహ్మదర్శనమున ఉపయుక్తములు కానేరవు.

తదిన్ద్రియజయే యుక్తిమిమామవికలాం శృణు
సిద్ధిమేతి స్వయత్నేన సుఖేన తనురేతయా. 3

కాఁబట్టి యింద్రియజయముకొఱకై ఈ యుత్తమయుక్తిని నీవు వినుము. ఇద్దానిచే నింద్రియజయముద్వారా అల్పసాధనమైనను స్వప్రయత్నముచేఁ సులభముగ మోక్షఫలసిద్ధిని బొందఁగలదు.

చిన్మాత్రం పురుషం విద్ధి చేతనాజ్జీవనామకమ్
యచ్చేతసి స జీవోఽన్తస్తన్మయో భవతి క్షణాత్. 4

ఓ రామచంద్రా! నీవు పురుషుని చిన్మాత్రునిగనే యెఱుఁగుము. చిత్తమునఁ బ్రాప్తించిన విషయముల నెఱుఁగుటఁబట్టి (చిత్తమున కధీనుఁడగుటవలన) యాతఁడు జీవుఁడని చెప్పఁబడుచున్నాఁడు. ఆ జీవుఁడు తనయందు చిత్తవృత్తిచే వ్యాపించి దేనిని సంకల్పించునో, క్షణకాలములో నద్దానియందు తన్మయుఁ డగుచున్నాఁడు. (ఆసక్తి గలవాఁడగుచునాఁడని భావము.)

సంవిత్ప్రయత్నం సంబోధనిశితాఙ్కుశకర్షణైః
మనోమత్తగజం మత్తం జిత్వా జయతి నాన్యథా. 5

చిత్తమును 'ప్రత్యాహార'మను యత్నముచే అభ్యంతరమున కాకర్షించుటద్వారా యద్దాని బాహ్యాకారమును నిరోధించి బ్రహ్మాకారత్వ ప్రబోధనముయొక్క అభ్యాసమను తీక్ష్ణమైన అంకుశముయొక్క పోట్లచే మనస్సను మదపుటేనుఁగును జయించుటద్వారా మనుజుఁడు ఇంద్రియములను జయింపఁగల్గునుగాని మఱియొక విధముగఁగాదు.

చిత్తమిన్ద్రియ సేనాయా నాయకం తజ్జయాజ్జయః
ఉపానద్గూఢపాదస్య నను చర్మావృతైవ భూః. 6

చిత్తము ఇంద్రియములను సేనయొక్క నాయకుఁడు. కావునఁ దానియొక్కదానిని జయించుటచే సర్వేంద్రియములపైనను విజయము సంప్రాప్తించుచున్నది. ఎవని పాదములకు చెప్పులు గలవో, ఆతనికి భూమియంతయును చర్మముచేఁ గప్పఁబడినట్లే యగునుగదా!

నవిదం సంవిదాకాశే సంరోప్య హృది తిష్ఠతః
స్వయమేవ మనః శామ్యేన్నీహార ఇవ శారదః. 7

ఎవఁడు తన జీవసంవిత్తును (చిత్తవృత్తిని) బ్రహ్మముతోటి ఐక్యపఱచి స్వాత్మయందు స్థితిగల్గియుండునో, ఆతనిమనస్సు శరత్కాలమందలి మంచువలె స్వయముగనే శమించును.

స్వసంవిద్యత్న సంరోధాద్యథా చేతః ప్రశామ్యతి
న తథాఙ్గ తప స్తీర్థ విద్యా యజ్ఞ క్రియా గణైః. 8

నిజ జీవసంవిత్తును (విషయాకార చిత్తవృత్తిని) బ్రహ్మమందైక్యపఱచుటయను యత్నముచే చిత్త మే ప్రకారము శమించునో, ఆ ప్రకారము తపస్తీర్థ, విద్యా, యజ్ఞాది క్రియాసమూహములచేఁ శమింపనేరదు.

యచ్చ సంవేద్యతే కించి త్త త్తత్సంవిది సంవిదా
నూనం విస్మార్యతే యత్నాద్భోగానామితి తజ్జయః. 9

ఏ యే విషయములయొక్క స్మరణము చిత్తవృత్తియందు బలాత్కారముగ సంభవించునో ఆ యా విషయములను అధిష్ఠానబ్రహ్మసంవిత్తునందు లయమొనర్చుటచే తద్విషయసంస్కారములు నశించి విషయవిస్మృతిచేకూరను. ఇట్టి ప్రయత్నరూపోపాయముచే భోగహేతువులగు విషయములయొక్క జయము సంప్రాప్తించుచున్నది.

స్వసంవేదనయత్నేన విషయామిషతోఽనిశమ్
కించిత్సంరోధితా సంవిత్ప్రాప్తం వై బుధం పదమ్. 10

నిజాభ్యాసమను యత్నముచే చిత్తవృత్తి విషయమును మాంసమునుండి సదా యొకింతైనను నిరోధింపఁబడినచో నపుడిఁక తత్త్వవేత్తలయొక్క యనుభవసిద్ధమగు స్వారాజ్య పదము పొందఁబడినదే యగును.

స్వధర్మవ్యవహారేణ యదా యాతి తదేవ మే
రోచతే నాన్యదిత్యేవ వదే వజ్రదృఢీభవ. 11

ఓ రామచంద్రా! స్వకీయవర్ణాశ్రమ ధర్మముయొక్క వ్యవహారముద్వారా అప్రయత్నముగ లభించిన పదార్థమే నాకు రుచించును. మఱియొకటికాదు. అనునిట్టి స్వధర్మైకనిష్ఠత్వముచేతను విషయ వైతృష్ణముద్వారా యింద్రియములను జయించి ఆత్మపదమున వజ్రమువలె దృఢముగ నెలయుము.

సంవిత్ప్రవృత్తిమర్థేషు విరుద్ధేషు వివర్జయన్
అర్జయఞ్ఛమసంతోషౌ యః స్థితః స జితేన్ద్రియః. 12

స్వధర్మవిరుద్ధములగు పదార్థములందు కోర్కెను త్యజించుచు, శమ, సంతోషములను సముపార్జించుచు నెవఁడుండునో ఆతఁడు జితేంద్రియుఁడనఁబడును.

సంవిద్రసికతాస్వన్తస్తథా నీరసతాసు చ
యస్యనోద్వేగమాయాతి మనస్తస్యోపశామ్యతి. 13

ఎవఁడు అభ్యంతరసంవిత్తునందు (ఆత్మయందు) ప్రీతిగల్గియుండుట యొక్కయు, బాహ్యచిత్తవృత్తులందు అప్రీతిగల్గియుండుటయొక్కయు అభ్యాసమందు అరుచిగల్గియుండఁడో అతని మనస్సు శమించును.

సంవిత్ప్రయత్నసంరోధాన్మనః స్వాయనముజ్ఝతి
చేతశ్చపలతోన్ముక్తం వివేకమనుధావతి. 14

ప్రయత్నముచే చిత్తవృత్తిని నిరోధించుటవలన మనస్సు విషయములవైపునకుఁ బరుగిడుట యను తన దుర్వ్యసనమును త్యజించును. మఱియు నెపుడట్టి విషయధావనమను చపలత్వమును వీడునో, అపుఁడిక వివేకము వైపునకే యది పరుగిడసాగును.

వివేకవానుదారాత్మా విజితేన్ద్రియ ఉచ్యతే
వాసనావీచివేగేన భవాబ్ధౌ న స ముహ్యతే. 15

అట్టి వివేకియగు ఉదారచరితుఁడు జితేంద్రియుఁడని చెప్పఁబడును. అతఁడిక సంసారసముద్రమున వాసనలను తరంగములయొక్క వేగముచే నెన్నఁటికిని గొట్టుకొనిపోఁడు.

సాధుసంపర్కసచ్ఛాస్త్రసమాలోకనతోఽనిశమ్
జితేన్ద్రియో యథావస్తు జగత్సత్యం ప్రపశ్యతి. 16

జితేంద్రియుఁడగువాఁడు నిరంతరము సాధుసంపర్క, సచ్ఛాస్త్రావలోకనములద్వారా జగత్తును యథార్థరూపముతోటి సత్యబ్రహ్మమాత్రముగ వీక్షించును.

సత్యావలోకనాచ్ఛాన్తిమేతి సంసారసంభ్రమః
మరావివ జలజ్ఞానం మిథ్యా పతనదుఃఖదమ్. 17

మఱియు, మృగతృష్ణయొక్క యథార్థజ్ఞానముచే మరుభూమియందు మిథ్యావస్తువును గూర్చి పరుగిడుట మున్నగు క్లేశముల గల్గించునదైన జలజ్ఞానము శమించునట్లు, అట్టి సత్యవస్తువు (ఆత్మ) యొక్క అవలోకనముచే సంసారభ్రమ శమించిపోవుచున్నది.

అచేత్యమేవ చిన్మాత్రమిదం జగదితి స్థితమ్
ఇత్యేవ సత్యబోధస్య బన్ధమోక్షదృశౌ కుతః 18

'ఈ జగత్తు విషయ (దృశ్య) రహితమగు కేవల చిన్మాత్రముగనే వెలయుచున్నది' అను నీ ప్రకారమగు సత్యబోధగలవాని కిఁక బంధ, మోక్షము లెచట!

అనాకారం యథా వారి క్షీణం వహతి నో పునః
అకారణం తథా దృశ్యం జ్ఞానచ్ఛిన్నం న రోహతి. 19

ఎండిపోవుటవలన ఆకారమును గోల్పోయి క్షయించినట్టి జలము మరల యెట్లు ప్రవహింప నేరదో, అట్లే జ్ఞానముచే ఛేదింపఁబడిన మూలముగల యీ దృశ్యమున్ను కారణరహితమై మరల యెన్నఁటికిని నుద్భవింపకుండును.

వేదనం వ్యోమమాత్రం త్వమహమిత్యాదిరూపధృక్
వర్జయిత్వైతదన్యత్వాదహమిత్యాదికం జగత్. 20

చిదాకాశమాత్రమగు సంవిత్తే అవిద్యచే 'నీవు నేను' మున్నగురూపములతోఁ గూడిన జగత్తును ధరించియున్నది. కావున, స్వాత్మయందు అధ్యస్తమైన యీ జగత్తును జ్ఞానముచేఁ దుడిచివైచి, అధ్యస్తమైనదానికంటె భిన్నమైనట్టి అధిష్ఠానచిన్మాత్రమే యైయుండవలెను.

అవిద్యామాత్రమేవేదమహమిత్యాదికం జగత్
చిద్వ్యోమ్న్యేవ స్థితం శాన్తం శూన్యమాత్రశరీరకమ్. 21

'నేను నీవు' మున్నగురూపములతోఁగూడిన యీ జగత్తు అవిద్యామాత్రమేయై, మిథ్యయగుటచే స్వయముగనే శమించినదై, శూన్యమాత్ర స్వరూపముగలదై చిదాకాశమందే (అధ్యస్తమై) వెలయుచున్నది.

ఇదం చిద్వ్యోమ్ని చిచ్ఛాయా జగదిత్యేవ భాసతే
శూన్యశూన్యైవ చిద్భాసా శూన్యా చేత్యేవ నిశ్చయః. 22

చిదాకాశమందే చిదాకాశముయొక్క ప్రతిబింబము జగద్రూపముగ భాసించుచున్నది. మఱియు జగచ్ఛూన్యమగు చిదాకాశము శూన్యముకంటెను అతిశూన్య (అతిసూక్ష్మ) మైనదనుటయే పరమసిద్ధాంతము.

స్వప్నదర్శనదృష్టాన్తః కేన నామాత్ర ఖణ్డ్యతే
అసన్మయోఽనుభూతశ్చ స్వానుభూతోఽప్యసన్మయః. 23

అసత్తైనను అనుభూతమగునదియు, స్వానుభూతమైనను అసత్తైనదియునగు స్వప్నదర్శన దృష్టాంతము నెవఁడు ఖండింపఁగలఁడు?

సోఽఙ్గ సంవిత్తిమాత్రాత్మా యద్వద్రాజ్యం మహీయతే
న కర్తృ కర్మ కరణం రూపం తద్వజ్జగచ్చితేః. 24

ప్రియుఁడవగు నో రామచంద్రా! స్వప్న జ్ఞానమాత్ర స్వరూపముగల యేదిస్వప్నమునః రాజ్యవైభవముగనయి వెలయుచున్నదో, అదియంతయు చైతన్యముయొక్కయే రూపమైయున్నది ఏలయనిన అది కర్తృ, కర్మ కరణాదుల నపేక్షింపకయేయున్నది. అట్లే కర్త్రాదిరహితమగు జాగ్రజ్జగత్తున్ను చైతన్యముయొక్క రూపమేయైయున్నది.

అకర్తృకర్మకరణమహం చిద్ఘనమాత్రకమ్
జగచ్చేదమనిర్దేశ్యం స్వసంవేదనలక్షణమ్. 25

ఏది కర్తృ, కర్మ, కరణాది సామగ్రి నపేక్షింపక భాసించునో, అది చిద్ఘనమాత్రుఁడ నగు నేనేనైయున్నాను. ఈ జగత్తున్ను సృష్ట్యాదియందు కర్త్రాది సామగ్రీసహితమని నిర్దేశించుట కఠిన్యము కావున నిదియు నాయొక్క స్వప్రకాశాత్మ స్వరూపమే యైయున్నది.

యథా స్వప్నేషు మరణమనుభూతం న విద్యతే
మరౌ జలేచ్ఛా విద్యేయం విద్యమానా న విద్యతే. 26

స్వప్నమందలి స్వమరణమున్ను, మరుభూమియందలి జలభ్రాంతియు అనుభూతములైనను లేనివే యగునట్లు అవిద్యారూపమగు ఈ జగత్తున్ను విద్యమానమైయున్నప్పటికిని జ్ఞానముచే బాధితమగుటచే లేనిదేయైయున్నది.

చిద్వ్యోమ్నా కాచకచ్యం స్వం సర్గాదౌ వ్యోమ్ని చేతితమ్
జగదిత్యేవ నిర్మూలం కాకతాలీయవత్స్వయమ్. 27

ఈ జగత్తు చైతన్యమను మణియొక్క ప్రకాశరూపమై సృష్ట్యాదియందు చిదాకాశముచే స్వాత్మయందు సంకల్పింపఁబడినదైయున్నది. ఇది కారణరహితమై యొప్పుచు కాకతాలీయ న్యాయముగ స్వయముగనే (మిథ్యారూపమున) భాసించుచున్నది.

నిర్మూలమేవ భాతీదమ భాతమపి భాతవత్
తస్మాద్యద్భాసురమిదం తత్తదేవ పదం విదుః. 28

యథార్థముగ కారణరహితమైనట్టి యీ జగత్తు భాసింపక యేయున్నను భాసించుచున్నట్లు ప్రతీతమగుచున్నది. మఱియు ఏ చిత్ప్రకాశమువలన నిది ప్రత్యక్షముగ వ్యక్తమై భాసించుచున్నదో, దానినే తత్త్వజ్ఞులు పరమపదమగు బ్రహ్మమని చెప్పిరి.

జీవాదికచనం త్వత్ర యద్భాతీదం తదేవ తత్
శూన్యత్వైవ భవేద్వ్యోమ వార్యేవావర్తవృత్తయః. 29

జీవాది పదార్థరూపముగ నెయ్యది స్ఫురించుచున్నదో, అది చిద్రూపమేయైయున్నది. ఏలయనిన, శూన్యత్వము ఆకాశమాత్రమై, ఆవర్త, తరంగాదులు జలమాత్రమైయే యున్నవిగదా!

యథా వయవినో రూపమేకం సావయవం భవేత్
ఏకం జీవాద్యవయవం బ్రహ్మానవయవం తథా. 30

అవయవియొక్క యేకమగు రూపమెట్లు అనేకావయవసహితమై, యొప్పుచున్నదో, అట్లే వాస్తవముగ అవయవరహితమైనట్టి యేకమగు బ్రహమున్ను, జీవజగదాద్యనేకావయవ సహితముగ భాసించుచున్నది.

ఆభాసమాత్రం దృశ్యాత్మ చిన్మాత్రం శాన్తమవ్యయమ్
స్థితమాస్థా కిమేతస్మిన్స్వభావే స్వే విచార్యతే. 31

లేక ఓ రామచంద్రా! స్ఫటికశిలయందలి వనాదుల ప్రతిబింబమువలె ఈ దృశ్య జగత్తు శాంతమై నాశరహితమైనట్టి చిన్మాత్రమందు, ఆభాసమాత్రముగ స్థితినొందియున్నదగును. మఱియు అట్టి నిర్మల చిన్మాత్ర స్వభావమే యీ జగద్రూపముగ వెలయుచున్నది. ఈ ప్రకారముగ ఆత్మ స్వభావరూపమేయగు ఈ జగత్తునుగూర్చి నీ విక నేమి విచారించుచున్నావు?

నాద్యన్తమధ్యాః కలనాః కాశ్చిత్సన్తి పరే పదే
తద్రూపమేవావిద్యేయం నావిద్యాऽత్రేహ విద్యతే. 32

పరమపదమగు బ్రహ్మమున ఆద్యంత మధ్యములఁగూర్చిన కల్పన యెద్దియునులేదు. జగత్తున్ను, దాని కారణమగు అవిద్యయున్ను పరమాత్మయొక్క యే రూపములైయున్నవి. పరమాత్మకంటె భిన్నముగ అవిద్యయనునదియేలేదు.

జీవః స్వప్నాద్విశఞ్జాగ్రజ్జాగ్రతః స్వప్నమావిశన్
ప్రబుద్ధో వాऽప్యబుద్ధో వాప్యేకరూపతయా స్థితః. 33

జీవుఁడు ప్రబుద్ధుడైనను, అప్రబుద్ధుడైనను స్వప్నమునుండి జాగ్రత్తునందును, జాగ్రత్తునుండి స్వప్నమునందును ప్రవేశించుచు ఏకమైనట్టి శుద్ధ చిద్రూపముతోటియే వెలయుచున్నాఁడు.

స్థితే సుషుప్తతుర్యే ద్వే సదా స్వప్నేऽథ జాగ్రతి
జాగ్రత్స్వప్నావేకమేవ తుర్యం వేత్తి తు బుద్ధధీః. 34

సుషుప్తికాలమందని అజ్ఞానముచే నావృతమగు ఆత్మయు, తురీయావస్థయందలి శుద్ధాత్మయు భ్రాంతికృత సర్పమందు అజ్ఞానరజ్జు, కేవల రజ్జువులవలె - స్వప్న, జాగ్రత్తులందు సదా యుండియుండుటచే, జ్ఞాని జాగ్రత్స్వప్నములందును యేకమగు తురీయస్థితిని నెఱుఁగుచున్నాఁడు.

జాగ్రత్స్వప్నః సుషుప్తం చ సర్వం తుర్యం ప్రబోధినః
నావిద్యా విద్యతే తస్య ద్వయస్థోऽప్యేవ సోऽద్వయః. 35

తత్త్వజ్ఞునకు జాగ్రత్స్వప్న సుషుప్తులు మూఁడును తురీయమేయగును. ఏలయనిన, అతనికి 'అవిద్య'లేనందున ద్వైతమందున్నప్పటికిని, అద్వైతరూపుఁడేయై విలసిల్లును.

ద్వైతమద్వైతమిత్యేతదహం త్వమిదమిత్యపి
నిరవిద్యస్య కలనా కుతః కాప్యమ్బరం కుతః. 36

ద్వైతము, అద్వైతము, నేను, నీవు, ఇది మున్నగు కల్పనలు, అవిద్యారహితుఁడగు జ్ఞానికెచటివి ? మఱియు సర్వత్ర పూర్ణ చిద్రూపమును గాంచునట్టి యాతనికి శూన్యత్వమున్ను నెచట ?

ద్వైతాద్వైతసముద్భేదైర్వాక్యసందర్భవిభ్రమైః
క్రీడన్త్యబుద్ధాః శిశవో బోధవృద్ధా హసన్తి తాన్ 37

ద్వైత, అద్వైతాది భేదములతోఁగూడిన వాక్యవిభ్రమములతోటి అజ్ఞానులను బాలురు గ్రీడించుచున్నారు. బోధవృద్ధులగు జ్ఞానులు వారినిజూచి నవ్వుచున్నారు.

ద్వైతాద్వైత వివాదేహా హృదయాకాశమఞ్జరీ
విన్నైతయేహ నోదేతి ప్రబోధాకాశమారనమ్. 38

ద్వైతాద్వైత వివాదములనుగూర్చిన కోర్కెయను లత శిష్యప్రబోధమను ఫలము గలుగఁజేయుటకొఱకు మాత్రము జ్ఞానుల హృదయాకాశమున అధ్యారోపింపఁబడియున్నది. ఏలయనిన, అదిలేనిచో నిఁట ప్రబోధ (జ్ఞాన)మును ఆకాశముయొక్క శుద్ధి సంభవింపనేరదు.

సుహృద్భూత్వా వివాదేన ద్వైతాద్వైతవిచారణా
కృతా హృదయగేహేఽన్తరవిద్యా భస్మమార్జని. 39

ఇక్కారణముననే మిత్రభావముచే నేను కల్పితమైనట్టి ద్వైతాద్వైత విచారణయను మార్జనిని (చీపురును) వివాదసహితముగ నంగీకరించితిని. ముముక్షువుల హృదయగుహనుండి అవిద్యయను ధూళిని నూడ్చివైచినపిదప నద్దానిని (ద్వైతాద్వైత విచారణను) నేనొకవైపుదూరముగఁ బడవైచెదను.

తచ్చిత్తాస్తద్గతప్రాణా బోధయన్తః పరస్పరమ్
కథయన్తశ్చ తన్నిత్యం తుష్యన్తి చ రమన్తి చ. 40

అట్లు, అవిద్యయను ధూళి తుడిచివేయఁబడినపిదప, అధికారులగు ముముక్షువులు బ్రహ్మమందే నెలకొల్పఁబడిన మనః ప్రాణంబులుగలవారై, బ్రహ్మమునుగూర్చియే పరస్పరము బోధించుకొనుచు, నిత్యమా బ్రహ్మమందే క్రీడించుచు, సంతుష్టులగుచు నుందురు.

తేషాం సతతయుక్తానాం భజతాం ప్రీతిపూర్వకమ్
జాయతే బుద్ధియోగోఽసౌ యేన తే యాన్తి తత్పదమ్. 41

ఇట్లు నిరంతరము ప్రీతిపూర్వకముగ ఆ (బ్రహ్మ) తత్త్వమును విచారించుచు, సేవించుచు నుండువారికిఁ కాలక్రమమున, ఈ నేను వచించిన బుద్ధి (సారాసారవివేచనాశక్తిరూప) యోగము దృఢముగ జనించును. దానిచే వారు మోక్షమను బ్రహ్మపదమును బొందుదురు.

కిలోపకురుతే యత్నాత్తృణమాత్రావగోపనే
కథం సిద్ధ్యత్యయత్నేన త్రైలోక్యగణగోపనమ్. 42

తృణమాత్రముయొక్కయు జల, అగ్ని, పశ్వాదులనుండి గావింపఁబడు — రక్షణ మందు ప్రయత్నముచే సాధింపఁబడిన యుపాయమే యుపకరించుచుండ త్రైలోక్య సమూహము యొక్క — బ్రహ్మరూపత్వ సంపాదనముద్వారా గావింపఁబడు - పరిరక్షణ రూపమగు తత్త్వ జ్ఞానము ప్రయత్నములేక ఎట్లు సిద్ధించును ?

అధ్యాత్మవ్యసనోన్ముక్తం తతం హృత్వాఽధమాఽప్రభు
ఉపహాసాస్పదం యస్యా జగదప్యుత్తమస్థితేః. 43

అధ్యాత్మజ్ఞానమం దాసక్తిలేనిదియు, మనుష్యానందము మొదలుకొని బ్రహ్మదేవుని యానందమువఱకు నొకదానికంటె మఱియొకటి పదిరెట్లధికముగనున్నట్టి సుఖముయొక్క యుప భోగముకొఱకై పదునాల్గులోకములందును వ్యాపించియున్నదియు, హృదయమందలి నీచమగు కామమును జయింపఁజాలనిదియునగు సమస్తజీవసమూహమున్ను, ఏ నిరతిశయానందరూపమగు ఉత్తమస్థితికి హాస్యాస్పదమైయున్నదో, అట్టి సర్వోత్తమమగు స్థితియొక్క సంపాదనమున ప్రయత్న మేల యుండరాదు ?

కిం నామేదం కిల సుఖం యద్రాజ్యాదిమనోఙ్కురమ్
తత్త్వజ్ఞానైకవిశ్రాన్తౌ దేవరాజపదమ్ తృణమ్. 44

మనస్సుయొక్క అంకురరూపమగు ఈ సంసారమందలి రాజ్యాదిసుఖ మేమిసుఖము? (తుచ్ఛమని భావము) ఏలయనిన, తత్త్వజ్ఞానమునఁ బూర్ణముగ విశ్రాంతి లభింప, ఇంద్రునియొక్క రాజ్యపద సుఖమున్ను తృణమువలెఁ బోచును.

సుప్తాః ప్రబుద్ధాః పశ్యన్తి దృశ్యం దృశ్యే రతా యథా
తథా దృశ్యే రతాః శాన్తాః సన్తః పశ్యన్తి తత్పదమ్. 45

అజ్ఞాన నిద్రయందున్న విషయ లంపటులు దృశ్యము నెట్లు అత్యంతాసక్తితోఁ జూచుచుందురో, అట్లే శాంతులగు తత్త్వజ్ఞానులు దృశ్యముయెడల నిదురించువారి చందమున నున్నవారై, నిరతిశయానందరూపమగు ఆత్మపదమున మేల్కొని యద్దానినే గాంచుచుందురు.

వినా యత్నభరేణేదం న కదాచన సిద్ధ్యతి
మహతోఽభ్యాస వృక్షస్య ఫలం విద్ధి పరం పదమ్. 46

ఓ రామచంద్రా! ఇట్టి సత్యాపరోక్ష, నిరతిశయానంద రూపమగు మోక్షపదము యత్నసమూహములేక ఎన్నఁటికిని సిద్ధింపదు. ఎలయనఁగా, పరమాత్మపదము మహాభ్యాసమను వృక్షముయొక్క ఫలమని యెఱుఁగుము

ఇదం బహూక్తమేతేన కిమేతేనేతి దుర్మతిః
న గ్రాహ్యేతావతాప్యుక్తే నాద త్తే నేదమజ్ఞధీః. 47

కావుననే మీయొక్క అభ్యాసదార్ఢ్యముకొఱకై యీ విషయమునే నేననేకరీతుల అనేక యుక్తి, ఆఖ్యానములద్వారా పెక్కుమారులు మీకు వచించితిని ఇట్లు మరల మరల చెప్పుట వలన నేమి ప్రయోజనమను దుర్బుద్ధి యెవనికిని గలుగకుండుగాక! ఏలయనిన, శుద్ధహృదయుఁడును కుశలబుద్ధియునగు ఉత్తమాధికారికి స్వల్పకథనముచేఁగూడ బోధ యావిర్భవించును, కాని, అజ్ఞాని యింత యధికముగఁ జెప్పినప్పటికిని దుర్బోధమగు ఆత్మతత్త్వమును హృదయమున గ్రహింపకుండును. కావున నట్టివానికి, ఆ వృత్త్యాదిరూపమగు (మరలమరల వినుట, చింతించుట యను) అభ్యాస మావశ్యకమై యున్నది.

భూయో భూయః పరావృత్త్యా చిరమాస్వాద్యతే యది
శ్రూయతే కథ్యతే చేదం తత్ జ్ఞైర్నాజ్ఞేన భూయతే. 48

ఇక్కారణమున, ఈ నాచే వచింపఁబడిన జ్ఞానశాస్త్రమును, అజ్ఞానియైనను మరల మరల ఆవృత్తిపూర్వకముగ శ్రవణ, కథనాదులద్వారా చిరకాలము సేవించుచో నట్టి యభ్యాసముచే నాతఁడున్ను తప్పక జ్ఞాని కాఁగల్గును

యస్త్వేకవారమాలోక్య దృష్టమిత్యేవ సంత్యజేత్
ఇదం స నామ శాస్త్రేభ్యో భస్మాప్యాప్నోతి నాధమః. 49

ఎవఁ డొక పర్యాయము చూచి 'నేను జూచితిని' అని తలంచి యీ శాస్త్రమును త్యజించివేయునో, అట్టి యధమునకు అధ్యాత్మశాస్త్రములవలన భస్మమైనను లభింపనేరదు.

ఇదముత్తమమాఖ్యానమధ్యేయం వేదవత్సదా
వ్యాఖ్యేయం పూజనీయం చ పురుషార్థఫలప్రదమ్. 50

పరమ పురుషార్థమగు మోక్షమను ఫలమును గలుగఁజేయునట్టి యీ యుత్తమశాస్త్రమును వేదమువలె సదా పఠింపవలెను. వ్యాఖ్యానము చేయవలెను. పూజింపవలయును.

యదస్మాత్ప్రాప్యతే శాస్త్రాత్తద్వేదాదవాప్యతే
అస్మిన్ జ్ఞాతే క్రియాజ్ఞానం ద్వయం యాతి పవిత్రతామ్. 51

ఈ శాస్త్రమునుండి యేది లభించునో, అదియే వేదమునుండియు లభించును. ఏల యనిన, దీని నెఱిఁగినచో, క్రియా, జ్ఞానములు (వేదముయొక్క పూర్వ, ఉత్తరభాగములగు కర్మ, జ్ఞానకాండలయొక్క యర్థములు) రెండును పవిత్రములగును.

వేదాన్తతర్కసిద్ధాన్తస్త్వస్మిన్ జ్ఞాతే చ బుధ్యతే
ఇదముత్తమమాఖ్యానం వ్యాఖ్యాతం శాస్త్రదృష్టిషు. 52

(వ్యాసాది మహర్షులచే) వేదతాత్పర్య నిర్ణయానుకూలములగు ఉపక్రమాది లింగములతోఁ గూడిన తర్కములచే స్థాపింపఁబడిన సిద్ధాంత మెయ్యది గలదో, అదియును ఈ (యోగవాసిష్ఠ) శాస్త్రము నెఱుఁగుటవలనఁ దెలియఁబడగలదు మఱియు ఈ యుత్తమశాస్త్రము వేదాంత శాస్త్రములందు శ్రేష్ఠముగ నెంచఁబడినది.

కారుణ్యాద్భవతామేతదహం వచ్మి న మాయయా
భవన్తస్త్వవగచ్ఛన్తి మాయామేతద్విచార్యతామ్. 53

నేను మీ యందఱియెడలగల కారుణ్యముచేతనే యద్దానిని వచించుచున్నాను. గాని కపటముచేఁగాదు. ఎపుడీ శాస్త్రమును మీరు విచారించెదరో, అపుడీ దృశ్యసమూహము మాయ యనియే యెఱుఁగఁగలరు. కాఁబట్టి దీనిని బాగుగ విచారింపుఁడు!

అస్మాచ్ఛాస్త్రవరాద్బోధా జాయన్తే యే విచారితాత్
లవణైర్వ్యఞ్జనానీవ భాన్తి శాస్త్రాన్తరాణి తైః. 54

ఈ యుత్తమశాస్త్రముయొక్క విచారణచే నే బోధలు జనించునో వానిచే తక్కిన శాస్త్రములు, లవణముచే కూరలవలె రుచివంతములై భాసిల్లును.

అనార్ష్యమిదమాఖ్యానమిత్యనాదృత్య దృశ్యధీః
మా భవంత్వాత్మహన్తారో భవన్తో భవ భాగినః. 55

'కావ్యమువంటి దగుటచే, ఈ శాస్త్ర ముత్తమమైనదికాదు' అని తలంచి దీనిని నాదరించిన, భోగాసక్త బుద్ధులును, ఆత్మహంతకులును, సంసారపాత్రులును గాకుఁడు!

తాతస్య కూపోఽయమితి బ్రువాణాః క్షారం జలం కాపురుషాః పిబన్తి
యథా భవన్తో వివిచారవన్తస్తథానిశం మా భవతాజ్ఞితాస్మై. 56

ఇత్యార్షే శ్రీ వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు
నిర్వాణప్రకరణే ఉత్తరార్ధే ఇన్ద్రియజయోపాయశాస్త్రవర్ణనం
నామ త్రిషష్ట్యధిక శతతమః సర్గః ॥ 163 ॥

'ఇది మా తండ్రి త్రవ్వించిన నూయి' అని తలంచి నీచులు సమీపముననున్న గంగా జలమును ఎడలి, ఆ నూతియందలి యుప్పునీటినే త్రాగునట్లు, 'మా పూర్వులు మీమాంసకులు. లేక నైయాయికులు, లేక, తాంత్రికులు' అయియున్నారు. కావున మనమున్ను వారి మార్గమునే యనుసరించెదము. ఆధ్యాత్మశాస్త్రములను గాదు అని యెంచి మీరు విరుద్ధములైన వివిధవిచారములతోఁగూడి అజ్ఞానమును బొందకుఁడు!

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున నుత్తరార్ధమున ఇంద్రియ జయోపాయ శాస్త్రవర్ణనమను నూట యఱువది మూఁడవ సర్గము ॥163॥

---

## చతుః షష్ట్యధిక శతతమః సర్గః

[ బ్రహ్మభావోద్భవాజ్జీవ జగద్భావవిమార్జనైః
ఇహ జీవజగద్బ్రహ్మ సామరస్యం ప్రసాధ్యతే.

బ్రహ్మభావముచేగల్గు జీవ, జగద్భావమార్జనము (నిషేధము) ల ద్వారా జీవజగద్బ్రహ్మల సమానత్వమిచట వర్ణింపఁబడుచున్నది. ]

**శ్రీ వసిష్ఠ ఉవాచ:—**

> జీవాణవో జగత్యస్మిచ్చిదాదిత్యాంశుమణ్డలే
> యత్ర తేఽవయవాస్తుల్యాస్తేనావయవాత్మతా. 1

శ్రీ వసిష్ఠుఁడు:— ఓ రామచంద్రా! సర్వత్ర పరిపూర్ణమగు చిద్రూప సూర్యమండలము స్ఫురింప, జగత్తునందు ప్రసిద్ధములగు ఏ జీవరూపాణువులు స్ఫురించుచున్నవో, అవి అగ్ని, మిణుగురులవలె ఆ చిద్రూపసూర్యమండలముతోటి సమానమైనట్టి ప్రకాశస్వభావము గలవగుటచే చిద్రూప సూర్యునియొక్క 'అవయవవాహిత్యము' సిద్ధించినదాయెను. ఏలయనిన, అవయవితోటి తుల్యమైనట్టి అవయవములుగలచోట మనుజహస్త పాదాదులందువలె పరస్పర భేదముగాని అవయవ, అవయవి భావముగాని యుదయింపనేరదు.

> సర్వం ప్రాప్య పరం బోధం వస్తు స్వం రూపముజ్ఝతి
> పునస్తదేకవాక్యత్వాన్న కించిద్భావపరం భవేత్. 2

మఱియు, జీవులయొక్క భేదము నక్షత్రముల పరస్పర భేదమువంటిదికాదు. అది అంతఃకరణాద్యుపాధివలన కలిగినదేయగును ఆ భేదకమగు ఉపాధివస్తువున్ను 'స్వరూపమైనట్టి అఖండ పరిపూర్ణపరబ్రహ్మమే నేను' అను ఈ మహావాక్యబోధనున్ను బొందినదై తన యుపాధి రూపమును తనచే గల్పింపఁబడిన భేదరూపమును త్యజించివేచుచున్నది. అపుడిఁక మరలజీవుల యొక్క భేదమును గల్పించునది యేదియునుండదు.

సర్వాస్వేవాస్వవస్థాసు తత్త్వజ్ఞవిషయం తు తత్
పరమేవామలం బ్రహ్మ నాన్యత్కించిత్కదాచన. 3

తత్త్వజ్ఞానియొక్క విషయమగు శుద్ధబ్రహ్మము సర్వావస్థలయందును భేదకళంక రహితమై ఏకరసమై, సదా నిర్మలమైయే వెలయుచున్నది. అది యెన్నడును నొకింతైనను మఱియొకరూపమగుట లేదు.

యచ్చాతత్త్వజ్ఞవిషయం తజ్జానాతి స ఏవ తత్
వయం తు విద్మో నాహం త్వం నాతత్త్వజ్ఞం న వస్తు తత్. 4

ఇఁక, తత్త్వజ్ఞులు కానివారైన అజ్ఞానులయొక్క విషయమగు అహంత్వాదు లెవ్విగలవో, వానిని వారే యెఱుఁగుదురుగాని మేముకాదు మేము (తత్త్వజ్ఞులు) 'అహంత్వ, త్వంత్వము' (నేను, నీవు - అను భావము)లనుగాని అజ్ఞానమునుగాని యెఱుఁగము. ఏలయనిన, అవి సత్యములుకావు.

అయం సోఽహమయం చాజ్ఞః సత్యోఽయమితి బుద్ధయః
సంభవన్తి న తత్త్వజ్ఞే క్వ మేరౌ మృగతృష్ణికా. 5

'వీఁడు, వాఁడు, నేను, వీఁడజ్ఞాని, వీఁడుజ్ఞాని' అను నీ మున్నగు బుద్ధులు అజ్ఞానియందే సంభవించునుగాని జ్ఞానియందుఁగాదు. ఏలయనఁగా దప్పికచే బాధనొందువాని దృష్టియందే మృగతృష్ణాభ్రమ ప్రసిద్ధమైయుండునుగాని దప్పికబాధ మున్నగునవెవ్వియులేని స్వర్గభూతమగు మేరు పర్వతముపై నట్టిది యెట్లుండును ?

యథైకద్రవ్యనిష్ఠే హి చిత్తేఽన్యద్రవ్య సంవిదః
న భవన్తి పరే తద్వన్నాన్యాస్తిష్ఠన్తి సంవిదః. 6

'ఇది స్థాణువే, ఇది శుక్తియే' అను నీప్రకారమైన యథార్థమగు ఏకపదార్థనిశ్చయము గలవానికి 'ఇది స్థాణువా, లేక, పురుషుఁడా' అనునిట్టి సంశయజ్ఞానముగాని, ఇది శుక్తికాదు, రజతమను' విపరీతజ్ఞానముగాని యెట్లుండవో అట్లే బ్రహ్మతత్త్వము నిశ్చయింపఁబడ ఇతరములగు భేదభ్రమజ్ఞానము లెవ్వియునుండవు.

ఇదం నాసీన్న చోత్పన్నం న చాస్తి న భవిష్యతి
జగద్బ్రహ్మైవ సద్రూపమిదమిత్థమవస్థితమ్. 7

ఈ జగత్తు పూర్వముండియుండలేదు, ఉత్పన్నమున్నుగాలేదు. ఇపుడునులేదు, ముందును నుండఁబోదు. సద్వస్తువగు బ్రహ్మమే యిట్లు జగద్రూపముగ స్థితినొందియున్నది.

చిన్నభః కాచకచ్యం చ స్వాత్మన్యేవావ తిష్ఠతే
జగదిత్యేవ తత్తత్ర తజ్జ్ఞానేనైవ చేత్యతే. 8

ఇట్లు జగత్తును నిషేధింప, జగద్రూపముగ గ్రహింపఁబడు చిదాకాశముయొక్క స్ఫురణము స్వాత్మయందే (శుద్ధ బ్రహ్మభావమందే) స్థితిపొందినదగుచున్నది. అట్టి స్థితియందు జీవన్ముక్తులు జగత్తును బ్రహ్మముగనే యెఱుఁగుదురుగాని జడముగగాదు.

స్వప్నేషు కల్పనపురేషు యథాన్యదస్తి
చిన్మాత్రమచ్ఛగగనం నను వర్జయిత్వా
నో కించనాపి న చ రూపమరూపకేషు
రూపం తథా జగతి సంప్రతి జాగ్రదాఖ్యే. 9

స్వప్నములందును, మనోరాజ్యముయొక్క కల్పితపురములందును నిర్మలమై, ఏకమైనట్టి చిన్మాత్రము తప్ప మఱియేద్దియు లేనట్లు, ఇపుడు జాగ్రత్తను జగత్తునందును చిన్మాత్రముతప్ప యొకింతైనను ఉపాధిస్వరూపములేదు.

పూర్వం కిలోద్భవతి కించన నామ నేదం
తచ్ఛావభాతి తదనాది ఖమేవ చిత్త్వాత్
నో కారణం న సహకారి కిలాస్తి యత్ర
తస్మాత్స్వయం భవతి వస్త్వితి కేయముక్తిః. 10

'సదేవ సోమ్యేదమగ్ర ఆసీదేకమేవాద్వితీయమ్' (ఈ జగత్తునకుఁ బూర్వము ఏకమగు సద్వస్తువు మాత్రమేగలదు) అను నీమున్నగు శ్రుతిప్రమాణములఁబట్టి యెచట సృష్టికిబూర్వము ఉపాదాన కారణముగాని, నిమిత్తకారణముగాని లేకయున్నవో. అచట నిఁక జగత్తుకలదను వాక్కెచట? కావున ఈ జగత్తొకింతైనను నుద్భవించుటలేదనియు, ఏది యుద్భవించినట్లు తోచుచున్నదో, అది అనాదియైన చిదాకాశరూపమగు బ్రహ్మమే తన చిత్స్వభావమువలన నట్లు స్వయముగనే భాసించుచున్నదనియు, నిశ్చితమగుచున్నది.

తస్మాత్స్వయం భవతి నేహ హి కశ్చిదాదౌ
బ్రహ్మాదయో జ్ఞవిదితా న చ నామ సన్తి
వ్యోమైవ మాతతమయం స ఇతః స్వయంభూ
రిత్యాది చిద్గగనమేవ చితా విభాతి. 11

ఇత్యార్షే శ్రీవాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే ఉత్తరార్ధే జగత్పరమాత్మనోరైక్యయోగోపదేశో నామ చతుఃషష్ట్యధికశతతమః సర్గః ॥ 164 ॥

కాఁబట్టి సృష్ట్యాదియందొకింతైనను నిటనేదియు నుత్పన్నమగుటలేదు. మఱియు, అజ్ఞానులచే, నెఱుఁగఁబడిన బ్రహ్మదేవుఁడు మున్నగు సమష్టి, వ్యష్టిజీవులుగాని, వారి యుపాధులు గాని వాస్తవముగ లేకయేయున్నవి అ బ్రహ్మదేవుఁడును్ను, ఈ ప్రపంచమున్ను బ్రహ్మమువద్ద శూన్యరూపములేయైయున్నవి. కావున, చిదాకాశమే తన చిత్స్వభావముచే నిట్లి వ్యాప్తమగు సమస్త జగజ్జీవాదిరూపముగ భాసించుచున్నదని సిద్ధించుచున్నది.

ఇది శ్రీవాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున నుత్తరార్ధమున జగత్పరమాత్మనోరైక్యయోగోపదేశమను నూటయఱువదినాల్గవసర్గము ॥164॥



## పఞ్చషష్ట్యధికశతతమః సర్గః

[ పరస్పరాను ప్రవేశాత్పరస్పర సముద్భవాత్
చిన్మాత్రత్వం దృఢీకర్తుం జాగ్రత్స్వప్నైక్యమీర్యతే.

పరస్పర మొకదానియందొకటి ప్రవేశించుటచేతను, ఒకదానినుండి యొకటి యుద్భ వించుటచేతను జాగ్రత్స్వప్నముల యైక్యమిచట చిన్మాత్రత్వమును దృఢపఱచుట కొఱకై వచింపఁబడుచున్నది. ]

**శ్రీ వసిష్ఠ ఉవాచ:—**

> జాగ్రత్స్వప్నే స్వప్న ఏవ జాగ్రత్త్వమనుగచ్ఛతి
> స్వప్నజాగ్రతి జాగ్రత్తు స్వప్నతాముపగచ్ఛతి. 1

శ్రీ వసిష్ఠుడు:— ఓ రామచంద్రా! జాగ్రత్స్వప్న సుషుప్తులు మూఁడును పరస్పర మొకదానియందొకటి ప్రవేశించుటచేత నొక్కొక్కటి ప్రత్యేకముగ మూఁడువిధములుగ నగుచున్నది. జాగ్రజ్జాగ్రత్తు, జాగ్రత్స్వప్నము, జాగ్రత్సుషుప్తి, స్వప్నజాగ్రత్తు, స్వప్న స్వప్నము, స్వప్నసుషుప్తి, సుషుప్తిజాగ్రత్తు, సుషుప్తిస్వప్నము, సుషుప్తి సుషుప్తి అందు మనోరాజ్యరూపమగు జాగ్రత్స్వప్న మున ఇంద్రియ వ్యాపార రాహిత్యమువలనను, కేవల మనోమయత్వమువలనను, పదార్థముల యొక్క స్వప్నసాదృశ్యమువలనను స్వప్నమే జాగ్రద్దశను బొందుచున్నది. అట్లే, స్వప్నమందును 'ఇంతకాలమువఱకు నేను నిదురించితిని. ఇపుడు మేల్కొనుచున్నాను' అను నిట్టి యనుభవముచే ప్రసిద్ధమగు స్వప్నజాగ్రత్స్థితియందు స్వానుభవసిద్ధమగు జాగ్రత్తే స్వప్నరూపత్వమును బొందు చున్నది.

> స్వప్నో జాగ్రత్ప్రవిశతి జాగ్రత్స్వప్నాత్ర బుధ్యతే
> జాగ్రత్స్వప్నం ప్రవిశతి ప్రబుద్ధం స్వప్నజాగ్రతః. 2

అట్లు జాగ్రద్రూప స్వప్నమునుండి మేల్కొని స్వప్నరూప జాగ్రత్తునందుఁ బ్రవేశిం చుటవలనను అట్లే స్వప్నరూప జాగ్రత్తునుండి మేల్కొని జాగ్రద్రూపస్వప్నమందుఁ బ్రవేశించుట చేతను, ఈ జాగ్రత్స్వప్నముల రెంటికిని పరస్పర కారణత్వముగలదు.

> జాగ్రత్స్వప్నవతా స్వప్నః స్వప్న ఇత్యభిధీయతే
> స్వప్నజాగ్రద్వతా జాగ్రజ్జాగ్రదిత్యభిధీయతే. 3

మఱియు జాగ్రత్స్వప్నవంతునియొక్క స్వప్నము స్వప్నస్వప్నమనియు, స్వప్న జాగ్రద్వంతునియొక్క జాగ్రత్తు జాగ్రజ్జాగ్రత్తనియుఁగూడఁ జెప్పఁబడుచున్నది.

> తజ్జాగ్రజ్జాగ్రతీవేహ న తు స్వప్నః కదాచన
> స్వప్నే స్వప్నో జాగ్రదేవ న తు జాగ్రత్కదాచన. 4

అట్లు స్వప్నమందలి జాగ్రత్తు వర్తమాన జాగ్రత్తుగవలెనే యనుభూతమగుటవలన జాగ్రత్తే యగునుగాని స్వప్నమెన్నటికినిగాదు. అట్లే జాగ్రత్స్వప్నమను మనోరాజ్యమందలి జాగ్రత్తున్ను అనుభవముచే స్వప్నమేయగునుగాని జాగ్రత్తెన్నటికినిగాదు.

> లఘుకాలాత్మకః స్వప్నః సర్వదైవ హి జాగ్రతి
> లఘుకాలాత్మకం జాగ్రత్స్వప్నకాలే సదైవ చ. 5

జాగ్రత్కాలమున స్వప్నము సదా అల్పకాలాత్మకమై యుండును. అట్లే స్వప్న కాలమున జాగ్రత్తున్ను సదా అల్పకాలాత్మకమైయుండును.

న జాగ్రత్స్వప్నయోర్భేదః కశ్చనాస్తి కదాచన
ఏకస్యావసరోఽన్యత్ర ద్వయోరపి న సన్మయః. 6

కాబట్టి జాగ్రత్స్వప్నములందెన్నడును భేదమేమియును లేదు. మఱియు ఆ రెంటి యొక్కయు మఱియొకచోట పరస్పర ప్రవేశము సత్యముకాదు.

మృతిప్రబోధసమయే జాగ్రత్స్వప్నః ప్రశామ్యతి
స్వప్నానుభవబోధే చ శూన్య ఏవాతిభాస్వరః. 7

స్వప్నము జాగ్రత్తునందు పూర్ణముగ శమించిపోవుచున్నది, మఱియు, ఆ స్వప్నపదార్థము లపుడు శూన్యరూపములే యగుచున్నవి. కాని స్వప్నసమయమున నట్లు జాగ్రత్తు శమించుటగాని అందలి పదార్థములు శూన్యములగుటగాని కనిపించుటలేదనిన అట్లుకాదు. ఈ జాగ్రత్తున్ను మరణానంతరము పరలోకమందలి జాగ్రత్తునగాని, లేక సమస్తద్వైత మరణరూపమగు తత్త్వ ప్రబోధ సమయమునగాని శమించుచునేయున్నది మఱియు ప్రతిదినము స్వప్నానుభవ కాల మునను, సుషుప్తియందును జాగ్రత్పదార్థములు శూన్యములుగనే వర్తించుచున్నవి. కావున జాగ్ర త్స్వప్నముల రెంటికిని భేదమేమియును లేదనియే సిద్ధించుచున్నది.

జీవతః స్వప్నసమయే మృతిబోధోదయం వినా
పరలోకాత్మకం జాగ్రత్కించనాపి న దృశ్యతే. 8

'నేడుగాంచిన స్వప్నపదార్థములు రేపటి స్వప్నమున లేకయున్నవి. కాని నేడు గాంచిన జాగ్రత్పదార్థములు రేపటి జాగ్రత్తునందట్లే యుండుచున్నవి. కావున రెంటియందును భేదముగలదు' అనిన అట్లుకాదు. ఈ జీవితమును స్వప్నసమయమునగూడ, గత జన్మయొక్క మరణానంతరముగల జ్ఞానము లేనందుచే ఆ పరలోకరూపమగు జాగ్రత్తొకింతైనను గన్పిం చుటలేదుకదా!

స్థితే జీవితబోధేఽస్మిఞ్ఛూన్యే నానామయాత్మని
పరలోకాత్మకః స్వప్నః కశ్చనాపి న దృశ్యతే. 9

ఇట్లుండ జీవితాది సర్వపదార్థ శూన్యమగు నేటి స్వప్నమున మనుజునకు భ్రాంతిచే 'నానారూపాత్మకమగు ప్రపంచమున నేను జీవించుచున్నాను' అను నీప్రకారమగు జీవితమును గూర్చిన (జాగ్రద్రూపమగు) బోధ కలుగగా, అపుడు గత దివసముయొక్కగాని, రాబోవుదివసము యొక్కగాని స్వప్నజగత్తు పరలోక ప్రాయమేయగుచు, అందలి యే పదార్థమున్ను నట అను వర్తించియున్నట్లు కనుపింపకయేయున్నది.

చిచ్చమత్కృతిమాత్రాత్మ యథా స్వప్నే జగత్త్రయమ్
సృష్ట్యాదిసర్గాత్ప్రభృత్యేవ తథైవాభాతి జాగ్రతి. 10

స్వప్నమందలి త్రైలోక్యమెట్లు చైతన్యముయొక్క చమత్కారమే యై యున్నదో. అట్లే సృష్ట్యాదినుండి వర్తించుచున్న యీ జాగ్రత్తునందలి జగత్తున్ను చైతన్యముయొక్క చమత్కార మాత్రమేయై హృదయమున భాసించుచున్నది.

సన్త్యేవాసత్యభూతాని స్ఫారాణి పరమార్థతః
నాస్త్యేవాకారవత్తేయం స్వప్నోర్వ్యామివ జాగ్రతి. 11

జాగ్రత్తునందలి సమస్త పదార్థములున్ను విశాలాకార యుక్తములుగ భాసించినప్పటి కిని, స్వప్నమందలి పృథ్వ్యాదిపదార్థములవలె, పరమార్థమున లేకయేయున్నవి.

నానాత్మభాసురమపి స్వప్నే శూన్యం యథా జగత్
తథైవ జాగ్రత్యఖిలం వ్యోమైవేదం చిదాత్మకమ్. 12

స్వప్నమున నానారూపములతోటి భాసించినప్పటికిని జగత్తెట్లు శూన్యమేయై చిన్మాత్ర పరిశేషముగ నుండియున్నదో, అట్లే జాగ్రత్తునందును ఈ సమస్త జగత్తున్ను చిదాకాశమేయై యున్నది.

చిద్వ్యోమ్నో హి స్వభావోఽయం యదిదం జగదప్యరే
కచతీత్థమిహ స్ఫారమాలోక ఇవ తేజసః. 13

ఈ విశాలమగు జగత్తు ఈ ప్రకారముగ సూర్యాదుల ప్రకాశమువలె చిదాకాశమున భాసించుట యేది గలదో, అది చిదాకాశముయొక్క స్వభావమే యైయున్నది

చితేశ్చమత్కృతిరియం జగన్నామ్నీ చకాస్త్యలమ్
సహజా గగనే కుడ్యే పరమాణౌ స్థలే జలే. 14

ఇట్లు చైతన్యము ఆకాశమందును, కుడ్య (గోడ) మందును, పరమాణువందును, స్థల మందును, జలమందును పూర్ణముగ ప్రకాశించుట యేదిగలదో, యిది యా చైతన్యముయొక్క జగత్తను పేరుగల స్వాభావిక చమత్కారమైయున్నది.

భ్రాన్తావసత్యరూపాయాం స్థితాయాం సత్యవస్తువత్
ఆకాశమాత్రదేహాయాం క ఇవైనాం ప్రతిగ్రహః. 15

శూన్యమాత్ర స్వరూపముగలదియు, అసత్యమైనను సత్యవస్తువువలె స్థితినొందియున్నదియు భ్రాంతి రూపమైనదియునగు యీ జగత్తునందు విశ్వాసము గల్గియుండుట అనుచితమేయై యున్నది.

గ్రహీతృగ్రహణగ్రాహ్యరూపమాశూన్యమేవ చ
సదస్త్వేవాసదేవాస్తు జగద్రాఘవ కింగ్రహః. 16

ప్రియుఃశవగు నో రామచంద్రా! గ్రహీత, గ్రహణము, గ్రాహ్యమను త్రిపుటియొక్క రూపమగు ఈ జగత్తు, అసత్తైయున్నది. ఇది, అధిష్ఠానసత్తచే సత్తగుగాక, లేక నిజసత్తచే అస త్తగు గాక! ఇవ్విషయమున నొక పక్షమును స్థాపింపవలయునను మొండిపట్టుదలవలన నేమి ప్రయోజనము?

ఇత్థమస్త్విదమథాన్యథాస్తు వా మైవ భూద్భవతు కోఽత్ర సంభ్రమః
కోఽత్ర ఫల్గుని ఫలే ఫలగ్రహో బుద్ధమేవ తదలం వికల్పనైః. 17

ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే ఉత్తరార్ధే జాగ్రత్స్వప్నైక్యోపదేశో నామ పఞ్చషష్ట్యధిక శతతమః సర్గః ॥ 165 ॥

ఓ రామచంద్రా! ఈ జగత్తు ఈ విధముగనే యున్నదా, లేక మఱియొక విధముగ నున్నదా, అను నివ్విషయమున నొక పక్షమును స్థాపించుటయందుఁ బట్టుదల యేల? అజ్ఞానముచే నట్టి యేకపక్షాభిమానభ్రమ యుండవచ్చును. కాని యిపుడు నీ వీ జగత్తుయొక్క తత్త్వమును బాగుగఁ దెలిసికొంటివి. గావున నిఁక నిద్దానియందలి భోగరూప యల్పఫలమందు నీకుఁ గోర్కె యేల? మఱియు, దీనియొక్క సత్యత్వ అసత్యత్వ ప్రతిష్ఠాపనమను నిరర్థక ఫలమందును పట్టుదల యేల?

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున నుత్తరార్ధమున జాగ్రత్స్వప్నైక్యోపదేశమను నూట యఱువదియైదవ సర్గము ॥ 165 ॥

## షట్ షష్ట్యధిక శతతమః సర్గః

[ ఆత్మఖ్యాతి విశేషోఽత్ర తథా ఖ్యాత్యన్తరస్థితిః
బ్రహ్మనీలశిలాఖ్యానం చోక్తం ప్రశ్నోత్తరాన్వితమ్.

ఆత్మఖ్యాతియొక్క విశేషము, ఇతరఖ్యాతులయొక్క స్థితి. ప్రశ్నోత్తర సహితమగు బ్రహ్మనీల, శిలోపాఖ్యానము, ఇచట వర్ణింపఁబడుచున్నది ]

శ్రీ వసిష్ఠ ఉవాచ:—

సార్థకేనాత్మశబ్దేన ఖ్యాతిశబ్దేన చోజ్ఝితామ్
ఆత్మఖ్యాతిమిమాం విద్ధి శిలాజఠరనిర్ఘనామ్. 1

శ్రీ వసిష్ఠుఁడు:— ఓ రామచంద్రా అఖ్యాతి, అసత్ఖ్యాతి, అన్యథాఖ్యాతి, (వాచ్యార్థమగు) ఆత్మఖ్యాతి యను నీ నాల్గింటికంటెను విలక్షణమైనదియు, ఆత్మశబ్దఖ్యాతిశబ్దముల వాచ్యార్థముచే విడువఁబడినదియు, ఆ రెండుపదములయొక్క అఖండార్థమునకు లక్ష్యభూతమైనదియు, శిలాగర్భమువలె (చైతన్య) ఘనీభూతమైనదియునగు ఈ అలౌకికమైన (ఆత్మఖ్యాతిని' గూర్చి వినుము.

ఆదిసర్గాత్ప్రభృత్యేవ చిద్వ్యోమైవేత్థమాతతమ్
కచత్యాత్మని యత్తస్య బుద్ధా తేనైవ సర్గతా. 2

సృష్ట్యాదినుండియు, పూర్ణమై వ్యాపకమైనట్టి చిదాకాశమే యీ ప్రకారముగ జగద్రూపముగ తనయందు స్ఫురించుచున్నది. ఏ కారణముచే నది తనయందే సృష్టిని నిజచైతన్యబలముచే ఖ్యాపిత మొనర్చినదో (పసిద్ధికెక్కించినదో,) ఆ కారణముచే, ఆ ఆత్మయే సృష్టిరూపమగు ఖ్యాతియై యున్నది. (ఆత్మఖ్యాతిః = అనగా, ఆత్మయే సృష్టిరూపమైయున్నది.)

న వహన్తీహ సరితో నేహోన్మజ్జనమజ్జనే
వ్యోమ వ్యోమ్న్యేవ చిద్రూపం కచత్యేవమనిర్గితమ్. 3

వాస్తవముగ నిట నదులెవ్వియు, ప్రవహించుటలేదు. వానియందలి మునుఁగుట, తేలుటలు గూడ సత్యములుకావు. ఈ సమస్తజగద్రూపముచే నిష్క్రియమై, చిద్రూపమైనట్టి చిదాకాశమే తనయందు స్ఫురించుచున్నదగును.

కచనోక్త్యా తు రహితాం సమగ్రేణాన్తకల్పనామ్
వినోత్తరపదార్థేన త్వాత్మఖ్యాతిమిమాం విదుః. 4

కావున, స్ఫురణవాచకమగు 'ఖ్యాతి' శబ్దమున్ను, దానియొక్క వాచ్యార్థమున్ను లేనిదియు (అఖండార్థము), సమస్త కల్పనారహితమైనదియునగు స్వప్రకాశమైన ఆత్మస్వరూపమునే సృష్టిరూపముగఁ బ్రకటమగుటఁబట్టి తత్త్వజ్ఞులు 'ఆత్మఖ్యాతి' యనిరి.

ఆత్మైవేదం జగత్సర్వం ఖ్యాతిర్యత్ర న కించన
అఖ్యాతో నామ న ఖ్యాత్మా కదాచిత్ఖ్యాపితః క్వచిత్. 5

ఈ ప్రకారముగ ఈ జగత్తంతయును, ఆత్మయేయైయున్నందునను, ఆ యాత్మ యెన్నఁడును, ఎచట నుదన స్వప్రకాశముకంటె భిన్నమగు యేఖ్యాతిచేతను నిద్దానిని ఖ్యాపిత (ప్రసిద్ధ) మొనర్చనందుచేతను, 'అఖ్యాత' శబ్దముయొక్క ప్రయోగము (వాచోయుక్తి) దీనియందు ఘటించవచ్చును. అంతేకాని 'అఖ్యాతి' అను భావార్థకక్తిన్నంతపద మిచట ఘటింపఁజేయుటకు శక్యముకాదు.

ఖ్యాతిరఖ్యాతిరిత్యత్ర వాచో యుక్తిరవాస్తవి
కిం తత్ర ఖ్యాపనం నామ స్యాద్వాప్యఖ్యాపనం చ కిమ్. 6

'ఖ్యా, ధాతువునను 'ప్రసిద్ధి' అనియు, 'తి' ప్రత్యయమునకు 'సత్త' అనియు అర్థము కావున 'ఖ్యాతి' శబ్దముయొక్క యర్థము ప్రసిద్ధరూపమగు సత్తఅని తేలినది. అట్టి ప్రసిద్ధ సత్తారూపమగు ఈ యాత్మ ఖ్యాతియేయగును. ఇట 'నఞ్' (అ) శబ్దముతోటి సంబంధములేదు. కాఁబట్టి, 'అఖ్యాతి' అను నితరవాదుల యుక్తి యిచట అసత్యమైయున్నది. మఱియు 'ఖ్యాతి' శబ్దము ప్రేరణార్థకమున్నుగాదు. ఏలయనిన, జగత్తు చైతన్యముకంటె భిన్నమగుచో అపుడు దాని యందుఁ బ్రేరణయుండవచ్చును. ఎపుడు జగత్తు చిద్రూపమేయైయున్నదో అపుడిఁక దానియందు మఱియొకదానిఖ్యాపనము (ప్రసిద్ధికెక్కించుట) గాని లేక, అఖ్యాపనముగాని యెట్లు యుక్తమగును? ఈ ప్రకారముగ 'అన్యథాఖ్యాతి' యు, 'అసత్ఖ్యాతి' యు గూడ ఖండింపఁబడినవి.

అఖ్యాతిరన్యథాఖ్యాతి రసత్ఖ్యాతిరితీతరా
దృశ్యాశ్చిన్మాత్రరూపస్య ఖాసశ్చిత్త్వచమత్కృతాః. 7

అఖ్యాతి, అన్యథాఖ్యాతి, అసత్ఖ్యాతులను స్వప్న, మనోరాజ్యాది ఇతర దృశ్యములవలె కల్పనామాత్రరూపములుగను, చైతన్యముయొక్క చమత్కార భూతములుగను దలంచుచో, అట్లే యగుగాక, దానిచే మాకే హానియును లేదు.

యథా యథా యదా యేయే చిన్మాత్రవ్యోమభాస్వతః
చిదంశవః కచన్త్యచ్ఛాస్తదా తేతే తథా తథా. 8

ఎపు డెచట చిన్మాత్రాకాశమగు సూర్యునియొక్క, (అగ్నియొక్క స్ఫులింగములవలె కల్పితములగు) ఏయే నిర్మల చిద్భాగము లెట్లెట్లు స్ఫురించునో, అపు డచట నయ్యవి ఆయా ప్రకారముగనే స్థితినొందియున్నవగును.

ఆత్మఖ్యాతిరసత్ఖ్యాతిరఖ్యాతిః ఖ్యాతిరన్యథా
ఇత్యేతాశ్చిచ్చమత్కృత్యా ఆత్మఖ్యాతేర్విభూతయః. 9

కాఁబట్టి (వాచ్యార్థమగు) ఆత్మఖ్యాతి, అసత్ఖ్యాతి, అఖ్యాతి, అన్యథాఖ్యాతి యను నీ నాల్గున్ను, (లక్ష్యార్థమగు) ఆత్మఖ్యాతియొక్కయే విభూతులగుచు, చైతన్యముయొక్క చమత్కారము చేతనే ఆయా ప్రకారముగ భాసించుచున్నవగును.

ఆత్మఖ్యాతిపదస్యార్థ ఆత్మఖ్యాతిపదోక్షితః
అనాద్యన్తో నిరుల్లేఖః సోఽయమేకఘనః స్థితః. 10

'ఆత్మఖ్యాతి' యను శబ్దముయొక్క వాచ్యార్థము లేనిదియు, అద్దానియొక్క లక్ష్యార్థమై యొప్పునదియు, ఆద్యంతరహితమైనదియు, వాక్కునకు విషయముకానిదియునగు ఏకమైన చిద్రూపమగు పరబ్రహ్మము శిలాగర్భమువలె (చైతన్య) ఘనీభూతమై యున్నది

తత్రేదం మహదాఖ్యానం శృణు శ్రవణభూషణమ్
దూషణం ద్వైతదృష్టీనాం ద్యోతనం బోధభాస్వతః. 11

ఓ రామచంద్రా! ఇవ్విషయమున వినుట కింపైనదియు, ద్వైతదృష్టులను నిరసించునదియు, జ్ఞానసూర్యునియొక్క ప్రకాశమువంటిదియునగు ఈ గొప్పదైన శిలాఖ్యానమునుగూర్చి వినుము.

అస్తి యోజనకోటీనాం సహస్రాణి ప్రమాణతః
అనీలకుడ్యకఠినా విమలా విపులా శిలా. 12

అనేకవేల కోట్ల యోజనముల పరిమాణముగలదియు అంతట వ్యాపించియుండు యాకాశమువంటి గోడ యుండుచో దానివలెఁ గఠినమై, నిర్మలమై, విశాలమైనదియునగు యొక శిల గలదు.

న సంధిబన్ధా నిబిడా వజ్రసారా విసారిణీ
అత్యన్తపుష్టకఠిన జఠరాకాశనిర్మలా. 13

ఆ శిల, అవయవములుగాని, సంధులుగాని లేనిదియు, మిగుల దట్టమైనదియు, వజ్రమువలె దృఢమైనదియు, అతి విశాలమైనదియు, మిగుల పరిపుష్టమై యొప్పునదియు, శిలవలె కఠినమైన గర్భము గల్గియున్నదియు, ఆకాశమువలె నిర్మలమైనదియునై వెలయుచున్నది.

అసంఖ్యకల్పనిచయమవినాశా ఘనాఙ్గికా
కాన్తాఙ్గీ నిర్మలత్వేన వ్యోమరూపైవ లక్ష్యతే. 14

మఱియు నది, అసంఖ్యాతములగు కల్పసమూహములవఱకు నాశరహితమై యుండునదియు, దట్టమైనట్టియు, రమణీయమైనట్టియు శరీరముగలదియు, నిర్మలత్వముచే ఆకాశమువలె జూపట్టునదియునై విరాజిల్లుచున్నది.

జాతిస్తు జ్ఞాయతే తస్యా విశిష్టా నైవ కేనచిత్
కథం కుత్ర కదా చేతి న విజ్ఞాతా సదైవ సా. 15

దానికంటె భిన్నముగ మఱియొకవస్తువు లేనందుచే దానియొక్క విశిష్టమగు జాతి నెవడును నెఱుఁగకయే యున్నాఁడు. మఱియు నే దేశమున నే కాలమున నే ప్రకారమది వర్తించుచున్నదో యెవఁడును నెన్నఁడును తెలిసికొనకయే యున్నాఁడు.

> అన్తస్తస్యాస్తు హృదయే భూతధాతుర్వివర్జితే
> నిబిడానన్తకఠినా వజ్రసారాఽవినాశినీ. 16
>
> లేఖామయాని విద్యన్తే స్వాఙ్గభూతాని భూరిశః
> పద్మజాలాని శఙ్ఖాశ్చ గదాశ్చక్రాదయస్తథా. 17

మిగుల ఘనీభూతమై, మహా కఠినమై, వజ్రమువలె దృఢమై నాశరహితమైనట్టి యా శిలయొక్క యాభ్యంతర ప్రదేశమున పంచమహాభూతములుగాని, చతుర్విధ భూతసముదాయము గాని లేవు. కాని యచట స్ఫటిక శిలయందలి రేఖలవలె, స్వావయవభూతములగు అనేక పద్మ సమూహములు, శంఖములు, గదలు, చక్రాదులుగలవు.

> ఖం వాయుః సలిలం తేజో వసుధేత్యభిధా కృతా
> నాస్తి తత్ర స్వలేఖానాం జీవ ఇత్యేవ వై తయా. 18

ఆ శిలాగర్భమున వాస్తవముగ ఆకాశ, వాయు, అగ్ని, జల, పృథివ్యాదిరూపమగు జగత్తులేదు. అయినను, ఆ శిల తనయందలి రేఖలకే యట్లుఆకాశాది నామములిడెను. మఱియు జీవుఁడను సంజ్ఞనుగూడ నట్లే యది తన రేఖలకే కల్పించెను.

**శ్రీరామ ఉవాచ:—**

> శిలాఽసౌ చేతనం తస్యాః కుత ఇత్యుచ్యతాం మమ
> అచేతనా శిలా నామ కథం నామ కరోతి చ. 19

శ్రీరాముఁడు:— ఓ మునీంద్రా! శిల చేతనమెట్లగును? మఱియు అచేతనమగు శిల నామముల నెట్లు గావించును? అనునివ్విషయమును వచింప వేడెద.

**శ్రీ వసిష్ఠ ఉవాచః—**

> న చేతనా న చ జడా సా శిలా విపులోజ్జ్వలా
> జాతిం జానాతి కస్తస్యాః కస్తత్రాన్యశ్చ విద్యతే. 20

శ్రీ వసిష్ఠుఁడు:—ఓ రామచంద్రా! విశాలమైనదియు, ప్రకాశవంతమైనదియునగు ఆ శిల చేతనముకాదు, జడముకాదు. ఎపుడద్దానికంటె భిన్నముగ మఱియొకఁడెవఁడును లేడో అపుడిక దానిజాతి యెవఁడెఱుఁగగలడు?

**శ్రీరామ ఉవాచ:—**

> తస్యాః పశ్యతి తా లేఖాః కః కథం జఠరస్థితాః
> కథం వా కేన సా భగ్నా కదా నామేతి మే వద. 21

శ్రీరాముఁడు:— ఓ మునీంద్రా! దానికంటె వేఱుఁగ నెవఁడును లేనిచో నిఁక దాని గర్భమందున్నట్టి ఆకాశ, వాయ్వాది రూపములగు రేఖల నెవఁడు చూచుచున్నాఁడు? మఱియు

దానియందలి రేఖలను ఉలి మున్నగు సాధనములచే నెవఁడెపుడు చెక్కెను? (శిలలోపల ఉలి మున్నగునవి ప్రవేశించుట అసంభవము గనుక ఆ రేఖలెట్లు చెక్కఁబడినవి?

**శ్రీ వసిష్ఠ ఉవాచ:—**

న భేత్తుం యుజ్యతే సోఽగ్రా న చ భేత్తా చ విద్యతే
తథైవాపారపర్యన్త దేహిన్యా సర్వమావృతమ్. 22

శ్రీ వసిష్ఠుఁడు:— ఓ రామచంద్రా! అతి దృఢమగు ఆ శిల దేనిచేతను భేదింప శక్యమైనదికాదు. దానిని భేదింపఁగల్గువాఁడును నెవఁడునులేఁడు. అది తన అపార దేహముతోటి సర్వత్ర వ్యాపించియున్నది.

లేఖామయాని విద్యన్తే తత్రానన్తాని కోటరే
వృక్షపర్వతజాలాని నగరాణి పురాణి చ. 23

తత్ర లేఖామయాః సన్తి దేవదానవనామకాః
సూక్ష్మసూక్ష్మ నిరాకారాః సాకారా ఇవ పుత్రికాః. 24

దానియందు రేఖామయములైన అనంతములగు వృక్ష, పర్వతాది సమూహములున్ను, గ్రామ నగరాదులున్ను గలవు. మఱియు, స్థూల, సూక్ష్మ సాకార, నిరాకారములగు ప్రతిమల వలె రేఖామయులగు అసంఖ్య దేవ దానవాదులున్ను నటగలరు.

ఆకాశనామ్నీ తత్రాస్తి లేఖా వై పృథ్వశాలినీ
ఉపలేఖాశ్చ సన్త్యస్యా మధ్యే చన్ద్రార్కనామికాః. 25

ఆ శిలయందు విశాలమైనట్టి యాకాశమను పేరుగల యొకానొక రేఖగలదు. ఇంకను మధ్యమధ్య సూర్యచంద్రులను పేరుగల అవాంతరరేఖలున్ను గలవు.

**శ్రీరామ ఉవాచ:—**

కేన దృష్టా వద బ్రహ్మల్లేఖాస్తాస్తత్ర కింవిధాః
కథం వా వద దృశ్యన్తే నిపిణ్డోపలకోశగాః. 26

శ్రీరాముఁడు:— మహాత్మా! ఆ ప్రకారములగు రేఖల నచట నెవఁడు చూచెను. మఱియు, అతి ఘనీభూతమగు ఆ శిలాగర్భమున నయ్యవి యెట్లుకన్పించును?

**శ్రీ వసిష్ఠ ఉవాచ:—**

మయా రాఘవ తా దృష్టాస్తాదృశ్యస్తత్ర లేఖికాః
తవాపీద్భా యది భవేత్తత్త్వమపి పశ్యసి. 27

శ్రీ వసిష్ఠుఁడు:—ఓ రాఘవా! ఆ యాకాశ, వాయ్వాది రేఖల నచట నేను గాంచితిని. తలంచుచో నీవున్ను సమాధిచే వాని నచట గాంచఁగలవు.

**శ్రీరామ ఉవాచ:—**

తాదృశీ వజ్రసారా సా శిలా భఙ్క్తుం న యుజ్యతే
తథాపి భవతా దృష్టా లేఖా స్తత్కోశగాః కథమ్. 28

శ్రీరాముఁడు ఓ మునీంద్రా! వజ్రమువలె దృఢమైనట్టి యాశిలభేదింపశక్యమైనదికాదు గదా! అయినను దానియందలి రేఖలను దామెట్లు చూడగల్గితిరో వచింపప్రార్థన.

శ్రీ వసిష్ఠ ఉవాచ:—

ఏతస్యా జఠరే రామ రేఖాహం జఠరే స్థితః
తేన పశ్యామి తత్రస్థో రేఖాజాలం తదక్షతమ్. 29

కోఽసౌ శక్తోఽన్యథా భక్తుం తాం శిలామహమన్తరే
తత్పూర్వం దృష్టవాంస్తస్యా అహం తత్రాన్తరస్థితః. 30

శ్రీ వసిష్ఠుఁడు:— ఓ రామచంద్రా! ఆ శిలాగర్భమున నేనున్ను నొకరేఖనైయున్నాను. కావుననే యచ్చోటనున్న రేఖాసమూహమునంతయుఁ బూర్ణముగఁ జూడ గల్గితిని. ఈ ప్రకారముగ, ఆ శిలలోపలనున్న నేను దాని యాభ్యంతరముననున్న సమస్తరేఖాజాలమును జూచితిని. కాకున్న, ఆ శిలను భేదించుట కెవఁడు సమర్థుఁడగును?

శ్రీరామ ఉవాచ:—

కాసౌ శిలాథ కశ్చ త్వం వద మే క్వాసి సంస్థితః
కిమేతద్వదసి బ్రూహి కిమేతద్దృష్టవానసి. 31

శ్రీరాముఁడు:— ఓ మునీంద్రా! ఈ శిలవాస్తవముగ నేమియైయున్నది? తామున్ను వాస్తవముగ నెవరు? తామెచట వర్తించుచున్నారు? ఈ శిలారూపముచే తామేమివచించుచున్నారు? మఱియు దానియందు తామేమిచూచితిరి? అదియంతయు వచింపవేడెద.

శ్రీ వసిష్ఠ ఉవాచ:—

పరమాత్మ మహాసత్తా కథితైషా మయా తవ
అనయైవ వచో భఙ్గ్యా న త్వేషా విపులా శిలా. 32

శ్రీవసిష్ఠుఁడు:— ఓ రామచంద్రా! నేనీ శిలాఖ్యానమను రూపకముద్వారా పరమాత్మ యొక్క మహాసత్త (సర్వవ్యాపకమగుచేతనము) ను గూర్చియే చెప్పితినిగాని విశాలమగు శిలను గూర్చి కాదు.

పరమాత్మ మహాసత్తా శిలాయా జఠరే వయమ్
తచ్ఛిలామాంసమే వేమే సౌషిర్యపరివర్జితే. 33

ఆ పరమాత్మ మహాసత్తయను శిలయొక్క ఛిద్రరహితమగు గర్భమున మనమందఱమును నద్దాని మాంసముపగిది వర్తించుచున్నారము.

తచ్ఛిలాఙ్గం నభో విద్ధి తచ్ఛిలాఙ్గం సదా గతిః
తచ్ఛిలాఙ్గం క్రియా శబ్దా వాసనా కాలకల్పనా. 34

భూమిరాపోఽనలో వాయుః ఖం మనో బుద్ధిరేవ చ
అహంకార ఇతీదం తత్తచ్ఛిలాఙ్గముదాహృతమ్. 35

ఓ రామచంద్రా! ఆకాశ వాయ్వాది పంచభూతములను, సమస్త క్రియలను, శబ్ద స్పర్శాదులను, వాసనలను, కాలకల్పనను, ఆ పరమాత్మ మహాసత్తయను శిలయొక్క అంగములుగనే నీవెఱుగుము. ఈ ప్రకారముగ పృథివీ, జల, అగ్ని, వాయు, ఆకాశ, మనో, బుద్ధి, అహంకారము లన్నియును, ఆ శిలయొక్క అంగములనియే చెప్పఁబడినవి.

పరమాత్మ మహాసత్తా శిలా మాంసమిమే వయమ్
సర్వ ఏవ తతోఽనన్యేఽప్యన్యే త్వితి చ విద్మహే. 86

ఈ మనమందఱమును, ఆ పరమాత్మ మహాసత్తయొక్క మాంసమువంటి వారమేయై యున్నాము. కావున వాస్తవముగ సద్దానికంటె వేఱుగాకయున్నప్పటికిని భ్రమచే వేఱుగానున్నట్లు తలంచుచున్నాము.

చిన్మాత్రైకాత్మికా యేయం శిలాతి మహతీ శిలా
ఏతస్యా వ్యతిరేకేణ క్వ తదస్తి కిముచ్యతామ్. 87

ఓ రామచంద్రా! ఈ సమస్తమున్ను చిన్మాత్రైక స్వరూపమగు మహాశిలయైయున్నది. అట్టి చిన్మాత్రసత్తకంటె వేఱుగ నేదేనియున్నచో, అది యేమియో, ఎచటనున్నదో వచింపుము?

శుద్ధం వేదనమేవేదం ఘటావటపటాదికమ్
యథా స్వప్నే తథా భాతి జలమూర్మితయా యథా. 88

ఘట, గర్త (గోయి) వస్త్రాదిరూపమగు ఈ సమస్తమున్ను శుద్ధజ్ఞానమాత్రమేయై యున్నది. స్వప్నమందొకే చైతన్యము నానారూపములతోటి భాసించునట్లును, ఒకేజలము తరంగాది వివిధరూపములచే వ్యక్తమగునట్లును, ఏకమగు చిద్రూపమే యీ సమస్త జగద్రూపముగ భాసించుచున్నది.

ఇదం బ్రహ్మ ఘనం సర్వం చిన్మాత్రఘనమాతతమ్
పరమార్థఘనం శాన్తం సర్వమేకఘనం విదుః. 89

ఈ సర్వమున్ను వ్యాపకమై, చిన్మాత్రఘనమై, శాంతమై, పరమార్థ ఘనస్వరూపమై, ఏకమైనట్టి పరబ్రహ్మమేయైయున్నది.

ఏకం మహాచితి శిలోదరమేవ సర్వం
సాక్షిర్యవర్జిత మపారమనాదిమధ్యమ్
తేనాత్మనైవ కలితా కలనాత్మనేయం
సర్గో జగద్భువనమిత్యపి దృశ్యనామ్ని. 40

ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు
నిర్వాణప్రకరణే ఉత్తరార్ధే శిలోపాఖ్యానం నామ
షట్ షష్ట్యధిక శతతమః సర్గః ॥ 166 ॥

ఓ రామచంద్రా! ఈ జగత్తంతయును, ఏకమై, ఛిద్రరహితమై, అనంతమై, అనాది మధ్యమైనట్టి మహాచైతన్యరూపశిలయొక్క యుదరమేయైయున్నది. అట్టి బ్రహ్మరూపమగు శిల తనంతట

తానే సృష్టి, జగత్తు, భువనము మున్నగు పర్యాయ నామములచేఁ బ్రసిద్ధమగు దృశ్యమను పేరుగల కల్పనను స్వీకరించినది.

ఇది శ్రీవాసిష్ఠతాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున నుత్తరార్ధమున శిలోపాఖ్యానమను నూటయఱువదియాఱవ సర్గము ॥ 166 ॥

## సప్తషష్ట్యధిక శతతమః సర్గః

[ఇహ తజ్జదృశోదస్య వాదిఖ్యాతి చతుష్టయమ్
అవస్థాత్రయనిర్ముక్త మాత్మతత్త్వం నిరూప్యతే.

జ్ఞానియొక్క దృష్టియందు నాల్గుఖ్యాతులయొక్క స్వరూపము, అవస్థాత్రయ రహితమగు ఆత్మతత్త్వము ఇచట నిరూపింపఁబడుచున్నవి.]

శ్రీవసిష్ఠ ఉవాచ:—

ఆత్మఖ్యాతిరసత్ఖ్యాతిః ఖ్యాతిరఖ్యాతిరన్యథా
శబ్దార్థదృష్టయస్తజ్జం ప్రత్యేతాః శశశృఙ్గవత్. 1

శ్రీవసిష్ఠుఁడు:— ఓ రామచంద్రా! (వాచ్యార్థమగు) ఆత్మఖ్యాతి, అసత్ఖ్యాతి, అఖ్యాతి, అన్యథాఖ్యాతి – అను నీ శబ్దార్థములు తత్త్వజ్ఞానియొక్క దృష్టియందు శశశృంగము (కుందేటి కొమ్ము) వంటివేయగును. (మిథ్యయని భావము.)

కదాచనాపి నామాజ్ఞ సంభవన్తి న కాశ్చన
శాన్తమవ్యపదేశ్యాత్మా జ్ఞ అస్తేఽన్తర్గతేఙ్గనః. 2

ప్రియుఁడవగు రామచంద్రా! జ్ఞానికి ఈ అసత్ఖ్యాతి మున్నగునవి యెవ్వియును నెప్పుడును సంభవింపనేరవు. ఏలయనిన అతఁడు సదాశాంతమై అనిర్వాచ్యమై ఖ్యాత్యాదికల్పనలకు మూలమగు చిత్తముయొక్క చేష్టలెవ్వియులేనిదైనట్టి ఆత్మస్వరూపమే గల్గియుండును.

ఏతా ఉద్యన్తి చిన్మాత్రాదాత్మఖ్యాత్యాదికాం దృశః
తచ్చ శుద్ధతరం వ్యోమ తన్మయ్యేవ చ దృశ్యతే. 3

ఈ ఆత్మఖ్యాతి మున్నగు భ్రాంతిదృష్టులు చిన్మాత్రమునుండియే యుదయించుచున్నవి. ఆ చిన్మాత్రమున్ను పరమార్థమున మహాశుద్ధమై, సర్వకల్పనాశూన్యమైనట్టి చిదాకాశమేయైయున్నది. కావున సమస్తకల్పనను నేనాచిదాకాశమయముగనే గాంచుచున్నాను.

అయమాత్మా త్వియం ఖ్యాతిరిత్యన్తః కలనాభ్రమః
న సంభవత్యతస్త్వేనం శబ్దం త్యక్త్వా భవార్థభాక్. 4

ఓ రామచంద్రా! 'ఇది ఆత్మ, ఇది దాని ఖ్యాతి (సృష్టిరూపత్వము) అని యీ ప్రకారముగఁ దలంచుట అంతఃకరణముయొక్క కల్పనాభ్రమమేయగును. ఇట్టి విభాగము వాస్తవముగ నెన్నఁడును సంభవింపనేరదు. కావున నీవట్టిశబ్దములను త్యజించివైచి పరమార్థభాగివి కమ్ము.

గచ్ఛం స్తిష్ఠన్నదదపి సర్వం శాన్తమతో జగత్
ఆకాశమౌన మేవాచ్ఛమచ్ఛిన్నం వా ప్రవప్న త్తిమత్ 5

ఈ జగత్తంతయు గమన, ఆగమన, భోజనాది సమస్త వ్యాపారములను గావించు చున్నను, వాస్తవముగ సర్వవ్యాపార శూన్యమై, ఆకాశమువలె మౌనరూపమై, నిర్మలమై; అచ్ఛేద్య మైనట్టి చిన్మాత్రముగనే వెలయుచున్నది.

నానామహాశబ్దమపి శిలామౌనమవస్థితమ్
అనారతం గచ్ఛదపి వ్యోమవచ్ఛైల వత్స్థితమ్. 6

నానావిధారమ్భమపి మహాశూన్యమనఙ్కితమ్
పఞ్చభూతాత్మకమపి ఖమివాలబ్ధపఞ్చకమ్. 7

పదార్థసంకులమపి శూన్యం సంవిత్తిమాత్రకమ్
స్వప్నే మహాపురమివ దృష్టమప్యచ్ఛచిన్మయమ్. 8

సారమ్భమప్యనారమ్భం సంకల్పనగరం యథా
ఆకాశమాత్రం భ్రాన్త్యాత్మ స్వప్నస్త్రీసంగమోపమమ్. 9

అనుభూతమపి వ్యర్థం ప్రతిబిమ్బాఙ్గనాసమమ్
నానానుభవనిర్మాణం వస్తు శూన్యం తు వస్తుతః. 10

పలువిధ మహాశబ్దములతోఁగూడియున్నను ఈ జగత్తు యథార్థముగ మౌనముగనే వర్తించుచున్నది. నిరంతరము గమనము సల్పుచున్నను. ఆకాశమువలెను, పర్వతమువలెను, నొకే స్థానముననే యున్నది. అనేక కార్యారంభములతోఁ గూడుకొనియున్నను చిహ్నరహితమగు మహాకాశమువలెనే వెలయుచున్నది. పంచభూతాత్మకమైయున్నను, పంచభూతరహితమైన కేవలాకాశమువలెనేయున్నది. అనేక పదార్థములచేఁ బరిపూర్ణమైయున్నను, సర్వపదార్థవర్జితమై జ్ఞానమాత్రముగనే చెన్నొందుచున్నది. స్వప్నమందలి మహానగరమువలెఁ జూపట్టినను నిర్మల చిన్మయస్వరూపమేయైయున్నది. వివిధ ప్రయత్న సహితమైయున్నను సంకల్పనగరమువలె సర్వ ప్రయత్న శూన్యమేయైయె యొప్పుచున్నది. మఱియు, ఈ జగత్తు స్వప్నస్త్రీసంగమమువలె భ్రాంతి రూపమును, శూన్యమాత్రమున్నునై యున్నది. ప్రతిబింబిత స్త్రీవలె నియ్యది అనుభూతమైనప్పటి కిని వ్యర్థమేయై తనరుచున్నవి. పలువిధ అనుభవములతోఁ గూడియున్నను నిది వాస్తవముగ సర్వానుభవరహితమై, వస్తుశూన్యమేయై వర్తిల్లుచున్నది.

శ్రీరామ ఉవాచ:—

జాగ్రత్స్వప్నాత్మకమిదం మన్యే స్మృత్యైవ దృశ్యతే
సద్రూపబాహ్యార్థకృతా స్మృతిరేవేహ కారణమ్. 11

శ్రీరాముఁడు:— ఓ మునీంద్రా! ఎపుడు, జాగ్రత్స్వప్నరూపమగు ఈ జగత్తు లేనిదేయై వాసనామాత్రమువలనఁ గానుపించుచున్నదో, అపుడు స్మృతియే యట్లు కన్పించు చున్నదని నేను నమ్మెదను. ఇట్లు సద్రూప బాహ్యపదార్థములయొక్క స్మృతియే జగత్కారణ మగునుగాని భ్రాంతి కాదని యెంచెద.

శ్రీ వసిష్ఠ ఉవాచః—

యత్తచ్చిత్కాచకచ్యేన కాకతాలీయవద్వపుః
వ్యోమాత్మా భాతి భావానాం సత్తామాత్ర మభిత్తిమత్. 12

శ్రీ వసిష్ఠుఁడు:— ఓ రామచంద్రా! చిదాకాశరూపమై పదార్థముల సత్తామాత్రమైనట్టి ఎయ్యది స్ఫురణముద్వారా కాకతాళీయముగ శరీరమును ధరించి నిష్కారణముగ భాసించుచున్నదో, అదియే భ్రాంతిసిద్ధమగు ఈ జగత్తైయున్నది. (అంతేగాని స్మృతిగాదు.)

తదేతదవినాశాత్మ సర్వత్ర పరమాత్మని
సర్వదా విద్యతే శాన్తే పయసీవ తరఙ్గకాః. 13

నాశరహితమై, సర్వవ్యాపకమై, శాంతమైనట్టి పరమాత్మయందీ జగత్తు సదా జలమందు, తరంగములవలె విద్యమానమైయున్నది.

నిర్నిమిత్తం స్వరూపాత్మ తదేతత్పరమాత్మని
సర్వాత్మన్యపి నిర్వాణే వ్యోమాత్మని నిరాత్మని. 14

సర్వరూపమై, పదార్థరహితమై నిర్వాణ (శాంత) స్వరూపమై, చిదాకాశమయమైనట్టి పరమాత్మయందు, కారణరహితమగు ఈ జగత్తు వాస్తవముగ పరమాత్మరూపముతోటియే వెలయుచున్నది.

యదా యదా వభాత్యన్తర్యేన తేన యథా తథా
సర్వదా న కదా చిద్వా యత్ర తత్ర న కించన. 15

ఎపుడెపుడు అవిద్యద్వారా యెచటెచట నెట్లెట్లు పరమాత్మచైతన్యము తనయందు స్ఫురించునో, అపుడపు డచటచట నాయాప్రకారముగనే యీ జగత్తు సదా భాసించును. మఱియు ఎచట చైతన్యమున స్ఫురణమెద్దియు నుండదో, అచట నెపుడును నొకింతైనను భాసింపదు.

తస్యైవ బ్రహ్మ భానస్య తేనైవం బ్రహ్మణాత్మనా
స్వచ్ఛస్యైవ స్వభాస్య స్వస్వభావమనుజ్ఝతా. 16

ఇదం జాగ్రదయం స్వప్నః సుషుప్తం తుర్యమిత్యపి
కృతం నామ స్వయం చిత్వాద్బ్రహ్మ వాత్మేతి చాత్మని. 17

ఆ బ్రహ్మస్వరూపమగు ఆత్మ తన పరమాత్మస్వరూపమును ద్యజింపకయే సర్వ శక్తివంతమగు చిత్స్వరూపమగుటబట్టి తన యా నిర్మలస్వభావమగు బ్రహ్మస్ఫురణమునకే, 'ఇది జాగ్రత్తు, ఇది స్వప్నము, ఇది సుషుప్తి, ఇది తురీయము, ఇది బ్రహ్మము, ఇది ఆత్మ' అను నీప్రకారములగు నామములను స్వయముగఁ గావించెను.

వస్తుత స్త్వస్తి న స్వప్నో న జాగ్రన్న సుషుప్తతా
న తుర్యం న తతోఽతీతం సర్వం శాన్తం పరం నభః. 18

కాని, వాస్తవముగ జాగ్రత్తుగాని, స్వప్నముగాని సుషుప్తిగాని, తురీయముగానిలేవు. వీని యన్నింటియందును అనుస్యూతమై, వీని యన్నింటికంటెను పరమైనట్టి శాంతమగు పరబ్రహ్మరూప చిదాకాశమే సమస్తమున్నునైయున్నది.

అథవా సర్వమేవేదం జాగ్రద్రూపం సదైవ చ
సర్వదైవచ వాస్వప్నః సుషుప్తం సర్వదైవ చ. 19

సర్వదైవ చ వాతుర్యం తదన్తః సర్వదైవ వా
తదిదం వా న యద్విద్మో వయమాశాన్తరూపిణః. 20

లేక ఇదియంతయును, చైతన్యమెపుడును నిదురింపకుండుటచే, సదా జాగ్రద్రూపమై యున్నదనియు, లేక భ్రాంతిమాత్రమగుటచే సదా స్వప్నరూపమై యొప్పుచున్నదనియు, లేక అవిద్యావరణమాత్ర మగుటచే సదా సుషుప్తిరూపమై వెలయుచున్నదనియు, లేక స్వయముగనే అవస్థాత్రయమును దాటియుండుటబట్టి సదా తురీయరూపమై వర్తించుచున్నదనియుఁ జెప్పనగును. మఱియు 'ఇది అది' అనునట్టి వికల్పములను నిర్వికల్పమగు పరమాత్మయందు, పూర్ణ శాంత స్వరూపులమగు మే మెఱుఁగము.

ఇదం ఫేనో న కించిద్వా బుద్బుదో వా న కశ్చన
శూన్యతామ్బుని చిద్వ్యోమ మహార్ణవమహోదరే. 21

సర్వథా జలమయమగు సముద్రమున 'ఇది నురుగు, ఇది నురుగుకాదు, ఇది బుద్బుదము, ఇది బుద్బుదముకాదు' ఇత్యాది వికల్పము లెట్లు మిథ్యయో, అట్లే చిదాకాశమను మహాసముద్రము యొక్క గొప్పయుదరమున 'ఇది జాగ్రత్తు, ఇది స్వప్నము' ఇత్యాది వికల్పములున్ను మిథ్యయై యున్నవి.

యథా సంవేద్యతే యద్యత్తథా తదనుభూయతే
సద్వా సద్వా భవత్స్వప్నే వ్యోమ్నీవ సదసచ్చ తత్ 22

చైతన్యము దేని నెట్లెఱుఁగునో, అది సత్తైనను, అసత్తైనను దాని నాప్రకారముగనే యనుభవించును. ఇట్లు స్వప్నమునందువలె ఈ చైతన్యము నిజ చిదాకాశముననే సదసత్పదార్థ ముల ననుభవించుచున్నది.

సంవిత్కచనమేవేదం యథా భానం విభాసతే
వ్యోమ వ్యోమని చిద్రూపం చిద్రూపే వితతాత్మని. 23

ఈ జగత్తంతయును చైతన్యముయొక్క స్ఫురణమాత్రమేయైయున్నది. కావున చైతన్య మెట్లు స్ఫురించుచున్నదో, అప్రకారమే యీ జగత్తు భాసించుచున్నది. వాస్తవముగ చిద్రూపమై, సర్వవ్యాపకమైనట్టి చిదాకాశమందు చిదాకాశమే ఇట్లు జగద్రూపముగ భాసించుచున్నదగును.

సంవిచ్చ చిన్నభోమజ్జా సైవం రూపైవ సర్వదా
నాస్తమేతి న చోదేతి తస్యాః స్వాఙ్గమిదం జగత్. 24

చైతన్యము చిదాకాశముయొక్క సారమైయున్నది. అది సదా ఏకరూపమై, ఉదయాస్తమయములులేక వెలయుచున్నది. ఆ చైతన్యముయొక్క స్వకీయావయవమే యీ జగత్తు.

మహాప్రలయ సర్గాద్యా మహాప్రలయరాత్రయః
తస్యా ఏవావయవతాం యాతాః కేశనఖాదివత్. 25

మహాప్రళయ, సృష్ట్యాదులను కాలవిభాగములున్ను మహాప్రళయములను రాత్రులున్ను, సృష్టులను పగళ్లను, కేశ, నఖాదులవలె ఆ చైతన్యముయొక్క అవయవరూపత్వమును బొందినవి.

తస్యా భానమభానం తద్వాస్వరం చిహ్నమేవ వా
నాన్యత్స్వభావవత్స్పన్ద ఇవ వాయోర్మహాచితేః. 26

స్ఫురించునదిగాని, లేక స్ఫురింపకుండునదిగాని, చిద్రూపముగాని, లేక మాయా రూపముగాని యేది భాసించుచున్నదో, అదియంతయును వాయువుయొక్క చలనమువలె ఆ మహా చైతన్యముయొక్క స్వభావమేగాని వేఱేమియునుగాదు.

తస్మాత్కిం నామ జాగ్రత్స్యాత్కః స్వప్నః కా సుషుప్తతా
కిం తుర్యం కా స్మృతిః కేచ్ఛా తుచ్ఛా ఏతాః కుదృష్టయః. 27

కాఁబట్టి జాగ్రత్తేమి, స్వప్నమేమి, సుషుప్తియేమి, తురీయమేమి, స్మృతియేమి ఇచ్ఛ యేమి, ఈ జాగ్రదాది కుదృష్టులన్నియును మిథ్యయే అయియున్నవి.

అన్తః సంవేదనం భాతి స్వం బాహ్యార్థతయా యతః
క్వ ద్వైతం క్వ చ కార్థశ్రీః స్మృతిరేవమతః కుతః. 28

చైతన్యముయొక్క స్వకీయమైన అభ్యంతరస్ఫురణమే బాహ్యపదార్థాకారముగ భాసించు చుండ నిఁక ద్వైతమెచట? పదార్థములెచట? పదార్థములే లేనపుడిఁక వాని స్మృతి యెచట ?

తదిదం భాతి నిర్భిత్తి తత్స్వభావం యదాత్మనా
భానోర్నభసి భారూపమేవ భూతవివర్జితమ్. 29

కావున, భేదరహితమగు ఆత్మరూపముగ ఏ యీ దృశ్యము భాసించుచున్నదో, అది నిరాధారమగు ఆకాశమున ప్రకాశ్యపదార్థముయొక్క అపేక్షలేకయుండు సూర్యునియొక్క ప్రకాశమువలె భౌతికపదార్థవర్జితమగు ఆత్మయొక్క నిజస్వరూపము యొక్కయే ప్రకాశముగాని, తద్భిన్నము కాదు.

సద్రూపో యది బాహ్యోఽర్థో విద్యతే తత్తదుత్థితా
స్మృతిః కారణతామేతు నామాద్య జగతః స్థితేః. 30

బాహ్యపదార్థములు నిజదృశ్యరూపముచే సత్యములగుచో, వానివలన నుత్పన్నమగు స్మృతిసృష్ట్యాదికాలమందలి జగత్తుయొక్క స్థితికి కారణముకావచ్చును.

కింతు నాస్త్యేష బాహ్యోర్థో భూతానామత్యసంభవాత్
పఞ్చానామాదిసర్గాదౌ కారణానామభావతః. 31

కాని, సృష్ట్యాదియందు, కారణములయొక్క అభావమువలన పంచభూతములు సర్వథా అసంభవములగుటఁబట్టి యీ బాహ్యపదార్థములు లేకయేయున్నవి,

శశశృఙ్గం యథా నాస్తి యథా నాస్తి ఖపాదపః
యథా వన్ధ్యాసుతో నాస్తి యథా నాస్త్యసితః శశీ. 32

కుందేటికొమ్ము, ఆకాశపుష్పము, వంధ్యాపుత్రుఁడు, నలుపువర్ణముగల చంద్రుడు ఎట్లు లేవో అట్లే యీ జగత్తున్ను వాస్తవముగ లేదు.

తథా జ్ఞప్రతిభాతోఽర్థో జగదాద్యహమాదికః
అప్రేక్షితోఽస్తి నాస్త్యేవ ప్రేక్షితః సన్న కశ్చన. 33

సృష్ట్యాది కాలమున, అజ్ఞానులకుఁ భాసించునట్టి 'నేను, నీవు, మున్నగు జగత్పదార్థములు విచారింపని కారణముచేతనే యట్లు భాసించుచున్నవగును. విచారించినచో నవి యెవ్వియును లేకుండును.

యథాస్తీదం మహాకారం న కించిద్రూపమేవ వా
తత్త్వజ్ఞవిషయం రామ తథాస్తీద మఖణ్డితమ్. 34

ఓ రామచంద్రా! అజ్ఞానులకు మహాకారయుక్తముగ భాసించు ఈ జగత్తు తత్త్వజ్ఞుల దృష్టియందు మూర్తామూర్తరహితమైనట్టి అఖండ చిన్మాత్రైక ఘనముగనే భాసించును.

సంవిద్ఘనభోమజ్ఞా యథోదేతి యదా యదా
నిత్యోదితోపచారేణ కల్పితాస్తమయోదయా. 35

చిదాకాశముయొక్క సారమగు చైతన్యఘనము నిత్యోదితమై యున్నప్పటికిని వ్యవహారమున నెపుడెపుడు ఎట్లెట్లు ఉదయించుచున్నదో, అపుడపుడు అట్లట్లు ఉదయాస్తమయ సహితముగఁ గల్పింపఁబడుచున్నది.

ముథా వ్యోమ్న్యేవ పృథ్వ్యాదితయా వేత్తి తదాతదా
స్వస్యైవ తస్య భానస్య ధత్తే పృథ్వ్యాదికల్పనామ్. 36

అజ్ఞాని చిదాకాశముననే వ్యర్థముగ పృథ్వ్యాదిరూపముల నెపుడెపు డెఱుగుచున్నాఁడో అపుడపుడాతఁడు తన ఆత్మసత్తయొక్క ప్రకాశముననే యట్లు పృథ్వ్యాదులుగఁ గల్పించుచున్నవాఁడగును.

స్వమేవభానమాకాశమ్మాత్రమేవ మహాచితిః
పృథ్వ్యాదివ్యవదేశేన పశ్చాద్వ్యపదిశత్యజా. 37

జన్మరహితమగు మహాచైతన్యరూప చిదాకాశము తనయొక్క స్ఫురణముననే మొదట పృథ్వ్యాదినామములు గల్పించి యాపిమ్మట వానితోటి వ్యవహరించుచున్నది.

ఆకాశ ఏవ పృథ్వీయమితి ధత్తే స్వసంవిదమ్
మనోరాజ్యపురం బాల ఇవ చిన్మాత్రమవ్యయమ్. 38

నాశరహితమగు చిన్మాత్రము ఆకాశమువలె నిర్మలమై, విశాలమైనట్టి తన స్వరూపముననే 'ఇది పృథివి' అను నీప్రకారమగు నిజజ్ఞానమును (చిత్తవృత్తిని) బాలుఁడు మనోరాజ్యపురమును ధరించునట్లు - ధరించుచున్నది.

కిం భానం కిమభానం స్యాత్తస్యేతి న వికల్ప్యతే
స్పన్దాస్పన్దస్వభావం తద్విద్ధి వాతమివామ్బరే. 39

ఓ రామచంద్రా! 'అది చిన్మాత్రమే యగుచో, దానికిఁక జగదాకారమగు స్ఫురణమేమి, అస్ఫురణమేమి' అని యీ ప్రకారముగ నద్దానిఁగూర్చి వికల్పముచేయఁదగదు. ఏలయనిన ఆకాశమున వాయువుయొక్క స్పంద, అస్పందములవలె, అది ప్రాణశక్తిచే స్పందస్వభావ యుక్తమనియు, చైతన్యశక్తిచే అస్పందస్వభావయుక్తమనియు నెఱుఁగుము.

యథా భాతి చిదాదాకాశం తథేదమవభాసతే
వ్యోమ వ్యోమ్నీవ నీరూపం నేదం పృథ్వ్యాది సత్క్వచిత్. 40

చిదాకాశ మేయేప్రకారముగ స్ఫురించునో ఆ యా ప్రకారముగ ఈ సమస్తపృథ్వ్యాది జగత్తున్ను భాసించును. ఈ సమస్తరూపముచే రూపరహితమగు చిదాకాశమే తన చిదాకాశస్వరూపమున భాసించుచున్నదగును. నామరూపాత్మకములగు ఈ పృథ్వ్యాదులు సత్యము లెన్నఁడునుగావు.

యథా భాతి చిదాకాశరూపత్వాద్భాత మవ్యలమ్
న నన్నాసదితి కించిత్తన్న కించిచ్చ కించన. 41

అది (జగత్తు) యెట్లు భాసించునో యట్లు భాసించుగాక! భాసించినను నది వాస్తవముగ చిదాకాశరూపమే యగుటఁబట్టి సర్వథా సత్తుగాని, అసత్తుగాని, వస్తువుగాని అవస్తువుగాని గానిదై, అనిర్వచనీయమే యగుచున్నది.

ఇదమిత్థమనిత్థం చ సద్వాఽసద్వా యథా స్థితమ్
లోకపర్యాయ వృత్తాన్తం ప్రాజ్ఞో జానాతి నేతరః. 42

ఈ జగత్తు ఈ ప్రకారముగనే యున్నదా, లేక మఱియొక విధముగనున్నదా, ఇది సత్తా, అసత్తా, అను నీ ప్రకారములగు లోకపర్యాయ వృత్తాంతములను తత్త్వజ్ఞానియే యథార్థముగ నెఱుఁగును. గాని మఱియెవఁడును నెఱుగజాలఁడు.

స ఏవ హృదయాకాశే కచన్త్యా దృశ్యసంవిదా
బాహ్యం బ్రహ్మాణ్డమిత్థం చ సద్వాఽసద్వా యథా స్థితమ్. 43

ఆ తత్త్వజ్ఞుఁడే సర్వుల హృదయాకాశమున ఆత్మరూపముగ వెలయుచున్నందున, అతని రూపముతో స్ఫురించు దృశ్యసంవిత్తుచే 'ఇవి అభ్యంతర శరీరములు, ఇది బాహ్యబ్రహ్మాండము' ఇత్యాది భేదకల్పనతో నామములు గావింపఁబడెను.

కిమిత్ర బాహ్యం కిం వాన్తః కిం దృశ్యం కాస్య దృశ్యతా
శివం శాన్తమశాన్తం చ సర్వమోమితి భావ్యతామ్. 44

ఓ రామచంద్రా! వాస్తవముగ నిచట బాహ్యమేమి, అభ్యంతరమేమి, దృశ్యమేమి, దాని దృశ్యత్వమేమి? ఈ శాంత, అశాంతరూపమగు సమస్తమునున్ను ఓంకారముయొక్క లక్ష్యభూతమగు శివరూపమైన బ్రహ్మమందు లయింపఁజేసి శాంతముగ నుండుము.

నో వాచ్యవాచకదృశా రహితో విచారః
సంపద్యతే న చ వికల్పమయేన సిద్ధైః
సిద్ధిశ్చ సంభవతి తేన వినా న కాచి
ద్దీపం వినా నిశి యథా నయనోపలమ్భః. 45

వాచ్యవాచకదృష్టి లేనిచో శాస్త్రార్థవిచారణ సంభవింపదు. ఆ విచారణయు వికల్పమయములగు (విషయ, సంశయ, పూర్వపక్ష, ఉత్తర, ప్రయోజనములను) ఐదు అంగములచేఁ గావింపఁబడినదై ఆత్మజ్ఞానసిద్ధికిఁగా ఱ కగుచున్నది. మఱియు, అట్టి విచారణ లేకున్న, రాత్రియందు దీపము లేనిచో నేత్రమునకు వస్తువు ప్రత్యక్షము కానట్లు, ఆత్మజ్ఞానసిద్ధియు సంభవింపనేరదు. (అసత్తైనను వాచ్యవాచకాది వికల్పములను, పూర్ణజ్ఞానము కలుగునంతవఱకును ఆశ్రయింప వలసియే యుండునని భావము.)

> తస్మాదపాస్య వరయాఽమలయా ధియాన్తః
> సంకల్పకల్పనమనల్ప వికల్పజాలమ్
> కృత్వా మనః సకలశాస్త్ర మహార్థనిష్ఠ
> ముడ్డీయ గచ్ఛ పదముత్తమమేకనిష్ఠః. 46

ఇత్యార్షే శ్రీవాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే ఉత్తరార్ధే జాగ్రత్స్వప్న సుషుప్త్యభావ ప్రతిపాదనం నామ సప్తషష్ట్యధిక శతతమః సర్గః ॥ 167 ॥

కాఁబట్టి ఓ రామచంద్రా! అట్టి యుత్తమవిచారణచే శుద్ధమైనట్టి నిర్మల, ఉత్కృష్ట బుద్ధిచే సంకల్పమయమగు సమస్త వికల్ప సమూహమును అంతఃకరణమునుండి పాఱద్రోలి, మనస్సును సకలశాస్త్ర సిద్ధాంతసిద్ధ మహార్థమగు అద్వయ సచ్చిదానందాత్మయందు నెలకొల్పి, తదేక నిష్ఠాపరుఁడవై, ఈ సంసారమునుండి యెగిరి, మోక్షమను ఉత్తమపదమును బొందుము.

ఇది శ్రీవాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున నుత్తరార్ధమున జాగ్రత్స్వప్న సుషుప్త్యభావ ప్రతిపాదనమను నూటయఱువది యేడవ సర్గము ॥ 167 ॥

## అష్టషష్ట్యధికశతతమః సర్గః

[అబుద్ధిపూర్వకః సర్గస్యాధ్యారోపోఽత్ర వర్ణ్యతే
చిన్మాత్రాత్మా చ స చితోఽవికారిత్వాదపోహ్యతే.

అబుద్ధిపూర్వకమగు సృష్టియొక్క అధ్యారోపము, అది వాస్తవముగ చిన్మాత్రాత్మయే యనుట, చైతన్యము వికారరహితమగుటచే, ఆ సృష్టియొక్క అపవాదము, ఇచట వర్ణింపఁబడు చున్నవి.]

**శ్రీ వసిష్ఠ ఉవాచః—**

> అబుద్ధిపూర్వమేవాగో యథా శాఖావిచిత్రతామ్
> కరోత్యేవమజశ్చిత్రాః సర్గాభాసః బవీవ జమ్. 1

శ్రీ వసిష్ఠుఁడు: ఓ రామచంద్రా! వృక్షము అబుద్ధి పూర్వకముగనే శాఖాది వైచిత్ర్యమును గావించునట్లు, జన్మాది వికారరహితుఁడగు పరమాత్మ, ఆకాశమువలె నిర్మలమై, విశాలమైనట్టి తన స్వరూపమున శూన్యరూపములగు విచిత్ర ప్రపంచములయొక్క అధ్యాసములను, అబుద్ధిపూర్వకముగనే గావించుచున్నాఁడు.

యథా కరోత్యబుద్ధ్యాదిరావర్తాది పయోనిధిః
తథా కరోతి ఖే శాత్మా సర్వేశః సర్వవేదనాః. 2

సముద్రము అబుద్ధిపూర్వకముగ ఆవర్తతరంగాదులను రచించునట్లు చిదాకాశరూపుఁడును, సర్వేశుఁడునగు పరమాత్మ చిదాకాశమున జగత్ప్రతిభాసముల నన్నిఁటిని గావించుచున్నాఁడు

తాసాం స్వసంవిదామేవ తతః న కురుతేస్స్వయమ్
మనోబుద్ధిరహంకార ఇత్యాద్యా వివిధాభిధాః. 3

నిజస్వరూప భూతములగు ఆ జగదాకార సంవిత్తుల (చైతన్య వృత్తుల)కు ఆ పరమాత్మ మనోబుద్ధ్యహంకారాది వివిధనామములను స్వయముగనే కల్పించుచున్నాఁడు.

అబుద్ధిపూర్వమారమ్భో దృశ్యరూపః స్వతశ్చితేః
సంకల్ప్యమానో బుద్ధ్యాది స్తరఙ్గాదిర్యథామ్బుధేః 4

సముద్రముయొక్క తరంగాదులవలె చైతన్యముయొక్క బుద్ధి సిద్ధి పర్యంతమగు దృశ్యముయొక్క ఆరంభము సముద్రముయొక్కతరంగాదులవలె స్వతః అబుద్ధిపూర్వకమే యగును. బుద్ధిసిద్ధ్యనంతరము సంకల్పింపఁబడు పదార్థములయొక్క ఆరంభము బుద్ధిపూర్వకమైయున్నది.

చిన్మాత్రాత్ప్రవర్తన్తే మనోబుద్ధ్యాదయస్తథా
ఆవర్తకణకల్లోలవీచయో వారిధేర్యథా. 5

సముద్రమునుండి ఆవర్త, కణ, కల్లోల, తరంగాదులు ప్రవృత్తములగునట్లు చిన్మాత్రముగు ఆత్మనుండి మనోబుద్ధ్యాదిరూప సృష్టియు ప్రవృత్తమగుచున్నది.

భిత్తిమాత్రం యథా చిత్రం జగదాలోకమాత్రకమ్
చితి చిద్వ్యోమమాత్రాత్మ తథైవాభాసమాత్రకమ్. 6

భిత్తి (గోడ)పై లిఖింపఁబడిన జగచ్చిత్రము భిత్తిమాత్రమే యెట్లగునో, అట్లే చిదాకాశమున ఆభాసమాత్రమగు ఈ జగత్తున్ను చిదాకాశమాత్రమేయైయున్నది.

అబుద్ధిపూర్వమారమ్భో నియత్యా సంనివేశవాన్
యథా సంపద్యతే వృత్తే తథా స్వర్గాత్మకశ్చితి. 7

వృక్షమందు శాఖాదులయొక్కయు, సముద్రమందు తరంగాదులయొక్కయు ఆరంభము, అబుద్ధిపూర్వకమైనప్పటికిని పిమ్మటఁ ప్రకృతి (నియతి)చే యథాయోగ్యమగు ఆకారముతోఁ గూడినదిగఁ గావింపఁబడునట్లు, చైతన్యమందును. అబుద్ధిపూర్వకముగ ప్రవృత్తమగు సృష్టిరూపారంభము పిమ్మట ప్రకృతిచే యథాయోగ్యమగు ఆకారముతోఁ గూడినదిగ నొనర్పఁబడుచున్నది.

తథా గులుచ్ఛకాదీనాం యథాన్యః కురుతే భిదాః
తథా చిద్వృక్షపుష్పాదివృథ్వ్యాది విహితాభిధమ్. 8

వృక్షమునుండి యుత్పన్నములైన పుష్పగుచ్ఛాదులకు మఱియొకఁ డెట్లు పేర్లు పెట్టుచున్నాఁడో, అట్లే చైతన్యమను వృక్షముయొక్క పుష్పాదిరూపములగు పృథ్వ్యాదులకు సమష్టిరూపులగు హిరణ్యగర్భాదులు నామములను గల్పించుచున్నారు.

అనన్యత్పుష్పపత్రాది యథా నామ మహాతరోః
తథైవానన్యదేవేదం చిద్వ్యోమ్నః పరమాత్మనః. 9

గొప్ప వృక్షముయొక్క పుష్పపత్రాదు లా వృక్షముకంటె వేఱుగాక యెట్లున్నవో, అట్లే చిదాకాశరూపుడగు పరమాత్మనుండి జనించిన యీ పృథ్వ్యాది జగత్తు ఆ పరమాత్మకంటె వేఱుగాక యున్నది.

తరావవయవేష్వన్యః కరోతివివిధాభిధాః
చిద్వ్యోమాత్మని సర్వేషు భూత్వాన్య ఇవ భాత్మను. 10

వృక్షముయొక్క అవయవములకు వివిధనామములను మఱియొకఁ డెట్లు పెట్టుచున్నాఁడో, అట్లే చిదాకాశమగు ఆత్మ వ్యష్టిజీవునివలెనయి, చిదాకాశరూపులగు స్వపుత్రాదులకును, ఇతరకార్యములకును, అన్నిఁటికిని అనేక నామములను బెట్టుచున్నది.

చిత్తరోః పల్లవాః సర్గాశ్చిత్త్వాదేవ న సన్త్యలమ్
కార్యకారణ వద్భాతి స ఏవ స్వప్నవత్స్వయమ్. 11

చైతన్యమను వృక్షముయొక్క పల్లవములవంటి ఈ యనేక సృష్టులు చిద్రూపములే యగుటచే, ఆ చైతన్యముకంటె నే మాత్రమున్ను భిన్నముగలేవు. చిద్రూపవృక్షమే యీ ప్రకారముగ స్వప్నమువలె కార్యకారణరూపముతో స్వయముగ భాసించుచున్నది.

వక్షి చేత్కథమేతస్మాద్వ్యర్థం తదనుభూయతే
సర్గాద్యమత్ర స్వప్నాదిష్వేషు కోఽపహ్నవం భవేత్. 12

సృష్ట్యాదులు లేనిచో విహిత నిషిద్ధకర్మ ఫలత్వముయొక్క సంబంధము లేకపోవుటచే, ఆత్మ పరలోకమున వ్యర్థముగ నద్దాని ననుభవించుట తటస్థించుచున్నదిగదాయని ఆక్షేపించిన, అది సరికాదు, ఏలయనిన, స్వప్నాదులందును, ప్రసిద్ధములగు రజ్జు, సర్ప, మృగతృష్ణాద్యనుభవములందును నట్టి వ్యర్థత్వము ఉండియేయున్నది. స్వప్న, రజ్జు సర్పాదులందు భోగాభాస మాత్రముచే కర్మఫలములయొక్క సఫలత్వమున్నదని యనినచో, యిచట (జాగ్రత్తునందు)కూడ సమానమేయై యున్నది.

తరావాకారవత్యేషా కల్పనారచితా యథా
చితేరాకాశమాత్రాయాస్తథైషా కల్పనాకృతా. 13

సాకారమగు వృక్షమందు సాకారములగు పుష్పపత్రాదుల కల్పన యెట్లు గావింపబడినదో, అట్లే నిరాకారమగు చైతన్యమున సాకారమగు యీ జగత్తుయొక్కయు కల్పన గావింపబడినది.

యథా గన్ధాదయః పుష్పే గగనే శూన్యతాదయః
యథా స్పన్దాదయో వాయౌ తథా బుద్ధ్యాదయః పరే. 14

పుష్పమందు గంధాదులున్ను, ఆకాశమున శూన్యత్వాదులున్ను, వాయువునందు చలనాదులున్ను, అభిన్నరూపముగ నెట్లుగలవో, అట్లే పరమాత్మయందును బుద్ధ్యాదులు అభిన్నరూపమున వర్తించుచున్నవి.

యథా గన్ధాదయః పుష్పే గగనే శూన్యతాదయః
యథా స్పన్దాదయో వాయౌ తథేమాః సృష్టయశ్చితి. 15

పుష్పమందు గంధాదులున్ను ఆకాశమందు శూన్యత్వాదులున్ను, వాయువునందు చలనాదులున్ను, అభిన్నరూపముగ నెట్లుగలవో, అట్లే చైతన్యమున ఈ యనేక బ్రహ్మాండరూపసృష్టులున్ను అభిన్నముగ వెలయుచున్నవి.

యథా ఖానిలపుష్పాణాం శూన్యతాస్పన్దగన్ధదృక్
శూన్యరూపానుభూతా చ తథా సర్గస్థితిశ్చితి. 16

ఆకాశముయొక్క శూన్యత్వదృష్టి, వాయువుయొక్క చలనదృష్టి, పుష్పముయొక్క గంధదృష్టి అనుభూతములైనప్పటికిని, ఆ యా యాకాశాదులకంటె వేఱుగ శూన్యరూపములే యెట్లగునో, అట్లే చైతన్యమున ఈ సృష్టియు అనుభూతమైనప్పటికి ఆచైతన్యముకంటె వేఱుగ శూన్యరూపమేయగును.

న పృథక్ శూన్యతా వ్యోమ్నో న పృథగ్ద్రవతామ్భసః
న పృథక్ కుసుమాద్గన్ధో నానిలాత్స్పన్దనం పృథక్. 17

అగ్నేర్న పృథగుష్ణత్వం పృథక్ శైత్యం చ నో హిమాత్
చిద్వ్యోమ్నైకాత్మనః స్వచ్ఛాన్న జగత్పృథగీశ్వరాత్. 18

ఆకాశముకంటె శూన్యత్వము జలముకంటె ద్రవత్వము, పుష్పముకంటె గంధము, వాయువుకంటెఁ చలనము, అగ్నికంటె నుష్ణత్వము, హిమము (మంచు) కంటె శీతలత్వము వేఱు కానట్లు, నిర్మలమై, ఈశ్వరరూపమై, కేవలము చిదాకాశస్వరూపమైనట్టి పరమాత్మకంటె జగత్తున్ను వేఱుకాదు.

సర్గాదావేవ యద్వ్యోమ్ని స్వప్నాద్హృది చ దృశ్యతే
అకారణం తచ్చిద్వ్యోమ్నః కథమన్యద్భవేత్కిల. 19

సృష్ట్యాదియందే యేది కారణశూన్యమైయున్నదో, మఱియు స్వప్నమున హృదయాకాశమున నెయ్యది కానుపించుచున్నదో, ఆ రెండును కూటస్థచైతన్యముకంటె భిన్నములెట్లగును?

స్వప్న ఏవాత్ర దృష్టాన్తో నిత్యదృష్టో విచార్యతామ్
చిన్మాత్ర వ్యతిరేకేణ సారం కిం తత్ర కథ్యతామ్. 20

ఓ రామచంద్రా! నిత్యముగాంచఁబడు స్వప్నమేయిట దృష్టాంతమైయున్నది. దానిని విచారింపుము. కావున, ఈ ప్రపంచమున చిన్మాత్రముకంటె వేఱుగ సారమేదిగలవో చెప్పుము.

అయం చిరన్థసంకల్పః సర్గప్రలయవిభ్రమః
జ్ఞానం స్వభావకచనమజ్ఞానం భ్రాన్తిజృమ్భణమ్. ౮౩

ఈ సృష్టి, ప్రళయవిభ్రమము చిరకాల సంకల్పమాత్ర స్వరూపమే యైయున్నది. అద్దాని యథార్థ (పారమార్థిక) స్వభావముయొక్క స్ఫురణమే తత్త్వజ్ఞానము. భ్రాంతిమాత్రముచే జగద్రూపముతోటి విజృంభణమే అజ్ఞానము.

ఝటిత్యుదేతి బ్రహ్మాత్మ దృశ్యం దృష్టమకారణమ్
ఖే సుషుప్తాదివ స్వప్నః పశ్చాన్నియతిమృచ్ఛతి. 84

దృశ్యశూన్యమగు ఆత్మయందు సుషుప్త్యనంతరము స్వప్నముగాంచఁబడునట్లు, మాయోపహిత బ్రహ్మము శీఘ్రముగ దృశ్యరూపమై కారణము లేకయే యుదయించుట గాంచఁబడుచున్నది. అటుపిమ్మట నయ్యది అర్థక్రియావ్యవస్థతోటి కార్యకారణభావాది రూపమగు నియతిని బొందుచున్నది.

కాకతాలీయవచ్ఛిత్త్వాచ్చితి దృశ్యం ప్రకాశతే
స్వయమేవ స్వభావస్థమావర్తాది యథామ్బుధౌ. 85

వాస్తవముగ చిత్స్వభావముననే యుండియున్నను, ఈ దృశ్యజగత్తు చైతన్యమున చిద్రూపత్వమువలన కాకతాళీయముగ - సముద్రమందు తరంగాదులవలె స్వయముగనే ప్రకాశించుచున్నది.

ఈదృశో నామ చిద్ధాతురయమాకాశమాత్రకః
యదిత్థం నామ కచతి జగద్రూపేణ చిద్వపుః. 86

చిదాకాశమాత్ర రూపమగు ఈ చైతన్యవస్తువు తన చిన్మాత్రశరీరమును త్యజింపకయే యిట్లు జగద్రూపముగ స్ఫురించుచున్నది. ఇది దానిస్వభావమైయున్నది.

తేన చిద్రూపిణా పశ్చాద్దృశ్యేనాత్మని కల్పితాః
సంజ్ఞాః స్మృత్యాదిపృథ్వ్యాది బుద్ధ్యాది కలనాత్మికాః. 87

ప్రథమమున అబుద్ధిపూర్వకమైన దృశ్యాకార ప్రతిభాసమువలన దృశ్యరూపమైనట్టి యా చిదాత్మ యటుపిమ్మట తనయందు స్మృత్యాది, పృథ్వ్యాది, బుద్ధ్యాది కల్పనారూపములగు సంజ్ఞలను గల్పించెను.

శ్రీరామ ఉవాచః—

ఏవం స్థితే హే భగవన్బుద్ధిసంస్కారతః స్మృతిః
ఇతి కిం ప్రోచ్యతే బ్రూహి సంబుద్ధా యది న స్మృతిః 88

శ్రీరాముడు:— మహాత్మా! తాత్కాలిక ప్రతిభాసములందలి కల్పనా మాత్రమే జగత్తగుచో నపుడు క్షణికవాదదోషము సంభవించునుగదా! మఱియు నట్లు తాత్కాలిక కల్పనా మాత్రరూపమే జగత్తైయున్నచో నపుడుస్మృతియు, ప్రత్యభిజ్ఞయు, పూర్వానుభూతవిషయములను బొందఁజాలవు. గనుక అత్తఱి 'పూర్వముత్పన్నమైన బుద్ధియొక్క ప్రామాణికాను భవముచే జనించిన సంస్కారమువలన స్మృతి, ప్రత్యభిజ్ఞ కలుగుచున్నవను' సర్వశిష్టజనానుభవసిద్ధమగు విషయమెట్లు లభించును?

శ్రీ వసిష్ఠ ఉవాచః—

శృణు రామ భినద్మ్యేనం ప్రశ్నం సింహ ఇవేభకమ్
అభేదం స్థాపయామ్యేకమాలోకమివ భాస్కరః. 39

శ్రీవసిష్ఠుఁడు:— ఓ రామచంద్రా! సింహము ఏనుఁగుపిల్లను ఛేదించివైచునట్లు నీ యీ ప్రశ్న (ఆక్షేపము)ను నేనిపుడు ఛేదించివైచి, సూర్యుఁడు ప్రకాశమును స్థాపింపఁజేయునట్లు అభేదరూపమగు అద్వైతాత్మతత్త్వమును స్థాపింపఁజేయుచున్నాను వినుము.

విద్యతే జగదాత్మేదం దృశ్యం చిన్మాత్రకోటరే
అనుత్కీర్ణా యథా వృక్షే వనస్థా శాలభఞ్జికా. 40

జగత్తు పూర్వము అసత్తేయై క్షణిక ప్రతిభాసముతో నుత్పన్నమగునను (బౌద్ధ) సిద్ధాంతము నంగీకరించినచో నీవు చూపిన దోషము ఘటిల్లును. కాని వేదాంత సిద్ధాంత మట్లుకాదు. నిత్య బ్రహ్మసత్తారూపమేయగు జగత్తు, అవిద్యావరణ విక్షేపశక్తి వైచిత్ర్య చమత్కారముచే, ఒకపుడావిర్భవించినట్లును, ఒకపుడుతిరోభావ మొందినట్లును, ఒకపుడు క్షణికముగను, ఒకపుడు స్థిరముగను, ఇట్లు భిన్నభిన్న ప్రకారములుగ భాసించుచున్నది. కావున నట్టిచోట స్మృతి, ప్రత్యభిజ్ఞాదులన్నియును తగియేయున్నవి. వనమందలి వృక్షమునఁ జెక్కఁబడని విగ్రహమువలె, ఈ జగద్రూపమగు దృశ్యము, ఉత్పత్తికిఁ బూర్వము చిన్మాత్రకోటరమున వెలయుచున్నది.

ఉద్ధరేద్వృక్షత స్తక్ష తథా చిద్భాలభఞ్జికామ్
అద్వితీయాచ్చితి స్తస్మాదుత్కీర్ణా కః కరోతి తామ్. 41

వృక్షముయొక్క ఆవరణరూపములగు శాఖాదులను ఛేదించి వడ్రంగి క్రమముగ ఆ వృక్షమునుండి విగ్రహమును బయలుపఱచును. కాని, అద్వితీయమగుటఁబట్టి చైతన్యముకంటె వేఱుగ కర్త యెవరును లేనందుచే, చిద్రూప స్తంభమునుండి జగద్రూప విగ్రహముయొక్క అభివ్యక్తి ఆ దారువిగ్రహమువలెఁ గాఁజాలదు.

స్తమ్భే జడేన సా వ్యక్తి మనుత్కీర్ణేహ గచ్ఛతి
చితి త్వన్తర్గతా చిత్త్వాదేవాత్మన్యేవ భాత్యలమ్. 42

జడమగు స్తంభమున విగ్రహ మితరునిచేఁ జెక్కఁబడక నెన్నఁటికిని బయల్పడఁజాలదు. కాని, చైతన్యమున, ఆ చైతన్యముయొక్క ప్రభావముచేతనే యందున్న జగత్తను విగ్రహము పూర్ణరూపముగఁ బ్రకాశించును.

భాసమానా త్వనుత్కీర్ణ దేహైవాపి చ భాత్మికా
స్వరూపాదచ్యుతా చైవ చిన్మాత్రాదాత్మని స్థితా. 43

అట్లు ప్రకాశించినప్పటికిని జగత్ప్రతిమ స్తంభప్రతిమవలె, జెక్కఁబడిన దేహముగలది కాదు. అది చిదాకాశమాత్రమేయై, తన పరమార్థస్వరూపమునుండి చ్యుతినొందక, చిన్మాత్రత్వము వలన స్వాత్మయందే స్థితిగల్గియున్నదగును. కావున సత్తాసామాన్యరూపముతోటి అయ్యది ప్రళయ సుషుప్తులందును విద్యమానమైయే యున్నది.

సర్గాదౌ సర్గకలనాః కరోతి కలనావతీ
సా చిత్స్వభావతః స్వప్నే ఖాత్మన్యద్యోదితామివ. 44

ఆకాశ ఏవ హృదయే పరమాకాశ రూపిణీ
సంకల్పయతి చిద్భాలభఞ్జికాః స్వాత్మనాత్మని. 45

సృష్ట్యాదియందును, ఆ చైతన్యము ప్రథమమున నట్లు నిర్వికల్పరూపమే గలదై, పిమ్మట ప్రాణులయొక్క భోజకములగు అదృష్టముల ననుసరించి యుత్పన్నములైన మనోవికల్పములచే స్వభావముగ విచిత్రములైన సృష్టికల్పనలను గావించుచున్నది. చిదాకాశరూపమగు ఆ చైతన్యము చిదాకాశరూపమగు తన హృదయమున, నేఁటి స్వప్నమున నుదయించిన కల్పనలవలె విచిత్ర జగద్రూపములగు చైతన్య - విగ్రహములను తానే సంకల్పించుచున్నది.

ఇయం బ్రహ్మకలా సేహ చిన్మాత్ర కలనా త్వియమ్
ఇయం చితిరియం జీవ స్త్వహంకార స్త్వసావితి. 46

ఇయం బుద్ధిరియం చిత్తమయం కాల ఇదం నభః
అయం సోఽహం క్రియాచేయమిదం తన్మాత్ర పఞ్చకమ్. 47

ఇన్ద్రియాణామిదం వృన్దం పుర్యష్టకమిదం స్మృతమ్
ఇహాతివాహికో దేహ స్తథాయం చాధిభౌతికః. 48

బ్రహ్మాహం శంకరశ్చాహముపేన్ద్రోఽహమహం రవిః
ఇదం బాహ్యమిదం చాన్తరయం సర్గ ఇదం జగత్. 49

'ఇది చిన్మాత్రముతోఁ గూడినదై, సత్తాసామాన్యరూపమై, జగద్బీజమైనట్టి బ్రహ్మకళ; ఇది యా బ్రహ్మకళయందు ప్రతిబింబించినట్టి చైతన్యము; ఈతఁడు జీవుఁడు (ప్రాణాదియుక్తమగు ప్రతిబింబిత చైతన్యము) ఇది అహంకారము (అభిమాన వృత్తిప్రధానమగు ఆ చిత్ప్రతిబింబము); ఇది బుద్ధి (నిశ్చయత్వ ప్రధానమగు ఆ చిత్ప్రతిబింబము); ఇది చిత్తము (సంకల్ప ప్రధానమగు ఆ చిత్ప్రతిబింబము); ఇది కాలము; ఇది ఆకాశము, ఇవి 'వీఁడు, వాఁడు, నేను' అను రూపములు; ఇది క్రియ, ఇవి పంచతన్మాత్రలు; ఇది యింద్రియముల సమూహము; ఇది మనోబుద్ధ్యాది రూపమగు పుర్యష్టకము; ఈ దేహేంద్రియాది సమూహమధ్యమున నిది సూక్ష్మశరీరము; ఇది స్థూల శరీరము; నేను బ్రహ్మదేవుఁడను; నేను విష్ణువును: నేను మహేశ్వరుఁడను; నేను సూర్యుఁడను; ఇది బాహ్యము; ఇది సృష్టి; ఇది జగత్తు' — ఈ ప్రకారముగ సృష్ట్యాదియందు చైతన్యము తనయందు సంకల్పించుచున్నది.

ఇత్యాదికలనా జాలం చిద్వ్యోమైవాతి నిర్మలమ్
తస్మాత్తైక్యతే పదార్థౌఘాః క్వ స్మృతిః క్వ ద్వయైకతే 50

ఈ మున్నగు కల్పనాసమూహమంతయు అతినిర్మలమగు చిదాకాశమేయైయున్నదిగాని దానికంటె వేఱుగ అణుమాత్రమైననుగాదు. కాఁబట్టి యిఁక అజ్ఞానులచేఁ గల్పింపఁబడిన యీ జడపదార్థసమూహము లెచట ! స్మృతి యెచట ! ద్వైత, ఏకత్వము లెచట.

అకారణకమేవేతి జగదా భోగిఖణ్డకః
సర్గాదౌ స్వప్నవద్భాతి ఖే ఖాత్మైవ వికారివత్. 51

ఈ ప్రకారముగ చిదాకాశరూపమేయగు ఈ విశాలజగత్ఖండము సృష్ట్యాదియందు కారణము లేకయే స్వప్నముచందమున, వికారయుక్తముగ నున్నదానివలె భాసించుచున్నది.

వ్యోమ్న్యేవ కచతి వ్యోమ చిన్మయే చిన్మయం హి యత్
శుద్ధం తదేవ తేనైవ జగద్వ్యోధాత్మ్యా తజ్జగత్. 52

చిన్మయమగు ఆకాశమున చిన్మయరూపమేయయి ఈ జగత్తు స్ఫురించుచున్నది మఱియు. ఆ చిదాత్మయే స్వయముగ నట్టిచిద్రూపమగు జగత్తు నెఱిగినది. కావున నిట్టియర్థజ్ఞానముచే నిఁక అకల్పితమగు జగత్తెచట?

క్వస్మృతిః క్వ చ వా స్వప్నః క్వ కాలాః కలనాశ్చకాః
చిదాభానమిదం భాతి శాన్తం శూన్యమివామ్బరే. 53

ఆకాశమందు శూన్యత్వమువలె ఏకమై, శాంతమైనట్టి చిదాకాశమున చిదాకాశరూపమే యగు ఈ జగత్తు స్ఫురించుచుండ నిఁక స్మృతి యెచట! స్వప్నమెచట; కాలములెచట! అనేక బ్రహ్మాండములయొక్క కల్పనలెచట!

యదన్తశ్చిద్ఘనస్యాస్తి తద్బహిర్భూతతాం గతమ్
వస్తుతస్తు న తద్బాహ్యం నాన్తః సన్మాత్ర కాద్భతే. 54

చిద్ఘనముయొక్క అభ్యంతరమున నేది (సత్త్వ)గలదో. అదియే బాహ్యమున, పంచభూతాది రూపత్వము నొందినది. కాని వాస్తవముగ సన్మాత్రము తప్ప బాహ్యముగాని, అభ్యంతరముగాని యేమియును లేదు.

నిరస్తావయవా చ్ఛాన్తాదనాఖ్యాద్వ్యత్ప్రవర్తతే
అకారణం భవేద్భూతం తదన్తాః కథమన్యథా. 55

అంధులగు ఓ వాదులారా! అవయవరహితమై. శాంతమై, వాక్కునకు విషయము గానిదైనట్టి చిన్మాత్రమునుండి కారణములేకయే యేది యుత్పన్నమగుచున్నదో, అది యుత్పన్నమైనదెట్లగును! మఱియు, ఆ కూటస్థచైతన్యమున్ను వికారసహిత మెట్లగును?

అస్మాద్యా దృక్పరం బ్రహ్మ తాదృగ్దృశ్య మిదం పరమ్
యదేవ చిన్నభః స్వప్నే తదేవ స్వప్నపత్తనమ్ 56

ఇక్కారణమున, పరబ్రహ్మమెట్టి శుద్ధచిన్మయ స్వరూపమైయున్నదో, ఈదృశ్యజగత్తున్ను నట్టి శుద్ధచిన్మయరూపమేయైయున్నది. స్వప్నమున ఏది చిదాకాశమో, అదియే స్వప్ననగరమున్ను నగునుగదా!

న కించిత్కించనాపీదం దృశ్యమస్తిమనాగపి
క్వ రజః పూర్ణజలధౌ క్వ దృశ్యం పరమామ్బరే. 57

ఈ దృశ్యమెకింతైనను లేదు. పూర్ణసముద్రమున ధూళియెచట? అట్లే పరమచిదాకాశమున దృశ్యమెచట?

తచ్చేదం భాతి వా కించిత్తచ్చిన్మాత్రమచేత్యకమ్
అకచత్త్వేవ సంశాన్తమాత్మనీత్థ మవస్థితమ్. 58

ఏది భాసించుచున్నదో, అది విషయరహితమై, కావుననే స్వమాత్రప్రకాశమై, ప్రశాంతమైనట్టి చిన్మాత్రమే తనయందా ప్రకారముగ స్థితినొందియున్నదగును.

పూర్ణాద్వై బ్రహ్మణః పూర్ణమప్యనుద్ధృతముద్ధృతమ్
ఇవేదం భాతి భారూపమాభానం పరమాత్మకమ్. 59

పూర్ణమగు బ్రహ్మమునుండి పూర్ణరూపమేయగు ప్రకాశస్వరూపమైన యీ జగత్తెయ్యది వాస్తవముగనుత్పన్నము కాకున్నను, ఉత్పన్నమైనదానివలె భాసించుచున్నదో, అది ప్రకాశరూపమైన పరమాత్మయేయైయున్నది.

ఇత్థం మయి ప్రకథయత్యనుభూయమాన
మప్యుచ్చకైర్భృత జనస్య విమూఢతాన్తః
స్వప్నే జగద్వపుషి జాగ్రదితి ప్రతీతి
నాద్యాపి యత్త్యజతి నామ విదన్నపి ద్రాక్. 60

ఇత్యార్షే శ్రీ వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే ఉత్తరార్ధే కాలకణ్టకోపదేశో నామాష్టషష్ట్యధిక శతతమః సర్గః ॥ 168 ॥

ఓ రామచంద్రా! అయ్యో! నేను స్వయముగ అనుభూతమొనర్చుకొనిన ఆత్మతత్త్వమును ఈ ప్రకారముగ అనేక దృష్టాంతములతోటి విశదముగఁ బ్రతిదినము చెప్పుచున్నప్పటికిని మందాధికారుల చిత్తమందలి విమూఢత్వము, స్వప్నప్రాయమగు ఈ జగత్తుయొక్క విషయమున 'ఈ జాగ్రత్తు సత్యమే' అను ప్రతీతిని నేఁటికిని నింకను త్యజింపకయేయున్నది? మఱియు, విజ్ఞుఁడైన అధికారియు మోహప్రాబల్యమువలన జాగ్రజ్జగత్తునందలి సత్యత్వభ్రాంతిని శీఘ్రముగఁ ద్యజింపకయే యున్నాఁడే!

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున నుత్తరార్ధమున కాలకంటకోపదేశ మను నూట యఱువది యెనిమిదవ సర్గము ॥ 168 ॥

## ఏకోనసప్తత్యధిక శతతమః సర్గః

[భూయో విశ్రాన్తచిత్తస్య జీవన్ముక్తస్య భూరిశః
లక్షణాన్యభిధీయన్తే సుప్తిశ్చాత్మవతః సదా.

మరల విశ్రాంత చిత్తుఁడగు జీవన్ముక్తునియొక్క యనేకలక్షణములు. ఆత్మజ్ఞానియొక్క సదాసుఖముగ నిద్రించుట (ఆత్మయందు విశ్రమించుట) ఇచట వర్ణింపఁబడుచున్నవి.]

**శ్రీ వసిష్ఠ ఉవాచ:—**

న సుఖాయ సుఖం యస్య దుఃఖం దుఃఖాయ యస్య నో
అన్తర్ముఖమతోర్నిత్యం స ముక్త ఇతి కథ్యతే. 1

శ్రీవసిష్ఠుఁడు: ఓ రామచంద్రా! సదా అంతర్ముఖమైనట్టి (ప్రత్యగాత్మయందాసక్తమైనట్టి) బుద్ధిగల యే ఆత్మజ్ఞానికి, సుఖహేతువగు విషయసమూహము సుఖమునుగాని, దుఃఖహేతువగు విషయసమూహము దుఃఖమునుగాని గలిగింపదో, అట్టివాఁడు జీవన్ముక్తుఁడనఁబడును.

యస్య న స్ఫురతి ప్రజ్ఞా చిద్వ్యోమన్యచలస్థితేః
ప్రసృతేష్వివ భోగేషు స ముక్త ఇతి కథ్యతే. 2

అజ్ఞానుల బుద్ధి విశాలభోగములనుండి యెట్లు చలింపకయుండునో, అట్లు, ఏ జ్ఞాని యొక్క బుద్ధి చిదాకాశమునుండి చలింపక నచటనే నిశ్చలముగనుండునో, ఆతఁడు జీవన్ముక్తుఁడని చెప్పఁబడును.

చిన్మాత్రాత్మని విశ్రాన్తం యస్య చిత్తమచఞ్చలమ్
తత్త్రైవ రతిమాయాతం స జీవన్ముక్త ఉచ్యతే. 3

చిన్మాత్రాత్మయందు విశ్రాంతినొందినదై యెవనిచిత్తము నిశ్చలముగనుండునో, మఱియు నట్టి ఆత్మయందే సదా ప్రీతిఁగొనునో, ఆతఁడు జీవన్ముక్తుఁడని పేర్కొనఁబడును.

పరమాత్మని విశ్రాన్తం యస్య వ్యావృత్య నో మనః
రమతేఽస్మిన్పునర్దృశ్యే స జీవన్ముక్త ఉచ్యతే. 4

పరమాత్మయందు విశ్రాంతి నొందినదై యెవని మనస్సు మరల యిటునుండి మరలి దృశ్యమం దెన్నఁటికిని ప్రీతిఁగొనకయుండునో, ఆతఁడు జీవన్ముక్తుఁడనఁబడును.

**శ్రీరామ ఉవాచ:—**

న సుఖాయ సుఖం యస్య దుఃఖం దుఃఖాయ యస్య నో
జగమేవ మునే మన్యే మానవం తమచేతనమ్. 5

శ్రీరాముఁడు:— ఓ మునీంద్రా, ఎవనికి సుఖహేతువగు విషయము సుఖమునుగాని, దుఃఖహేతువగు విషయము దుఃఖమునుగాని కలిగింపదో, అట్టి మనుజుని నేను చేతననిరహితుఁడగు జడునిగనే (ఉన్మత్తునిగ, లేక, మూర్ఛితునిగనే) తలంచెద.

**శ్రీవసిష్ఠ ఉవాచ:—**

చిద్వ్యోమైకాన్తనిష్ఠత్వాత్ప్రయత్నేన వినా సుఖమ్
న వేత్తి శుద్ధబోధాత్మా యః స విశ్రాన్త ఉచ్యతే. 6

శ్రీ వసిష్ఠుఁడు:— ఓ రామచంద్రా! శుద్ధబోధస్వరూపుఁడగు యెవఁడు కేవలము చిదాకాశమందే స్థితిగల్గియుండుటవలన, అప్రయత్నముగనే బాహ్య (లౌకిక) సుఖము ననుభవింపకయుండునో, అట్టివాఁడు విశ్రాంత చిత్తుఁడనియు, లేక జీవన్ముక్తుఁడనియుఁ జెప్పఁబడును.

సర్వ ఏవ పరిక్షీణాః సందేహా యస్య వస్తుతః
సర్వార్థేషు వివేకేన స విశ్రాన్తః పరే పదే 7

వివేకముచే మూలాజ్ఞానము నశించుటవలన యెవనికి వాస్తవముగ సమస్త విషయము లందును సందేహములు నశించిపోయినవో, అతఁడు పరమాత్మపదమున విశ్రాంతినొందినవాఁడని పచింపబడును.

యస్య కస్మింశ్చిదప్యర్థే క్వచిద్రసికతాస్తినో
వ్యవహారవతోఽప్యన్తః స విశ్రాన్త ఉదాహృతః. 8

వ్యవహారము సల్పుచున్నప్పటికిని ఎవనికి అంతరంగమున ఏ పదార్థమందును రాగము లేక యుండునో, అతఁడు పరమాత్మపదమున విశ్రాంతి నొందినవాఁడని చెప్పఁబడును.

యస్య సర్వే సమారమ్భాః కామసంకల్పవర్జితాః
యథాప్రాప్తం విహరతః స విశ్రాన్త ఇతి స్మృతః. 9

ఎవనియొక్క సమస్తకార్యములున్ను గోర్కెయొక్క సంకల్పములేనివై (ఫలాపేక్ష రహితములై) యుండునో, మఱియు నెవఁడు యథాప్రాప్తమగు పదార్థమున మాత్రము ప్రవర్తించునో అతఁడు విశ్రాంతచిత్తుఁడని యెంచఁబడును.

అవిశ్రామే నిరాలమ్బే దీర్ఘే సంసారవర్త్మని
చిత్త్వాదాత్మని విశ్రాన్తిః ప్రాప్తా యేన జయత్యసౌ. 10

విశ్రాంతిలేనిదియు ఆధారవర్జితమైనదియు దీర్ఘమైనదియునగు ఈ సంసారమార్గమున నలసి యెవఁడు చిన్మాత్రాత్మయొక్క దర్శనమువలన నట్టి ఆత్మయందే విశ్రాంతిని బడసెనో అతఁడే సర్వోత్తముఁడు.

భావిత్వా యే చిరం కాలం ప్రాప్తవిశ్రాన్తయః స్థితా
తే సుప్తా ఇవ లక్ష్యన్తే వ్యవహారపరా అపి. 11

ఎవరు సంసారమున చిరకాలము విషయసుఖములకొఱకై పరువిడి యలసినవారై, క్రమముగ ఆత్మజ్ఞానమును సముపార్జించి బ్రహ్మపదమున విశ్రాంతి నొందియుందురో అట్టివారు వ్యవహారపరులైయున్నను సుషుప్తియందున్న వారివలెనే యుందురు.

తే హి చిత్యే చిదాభాసనభస్యాభాన్తి భామయా
భాస్కరా ఉదితానిత్యం నేహ తిష్ఠన్తి తే క్వచిత్. 12

అట్టిజ్ఞానులు ద్రష్టృదృశ్యరహితమగు స్వచిత్తాకాశమున శుద్ధచిద్రూపమయులగు నిత్యోదిత సూర్యులవలె సదాభాసించుచుందురు. మఱియు వారీసంసారమున నెచటను ప్రీతిఁగొనరు.

సదేహా వ్యవహారస్థా అపి సుప్తా ఇవోత్తమాః
ప్రక్షీణా ఇవ లక్ష్యన్తే జడాభా నతు తే జడాః. 13

అట్టి యుత్తములగు జీవన్ముక్తులు దేహధారులైయున్నను విదేహులుగను వ్యవహారమందున్నను నిద్రించుచున్న వారివలెను గన్పట్టుదురు. అట్లు వారు జడులుగ పైకి చూపట్టుదురేగాని వాస్తవముగ జడులుకారు!

సుప్తా ఇవేహ శయ్యాసు యే స్వప్ననగరేస్థితాః
సుప్తా ఇతి త ఉచ్యన్తే నతు తే జడతాం గతాః. 14

ఈ ప్రపంచమును స్వప్ననగరముగ దలంచి యద్దానియెడల నుదాసీనులై శయ్యపై నిదురించువానివలె నెవరుకానుపింతురో వారు ప్రపంచముయెడల నిద్రితులని (జీవన్ముక్తులని) చెప్పఁబడుదురు కాని వారు వాస్తవముగ నిద్రకు వశీభూతులైనవారుకారు.

దీర్ఘాధ్వపరివిశ్రాన్తో విశ్రాన్తో న దదాతి యః
వాక్యం స సుఖమౌనస్థః ప్రోచ్యతే న జడాకృతిః. 15

సంసారమను దీర్ఘమైన మార్గమున పరిభ్రమించుటనుండి నివృత్తుఁడైనవాఁడును, ఆత్మయందు విశ్రాంతినొందినవాఁడును, బహిర్ముఖవృత్తిగల అజ్ఞానులతోటి సంభాషింపనివాఁడునగు జీవన్ముక్తుఁడు నిరతిశయానందరూపమగు ఆత్మయందు మౌనముగ నుండువాఁడనియే చెప్పబడును గాని జడస్వరూపుఁడనికాదు.

యా నిశా సర్వభూతానామవిద్యాన్తమయాత్మికా
పరో బోధః పరా శాన్తిస్తత్రాసౌ సమమాస్థితః. 16

అవిద్యాంధకారమున వ్యవహరించునట్టి సమస్తజీవులకును నేది యద్దాని వినాశరూపమగు రాత్రియైయున్నదో, అనఁగా యే ఆత్మజ్ఞానవిషయమున వారు నిద్రించుచున్నారో అదియే పరమబోధయు పరమశాంతియునై యున్నది. అట్టి జ్ఞానస్వరూపముననే యీ జీవన్ముక్తుఁడు సదా సమరూపమున వెలయుచుండును.

యస్మిఞ్జాగ్రతి భూతాని దృశ్యేఽస్మిన్దుఃఖదాయిని
తత్రాసౌ సతతం సుప్తస్తం న పశ్యత్యసౌ సుఖీ. 17

దుఃఖప్రదమగు ఏ యీ సంసారరూప దృశ్యమున సమస్త ప్రాణులును మేల్కొనియున్నారో (అతిజాగరూకులై వర్తించుచున్నారో) జీవన్ముక్తుఁడద్దానియందు నిరంతరము నిదురించును (లక్ష్యము లేనివాఁడై) దానిని గాంచకయేయుండును. అతఁడే పరమసుఖియగును.

యః కర్మౌఘమనాదృత్య స్వాత్మన్యేవావతిష్ఠతే
స ఆత్మారామ ఇత్యుక్తో న జడోఽసౌ రఘూద్వహ. 18

రఘుకులశ్రేష్ఠుఁడవగు రామచంద్రా! ఎవఁడు సంసారముయెడల విరక్తుఁడై, సమస్త కర్మసమూహమును విడిచి స్వాత్మయందే నెలకొనియుండునో, అతఁడు ఆత్మారాముఁడని చెప్పఁబడును. అట్టివాఁడు జడుఁడెన్నఁటికినికాదు.

దుఃఖాదతిగతః సోఽస్మాత్ప్రాప్తః పారం భవామ్బుధేః
తిష్ఠత్యనుభవన్పూర్వో విశ్రాన్తిసుఖమాత్మని. 19

ఆ భవ్యపుత్రుఁడీదుఃఖప్రదమగు సంసారసముద్రముయొక్క యావలితీరమును బొందినవాఁడై విశ్రాంతిసుఖమనుభవించుచు, ఆత్మయందే స్థితిగల్గియుండును.

దీర్ఘాధ్వని పరిశ్రాన్తో విషయైశ్చతురైశ్చిరమ్
భోగభావాతురః క్రూరైః ప్రోత్థితః పథి డామరైః. 20

జీవుఁడను పథికుఁడు దీర్ఘమగు సంసారమార్గమునఁ జిరకాలము సంచరించుటచే మిగుల నలసినవాఁడును, భోగసాధనములగు పదార్థములచే వ్యాకులుఁడును, వంచించుటయందు ప్రవీణములును, క్రూరములునగు విషయములను దోపిడిగాండ్రచే మార్గమున బాధితుఁడును నగుచున్నాఁడు

జరాతుషారాశనిభిర్భూయోభూయో జడీకృతః
జన్మజఙ్గలసారఙ్గో వ్యర్థవ్యగ్రవిహారవాన్. 21
పరమాత్మా పరిశ్రాన్తో దుఃఖకణ్టకసంకటే
సుదుష్ప్రాపసుఖచ్ఛాయే పాన్థః సంసారవర్త్మని. 22
దుష్కృతైః కృతపాథేయో లుఠన్క్షీణః పదేపదే
అర్థానర్థమయైర్మార్గైఃసంకటైర్వివశీకృతః. 23

మఱియు, ఆ జీవుఁడను పథికుఁడు (బాటసారి) వార్ధక్యమను మంచుచేతను పిడుగులచే తమ మరల మరల జడీకృతుఁడు (వ్యవహారాసమర్థుఁడు) అగువాఁడును, జన్మయగు అరణ్యమున హరిణమువలె వ్యర్థముగ విహరించుట యందాసక్తుఁడును, దుఃఖసంకటములచే బరిపూర్ణమై, సుఖమను నీడలేనిదైనట్టి యీ సంసారమార్గమున స్వయముగ నసహాయుఁడై చనువాఁడును, పాపార్జితధనమను పాథేయము (దారిబత్తెము) గలవాఁడును, అడుగడుగునకు పడుచు, దొర్లుచుండు వాఁడును, అర్థానర్థమయములగు మార్గములచేతను పెక్కుసంకటములచేతను గలఁతనొందిన బుద్ధిగలవాఁడును నగుచున్నాఁడు.

సంసారజలధేః పారం ప్రాప్య భూతవివర్జితమ్
అశయ్యోఽతిప్రమాబుద్ధః స శేతే సుఖమాత్మవాన్. 24

అట్టు సంసారమార్గమున మిగుల అలసినట్టి జీవుఁడొకపుడు సౌభాగ్యవశమున ననేక జన్మలందలి పుణ్యముద్వారా, సాధనచతుష్టయ సంపత్తియుక్తుఁడై సచ్ఛాస్త్ర, సద్గురువుల యనుగ్రహమువలన తత్త్వసాక్షాత్కారమువలన ప్రబుద్ధుడై (ఆత్మజ్ఞానియై) సంసారసముద్రము యొక్క ప్రాణిశూన్యమగు యావలితీరమును బొంది యట శయ్య లేకున్నను సుఖముగ నిదురించును (విశ్రాంతి నొందును.)

అపసర్పం నిరస్తేహమస్వప్నమసుషుప్తకమ్
ప్రబుద్ధమబహిర్నిద్రం హా శేతే సుఖమాత్మవాన్. 25

అహా! శయ్యాదులు లేకయు, ప్రాణాదిచేష్టారహితముగను, స్వప్నరహితముగను, సుషుప్తివర్జితముగను, ఆత్మస్వరూపమున జాగరూకతాపూర్వకముగను, స్వస్వరూపబహిర్భూతమగు నిద్రయను వస్తువులేకయు, ఆత్మజ్ఞాని సుఖముగ నిదురించుచున్నాఁడు! (బహిర్ముఖత్వమును త్యజించి, ఆత్మస్వరూపమున సుఖముగ విశ్రమించుచున్నాఁడు.)

జాత్యశ్వవదిహాజాతిరశ్నన్గచ్ఛన్శ్వసన్వదన్
లోకమధ్యే మహారణ్యే హా శేతే సుఖమాత్మవాన్. 26

ఆహా! ఉత్తమ జాతిగుఱ్ఱము*వలె, ఆత్మజ్ఞాని, భుజించుచున్నను, నడచుచున్నను, శ్వాసగైకొనుచున్నను, మాట్లాడుచున్నను, ఈ సంసారమను మహారణ్యమధ్యమున సుఖపూర్వకముగ నిదురించుచున్నాఁడు!

అపూర్వైవ ఘనా నిద్రా కాపి సా తత్త్వదర్శినామ్
యా న శామ్యతి కల్పాభ్రమరవైర్నాద్రి వికర్తనైః. 27

తత్త్వజ్ఞులయొక్క యానిద్ర యీ సాంసారికనిద్రకంటె విలక్షణమై, అతిఘనీభూతమై యొప్పుచున్నది. ఏలయనిన, అది ప్రళయకాల గర్జనలచేగాని, అవయవచ్ఛేదనాదులచేగాని శమింపనిదైయున్నది.

అపూర్వైవ ఘనా నిద్రా కాపి సా తత్త్వదర్శినామ్
ప్రబుద్ధానామపి హి యా నిమీలయతి దృగ్దృశౌ. 28

తత్త్వజ్ఞుల యానిద్ర అపూర్వమై, మహాఘనీభూతమై వర్తించును. చిన్మాత్రదర్శనమున ప్రబుద్ధులగువారి కయ్యది బాహ్యేంద్రియములను మూసివేయును.

అనిమీలితనేత్రస్య యస్య విశ్వం ప్రలీయతే
స క్షీబః వనమార్థేన హా శేతే సుఖమాత్మవాన్. 29

ఆహా! నేత్రములను, మూయకయున్నప్పటికిని, ఎవనికి ప్రపంచమంతయును విలీనమై (లేనిదై) పోవుచున్నదో, అట్టి పరమార్థ జ్ఞానమదోన్మత్తుఁడగు ఆత్మజ్ఞాని సుఖముగ నిదురించుచున్నాడు.

వినిగీర్య జగత్సర్వం పరమాం పూర్ణతాం గతః
అతృప్తైరమృతం పీత్వా హా శేతే సుఖమాత్మవాన్. 30

ఆహా! జగత్తునంతయు మ్రింగివైచి (స్వాత్మయందు లయపఱచి) తృప్తియగువఱకు ఆత్మానందరసామృతమును గ్రోలి పరమపూర్ణత్వమును బొందినవాఁడై ఆత్మజ్ఞాని సుఖముగ నిదురించుచున్నాడు! (ఆత్మయందు విశ్రాంతి సుఖమనుభవించుచున్నాడు.)

నిరానన్దమహానన్దీ సుఖమద్వైతమక్షయమ్
నిరాలోకమహాలోకో హా శేతే సుఖమాత్మవాన్. 31

ఆహా! విషయజనితమగు ఆనందములేకున్నను, నిరతిశయమగు ఆత్మానందముతోఁ గూడియున్నవాఁడై, అన్యప్రకాశముచేఁ బ్రకాశింపఁబడనట్టి మహాస్వాత్మప్రకాశముగల్గి, అద్వయమై, నాశరహితమైనట్టి సుఖమునను భవించుచు, ఆత్మజ్ఞాని సుఖముగ నిదురించుచున్నాఁడు!

లోకాన్ధకారోపరమో లోకలమ్పటతాం గతః
అమనత్వమనాభోగో హా శేతే సుఖమాత్మవాన్. 32

* ఉత్తమ జాతిగుఱ్ఱము యుద్ధభూమియందుఁదప్ప తక్కినచోట్ల భుజించుచున్నను, త్రాగుచున్నను, చలించుచున్నను నిద్రించుచుండునని లోక ప్రసిద్ధిగలదు.

అహా! కామ, క్రోధ, లోభాదిరూపమగు అంధకారములేనివాఁడై, ఆత్మప్రకాశతత్పరుఁడై, అమూర్తమగు ఆత్మానందరసమున ఘనాస్వాద యుక్తుఁడై ఆత్మజ్ఞాని సుఖముగ (స్వాత్మయందు, శయనించుచున్నాఁడు!)

అనన్తదుఃఖమాశాన్తమశాన్తం జనతాస్థితౌ
అబహిర్ముఖమాభోగి హా శేతే సుఖమాత్మవాన్. 33

అహా! అనంతసాంసారిక దుఃఖరహితుఁడై, వర్ణాశ్రమోచితవ్యవహారమున లోకసంగ్రహార్థము తత్పరుఁడై, బాహ్యపదార్థములందనాసక్తుఁడై, అభ్యంతరమగు ఆత్మానందరసమున అనురక్తుఁడై ఆత్మజ్ఞాని సుఖముగ నిదురించుచున్నాఁడు! (ఆత్మయందు విశ్రాంతి సుఖమనుభవించుచున్నాఁడు.)

అణీయసామణీయాంసం స్థవిష్ఠం చ స్థవీయసామ్
కృత్వాత్మానం నభఃశయ్యాం హా శేతే సుఖమాత్మవాన్. 34

అహా! తన ఆత్మను సూక్ష్మ పదార్థములకంటెను, అతిసూక్ష్మమైనదిగను స్థూలపదార్థములకంటె అతిస్థూలమైనదిగనుగావించి చిదాకాశమను శయ్యపైఁ బరుండి, ఆత్మజ్ఞాని సుఖముగ నిదురించుచున్నాఁడు!

పరమాణౌ పరమాణౌ జగత్కోటిశతాన్యపి
అణౌ స్థూలే దధద్దేహే హా శేతే సుఖమాత్మవాన్. 35

అహా! అతిసూక్ష్మమగుటచే అణురూపమున్ను, విశాలమగుటచే స్థూలమున్నునగు తన చిత్స్వరూపదేహమున ప్రతిపరమాణువందును అనంతకోటి బ్రహ్మాండములను ధరించుచు, ఆత్మజ్ఞాని సుఖముగ నిదురించుచున్నాఁడు.

కుర్వన్సంహారసర్గౌఘా న కుర్వంశ్చ కథంచన
పరమాలోకశయ్యాయాం హా శేతే సుఖమాత్మవాన్. 36

అహా! అనేక సృష్టిసమూహములను సంహార మొనర్చుచు, వాస్తవముగనేమియు సంహార మొనర్పకయేయున్నవాఁడై, ఆత్మజ్ఞాని మహత్తరమగు ఆత్మప్రకాశమను శయ్యపై సుఖముగ నిదురించుచున్నాఁడు!

సంసారనిచయస్స్వప్నం పరిజ్ఞాయ సుషుప్తతామ్
నయన్ప్రకటదిగ్గీర్ణాం హా శేతే సుఖమాత్మవాన్. 37

అహా! సంసారసమూహమును స్వప్నముగ నెఱిఁగి, పూర్ణప్రకాశముతోటి వ్యక్తములగు దిక్కులవలె, ఆత్మప్రకాశాన్వితమగు దీర్ఘ (అపరిచ్ఛిన్న) సుషుప్తిని బొందుచు, ఆత్మజ్ఞాని సుఖముగ శయనించుచున్నాఁడు.

సర్వేషాం జగదర్థానాం సత్తాసామాన్యతాం గతః
ఆకాశాదధికో వ్యాపీ హా శేతే సుఖమాత్మవాన్. 38

అహా! సద్రూపముచే సర్వత్ర వ్యాపించియుండుటఁబట్టి సమస్త జగత్పదార్థములయొక్క సత్తాసామాన్యరూపమును బొందియున్నవాఁడై, ఆకాశముకంటెను నధికవ్యాపకుఁడై (ఆకాశమును గూడ తన చిత్స్వరూపమున ధరించియున్నవాఁడై) ఆత్మజ్ఞాని సుఖముగ నిద్రించుచున్నాఁడు.

అద్భాచ్ఛమమ్బరం కృత్వా జగదవ్యామ్బరీకృతమ్
శాన్తశబ్దపరశ్వాసం హా శేతే సుఖమాత్మవాన్. 39

ఆహా! ప్రథమమున లయక్రమముచే పృథ్వ్యాది సమస్త జగత్తును ఆకాశరూప మొనర్చి, పిమ్మట ఆ యాకాశమునుగూడ, అవ్యాకృతాకాశముకంటెను అతినిర్మలమైనట్టి చిదాకాశముగఁ గావించి (చిదాకాశమున లయము చేసి), ఆత్మజ్ఞాని శబ్ద (గుఱక), ప్రశ్వాసములు లేక సుఖముగ నిదురించుచున్నాఁడు!

ఇదమస్మజ్జగత్పశ్యత్స్వయమాకాశ కోణకే
విశదాకాశకోశాత్మా హా శేతే సుఖమాత్మవాన్. 40

ఆహా! నిర్మల చిదాకాశరూపుఁడైన సాక్షియగు ఆత్మజ్ఞుఁడు తన చిదాకాశస్వరూపమున నొక మూల యీ మన జగత్తును స్వప్నమువలె స్వయముగఁ గాంచుచు సుఖముగ నిదురించుచున్నాఁడు!

యథా ప్రవాహసంప్రాప్తవ్యవహారమనోరమే
తృణాశ్యాస్తరణవిశ్రాన్తో హా శేతే సుఖమాత్మవాన్ 41

ఆహా! ప్రవాహపతితములగు యథాప్రాప్తములైన వ్యవహారములను నట్టి గడ్డిదాపపై బరుండి విశ్రమించుచు, ఆత్మజ్ఞాని సుఖముగ శయనించుచున్నాఁడు!

పరమేణ ప్రయత్నేన పరిజ్ఞానాత్స్వరూపిణా
స్వప్నసందర్శనేనైవ జీవన్థమివ ఖేన ఖే. 42

నిద్రయం దనుభూతమైన స్వప్నమును మేల్కొనినవాఁడు మిగుల ప్రయత్నముచే స్మరించునట్లు, ఆత్మవిచారమను సుషుప్తియందు విశ్రమించునట్టి ఆత్మజ్ఞాని తనయొక్కగాని, లేక, ఇతరుల యొక్కగాని అధిక ప్రయత్నముచే చిత్తము నొకింత బహిర్ముఖముగఁ గావించి — అవకాశ రహితమగు ప్రదేశమున నుండఁజాలనదియైన యాకాశముఁ తనచేతనే అవకాశయుక్తముగఁ గల్పింపఁబడిన యాకాశముచే నవకాశమును బొంది తన ఆ యాకాశస్వరూపమున జీవించునట్లు (సత్తను ధరించునట్లు) —బాహ్యవ్యవహార పరిజ్ఞానమువలన నేర్పడిన దేహాదిస్వరూపముతోఁగూడి జీవించుచున్నాఁడు.

జ్ఞానేనాకాశకల్పేన ధర్మాన్గగన సంనిభాన్
జ్ఞేన యత్నేన సంబుద్ధః పరమామ్బరతాం గతః 43

పరమ చిదాకాశరూపత్వమును బొందిన ఆత్మజ్ఞాని, ఆకాశమువలె విశాలమై సూక్ష్మమైనట్టి నిజస్వరూపముయొక్క జ్ఞానమువలన మిగుల అసత్తమగుటచే ఆకాశమువలె శూన్యప్రాయములగు జీవజగదాది ధర్మములను ప్రయత్నముచేతనే లెస్సగ నెఱుఁగుచున్నాఁడు.

ప్రబుద్ధః సుప్తః సుప్తోఽపి ప్రబుద్ధో రమతేఽనిశమ్
సుషుప్తోభూత్తతో జాగ్రత్స్వప్నార్థసుహృదా సహ. 44

ఈ ప్రకారముగ జ్ఞాని సదా నిదురించుచున్నను (ఆత్మయందు విశ్రమించుచున్నను), లోకప్రసిద్ధములగు జాగ్రత్స్వప్నములం దితరులవలెనే మేల్కొనుచు, నిదురించుచు, జాగ్రత్స్వప్న

పదార్థములయొక్క భోగములందు, సహాయభూతుఁడగు (ఈ చెప్పఁబోవు) మిత్రునితోఁగూడ నిరంతరము క్రీడించుచుండును.

జన్మాన్తరైకసహవాసనమాశయేన
చిత్తానువృత్తిమధురేణ చిరంతనేన
మిత్రేణ సార్ధమఖిలాని దినాని నీత్వా
విశ్రాన్తిమేష్యతిపదే పరమే చిరం సః. 46

ఇత్యార్షే శ్రీవాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే ఉత్తరార్ధే విశ్రాన్తచిత్తవర్ణనం నామైకోన సప్తత్యధికశతతమః సర్గః ॥ 169 ॥

జన్మాంతరములందలి చిరకాల సహవాసమువలన జనించిన స్నేహాతిశయముచేవలె తనయొక్క వైషమ్యమంతయుఁ ద్యజించినవాఁడును, సమచిత్తుఁడును కావుననే విచిత్రములైన శమ, దమ, తితిక్షా, జ్ఞానవైరాగ్య సంతోషాది ఉత్తమవృత్తులతోటి మనోహరరూపుఁడునగు (ఈ చెప్పఁబోవు) చిరకాల మిత్రునితో సహా శేషించిన ఆయువునందలి దినముల నన్నింటిని గడిపి, జీవన్ముక్తుఁడు దేహపాతానంతరము నిరతిశయానంద రూపమగు విదేహకైవల్యపదమున చిరకాలము విశ్రమించును.

ఇది శ్రీవాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున నుత్తరార్ధమున విశ్రాంతచిత్తవర్ణనమను నూటయఱువదితొమ్మిదవ సర్గము ॥ 169 ॥

## సప్తత్యధికశతతమః సర్గః

[ సుహృత్స్వకర్మనామాత్ర పుత్రస్త్రీ భృత్యసంయుతః
తద్గుణాశ్చోపవర్ణ్యన్తే రమణం చ సుఖోదయమ్

పుత్ర, పత్నీ, సేవకాసహితమగు 'స్వకర్మ'యే జీవన్ముక్తునియొక్క మిత్రుఁడనుట, అతని గుణములు, సుఖపూర్వకముగ నాతనితోటి క్రీడించుట యను నీ విషయము లిచట వర్ణింప బడుచున్నవి. ]

**శ్రీరామ ఉవాచః—**

బ్రహ్మన్నోఽస్య సుహృద్బ్రూహి యేనాసౌ రమతే సహ
రమణం కిం స్వభావం స్యాదుత రత్యాత్మ వాస్య తత్. 1

శ్రీరాముఁడు :— మహాత్మా! ఎవనితోడ జీవన్ముక్తుఁడు క్రీడించునో, అట్టి యాతని మిత్రుఁ డెవరు? అతనితోడ సల్పు ఆ క్రీడయు నెట్టి స్వభావము గలది? అది స్వాత్మస్వరూపస్థితి రూపమైనదా, లేక భోగపదార్థములందలి ప్రీతిరూపమైనదా ?

**శ్రీ వసిష్ఠ ఉవాచః—**

స్వప్రవాహేహితం నామ స్వప్రాయేహితనామ చ
స్వకర్మ నామ చాస్యాస్తి మిత్రమేకమ్మ్రతిమమ్. 2

శ్రీ వసిష్ఠుఁడు :— ఓ రామచంద్రా స్వకుల పరంపరచే ప్రవాహరూపముగ సంప్రాప్తమైన సహజకర్మ, లోకసంగ్రహార్థమైన శాస్త్రీయకర్మ, స్వప్రయత్నముచే నభ్యసింపఁబడిన సచ్ఛాస్త్రాభ్యాస, విచార, సత్సంగ, శమ, దమ, తితిక్షా, ఉపరతి, శౌచ, సంతోష, ఈశ్వర, ప్రణిధాన, సంయమాది రూపమగు స్వకర్మ — ఈ మూఁడును ఉపాధిభేదముచే మూఁడుగనున్నను నొకటేయైయున్నవి. అట్టి యుత్తమకర్మయే జీవన్ముక్తునియొక్క సహజమిత్రుఁడై తనరుచున్నది.

పితృవద్విహితాశ్వాసం దారా ఇవ నియన్త్రణమ్
సంకటేషు దురన్తేషు నిత్యమవ్యభిచారి చ. 3

అశఙ్కితోపచరణం సుసంపాదితనిర్వృతి
కోపేష్వకోపనతయా వితీర్ణావర్జనామృతమ్. 4

దుర్గదుర్గమదుర్వారదోషోద్ధరణతత్పరమ్
సర్వవిశ్వాసరత్నానాం కోశ ఆశైశవోషితమ్. 5

సహపాంసు కృతాక్రీడమాబాల్యాదేవ సంగతమ్
వినివారితదుశ్చేష్టం పితృవద్రక్షణోన్ముఖమ్. 6

వహ్నేరివౌష్ణ్యం సౌగన్ధ్యం కుసుమస్యేవ సర్వదా
అవినాభావి విమలం రవేరివ చ వాసరమ్. 7

లాలనైకరతం నిత్యం పాలనైకపరాయణమ్
సర్వసంకటసంఘట్ట రక్షణైకసముద్యతమ్. 8

హేమ్నోఽగ్నిరివ దేహస్య సర్వావస్థస్య శుద్ధిదమ్
ఇదం హేయముపాదేయమితి దర్శనతత్పరమ్. 9

ఆహ్లాదకమనిన్ద్యాభిః కథాభిరివ నాగరమ్
సచ్చేష్టామణిమాణిక్య భాణ్డసంభారమన్దిరమ్. 10

ఆ యుత్తమకర్మయను మిత్రుఁడు తండ్రివలె నూఱడించును; భార్యవలె దుష్కర్మల నుండి నివారించును: మహాసంకటములందు నిత్యము తోడగును, కార్యమందు సంశయరహితముగఁ బ్రవర్తింపజేయును; శాంతిని బాగుగఁ గలుగఁజేయును; కోపము వచ్చినపుడు శాంతరీతిచే సమాధానమను అమృతము నొసంగును; దుర్గమప్రదేశములనుండియు, దుర్వారములగు వైరకలహాది దోషములనుండియు నుద్ధరించుటయందుఁ దత్పరుఁడైయుండును; మఱియు, అతఁడు సమస్త విశ్వాసరూప రత్నముల యొక్కయు కోశమున్ను, అనేక జన్మలయొక్క యభ్యాసమువలన బాల్యకాలము నుండియే కూడియుండువాఁడును, అట్లు బాల్యమునుండియే సహవాసము చేయుటవలన ధూళిమున్నగువానితో నాడుకొనునపుడు తోడు ఆటఁవాఁడుగ నుండువాఁడును, తండ్రివలె దుశ్చేష్టల నుండి తొలగించి రక్షించువాఁడును, అగ్నిని ఉష్ణత్వమున్ను, పుష్పమును సుగంధమున్ను, సూర్యుని నిర్మల దివసమున్ను వీడనట్లు, సదా యెడతెగక నుండువాఁడును, లాలించుటయందును, పాలించుటయందును నిరంతరము తత్పరుఁడును, సమస్త సంకటములందును బాగుగ రక్షించు

టకుం బూనుకొనువాఁడును, అగ్ని బంగారమును శుద్ధిపఱచునట్లు, సర్వావస్థలయందును దేహమును శుద్ధిపఱచువాఁడును, 'ఇది త్యజింపఁదగినది, ఇది గ్రహింపఁదగినది' అని యిట్లు వివేచించి చూపువాఁడును, చతురులగు జనులవలె నుత్తమ కథలచే ఆహ్లాదమును గొల్పువాఁడును, సత్క్రియలను మణిమాణిక్యాదులయొక్క భండారమున్నునై యలరుచుండును.

సూర్యస్తమ ఇవాజ స్రమప్రదర్శయదప్రియమ్
అనురక్తా మహిళేవ ప్రియమేవ ప్రదర్శయత్ 11

జనం ప్రియంవదం కుర్వ్రత్ప్రియమేవ సమాచరత్
పేశలంమధురం స్నిగ్ధమక్షుబ్ధముదితాశయమ్. 12

లోకోపచారకం పూజ్యం స్మితపూర్వాభిభాషణమ్
కామోపశాన్తం సద్రూపం పరమార్థైకకారణమ్. 13

రణేఽజ్ఞాననముద్భూతే పూర్వం ప్రహరణోద్యతమ్
అపూర్వనర్మనిర్మాణ లీలాలలనలాలకమ్. 14

పాలకం శీలసారాణాం దారాణాం చ కులస్య చ
ఆధివ్యాధిపరీతస్య చేతసోఽమృతమౌషధమ్. 15

విశేష విద్యావైదగ్ధ్యవాదవన్ధ్యవినోదనమ్
సమానకుల శీలత్వాద్ద్విధాభావ ఇవ స్థితమ్. 16

అనురక్తాన్నపానాద్యాధాన్వదాన్యాన్కార యత్సదా
యజ్ఞదానతపస్తీర్థన్యాయార్థప్రేరణోన్ముఖమ్. 17

పుత్రదారద్విజాతిస్త్రీ భృత్యబన్ధుజనైః సహ
శుభభోజన పానార్హ్వముత్తమశ్లాఘ్యసంగతి. 18

భోగాదిబద్ధతృష్ణత్వం దుఃఖదం వినివారయత్
సుస్నిగ్ధసంకథోదారం సమాశ్వాసోత్తమాస్పదమ్. 19

మఱియు, జీవన్ముక్తుని ఆ శ్రేష్ఠకర్మయను మిత్రుఁడు సూర్యుఁడంధకారమును దొలఁగించునట్లు అప్రియమును దొలగించువాఁడును, అనురాగవతియగు స్త్రీవలెఁ బ్రియమునే ప్రదర్శింపఁజేయువాఁడును, ప్రియమగు ఆచరణమునే గావింపఁజేయుచు మనుజుని కోమలముగను, మధురముగను, శాంతముగను, క్రోధాది రహితముగను, ప్రమాదవర్జితముగను, ప్రియముగను వచించువానిగ జేయువాఁడును, మఱియు, సత్పురుషుల సేవకునిగను పూజ్యునిగను చిఱునగవుతోడ మాట్లాడువానిగను, కామవారహితునిగను సజ్జనరూపధారిగను పరమార్థము (మోక్షము)ననే తత్పరునిగను గావించువాఁడును దైవయోగముచే నెపుడైన అజ్ఞానులతో యుద్ధము తటస్థింప, అందరికంటెను ముందుగ శత్రువుపై ప్రహారము సల్పువాఁడును (అనఁగా నట్టియుద్ధమున వీరుఁడును) అపూర్వములగు క్రీడాహాస్యాది కౌతూహలములయొక్క రచనలతోను వినోదపూర్వకముగ స్త్రీలతోను, విలాసమొనర్పింపఁ జేయువాఁడును ఉత్తమశీలములయొక్కయు, గుణవతులగు స్త్రీలయొక్కయు, కులముయొక్కయు పాలకుఁడును. శారీరిక, మానసిక వ్యాధిగ్రస్తుఁడగు మనుజుని

చిత్తమును అమృతమువలె సుజ్జీవింపఁజేయువాఁడును, మఱియు ఔషధమువలె రోగవిముక్తముగ గావించువాఁడును, ముఖ్యముగ పాండిత్యముచేతను, ఉత్తమవాదములచేతను శ్రేష్ఠులగు ప్రభు, గురు, మాన్యజనాదులను వినోదపఱచువాఁడును, ఒకచోట సమానకులశీలాదులవలన విభాగము ద్వారా రెండురూపములతోటి యున్నట్లు తోచువాఁడును, రాజాదులను తనయం దనురాగముగల వారినిగఁ గావించి, వారిని సదాసాధువులుగను, సత్యశీలురుగను, దానపరులుగను నొనర్చువాఁడును, మఱియు వారి నెల్లప్పుడునుయజ్ఞదాన, తపస్తీర్థ న్యాయాదులను గావించుటకై ప్రేరణచేయు వాఁడును, పుత్ర, పత్నీ, బ్రాహ్మణ, స్త్రీ, సేవక, బంధుజనులతోగూడ నుత్తమభోజన, పానముల గావించువాఁడును, శ్రేష్ఠులును, ప్రశంసనీయులునగు మనుజులతో సాంగత్యము చేయువాఁడును దుఃఖదాయకములగు భోగాదులందు జనించియున్న తృష్ణను బాగుగ నివారించువాఁడును, అతి మధురములును, గంభీరములునగు ఉత్తమకథలను ప్రచారమొనర్చువాఁడును, ధైర్యమునకు శ్రేష్ఠమగు నిలయమున్నునై విరాజిల్లు చుండును.

ఈదృశేనాత్మమిత్రేణ సకలత్రేణ సంయుతః
స్వకర్మనామ్నా రమతే స్వభావేనైవ నేరితః. 20

ఓ రామచంద్రా! స్త్రీ పుత్రాది సహితుఁడును, స్వకర్మయను పేరుగలవాఁడునగు, ఇటువంటి తన మిత్రునితోడ ఆత్మజ్ఞాని స్వభావముగనే క్రీడించునుగాని యితరులచే ప్రేరితుఁడై కాదు.

శ్రీరామ ఉవాచః—

కలత్రమస్య మిత్రస్య తదీయస్య మునీశ్వర
కిం తత్కింరూపమేవ స్యాత్సమాసేనైవ మే వద. 21

శ్రీరాముఁడు:— ఓ మునీశ్వరా! ఆ మిత్రునియొక్క స్త్రీ పుత్రాది కుటుంబవర్గమెయ్యది? దానిస్వరూపమేమి? సంక్షేపముగ వచింపప్రార్థన.

శ్రీ వసిష్ఠ ఉవాచః—

స్నానదానతపోధ్యాన నామానోఽస్య మహామతే
సన్తి పుత్రా మహాత్మానః స్వనురక్తాఖిలప్రజాః. 22

శ్రీ వసిష్ఠుఁడు:— మహాధీశాలివగు నో రామచంద్రా! తమ గుణములచే సమస్త ప్రజలను తమ యందనురాగము గలవారినిగఁ జేయునట్టి స్నాన, దాన, తప, ధ్యానాదులను పేరుగల మహాత్ము లితని పుత్రులు.

చన్ద్రలేఖేవ లోకస్య దృష్ట్యైవాహ్లాదదాయినీ
అవినాభావినీ భార్యాముదితాస్యానురాగిణీ. 23

చంద్రకళవలె దర్శనమాత్రముచేతనే సర్వుల నానందపఱచునదియు, సదాసహగామినియై యొప్పునదియు, అనురాగవతియునగు ముదిత (నిత్యసంతోషరూపత్వము) ఈతని భార్య.

కరుణాకారణా కీర్ణఘనా హృదయహారిణీ
ఆనన్దజననీ చాస్య వయస్యాఽవ్యభిచారిణీ. 24

కరుణచే సర్వత్రసనమును వెదచల్లునదియు, మనోహారిణియు, ఆనందమును గలుగఁజేయునదియు, నిత్యమెడతెగక యుండునదియునగు కరుణ యీతని చెలికత్తె.

సమతాస్య మతా నిత్యమాస్తే హృదయవల్లభా
ప్రతీహారీ పురః ప్రహ్వా సంముఖం సుఖదాయినీ. 25

ధైర్యే ధర్మే చ ధీః సాధో నిత్యమాధీయతే చ యా
సాస్య ధీరస్య ధుర్యస్య పురో ధన్యస్య ధావతి. 26

సాధువగు రామచంద్రా! సమత్వమనునది సదా యీతని రెండవభార్యయైయున్నది నిత్యము సమ్ముఖముననుండునదియు, వినమ్రపతియు, సుఖమును గలుగఁజేయునదియునగు, ధైర్య, ధర్మములందు ప్రవర్తించునట్టి బుద్ధియను ద్వారపాలిక, ధీరుఁడును ధర్మధురంధరుఁడును ధన్యుఁడును మహాత్ముఁడు నగు ఈ మిత్రునియెదుట నిరంతరము పరువిడుచుండును

అస్య సన్నా సమం స్కన్ధే సర్వదైవ మహౌజసః
విషయారిజయే రాజ్ఞో మైత్రీ మన్త్రప్రదాయినీ 27

మహాతేజస్వియైన యీ మిత్రుఁడను రాజునకు విషయములను శత్రువులను జయించు విషయమున మంత్రణమొసంగునదియైన మైత్రియను మఱియొకభార్య సమత్వమను భార్యతోటి సమముగ సదా భుజప్రదేశమున వెలయుచుండును.

కార్యాణామార్యమర్యాదా చర్యా చాతుర్యశాలినీ
సర్వేషామస్య మాన్యస్య సత్యతా స్వార్థదాయినీ. 28

శ్రేష్ఠమర్యాదఁగూర్చిన కార్యములం దాచార్యునివలె నుపదేశించునదియు, చాతుర్యముతోటి శోభించునదియు, స్వాభిలషితపదార్థము నొసంగునదియునగు సత్యత్వము సర్వులకు మాననీయుఁడగు ఈ మహాత్మునియొక్క కోశాధ్యక్షురాలైయున్నది.

ఇత్యేవం పరివారేణ మిత్రేణ సహ మన్త్రిణా
స్వకర్మణా వ్యవహరన్న హృష్యతి న కుప్యతి. 29

ఈ ప్రకారమగు పరివారముతోఁ గూడియున్నవాఁడును, మంత్రి రూపుఁడునగు స్వకర్మయను మిత్రునితోఁగూడ వ్యవహరించుచు జీవన్ముక్తుఁడు లాభాలాభములందు ప్రసన్నుఁడుగాకయు, క్రోధమునొందకయు సమముగ వర్తించుచుండును.

స యథాస్థితమేవాస్తే వినిర్వాణమనాః మునిః
చిత్రార్పిత ఇవాజస్రం లోకే వ్యవహరన్నపి. 30

నిరంతరము లోకమున వ్యవహరించుచున్నప్పటికిని జీవన్ముక్తుఁడగు మునిచిత్రమందలి సైనికునివలె నిశ్చలముగ స్వస్వరూపమున నెప్పటియట్లున్నవాఁడై నిర్వాణ (శాంత) మనస్కుఁడై వెలయుచుండును.

వస్తుశూన్యేషు వాదేషు మూకః శైలమయో యథా
నిష్ప్రయోజన శబ్దేషు పరం బాధిర్యమాగతః. 31

తత్త్వజ్ఞానరహితములైనట్టి వస్తు (సార) శూన్యములైన వాదములందాతఁడు శిలావిగ్రహమువలె శూన్యముగనుండును. మఱియు నిష్ప్రయోజన శబ్దములందు పరమబాధిర్యము (ఎక్కువ చెవుడు)ను వహించియుండును.

లోకాచారవిరుద్ధేషు శవం సకలకర్మసు
ఆర్యాచారవిచారేషు వాసుకిర్వా బృహస్పతిః. 82

లోకాచారవిరుద్ధములగు సమస్తకర్మలందును ఆ జీవన్ముక్తుఁడు శవప్రాయుఁడుగనుండును. కాని, శిష్టాచారవిచారములందు శేషునివలెనో లేక బృహస్పతివలెనో వర్తించును

ప్రవృత్త వాక్పుణ్యకథో జిహ్వానాం ప్రతిభానవాన్
నిమేషేణైవ నిర్ణేతా వక్తాపు బహువస్తునః. 83

సమదృష్టిరుదారాత్మా వదాన్యః సంవిభాగవాన్
పేశలస్స్నిగ్ధమధురః సున్దరః పుణ్యకీర్తనః. 84

మఱియు, జీవన్ముక్తుఁడు పుణ్యకథలను జెప్పువాఁడును, స్వపరదోషముల నెఱుఁగువాఁడును, అనేక కఠిన విషయములనుగూడ క్షణకాలములో నిర్ణయించివైచి శీఘ్రముగ వచించువాఁడును, సమదృష్టిగలవాఁడును, ఉదారచరితుఁడును, దానశీలుఁడును, గుణదోషముల విభజించువాఁడును, అతి కోమల, స్నేహయుక్త, మధురస్వభావ యుతుఁడును, మనోహరుఁడును; పుణ్యకీర్తిమంతుఁడునునై యొప్పును.

స్వభావవిశేషైవ భవేత్ప్రబుద్ధ ధియాం ప్రయత్నేన తు నేదృశాస్తే
భవన్తి నేన్ద్వర్కహుతాశ నాద్యాః క్వచిత్పరప్రేరణయా ప్రకాశాః. 85

ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు
నిర్వాణప్రకరణే ఉత్తరార్ధే తత్త్వజ్ఞ వ్యవహారవర్ణనం
నామ సప్తత్యధికశతతమః సర్గః ॥ 170 ॥

ఓ రామచంద్రా ! ఇట్టి యుత్తమగుణములు ఆత్మజ్ఞానులయొక్క స్వభావమేయై యున్నవి. అంతేగాని యితరుల ప్రయత్నముచే వారిట్టిగుణములు కలిగియున్నవారుకారు. ఎట్లనిన, చంద్ర సూర్య, అగ్న్యాదులితరుల ప్రేరణచే ప్రకాశశీలురగుటలేదు. ప్రకాశశీలత్వము వారి స్వభావమే యైయున్నది.

ఇది శ్రీవాసిష్ఠతాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున నుత్తరార్ధమున
తత్త్వజ్ఞవ్యవహారవర్ణనమను నూటడెబ్బదవ సర్గము ॥ 170 ॥

## ఏకసప్తత్యధిక శతతమః సర్గః

[జీవన్ముక్తిప్రతిష్ఠార్థం సర్వసందేహశాన్తయే
భూయస్తత్త్వోపదేశేన క్రియతే దృశ్యమార్జనమ్.

జీవన్ముక్తియొక్క ప్రతిష్ఠకొఱకును, సర్వసందేహముల నివృత్తికొఱకును, మరల తత్త్వోపదేశముద్వారా దృశ్యమును తుడిచివేయుట యిచట వర్ణింపఁబడుచున్నది.]

శ్రీ వసిష్ఠ ఉవాచ:—

సంవిదాకాశకచనమిదం భాతి జగత్త్రయా
వస్తుతో న జగన్నాభా న శూన్యం న చ సంవిదః. 1

శ్రీ వసిష్ఠుఁడు:— ఓ రామచంద్రా! చిదాకాశముయొక్క ఆభాసమే యీ జగద్రూపముగ స్ఫురించుచున్నది. వాస్తవముగ జగత్తుగాని ఆభాసముగాని, శూన్యముగాని, వృత్తిచైతన్యముగాని యెవ్వియును లేవు.

యదిదం భాతిదివ్యోమ జగదాఖ్యం న తత్తతః
ఆకాశాదివ శూన్యత్వమన్యదన్యదపిస్థితమ్. 2

ఈ జగత్తనునది ఎయ్యది భాసించుచున్నదో, అది, అజ్ఞానుల దృష్టియందు వేఱుగ స్థితినొంది యున్నప్పటికిని. శూన్యత్వమాకాశముకంటె వేఱుగానట్లు, ఆ చిదాకాశముకంటె వేఱు కాకయే యున్నది.

దేశాద్దేశాన్తరప్రాప్తౌ మధ్యే యత్సంవిదో వపుః
తద్దృశ్యమితి భాతీదం దృశ్యమన్యన్న విద్యతే. 3

ఒక ప్రదేశమునుండి దూరముననున్న మఱియొక ప్రదేశమునకు నేత్రేంద్రియముద్వారా బుద్ధి వృత్తి చనునపుడు ఆ రెండుప్రదేశముల మధ్యనున్న నిర్విషయమగు చైతన్యస్వరూపమెద్ది గలదో. అదియే యీ దృశ్యరూపమున బాసించుచున్నది. అంతేకాని యీ దృశ్యమనునది వేఱేమియునుగాదు.

మహాప్రలయసంపత్తావాదిసర్గః పునః కిల
పరస్మాత్కారణాభావే కుతో దృశ్యస్య సంభవః. 4

మహాప్రళయానంతరము మరల ఆదిసృష్టి సంభవించుచున్నది. కాని 'సదేవసోమ్యేదమగ్ర ఆసీత్ - (సృష్టికిఁ బూర్వము సద్రూప పరమాత్మయే కలఁడు) ఇత్యాది శ్రుతివాక్యములఁ బట్టి పరమాత్మకంటె వేఱుగ జగత్తునకు మఱియొక కారణమెద్దియులేనందున నిఁక ఈ దృశ్యముయొక్క సంభవమెచట ?

తదాణుమాత్రమపి హి దృశ్యబీజం న విద్యతే
కిల యస్మాదిదం చక్రం పునర్మూర్తం ప్రవర్తతే 5

ఆ మహాప్రళయదశయందెపుడు జగద్బీజమెద్దియును లేకయున్నదో, అపుడిఁక పరమాణువు మున్నగువానినుండి యీ మూర్తివంతమగు జగత్తేర్పడుచున్నదను ఈ కల్పనయు నసంగతమేయైయున్నది.

ఉత్పన్నమేవ నైవాతో మూర్తం దృశ్యమిదం జగత్
వన్ధ్యాపుత్ర ఇవాత్యన్తమతోఽస్త్యేవ న దృశ్యధీః. 6

మూర్తివంతమగు ఈ దృశ్యజగత్తు, ఉత్పన్నమేకాకయున్నది ఇవ్విషయముననే సమస్త శ్రుతులయొక్కయు తాత్పర్యమైయున్నది. కాఁబట్టి వంధ్యాపుత్రునివలె ఈ దృశ్యము అత్యంత అసత్యమై యొప్పుచున్నది.

యచ్చేదం కిం చిదాభాతి దృశ్యమిత్యభితః స్థితమ్
తచ్చిన్మాత్రం ఖమేవాచ్ఛం పరమేవ పదం విదుః. 7

ఈ నలువైపుల ప్రత్యక్షముగఁ గానుపించుచున్న దృశ్యమెద్దిగలదో, పరమాత్మపదమగు అది నిర్మల చిన్మాత్రాకాశమేయని శ్రుతితాత్పర్యవేత్త లెఱుఁగుచున్నారు.

యథా సుషుప్తాత్స్వప్నత్వం గచ్ఛద్యాత్యనవస్థితిమ్
చిన్మాత్రమజహత్స్వచ్ఛం నిజం రూపమనామయమ్. 8

సర్గస్యాదౌ తథై వేదమాత్మైవ స్వాత్మనాత్మని
వ్యోమాత్మైవ చిదాభాసం దృశ్యమిత్యవభాసతే. 9

చిన్మాత్రము తన నిర్మల నిర్వికారరూపమును త్యజింపకయే సుషుప్తినుండి స్వప్నదశ కేగుచు, అనవస్థితినెట్లు పొందుచున్నదో, అట్లే సృష్ట్యాదియందును చిదాకాశరూపమగు ఈ చిన్మాత్రాత్మయే నిజస్వరూపమును త్యజింపక. స్వయముగ తనయం దీచిదాభాసరూపమగు దృశ్యజగత్తుగ భాసించుచున్నది. (ప్రళయమునుండి సృష్టిదశ కేగుచున్నది.)

యథా పురతయా భాతి మనః సంకల్పమన్థరమ్
తథా దృశ్యమివాభాతి సర్గాదౌ చిన్నభః పరమ్. 10

సుషుప్తిదశనుండి స్వప్నదశప్రాప్తించునపుడు మనస్సుయొక్క సంకల్పమేయట నగరాది రూపములుగ భాసించునట్లు సృష్ట్యాదియందు పరమచిదాకాశమే దృశ్యజగత్తువలె భాసించుచున్నది.

యథాత్మన్యనిలః స్పన్దశ్చక్రావర్తవదీహతే
సర్గాదౌ చిన్నభః స్థిత్వా దృశ్యమిత్యేవ తిష్ఠతి. 11

వాయువు స్పందరూపమై తన స్వరూపమున స్వయముగనే చక్ర, ఆవర్తాదిరూపమున నెట్లు చేష్టించుచున్నదో, అట్లే, అజ్ఞాతచిదాకాశమున్ను సష్ట్యాదియందు తనయందు స్వయముగనే దృశ్యరూపముగ స్థితినొందుచున్నది

అతో జ్ఞాతమనాభాతమేవ దృశ్యం జగత్త్రయమ్
బ్రహ్మైవేదం పరం భాతి స్వాత్మనీత్థమవస్థితమ్. 12

కావుననే, ఎఱుఁగఁబడినచో (తత్త్వజ్ఞానము కలిగినచో) త్రైలోక్యరూపమగు ఈ దృశ్యము దృశ్యరూపముగ భాసింపక పరబ్రహ్మముగనే భాసించును. అత్తఱి, పరబ్రహ్మమే తనయందివ్విధమున దృశ్యరూపముగ నెలకొనియున్నట్లు తెలియఁబడును.

నాస్త్యేవ మూర్తం పృథ్వ్యాది కించ నాపి కదాచన
అస్తు మూర్తమమూర్తం వా బ్రహ్మైవేదం విరాజతే. 13

ఈ పృథ్వ్యాదులెవ్వియు నెపుడును మూర్తివంతము (సాకారము)గ లేవు. అవి, అజ్ఞాని దృష్టియందు మూర్తివంతములైనను జ్ఞానిదృష్టియందు అమూర్తివంతములైనను నగుగాక! కాని యీ మూర్తామూర్త జగద్రూపముగ పరబ్రహ్మమే విరాజిల్లుచున్నదనుట నిక్కము.

ప్రబోధకాలే స్వప్నాద్రిర్యథా వ్యోమైవ నిర్వపుః
తథేదం శాన్తచిన్మాత్రం ఖం ప్రబోధే జగత్త్రయమ్. 14

మేల్కొనిన పిదప స్వప్నమందలి పర్వతాదులు రూపరహితములై యెట్లాకాశరూపమునే బొందుచున్నవో, అట్లే, ఆత్మజ్ఞానము కలిగినమీదట ఈ ముల్లోకములున్ను శాంత చిన్మాత్రాకాశమే యగుచున్నవి

ప్రబుద్ధానాం పరం బ్రహ్మ నిర్విభాగమిదం జగత్
ధీమన్తోఽపిన తద్విద్మో యదిదం త్వప్రబోధనమ్. 15

జ్ఞానుల దృష్టియందీజగత్తు విభాగరహితముగ వెలయునదై పరబ్రహ్మముగనే భాసించును. బుద్ధిమంతులమగు మేము విచారించుచున్నప్పటికిని, ఈ అజ్ఞానమెట్టిదో యెఱుఁగకయున్నాము.

దేశాద్దేశాన్తరప్రాప్తౌ యన్మధ్యే సంవిదో వపుః
స్వస్వభావో హి భూతానాం తత్పదం పరమాత్మకమ్. 16

భూతలమందలి యొక ప్రదేశమునుండి చంద్రమండలాది మఱియొక ప్రదేశమునకు నేత్రేంద్రియముద్వారా బుద్ధివృత్తిచనునపుడు, ఆ రెండు ప్రదేశముల మధ్యమందలి నిర్విషయమగు చైతన్యముయొక్క స్వరూపమెద్దిగలదో, అదియే సర్వజీవులయొక్కయు స్వస్వభావమైయున్నది. మఱియు నదియే పరమాత్మపదమున్ను నగును.

దేశాద్దేశాన్తరప్రాప్తౌ యన్మధ్యే సంవిదో వపుః
ఏతత్తత్పరమాకాశమత్ర సర్వం ప్రతిష్ఠితమ్. 17

ఒక ప్రదేశమునుండి మఱియొక ప్రదేశమునకు నేత్రేంద్రియముద్వారా బుద్ధివృత్తి చనునపుడు, ఆ రెండుప్రదేశముల మధ్యనుండు నిర్విషయమగు చిత్స్వరూపమేదిగలదో, అదియే పరమాత్మరూపమగు చిదాకాశము, మఱియు నచటనే సమస్తము ప్రతిష్ఠితమైయున్నది (అదియే [illegible]ముసకు అధిష్ఠానమని భావము )

యాదృగేతత్పదం తాదృగిదం సదసదాత్మకమ్
యేనార్థపఞ్చకాదన్యత్కించ నాపి న విద్యతే. 18

నిర్విషయమగు ఈ పరమాత్మపద మెట్టిరూపముగల్గియున్నదో, అట్టిరూపమే సదసదాత్మకమగు ఈ జగత్తున్ను గల్గియున్నది. ఏలయనిన, ఈ సమస్త ప్రపంచమున్ను పంచభూతముల కంటె వేఱేమియునుగాదు; పంచభూతములో, తమ యధిష్ఠానము (పరమాత్మ) కంటె అన్యముగ నొకింతైనను లేవు.

రూపాలోకమనస్కారా ఏతదేవ పదం విదుః
ఏతేతే ద్రవతావర్తాః పదస్యాస్య మహామ్భసః. 19

బాహ్యేంద్రియ జన్యములైన రూప, ప్రకాశాదివిషయములున్ను అభ్యంతరమందలి, మనస్సున కధీనములైనట్టి సంకల్పాదులున్ను; సమస్తము (బాహ్యాభ్యంతర జగత్తంతయు) ఈ పరమాత్మ పదరూపమేయని చెప్పఁబడినది. ఏలయనిన, ఇవియన్నియును పరమాత్మపదమను మహాసముద్రముయొక్క ద్రవత్వ, ఆ వర్తాదులేయైయున్నవి

దేశాద్దేశాన్తరప్రాప్తా యన్మధ్యే సంవిదో వపుః
ఏతస్యావ్యతిరేకేణ జగత్తా నాస్తి కాచన. 20

ఒక ప్రదేశమునుండి మఱియొక ప్రదేశమునకు నేత్రేంద్రియముద్వారా బుద్ధివృత్తి చనునపుడు ఆ రెండుప్రదేశముల మధ్యనుండు నిర్విషయమగు చైతన్యముయొక్క స్వరూప మెద్ది గలదో, దానికంటె వేఱుగ ఈ జగత్తే మియును లేదు.

రాగద్వేషాదయో భావా భావా భావదృశ స్తథా
ఏతద్రూపమముఞ్చన్త ఏతస్యావయవాః స్థితాః. 21

రాగద్వేషాదులు, భావ, అభావములు మున్నగునవి యన్నియును, ఈ సద్రూపమును దృజింపకయే యద్దాని అవయవమువలె స్థితినొందియున్నవి.

త్యక్త్వా పూర్వాపరే కోట్యౌ మధ్యే యత్సంవిదో వపుః
న స్వభావః పరో జ్ఞేయో జగత్ప్రయసి సంజ్ఞితః. 22

శాఖద్వారా చంద్రుని వీక్షించునపుడు, అట, పూర్వవిభాగమగు శాఖను, అపరవిభాగ మగు చంద్రుని రెంటిని విడిచినచో మధ్యనుండు చైతన్యముయొక్క నిర్విషయమగు స్వరూప మేది గలదో, అదియే యా చైతన్యముయొక్క పరమ (సర్వోత్తమ) స్వభావమైయున్నదని యెఱుఁగనగును. మఱియు నదియే జగత్తును మృగతృష్ణాజలమునకు అధిష్ఠానమని వచింపఁబడినది.

దేశాద్దేశాన్తరప్రాప్తా విద్ధి మధ్యమసంవిదః
జగదిత్యపరం నామ స్వరూపాదచ్యుతాత్మనః 23

ఓ రామచంద్రా! జాగ్రత్ప్రదేశమునుండి స్వప్నప్రదేశమును బొందునపుడు మధ్య సుషుప్తిదశయందు సంవిత్తు (చైతన్యము)యొక్క రూప మేదికలదో, పూర్వసృష్టి రూపప్రదేశము నుండి మరల సృష్టిరూపప్రదేశమును బొందునపుడు మధ్య ప్రళయమందు సంవిత్తుయొక్క రూప మేదిగలదో, ఇహలోక ప్రదేశమునుండి పరలోక ప్రదేశమును బొందునపుడు మధ్య మూర్ఛావస్థ యందు సంవిత్తుయొక్క రూప మేదికలదో, అదియే (తద్రూపముగనే) సర్వకాలములందును నుండుచున్నది. కూటస్థమైయుండుటచే తన స్వరూపమునుండి యెన్నఁడును చ్యుతినొందనట్టి యా చిద్రూపమునకే అజ్ఞానులు జగత్తను మఱియొక పేరును గల్పించిరి.

ఆదిసర్గాత్ప్రభృత్యేవ దృశ్యముత్పన్న మేవ నో
యన్నామ తదిహాస్తీతి మాయాశమ్బరడమ్బరః 24

ఆదిసృష్టినుండియును, ఈ జగత్తు వాస్తవముగ నుత్పన్నము కాకయేయున్నది. ఏది యుత్పన్నమైనట్లు భాసించుచున్నదో, అది జగన్మాయయొక్క యింద్రజాలము మాత్రమేయై యున్నది.

కష్టం నాస్త్యేవ యద్దృశ్యం తదప్యస్తీతి సంస్థితమ్
యదప్యస్తిపరం బ్రహ్మ కష్టం నాస్తీతి తత్స్థితమ్. 25

అయ్యో! దుఃఖకరమైన విషయము! మణియందు గాజు గూర్చిన బుద్ధివలెను, గాజునందు మణినిగూర్చిన బుద్ధివలెను, ఏ జగద్రూపదృశ్యము లేకయున్నదో, దానియందు 'కలద'ను బుద్ధియు, ఏ పరబ్రహ్మ ముండియున్నదో, దానియందు 'లేద'ను బుద్ధియు అజ్ఞానులకుఁ గలుగుచున్నదే!

అబ్రహ్మణ్యం క్వ గచ్ఛామి విపరీతమతో జగత్
అసద్దృశ్యం సదిత్యుక్తం బ్రహ్మైవం నావగమ్యతే. 26

నాకు బ్రహ్మభావరహితమైనట్టి విపరీత జగత్తెచటను లభించుటలేదు. అజ్ఞానులైతే అసత్తగు ఈ దృశ్యమును సత్తని వచించుచున్నారు. సత్తగు బ్రహ్మమునుమాత్ర మిట్లు సత్తని యెఱుఁగకయే యున్నారు.

న చోత్పన్నం న చాభాతి దృశ్యం కించన కుత్రచిత్
యదిదం భాతి తద్బ్రహ్మ వ్యోమైవ కచతి స్వయమ్. 27

వాస్తవముగ దృశ్య మెచటను నొకింతైనను నుత్పన్నము కాలేదు. భాసించుటయు లేదు, ఈ భాసించునదంతయు బ్రహ్మమే స్వయముగ నట్టిరూపముగ ప్రకాశించుచున్న దగును.

యథా మణిః ప్రకచతి స్వభాసాఽవ్యతిరిక్తయా
ఆత్మనోఽనన్యయా సృష్ట్యా చిద్వ్యోమ కచితం తథా. 28

మణి తనకంటె వేఱుకానట్టి కాంతితోడ నెట్లు ప్రకాశించునో, అట్లే చిదాకాశము తనకంటె వేఱుకానట్టి సృష్టిరూపముతోడ ప్రకాశించుచున్నది.

తస్మిన్నేవ పదేశాన్తే తపత్యేష దివాకరః
తస్యైవావయవశ్చైవ న నామాన్యోఽస్తి భాస్కరః. 29

సూర్యుఁ డట్టి శాంతమగు పరమాత్మపదముననే సద్రూపముతోటి వెలుఁగుచున్నాఁడు. ఆ పరమాత్మయొక్క అవయవమే యీ సూర్యుఁడు. సద్రూపుఁడగు పరమాత్మకంటె వేఱుగ ఈ సూర్యుఁడు లేనేలేడు.

స్థితోఽపి తత్ర న తపత్యర్కో న చ నిశాకరః
ప్రకాశయతి దేవోఽసావర్కం నార్కస్తమీశ్వరమ్. 30

చిత్స్వరూపమున నున్నవారైనప్పటికిని సూర్యచంద్రు లా చిత్స్వరూపమును ప్రకాశింపఁజేయఁజాలకయే యున్నారు. ఈశ్వరుఁడగు ఆ పరమాత్మదేవుఁడే సూర్యునిఁ బ్రకాశింపఁజేయుచున్నాఁడు గాని సూర్యుఁ డా పరమాత్మ దేవుని గాదు.

తస్య భాసా విభాతీదం తదహో దృశ్యమణ్డలమ్
సర్వచన్ద్రార్కవహ్నీనాం పదార్థానామ్ స దీపకః. 31

అహా! ఆ చైతన్యముయొక్క ప్రకాశముచేతనే యీ దృశ్యసమూహమంతయును ప్రకాశించుచున్నది. మఱియు సూర్యచంద్రాగ్న్యాది ప్రకాశక పదార్థము లన్నిఁటియొక్కయు, ఆ చిద్రూపుఁడగు పరమాత్మ ప్రకాశకుఁడై యొప్పుచున్నాఁడు.

న సాకారో నిరాకార ఇతి శబ్దార్థకల్పనా
ఖపుష్పవదసద్రూపా న సంభవతి తద్విదామ్. ౮౨

ఆ పరమాత్మ సాకారరూపుఁడా, లేక నిరాకార స్వరూపుఁడా అను ఈ శబ్దార్థకల్పన, ఆకాశపుష్పమువలె అసద్రూపమైయున్నది. కాబట్టి యట్టి కల్పన తత్త్వజ్ఞానులకు సంభవింపనేరదు.

సాఽఙ్గభూతో యథైకోఽణుర్భాతి జీవార్కతేజసి
న భాన్తి భాన్తి వా తత్ర తథా సూర్యాదయోఽణవః. ౮౩

జీవభూతుఁడును, జగత్తుయొక్క ద్రష్టయునగు సూర్యునియొక్క తేజమందు, అతని అవయవరూపమగు అణువు కిటికిలగుండా యెట్లు భాసించునో, అట్లే. అపరిచ్ఛిన్న చిత్ప్రకాశమయమగు బ్రహ్మమందు సూర్యాదులను అణువులున్ను భాసించుచున్నవి. (పరమార్థమున ద్వైతమే లేనందుచే) భాసింపకయు నున్నవి.

చిన్మాత్రాకాశరత్నస్య సృష్టయోఽర్కాది సంయుతాః
యా భాసస్తాః కథం తస్మాద్వ్యతిరిక్తాః స్యురుచ్యతామ్. ౮౪

ఓ రామచంద్రా! ఈ సూర్యాది సహితములగు అనేక సృష్టులన్నియును చిన్మాత్రాకాశమను రత్నముయొక్క కాంతులైయున్నవి. కావున నయ్యవి యా చిద్రూపముకంటె నెట్లు వేఱగునో చెప్పుము?

చిన్మాత్రేణాపి రహితం శూన్యత్వేనాపి వర్జితమ్
పదం సర్వాత్మరిక్తం తత్పర్వార్థైశ్చ సమన్వితమ్ ౮౫

ఆ పరమాత్మపదము ద్వంద్వాతీత మగుటచే చిదచిద్రహితమైనదియు, (చిత్, జడ భేదము, లేనిదియు), సర్వత్ర పరిపూర్ణమైయుండుటచే శూన్యత్వవర్జితమైనదియు, పదార్థములు అసత్తగుటచే సర్వపదార్థరహితమైనదియు, కాని సర్వకల్పనలకు అధిష్ఠానమగుటచే సర్వపదార్థసహితమైనదియునై వెలయుచున్నది.

పృథ్వ్యాదీన్యపి సన్త్యేవ తత్ర సన్తి న కానిచిత్
జీవన్తోఽపి న విద్యన్తే జీవాస్తత్ర చ కేచన. ౮౬

పృథ్వ్యాది సమస్తపదార్థములున్ను, ఆ చైతన్యమున ఆరోపిత (కల్పిత) దృష్టిచేఁ గలవు. కాని, అధిష్ఠానదృష్టిచే నవి యెవ్వియును లేవు. అట్లే జీవులున్ను, ఆ చిద్రూపమున ఆరోపిత దృష్టిచే జీవించుచునున్నను అధిష్ఠానదృష్టిచే నా రెవరును లేకయేయున్నారు.

అత్యజన్తోద్వ్యయస్థౌల్యం తత్రైతే పరమాణవః
స్వరూపమత్యజద్ద్వైతమైక్యం వాత్ర న కించన. ౮౭

అవయవ ద్వయఘటనచే నుత్పన్నమైన స్థూలత్వమును త్యజింపకయే యీ సూర్యాది పదార్థములు ఆ చిత్ప్రకాశమున అవయవరహితములగు చిద్రూపాణువులుగఁ బ్రకాశించుచున్నవి. కాని. వాస్తవముగ నిజసత్తను త్యజింపకయేయున్నట్టి యా చిద్రూపమున ద్వైతముగాని, ఏకత్వముగాని యొకింతైనను లేవు.

కించిదత్ర న కించిద్వై న కిం చిచ్చ న కించన
కించిన్న కించిదిత్యేషా కలనామాత్రాతిదూరగా. 38

ఇది పదార్థసహితమైనది, ఇది పదార్థరహితమైనది, ఇది స్థూలమైనది, ఇది శూన్యమైనది, ఇది అల్పమైనది, ఇది అధికమైనది – ఇత్యాది కల్పనలు ఆ శుద్ధ, నిర్విషయ చిత్స్వరూపమునకు అతిదూరమున నున్నవి. (అవి యెవ్వియు నిట లేవని భావము )

ఏకా నిరన్తరానన్తా నిత్యమత్యాత తాత్మనా
చిన్మాత్రవ్యోమసత్తైవ జగన్నామ్నాత్మని స్థితా. 39

ఏకమై, శాశ్వతమై, అనంతమై, సదా అతివ్యాపకమైనట్టి చిన్మాత్రాకాశ సత్తయే తనయందీ జగత్తను నామముతోటి స్థితినొందియున్నది.

ఏకం చేత్యం త్యక్తవత్యా అప్రాప్తాయాశ్చితోఽపరమ్
యద్రూపం జగతో రూపమస్య నానాత్మనోఽపితత్. 40

బుద్ధివృత్తి ఒక విషయమును త్యజించి మఱియొక విషయమును గ్రహింపక పూర్వము మధ్యనుండు చైతన్యముయొక్క నిర్విషయమగు స్వరూపమేదిగలదో, అదియే యీ వివిధరూపములతో ప్రకాశించు జగత్తుయొక్కయు రూపమైయున్నది.

నానేవేదమనానైవ చిద్వ్యోమ్ని వేదమాతతమ్
భూతపఞ్చకరూపేణ స్వప్నే చితిరివ స్థితమ్. 41

స్వప్నమందు జీవచైతన్యమువలె చిదాకాశమే ఏకమైనప్పటికిని అనేక ప్రకారములుగ నిట్లు పంచభూతమయమగు జగద్రూపముచే వ్యాప్తమైయున్నది.

సుషుప్తాద్విశతః స్వప్నం సుషుప్తస్థైవ చిద్యథా
యథా స్థితైవ స్వప్నత్వమేత్యేవం సర్గతామిమామ్. 42

సుషుప్తినుండి స్వప్నమున ప్రవేశించునటువంటి చైతన్యము నిజసుషుప్త స్వరూపముననే యథారీతి యుండినప్పటికిని స్వప్నత్వమును బొందినదై వివిధరూపములను ధరించునట్లు ప్రళయమునుండి సృష్టియందుఁ బ్రవేశించునటువంటి చైతన్యమున్ను నెప్పటియట్లు తన అద్వైతరూపముననే యుండియున్నను ఈ జగద్రూపత్వమును బడసినదై నానారూపములను ధరించుచున్నది.

యాదృక్సుషుప్తం స్వప్నస్తు తాదృగేవ తథైవ చ
జాగ్రత్తుర్యం తథైవేదమతో వ్యోమసమం జగత్. 43

సుషుప్తి యెట్లు చిద్రూపమైయున్నదో, అట్లే స్వప్నమున్ను చిద్రూపమేయైయున్నది. అదేరీతి, తురీయమెట్లు చిద్రూపమైయున్నదో, జాగ్రత్తున్ను నట్లే చిద్రూపమే యైయున్నది. ఇక్కారణమున, ఈ జగత్తంతయును చిదాకాశమయమై వెలయుచున్నది.

జాగ్రత్స్వప్నః సుషుప్తం చ తుర్యమేవాఖిలం స్థితమ్
తత్త్వవిద్గోత్రమూఢస్తు యద్వై వేత్తి న వేద్మి తత్. 44

తత్త్వవేత్తల దృష్టియందు జాగ్రత్స్వప్న సుషుప్తిరూపమగు ఈ సమస్త జగత్తున్ను తురీయమేయైయున్నది. అట్టి తత్త్వవేత్తల బ్రహ్మవిద్యా సంప్రదాయ విషయమున మూర్ఖులేమి తలంచుచున్నారో (ఈ జగత్తు నేరీతి యెఱుఁగుచున్నారో) దానిని నే నెఱుఁగను.

> జడానామజడానాం యః సర్వార్థానామనాతరమ్
> దుర్లక్ష్యపరిణామోఽన్తర్మనోబుద్ధ్యాదివర్జితః. 45
>
> సుశుద్ధాయాశ్రితో రూపం పదార్థాస్తన్మయాశ్రితే
> తే వసన్తి నసద్రూపాస్తదేవ హి తథా స్థితమ్. 46

జగత్తులయొక్కయు, జీవులయొక్కయు, సమస్తపదార్థములయొక్కయు అభ్యంతరమున నున్నదియు, అంతర్యామిరూపముచే దుర్లక్ష్యముగ జగత్తును పరిణామమొనర్చునదియు, మనోబుద్ధ్యాది వర్జితమునగు ఈశ్వరరూపమే పరిశుద్ధమొనర్పఁబడిన జీవచైతన్యముయొక్క స్వరూపమై యున్నది. సమస్తజగత్పదార్థములున్ను తదీశ్వరమయములేయైయున్నవి. కావున, ఆ చిద్రూపుఁడగు యీశ్వరుఁడే జగదాకారముగ నున్నాఁడని నిశ్చితమగుచున్నది. కాని నిజదృశ్యరూపముచే ఆ జగత్పదార్థములు సత్యములు కావనియే తెలియనగును.

> పరిణామాదిశబ్దార్థదృశామత ఇహానఘ
> ఉపదేశార్థముక్తీనాం గన్ధోఽప్యేవం న విద్యతే. 47

పాపరహితుఁడవగు రామచంద్రా! పృథ్వ్యాదులందు అంతర్యామియై పరమాత్మ (ఈశ్వరుడు) సమస్తమునకు సాక్షిరూపమున వర్తించుచు, పరిణామమొనర్చుచున్నాఁడను నీ ప్రకారములగు పరిణామాది శబ్దార్థములయొక్క కథనము లౌకికవ్యవస్థనుబట్టి యుపదేశార్థమే యగును. పరమార్థమున వాని గంధ (లేశ) మైననులేదు. కాఁబట్టి సమస్తము చిద్రూపమేయై యున్నది. గాని వాస్తవముగ నటసాక్షిత్వప్రేరకత్వములుగూడ లేవు.

> ఆదిసర్గాత్ప్రభృత్యేవ మహాసత్తాత్మనాత్మని
> చిన్మాత్రపరమాకాశం స్థితమేకం మహాత్మనః 48
>
> ప్రపూర్ణైకాత్మని ప్రఖ్యా సా సర్వవ్యాపినీ చితిః
> స్థితా తయాత్మన్యేవాస్తద్జగదిత్యభిధాః కృతాః. 49

ఆదిసృష్టినుండి మొదలుకొని యేకమైనట్టి చిన్మాత్రమగు పరమాకాశమే మహాసత్తారూపమగు స్వాత్మయందు స్వయముగ జగద్రూపమున స్థితినొందియున్నది. ఇవ్విషయమున తత్త్వవేత్తల ప్రపూర్ణైకాత్మనుగూర్చిన యనుభవము ప్రమాణమైయున్నది. అట్టి యనుభవరూపమైనట్టి సర్వవ్యాపకమైన చైతన్యమే సర్వత్రస్థితినొందియున్నది అదియే తనయందు అజ్ఞానమలముకై జగజ్జీవాది సంజ్ఞలను గల్పించెను

> పరిజ్ఞాతే యథా స్వప్నే స్వాఙ్గీకారాత్సుఖం సుఖమ్
> అనఙ్గీకారతో దుఃఖం నదుఃఖం భవతి క్షణాత్

స్వప్నమునుండి మేల్కొనినపిదప స్వప్నానుభూతమగు జగత్తంతయు మహాసుఖమెట్ల గునో, మేల్కొననపుడది మహాదుఃఖమే యెట్లగునో, అట్లే ఆత్మస్వరూపము నెఱింగినమీదట శేషించు శుద్ధాత్మమాత్రస్వరూపముయొక్క యంగీకారముచే, తానను భవించు జగత్కౌతుకమంత యును నిఁక సుఖమే సుఖమగును. అట్లాత్మ నెఱుఁగక, శుద్ధాత్మమాత్రస్వరూపము నంగీకరింపక యున్నచో, తాననుభవించునదంతయు దుఃఖమే దుఃఖమగును.

గచ్ఛత స్తిష్ఠతశ్చైవ జాగ్రతః స్వపత స్తథా
నిత్యమేకం సమాధానం స్థితం శాన్తస్య తద్విదః. 51

ఆకారణముననే శాంతుఁడగు తత్త్వజ్ఞానికి (దుఃఖవిక్షేపాభావమువలన) నడుచు చున్నను కూర్చొనుచున్నను, మేల్కొనుచున్నను, నిదురించుచున్నను సదా యొకేసమాధిసుఖము వర్తించుచున్నది.

భేదేఽప్యభేదనిష్ఠస్య దుఃఖేఽపి హి సుఖస్థితేః
సతోఽప్యేవాసతో జ్ఞస్య కిమన్యదవశిష్యతే. 52

మాయానిర్మితమగు భేదమందు వసించినప్పటికిని, అభిన్నమై, ఏకరసమైనట్టి ఆత్మ యందు తత్పరుఁడును, కల్పితశరీరమనో దుఃఖములందున్నప్పటికిని నిరతిశయానందరూపమగు స్వాత్మయందు వెలయువాఁడును, బాహ్యప్రపంచమున వర్తించినప్పటికిని ఆభ్యంతరమున ముక్తుఁ డగుటచే నట్టి బాహ్య, అసత్ప్రపంచమున లేనివాఁడునగు జ్ఞానికిఁక గ్రహింపఁదగినదిగాని, త్యజింపఁదగినదిగాని యగు ఏది శేషించును?

న సంత్యజతి నాదత్తే కిం చిద్వ్యవహరన్నపి
హృదయే న బహిః కార్యేఽకార్య ఏవావతిష్ఠతే. 53

బాహ్యమున సమస్తకార్యములందును వ్యవహరించుచున్నప్పటికిని ఆత్మజ్ఞాని హృద యములోఁ దేనిని త్యజింపకయు, గ్రహింపకయు నున్నవాఁడై కార్యవర్జితమగు బ్రహ్మమందే స్థితిగల్గియుండును.

యథా హి మస్య శీతత్వం వహ్నేరౌష్ణ్యం తథేదృశః
స్వభావోఽస్య భవేన్నిత్యం నత్వాహార్యో గుణోఽస్య సః. 54

అట్టి స్థితి మంచునకుఁ జల్లదనమువలెను అగ్నికి నుష్ణత్వమువలెను, జ్ఞానికి సదా స్వభావమే యైయున్నది. గాని ప్రయత్నముచే సంపాదింపఁబడిన గుణముకాదు.

యస్య త్వేష స్వభావః స్యాన్న నామ న స తత్త్వవిత్
వీతదేవాజ్ఞతాచిహ్నం యదిదాః ప్రకృతేతరా. 55

ఎవని కిట్టి నిరంతరాత్మస్థితియను స్వభావ [illegible]నో, అతఁడే తత్త్వవేత్తయగును. ఎవని కిట్టి స్వభావములేదో, అతఁడు జ్ఞానికాఁడు. ఏలయనిన, ఆత్మేతరమగు పదార్థమందుఁ గోర్కె గలిగియుంతుటయే, అజ్ఞానముయొక్క చిహ్నమైయున్నది.

అశ్వస్తాన్తఃకరణః క్షీణవికల్పః స్వరూపసారమయః
పరమ శమామృతతృప్తస్తిష్ఠతి విద్వాన్నిరావరణః. 56

ఇత్యార్షే శ్రీవాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు
నిర్వాణప్రకరణే ఉత్తరార్ధే ద్వైతైక్యనిరామయయోగోపదేశో
నామైక సప్తత్యధికశతతమః సర్గః ॥ 171 ॥

అజ్ఞానావరణము లేనివాఁడగు జ్ఞాని సదా శాంతచిత్తుఁడై, శత్రుమిత్రాది వికల్పము లన్నియు క్షయించినవాఁడై, సారభూతమగు స్వాత్మసుఖముచేఁ బరిపూర్ణుఁడై, మహాశాంతియను అమృతముచే నిత్యము సంతృప్తుఁడై, ఆత్మయందే సదా స్థితిగల్గియున్నవాఁడై వెలయుచుండును.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున నుత్తరార్ధమున ద్వైతైక్యనిరామయయోగోపదేశమను నూటడెబ్బదియొకటవసర్గము ॥171॥

---

## ద్విసప్తత్యధిక శతతమః సర్గః

[మనోమాత్రం విధాతాత్ర తత్సంకల్పో జగద్భ్రమః
న దేహోఽస్య స్మృతిర్వేతి స్మృతితత్త్వం చ కీర్త్యతే.

మనోమాత్రమే బ్రహ్మదేవుఁడనియు, అతని సంకల్పమే భ్రమరూపమగు జగత్తనియు, అతనికి దేహముగాని, స్మృతిగాని లేవనియు వచింపఁబడుటయు, స్మృతియొక్క తత్త్వము కీర్తింపఁబడుటయు నిచటఁ గాననగును.]

శ్రీవసిష్ఠ ఉవాచ :—

ఏవం పృథ్వ్యాదిరహితః ఖమేవాద్యః ప్రజాపతిః
మనోమాత్రమహం మన్యే సంకల్పవిటపీ యథా. 1

శ్రీవసిష్ఠుఁడు:— ఓ రామచంద్రా! ఈ ప్రకారముగ ఆదిప్రజాపతి (విరాట్)యు పృథ్వ్యాది రహితమై, నిరావరణమైనట్టి చిదాకాశమేయైయున్నాఁడు. అతనిని సంకల్పవృక్షమువలె మనోమాత్రునిగనే (సమష్టిమనోరూపుఁడగు హిరణ్యగర్భునిగనే) నేను నమ్ముచున్నాను. (మనస్సు) చైతన్యముయొక్క స్ఫురణమాత్రమే గావున చిన్మాత్రత్వమే యాతనికి సిద్ధించుచున్నదగును.

మన ఇత్యభిదానేన పశ్చాదాస్థా ప్రకల్పితా
వార్యావర్తవివర్తేన ప్రోత్థాయావర్తతా యథా. 2

మననాకారమగు కల్పనకుఁ బూర్వమాతఁడు చిన్మాత్రుఁడుగ, నే యుండియుండెను. కాని అట్టి కల్పనానంతరము, జలము తనయందుఁ దానే స్వయముగ ఆవర్తాదిరూపములతోడ నావిర్భవించి అట్టి యావర్తాదులగూర్చిన కల్పనను గావించునట్లు, అతఁడు తనయందుఁ దానే మనస్సను పేరుచే చైతన్యతాదాత్మ్యాధ్యాసమును గల్పించెను.

సత్తామాత్రాత్మన స్తస్య కుతో బుద్ధ్యాదయః కిల
అవిద్యమానే పృథ్వ్యాదౌ ఖ్యస్యాన స్తస్య కిం రజః. 3

సత్తామాత్రస్వరూపుఁడగు ఆ బ్రహ్మదేవునకు బుద్ధ్యాదులెటులుండును? పృథ్వ్యాదులెవ్వియు లేనపుడు, అనంతాకాశమున ధూళి యెట్లుండును?

న తస్య దేహచిత్తాది నేన్ద్రియాణి న వాసనాః
సదప్యేతత్సదా తస్య న కించిదపి విద్యతే. 4

ఆ బ్రహ్మదేవునకు దేహముగాని, చిత్తాదులుగాని, ఇంద్రియములుగాని, వాసనలుగాని యేవియును లేవు. వ్యవహార నిర్వహణార్థము కల్పిత దేహేంద్రియములాతనికి సదా విద్యమానములైయున్నను, పరమార్థమున నవి యొకింతైనను లేవు.

ప్రాక్తనస్య ప్రజేశస్య ముక్తత్వాత్కథమేవ చ
భూయః సంభవతి ప్రాజ్ఞ న స్మృతిర్న చ సంభవః. 5

ఏలయనిన, ప్రాజ్ఞుఁడవగు రామచంద్రా! ఆదిసృష్టాదియందు కారణాభావముచేతను, ద్విపరార్థమున పూర్వపు ప్రజాపతి ముక్తుఁడగుటవలన నాతఁడే నూతనప్రజాపతికి కారణము కాకుండుట వలనను, మరల నూతనప్రజాపతి యెట్లు సంభవించును? కావున, అతనికి ఉత్పత్తిగాని, స్మృతిగాని వాస్తవముగ లేవనియే నిశ్చితమగుచున్నది.

న భవత్యేవ ముక్తానాం స్మృతిర్దేహోదయః పునః
న దేశకాలావర్తత్వమావర్తానాం సతామివ. 6

సంసారమున నున్నవారును, జననమరణ పరివర్తనశీలురునగు జీవులకువలెగాక ముక్తజీవులకు సంసారస్మృతిగాని, మరల దేహోత్పత్తిగాని కలుగనేరవు. ఏలయనఁగా, వారికిఁక దేశాంతరముననుగాని, కాలాంతరముననుగాని పునరావృత్తిలేదు.

యదివాపి భవేత్కించిత్స్మృత్యా దేహాది తస్య తత్
తదపృథ్వ్యాదిభిః శాన్తం సంకల్పనగరం తను. 7

ఒకవేళ ఆ బ్రహ్మదేవునకు పూర్వకల్ప వాసనాజన్యమగు హిరణ్యగర్భాహంభావ సంస్కారముచే జనించిన స్మృతివలన, ఆ దేహాదులొకింత సంభవించుచో, అవి కేవలము మానసములును, పృథ్వ్యాదులనుండి యుత్పన్నముగానివియు, అతి తుచ్ఛములును శమించినవియు సంకల్పనగర ప్రాయములును, మిథ్యాభూతములు మాత్రమేయగును.

యథా సంకల్పశైలస్య దృశ్యమానమపి స్ఫుటమ్
పృథ్వ్యాదిరహితం రూపం తద్విరాడ్వపుష స్తథా. 8

సంకల్ప (లేక, స్వప్న) పర్వతము స్పష్టముగఁ గానుపించినను నెట్లు పృథ్వ్యాదిరహితమై యున్నదో, అట్లె విరాట్టుయొక్క శరీరరూపమున్ను స్ఫుటముగ గన్పించినను పృథ్వ్యాదిరహితమే యైయున్నది.

స్మృతిశ్చ సంభవత్యేవ న కదాచన కాచన
ఏషా లౌకికబుద్ధ్యా యా సా సద్బుద్ధ్యా న విద్యతే. 9

అది సృష్టియందు పూర్వానుభవముయొక్క అభావముయొక్క అభావమువలన ప్రజాపతికి స్మృతిసంభవింపదు. 'ధాతా యథా పూర్వమకల్పయత్' — అనగా బ్రహ్మదేవుఁడు పూర్వకల్పానుసారము సూర్య, చంద్ర, పృథ్వ్యాది రూప జగత్తును నిర్మించెను. అనునిట్టి శ్రుతివాక్యములద్వారా బ్రహ్మదేవునకు 'స్మృతి' గలదని స్పష్టమగుచున్నదనినచో, అట్టి శ్రుతివాక్యములు లౌకికులగు అజ్ఞానుల నిమిత్తము అనాదిసిద్ధమగు కర్మమార్గముయొక్క ప్రవర్తనముకొఱకై యితరుల బుద్ధిననుసరించి బోధింపఁబడినవేయగును. అంతేకాని తత్త్వవేత్తలయొక్క దృష్టియందు ప్రజాపతికి స్మృతి సంభవింపనేరదు.

**శ్రీరామ ఉవాచ :—**

కథం న సంభవత్యేషాం స్మృతిః స్మృతిమతాం వర
స్మృతేశ్చా సంభవే కస్మాద్గుణో గుణగణాకర. 10

శ్రీరాముఁడు :— స్మృతిమంతులలో శ్రేష్ఠుఁడవును, ఉత్తమగుణ సమూహములకు నిలయుఁడవునగు నో మునీశ్వరా ! హిరణ్యగర్భాదులకు స్మృతి యెట్లు సంభవింపదు ? ఏలయనిన, అట్లు వారికి స్మృతి సంభవింపనిచో, పూర్వకల్పీయమగు బ్రహ్మాండముయొక్క సమస్తగుణములను, ఈ బ్రహ్మాండమందెట్లు సిద్ధించుచున్నవి ?

**శ్రీ వసిష్ఠ ఉవాచ :—**

దృశ్యే హి సంభవత్యేషా కార్యకారణతాత్మని
తత్త్వావాభావ సంపన్నా నతు సంభవతి స్మృతిః. 11

శ్రీవసిష్ఠుఁడు :— ఓ రామచంద్రా ! సత్యపదార్థశూన్యమై, కల్పితమై, భ్రాంతిసంస్కారజనితమైనట్టి స్మృతిచే (మాయోపహిత) ఆత్మయందు కార్యకారణత్వముయొక్క కల్పన సంభవమగునుగాని, సత్యపదార్థానుభవముచే నుత్పన్నమైన స్మృతిచేగాదు. ఏలయనఁగా, అట్టి స్మృతి వాస్తవముగ సంభవింపనేరదు.

ఆబ్రహ్మస్తమ్బపర్యన్తం దృశ్యం కించిన్న విద్యతే
యత్రతత్రకథం కీదృక్ కుతః స్యాత్సంభవఃస్మృతేః. 12

ఎచట బ్రహ్మదేవుఁడు మొదలుకొని తృణమువఱకుగల సమస్త దృశ్యమున్ను వాస్తవముగ నొకింతైనను లేకయున్నదో, అచట నిఁక స్మృతి యేది యెచట నెట్లు సంభవింపగలదు.

భూత్వా భావే హిదృశ్యస్య స్మరణంస్మృతిరుచ్యతే
దృశ్యమేవ న యత్రాస్తి తత్రైతాం కలనాః కుతః. 13

వాస్తవముగ నుత్పన్నమై, విద్యమానదశయందు ప్రమాణములచే ననుభూతమైనట్టి దృశ్యముయొక్క కాలాంతరమందలి స్మరణమునే స్మృతియని చెప్పుదురు. ఎచటదృశ్యమేలేదో, అచట నిఁక ఈస్మృత్యాది కల్పనలన్నియు నెచట ?

అత్యన్తాభావ ఏవాస్య దృశ్యస్య కిల సర్వదా
సర్వం బ్రహ్మేతి సత్యార్థాస్తత్స్మృతేః కలనాః కుతః. 14

నిక్కముగ ఈ దృశ్యము యొక్క సర్వదా అత్యంతాభావమే సిద్ధించుచున్నది. మఱియు సమస్తపదార్థములున్ను వాస్తవముగ బ్రహ్మమేయైయుండ నిఁక వానియొక్క స్మృతిఁగూర్చిన కల్పన లెచట ?

స్మృతిర్న సంభవత్యేవత స్మాదాద్యా ప్రజాపతేః
ఆకారవత్త్వమేవాస్య శుద్ధజ్ఞానాత్మనః కుతః 15

ఇక్కారణమున ప్రజాపతికి ఆదిస్మృతియే సంభవింపనేరదు. ఏలయనిన, శుద్ధజ్ఞాన రూపుఁడగు ఆతనికి ఆకారమే (శరీరమే) యెచట ?

స్మర్తవ్యం భావవశతః స్మృతిర్నాస్త్యేవ లౌకికీ
స్మృత్యర్థస్త్వన్యదీయోఽస్తి సత్యాత్మా త్వమిమం శృణు. 16

బ్రహ్మదేవునకు వాస్తవముగ పూర్వజన్మమున్నచో అప్పటి జగచ్ఛరీరత్వ భావనావశముచే నిప్పుడున్ను 'నేను జగచ్ఛరీరుఁడను' అనిస్మరింపవచ్చును. కాని ఈతఁడు, నా తండ్రి, ఈమె నాతల్లి, ఇత్యాది రూపమగు లౌకిక స్మృతివలె బ్రహ్మదేవుని ఆస్మృతిపదార్థానుభవముచే నుత్పన్నమైనది.కాదు. లౌకికస్మృతిపదార్థములగు పిత్రాదులు గృహమందుగలరు. గాన స్మృతికి యోగ్యులై యున్నారు. కాని బ్రహ్మదేవుని ఉపాసనావిషయమైతే మనోరాజ్యమువంటిదికాదు ఎట్లుకాదో వచించెద వినుము.

భూతస్యాన్తః పదార్థస్య స్మరణం స్మృతిరుచ్యతే
పదార్థస్తు నచైవాస్తి న భూతో న భవిష్యతి. 17

అనుభూతమైన భూతకాలికపదార్థముయొక్క సంస్కారముయొక్క వశముచేనగు స్మరణమే లోకమున స్మృతియనఁబడుచున్నది. ప్రజాపతికైతే కల్పాదియందు పదార్థములు వాస్తవముగ లేవు. ఉండియుండలేదు, ఉండబోవు. కావున నిఁక నాతనికి వానిఁగూర్చి స్మృతియెచట?

ఏవం హి ఖల్విదం బ్రహ్మ పరమేవాచలం యతః
అనాదిమధ్యపర్యన్తం కుతః స్మృత్యాదయస్తతః. 18

ఈ ప్రకారముగ ఈ సమస్తమున్ను ఆదిమధ్యాంత రహితమగు కూటస్థ పరబ్రహ్మమే యైయుండ నిఁక స్మృత్యాదులెచట ?

సర్వాత్మత్వాత్పదార్థాత్మ చిద్వ్యోమరచనం తు యత్
వ్యవహారేఽప్యలం శాన్తం స్మృత్యా తచ్ఛబ్దితం మయా. 19

చైతన్యము సమస్త పదార్థముల యొక్క ఆత్మయై యుండుటఁబట్టి సర్వపదార్థ రూపమై యున్నది. గావున స్మృతియు చిదాకాశముయొక్క స్ఫురణమేయనిన, అట్లేయగుగాక ! ఇట్టిరూపముచే స్మృతి బ్రహ్మదేవునకుండుగాక ! దానిచే నేహానియులేదు. ఏదికలదో, అదియంతయు బ్రహ్మమేయనియు కావున స్మృత్యాదులచే వ్యవహరించినను బ్రహ్మదేవుడు పరమశాంతుఁడైయుండు ననియు నే నిదివఱకే చెప్పియుంటిని

తదేతత్స్మరణం నామ స్వభావకచనం హి తత్
తేనాభ్యస్తోఽథ బాహ్యోర్థః సాదృశ్యాదవభాసతే. 20

అజ్ఞాతబ్రహ్మస్వభావమే స్మృత్యాదిరూపములుగ స్ఫురించుచున్నది. 'నేను బ్రహ్మదేవుఁడను' అనునిట్టి యుపాసనారూపముచే మరల మరల అభ్యస్తమై, బ్రహ్మరూపమగు ఆత్మయే ఉపాసనాఫల రూపమగు బాహ్యపదార్థమువలె ఉపాసనచే కల్పితమైన యాకారము యొక్క సాదృశ్యమువలన భాసించుచున్నది.

యద్యత్సంవేద్యతే కించిత్తత్స్వభావం స్వభావయత్
తేనావభాసతే యోఽర్థస్తస్య స్మృత్యభిధా కృతా. 21

అజ్ఞానోపహితమగు బ్రహ్మముచే జీవునిద్వారా యే యే పదార్థమెఱుఁగఁబడుచున్నదో, ఆయా పదార్థము నవలంబించి, దానిని భావనచేయుచు అట్టి యాకారముతోనే కాలాంతరమునఁ గూడి యుండుటచే మరల యేపదార్థము భాసించుచున్నదో, దానికి స్మృతియను పేరును నదియే తనయందుఁ గల్పించెను.

అవిద్యమానం భాతీవ యథా దృశ్యం తథా స్థితిః
భాత్యేవావిద్యమానైవం మృగతృష్ణా యథోద్యతా. 22

మృగతృష్ణాది భ్రాంతియొక్క యనుభవమందు అవిద్యమానమైనట్టి దృశ్యమెట్లు భాసించుచున్నదో, అట్లే స్మృతియందును అవిద్యమానమైనట్టి పదార్థము భాసించుచున్నది.

సర్వాత్మని స్థితాః సత్యే యాః కచన్తి సుసంవిదః
తా ఏవాభ్యాసరూఢార్థాః సాదృశ్యాత్స్మృతయః స్మృతాః. 23

సత్యస్వరూపమైన సర్వాత్మయగు పరబ్రహ్మమందు స్ఫురించుననియు, అభ్యాసముచే రూఢిపడినవియునగు ఏ సంవిత్తులు (చైతన్యవృత్తులు)గలవో అవియే సాదృశ్యమువలన స్మృతులని చెప్పఁబడినది.

కాకతాలీయవద్భాన్తి సర్వాత్మని సుసంవిదః
స్వాఙ్గభూతాః స్వతః స్వస్థాస్తా ఏవ స్మృతయః కృతాః 24

సర్వాత్మయగు చిద్రూపపరబ్రహ్మమందు అద్దాని అవయవములవలెనున్నవియు విషయముల వైపునకు ఉన్ముఖములగుటచే పరోక్షములుగనున్నను స్వతః (పరమార్థమున) అపరోక్షములై (చిద్రూపత్వమువలన) వికారరహితములై యొప్పునవియునగు ఏ సంవిత్తులు కాకతాలీయముగ (ఆకస్మిక ఉద్బోధకవశముచే) భాసించుచున్నవో అవియే స్మృతులని వచింపఁబడినవి.

యద్యత్కచతి సద్రూపం స్వాఙ్గం సర్వాత్మనః స్వతః
తదభ్యస్తార్థసాదృశ్యాత్స్మృతిరిత్యుచ్యతే బుధైః. 25

సర్వాత్మయగు పరబ్రహ్మము యొక్క స్వాంగభూతమై, సద్రూపమైనట్టి యేదేది స్వతః స్ఫురించుచున్నదో, అదియది అభ్యస్తపదార్థము యొక్క సాదృశ్యమువలన స్మృతియని విజ్ఞులచేఁ జెప్పబడినది.

హేతౌ లబ్ధేఽప్యలబ్ధే వా పవనస్పన్దవద్విదః
తా ఏవాభ్యాసరూఢార్థాః సాదృశ్యాత్స్మృతయః కృతాః 26

వాయువుయొక్క చలనమువలె హేతువులభించినను లేక లభింపకయున్నను స్ఫురించు సంవిత్తి అభ్యాసముచే రూఢిపడిన పదార్థములగూర్చిన వృత్తులే సాదృశ్యమువలన స్మృతులనఁబడినవి.

కాకతాలీయవద్భ్రాన్తి యాస్తాః స్మృత్యభిధాః కృతాః
యథా తవైతేఽవయవాః కచన్తి న కచన్తి చ. 27

ఓ రామచంద్రా! నీయొక్క యీహస్తపాదాద్యవయవములెట్లు మనస్సువానియందు సంలగ్నమైనపుడు భాసించుచు సంలగ్నముకానపుడు భాసింపకయున్నవో, అట్లే చైతన్యము యొక్క (కల్పిత) అవయవభూతములగు సంవిత్తులెయ్యవి కాకతాళీయన్యాయముగ నొకానొకపుడు కాలాంతరమున స్ఫురించుచున్నవో వానికే స్మృతులను పేర్లను అత్మకల్పించెను

స్థితా ఏవాత్మని తథా సర్వాః సర్వాత్మికా విదః
మిథ్యాజ్ఞానమయా యద్వదర్థా ఘటపటాదయః. 28

స్వప్న, ఇంద్రజాలాదులందెట్లు మిథ్యాజ్ఞానమయములగు ఘటపటాది పదార్థములు గలవో అవిసమయమును బొంది ఆకస్మికముగ నెట్లు భాసించుచున్నవో, అట్లే, ఆత్మయందు సర్వరూపములగు సమస్తసంవిత్తులున్నుగలవు. అవిసమయమునుబొంది భాసించుచున్నవి.

తద్వత్స్మృతిపదార్థస్య కిం భ్రమస్య విచార్యతే
దృశ్యస్యాసంభవాజ్జ్ఞస్య స్మృతిర్నాస్త్యేవ తత్త్వతః. 29

ఓ రామచంద్రా! ఎపుడు స్వప్నపదార్థములయొక్క మూలమును నీవు విచారించుట లేదో, అపుడిక భ్రమమయమగు ఈ స్మృతిపదార్థములయొక్క మూలమునుగూర్చి యేల విచారించుచున్నావు? దృశ్యముయొక్క అసంభవమువలన జ్ఞానియొక్క దృష్టియందు వాస్తవముగ స్మృతి లేనేలేదు.

స తథైకఘనత్వాచ్చ చిద్వ్యోమత్వాజ్జగత్స్థితేః
యథా స్థితమిదం దృశ్యమస్త్యేవాజ్ఞస్య సంప్రతి. 30

జ్ఞానియొక్క దృష్టియందీజగత్తు పరమాత్మఘనమై, చిదాకాశమాత్రమైయుండుటచే నాతడు యథారీతి సదానిర్వికారముగనేయుండును. అజ్ఞానియొక్క దృష్టియందీజగత్తు దృశ్యరూపముగను, సత్యముగను భాసించుటచే నాతనికి పూర్వకాలాను భూతపదార్థముల స్మృతియు సత్యముగను తోచునుగావున, అతఁడా పదార్థములందు తన్మయుఁడగుటచే నిర్వికారముగ నుండఁజాలఁడు.

న మోక్షోపాయకథనం నచ జానామి తత్స్థితిమ్
సందేహాదివ జిజ్ఞాసుస్తావన్మోక్షకథోచ్యతే. 31
యావద్దృశ్యం స్మృతిశ్చైవ సంస్మృతిశ్చాస్య శామ్యతి

తత్త్వజ్ఞానికొఱకై మోక్షోపాయమునుగూర్చిన కథన మావశ్యకములేదు. మఱియు, అజ్ఞాని యొక్క యనుభవము ననుసరించి తత్త్వజ్ఞానియొక్క స్థితియెట్టిదో నేనెఱుఁగను. ఆ యజ్ఞానియు

సౌభాగ్యవశమున సాధనచతుష్టయసంపత్తి సహితుఁడగుటచే సందేహమువలన జిజ్ఞాసువై దేనిని గూర్చి యడుగునో, అట్టి మోక్షకథారూపమగు అర్థానిని గురు వాతనికి దృశ్యశాంతియగు వఱకు నుపదేశించును. దృశ్యము శమింప అవిద్యచే నుత్పన్నములైన స్మృత్యాదు లాతనికి స్వయముగనే శమించును.

అవిద్యాయాస్తు మౌర్ఖ్యస్య విమోహస్యాత్యసంభవాత్. 32
అజ్ఞస్థో నిశ్చయోఽస్మాకం న కదాచన గోచరః
యచ్చ యద్విషయే నాస్తి త న్నైవానుభవత్యసౌ. 33
రజన్యనుభవో భానోర్భవత్యఙ్గ కథం వద

ప్రియుఁడవగు రామచంద్రా! తత్త్వజ్ఞానులయొక్క స్థితి నెట్లెఱుఁగరో, అట్లే అవిద్యయు, తజ్జనితమగు మూర్ఖత్వమున్ను, మోహమున్ను సర్వథా అసంభవములగుటఁబట్టి (తత్త్వజ్ఞులమగు) మేమున్ను అజ్ఞానుల హృదయమందలి నిశ్చయ మెపుడును నెఱుఁగము. ఏలయనిన, ఏ పదార్థము దేనియొక్క విషయముకాదో (నేత్రమునకు శబ్దమువలె), అది దానిచే నెన్నఁడును ననుభవింపఁబడఁ జాలదు. ప్రియుఁడవగు రామచంద్రా! సూర్యునకు రాత్రియొక్క యనుభవమెట్లగునో వచింపుము!

భాతం వస్తుస్వరూపాత్మ చిన్మాత్రే కించిదేవ యత్. 34
తదభ్యస్తార్థసాదృశ్యాత్తత్సంస్కార ఇతి స్మృతమ్

అంతఃకరణసహిత చైతన్యమున బాహ్యవస్తు స్వరూపమెయ్యది భాసించుచున్నదో అదియే మరల మరల వ్యవహారముద్వారా అభ్యస్తమై చిత్తమందు దృఢముగ నాటుకొని, తత్పదార్థ సదృశముగ వాసనారూపమైయుండుటవలన అది సంస్కారమని చెప్పఁబడినది.

ఆత్మస్వభావభూతానామపి చిద్వ్యోమరూపిణామ్. 35
సర్వేషాం పరికల్ప్యానామాభాసేఽప్యనవస్థితేః
ఏవం న సంభవత్యేవ జగత్కించిత్కదాచన. 36

కాని, తత్త్వజ్ఞానులయొక్క దృష్టియందు, అట్టి సమస్త పరికల్పిత పదార్థములున్ను (అధిష్ఠానదృష్టిచే) ఆత్మస్వభావభూతములై, చిదాకాశరూపములై వర్తించుటచే నయ్యవి (దృశ్య రూపముచే) బాధితములగుటఁబట్టి, దగ్ధపటన్యాయముగ ఆభాసరూపముగ మన్నప్పటికిని వాస్తవ ముగ లేకయేయుండుటవలన వానియొక్క సాదృశ్యమున్ను వారి చిత్తమునుండి తుడిచివేయఁ బడినది. గావున సంస్కారము తత్త్వవేత్తల కెన్నఁడును సంభవింపఁజాలదు. ఈ ప్రకారముగ వారికి జగత్తొకింతైనను నెపుడును సంభవింపకయే యున్నది.

దృష్టం మృగతృష్ణావామ్బు నతు తత్పరమార్థతః
యదా త్వయం తదా స్వప్నే సర్గాదౌ చావభాసతే. 37

ఎపుడు మృగతృష్ణాజలమున్ను, స్వప్నాదులందలి పదార్థములున్ను వాస్తవముగ లేనివైనను కానుపించుచునేయున్నవో, అపుడిఁక, ఈ సృష్టియు లేనిదైనను సృష్ట్యాదియందు భాసించుచున్నదని నిశ్చితమగుచున్నది

చిద్వ్యోమైవ పరం సర్గావర్యాయం స్వాత్మని స్థితమ్
చిద్వ్యోమైవేత్థమాభాతం న చ్యుతం సత్స్వరూపతః. 38

పరమాత్మరూపమగు చిదాకాశమే తనయందిట్లు జగద్రూపముగ స్థితినొందియున్నది. కావున చిదాకాశము సృష్టియొక్క పర్యాయమేయైయున్నది. చిదాకాశమే తన సత్స్వరూపము నుండి చ్యుతినొందక యిట్లు జగద్రూపముగ భాసించుచున్నది.

ఆత్మనాత్మని రూపం వా సద్రూపమివ సంస్థితమ్
సర్గాదావేవ కచితే మిథ్యా కచదపి స్థితమ్. 39

బ్రహ్మము తనయందు తానే యిట్లు జగద్రూపముగ భాసించుచునున్నది. లేక, మిథ్యగా భాసించునదియు, అసద్రూపమునగు ఈ జగత్తువలె సృష్ట్యాదియందు బ్రహ్మము స్థితినొందియున్నది.

అతః కుతః క్వచిన్నామ హేయాదేయాది భాసనమ్
నేదమాకారవత్కించిన్నాపి స్మృత్యాత్మకం క్వచిత్. 40

అంతయు బ్రహ్మరూపమే యగుటచే నిఁక నిందు గ్రాహ్యముయొక్కగాని త్యాజ్యము యొక్క గాని భాసనమెచట? బ్రహ్మరూపమగు ఈ జగత్తునందెచటను, ఆకారవంతమైనదిగాని, స్మృత్యాదులుగాని సంభవింపనేరవు.

కారణాభావతో భాతి స్వరూపం పరమాత్మనః
ఆకారవత్త్వే యద్దుఃఖం భవేత్స్మృత్యాం తదేవ చ. 41

నిమిత్తాది కారణములయొక్క అభావముచే పరమాత్మయొక్క స్వరూపమే యిట్లు జగత్తుగ భాసించుచున్నదగును. ఈ జగత్తును సాకారమని నమ్మిన, పుత్రాది సాకారపదార్థముల మరణముయొక్క స్మృతియందువలె దీనియొక్క స్మృతియందును దుఃఖము కలుగును.

ద్వయమేతదసత్తస్మాద్బన్ధో నామ న విద్యతే
చిద్వ్యోమ్ని ఖే భూతవ్యోమాభే శూన్య ఏవ యథాస్థితమ్. 42

ఈ జగత్తుయొక్క ఆకారమున్ను, దాని స్మృతియు రెండును మిథ్యయైయున్నవి. కాబట్టి వాస్తవముగ బంధమనునదియే లేదు. భూతాకాశమున నీలత్వమువలె, చిదాకాశమున ఈ జగత్తున్ను శూన్యరూపముగనే వర్తించుచున్నది.

స్థితం స్వరూపమజహద్భువనార్కాచలాదికమ్
యథా స్థితో౽గ్రదిక్కాలం జగత్స్వం రూపమత్యజత్. 43

స్వప్నమున చిదాత్మ నిజస్వరూపమును త్యజింపకయే విశాలదిక్కాలాదిసహిత జగద్రూపముగ భాసించునట్లు, పరబ్రహ్మము తన శుద్ధ సచ్చిదానందస్వరూపమును త్యజింపకయే సూర్య, చంద్ర పర్వతాదిరూపములుగ స్థితినొందియున్నది.

స్వమేవాత్యజతో రూపంచిద్వ్యోమ్న ఉదరే స్థితమ్
స్వానుభూత్యేకమాత్రాత్మ ప్రమాతృస్వాప్నవత్తనమ్. 44

అపృథ్వ్యాది కుతస్తత్ర కిల పృథ్వ్యాదయో వద
తద్భాతి కేవలం శాన్తం చిదాకాశం తదాత్మని. 45

ఓ రామచంద్రా! తనశుద్ధస్వరూపమును వ్యజింపనటువంటి చిదాకాశముయొక్క యుదరముననున్నదియు, స్వానుభవమాత్ర స్వరూపమైనదియునగు - ద్రష్టయొక్క స్వప్నపట్టణమున వాస్తవముగ పృథ్వ్యాదులు లేకున్నను ఎటనుండి వచ్చుచున్నవో చెప్పుము? కేవలము శాంతమగు చిదాకాశమే తనయందట్లు జగద్రూపముగ భాసించుచున్నదగును.

సర్వాదౌ స్వప్నకాలే చ పృథ్వ్యాదేః సంభవః కుతః
ఉద్భాయేవ జగద్రూపా ద్బ్రహ్మసత్తాత్మనాత్మని. 46

సృష్ట్యాదియందును స్వప్నకాలమునను, కారణాభావముచే నిక పృథ్వ్యాదుల సంభవమెచట? బ్రహ్మసత్తయే యిట్లు తనయందు జగద్రూపముగ భాసించుచున్నది

కరోతి పృథ్వ్యాద్యభిధాః పశ్చాత్సత్యార్థదా ఇవ
న స్మృత్యాత్మ న సాకారం పృథ్వ్యాదీనామసంభవాత్
న భ్రాన్తిర్న వివర్తాది జగద్బ్రహ్మాత్మ కేవలమ్. 47

పరమాత్మయే హిరణ్యగర్భ (సమష్టిమనస్సు) రూపమును ధరించి సృష్టియొక్క కల్పనానంతరము సత్యమగు అర్థ మొసంగువానివంటివాఁడై పృథ్వ్యాది అనేక సంజ్ఞలను గావించుచున్నారు. కాని వాస్తవముగ పృథ్వ్యాదులు అసంభవములగుటచే ఈ జగత్తు బ్రహ్మదేవుని స్మృతిరూపము కాదు, సాకారముకాదు, భ్రాంతికాదు, వివర్తాదిమయముకాదు; కేవలము బ్రహ్మరూపమేయైయున్నది;

బ్రహ్మేదమాకచతి చారుజగత్స్వరూపం
తచ్చైకమేవ కచనాకచనాత్మనిష్ఠమ్
దృశ్యాభమప్యమలమేవ నభః ప్రశాన్తమ్
నిత్యోదితం ప్రలయసర్గమయోదయాత్మ. 48

ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే ఉత్తరార్ధే జగతో బ్రహ్మత్వప్రతిపాదనం నామ ద్విసప్తత్యధికశతతమః సర్గః ॥ 172 ॥

ఓ రామచంద్రా! సృష్టిప్రళయములందుఁదనయొక్క నిర్వికారచిత్స్వభావమందే వెలయునట్టి యీ బ్రహ్మమే రమణీయమగు ఈ జగత్స్వరూపముగ భాసించుచున్నది. ఇట్లు సృష్టి, ప్రళయాత్మకమగు దృశ్యరూపముగ భాసించినప్పటికిని అయ్యది యేకమై నిర్మలమై, ప్రశాంతమై, నిత్యోదితమైనట్టి చిదాకాశముగనే వెలయుచున్నది.

ఇది శ్రీవాసిష్ఠతాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున నుత్తరార్ధమున జగతోబ్రహ్మత్వ ప్రతిపాదనమను నూటడెబ్బదిరెండవ సర్గము ॥ 172 ॥



## త్రిసప్తత్యధికశతతమః సర్గః

[యథా చితోఽపి దేహాది జడభావక్రియాగ్రహః
యథా సర్వాత్మకత్వం చ తథేహ ప్రతిపాద్యతే.

చైతన్యమున్ను నెట్లు దేహాది జడరూపమును గ్రహించునో చైతన్యమునకు సర్వరూపత్వ మెట్లుగలదో యిచటఁ దెలుపఁబడుచున్నది.]

**శ్రీరామ ఉవాచ:—**

సర్వానుభవరూపస్య తథా సర్వాత్మనోఽవ్యయమ్
అనన్తస్యాత్మతత్త్వస్య దేహేఽపి కిమహంగ్రహః. 1

శ్రీరాముఁడు:— ఓ మునీంద్రా! ఇట్లు, సర్వానుభవరూపమై, అనంతమై, సర్వస్వరూపమైనట్టి ఆత్మ (చైతన్యము)యొక్క చమత్కారమే యీ జగత్తైయున్నదో, ఆత్మ సర్వత్ర సమముగనే వర్తించును గావున నిఁక నద్దానిని దేహమందే 'అహం' (నేనను) భావమునుగూర్చిన పట్టుదల యేల? సర్వత్ర యట్టి 'అహం' భావమునుగూర్చిన పట్టుదల లేకుండుటేల?

చితః పాషాణకాష్ఠత్వం స్వప్నాదిషు కథం భవేత్
ఇదం పాషాణకాష్ఠాది కథం నాస్త్యస్తి వా కథమ్. 2

స్వప్నాదులందు చైతన్యము చిత్స్వభావ విరుద్ధములగు కాష్ఠశిలాదిరూపములనేల గ్రహించుచున్నది? ఏలయనిన చైతన్యమునకు చిద్రూపముయొక్క త్యాగము, అచిత్ (జడ) రూపముయొక్క గ్రహణము సంభవింపనేరదు గదా! మఱియు నెపుడు చైతన్యమే సర్వరూపమై యున్నదో, అపుడిఁక కాష్ఠశిలాదులు 'లేవు' అనుటయు నెట్లు సంగతమగును? ఏలయనఁగా, చైతన్యమునకు 'లేదు' (అసద్రూపము) అనునది సంభవింపదుగదా. కాష్ఠశిలాదులు చిత్స్వభావ విరుద్ధములైన జడరూపములు గనుక నవి 'కలవు' అనుటయు నెట్లు సంభవించును? కాఁబట్టి చైతన్యమునకు సర్వరూపత్వ మెట్లు సిద్ధించును?

**శ్రీ వసిష్ఠ ఉవాచ:—**

శరీరిణో యథా హస్తే హస్తతాయాం యథాగ్రహః
సర్వాత్మనస్తథా దేహే దేహతాయాం తథాగ్రహః. 3

శ్రీవసిష్ఠుఁడు:— ఓ రామచంద్రా! 'దేహధారియగు జీవునకు శరీరమందంతటను 'అహం' భావము సమానముగనున్నను, హస్తమందే హస్తమునుగూర్చిన అహంభావన, పాదమందే పాదమును గూర్చిన అహంభావన, యెట్లు గలుగుచున్నదో, అట్లే సర్వరూపమగు చైతన్యమునకున్ను దేహమందే దేహమునుగూర్చిన అహంభావన గలుగుచున్నది.

పాదపస్య యథా పత్రే పత్రతాయాం యథాగ్రహః
సర్వాత్మనస్తథా వృక్షే వృక్షతాయాం తథాగ్రహః. 4

వృక్షాభిమానియగు జీవునకు వృక్షమందంతటను 'అహం' భావము సమముగనున్నను, పత్రమందే పత్రమునుగూర్చిన అహంభావమెట్లుగలదో, అట్లే సర్వరూపమగు చైతన్యమునకున్ను వృక్షమందే వృక్షమునుగూర్చిన అహంభావము గలదు.

ఆకాశస్య యథా శూన్యే శూన్యతాయాం యథా గ్రహః
సర్వాత్మనస్తథా ద్రవ్యే ద్రవ్యతాయాం తథా గ్రహః. 5

ఆకాశాభిమానియగు జీవునకు శూన్యమందే శూన్యత్వమునుగూర్చిన అహంభావమెట్లు గలదో, అట్లే సర్వాత్మయగు చైతన్యమునకున్ను (మణి, సువర్ణాది) ద్రవ్యమందే ద్రవ్యత్వమును గూర్చిన అహంభావముగలదు.

స్వాప్నోచితః స్వప్నపురే రూపతాయాం యథా గ్రహః
సర్వాత్మనస్తథా స్వప్నజాగ్రదాదౌ తథా గ్రహః. 6

నిరాకారయోగ్యమగు స్వప్నపురమున స్వప్నద్రష్టకు రూపత్వమునుగూర్చిన అహంభావ మెట్లుగలదో, అట్లే సర్వరూపమగు చైతన్యమునకున్ను స్వప్న, జాగ్రదాదులందే స్వప్న జాగ్రదాదు లంగూర్చిన అహంభావముగలదు.

యథా గేన్ద్రే దృషద్వృక్షవార్యాదౌ స తథా గ్రహః
తథా సర్వాత్మనోఽగేన్ద్రపురతాయాం తథా గ్రహః. 7

మహాపర్వతాభిమానియగు జీవునకు శిలా, వృక్ష, జలాదులందే క్రమముగ నాయాశిలాత్వ వృక్షత్వజలత్వాదులంగూర్చిన అహంభావమెట్లుగలదో, అట్లే సర్వాత్మయగు చైతన్యమునకున్ను మహాపర్వత, పురములందే క్రమముగ మహాపర్వతత్వ పురత్వములంగూర్చిన అహంభావముగలదు.

శరీరస్య యథా కేశనఖాదిషు యథా గ్రహః
సర్వాత్మనస్తథా కాష్ఠదృషదాదౌ తథా గ్రహః. 8

చేతనరూపమగు శరీరమునకు కేశ, నఖాదులందు, అచేతనత్వమునుగూర్చిన పట్టుదలయే యెట్లుగలదో, అట్లే సర్వరూపమగు చైతన్యమునకున్ను, కాష్ఠశిలాదులందు, అచేతనత్వమునుగూర్చిన పట్టుదలయేగలదు.

చిత ఏవ యథా స్వప్నే భవేత్కాష్ఠోపలాదితా
చిదకాశస్య సర్గాదౌ తథైవావయవాదితా. 9

స్వప్నమున, అవయవరహితమగు చైతన్యమే కాష్ఠశిలాద్యవయవరూపమును, జడత్వ మును ధరించునట్లు, సృష్ట్యాదియందును, అవయవరహితమగు చిదాకాశమే అవయవత్వ. జడత్వా దులను ధరించుచున్నది.

చేతనాచేతనాత్మైకం పురుషస్య యథా వపుః
నఖకేశ జిలాకాశ ధర్మమాకార భాసురమ్. 10

చేతనాచేతనాత్మైకం తథా సర్వాత్మనో వపుః
జఙ్గమం స్థావరమయం శిలం తు నిత్యమనాకృతి. 11

మనుజునిశరీరమెట్లు నఖ, కేశ, జల ఆకాశాదిధర్మయుక్తమై, శోభాయమానమగు ఆకారము గలదై, చేతన, అచేత నాత్మకమై విలసిల్లుచున్నదో, అట్లే సర్వరూపుఁడగు పరమాత్మ యొక్క శరీరమగు ఈ జగత్తున్ను స్థావర, జంగమ, చేతన, అచేతనమయమై, భాసించుచున్నది. అయినను, వాస్తవముగ నదియంతయు పరమాత్మవలెనే నిరాకారమై, శాశ్వతమై యొప్పుచున్నది.

యథా స్థితం శామ్యతీదం సమ్యగ్జ్ఞానవతో జగత్
స్వప్నే స్వప్నపరిజ్ఞాతుర్యథా దృష్టార్థసంభ్రమః. 12

మేల్కొనినవానికి స్వప్నమందుఁ దానుగాంచిన పదార్థభ్రమయంతయు నెట్లు శమించుచున్నదో, అట్లే యీ జగత్తున్ను నెప్పటియట్లున్నప్పటికిని, సమ్యక్—జ్ఞానము గలవానికి శమించిపోవుచున్నది.

చిన్మాత్రాకాశమేవేదం న ద్రష్టాస్తి న దృశ్యతా
ఇతి మౌనమలం స్వప్నద్రష్టుర్యత్వా ప్రబుద్ధతా. 13

స్వప్నద్రష్టయొక్క ప్రాతఃకాలమందలి ప్రబుద్ధరూపత్వమేదిగలదో, అదియే 'ద్రష్టలేఁడు, దృశ్యత్వములేదు, ఇదియంతయును, మౌనరూపమగు చిన్మాత్రాకాశమే' అను నిశ్చయమును చాటుటయందు మహాసమర్థమైయున్నది.

కల్పకోటి సహస్రాణి సర్గా ఆయాన్తి యాన్తి చ
త ఏవాన్యే చ చిద్వ్యోమ్ని జలావర్తా ఇవార్ణవే. 14

సముద్రమందు జలముయొక్క అనేక ఆవర్తము లుత్పన్నములై విలీనమగునట్లు చిదాకాశమందును అనేకకోట్ల సృష్టులు అదేవిధముగనున్నవియు, భిన్నరూపములుగలవియు, నుత్పన్నములై, విలీనములగుచున్నవి. కాని, దానిచే అధిష్ఠానముయొక్క ఏకరూపత్వమున లేశహానియునులేదు.

కరోత్యబ్ధౌ యథోర్మ్యాదౌ నానాకచకచం వపుః
చిత్కరోతి తథా సంజ్ఞాః సర్గాద్యాశ్చేతనే నిజే. 15

సముద్రమందు జలము తరంగాది వివిధరూపములుగ తన శరీరమును స్ఫురింపఁజేయునట్లు, చైతన్యమున్ను తన చిత్స్వరూపమున సృష్ట్యాద్యనేక సంజ్ఞలను రచించుచున్నది.

యథా స్థితమిదం విశ్వం బ్రహ్మైవానామయం సదా
తత్త్వజ్ఞం ప్రత్యతత్త్వజ్ఞ జనతానిశ్చయాదృతే. 16

అజ్ఞానుల నిశ్చయమువలెఁగాక, జ్ఞానికి, యథారీతి స్థితిగల్గియున్న యీ ప్రపంచమంతయును సదా నిర్వికారమగు పరబ్రహ్మమేయైయున్నది.

నాహం తరఙ్గః సలిలమహమిత్యేవ యుక్తితః
బుద్ధం యేన తరఙ్గేణ కుతస్తస్య తరఙ్గతా. 17

'నేను తరంగముగాను, జలమును, అని యట్లు ఏతరంగము యుక్తిచే నెఱిఁగినదో, అద్దానికిఁక తరంగత్వమెచట ?

బ్రహ్మణోఽస్య తరఙ్గత్వ మివాభానం యత స్తతః
తరఙ్గత్వా తరఙ్గత్వే బ్రాహ్మ్యా శ క్తిస్థితిం గతే. 18

ఈ జగత్తు బ్రహ్మమను సముద్రము (జలము) యొక్క తరంగమువలె భాసించుచున్నది. గావున, తరంగత్వ, అతరంగత్వములు, అనఁగా జగత్తు, జగత్తుయొక్క అభావమున్ను బ్రహ్మము యొక్క శక్తిచేతనే స్థితిని బొందినవగును.

చిద్వ్యోమ్నోఽత్యజతో రూపం స్వప్నవద్వ్యస్తవేదనమ్
తదిదం హి మనో రామ బ్రహ్మేత్యుక్తః పితామహః. 19

ఓ రామచంద్రా! చిదాకాశముయొక్క తన శుద్ధస్వరూపమును త్యజింపకయే స్వప్నమందువలె పరస్పర ధర్మవినిమయముద్వారా వ్యత్యాసమొందిన చేతనభావమైనట్టి సమష్టిమనస్సహితమగు రూపమేదిగలదో, అదియే మనస్సు, బ్రహ్మదేవుఁడు పితామహుఁడు మున్నగుపేర్లచే జెప్పఁబడినది.

ఏవమాద్యః ప్రజానాథో నిరాకారో నిరామయః
చిన్మాత్రరూపసంకల్పపురవత్కారణోజ్ఝితః. 20

ఈ ప్రకారముగ ఆదిప్రజాపతి నిరాకారుఁడై, నిర్వికారుఁడై, సంకల్పపురమువలె కారణరహితుఁడై, చిన్మాత్రరూపుఁడై వెలయుచున్నాఁడు.

యేనాఙ్గదత్వం నాస్తీతి బుద్ధం హేమాఙ్గదేన వై
అఙ్గదత్వం కుత స్తస్య తస్య శుద్ధైవ హేమతా. 21

ఏ సువర్ణాంగదము (భుజభూషణము) నాకు. అంగదత్వము లేదు అని యెఱిఁగినదో, దానికిఁక అంగదత్వమెచట ? శుద్ధ సువర్ణత్వమే దానికపుడు కలదు.

అజే సంకల్పమాత్రాత్మ చిన్మాత్రవ్యోమదేహిని
అహం త్వం జగదిత్యాది యద్విభాతం తదేవ తత్. 22

సంకల్పస్వరూపుఁడును, చిన్మాత్రాకాశ దేహధారియు, జన్మరహితుఁడునగు బ్రహ్మదేవునియందు, అహంత్వము ('నేను' అనుభావము), జగత్తు మున్నగు వానిరూపముతో నేది భాసించుచున్నదో, అది చిన్మాత్రరూపుఁడగు బ్రహ్మదేవునియొక్క స్వరూపమేయైయున్నది.

చిచ్చమత్కృతయో భాన్తి యాశ్చిద్వ్యోమని శూన్యతాః
ఏతాస్తాః సర్గసంహారస్థితిసంరమ్భసంవిదః. 23

చిదాకాశమున శూన్యరూపములగు ఏ చైతన్య — చమత్కృతులు భాసించుచున్నవో, అవియే యీ సృష్టి, స్థితి, లయములను సంరంభము (ఆటోపము) ను గూర్చిన యనుభవములై యున్నవి.

అచ్ఛం చిన్మాత్రనభసః కచనం స్వయమేవ తత్
స్వప్నాభం చిత్తతామాత్రం స ఏష ప్రపితామహః, 24

చిన్మాత్రాకాశముయొక్క, నిర్మలమైనదియు, స్వప్నతుల్యమైనదియు, చిత్తత్వమాత్రమై, యొప్పునదియునగు స్వయం స్ఫురణమేదిగలదో, అదియే యీ బ్రహ్మదేవుఁడు

యథా తరఙ్గస్తేనైవ రూపేణాన్యేన వాఽనిశమ్
స్ఫురత్యేవమనాద్యన్తః సర్గప్రలయవిభ్రమః. 25

జలము అదేవిధమైనట్టిగాని, లేక మఱియొక విధమైనట్టిగాని తరంగరూపముగ సదా స్ఫురించుచుండునట్లు, ఆద్యంతరహితమగు చిద్రూపమున్ను సృష్టి, ప్రళయ విభ్రమరూపముగ స్ఫురించుచున్నది.

చిద్వ్యోమ్నః కచనం కాన్తం యద్విరాడితి శబ్దితమ్
భవేత్సంకల్పపురవత్తస్య కుర్యాన్మనోఽపి వై. 26

'విరాట్' అను పేరుచేఁ బ్రసిద్ధమైనట్టి హిరణ్యగర్భ రూపమగు మనస్సున్ను, దానిచే నిర్మితములగు భువన, భూత సమూహాదులున్నుగూడ సంకల్పనగరమువలె చిదాకాశముయొక్క నిర్మల స్ఫురణమాత్రములే యైయున్నవి.

సర్గః స్వప్నః స్వప్న ఏవ జాగ్రద్దేహః స ఏవ చ
ఘనం సుషుప్తం తైమిర్యాద్యథా సంవేదనం భవేత్. 27

(చిదాకాశరూపుఁడగు) ఆ విరాట్టే సృష్టి; అతఁడే స్వప్నము; ఆ స్వప్నమే జాగ్రద్వ్యష్టి, సమష్టి దేహరూపమును ధరించినది. ఘనీభూతమగు సుషుప్తి నిద్రాతిశయరూపమగు అంధకారమువలన స్వప్నానుభవ మెట్లగునో, అట్లే ప్రళయమందు, అవిద్యాంధకారముచే ఆవృతమగు ఆత్మయే జగదనుభవమగును.

తస్య కల్పాన్తరజనీ శిరోరుహతయోదితా
ప్రకాశతమసీ కాలక్రియాఖ్యాః స్వాఙ్గసంధయః. 28
తస్యాగ్నిరాస్యం ద్యౌర్మూర్ధా ఖం నాభిశ్చరణౌ క్షితిః
చన్ద్రార్కౌ దృగ్ దిశౌ శ్రోత్రే కల్పనేతి విజృమ్భితా. 29

ఆ విరాడ్రూపుఁడగు పరమాత్మకు, కల్పాంతమందలి రాత్రి, అవాంతర ప్రళయములు కేశములవలె నుదయించినవి; దిన, రాత్రులు, కాల, క్రియలు, అతని అవయవసంధులు; అగ్ని యాతని ముఖము, స్వర్గము, శిరస్సు; ఆకాశము నాభి; భూమి పాదములు, చంద్రసూర్యులు నేత్రములు; దిక్కులు చెవులు. ఈ ప్రకారముగ మనఃకల్పనయే విరాడ్రూపముగ విజృంభించినది.

ఏవం సమ్యగ్దృశ్యమానో వ్యోమాత్మా వితతాకృతిః
అన్యత్సంకల్పశైలాభో విరాడ్ స్వప్నాకృతి స్థితః. 30

అట్లు బాగుగ, గన్పించుచున్నప్పటికిని విశాలరూపుఁడగు విరాడ్భగవానుఁడు వాస్తవముగ మనయొక్క స్వప్నపర్వతమువలెను, లేక స్వప్నాకారముగనే స్థితినొందియున్నాఁడు. కాఁబట్టి పరమార్థముగ నాతఁడు ప్రపంచరహితుఁడై చిదాకాశరూపుఁడేయై యున్నాఁడు.

యచ్చ చేతచ్చిదాకాశే స్వయం కచకచాయతే
తదేతజ్జగదిత్యేవం తేనాత్మైవానుభూయతే. 31

ఎయ్యది చిదాకాశమున చేతనాత్మకమగు జీవరూపమునుబొంది స్వయముగ అతిశయ రూపమునఁ బ్రకాశించుచున్నదో, అదియే యీ జగత్తు. కావున, దానిచే చిదాకాశరూపమగు ఆత్మయే యనుభవింపఁ బడుచున్నదగుచున్నది.

విరాడాత్మైవమాకాశం భాతి చిన్మయమాతతమ్
స్వభావస్వప్ననగరం నగనాగమయాత్మకమ్. 32

ఈ ప్రకారముగ సర్వవ్యాపకమైన చిన్మయాకాశమే పర్వత, సర్పాదియుక్తమగు స్వప్న నగరమువలె, యీ విరాడ్రూపముగ భాసించుచున్నది

అనుభవితైవానుభవం సత్యం స్వాత్మానమప్యసత్తమివ
అనుభవతీయత్త్వేన స్వప్ననటః స్వప్నదేశమివ. 33

స్వప్నమును బొందిన నటుఁడు తన్నే తనకంటెవేరైన నాట్య, ప్రేక్షకసమాజ పరిపూర్ణ మగు స్వప్నప్రదేశముగఁ గల్పించుకొని యట తన నాట్యమును తానే స్వయముగ ననుభవించు నట్లు, అనుభవకర్తయగు చిదాత్మయే, అనుభవైకరసమై, సత్యమైనట్టి స్వస్వరూపమును మాయా వరణముచే లేనిదానివలె నొనర్చి పరిచ్ఛిన్నమగు ప్రపంచరూపముగ నద్దాని ననుభవించుచున్నది.

వేదాన్తార్హతసాంఖ్యసౌగతగురుత్రయ్యాదిసూక్తా దృశో
బ్రహ్మైవ స్ఫురితం తథాత్మకలయస్తాదాత్మ్యనిత్యం యతః
తేషాం చాత్మవిదోఽనురూపమఖిలం స్వర్గం ఫలం తద్భవ
త్యస్య బ్రహ్మణ ఈదృగేవ మహిమా సర్వాత్మ యత్తద్వపుః. 34

ఇత్యార్షే శ్రీవాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు
నిర్వాణప్రకరణే ఉత్తరార్ధే బ్రహ్మగీతాసు పరమార్థోపదేశో నామ
త్రిసప్తత్యధిక శతతమః సర్గః ॥ 173 ॥

వేదాంతులు, అర్హతులు, సాంఖ్యులు, సౌగతులు (సౌత్రాంతిక, వైభాషిక, యోగాచార మాధ్యమికులు), వీరి గురువులగు వ్యాస, అర్హత్, కపిల, పతంజలి, బుద్ధులు, పాశుపత, గాణాపత్య, వైష్ణవ, శాక్త మతములయొక్క ప్రవర్తకులైన ఆచార్యులు, తమ తమ శాస్త్రములం దేయేధర్మములను ప్రతిపాదించిరో, వాని యన్నింటియొక్క రూపముచే వారి వారి వాసనానుసారము మనయొక్క బ్రహ్మమే స్ఫురించినదగును. మఱియు, ఆ యా వాదులయొక్క నిశ్చయానుకూలములగు ఐహిక, పారలౌకిక (స్వరాది) ఫలములన్నియుఁగూడ, ఆ బ్రహ్మమేయగును. ఏలయనఁగా, ఆయా వాదులు తమ ఆత్మయందే ఆయా ఫలసిద్ధినిగూర్చి భావించి వానిఁబొందిరి. బ్రహ్మముయొక్క (మాయా కబలిత) స్వరూపము సర్వాత్మకమై, సర్వుల వాసనానుసారము, ఆయా శరీరములను ధరించి, ఆయా ఫలముల నన్నింటిని సిద్ధింపఁజేయుచున్నది. బ్రహ్మముయొక్క మహిమ యిట్టిదేయైయున్నది.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున నుత్తరార్ధమున బ్రహ్మగీతలందు పరమార్థోపదేశమను నూటడెబ్బదిమూడవ సర్గము ॥ 173 ॥



## చతుః సప్తత్యధిక శతతమః సర్గః

[స్వప్నస్యేవ ప్రబోధేన కృతే దృశ్యస్య మార్జనే
పరిశిష్టశ్చిదాత్మైకో వర్ణ్యతేఽత్ర పరం పదమ్.

మేల్కొనినపిదప స్వప్నపదార్థములయొక్క మార్జనము (తుడుపు) అగునట్లు, జ్ఞానముచే దృశ్యముయొక్క మార్జనముకాఁగా, పరమపదమగు చిదాత్మయే శేషించునను విషయమిచట వర్ణింపఁబడుచున్నది.]

**శ్రీ వసిష్ఠ ఉవాచ :—**

సర్గాదౌ స్వప్నసంవిత్త్యా చిదేవాభాతి కేవలా
జగదిత్యవభాసేవ బ్రహ్మైవాతో జగత్త్రయమ్. 1

శ్రీవసిష్ఠుఁడు:— ఓ రామచంద్రా! సృష్ట్యాదియందు కేవల చిన్మాత్రమే స్వప్నానుభవమువలె జగత్తుగ భాసించుచున్నదని నిశ్చయింపఁబడినది గావున, ఈ ముల్లోకములున్ను బ్రహ్మమేయైయున్నవి. (ఇట్టి దృఢజ్ఞానముచే ముక్తి సిద్ధించునని భావము.)

సర్గాన్తరఙ్గా బ్రహ్మాబ్ధేస్తేషు సంవేదనం ద్రవః
సర్గాన్తరం సుఖాద్యాత్మ ద్వైతైక్యాదీతరత్కుతః. 2

బ్రహ్మమను సముద్రమున సృష్టులన్నియును తరంగములైయున్నవి. ఆ సృష్టులయొక్క యనుభవము అద్దాని ద్రవత్వమై యొప్పుచున్నది. అజ్ఞానులదృష్టియందుఁ బ్రసిద్ధమగు దుఃఖమయజగత్తు జ్ఞానముచేఁ దుడిచివేయఁబడినది. గావున నిఁక జీవన్ముక్తులయొక్క వ్యవహారార్థము శేషించు జగత్తు సచ్చిదానందైకరస స్వరూపమైయుండుటఁబట్టి, అటద్వైత, ఏకత్వాది దుఃఖరూపమెట్లుండును?

యథా స్వప్నసుషుప్తాత్మ నిద్రారూపకమేవ ఖమ్
దృశ్యాదృశ్యాంశమేకాత్మరూపం చిన్నభసస్తథా. 3

స్వప్న, సుషుప్తులం దొకదానియందు దృశ్యముండుట, మఱియొకదానియందు లేకుండుట యను నీ భేదమున్నప్పటికిని, ఆ రెంటియందును నిద్రారూపమందే భేదమున్నులేనట్లు, జీవన్ముక్త, విదేహముక్తులందును, ఒకదానియందు దృశ్యము ప్రతిభాసించుట, మఱియొకదానియందు, ప్రతిభాసింపకుండుట యను నీ భేదమున్నప్పటికిని సుఖరూపమగు చిదాకాశముయొక్క స్వరూపమందు భేదములేనందుచే రెంటియొక్క సుఖస్థితి సమానమేయైయున్నది.

జాగ్రతి స్వప్ననగరం యాదృక్తాదృగిదం జగత్
పరిజ్ఞాతం భవేదత్ర కథమాస్థా వివేకినః. 4

జాగ్రత్తునందు స్వప్ననగర మేరీతి భాసించునో, బ్రహ్మము నెఱిఁగినపిదప ఈ జగత్తున్ను ఆ రీతిగనే భాసించును. కావున నపుడు వివేకికి స్వప్నమువంటి యీ జగత్తునందాసక్తి యెట్లుండును?

సర్గాదౌ సర్గసంవిత్తేర్యథా భూతార్థవేదనాత్
జాగ్రతి స్వాప్ననగరం యాదృశం తాదృశం జగత్. 5

స్వప్నాదియందు కారణాభావముచే స్వప్నియుత్పన్నమేకాకయున్నదనియు, చిద్రూపమే యట్లు స్వప్నిగ భాసించుచున్నదనియు. నిట్లు స్వప్నియొక్క యథార్థజ్ఞానము కలుగఁగా జాగ్రత్తు నందు స్వప్ననగరమెట్లు బాధితమగుచున్నదో, అట్లే యీ జగత్తున్ను బాధితమగుచున్నది గాఁబట్టి తత్త్వజ్ఞున కీజగత్తు దుఃఖదాయకము కానేరదు.

జాగ్రతి స్వప్ననగరవాసనా వివిధా యథా
సత్యా అపి న సత్యాస్తా జాగ్రతో వాసనాస్తథా. 6

జాగ్రత్తునందు స్వప్నమందలి వివిధవాసన లెట్లు విద్యమానములైయున్నను, అసత్యము లగుటఁబట్టి దుఃఖప్రదములుకావో, అట్లే జ్ఞానముకలిగిన పిమ్మట, ఈ జగత్తునందలి వాసనలున్ను దగ్ధపట న్యాయముగ జ్ఞానికి క్లేశము కలుగఁజేయఁజాలవు.

అన్యథోపప్రపద్యేహ కల్ప్యతే యది కారణమ్
తత్కిం నేదీయసీ నాత్ర భ్రాన్తతా కల్ప్యతే తథా. 7

ఈ జగత్తు తత్త్వబోధచే స్వప్నమువలె భ్రాంతిమాత్రముగ నిశ్చితమై బాధితమగును కాని, ఈ జగత్తునకు కారణము ప్రధాన, పరమాణ్వాదులని నమ్ముటచే నియ్యది భ్రాంతిమాత్రమని నిశ్చితముకాకపోవుటవలన బాధితముకాకయేయుండును దానిచే దుఃఖము కలుగును. ఇక్కారణమున నట్టి కారణాంతరములకంటె (శ్రుతిప్రసిద్ధమగు స్వప్నాది దృష్టాంతములద్వారా, శీఘ్రముగ లభ్యమగుటచే) అతిసమీపమైనదగు భ్రాంతిమాత్రత్వము జగత్తునకేల కల్పింపఁబడరాదు?

స్వానుభూయత ఏవేయం భ్రాన్తిః స్వప్నజగత్స్వివ
కారణం త్వనుమాసాధ్యం క్వానుమానుభవాధికా. 8

మృత్తికా, తంత్వాదులకంటె ఘట, పటాదులు వేఱుకానట్లును, వాని నామరూపములు అసత్యములైనట్లును, ఈ జగత్తు చైతన్యముకంటె వేఱుకాదు. దీని నామరూపములు భ్రాంతిమాత్రములే యను నీప్రకారముగ స్వప్నజగత్తులందువలె ఈ జగత్తుయొక్క కారణము భ్రాంతియేయని స్వయముగ, ప్రత్యక్షముగ ననుభవింపబడుచున్నందున నిఁక పరమాణ్వాది కారణములయొక్క యనుమానమెట్లు సంగతమగును? ఏలయనిన, ప్రత్యక్షానుభవముకంటె అనుమానము బలవత్తరమై యుండుట యెచటఁగాంచఁబడినది?

దృష్టమప్యస్తి యన్నేశేన చాత్మని విచారితమ్
అన్యథానుపపత్త్యాన్తర్యాన్త్యాత్మ స్వప్నశైలవత్. 9

జగత్తు స్వప్నపర్వతమువలె భ్రాంతిమయమేయను నిర్విషయమున ప్రత్యక్షమగు గుఱుతు కూడ గలదు. అదియేదనిన, జగత్తు భ్రాంతిగాక అన్యమగు కారణము గల్గియున్నచో దానిచే మనుజుఁడు ఇష్టవస్తువునే సృజించుకొనగలఁడు; అనిష్టవస్తువును నివారించుకొనగలడు. మఱియు అకస్మిక దృశ్యము నపుడుగాంచకుండును. కాని అట్లులేదు. కాబట్టి యీ జగత్తు భ్రాంతిమాత్రమే యైయున్నది.

నిర్వికల్పం పరం జాడ్యం సవికల్పం తు సంసృతిః
ధ్యానం తేనసమాధానం న సంభవతి కించన. 10

ఆత్మవిచారశూన్యులును జగత్తును సత్యముగ దలంచువారును, ఆత్మను ఆనంద స్వరూపముగ నమ్మినవారునగుయోగుల నిర్వికల్పసమాధి మహాజడత్వమేయగును. మఱియు, వారి సవికల్పసమాధి సంసారమేయైయున్నది. కావున వారి యధ్యానము వలనను, సమాధివలనను పురుషార్థరూపమగు మోక్షము కలుగనేరదు.

సచేత్యం సంసృతిర్ధ్యానమచేత్యం తూపలస్థితి
మోక్షో నోపలవద్ధ్యానం న వికల్పాత్మకం తతః. 11

ఏలయనిన, వారియొక్క సవిషయకధ్యానము సంసారమేయైయున్నది; నిర్విషయక ధ్యానము శిలవంటి జడస్థితియే యైయున్నది. మోక్షమో, వికల్పాత్మకమగు సంసారరూపముగాని శిలవంటి జడస్థితిగాని కానిదై యొప్పుచున్నది.

న చ నామోపలాభేన నిర్వికల్పసమాధినా
అన్యదాసాద్యతే కించిద్లభ్యతే కిం స్వనిద్రయా. 12

శిలాసదృశమగు ఇట్టి నిర్వికల్పసమాధిచే సాంఖ్యుల అభిమతమగు జడస్థితికంటె అన్యముగ నొకింతైనను లభింపనేరదు. ఏలయనిన, అట్టి సమాధిచే ముక్తి లభించుచో మనుజునకు తనయొక్క నిద్రచేఁగూడ ముక్తి లభింపవలసియుండును.

తస్మాత్సమ్యక్పరిజ్ఞానాద్భ్రాన్తిమాత్రం వివేకినః
సర్గాత్యన్తాసంభవతో యో జీవన్ముక్తతోదయః. 13

నిర్వికల్పం సమాధానం తదనన్తమిహోచ్యతే
యథా స్థిత మవిక్షుబ్ధమాసనం సర్వభాసనం. 14

తదనన్తసుషుప్తాఖ్యం తత్తురీయమితి స్మృతమ్
తన్నిర్వాణమితి ప్రోక్తం తన్మోక్ష ఇతిశబ్దితమ్. 15

కాఁబట్టి ఉత్తమ ఆత్మజ్ఞానముద్వారా, ఈ జగత్తు భ్రాంతిమాత్రమేయనియు, ఆత్మ నిరతిశయానందసచ్చిదేకరసస్వరూపమనియు నిశ్చయించుటచే జగత్తుయొక్క అత్యంతాభావము సంభవించుటవలనను, భ్రాంతిహేతువగు అజ్ఞానావరణక్షయముచే భ్రాంతి నశించుట వలనను, ఆత్మసాక్షాత్కార మగుటవలనను, వివేకికి జీవన్ముక్తత్వ మెయ్యది యుదయించుచున్నదో, అదియే నిర్వికల్పసమాధియనియు, అనంతమగు నిర్వాణమనియుఁ జెప్పబడుచున్నది, మఱియు నదియే వికార రహితముగ స్వస్వరూపమున నెప్పటియట్లు స్థితిగల్గి సమస్తమును ప్రకాశింపఁజేయుటయు నగును. అట్టి చిత్స్వరూప మాత్రస్థితియే, అనంతసుషుప్తియనియు, తురీయమనియు, నిర్వాణమనియు, మోక్షమనియుఁగూడ పేర్కొనఁబడుచున్నది.

సమ్యగ్బోధైకఘనతా యాసౌ ధ్యానమితి స్మృతమ్
దృశ్యాత్యన్తా సంభవాత్మ బోధమాహుః పరంపదమ్. 16

సమ్యగ్జ్ఞానైకఘనత్వమే ధ్యానమనియు, దృశ్యముయొక్క అత్యంతభావ పూర్వకమగు ఆత్మజ్ఞానమే పరమపదమనియు వచింపఁబడినది.

తచ్ఛ్నోపల వజ్జాడ్యం న సుషుప్తోపమం భవేత్
న నిర్వికల్పం న చ వా సవికల్పం న వాప్యసత్. 17

అట్టి నిరతిశయానందరూపస్థితి శిలవంటి జడత్వముకాదు; ప్రకృతివిలయమువంటి సుషుప్తి రూపముకాదు; నిర్వికల్పతామాత్రముకాదు; సవికల్పముకాదు; అసత్, నైరాత్మ్యరూప మగు శూన్యమున్ను గాదు.

దృశ్యాత్యన్తాసంభవాత్మ తదేవాద్యం హి వేదనమ్
తత్పర్వం తన్న కించిచ్ఛ తద్వదేవాఙ్గ వేత్తితత్. 18

ప్రియుఁడవగు రామచంద్రా! దృశ్యము (నామరూపములు) యొక్క అత్యంతాభావ పూర్వకముగ ఇది యంతయు అద్వయస్వరూపమగు బ్రహ్మమే, శుద్ధ బ్రహ్మమే నేను అనునీప్రకార మగు దృఢానుభవమొందుటయే మోక్షము ఆబ్రహ్మము అధిష్ఠానరూపముచే సమస్తమున్నునై యున్నది; అధ్యాసరూపముచే నేమియుఁ గాకయేయున్నది అట్టి బ్రహ్మముకంటె వేఱుగ నెద్దాని యొక్కయు అనుభవము గాకయుండునట్టి స్థితియే పరమపదము.

సమ్యక్ప్రబోధాన్నిర్వాణం పరంతత్త్వముదాహృతమ్
యథాస్థితమిదం విశ్వం తత్రాలం ప్రలయం గతమ్. 19

ఆత్మయొక్క పూర్ణజ్ఞానముచే, ఏనిరతిశయానందము సంప్రాప్తించుచున్నదో, అదియే పరనిర్వాణమని చెప్పఁబడినది. అట్టి స్థితియందు యథారీతి వర్తించుచున్న యీజగత్తంతయును బూర్ణముగ లయమొందుచున్నది.

న తత్రనానాఽనానా న నచ కించిన్న కించన
సమస్తసదసద్భావసీమాన్తః స ఉదాహృతః. 20

ఆ చిద్రూపమగు పరమాత్మయందు అనేకత్వముగాని, ఏకత్వముగాని లేవు. మఱియు నయ్యది పదార్థసహితముకాదు, పదార్థరహితముకాదు. అది సమస్త సదసత్పదార్థముల యొక్కయు సీమాంతము (హద్దు) అని వచింపఁబడినది.

అత్యన్తాసంభవం దృశ్యం యద్వైనిర్వాణమాశితమ్
శుద్ధబోధోదయం శాన్తం తద్విద్ధి పరమం పదమ్. 21

ఓ రామచంద్రా! దృశ్యముయొక్క అత్యంతాసంభవపూర్వకముగ సర్వవిక్షేపరహిత మైనట్టి నిరతిశయానందమయమగు ఆత్మస్వరూపస్థితియను నిర్వాణమేది గలదో, అట్టి శుద్ధబోధో దయరూపమైన శాంతస్వరూపమునే పరమపదమనియు, పరమపురుషార్థమనియు నెఱుఁగుము.

సచ సంప్రాప్యతే శుద్ధోబోధోధ్యానమనుత్తమమ్
శాస్త్రోత్పదపదార్థజ్ఞ బోధినోత్పన్న బుద్ధినా. 22

పరమార్థజ్ఞానమును బోధించునట్టువంటి ఈ (యోగవాసిష్ఠ) శాస్త్రముచే నుత్పన్నమైన వివేకబుద్ధిగల మనుజునకు అట్టి శుద్ధమైన ఆత్మబోధయను ఉత్తమధ్యానము సంప్రాప్తించుచున్నది.

మోక్షోపాయాభిధం శాస్త్రమిదం వాచయతానిశమ్
బుద్ధ్యుపాయేన శుద్ధేన పుంసా నాన్యేన కేనచిత్. 23

మోక్షోపాయమను ఈ శాస్త్రమును నిరంతరము విచారణాపూర్వకముగఁ బఠింపవలయును. ఏలయనిన, అధ్యాత్మశాస్త్ర జన్యమగు శుద్ధజ్ఞానమను నుపాయముచేదప్ప మఱియేయుపాయముచేతను మనుజునకు మోక్షము లభింపనేరదు.

న తీర్థేన న దానేన న స్నానేన న విద్యయా
న ధ్యానేన న యోగేన న తపోభిర్న చాధ్వరైః. 24

మోక్షము (చిత్స్వరూపమగు ఆత్మయందలిస్థితి) అనునది తీర్థములచేగాని, దానములచేగాని, స్నానములచేగాని, లౌకికవిద్యలచేగాని, ధ్యానములచేగాని, యోగములచేగాని, తపస్సులచేగాని, యజ్ఞములచేగాని సంప్రాప్తింపదు.

భ్రాన్తిమాత్రం కిలేదం సదసత్పదివ లక్ష్యతే
వ్యోమైవజగదాకారం స్వప్నోఽనిద్రే చిదమ్బరే. 25

సదసద్రూపమై, అనిర్వచనీయమైనట్టి యీ జగత్తు భ్రాంతిమాత్రమేయై యున్నను, అజ్ఞానముచే సత్యముగఁ గన్పట్టుచున్నది. నిద్రారహితమగు చిదాకాశమున చిదాకాశమే యిట్లు స్వప్నరూపమైన జగదాకారముగ స్థితినొందియున్నది.

న శామ్యతి తపస్తీర్థైర్భ్రాన్తిర్నామ కదాచన
తపస్తీర్థాదినా స్వర్గః ప్రాప్యన్తే నతు ముక్తతా. 26

భ్రాంతియనునది తపస్సులచేగాని, తీర్థాదులచేగాని యెన్నఁడును శమింపదు. ఏలయనిన, తపస్తీర్థాదులచే స్వర్గాదిలోకములు ప్రాప్తించునేగాని ముక్తికాదు.

భ్రాన్తిః శామ్యతి శాస్త్రార్థాత్సమ్యగ్బుద్ధ్యావలోకితాత్
ఆత్మజ్ఞానమయాన్మోక్షోపాయాదేవేహ నాన్యతః. 27

ఆత్మజ్ఞానమయమగు ఈ మోక్షోపాయమను శాస్త్రముయొక్క అర్థమును ఉత్తమబుద్ధితో విచారించుటవలననే మోక్షము ప్రాప్తించునుగాని మఱియేయుపాయముచేతనుగాదు.

ఆలోకకారిణాత్యర్థం శాస్త్రార్థే నైవ శామ్యతి
అమలేనాఖిలా భ్రాన్తిః ప్రకాశేనైవ తామసీ. 28

సూర్యోదయముచే అంధకారమయమగు రాత్రి శమించునట్లు నిర్మల జ్ఞానప్రకాశమును గలుగఁజేయునట్టి అధ్యాత్మశాస్త్రములయొక్క యర్థముచే సాంసారికభ్రాంతియంతయుఁబూర్ణముగ శమించును.

సర్గసంహారసంస్థానాం భాసో భాన్తి చిదమ్బరే
స్పన్దనానీవ మరుతి ద్రవత్వానీవ వారిణి. 29

వాయువునందు చలనములవలెను, జలమందు ద్రవత్వములవలెను, చిదాకాశమందు సృష్టి, స్థితి, సంహారములయొక్క ప్రతిభాసములు భాసించుచున్నవి.

ద్రవ్యస్య హృద్యేవ చమత్కృతిర్భిన్నా నభస్వతః స్పన్ద ఇవానిశం యథా
యథా స్థితా సృష్టిరియం తథా స్థితా లయం నభస్యన్తరనన్యరూపిణీ. 30

ఇత్యార్షే శ్రీ వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే ఉత్తరార్ధే బ్రహ్మగీతాసు నిర్వాణోపదేశోనామ చతుః సప్తత్యధిక శతతమః సర్గః ॥ 174 ॥

ఓ రామచంద్రా! వట (మఱ్ఱి) బీజాది పదార్థములందు వటవృక్షాకారచమత్కృతియు, వాయువునందు స్పందచమత్కృతియు నెట్లు కలవో, అట్లే మాయాశబలిత - చిదాకాశమందు, యథారీతి స్థితిగల్గియున్న యీ జగత్తుయొక్క సృష్టి, స్థితి లయములున్ను, ఆ చిదాకాశముకంటె వేఱుగాక వర్తించుచున్నది.

ఇది శ్రీవాసిష్ఠతాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున నుత్తరార్ధమున బ్రహ్మగీతలందు నిర్వాణోపదేశమను నూటడెబ్బదినాల్గవ సర్గము ॥ 174 ॥

## పఞ్చసప్తత్యధికశతతమః సర్గః

[యావన్మౌర్ఖ్యం జగదివ చిదేవాభాత్యకారణమ్
శాస్త్రేణ మౌర్ఖ్యేఽపహృతే సా ముక్తిరిహ వర్ణ్యతే.

ఎంతవఱకు అజ్ఞానముండునో, అంతవఱకును చైతన్యమే నిష్కారణముగ జగత్తువలె భాసించుననియు, ఆత్మజ్ఞానముద్వారా అజ్ఞానముయొక్క నాశమగుటయే ముక్తియనియు నిచట వర్ణింపఁబడుచున్నది.]

శ్రీ వసిష్ఠ ఉవాచః—

స్వప్నాభమాద్యం చిద్వ్యోమ కారణం దేహ సంవిదామ్
దృశ్యాన్యతా సంభవతశ్చిద్వ్యోమ్నస్తత్కుతో వపుః. 1

శ్రీవసిష్ఠుఁడు:— ఓ రామచంద్రా! అద్వస్వరూపమగు చిదాకాశము స్వకల్పితమగు అవిద్యచే స్వప్నసదృశముగనయి జీవరూపముతో సంసారమునఁ దిరుగాడుచు నేను దేవతను, నేను మనుష్యుఁడను అనునీప్రకారముగ నాయా దేహములతోటి తాదాత్మ్యాధ్యాసముచే కామ, కర్మ, వాసనాదులద్వారా ఆయా దేహములయొక్క కారణమగుచున్నది. జీవోపాధిసిద్ధికిఁ బూర్వము మహాప్రళయమున ఆ చిదాకాశమందు దృశ్యరూపభేదముయొక్క అత్యంతాసంభవమగుటవలన నిఁక ఆ సృష్టిరూపమగు దృశ్యము ఆ చిదాకాశముయొక్క దేహమెట్లగును?

సర్గాదౌ స్వప్నసంవిత్తి రూపత సర్వం వినానఘ
న సర్గో న పరో లోకో దృశ్యమానోఽపి సిద్ధ్యతి. 2

పాపరహితుఁడవగు రామచంద్రా! సృష్ట్యాదియందు స్వప్నసంవిద్రూపముచేఁదప్ప మఱియే కారణాంతరమువలనను ఈ దృశ్యమానమగు సృష్టిగాని, పరలోకముగాని యేదియును సిద్ధింపనేరదు.

అసదేవాను భూరిత్థమేవేదం భాసతే జగత్
స్వప్నాఙ్గనాసఙ్గ ఇవ శాన్తం చిద్వ్యోమ కేవలమ్. 3

కేవలము అనుభవరూపమై, శాంతమైనట్టి చిదాకాశమే స్వమాయాశక్తిచే నీప్రకారముగ స్వప్నస్త్రీసంగమమువలె అసత్తైనట్టి జగద్రూపముగ భాసించుచున్నది.

ఏవం నామాస్తి చిద్ధాతురనాదినిధనోఽమలః
శూన్యాత్మైవాచ్ఛరూపోఽపి జగదిత్యవభాతి యః. 4

ఏది దృశ్యశూన్యమై, శుద్ధస్వరూపమైనప్పటికిని జగద్రూపముగ భాసించుచున్నదో, అది అద్యంతరహితమై, నిర్మలమైనట్టి చైతన్యవస్తువేయైయున్నది.

మలస్త్వేషోఽపరిజ్ఞాతః పరిజ్ఞాతః పరం భవేత్
కుతః కిల పరే వ్యోమన్యనాది నిధనే మలః. 5

ఈ పరమాత్మయే తెలియఁబడనంతవఱకును, అవిద్యారూపముమలముగ భాసించును; (ఆ అవిద్యయందే తిరుగాడుచు జీవుఁడుగ వేఱుగనున్నట్లు వర్తించును). కాని, తెలియఁబడినపిదప నిర్మలమగు పరబ్రహ్మమేయగును. ఏలయనిన, జ్ఞానముకలుగఁగా (మేల్కొనినపిమ్మట స్వప్నరూపమలము బాధితమగునట్లు), అద్యంతరహితమైనట్టి చిదాకాశమున నిఁక అవిద్యామల మెచట ?

యదేతద్వేదనం శుద్ధం తదేవ స్వప్నపత్తనమ్
జగత్తదేవ సర్గాదౌ పృథ్వ్యాదేః సంభవః కుతః. 6

ఈ పరమాత్మయొక్క శుద్ధమైనట్టి యనుభవమేదిగలదో, అదియే స్వప్నపట్టణము. మఱియు నదియే యీ జగత్తున్నునైయున్నది. ఏలయనిన, కారణాభావమువలన సృష్ట్యాదియందుఁ పృథ్వ్యదుల సంభవమెచట?

చిద్వ్యోమాత్మావభాసస్య నభసః సర్గరూపిణీ
కృతాపృథ్వ్యాదికలనా మనోబుద్ధ్యాదితా తథా. 7

చిదాకాశముయొక్క స్ఫురణమే సృష్టిరూపములగు పృథ్వ్యదులుగను మనోబుద్ధ్యాదులుగను గల్పింపఁబడినది.

వార్యావర్త ఇవాభాతి పవన స్పన్దవచ్ఛయత్
అబుద్ధిపూర్వం చిద్వ్యోమ్ని జగద్భానమభిత్తిమత్. 8

జలమందు ఆవర్తమువలెను, వాయువునందు చలనమువలెను చిదాకాశమున, అబుద్ధిపూర్వకముగను, నిష్కారణముగనునైనట్టి స్ఫురణమే జగత్తైయున్నది.

పశ్చాత్తస్యైవ తేనైవ స్వయమైశ్వర్యశంసినా
కృతం బుద్ధ్యాదిపృథ్వ్యాదికల్పనం సదసన్మయమ్. 9

అట్లాకస్మికముగ జగత్తు భాసించినపిదప జీవరూపముతో పరమాత్మయందుఁ బ్రవేశించి 'నేను సృష్టికర్తయగు బ్రహ్మదేవుఁడను' ఇత్యాద్యైశ్వర్యమును ప్రకటమొనర్చుచు స్వయముగ బుద్ధ్యాది, పృథ్వ్యాది సదసన్మయ (మూర్తామూర్త) ప్రపంచముయొక్క కల్పన గావించెను.

స్వయమేవ కచత్యచ్ఛా చ్ఛాయేయం స్వా మహాచితిః
సర్గాభిధాన మస్యైవ నభవివేహ నేతరత్. 10

నిర్మలమగు ఆకాశముకంటెను అతినిర్మలమైనట్టి యీ మహాచైతన్యము నిజశక్తిచే స్వయముగనే జగద్రూపముగ భాసించుచున్నది. కాఁబట్టి వాస్తవముగ జగత్తను పేరు చిదాకాశమునకే యైయున్నది. ఇట్లు జగత్తు చిదాకాశమేగాని వేఱేమియునుగాదు.

న చ కించన నామ్నాఙ్గ కచత్య చ్చైవ సా స్మృతా
చిన్మాత్రైకకలనం తతమేవాత్మనాత్మని. 11

ప్రియుఁడవగు రామచంద్రా! ఈ ప్రకారముగ విచారదృష్టితోఁజూచిన చైతన్యమున కన్యముగ నేమియును భాసించుటలేదు. పూర్వోక్తమగు పరమనిర్మలమైనట్టి అద్వయచిన్మాత్రమే తనయందిట్లు జగద్రూపముగ వ్యాపించియున్నది.

చిదాకాశశ్చిదాకాశే తదిదం స్వమలం వపుః
చిత్తం దృశ్యమివాభాతి యథా స్వప్నే తథా స్థితమ్. 12

నిజపూర్ణ (శుద్ధ సచ్చిదానంద) స్వరూపమగు చిదాకాశమే చిదాకాశమున వాస్తవముగ తన నిర్వికారరూపముతోడ నెప్పటియట్లున్నప్పటికిని, స్వప్నమందువలె, చిత్తముగను, దృశ్యముగను భాసించుచున్నది.

అన్యథానుపపత్త్యార్థకారణాభావతః స్వతః
సర్గాదావేవ స్వాత్మైవ దృశ్యం చిద్వ్యోమ పశ్యతి. 13

సృష్ట్యాదియందు కారణాభావమువలన, మఱియొకవిధముగ సృష్టి సంభవింపకపోవుటచే స్వాత్మయగు చిదాకాశమే దృశ్యరూపమై యద్దానిని గాంచుచున్నదని స్పష్టమగుచున్నది.

స్వప్నవత్తచ్చ నిద్ధర్మనాగపి న భిద్యతే
తస్మాచ్చిద్వ్యోమ చిద్వ్యోమ శూన్యత్వం గగనాదివత్. 14

చిదాకాశముయొక్క యిట్లు దృశ్యరూపమును ధరించుట స్వప్నమువలె కేవలము మాయామయమైయున్నది. స్వప్నమందును, ఈ ప్రపంచమందును నొకింతైనను భేదములేదు కావున ఈ ప్రపంచమంతయును వాస్తవముగ ఆకాశమువలె పదార్థశూన్యమైనట్టి చిదాకాశము మాత్రమేయై యున్నది.

య దేవ తత్పరం బ్రహ్మ సర్వరూపవివర్జితమ్
తదేవైకం తథారూపమేవం సర్వతయా స్థితమ్. 15

సర్వరూప (పదార్థ) వర్జితమైనట్టి యేకమైన పరబ్రహ్మమే, తన సచ్చిదానంద, అద్వయ రూపముతోడ సదా స్థితినొంధియున్నప్పటికిని, నిజమాయాశక్తిచే నిట్లు సర్వజగద్రూపముగ వర్తించుచున్నది.

స్వప్నేఽనుభూయతే చైతత్స్వప్నో హ్యాత్మైవ భాసతే
నానాబోధమనానైవ బ్రహ్మైవామలమేవ తత్. 16

ఈ ప్రకారమగు సృష్టిని స్వప్నమందు ప్రతిజీవియు ననుభవించుచునేయున్నాఁడు. అట్లు స్వప్నపదార్థరూపముచే ఆత్మయే భాసించుచున్నది. కాఁబట్టి, ఏకమై, నిర్మలమై, జ్ఞాన స్వరూపమైనట్టి బ్రహ్మమే యిట్లు నానాప్రకారములుగ జగద్రూపముచే భాసించుచున్నదగును.

బ్రహ్మైవాత్మని చిద్భావాజ్జీవత్వమివ కల్పయత్
రూపమత్యజదేవాచ్ఛం మనస్తామివ గచ్ఛతి. 17

బ్రహ్మమే చిద్రూపమగుటవలన తనయందు జీవత్వమును గల్పించుచున్నదానివలె నున్నదై, తన నిర్మలచిత్స్వరూపమును త్యజింపకయే మనోరూపమును బొందినదానివలె నగుచున్నది.

ఇదం సర్వం తనోతీవ తచ్చ భాత్మకమేవ ఖమ్
భవతీవ జగద్రూపం వికారీవావికార్యపి. 18

ఆ చిదాకాశమే సమష్టిమనోరూపముచే ఈ సమస్త జగత్తును విస్తరింపఁజేయుచున్న దానివలెనున్నది. మఱియు స్వయముగ నిర్వికారరూపమైనప్పటికిని వికారివలెనగుచున్నది.

మన ఏవ స్వయం బ్రహ్మా స సర్గస్య హృది స్థితః
కరోత్యవిరతం సర్వమజస్రం సంహరత్యపి. 19

సమష్టిమనస్సే బ్రహ్మదేవుఁడు. అతఁడు సృష్టియొక్క హృదయమున నున్నవాఁడై నిరంతరము సమస్తసృష్టిని స్వయముగ రచించుచు, సంహరించుచునున్నాఁడు.

పృథ్వ్యాదిరహితో యస్మిన్మనోహృద్యజ్ఞవర్జితే
అన్యద్వా త్రిజగద్భాతి యథా స్వప్నే నిరాకృతి. 20

నిరాకారమగు ఆత్మ స్వప్నమందు స్వాప్నిక పదార్థరూపముగ భాసించునట్లు, పృథ్వ్యాది రహితుఁడగు ఆ సమష్టిమనోరూపుఁడైన బ్రహ్మదేవుఁడు, అవయవరహితమగు స్వహృదయము (చిదాత్మ) ననే స్థితినొందియున్నవాఁడై, అద్దానికంటె వేఱైనవానివలె త్రైలోక్యరూపుడై స్వయముగ భాసించుచున్నాఁడు.

దేహరూపజగద్రూపై రహమేకమనాకృతి
మనస్తిష్ఠామ్యనన్తాత్మ బోధాబోధం పరాభవమ్. 21

అద్వితీయమై, నిరాకారమై, పరిపూర్ణమైనట్టి చైతన్యస్వరూపము గల్గియున్నను, ఆ సమష్టి మనోరూపుఁడగు బ్రహ్మదేవుఁడు తన అవిద్యచే పూర్ణచిత్స్వభావమునుండి చ్యుతినొందిన వానివలెనయి, అహంకారరూపముతోఁగూడి దేహ, జగద్రూపములచే అనంతరూపుఁడై, జడ, చేత నాత్మకమగు జగద్రూపముగ వెలయుచున్నాఁడు.

నేహ పృథ్వ్యాది నో దేహో న చైవాన్యాస్తి దృశ్యతా
జగత్త్రయా కేవలం ఖం మనః కచకచాయతే. 22

కాని వాస్తవముగ నిట పృథ్వ్యాదులుగాని, దేహముగాని, చైతన్యముకంటె వేఱగు ఏదృశ్యత్వముగాని లేవు. చిదాకాశమే కల్పిత సమష్టిమనోరూపమై యిట్లు కల్పిత జగద్రూపముగ స్ఫురించుచున్నది.

విచార్యదృష్ట్యైతదపి న కించిదపి విద్యతే
కేవలం భాతి చిన్మాత్రమాత్మనాత్మని నిర్ఘనమ్. 23

విచారదృష్టితోఁ జూచిన, ఈ కల్పిత జగత్తుయొక్క నొకింతయు లేక యున్నది. కేవలము ఆనందఘనమగు చిన్మాత్రమే తనయందుఁదానిట్లు భాసించుచున్నది.

యతో వాచో నివర్తన్తే తూష్ణీంభావోఽవశిష్యతే
వ్యవహార్యపి భాత్యైవ తద్వ్యత్తిష్ఠతి మూకవత్. 24

వాఙ్మనస్సుల కగోచరమైనట్టి నిరతిశయానందరూపమైన ఆత్మ లభింప, కేవలము మౌన భావమే (నిశ్చలమగు ఆత్మరూపత్వమే) శేషించుచున్నది. మఱియు శుద్ధ సచ్చిదాత్మస్వరూపుఁడగు తత్త్వజ్ఞాని ప్రాపంచిక వ్యవహారమున మగ్నుఁడైనను, నిజ చిత్స్వరూపముననే మౌనముగ నెప్పటి యట్లు స్థితినొందియున్నవాఁడై, తనయానిశ్చలత్వమును గోల్పోవకయే యుండును.

అనన్తాపారపర్యన్తా చిన్మాత్రపరమేష్ఠకా
తూష్ణీం భూత్వా భవత్యేష ప్రబుద్ధః పురుషోత్తమః. 25

ప్రబుద్ధుఁడగు పురుషోత్తముఁడు, ఆత్మయందు మౌనముగనున్నవాఁడై అనంతమై, అపారమై, చిన్మాత్రరూపమై, పరమప్రేమాస్పదమైనట్టి నిరతిశయానందఘనత్వమును స్వయముగఁ బొందును.

అబుద్ధిపూర్వం ద్రవతో యథా వర్తాదయోఽమ్భసి
క్రియన్తే బ్రహ్మణా తద్వచ్చిత్తబుద్ధ్యాదయో జడాః. 26

ద్రవత్వమువలన జలమందావర్త తరంగాదుల కల్పన, అజ్ఞానపూర్వకముగఁ గావింపఁ బడునట్లు, అవిద్యావృతమగు బ్రహ్మముచే జడములైన చిత్త, బుద్ధ్యాది జగద్రూపముల కల్పన గావింపఁబడుచున్నది.

అబుద్ధిపూర్వం వాతేన క్రియతే స్పందనం యథా
అనన్యదేవం బుద్ధ్యాది క్రియతే పరమాత్మనా. 27

వాయువుచే అబుద్ధిపూర్వకముగ స్పందాదుల కల్పన గావింపఁబడునట్లు, అవిద్యావృతుఁడగు పరమాత్మచే తనకంటె వేఱుకానట్టి రూపముతోడ నిట్లు బుద్ధ్యాదుల కల్పన గావింపఁ బడుచున్నది.

అనన్యదాత్మనో వాయోర్యథా స్పన్దనమవ్యయమ్
అనన్యదాత్మనస్తద్వచ్చిన్మాత్రం పరమాత్మనః. 28

వాయువుకంటె నద్దాని చలనము వేఱుకానట్లు, చిదాభాసరూపులగు జీవులున్ను సాక్షి యగు పరమాత్మకంటె వేఱుకారు.

చిద్వ్యోమ బ్రహ్మచిన్మాత్రమాత్మా చితి మహానితి
పరమాత్మేతి పర్యాయో జ్ఞేయా జ్ఞానవతాం వర. 29

జ్ఞానులలో శ్రేష్ఠుఁడగు నో రామచంద్రా! ఇక్కారణమున, చిదాకాశము, బ్రహ్మము, చిన్మాత్రము, జీవచైతన్యము, మహాచిద్రూపము, పరమాత్మ అను నివియన్నియును పర్యాయ (ఏకార్థవాచక) శబ్దములైయున్నవి.

బ్రహ్మోన్మేషనిమేషాత్మ స్పన్దాస్పన్దాత్మ వాతవత్
నిమేషో యాదృగేవాస్య సమున్మేషస్తథా జగత్. 30

అవిద్యావృతమగు బ్రహ్మము నేత్రమువలె, ఉన్మేష, నిమేషాత్మకమై, (వికాస, సంకోచ రూపమై). లేక వాయువువలె స్పంద, అస్పంద (చలన, స్థిర) రూపమై వెలయుచున్నది. దీని యొక్క సంకోచమెట్లు ప్రళయమైయున్నదో, అట్లే వికాసమున్ను జగత్తై యున్నది.

దృశ్యమస్య సమున్మేషో దృశ్యాభావో నిమేషణమ్
ఏకమేతన్నిరాకారం తద్ద్వయోరప్యవక్షయాత్. 31

ఈ పరమాత్మయొక్క మహావికాసమే దృశ్యము; సంకోచమే దృశ్యముయొక్క అభావము వికాస సంకోచములు రెండును ఒకేనేత్రగోళమందు లయించుటవలన నద్దాని స్వరూపములై యున్నట్లు, సృష్టి. ప్రళయములు రెండును ఒకే నిరాకారమైనట్టి చిన్మాత్రమందు లయించుటవలన నద్దాని స్వరూపములైయున్నవి.

నిమేషోన్మేషయోరేకరూపమేవ పరం మతమ్
అతోఽస్తి దృశ్యం నాస్తీతి సదసచ్చ సదా చితిః. 32

అధిష్ఠానదృష్టిచే వికాస. సంకోచ (సృష్టి. ప్రళయముల రెంటియొక్కయు నొకే పరమ (బ్రహ్మ)రూపమైయున్నది కాఁబట్టి దృశ్యముయొక్క భావ, అభావములు రెండును, ఆ చైతన్యము నుండియే స్ఫురించుటవలన దృశ్యము సత్తున్ను, అసత్తున్ను, ఇట్లు ఉభయరూపమైయున్నది. కాని చైతన్యమో, సదా యేకమైనట్టి సత్తాస్వరూపమైయే ప్రకాశించుచున్నది.

నిమేషో నాన్య ఉన్మేషాన్నోన్మేషోఽపి నిమేషతః
బ్రహ్మణః సర్గవపుషో నిమేషోన్మేషరూపిణః. 33

నేత్రరూపములే యగుటచే నేత్రముయొక్క సంకోచము వికాసముకంటెను, వికాసము సంకోచముకంటెను వేఱుకానట్లు, మాయాశబలిత బ్రహ్మరూపములే యగుటచే సృష్టి ప్రళయము లున్ను పరస్పరము భిన్నములుకావు.

తద్యథా స్థితమేవేదం విద్ధి శాన్తమశేషతః
అజాతమజరం వ్యోమ సౌమ్యం సమసమం జగత్. 34

ఓ రామచంద్రా! ఇక్కారణమున యథారీతి స్థితిగల్గియున్న యీ సమస్తజగత్తును, జన్మజరామరణరహితమై, సౌమ్యమై. శాంతమై శాంతమై, సృష్టిప్రళయములందును సమరూపమైనట్టి చిదాకాశముగనే యెఱుఁగుము.

చిదచిత్త్వాత్మకం వ్యోమరూపం కచకచాయతే.
చిన్మాత్రమదిదం భాతి జగదిత్యేవ తద్వపుః. 35

ఆకాశము తనయందు గల్పితమైనట్టి నీలరూపముతోడ స్ఫురించునట్లు, చైతన్యమున్ను, అచేతనమగు జగద్రూపముతోడ స్ఫురించుచున్నది. కావున, ఏది భాసించుచున్నదో, అది జగచ్ఛరీరధారియైన చిన్మాత్రబ్రహ్మమేయైయున్నది.

న నశ్యతి న చోత్పన్నం దృశ్యం నాప్యనుభూయతే
స్వయం చమత్కరోత్యన్తః కేవలం కేవలైవ చిత్. 36

ఈ దృశ్యము వాస్తవముగ నుత్పన్నముకాలేదు, నశించుటలేదు. అనుభవింపఁబడుట లేదు; కేవలము నిర్మలమగు చైతన్యమే స్వయముగ తనయందీజగద్రూపముయొక్క చమత్కారము గావించుచున్నది.

మహాచిద్వ్యోమమణిభా దృశ్యనామ్నీ నిజాకరాత్
అనన్యాన్యేవ భాతాపి భానుభాస ఇవోష్ణతా. 37

మహాచిదాకాశమను మణియొక్క కాంతిరూపమగు ఈ దృశ్యమను వేరుగల వస్తువు భిన్నరూపముగ భాసించినప్పటికిని, సూర్యప్రకాశముకంటె నుష్ణత్వము వేఱుకానట్లు, తన యుత్పత్తి స్థానమగు ఆ చిద్రూపమణికంటె భిన్నముకాదు.

సుషుప్తం స్వప్నవద్భాతి భాతి బ్రహ్మైవ సర్గవత్
సర్వమేకం శివం శాన్తం నానేవాపి స్థితం స్ఫురత్. 38

సుషుప్తియే స్వప్నముగ భాసించునట్లు బ్రహ్మమే సృష్టిగ భాసించుచున్నది. కావున నానారూపములుగ స్ఫురించినప్పటికిని, ఈ జగత్తంతయును ఏకమై, శాంతమై, శివరూపమైనట్టి, బ్రహ్మమేయైయున్నది.

యద్యత్సంవేద్యతే యాదృక్సద్వాఽసద్వా యథా యదా
తథానుభూయతే తాదృక్తత్సదస్త్వసదస్తు వా. 39

సత్తుగాని, అసత్తుగానియగు ఏ పదార్థమెపుడే ప్రకారముగ చైతన్యముచేఁ బ్రకాశింపఁ బడుచున్నదో, అపుడాప్రకారముగనే యది సత్తైనను, అసత్తైనను సరియే చిదాభాసునిచే ననుభవింపఁ బడుచున్నది.

అన్యథానుపపత్త్యా చేత్కారణం పరికల్ప్యతే
తత్స్వప్నాభో జగద్భావాదన్యథా నోపపద్యతే. 40

జగత్తునకు, పరమాత్మకంటె వేఱుగ ప్రధాన, పరమాణ్వాదిరూపమగు కారణము కల్పింపఁబడుచో, అది స్వప్నతుల్యమగు ఈ జగత్తునందు యుక్తియుక్తముకానేరదు. స్వప్నమందు అన్యకారణములయొక్క అభావముచే ఆత్మయే జగద్రూపమును ధరించునదగునట్లు, సృష్ట్యాది యందు బ్రహ్మమే జగద్రూపమును ధరించుచున్నదగును.

ప్రమాతీతాత్పరాద్విశ్వమనన్యదుదితం యతః
ప్రమాతీతమిదం చైవ కించిన్నాభ్యుదితం తతః. 41

ఈ జగత్తు ప్రమాణముల కతీతమగు పరమాత్మనుండి స్వప్నమందువలె, తదభిన్నముగ నుదయించినది. కావున నిదియుఁగూడ, ప్రమాణముల కతీతమై, అనిర్వచనీయమైయున్నదనియు, వాస్తవముగ నేమియు నుదయింపక నేయున్నదనియు అంతయు పరమాత్మయే యనియు నిశ్చితమగుచున్నది

యస్య యద్రసికం చిత్తం తత్తథా తస్య గచ్ఛతి
బ్రహ్మైకరసికం తేన మనస్తత్తాం సమశ్నుతే. 42

ఎవని చిత్తము దేనియందాసక్తమైయుండునో. అది దానినే యనుభవించును. కాఁబట్టి యెవనిమనస్సు బ్రహ్మమందే అనురక్తమైయుండునో అది జగత్తును బ్రహ్మరూపముగనే యనుభవించును.

యచ్చిత్తో యద్గతప్రాణో జనో భవతి సర్వదా
తత్తేన వస్త్వితిజ్ఞాతం జానాతి తదసా స్ఫుటమ్. 43

ఎవనియొక్క చిత్తము, ప్రాణము దేనియందు సదా అనురక్తములైయుండునో, అది సత్యమను జ్ఞానమాతనికిఁ గలుగును. మఱియు దాని నతఁడు స్పష్టముగ నెఱుఁగఁ గల్గును.

బ్రహ్మైకరసికం యత్స్యాన్మనస్తత్తద్వవేత్తణాత్
యస్య యద్రసికం చేతో బుద్ధం తేన తదేవ సత్. 44

ఎవని మనస్సు కేవలము బ్రహ్మమందే అనురక్తమైయుండునో, అది క్షణకాలములోనే, బ్రహ్మమైపోవును. ఎవని చిత్తము దేనియందు అనురక్తమైయుండునో, అతఁడు దానినే సత్యముగ నెఱుఁగును.

విశ్రాన్తం యస్య వై చిత్తం జన్తోస్తత్పరమార్థసత్
వ్యవహృత్యై కరోత్యన్యత్సదాచారాదతద్రసమ్. 45

ఎవని చిత్త మెచట దృఢనిశ్చయముతో విశ్రాంతి నొందియుండునో, ఆతని కదియే పరమార్థసత్యమైయున్నది. కావున బ్రహ్మవేత్త స్వనిశ్చితవస్తువుకంటె అన్యములైనట్టి యజ్ఞదానాదులను జేయుట యేదిగలదో, అది సదాచారమువలన లోక సంగ్రహార్థ వ్యవహారముకొఱకై, అనాసక్తి పూర్వకముగ నాచరించుటయే యగును.

ద్విత్వైకత్వాదికలనా నేహ కాచన విద్యతే
సత్తామాత్రం చ దృగియమితశ్చేదలమీక్ష్యతే. 46

ఓ రామచంద్రా ! ఈ నేను పచించిన యుపాయముద్వారా జగత్తు నవలోకించుచో, అపుడిది యంతయును సత్తామాత్రముగను, దృగ్రూపమగు పరబ్రహ్మముగనే యనుభూతమగును. ఏలయనిన, ఇచట వాస్తవముగ ద్వైత, ఏకత్వాది కల్పన యేదియును లేదు.

అదృశ్యదృశ్యనదసన్మూర్తామూర్తదృశామిహ
నైవాస్తి న చ నాస్త్యేవ కర్తా భోక్తాథవా క్వచిత్. 47

దృశ్యరహితమగు బ్రహ్మమే సత్, అసత్, మూర్త, అమూర్తరూపమగు దృశ్యజగదాకారమును ధరించుచున్నదను దృఢనిశ్చయముగలవారికిఁక నిచట కర్తగాని భోక్తగాని, జీవునియొక్క అస్తిత్వ, నాస్తిత్వములుగాని యెవ్వియు భాసింపకుండును. ఏలయనిన, సర్వము వారికి బ్రహ్మమాత్రముగనే యొప్పుచుండును.

ఇదమిత్థమనాద్యన్తం జగత్పర్యాయమాత్మని
బ్రహ్మైకఘనమాశాన్తం స్థితం స్థాణురివాధ్వని. 48

పరమార్థముగ జగత్తుయొక్క పర్యాయరూపమై, ఆద్యంతరహితమై, మహాశాంతమై, కేవలము చిద్ఘనమైనట్టి బ్రహ్మమే తనయందిట్లు మార్గమందు పథికునకు చోరాదులఁగూర్చిన భ్రాంతిని గలుఁగఁజేయు స్థాణువువలె జగద్రూపముగ స్థితినొందియున్నది.

యదేవ బ్రహ్మబుద్ధ్యాది తదేవైతన్నిరఞ్జనమ్
యదేవ గగనం శాన్తం శూన్యం విద్ధి తదేవ తత్. 49

ఓరామచంద్రా! ఏది శాంతమైనట్టి ఆకాశమో, అదియే శూన్యమైనట్లు, ఏది నిరంజన (దోషరహిత)మగు బ్రహ్మమో, అదియే బుద్ధ్యాదిరూపమగు ఈ జగత్తని యెఱుఁగుము.

కేశోణ్డ్రకాదయో వ్యోమ్ని యథా సదసదాత్మకాః
ద్వితామివాగతా భాన్తి పరే బుద్ధ్యాదయస్తథా. 50

ఎట్లు, సదసద్రూపములగు కేశ, నీలత్వాదు లాకాశమున తదాకాశముకంటె భిన్నరూపములుగ భాసించుచున్నవో, అట్లే పరబ్రహ్మమున బుద్ధ్యాది జగత్తున్ను భాసించుచున్నది.

తథా బుద్ధ్యాది దేహాది వేదనాది పరావరే
అనేకాన్యవ్యనన్యాని శూన్యత్వాని యథామ్బరే. 51

ఆకాశమందు శూన్యత్వముల (ఘటపటాదుల) అభావములవలె సత్తాసామాన్యమగు పరబ్రహ్మమందు బుద్ధ్యాదులున్ను, దేహాదులున్ను, అనుభవాదులున్ను, అనేకములుగను, భిన్నములుగను భాసించినను, వాస్తవముగ ఏకమై, బ్రహ్మముకంటె భిన్నములుకానివై వర్తించుచున్నవి.

సుషుప్తాద్విశతః స్వప్నమేకనిద్రాత్మనో యథా
సర్గస్థస్యాపి న ద్విత్వం నైకత్వం బ్రహ్మణస్తథా. 52

సుషుప్తినుండి స్వప్నమునఁ బ్రవేశించి స్వప్నసృష్టియందుండునట్టి యేకమగు నిద్రాత్మకువలె, ప్రళయమునుండి సృష్టిరూపమునఁ బ్రవేశించి యాసృష్టియందుండునట్టి బ్రహ్మమునకున్ను ద్వైతముగాని, ఏకత్వముగాని లేవు.

ఏకమేవ కచత్యచ్ఛా భాయేయం స్వా మహాచితేః
న చ కించన నామాఙ్గ కచత్యచ్ఛైవమాస్థితా. 53

ప్రియుఁడవగు రామచంద్రా! మహాచైతన్యము (బ్రహ్మము)యొక్క స్వకీయనిర్మల కాంతియే యిట్లు జగద్రూపముగ భాసించుచున్నది. కాని వాస్తవముగ నది తన నిర్మలరూపము తోడ స్థితినొందియున్నదై యిట్లొకింతైనను భాసింపకయేయున్నది.

చిద్వ్యోమ్ని హి చిదాకాశమేవ స్వమమలం వపుః
చేత్యం దృశ్యమివాభాతి స్వప్నేష్వివ యథా స్థితమ్. 54

చిదాకాశమున చిదాకాశమే, తనశుద్ధసచ్చిదానందరూపముతోనుండి యున్నప్పటికిని, స్వప్నమందువలె, యథారీతి స్థితిగల్గియున్న యీ దృశ్యజగత్తుగ భాసించుచున్నది.

అన్యథానుపపత్త్యార్థకారణాభావతః స్వతః
చిద్వ్యోమాత్మానమేవాదౌ దృశ్యమిత్యేవ పశ్యతి. 55

సద్వస్తువుకంటె వేఱుగ మఱియొక వస్తువు కలదని ఏయుక్తిచేతను నిరూపింపఁబడఁజాలక పోవుటవలనను, కారణాంతరముయొక్క అభావమువలనను, చిదాకాశము స్వతఃతన్నే సృష్ట్యాదియందు దృశ్యముగఁగాంచుచున్నదగును.

సర్గాదావేవ భాత్యేవ దృశ్యం భాతి నిరాకృతి
సంభ్రమః స్వప్నసంకల్పమిథ్యాజ్ఞానేష్వివాఖిలః. 56

నిరాకారమగు చిదాకాశమే సృష్ట్యాదియందు దృశ్యజగదాకారముగ భాసించుచున్నది. అట్టి భావము స్వప్న, సంకల్ప, మిథ్యాజ్ఞానములందువలె సర్వథా భ్రమరూపమైయున్నది.

స్వప్నవత్తచ్చ నిర్ధర్మ మనాగపి న భిద్యతే
వికార్యపి సధర్మాపి చిద్వ్యోమ్నో వస్తునో మలాత్. 57

ఈ దృశ్యము స్వప్నమువలె సర్వధర్మ (వస్తుస్వభావ) శూన్యమగు చిదాకాశమేయై యున్నది. వాస్తవముగ చిదాకాశమందు; ఈ జగత్తునందును నొకింతైనను భేదములేదు. పరమార్థభూతమగు చిదాకాశము అవిద్యామలమువలననే యిట్లు వికారవంతముగను, ధర్మసహితముగను ప్రతీతమగుచున్నది.

తత్స్వప్ననగరాకారం సధర్మాప్యసధర్మకమ్
శివాదనన్యమేవేత్థం స్థితమేవ నిరన్తరమ్. 58

స్వప్ననగరాకారమగు ఈజగత్తు చూచుటకు అనేకధర్మసహితమై యొప్పుచున్నను వాస్తవముగ సర్వధర్మరహితమేయైయున్నది. అధిష్ఠానమగు సన్మాత్ర బ్రహ్మముకంటె యిదిఏమి వేఱుకాదు. అజ్ఞానుల దృష్టియందే యిట్లియ్యది వేఱుగను జగదాకారముగను స్థితినొందియున్నది,

దృశ్యం స్వప్నాద్రివత్స్వచ్ఛం మనాగపి న భిద్యతే
తస్మాచ్చిద్వ్యోమ చిద్వ్యోమ్నః శూన్యత్వం గగనాదివ. 59

ఈ జగద్రూపమగు దృశ్యము స్వప్నపర్వతమువలె స్వచ్ఛమగు చిద్రూపమేయైయున్నది. అధిష్ఠానమగు చైతన్యమునకున్ను దీనికిన్ని నొకింతైనను భేదములేదు. కాఁబట్టి చిదాకాశమాత్రముగ శేషించిన యీ జగత్తునకు ఆకాశముకంటెను అతి సూక్ష్మత్వము సిద్ధించినదగుచున్నది.

యదేవ తత్పరం బ్రహ్మ సర్వరూపవివర్జితమ్
తదేవేదం తథాభూతమేవ సర్గతయా స్థితమ్. 60

సర్వరూపరహితమగు పరబ్రహ్మమేది గలదో, అదియే (తన శుద్ధాత్మస్వరూపమునుండి చ్యుతినొందక) యిట్లు సృష్టిరూపముగ స్థితినొందియున్నది.

స్వప్నేఽనుభూయతే చైతత్స్వప్నే హ్యాత్మైవ భాసతే
పురాదిత్వేన నతు సత్పురాదిరచితం తదా. 61

స్వప్నమున ఏ యేనగరాద పదార్థము లనుభూతములగుచున్నవో, ఆయారూపములచే ఆత్మయే యట్లు భాసించుచున్నది. అంతేగాని యిపుడచట సత్యములగు నగరాదులెవ్వియు రచింపబడుటలేదు. నిజమాయాశక్తిచే ఆత్మయే యట్లు స్ఫురించుచున్నదగును.

స్వప్నే చ ప్రత్యభిజ్ఞాయాః సంస్కారస్య స్మృతేస్తథా
న సత్తా తదిదం దృష్టమిత్యర్థస్యాత్యసంభవాత్. 62

స్వప్నమున హృదయ, కంఠ నాడీరంధ్రాది ప్రదేశములందు గృహాది పదార్థముల యొక్క సత్త సర్వథా అసంభవమగుటవలన, వానింగూర్చిన ప్రత్యభిజ్ఞానము, సంస్కారము, స్మృతిమిగుల అసంభవములైయున్నది. కావున స్వప్నము భ్రమమాత్రమేయైయున్నది.

తస్మాదేతత్త్రయం త్యక్త్వా యద్భానం బ్రహ్మసంవిదః
తస్య దృష్టార్థసాదృశ్యాన్మూఢైః స్మృత్యాదితోహితా. 63

ఇక్కారణమున, ప్రత్యభిజ్ఞానము, సంస్కారము, స్మృతియను ఈమూఁటినివిడిచి బ్రహ్మసంవిత్తే నిద్రాదిదోషములచే నవ్విధముగ భాసించుచున్నదగును. ఆ స్వప్నముయొక్క జాగ్రద్దృష్ట పదార్థములతోటి సాదృశ్యమువలన, స్మృత్యాదులయొక్కయు సాదృశ్యమును గల్పించి మూఢులాస్వప్నమునుగూర్చిన స్మృత్యాదిత్వము నూహించిరి.

యథా యత్రైవ లహరీ వారిణ్యేతి పునః పునః
తత్రైవైతి తథా తద్వదనన్యా ఖే పరే జగత్. 64

జలమందు తరంగములు దీపమందు జ్వాలలు ఒకేస్థానమున భిన్నభిన్నములైనవి మరలమరల యేతెంచినప్పటికిని, సాదృశ్యముచే 'అదియే యిది' అను ఈప్రకారమగు ప్రత్యభిజ్ఞాన భ్రమ లోకమందుఁ బ్రసిద్ధమైయున్నట్లు, బ్రహ్మమందు అనేక భిన్నభిన్న జగత్తున్ను మరల మరల స్ఫురించినను, అదియే యిది అను భ్రాంతిజ్ఞానము జనులకుఁ గలుగుచున్నది. ఆ జగత్తులన్నియు వాస్తవముగ అధిష్ఠానమగు చిదాకాశముకంటె వేఱుగాకయేయున్నవి.

విధయః ప్రతిషేధాశ్చ సర్వ ఏవ సదైవ చ
విభక్తాశ్చ విమిశ్రాశ్చ పరే సన్తి న సన్తి చ. 65

'పరమాత్మయందు' పృథివ్యాదులు ఓతప్రోతములై యున్నవి. అను ఈప్రకారములగు సమస్తవిధులున్ను, 'ఇచట' అనేకత్వములేదు. అను ఈప్రకారములగు సమస్తనిషేధములున్ను విభక్తములై, మిళితములై, అధిష్ఠానదృష్టిచే బ్రహ్మమందు సదా విద్యమానములైయున్నవి. కాని, ఆరోపిత (కల్పిత) దృష్టిచే నవియెవ్వియు లేకయున్నవి

తస్మాత్సద్బ్రహ్మ సర్వాత్మ కిమివాత్ర న విద్యతే
సైవ సత్తైవ సర్వాత్మచై తదప్యేతదాత్మకమ్. 66

సద్రూపమగు ఆ బ్రహ్మము సర్వాత్మకమైయుండుటచే నిజమాయాశక్తిచే నిటనేమి సంభవింపకయుండును? ఆ బ్రహ్మ సత్తయే సర్వరూపమై వెలయుచుండుటవలన ఈ సమస్త జగత్తున్ను బ్రహ్మరూపమై సద్రూపమైయే యొప్పుచున్నది.

భ్రాన్తస్య భ్రమణం భూమేర్న భూభ్రాన్త్యైవ వా గతైః
న శామ్యతి జ్ఞాతురపి తథాభ్యాసం వినాత్ర దృక్. 67

కావున, సర్వాత్మకమగు బ్రహ్మసత్తయందు వాదులందఱియొక్క సమస్తకల్పనలకును, అవిరోధపూర్వకముగ సమావేశము సిద్ధించుచున్నది. మఱియు, కల్పనను త్యజించినవానికి మోక్షమున్ను సిద్ధించుచున్నది. ఎట్లనిన, క్రీడార్థము తనచుట్టు తాను తిరుగుచుండు బాలునియొక్క దృష్టియందు వృక్ష, పర్వతాది సమూహసహితముగ భూమి తిరుగుచుండునట్లు కానుపించును ఇతరుల దృష్టియందట్లు కానుపించదు. ఉభయులకును, ఆ యా స్థితులు సత్యములుగనే తోచును. అట్లే, ఈ జగద్భ్రమ, అజ్ఞానుల దృష్టియందుగలదు ఈ జగద్భ్రమ సత్యముకాదు. అని యెఱిగిన జ్ఞానికిన్ని ఆత్మస్వరూపమందలి స్థిరత్వమునుగూర్చిన అభ్యాసములేనిచో భ్రాంతి దృష్టి శమింపదు.

శాస్త్రస్యాస్య తు యన్నామ వాదనం తద్వినాపరః
అభ్యాసో దృశ్యసంశాన్త్యై న భూతో న భవిష్యతి. 68

సేవాదులద్వారా సద్గురువును మెప్పించి యాతని ముఖతః యీ మోక్షోపాయమను (యోగవాసిష్ఠ) శాస్త్రముయొక్క బోధను విని (శ్రవణము గావించి) పిమ్మట మనన నిదిధ్యాసనములద్వారా దాని నభ్యసించుట యను నుపాయము తప్ప మఱియొకయుపాయ మెద్దియు, ఈదృశ్యము శమించుటకొఱకై యుండియుండలేదు, ఉండబోదు

న జీవన్న మృతం చిత్తం రోధమాయాతి సంసృతేః
అవినాభావిదేహ త్వాద్బోధాత్వేతన్న పశ్యతి. 69

చిత్తము సంసారముతో అవినాభావమైనట్టి స్వరూపము గల్గియుండుటబట్టి జాగ్రత్స్వప్నములందు జీవించుచు, సుషుప్తియందు లయించుచునున్నదై ప్రయత్నముచే యోగాదులద్వారా నిరోధింపబడినప్పటికిని నిరోధింపబడుటలేదు. కాని, ఈ (యోగవాసిష్ఠ) శాస్త్రముయొక్క యభ్యాసముచే నుత్పన్నమైన జ్ఞానముచేతనే సంసారము బాధితమగుటచే నద్దాని నయ్యది మరల గాంచకుండును. కాబట్టి. ఈ శాస్త్రముయొక్క యభ్యాసమే చిత్తనిరోధమున కుపాయమైయున్నది.

సర్వదైవావినాభావి చిత్తం దృశ్యశరీరయోః
ఇహ చాముత్ర చైతస్య బోధాన్తే శామ్యతః స్వయమ్. 70

చిత్తమెట్లు సంసారముయొక్క అవినాభావరూపమైయున్నదో, అట్లే దృశ్యరూపమగు సంసారమున్ను సదా చిత్త, శరీరములయొక్క అవినాభావరూపమైయేయున్నది. ఆ చిత్త, సంసారములు ఈ శాస్త్రముయొక్క యభ్యాసమువలన ప్రతిబంధములేని పక్షమున, ఈ జన్మయందును, ఉన్నపక్షమున మఱుజన్మయందును, తత్త్వబోధచే స్వయముగ శమించుచున్నవి.

చిత్తదృశ్యశరీరాణి త్రీణి శామ్యన్తి బోధతః
పవనస్పన్దసైన్యాని కారణాభావతో యథా. 71

వాయువుయొక్క చలనముచే ప్రేరితములగు మేఘసైన్యములు శుక్రోదయ, అస్త్రాది కారణములయొక్క అభావముచే శమించునట్లు, జ్ఞానముచే అవిద్యయను కారణములయొక్క అభావముచే శమించునట్లు, జ్ఞానముచే అవిద్యయను కారణముయొక్క అభావమువలన చిత్త, దృశ్య, శరీరములు మూఁడును శమించిపోవుచున్నవి

కారణం మౌర్ఖ్యమేవాస్య తద్వాస్మాదేవ శాస్త్రతః
కించిత్సంస్కృతబుద్ధీనాం వాదితాదేవ శామ్యతి 72

చిత్త, దృశ్య, శరీరములకు కారణము, అజ్ఞానమేయైయున్నది. ఆయజ్ఞానమో, ఒకింత సంస్కరింపఁబడిన బుద్ధిగలవారికి ఈ శాస్త్రమును జదివినంతమాత్రముననే శమించిపోవుచున్నది.

అబుద్ధముత్తరగ్రంథాత్పూర్వం పూర్వం హి బుధ్యతే
గ్రన్థం పదపదార్థజ్ఞః ఖేదవాన్న నివర్తతే. 73

ఏవిషయములు దీనియొక్క పూర్వగ్రంథమును జదువుటచే బోధపడకుండునో, ఆయా పూర్వపూర్వవిషయములన్నియును శ్రమయని తలంచి మధ్య విడువకున్నచో ఉత్తరగ్రంథమును జదువుటవలన తప్పక బోధపడును; పదపదార్థజ్ఞానమున్ను బాగుగ నలవడును.

ఉపాయమిదమివాతో విద్ధి శాస్త్రం భ్రమక్షయే
అనన్యసాధారణతాం గతమిత్యనుభూయతే. 74

ఓ రామచంద్రా! కాఁబట్టి, ఇతర సామాన్య గ్రంథములకంటె విలక్షణమైనట్టి యీ మోక్షోపాయమను (యోగవాసిష్ఠ) శాస్త్రములే సంసారభ్రమ వినాశముకొఱకై ఉత్తమోపాయముగ నెఱుఁగుము.

తస్మాదస్మాన్మహాశాస్త్రాద్యథాశక్తి విచారయేత్
భాగౌ ద్వౌ భాగమేకం వా తేన దుఃఖక్షయో భవేత్. 75

ఇక్కారణమున, ఈ (యోగవాసిష్ఠ) మహాశాస్త్రముయొక్క పూర్వార్థ, ఉత్తరార్థములను రెండుభాగములనుగాని, లేక ఒక భాగమునుగాని యథాశక్తి బాగుగ విచారింపవలయును. దానిచే దుఃఖక్షయము కలుగును.

ఆరుషేయమిదమితి ప్రమాదాచ్చేన్న రోచతే
తదన్యదాత్మవిజ్ఞానశాస్త్రం కించిద్విచారయేత్. 76

'ఈ శాస్త్రమునకు వేదము (ఉపనిషద్భాగము) మూలము; కావున వేదమునే పఠించెదము అను బుద్ధిచే ప్రమాదవశమున నియ్యది యెవనికేని రుచియింపకున్నచో, అతఁడితరమగు ఉపనిషదాది రూపమైన ఆత్మజ్ఞాన శాస్త్రమునే యొకింత విచారింపవలయుగాని, ఆత్మశాస్త్ర విముఖుఁడుమాత్రము కాఁగూడదు.

అనర్థేనావిచారేణ వయః కుర్యాన్న భస్మసాత్
బోధేన జ్ఞానసారేణ దృశ్యం కర్తవ్యమాత్మసాత్. 77

అనర్థప్రదమగు అవిచారణచే ఆయువును నష్టమొనర్పరాదు; శ్రవణ మననాద్యుపాయములచేఁ బ్రాప్తమగు తత్త్వజ్ఞానముచే దృశ్యమును ఆత్మయందు లయింపఁజేసి ఆత్మరూపముగఁ గావింపవలయును.

ఆయుషః క్షణ ఏకోఽపి సర్వరత్నైర్న లభ్యతే
నీయతే తద్వృథా యేన ప్రమాదః సుమహానహో. 78

ఆయువుయొక్క యొక్కక్షణమైనను వ్యర్థముగ గడుపఁబడినచో, మరల అది సమస్త రత్నములచేఁ గూడ లభింపనేరదు. కావున, ఆత్మవిచారములేక ఆయువును వ్యర్థముగ గడుపుట మహాప్రమాదమైయున్నది.

అనుభూతమపి చ నో సద్దృశ్యమిదం ద్రష్టృసహితమపి
స్వప్ననిజమరణబాన్ధవ రోదనమివ సదివ కచితమపి. 79

ఇత్యార్షే శ్రీ వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే ఉత్తరార్ధే పరమార్థగీతాస్వద్వైతయుక్తిర్నామ పఞ్చసప్తత్యధిక శతతమః సర్గః ॥ 175 ॥

ఓ రామచంద్రా! స్వప్నమున తాను మరణింప, చుట్టును బంధువులచేఁగావింపఁబడిన రోదనము ఆ స్వప్నకాలమున సత్యముగ భాసించినను, వాస్తవముగ నెట్లు మిథ్యయేయైయున్నదో, అట్లే యీ దృశ్యమున్ను ప్రత్యక్షముగ ననుభూతమైనప్పటికిన్ని, అంతఃకరణోపహితుఁడగు జీవుఁడను ద్రష్టతోఁగూడి యున్నప్పటికిన్ని, మిథ్యయేయైయున్నది.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున నుత్తరార్ధమున పరమార్థగీతలందు అద్వైతయుక్తియను నూటడెబ్బదియైదవ సర్గము ॥ 175 ॥

## షట్ సప్తత్యధిక శతతమః సర్గః

[స్వప్నవద్భాన్తి సర్గాదౌ బ్రహ్మాణ్డాశ్చిదణావితి
అత్రార్థే బ్రహ్మణా ప్రోక్తం బ్రహ్మాణ్డాఖ్యానమీర్యతే.

సృష్ట్యాదియందు అనేక బ్రహ్మాండములు చైతన్యమను అణువునందు స్వప్నమువలె భాసించుచున్నవను నివ్విషయమున బ్రహ్మదేవునిచేఁ జెప్పఁబడినట్టి బ్రహ్మాండాఖ్యాన మిచట వర్ణింపఁబడుచున్నది.]

**శ్రీరామ ఉవాచ :—**

జగన్తి నన్త్యసంఖ్యాని భవిష్యన్తి గతాని చ
తత్కథాభిః కథం బ్రహ్మన్ప్రబోధయసి మామిమమ్. 1

శ్రీరాముఁడు :— మహాత్మా! అసంఖ్యాతములగు జగత్తులు గడచిపోయినవి. మఱియు రానున్నవి. వానియొక్క బాధఁగూర్చిన కథలద్వారా బంధముయొక్క అభావమును నాకేల బోధించు

మన్నారు? భూత, భవిష్యజ్జగత్తులయొక్క అప్రతీతిచే బంధముయొక్క అభావము స్వతః సిద్ధిం చినదగుచున్నది. కావున వర్తమాన జగత్తుయొక్కయే మార్జనము (తొలగించుట) ను గూర్చి నాకు బోధింపుఁడు.

శ్రీ వసిష్ఠ ఉవాచ :—

జగత్స్వప్నేషు శబ్దార్థసంబన్ధోఽవగతస్త్వయా
న నామ నచ లోకేన వ్యర్థం తత్కథనం తతః. 2

శ్రీ వసిష్ఠుఁడు:— ఓ రామచంద్రా! ఈ (యోగవాసిష్ఠ) శాస్త్ర శ్రవణమునకు అధికారి వగు నీవు, అనేక జగత్తులను స్వప్నముల శబ్దార్థములయొక్క సంబంధమును నెఱిఁగినవో నీకు భూతభవిష్యద్బ్రహ్మాండములయొక్క కథనము వ్యర్థముకానేరదు. ఏలయనిన, పదపదార్థ సంబంధము వ్యాప్తిగ్రహము దృష్టాంతసిద్ధి మున్నగునవి, భూతకాలిక వ్యవహారమున కధీనములై యుండుటఁబట్టి, తద్వ్యవహారమునుగూర్చి వచింపనిచో, అధ్యాత్మ శాస్త్రవిచారమందు ప్రవృత్తి సంభవింపదు.

యా కథావగతాత్మభ్యాం శబ్దార్థాభ్యాం నిగద్యతే
బుధ్యతే పేతరా నాన్తః సైవేహ వ్యవహారిణీ. 3

ఎఱుఁగఁబడినట్టి శబ్దార్థములతోఁడ నే కథ చెప్పఁబడునో, అదియే అంతఃకరణమున బాగుగఁ జొచ్చును. కాఁబట్టి యదియే లోకమున వ్యవహరింపఁబడునుగాని మఱియొకటి కాదు.

యదా విదితవేద్యః సంస్త్రికాలామలదర్శనః
భవిష్యసి తదా తాని ప్రత్యక్షేణైవ భోత్స్యసే. 4

ఓ రామచంద్రా! ఎపుడు నీవు జ్ఞేయమగు పరమాత్మ నెఱిఁగినవాఁడవై, దివ్యదృష్టిగల వాఁడవును, త్రికాలజ్ఞుఁడవు నగుదువో, అపుడు నిజస్వరూపముననే త్రికాలములందలి సమస్త ద్రష్టృ, దృశ్యరూపముల ననుభవించుదువు. గావున, భూత, భవిష్యద్బ్రహ్మాండములకును వర్తమాన బ్రహ్మాండములకును, లేశమైనను విశేషములేదని ప్రత్యక్షముగ నెఱుఁగఁగలవు.

స్వప్నే చిన్మాత్రమేవాద్యం స్వయం భాతి జగత్తయా
యథా తథైవ సర్గాదౌ నాత్రాన్యదుపపద్యతే. 5

స్వప్నమున, సమస్తమునకు ఆదియగు చిన్మాత్రమే స్వవయవముగ జగద్రూపముతోఁడ భాసించునట్లు, భూత, భవిష్యదాది సమస్తసృష్టులయొక్క ఆదియందును, ఆ చిన్మాత్రబ్రహ్మమే జగత్తుగ భాసించుచున్నది. ఇట చైతన్యమునకు అన్యమగు ఎద్దియును తగదు.

అణావణావసంఖ్యాని తేన సన్తి జగన్త్యఖే
తేషాం తాన్వ్యవహారౌఘాన్సంఖ్యాతుం క ఇవ క్షమః 6

ఆ పరమాత్మయొక్క మాయాశక్తిచే నొక్కొక్క అణువునందును అసంఖ్యాతములగు బ్రహ్మాండములు వర్తించుచున్నవి. కావున, ఆ బ్రహ్మాండము లన్నిటియొక్క యా వ్యవహార సమూహములను లెక్కింప నెవరికిఁదరము?

అత్రైవ మే పురా ప్రోక్తమత్రిపుత్రా పద్మజన్మనా
పద్మరేణుమతాఖ్యానం శృణు తత్కథయామి తే. 7

ఇవ్విషయమున పూర్వము, పద్మపరాగములచే వ్యాప్తమైనట్టి దేహముగల మా తండ్రియగు బ్రహ్మదేవుఁడు నాకు వచించినట్టి ఆఖ్యానమును జెప్పుచున్నాను, వినుము.

పురా పృష్టో మయా బ్రహ్మ జగజ్జాలమిదంకియత్
క్వ వా భాతీతి వదమే బ్రహ్మోవాచ తతః స మామ్. 8

పూర్వకాలమున బ్రహ్మదేవుని నేనిట్లు ప్రశ్నించితిని— 'మహాత్మా! ఈ జగత్సమూహమెంత విస్తీర్ణముగలది? ఎచట భాసించుచున్నది?' — అంత నాతఁడిట్లనియె.

శ్రీ బ్రహ్మోవాచ :—

బ్రహ్మైవేదం మునే సర్వం జగదిత్యవభాసతే
సత్తామనన్తం సత్త్వేన జగత్త్వే నాసత్తామపి. 9

శ్రీ బ్రహ్మదేవుఁడు:— ఓ మునీ! బ్రహ్మమే యీ సమస్త జగద్రూపముచే భాసించుచున్నది. ఆ యనంతమగు బ్రహ్మము తత్త్వజ్ఞానులకు బ్రహ్మసత్తారూపముగను, అజ్ఞానులకు జగద్రూపముగను నున్నది.

శుభం మమేదమాఖ్యానం శృణు శ్రవణభూషణమ్
బ్రహ్మాణ్డపిణ్డ ఇత్యుక్తం బ్రహ్మాణ్డాఖ్యానమేవ చ. 10

ఓ రామచంద్రా! కర్ణము (చెవు) లకు భూషణరూపమగు ఈ శుభాఖ్యానమును నీవు నావలన వినుము. దీనినే బ్రహ్మాండాఖ్యానమనియు: లేక బ్రహ్మాండ పిండాఖ్యానమనియు నందురు.

అస్తి ఖే ఖాదనన్యాత్మా చిద్వ్యోమపరమాణుకః
శూన్యరూపమివాకాశే శుద్ధం స్పన్ద ఇవానిలే. 11

ఆకాశమున శూన్యమువలెను, వాయునందు శుద్ధస్పందమువలెను— స్వ సత్తామాత్రముచే జగత్తుయొక్క చేష్టకు కారణమైనట్టి చిదాకాశపరమాణువు — చిదాకాశమున చిదాకాశముకంటె వేఱుగాక వర్తించుచున్నది.

సోఽపశ్యదాత్మనా స్వప్న ఇవ జీవత్వమాత్మని
శూన్యరూపమివాకాశం పవనః స్పన్దనం యథా. 12

ఆకాశము తనయందు శూన్యరూపమును, వాయువు తనయందు స్పందనము (చలనము)ను గాంచునట్లు ఆ చిదాకాశపరమాణువు తనయందు స్వప్నమువలె స్వయముగ సమష్టి జీవత్వమును గాంచెను. (అనుభవించెను.)

ఆకాశరూపమజహదేవ జీవస్తతః స్వయమ్
అపశ్యదహమిత్యేవ రూపమాకాశరూపకమ్. 13

తనయొక్క నిర్వికార, అసంగ, పరిపూర్ణ, సూక్ష్మ చిద్రూపమును త్యజింపకయే యా చైతన్యపరమాణురూపుఁడగు సమష్టిజీవుఁడు తనయందు ఆకాశసదృశమైనట్టి అహంకారమును వీక్షించెను.

అహంకార స్త్వహం బుద్ధిరిత్యేవాపశ్యదాత్మని
ఏకనిశ్చయనిర్మాణమయీ మాయానురూపిణీ. 14

ఆ అహంకారము తనయందు ఏకనిశ్చయముయొక్క నిర్మాణముచేఁ బూర్ణమైనదియు, అసత్పదార్థమునుగూర్చిన భ్రమను గలుగఁజేయునదగుటచే మాయయొక్క అనురూపమైనదియు నగు — బుద్ధిని గాంచెను.

బుద్ధిర్మనోఽహమిత్యేవం స్వప్నే పశ్యదసన్మయమ్
సమయన్త్యాత్మనాత్మానమవికల్పం వికల్పనైః. 15

వికల్పరహితమగు తన్ను వికల్పాభాసములయొక్క ఆరోపణములచే స్వయముగఁ క్రిందికిఁ బడఁద్రోసికొనుచు, ఆ బుద్ధి స్వప్నమందువలె తనయందు, అసన్మయమగు మనస్సును గాంచెను. ('నేను మనస్సును' అను అనుభవమును బొందెను.)

అపశ్యత్తన్మనః స్వప్నే దేహే పశ్చేన్ద్రియం తతః
అనాకారం ఘనాకారం స్వప్నాద్రిత్వమివాజ్ఞధీః. 16

నిద్రయను తమస్సుచే నావరింపఁబడిన జీవుఁడు స్వప్నమున నిరాకారమగు చైతన్యమునే ఘనాకారమగు పర్వతముగఁ గాంచునట్లు, ఆ మనస్సు స్వప్నమందువలె తన దేహమున పంచేంద్రియముల గాంచెను.

దదర్శ స మనో దేహో వపుస్త్రిభువనాత్మకమ్
భాత్మాభాత్యేవ నిర్భిత్తి భిత్తిభాసురమాతతమ్. 17

ఈ ప్రకారముగ, ఆ చిదాకాశ పరమాణువు సమష్టి మనోరూపమై, నిరాకారమైనదియు, భేదవర్జితమైనదియునగు తన స్వరూపముననే సాకారమై, భేదసహితమై, ప్రకాశవంతమై, విశాలమైనట్టి త్రైలోక్యరూపమగు జగత్తు (విరాడ్రూపము)ను అవలోకించెను. ०

అనేకభూతవలితం నానాస్థావరజంగమమ్
కలనాకాలకలితం కల్పితాన్యోన్యసంగమమ్. 18

ఆ త్రైలోక్యము అనేక భూతములచే నావరింపఁబడినదియు, స్థావరజంగమరూపులగు పెక్కుప్రాణికోట్లచే వ్యాప్తమైనదియు, కాలముయొక్క కల్పనతోఁగూడినదియు, పదార్థములయొక్క పరస్పరసంగమము కల్పింపఁబడినదియునై యుండెను.

స్వప్నే ప్రత్యేకమేవాత్ర పశ్యత్యాదర్శబిమ్బితమ్
ఇవ త్రైలోక్యనగరం నవరఙ్గ మనోహరమ్. 19

స్వప్నమందువలె ప్రతివ్యష్టిజీవుఁడును ప్రత్యేకముగ విట ద్రష్టృదర్శనదృశ్య, భోక్తృభోగభోగ్య, కర్తృక్రియాకార్యములను (త్రిపుటిత్రయమను) తొమ్మిదిరంగులచే మనోహరమైనట్టి, అద్దమందు ప్రతిబింబించిన నగరమువంటి ఈ త్రైలోక్యమును గాంచుచున్నాఁడు.

అథ ప్రత్యేక మత్రాపి నవరఙ్గమనోహరమ్
త్రిజగద్వేత్తిహృదయేస్వాదర్శ ఇవ బిమ్బితమ్. 20

స్వప్నమందువలె ఈ జాగ్రత్తునందును త్రటివ్యష్టిజీవుఁడును ప్రత్యేకముగ తన హృదయమున, నవరంగ త్రిపుటిత్రయ మనోహరమైనదియు, అద్దమందుఁ బ్రతిబింబించినదాని వంటిదియు నగు ఈ త్రైలోక్యము ననుభవించుచున్నాఁడు.

పరమాణోః పరమాణో రితిస న్తి తనూదరే
అతనూని జగన్త్యత్ర ప్రఘ్నానీవ చ తాన్యపి. 21

ఈ ప్రకారముగఁ బ్రత్యేకజీవభేదములచే విభిన్నమైనట్టి చిదాకాశ పరమాణువుయొక్క అతిసూక్ష్మమైన యుదరమందు పూర్వోక్తరీతిగ కల్పితములైన అసంఖ్యాతములగు విశాలములైన మహాజగంబులు కలవు. అయ్యవి జీవ, పృథివ్యాదిసమూహములచేఁ బూర్ణములై యొప్పుచున్నవి.

అవిద్యేయమన న్తేయమవిద్యాత్వేన చేతితా
బ్రహ్మాత్వేన పరిజ్ఞాతా భవతి బ్రహ్మ నిర్మలమ్. 22

ఇదియంతయును (స్వాత్మతత్త్వమునుగూర్చిన అజ్ఞానముయొక్క రూపమైన) అవిద్యయే యైయున్నది. ఆత్మతత్త్వముయొక్క అజ్ఞానముచే ఈ అవిద్య అంతమై యొప్పుచున్నది. కాని, ఆత్మజ్ఞానముచే నివారింపఁబడినచో నిర్మలమగు బ్రహ్మమే యగుచున్నది

ఏవం ద్రష్టాపి యః స్వప్నజాలం దృష్టే న కించ న
కోఽత్ర ద్రష్టా కుతో దృశ్యం క్వ ద్వైతం క్వ చ కారణమ్. 23

ఇట్లు సమస్తము బ్రహ్మరూపముగఁ గాంచఁబడనపుడు దృశ్యము స్వప్నజాలమువంటి దియే యగును. గావున నిఁక నందు ద్రష్టయెకింతైనను లేకుండును. ద్రష్టయే లేనపుడిఁక దృశ్యమెచట? ద్రష్టదృశ్యములు లేనపుడిఁక ద్వైతమెచట ? దాని కారణమున్ను నెచట ?

సర్వం నిః శాన్తమాభాతం భాత్మనిర్వృత్తి కేవలమ్
బ్రహ్మాత్మని స్థితం స్వచ్ఛమాద్యన్త పరివర్జితమ్. 24

కావున, కేవలము మహాశాంతమై, భేదరహితమై, నిర్మలమై, అద్యంతపరివర్జితమైనట్టి చిదాకాశమగు బ్రహ్మమే తనయందుఁ దానిట్లు సమస్త జగద్రూపముచే స్థితినొందియున్నదగును.

బ్రహ్మాణ్డలక్షనిచయాః పరమాత్మనీతి నిత్యం స్థితా నిపుణమన్యవదప్యనన్యే
వారిణ్యవారితవిసారితరఙ్గవేగాల్లోలం స్థితామ్బుపరమాణుచయా యదై తే. 25

ఇత్యార్షే శ్రీవాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే ఉత్తరార్ధే బ్రహ్మగీతాసు బ్రహ్మాణ్డోపాఖ్యానం నామ షట్సప్తత్యధిక శతతమః సర్గః ॥ 176 ॥

ఓ రామచంద్రా ! సముద్రమందు, నిరోధింపఁబడనిదియు, ప్రచురించునదియునగు తరంగవేగమను కారణముచేఁ చంచలమైయుండునట్టి జలముయొక్క అసంఖ్యాతములైన పరమాణు సమూహములు వర్తించునట్లు, అజ్ఞానముండువఱకును, పరమాత్మయందు లక్షలకొలది బ్రహ్మాండ సమూహములు పూర్వోక్తరీతి - నిత్యము అభిన్నములై యున్నప్పటికిని మిగుల భిన్నములైనవాని వలె భాసించుచున్నవి.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున నుత్తరార్ధమున బ్రహ్మగీతలందు బ్రహ్మాండోపాఖ్యానమను నూట డెబ్బదియాఱవ సర్గము ॥ 176 ॥



## సప్తసప్తత్యధికశతతమః సర్గః

[సకారణం కల్పనయా వస్తుదృత్యా త్వకారణమ్
జగత్స్వప్నసమం మోహాద్బోధాద్బ్రహ్మేతి వర్ణ్యతే.

కల్పనాదృష్టిచే కారణసహితమైనదియు, యథార్థదృష్టిచే కారణ రహితమైనదియునగు ఈ జగత్తు, అజ్ఞానముచే దృశ్యరూపమైనదనియు, జ్ఞానముచే కేవలము బ్రహ్మరూపమేయనియు నిచట వర్ణింపఁబడుచున్నది.]

శ్రీరామ ఉవాచ :—

> అకారణకమేవేదం జగద్బ్రహ్మ పరాత్పదాత్
> యది ప్రవర్తతే నామ స్వప్న సంకల్పనాదివత్. 1
> తదకారణతః సిద్ధేః సంభవేఽన్యదకారణమ్
> కథం న జాయతే వస్తు క్వచిత్కించిత్కదాచన. 2

శ్రీరాముఁడు:— మహాత్మా ! స్వప్న, సంకల్పాదులవలె. ఈ జగత్తు బ్రహ్మరూపమగు, పరమపదమునుండి కారణములేకయే యుత్పన్నమగుచో, అపుడు సమస్త అభిలషితవస్తువుల యొక్కయు నుత్పత్తికారణములేకయే సంభవింపవలయునుగదా ! అట్టిచో, కారణము సస్య. ధాన్యాది రూపమగు కార్యము కృషీవలులకు కృషి, వృష్ట్యాది రూపమగు కారణములేకయే యొకింతైనను నెచటను నెపుడును ఏల సంభవించుటలేదు.

శ్రీ వసిష్ఠ ఉవాచ :—

> యద్యథా కల్పితం యేన స సంపశ్యతి తత్తథా
> కల్పనైవాన్యథా నస్యాత్తాదృక్కారణ విద్యతే. 3

శ్రీ వసిష్ఠుఁడు:— ఓరామచంద్రా ! వ్యవహారదశయందెవఁడు దృఢాభ్యాసముచే దేనినెట్లు కల్పించునో, అతఁడు దాని నావిధముగనే (కల్పితకార్య కారణనియమబద్ధముగ) గాంచును. అట్లు కాక వ్యవహారమందును వ్యావహారికనియమము లేనియెడల, ఏకల్పనయు నుండఁజాలదు. గనుక, అపుడు తత్త్వజ్ఞానాభ్యాసముయొక్కయు కల్పనలేమి అనభ్యాసముచేతనే సర్వజనముక్తి ప్రసంగము సిద్ధింపవలసియుండును.

> యథేదం కల్పితం దృశ్యం మనసా యేన తత్తథా
> వేత్త్యసౌ యాదృగన్యేన కల్పితం వేత్త్యసౌ తథా. 4

ెవఁడు మనస్సుచే ఈ దృశ్యము నేవిధముగ కల్పించునో, దానినాతఁడావిధముగనే యను. వించును. దానినే మఱియొకఁడు నిజకల్పనాభేదముచే మఱియొకవిధముగ ననుభవించును.

> కల్పనాకల్పనాత్మైకం తచ్ఛబ్రహ్మ స్వభావతః
> కల్పనాత్మేదృశం జన్తుర్యథా కేశనఖాదిమాన్. 5

కల్పన, అకల్పనరెండును ఏకమగు బ్రహ్మముయొక్క స్వభావమువలననే యేర్పడిన వగును. అట, అచిదంశము కల్పనారూపము, చిదంశము అకల్పనారూపము. చేతనుఁడగు మనుజుఁడు కేశ నఖాది అచేతనపదార్థయుక్తుఁడైయు వర్తించునట్లు, ఈ జగత్తు, కల్పన అకల్పన లను ఉభయరూపములతోను గూడియున్నది.

అకారణపదార్థత్వం సకారణపదార్థతా
బ్రహ్మణి ద్వయమప్యస్తి సర్వశక్త్యాత్మ తద్యతః. 6

పరమార్థదృష్టిచే పదార్థములు అకారణములున్ను, కల్పనాదృష్టిచే సకారణములున్ను నగును. ఇట్లు బ్రహ్మమందారెండు ధర్మములును, అవిరోధపూర్వకముగ వర్తించుచున్నవి. ఏల యనిన ఆ బ్రహ్మము సర్వశక్తివంతమై యలరారుచున్నది.

యతః స్యాద్బ్రహ్మణస్త్వన్యత్క్వచిత్కించిత్కదాచ న
తత్కారణవికల్పేన సంయోగస్తస్య యుజ్యతే. 7

అజ్ఞానుల దృష్టిచే బ్రహ్మముకంటె భిన్నముగ నెచటనైన నెపుడైన నేదేని ప్రతీత మగుచో, అది కారణమునుగూర్చిన వికల్పముచేతనేయగును. బ్రహ్మముతోడ దానియొక్క సంయోగమే యుక్తమైనది

యత్ర సర్వమనాద్యన్తం నానానానాత్మ భాసతే
బ్రహ్మైవ శాన్తమేకాత్మ తత్ర కిం కస్య కారణమ్. 8

ఎచట అనాదియై, అనంతమై, ఏకమై శాంతమైనట్టి బ్రహ్మమే (నిజమాయాశక్తిచే) అనే కరూపముతోడ జగత్తుగ భాసించుచున్నదో అచట నిఁక నేది దేనియొక్క కారణమగును?

నేహ ప్రవర్తతే కించిన్న చ నామ నివర్తతే
స్థితమేకమనాద్యన్తం బ్రహ్మైవ బ్రహ్మభాత్మకమ్. 9

ఈ ప్రపంచమున వాస్తవముగ నొకింతైనను నుత్పన్నమగుటలేదు. నశించుటలేదు. ఏకమై ఆద్యంతరహితమైనట్టి చిదాకాశరూపమగు బ్రహ్మమేయిటస్థితిగల్గియున్నది. తదన్యముగ నెద్దియునులేదు.

కిం కస్య కారణం కేన కిమర్థం భవతు క్వ వా
కిం కస్య కారణం కేన కిమర్థం మాస్తు వా క్వచిత్. 10

ఎపుడు పరమార్థముగ, అకారణత్వమే కలదో, కారణత్వము కేవలము కల్పనా మాత్రమైయున్నదో, అపుడిఁక నేది యెచట నెందుకొఱకు దేనియొక్క కారణముకావలెను. ఏది యెచట నెందుకొఱకు దేనియొక్క కారణము కాఁగూడదు? ఏలయనిన, కల్పితమైన, కార్యము యొక్క యుత్పత్తియు, అనుత్పత్తియు రెండును సమానములై, అవిరుద్ధములై యున్నవి.

నేహ శూన్యం న వా శూన్యం న సన్నాసన్న మధ్యతా
విద్యతే న మహాశూన్యే న నేతి న న నేతి చ. 11

ఈ బ్రహ్మమందు శూన్యత్వముగాని, అశూన్యత్వముగాని లేవు (అశూన్యత్వము శూన్య త్వము నపేక్షించియే యేర్పడునది యగుటవలన) అట్లే సత్తుగాని, అసత్తుగాని, సదసత్తుగాని లేవు.

మఱియు మహాశూన్యమగు పదార్థరహితమగు) ఈ చిదాకాశమున 'ఇది అవును. ఇదికాదు' అను భావమున్ను లేదు.

ఇదం న కించిత్కించిద్వా యన్నామాన్యథ నాస్తి వా
సర్వం బ్రహ్మైవ తద్విద్ధి యత్రత్రైవాతత్రైవ తత్. 12

ఓ రామచంద్రా! ఈ సమస్తమున్ను దృశ్యరూపముచే నేమియుగాకయున్నది; కాని అధిష్ఠానరూపముచే సద్రూపమై వెలయుచున్నది. అట్లే యిది దృశ్యరూపముచే లేదు. అధిష్ఠాన రూపముచే కలదు. ఏలయనిన ఆ బ్రహ్మమును, అధ్యారోపదృష్టిచే సర్వరూపముగను, అపవాద దృష్టిచే సర్వ పదార్థరహితముగను నెఱుఁగుము.

శ్రీరామ ఉవాచ:—

అతజ్జ్ఞవిషయే బ్రహ్మన్కార్యే కారణసంభవే
కిమకారణతాత్మ స్యాత్కథం వేత్తి వదప్రభో. 13

శ్రీరాముఁడు :— ప్రభూ; మహాత్మా! ఎపుడు తాము అజ్ఞానుల బోధనార్థము, అధ్యా రోప, అపవాదములను స్వీకరించి కార్యకారణభావముల నంగీకరించుచున్నారో, అపుడిఁక ప్రధాన, పరమాణ్వాదిప్రయుక్తమగు కార్యకారణభావమునుగూడ నేల అంగీకరింపరాదు? పృథి వ్యాది భూతములను కార్యముయొక్క అవయవపరంపరాసూక్ష్మత్వముయొక్క అవధిభూతమగు పరమాణువులను నట్టిగాని, సత్త్వాది గుణములనునట్టిగాని కారణములు సంభవించుచుండ నిఁక ఏ పదార్థము కారణరహితముగ నుండఁగలదు? మఱియు, అత్తఱి అద్వితీయ బ్రహ్మమే యెట్లు శేషించును?

శ్రీ వసిష్ఠ ఉవాచ:—

అతజ్జ్ఞో నామ నాస్త్యేవ తావత్తజ్జ్ఞజనం ప్రతి
అసతో వ్యోమవృక్షస్య విచారః కీదృశ స్తతః. 14

శ్రీవసిష్ఠుఁడు:— ఓరామచంద్రా! సృష్టికిఁ బూర్వము బ్రహ్మమే గలదు! ఈ జగత్తంతయు బ్రహ్మరూపమేయైయున్నది. అను నీమున్నగు శ్రుత్యర్థములఁబట్టి, అజ్ఞానియే వాస్తవముగ లేకయుండ నిఁక అజ్ఞానికొఱకై జ్ఞానికి ఆకాశవృక్షమువలె అసత్తైనట్టి యీ జగత్తునుగూర్చిన విచారణ యెట్లు సంభవించును, (అధ్యారోప, అపవాదక్రమము కేవలము బ్రహ్మబోధార్థము కల్పింపఁబడినదే యగును.)

ఏకబోధమయాః శాన్త విజ్ఞానఘనరూపిణః
తత్ జ్ఞాస్తేషామసద్రూపే కథమర్థే విచారణా. 15

అద్వైతబోధమయులును, శాంతవిజ్ఞాన ఘనరూపులును నగు జ్ఞానులకు, అసద్రూప మగు పదార్థమున పరమాణ్వాది కారణములఁగూర్చిన విచారణ యెట్లు సంభవించును?

అతజ్జ్ఞత్వం చ బోధేఽన్తరవభాతి తదజ్ఞతా
గతే స్వప్నసుషుప్తేఽన్తరివ నిద్రాత్మ కేవలమ్. 16

స్వప్న, సుషుప్తులు నిద్రయందు నిద్రయొక్క అవయవరూపత్వమును బొందఁగా, నానియొక్క స్వరూపమప్పుడు నిద్రయేగాని తద్వ్యతిరిక్తమెట్లుకాదో, అట్లే బోధమయమై, అధిష్ఠాన రూపమైనట్టి పరబ్రహ్మమందు అజ్ఞత్వమున్ను 'నేను అజ్ఞానిని' అను ఈ యనుభవము, తదవయవ రూపత్వమును బొందినదై భాసించుచున్నది. గావున నదియు, అపరబ్రహ్మముకంటె వేఱుకాదు.

తథావ్యత్యవగమ్యాపి మూర్ఖనిశ్చయ ఉచ్యతే
మయేదమణు సర్వాత్మ యస్మాద్బ్రహ్మ నిరామయమ్. 17

అజ్ఞానాది సమస్తజగత్తుయొక్క అధిష్ఠానము బ్రహ్మము అను నీప్రకారమైన బ్రహ్మము యొక్క యీ తటస్థలక్షణమును, నేను అజ్ఞానులయొక్క బోధనార్థము వారి బుద్ధిననుసరించి శుద్ధ బ్రహ్మమును బోధించునిమిత్తమే యంగీకరించి చెప్పితిని. అంతేగాని దానిస్వరూపలక్షణమైతే నిత్య, శుద్ధ, నిర్వికార, అనందైకరసత్వమే యైయున్నది.

సన్త్యకారణకా ఏవ సన్తి కారణకా స్తథా
భావాః సంవిద్యథా యస్మాత్కల్ప్యతే లభ్యతే తథా. 18

కల్పనానుసారము జగత్పదార్థములు కారణసహితములును కారణరహితములును గూడనైయున్నవి. ఏలయనిన, సంవిత్తు (బుద్ధి) దేనినెట్లు కల్పించునో, దానినావిధముగనే నిజాను భవమునుఁ బొందును. (కావున, అజ్ఞానుల బుద్ధిననుసరించి జగత్తును వేఱుగఁ గల్పించి యట్టి మిథ్యాభూతమగు జగత్తునకు మిథ్యాభూతమగు మాయయే కారణమని వచించుటలో, వాస్తవా ద్వైతమునకు ఏ హానియును లేదు.)

సర్వకారణ సంశాన్తౌ సర్వానుభవశాలినామ్
సర్గస్య కారణం నాస్తి తేన సర్గస్త్వకారణః. 19

సమస్త జగత్తుయొక్కయు కారణభూతమగు అవిద్య జ్ఞానముద్వారాశమింప, అనుభవ శీలురగు తత్త్వవేత్తల దృష్టియందిఁక సృష్టియొక్క కారణ మేదియు లేకుండును. కావున, ఈ సృష్టి వాస్తవముగ కారణరహితమేయైయున్నది.

హృదయంగమతాత్యక్తమీశ్వరాది ప్రకల్ప్యతే
యదత్ర కించిద్దుఃస్వాదు వ్యర్థం వాగ్జాలమేవ తత్. 20

స్వప్న, గంధర్వనగర, మృగతృష్ణాసదృశమగు ఈ మిథ్యాజగత్తునందు సత్యత్వమును సాధించు నిమిత్తము వైశేషికాదులచే 'మాయాంతు ప్రకృతిం విద్యాన్మాయినంతు మహేశ్వరమ్' ఇత్యాదిశ్రుతి ప్రసిద్ధమైన మాయోపహితబ్రహ్మముకంటె వేఱుగ తటస్థేశ్వర, ప్రధాన, పరమాణ్వాది రూపమైన ఒకింతకారణమెయ్యది కల్పింపఁబడుచున్నదో, అది ప్రత్యక్ష, శ్రుతి, విద్వదనుభవ విరోధమువలన స్వాదరహితమైయున్నందున తత్త్వజ్ఞులకు హృదయంగమముకానిదై యొప్పు చున్నది. కాఁబట్టి యది వ్యర్థకంఠ శోషయు వాగ్జాలముమాత్రమేయగును.

అన్యథానుపపత్త్యైవ స్వప్నాభాకలనాదృతే
స్థూలాకారాత్మికా కాచిన్నాస్తి దృశ్యస్య దృశ్యతా. 21

జ్ఞానముచే బాధితమగుటవలన ఈ దృశ్యజగత్తునకు స్వప్నమువంటి కల్పన తప్ప స్థూలాకారమగు దృశ్యరూపత్వమేమియునులేదు. (కావున అట్టిదానికొఱకై యిఁక కారణ కల్పనను గూర్చిన అవకాశమే లేదని భావము.)

స్వప్నపృథ్వ్యాద్యనుభవే కిమబుద్ధస్య కారణమ్
చిత్స్వభావాదృతే బ్రూహి స్వప్నార్థో నామ కీదృశః. 22

ఓ రామచంద్రా! స్వప్నమందలి పృథ్వ్యాదులయొక్క యనుభవమందు అజ్ఞానికి ఏ కారణముగలదు? మఱియు, చిత్స్వభావముకంటె భిన్నముగ స్వప్నపదార్థము మఱెట్టిదో చెప్పుము.

స్వప్నార్థో హ్యవరిజ్ఞాతో మహామోహభరప్రదః
పరిజ్ఞాతో న మోహాయ యథా సర్గాస్తథైవ చ. 23

స్వప్నపదార్థము మిథ్యారూపముగ తెలిసికొనఁబడనంతవఱకును మహామోహాతిశయమును గలుగఁజేయునదియు, తెలిసికొనఁబడిన పిదప మోహమును గలుగఁజేయనిదియు నెట్లగునో, అట్లే యీ జగత్తున్ను మిథ్యారూపముగ నెఱుఁగఁబడినచో దుఃఖప్రదము కానేరదు.

శుష్కతర్కహఠావేశాద్యద్వా స్వప్నానుభవోజ్ఝితమ్
కల్ప్యతే కారణం కించిత్సా మౌర్ఖ్యాభినివేశితా. 24

శుష్కతర్కమునుగూర్చిన హఠముయొక్క యావేశముచే స్వప్నాద్యనుభవమును విడిచి, జగత్తునకు ప్రధాన, పరమాణ్వాదిరూపమగు ఒకింతకారణమును గల్పించుచో, అది, మూర్ఖత్వముతోఁటియైన పట్టుదలమాత్రమే యగును.

అగ్నేరౌష్ణ్యమపాం శైత్యం ప్రాకాశ్యం సర్వతేజసామ్
స్వభావో వాఖిలార్థానాం కిమబుద్ధస్య కారణమ్. 25

ఒక వేళ అవశ్యము కారణము అపేక్షింపఁబడుచో, అగ్నికి నుష్ణత్వమున్ను, జలమునకు శీతలత్వమున్ను సమస్తతేజములకు ప్రకాశమున్ను కారణమైయున్నట్లు, సర్వపదార్థములకును, అజ్ఞానోపహితమగు బ్రహ్మముయొక్క స్వభావముతప్ప మఱియేమి కారణము కాఁగలదు?

కిం ధ్యాతృశతలబ్ధస్య ధ్యేయస్యైకస్య కారణమ్
కించ గన్ధర్వనగరే పురే భిత్తిషు కారణమ్. 26

మనోరథకల్పితనగరమువలె ధ్యాతృ (కల్పక) భేదముచే ధ్యేయము (జగత్తు)యొక్కయు ఆకారభేదము సంభవించును. గావున అద్దానికి సర్వసామాన్యమగు ఏకమైన కారణము వచించుట కలవికాదు. కావున అనేక ధ్యాతలచే లబ్ధమగు పదార్థమున కొకే కారణమెట్లు? మఱియు, గంధర్వనగరమందలి భిత్త్యాదులకు కారణమేముండును?

ధర్మాద్యమూర్తామూర్తత్వాన్మూర్తే దేహే న కారణమ్
దేహస్య కారణం కిం స్యాత్తత్ర సర్గాదిభోగినః. 27

కర్మమీమాంసకుల కల్పనయు సరికాదు. ఏలయునిన, పరలోకమందలి ధర్మాధర్మాదులు అమూర్త (నిరాకారములగుటవలన, మూర్తములగు దేహాదులకవి ఉపాదానకారణము

స్వప్న, సుషుప్తులు నిద్రయందు నిద్రయొక్క అవయవరూపత్వమును బొందఁగా, దానియొక్క స్వరూపమప్పుడు నిద్రయేగాని తద్వ్యతిరిక్తమెట్లుకాదో, అట్లే బోధమయమై, అధిష్ఠానరూపమైనట్టి పరబ్రహ్మమందు అజ్ఞత్వమున్ను 'నేను అజ్ఞానిని' అను ఈ యనుభవము, తదవయవరూపత్వమును బొందినదై భాసించుచున్నది. గావున నదియు, ఆపరబ్రహ్మముకంటె వేఱుకాదు.

తథావ్యభ్యుపగమ్యాపి మూర్ఖనిశ్చయ ఉచ్యతే
మయేదమణు సర్వాత్మ యస్మాద్బ్రహ్మ నిరామయమ్. 17

అజ్ఞానాది సమస్తజగత్తుయొక్క అధిష్ఠానము బ్రహ్మము అను నీప్రకారమైన బ్రహ్మముయొక్క యీ తటస్థలక్షణమును, నేను అజ్ఞానులయొక్క బోధనార్థము వారి బుద్ధిననుసరించి శుద్ధబ్రహ్మమును బోధించునిమిత్తమే యంగీకరించి చెప్పితిని. అంతేగాని దానిస్వరూపలక్షణమైతే నిత్య, శుద్ధ, నిర్వికార, ఆనందైకరసత్వమే యైయున్నది.

సన్త్యకారణకా ఏవ సన్తి కారణకాస్తథా
భావాః సంవిద్యథా యస్మాత్కల్ప్యతే లభ్యతే తథా. 18

కల్పనానుసారము జగత్పదార్థములు కారణసహితములును కారణరహితములును గూడనైయున్నవి. ఏలయనిన, సంవిత్తు (బుద్ధి) దేనినెట్లు కల్పించునో, దానినావిధముగనే నిజానుభవమునుఁ బొందును. (కావున, అజ్ఞానుల బుద్ధిననుసరించి జగత్తును వేఱుగఁ గల్పించి యట్టి మిథ్యాభూతమగు జగత్తునకు మిథ్యాభూతమగు మాయయే కారణమని వచించుటలో, వాస్తవాద్వైతమునకు ఏ హానియును లేదు.)

సర్వకారణ సంశాన్తౌ సర్వానుభవశాలినామ్
సర్గస్య కారణం నాస్తి తేన సర్గస్త్వకారణః. 19

సమస్త జగత్తుయొక్కయు కారణభూతమగు అవిద్య జ్ఞానముద్వారాశమింప, అనుభవశీలురగు తత్త్వవేత్తల దృష్టియందిఁక సృష్టియొక్క కారణ మేదియు లేకుండును. కావున, ఈ సృష్టి వాస్తవముగ కారణరహితమేయైయున్నది.

హృదయంగమతాత్యక్తమీశ్వరాది ప్రకల్ప్యతే
యదత్ర కించిద్బుధఃస్వాదు వ్యర్థం వాగ్జాలమేవ తత్. 20

స్వప్న, గంధర్వనగర. మృగతృష్ణాసదృశమగు ఈ మిథ్యాజగత్తునందు సత్యత్వమును సాధించు నిమిత్తము వైశేషికాదులచే 'మాయాంతు ప్రకృతిం విద్యాన్మాయినంతు మహేశ్వరమ్' ఇత్యాదిశ్రుతి ప్రసిద్ధమైన మాయోపహితబ్రహ్మముకంటె వేఱుగ తటస్థేశ్వర, ప్రధాన, పరమాణ్వాదిరూపమైన ఒకింతకారణమెయ్యది కల్పింపఁబడుచున్నదో, అది ప్రత్యక్ష, శ్రుతి, విద్వదనుభవవిరోధమువలన స్వాదరహితమైయున్నందున తత్త్వజ్ఞులకు హృదయంగమముకానిదై యొప్పచున్నది. కాఁబట్టి యది వ్యర్థకంఠశోషయు వాగ్జాలముమాత్రమేయగును.

అన్యథానుపపత్త్యైవ స్వప్నాభాకలనాదృతే
స్థూలాకారాత్మికా కాచిన్నాస్తి దృశ్యస్య దృశ్యతా. 21

జ్ఞానముచే బాధితమగుటవలన ఈ దృశ్యజగత్తునకు స్వప్నమువంటి కల్పన తప్ప స్థూలాకారమగు దృశ్యరూపత్వమేమియునులేదు. (కావున అట్టిదానికొఱకై యిఁక కారణ కల్పనను గూర్చిన అవకాశమే లేదని భావము.)

స్వప్నపృథ్వ్యాద్యనుభవే కిమబుద్ధస్య కారణమ్
చిత్స్వభావాదృతే బ్రూహి స్వప్నార్థో నామ కీదృశః. 22

ఓ రామచంద్రా! స్వప్నమందలి పృథ్వ్యాదులయొక్క యనుభవమందు అజ్ఞానికి ఏ కారణముగలదు? మఱియు, చిత్స్వభావముకంటె భిన్నముగ స్వప్నపదార్థము మఱెట్టిదో చెప్పుము.

స్వప్నార్థో హ్యపరిజ్ఞాతో మహామోహాతిరప్రదః
పరిజ్ఞాతో న మోహాయ యథా సర్గాస్తథైవ చ. 23

స్వప్నపదార్థము మిథ్యారూపముగ తెలిసికొనఁబడనంతవఱకును మహామోహాతిశయమును గలుగఁజేయునదియు, తెలిసికొనఁబడిన పిదప మోహమును గలుగఁజేయనిదియు నెట్లగునో, అట్లే యీ జగత్తున్ను మిథ్యారూపముగ నెఱుఁగఁబడినచో దుఃఖప్రదము కానేరదు.

శుష్కతర్కహఠావేశాద్యద్వాప్యనుభవోజ్ఝితమ్
కల్ప్యతే కారణం కించిత్సా మౌర్ఖ్యాభినివేశితా. 24

శుష్కతర్కమునుగూర్చిన హఠముయొక్క యావేశముచే స్వప్నాద్యనుభవమును విడిచి, జగత్తునకు ప్రధాన, పరమాణ్వాదిరూపమగు ఒకింతకారణమును గల్పించుచో, అది, మూర్ఖత్వముతోటియైన పట్టుదలమాత్రమే యగును.

అగ్నేరౌష్ణ్యమపాం శైత్యం ప్రాకాశ్యం సర్వతేజసామ్
స్వభావో వాఖిలార్థానాం కిమబుద్ధస్య కారణమ్. 25

ఒక వేళ అవశ్యము కారణము అపేక్షింపఁబడుచో, అగ్నికి నుష్ణత్వమున్ను, జలమునకు శీతలత్వమున్ను సమస్తతేజములకు ప్రకాశమున్ను కారణమైయున్నట్లు, సర్వపదార్థములకును, అజ్ఞానోపహితమగు బ్రహ్మముయొక్క స్వభావముతప్ప మఱియేమి కారణము కాఁగలదు?

కిం ధ్యాతృశతలబ్ధస్య ధ్యేయస్యైకస్య కారణమ్
కిం చ గన్ధర్వనగరే పురే భిత్తిషు కారణమ్. 26

మనోరథకల్పితనగరమువలె ధ్యాతృ (కల్పక) భేదముచే ధ్యేయము (జగత్తు)యొక్కయు ఆకారభేదము సంభవించును. గావున అద్దానికి సర్వసామాన్యమగు ఏకమైన కారణము వచించుట కలవికాదు. కావున అనేక ధ్యాతలచే లబ్ధమగు పదార్థమున కొకే కారణమెట్లు? మఱియు, గంధర్వనగరమందలి భిత్త్యాదులకు కారణమేముండును?

ధర్మాద్యమూర్తామూర్తత్వాన్మూర్తే దేహే న కారణమ్
దేహస్య కారణం కిం స్యాత్తత్ర సర్గాదిభోగినః. 27

కర్మమీమాంసకుల కల్పనయు సరికాదు. ఏలయునిన, పరలోకమందలి ధర్మాధర్మాదులు అమూర్త (నిరాకారములగుటవలన, మూర్తములగు దేహాదులకవి ఉపాదానకారణము

కాఁజాలవు. ఇట్లు దేహమునకే యవి కారణము కాఁజాలనపుడిఁక విశాలాకారయుక్తములగు సృష్ట్యాదులకవి యెట్లు కారణము కాగల్గును ?

భిత్త్యభిత్త్యాదిరూపాణాం జ్ఞానస్య జ్ఞానవాదినః
కిం కారణమనన్తానాముత్పన్నధ్వంసినాం ముహుః. 28

విజ్ఞానవాదులమతమునకుఁజెందిన నిరాకార, క్షణిక విజ్ఞానమున్ను స్థూలకుడ్యాది రూపములును, సూక్ష్మపరమాణురూపములును, అనంతములును మరల మరల (ఉత్పత్తి వినాశములఁ బొందునవియునగు) క్షణికపదార్థముల యొక్క ఉపాదానకారణ మెట్లు కాఁగలదు ?

స్వభావస్య స్వభావోఽసౌ కిల కారణమిత్యపి
యదుచ్యతే స్వభావస్య సా పర్యాయోక్తి కల్పనా. 29

ఇఁక అంకురాది స్వభావమునకు కాల క్షేత్ర, జలాదిసహిత బీజాదిస్వభావము కారణమని వచించు స్వభావవాదులగు చార్వాకుల మతమున్ను సరికాదు, ఏలయనగా బీజస్వభావము, అంకురస్వభావము అను రెండు పదములయొక్క అర్థము అభిన్నమైయుండుటబట్టి అంకుర స్వభావమునకు అనుపపన్నార్థ సంబంధమచట అయుక్తమైయున్నది. ఆ రెండు పదములును పర్యాయ వాచకములగుటచే వారి యాకల్పన నిరర్థకమే యగును.

తస్మాదకారణా భ్రాన్తిర్భావా భ్రాన్తి చ కారణమ్
అజ్ఞే జ్ఞే త్వఖిలం కార్యం కారణాద్భవతి స్థితమ్. 30

కాఁబట్టి సమస్తపదార్థములున్ను కారణరహితములై, అజ్ఞానియొక్క దృష్టియందు భ్రాంతిచేఁ కారణసహితములైన వానివలె భాసించుచున్నవి జ్ఞానియొక్క దృష్టియందు సర్వ కార్యములున్ను చిద్రూపములేయైయున్నవి. ఏలయనఁగా ఆ చైతన్యమునుండియే సమస్త పదార్థములున్ను తచ్చైతన్య చమత్కారముచే ఆవిర్భావ, తిరోభావములను బొందుచునున్నవగును.

యద్వత్స్వప్న పరిజ్ఞానాత్స్వప్నే ద్రవ్యాపహారిభిః
న దుఃఖకారణం తద్వజ్జీవితం తత్త్వదర్శనాత్. 31

స్వప్న మెఱుగఁబడినపిదప స్వప్నమందలి ద్రవ్యాపహారులగు చోరులచేఁ గావింపఁబడిన తాడన బంధనాదికమిఁక మనుజునకెట్లు దుఃఖకారణము కాఁజాలదో, అట్లే తత్త్వదర్శనానంతరమున్ను (జగత్తు మిథ్యయని యెఱుఁగఁబడుటవలన) మనుజునకు జీవితమిఁక దుఃఖకారణము కానేరదు.

సర్గాదావేవ నోత్పన్నం దృశ్యం చిద్గగనం త్విదమ్
స్వరూపం స్వప్నవద్భాతి నాన్యదత్రోపపద్యతే. 32

ఏలయనిన, సృష్ట్యాదియందే యీదృశ్య ముత్పన్నముకాకయున్నది. చిదాకాశస్వరూపమే స్వప్నమువలె నిట్లు పదార్థరూపముగ భాసించుచున్నది. చిదాకాశముకంటె భిన్నముగ నిఁకనేదియు తగదు.

అన్యా న కాచిత్కలనా దృశ్యతే సోపపత్తికా
అస్మాన్న్యాయాదృతే కస్మాద్బ్రహ్మైవైషానుభూతిభూః. 33

ఇట్టి న్యాయముకంటె వేఱుగ మఱియేకల్పనాయుక్తియుఁ గానఁబడుటలేదు. కావున, ఈ జగత్కల్పన బ్రహ్మానుభవ మాత్రమేయైయున్నది.

ఊర్మ్యావర్తద్రవత్వాది శుద్ధే జలఘనే యథా
తథేదం సర్గపర్యాయం బ్రహ్మణి బ్రహ్మ భాసతే. 34

శుద్ధజలమందు తరంగ, ఆవర్త, ద్రవత్వాదులేప్రకారముగ భాసించుచున్నవో, ఆప్రకారముగనే బ్రహ్మమందును, బ్రహ్మరూపమేయగు ఈ సృష్టి భాసించుచున్నది. (బ్రహ్మము సృష్టియొక్క పర్యాయమేయైయున్నది.)

స్పన్దావర్తవివర్తాది నిర్మలే పవనే యథా
తథాయం బ్రహ్మపవనే సర్గస్పన్దోఽవభాసతే. 35

నిర్మలమగు వాయువందు స్పంద, ఆవర్త, వివర్తాదులెట్లు భాసించుచున్నవో, అట్లే బ్రహ్మమను వాయువందీ సృష్టియను స్పందము భాసించుచున్నది.

యథానన్తత్వసౌషిర్యశూన్యత్వాది మహామ్బరే
స సన్నాసన్న బోధాత్మ తథా సర్గః పరావరః. 36

మహాకాశమున, అనంతత్వ ఛిద్రత్వ, శూన్యత్వాదు లేరీతి వర్తించుచున్నవో, ఆరీతిగనే యీ జగత్తున్ను, బోధాత్మయై, పరాపరమైనట్టి సద్రూపమగు చిదాకాశమున సత్తారూపముతోనే వర్తించుచున్నది.

ఏషు నిద్రాదికేష్వేతే సూపలబ్ధా అపి స్ఫుటమ్
భావా అసన్మయా ఏవమేతేఽనన్యాత్మకా యతః. 37

స్వప్న, సంకల్పాదులందలి అసన్మయములగు పదార్థములెట్లు చిద్రూపములుగ స్పష్టరీతి యెఱుఁగఁబడుచున్నవో, అట్లే యీ జాగ్రత్పదార్థములున్ను సచ్చిద్రూపమగు పరబ్రహ్మముకంటె వేఱుకావు.

సర్గప్రలయసంస్థానాన్యేవమాత్మని చిద్ఘనే
సౌమ్యే స్వప్నసుషుప్తాభా శుద్ధే నిద్రాఘనే యథా. 38

శుద్ధమైనట్టి గాఢనిద్రయందు స్వప్న సుషుప్తులెట్లు వర్తించుచున్నవో; అట్లే సౌమ్యమై, చిద్ఘనమైనట్టి ఆత్మరూపమగు పరబ్రహ్మమందు సృష్టి ప్రళయములున్ను వర్తించుచున్నవి.

స్వప్నాత్స్వప్నాన్తరాణ్యాస్తే నిద్రాయాం మానవో యథా
సర్గాత్సర్గాన్తరాణ్యాస్తే స్వసత్తాయామజస్తథా. 39

నిద్రయందు మనుజుఁడొక స్వప్నమునుండి యనేకస్వప్నాంతరములఁబొందుచు ఆయా స్వప్నరూపములుగ నెట్లుండునో, అట్లే జన్మాది రహితుఁడగు పరమాత్మ స్వసత్తయందు ఒకసృష్టినుండి అన్యములగు అనేక సృష్టులను బొందుచు ఆయా సృష్టిరూపములుగ వర్తించుచున్నాఁడు.

పృథ్వ్యాదిరహితోఽప్యేష బ్రహ్మకాశో నిరామయః
అతద్వాంస్తద్వదాభాతి యథా స్వప్నానుభూతిషు. 40

నిర్వికారమగు ఈ బ్రహ్మాకాశము వాస్తవముగ పృథివ్యాది రహితమైయున్నప్పటికిని. స్వప్నానుభవములందువలె, పృథ్వ్యాదిసహితమైయున్నట్లు భాసించుచున్నది.

స్థితా యథాస్యాం పశ్యన్త్యాం శబ్దా ఘటపటాదయః
తాతాతాతాః స్థితాః సర్గాస్తథానన్యే మహాచితి. 41

వర్తమానసమయమున ప్రత్యక్షమగు పరమాత్మయందు ఘటపటాది సర్వపదార్థములు ఎట్లు అభిన్నరూపముగ వెలయుచున్నవో, అట్లే భూత, భవిష్యత్కాలములందలి సమస్తసృష్టులున్ను మహాచైతన్యమగు ఆ పరమాత్మయందు అభిన్నరూపముగనే స్థితినొందియున్నవి.

పశ్యన్త్యామేవ పశ్యన్తీ యథా భాతి తథైవ చ
యథా శబ్దాస్తథా సర్గాశ్చిత్త్యైవ చితి చిన్మయాః. 42

ఎపుడు సృష్టియొక్క శబ్దార్థములు బ్రహ్మముకంటె భిన్నములుకావో, అపుడవి బ్రహ్మమందుగలవు. అను ఈ ఆధారాధేయ భావమునుగూర్చిన కథనము, అభిన్నమైనదానియందే భేదముయొక్క ఉపచారముచే గావింపఁబడినదగును. కావున వాస్తవముగ సమస్తశబ్దములున్ను, తదర్థభూతములగు సమస్త సృష్టులున్ను చిన్మయములేయై చైతన్యమున వెలయుచున్నవి.

కిం శాస్త్రకం తత్ర కథా విచారై ర్నిర్వాసనం జీవితమేవ మోక్షః
సర్గే త్వసత్త్వేవమకారణత్వాత్సత్యేవ నాస్త్యేవ న నామ కాచిత్. 43

ఎపుడు సమస్త శబ్దములు, తదర్థభూతములగు సృష్టులు చిన్మయములేయని యెఱుఁగఁబడునో, అపుడిఁక శాస్త్రములు—శాసింపఁదగినది లేనందునను, మోక్షఫలము వేఱుగ లేకుండుట చేతను, నిరసింపఁదగినట్టి ప్రపంచబంధము తొలఁగుటవలనను కృతార్థములై నివర్తించును. కావున నట్టి స్థితియందిఁక శాస్త్రమేమి ? వానియందలి కథావిచారములచే నేమి ప్రయోజనము ? ఏలయనిన, వాసనారహితమగు జీవితమే మోక్షము గావున నట్టి స్థితి మనుజునకపుడు సిద్ధించినదేయగును మఱియు, పూర్వోక్తరీతి కారణముయొక్క అభావమువలన సృష్టి సంభవింపనందున వివిధ ప్రపంచరచన ప్రత్యక్షముగఁ గానుపించినప్పటికిని నయ్యది వాస్తవముగ నొకింతైనను లేకయే యున్నది.

ఏషా చ సిద్ధేహ హి వాసనేతి సా బోధసత్తైవ నిరన్తరైకా
నానాత్వనానారహితైవ భాతి స్వప్నే చిదేవేహ పురాదిరూపా. 44

ఇత్యార్షే శ్రీవాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే ఉత్తరార్ధే బ్రహ్మగీతాసు సత్యవర్ణనం నామ సప్తసప్తత్యధిక శతతమః సర్గః ॥ 177 ॥

ఓ రామచంద్రా ! ప్రపంచమునకు బీజభూతమైనట్టి ఏ యీవాసన భాసించుచున్నదో, అది స్వప్నమున నిట చైతన్యమే నగరాదిరూపములుగ భాసించునట్లు—నానారూపరహితమై ఏకమై శాశ్వతమైనట్టి బోధసత్తయే యట్లు నానారూపములతో భాసించుచున్నదగును.

ఇది శ్రీవాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున నుత్తరార్ధమున బ్రహ్మగీతలందు సత్యవర్ణనమను నూటడెబ్బదియేడవ సర్గము ॥ 177 ॥



## అష్టసప్తత్యధికశతతమః సర్గః

[ఇహోఽమూర్తచితా మూర్తచాలనే యుక్తిరుచ్యతే
జగచ్చామూర్త చిన్మాత్రమైన్దవాఖ్యానతః స్ఫుటమ్.

అమూర్త (నిరాకార)మగు చైతన్యము మూర్తరూప (సాకార)ముగ చలింపఁబడుట యందు యుక్తిని వచించుట ఐందవోపాఖ్యానమునుబట్టి జగత్తు నిరాకారమగు చిన్మాత్రమేయని స్ఫుటముగఁ దెలుపుట యిచటఁ గాననగును.]

**శ్రీరామ ఉవాచ :—**

పదార్థా ద్వివిధాః సన్తి మూర్తామూర్తా జగత్త్రయే
యత్ర సప్రతిఘాః కేచిత్కేచిదప్రతిఘా అపి. 1

శ్రీరాముఁడు:— మహాత్మా! ముల్లోకములందును మూర్త, అమూర్త (సాకార, నిరాకారములను రెండువిధములగు పదార్థములు గలవు. అందుఁ గొన్ని సప్రతిఘములును (ఒకదానిచే నొకటి కొట్టఁబడునవి) కొన్ని అప్రతిఘములున్ను (కొట్టఁబడనివి) అయియున్నవి.

తానిహాప్రతిఘానాహుర్నాన్యోన్యం వేల్లయన్తి యే
తాంశ్చసప్రతిఘానాహురన్యోన్యం వేల్లయన్తి యే. 2

ఈ ప్రపంచమున నెయ్యవి పరస్పరము కూడియుండలేక, చలింపఁజేయఁబడక యుండునో, అవి అప్రతిఘములనియు, కూడియుండుచులేక చలింపఁజేయఁబడుచునుండునో, అవి సప్రతిఘములనియుఁ జెప్పఁబడినది.

ఇహ సప్రతిఘానాం తు దృష్టమన్యోన్యవేల్లనమ్
నత్వప్రతిఘరూపాణాం కేషాంచిదపి కించన. 3

ఈ ప్రపంచమున సప్రతిఘపదార్థములయొక్క పరస్పరము కూడియుండుట లేక, చలింపఁజేయఁబడుట చూడఁబడినదేగాని, అప్రతిఘపదార్థములయొక్కదికాదు.

తత్ర సంవేదనం నామ యదిదం చన్ద్రమణ్డలే
ఇతః పతత్యప్రతిఘం తత్పర్వేణానుభూయతే. 4

అట, లోకప్రసిద్ధమగు సంవేదనము (అనుభవము, లేక, వృత్తిజ్ఞానము) అప్రతిఘమేయై యున్నది. ఎట్లనిన, చంద్రుని గాంచు మనుజునియొక్క యీ ప్రదేశమునుండి నేత్రజ్యోతిననుసరించు చిత్తముతోసహా చనునట్టి చైతన్యవృత్తులు చంద్రమండలమునందు పరస్పర సంశ్లేషము (కూడిక లేకయే పోయిపడుచున్నవి. కావున నవి అమూర్తములేయైయున్నవి. ఈ విషయమును చంద్రుని చూచువారందఱును ననుభవించుచునేయున్నారు.

అర్ధప్రబుద్ధసంకల్పవికల్పాద్ద్వైతకల్పితమ్
పదామ్యభ్యుపగమ్యేదం న తు బోధదశాస్థితమ్. 5

ఈ విషయమును కేవలము ప్రబుద్ధుని దృష్టిననుసరించిగాని, కేవలము అప్రబుద్ధుని దృష్టిననుసరించిగాని నేను జెప్పుటలేదు. అర్ధప్రబుద్ధులయొక్క సంకల్ప వికల్పరూపద్వైతముచే కల్పింపఁబడిన యీ జగత్తు నంగీకరించి చెప్పుచున్నాను; జ్ఞానదృష్టిచే స్థితినొందియున్న కేవల చిన్మాత్రము నంగీకరించి కాదు

> కః ప్రాణమారుతః క్షోభం జనయత్యాశయస్థితః
> ప్రవేశనిర్గమమయం కథం వా వద మే ప్రభో. 6

ప్రభూ! హృదయ ప్రదేశమున నున్నదై, ప్రాణవాయువును క్షోభితమొనర్చి నాసికా రంధ్రములద్వారా దానియొక్క గమనాగమనవ్యాపారము నెయ్యది గావింపఁజేయుచున్నదో వచింపవేడెద

> కథమప్రతిఘం నామ వేదనం ప్రతిఘాత్మకమ్
> ఇమం దేహం చాలయతి భారం భారహరో యథా. 7

భారమును వహించువాఁడు భారమును చలింపఁజేయునట్లు, అమూర్తమగు జ్ఞానము (చిదాభాసుఁడు మూర్తమగు ఈ ప్రాణాది దేహాంతమువఱకుగల సంఘాతము నెట్లు చలింపఁ జేయుచున్నది?

> యది స్వప్రతిఘం వస్తు వేల్లత్యప్రతిఘాత్మకమ్
> కథం సంవిత్తిమాత్రేణ పుంసః శైలో న వల్గతి. 8

నిరాకారమగు జ్ఞానము సాకారమగు ప్రాణాది దేహాంతమువఱకుఁగల సంఘాతమును చలింపఁజేయునదగుచో, అపుడు పర్వతము చలించుగాక అను మనుజుని ఈ సంకల్పజ్ఞాన మాత్రముచేతనే పర్వత మేల చలించుటలేదు?

శ్రీ వసిష్ఠ ఉవాచః—

> వికాశమథ సంకోచమత్ర నాలీ హృది స్థితా
> యదా యాతి తదా ప్రాణశ్చైదై రాయాతి యాతి చ. 9

శ్రీవసిష్ఠుఁడు:— ఓ రామచంద్రా! హృదయప్రదేశముననున్న నాడియెపుడు సంకోచ, వికాసములను బొందునో, అపుడు ప్రాణవాయువు నాసికాది ఛిద్రములద్వారా గమనాగమనములను సల్పుచుండును.

> బాహ్యే పస్కర భస్త్రాయాం యథాకాశా స్పదాత్మకః
> వాయుర్యాత్యపి చాయాతి తథాత్ర స్పన్దనం హృది. 10

ఆకాశము ఆశ్రయముగాఁ గలదైనట్టి వాయువెట్లు బాహ్యప్రదేశమందలి కమ్మరివాని కొలిమితిత్తులందు గమనాగమనములను సల్పుచునున్నదో, అట్లే హృదయమందలి వాయువున్ను గమనాగమనములను, సల్పుచునున్నది.

శ్రీరామ ఉవాచః—

> బహిర్భస్త్రామయస్కారః సంకోచన వికాసనైః
> యోజయత్యాన్తరం నాడీం కశ్చాలయతి చాలకః. 11

శ్రీరాముఁడు:— ఓ మునీంద్రా! బాహ్యప్రదేశమున కమ్మరివాఁడను చేతన రూపుఁడు కొలిమితిత్తులను సంకోచవికాసయుక్తములుగఁ గావించుచున్నాడు. అట్లే, అభ్యంతరమునఁ బ్రవేశించి చేతనరూపుఁడగు ఎవఁడు నాడిని చలింపఁజేయుచున్నాఁడు?

శతం కథ భవేదేకం కథమేకం శతం భవేత్
కథం సచేతానా ఏతే కాష్ఠలోష్టోపలాదయః. 12

మహాత్మా! హృదయప్రదేశమున నూటొక్క నాడులు గలవు. (శ్రుతి - శతం చైకాచ హృదయస్య నాడ్యః, ఆ నూటొక్క నాడులయొక్కయు నొక్కొక్క శాఖయందు మరల డెబ్బదిరెండు వేల యుపనాడులు గలవు. వానియన్నిటియందును వ్యానవాయువు సంచరించుచున్నది. కావున, ఆ నాడులచే దేహముయొక్క సర్వాంగచలనమే సంభవింపవలసి యుండునుగాని ఒక్కొక్క అంగముయొక్క చలనముకాదు. ఒక్కొక్క అంగము చలింపఁబడుచో నపుడా నాడులన్నియు ఆ యంగమున నొకటి కావలసియుండును. మరల సర్వాంగచలనమున ఆ యొకటియు అన్ని నాడులున్ను కావలసియుండును, అది యెట్లు సంభవమగును? మఱియు వాస్తవముగ నిరాకారమగు చైతన్యముయొక్క సంబంధము దేహమందు లేదు గనుక. ఆ నాడులు చేతనములవలె నెట్లు అధ్యాసమువలన నట్లు చేతన యుక్తములైనవనినచో, ఆ ఆధ్యాసికసంబంధము కాష్ఠ, లోష్ట, శిలాదులందును సమానమే గావుననియు నేల చేతనవంతములై యుండుటలేదు?

కస్మాన్న స్థావరం వస్తు ప్రస్పన్ద్యపి చమత్కృతమ్
వస్తు జంగమ మేవేహ స్పన్ది మాత్రేవ కిం వద. 13

స్థావరములగు కాష్ఠశిలాదులు చేతనములనినచో నవి యేల చలించుటలేదు? జంగమ వస్తువగు దేహమువలె భోగోపయోగముచే నవి చమత్కారముగ గావింపఁబడినవనినచో, కులాలాదులచే అధిష్ఠితములగు చక్రాదులవలె నవి నియమితకాలమువఱకు చలించునవి యేలకావు?

శ్రీ వసిష్ఠ ఉవాచ:—

అన్తః సంవేదనం నామ చాలయత్యాన్త్ర వేష్టనమ్
బహిర్భస్త్రామయస్కార ఇవలోకేఽనుచేష్టనమ్. 14

శ్రీవసిష్ఠుఁడు:— ఓ రామచంద్రా! కార్యకారణములకు ప్రభువును, భోక్తయునగు జీవ చైతన్యము అనాదికాలప్రవాహ పతితములగు కామ్య, కర్మ, వాసనలచే ప్రాణవాయువుతో తాదాత్మ్యాధ్యాసము నొందుచున్నది. అట్లు ప్రాణవాయువుతో అభేదాభిమానము గావించు అభ్యంతర జీవచైతన్యము స్వతంత్ర్యముగ అభ్యంతరనాడీ సమూహమును, దేహమును బాహ్యప్రదేశమునఁ కమ్మరివాఁడు కొలిమితిత్తులను చలింపఁజేయునట్లు చలింపఁచేయుచున్నది. తదనుసారముగనే ప్రపంచమున సర్వులును బాహ్యమున వ్యవహరించుచున్నారు.

శ్రీరామ ఉవాచ:—

వాయ్వన్త్రాదిశరీరస్థం సర్వం సప్రతిఘం మునే
కథమప్రతిఘా సంవిచ్చాలయేదితి మే వద. 15

శ్రీరాముఁడు:— ఓ మునీంద్రా! దేహమందలి వాయువు, నాడులు మున్నగునవి యన్నియు సాకారములుగదా! అట్టివానిని నిరాకారమగు జీవచైతన్యమెట్లు చలింపఁజేయుచున్నదో వచింప ప్రార్థన

సంవిదప్రతిఘాకారా యది సప్రతిఘాత్మకమ్
చాలయేదచలిష్యత్తద్దూరమమ్భో యదిచ్ఛయా. 16

నిరాకారమగు సంవిత్తు (చైతన్య) సాకారములగు ప్రాణ, దేహాదులను కల్పింపఁజేయుచో నపుడు దప్పికగొనిన బాటసారియొక్క యిచ్ఛచేతనే దూరముననున్న జలము స్వయముగ నాతనివద్దకు రావలసియుండును.

సప్రతిఘాప్రతిఘయోర్మిథో యది పదార్థయోః
వేల్లనం స్యాత్తదిచ్ఛైవ కర్తృకర్మేన్ద్రియైః క్వ కిమ్. 17

మఱియు, సాకార, నిరాకారపదార్థములయొక్క పరస్పర సంబంధము సంభవించుచో, అపుడు యిచ్ఛయే బాహ్యమందలి భాషణ. గ్రహణ, విహరణాది సమస్తకార్యములను జేయునది యగును. గావున నిఁక మరల కర్మేంద్రియములచే నెచట నేమిప్రయోజనము గలదు?

సప్రతిఘాప్రతిఘయోః శ్లేషో నాస్తి బహిర్యథా
తథైవాన్తరహం మన్యే శేషం కథయ మే మునే. 18

బాహ్యమున సాకార, నిరాకార పదార్థములకు సంబంధమెట్లు లేదో, అట్లే అభ్యంతర మందును లేదని తలంచుచున్నాను. కాఁబట్టి యివ్విషయమున మఱియొకయుక్తి యేదైన వచింపవేడెద.

అన్తః స్వయం యోగినా వా యదైతదనుభూయతే
అమూర్తస్యైవ మూర్తేన వేల్లనం తద్వదాశు మే. 19

లేక, యోగిరాట్టగు తాము సాకార, నిరాకార పదార్థములయొక్క పరస్పర సంబంధమును యోగబలముచే నంతఃకరణమున నేయుపాయముచే స్వయముగ ననుభవించుచున్నారో శీఘ్రముగ వచింపవేడెద.

శ్రీ వసిష్ఠ ఉవాచః—

సర్వసందేహవృక్షాణాం మూలకాషమిదం వచః
సర్వైకతానుభూత్యర్థం శృణు శ్రవణభూషణమ్. 20

శ్రీవసిష్ఠుఁడు:— ఓ రామచంద్రా! సమస్త సందేహములను వృక్షములను సమూలముగ ఛేదించివైచునదియు, శ్రవణభూషణమైనదియునగు ఈ వాక్యమును, సమస్తముయొక్క ఏకత్వానుభవరూపమగు తత్త్వసాక్షాత్కారానుభవము కొఱకై వినుము.

నేహ కించిన్న సామాస్తి వస్తుసప్రతిఘం క్వచిత్
సర్వదా సర్వమేవేదం శాన్తమప్రతిఘం తతమ్. 21

ఈ ప్రపంచమున నెచటను సాకారమైన పదార్థ మొకింతైననులేదు. ఇది యంతయును సదా నిరాకారమై, శాంతమై, సర్వవ్యాపకమైనట్టి బ్రహ్మమేయైయున్నది.

శుద్ధం సంవిన్మయం సర్వం శాన్తమప్రతిఘాత్మకమ్
పదార్థజాతం పృథ్వ్యాది స్వప్నసంకల్పయోరివ. 22

స్వప్న, సంకల్పములందువలె, ఈ పృథ్వ్యాది పదార్థ సమూహమంతయును నిరాకారమై, **శాంతమై** శుద్ధజ్ఞానమయమైనట్టి బ్రహ్మమేయైయున్నది.

ఆదావన్తే చ నాస్తీదం కారణాభావతోఽఖిలమ్
భ్రాన్త్యాత్మా వర్తమానాపి భాతి చిత్స్వప్నకా యథా. 23

కారణాభావమువలన ఈ సమస్త జగత్తున్ను ఆద్యంతములందు లేకయేయున్నది. కావున భ్రాంతిరూపమేయై యొప్పుచున్నది. ఈ సమస్తరూపముచే చైతన్యమే స్వప్నమందువలె భాసించుచున్నది.

ద్యౌః క్షమా వాయురాకాశం పర్వతాః సరితో దిశః
మహతా కారణౌఘేన బోధమప్రతిఘం విదుః. 24

కావుననే తత్త్వజ్ఞానులగు జనులు మహత్తరంమైనట్టి వివేక, వైరాగ్య, త్యాగ, శ్రవణ మనన, నిదిధ్యాసనాది ప్రయత్నములను కారణసమూహముచే జ్ఞానప్రాప్తిద్వారా సాకారమగు జగత్తును వాసనాసహితముగ దుడిచివైచి, అంతరిక్ష, పృథివీ, వాయు, ఆకాశ, పర్వత, నదీ, దిగాది సమస్తపదార్థములను నిరాకార బోధరూపములుగనే యెఱుగుచున్నారు.

అన్తఃకరణభూతాది మృత్కాష్ఠదృషదాది వా
సర్వం శూన్యమశూన్యం చ చేతనం విద్ధి నేతరత్. 25

ఓ రామచంద్రా! అంతఃకరణ, భూతాదులున్ను, మృత్తిక, కాష్ఠ, శిలాదులున్ను — సమస్తము పదార్థ శూన్యమై, శూన్యత్వరహితమైనట్టి చైతన్యమేగాని వేఱుకాదని యెఱుగుము.

తత్రైవమైన్దవాఖ్యానం శృణు శ్రవణభూషణమ్
మయా చ పూర్వముక్తం తత్కించాన్యదథివర్ణ్యతే. 26

ఇవ్విషయమున శ్రవణ భూషణమైనట్టి ఐందవోపాఖ్యానమునుగూర్చి వినుము. దానిని బూర్వము జగత్తుయొక్క మనోమయత్వ, క్షణోత్పత్తి ప్రదర్శనముకొఱకై నేను నీకు వచించి యుంటిని. ఇపుడు జగత్తుయొక్క చిన్మాత్రత్వమును జూపుటకొఱకై దానినిట వర్ణించుచున్నాను

తథాపి వర్తమానోక్త ప్రశ్నబోధాయ తచ్ఛృణు
యథేదం సర్వమద్యాపి చిదిత్యేవ తు భోత్స్యతే. 27

నిరాకారమగు చైతన్యము సాకారములగు శరీరాదుల నెట్లు చలింపజేయుచున్నదను ప్రస్తుత ప్రశ్నయొక్క సమాధానముకొఱకున్ను నీవు దీనిని వినుము అపుడే పర్వతాది సహితమగు జగత్తంతయును చిన్మాత్రమేయను విషయము అనుభూతముకాగలదు.

కస్మింశ్చిత్ప్రాక్తనే నైవ జగజ్జాలేఽభవద్ద్విజః
తపోవేదక్రియాధారో బ్రహ్మన్నిన్దురితి స్మృతః. 28

ఓ రామచంద్రా! పూర్వము ఉత్పత్తిప్రకరణమున వర్ణింపఁబడినరీతి యొకానొక జగజ్జాలమందు, తపో, వేదాధ్యయన, వేదోక్త కర్మానుష్ఠానముల కాధారభూతుఁడైన ఇందువను బ్రాహ్మణుఁడొకఁడుండెను.

దశ తస్యాభవన్పుత్రా జగతో దిక్తటా ఇవ
మహాశయా మహాత్మానో మహాత్మ్యమాస్పదం సతామ్ 29

బ్రహ్మాండోదరమందలి యాకాశమునకు దశదిక్తటములవలె నాతనికి మహాశయులును, మహాత్ములును, మహనీయులయొక్కయు సజ్జనులయొక్కయు ప్రతిష్ఠాపాత్రులునగు పదిగురు పుత్రులు జనించిరి.

స తేషాం కాలవశతః పితాఽర్థిముపాయయౌ
దశానాం భగవాన్ రుద్ర ఏకాదశ ఇవ క్షయే. 30

మహాప్రళయమున దశరుద్రులయొక్క అధిపతియగు ఏకాదశ రుద్రునివలె, వారి యా తండ్రి కాలవశమున నంతర్ధాన మొందెను.

తస్యానుగమనం చక్రే భార్యా వైధవ్యభీతిభిః
అనురక్తా దినస్యేవ సంధ్యా తారావిలోచనా. 31

అపుడు, దివసమందనురాగముగలదియు, నక్షత్రములను నేత్రములచే శోభించునదియు నగు సంధ్యదివసము ననుగమించునట్లు, ఆతని భార్య వైధవ్యభీతిచే నాతని ననుగమించెను.

తయోస్తే తనయా దుఃఖకలితా విపినం గతాః
కృతౌర్ధ్వదేహికా స్త్యక్త్వా వ్యవహారం సమాధయే. 32

వారి యాపుత్రులంత మాతాపితరుల యౌర్ధ్వదేహిక (దహనాది) క్రియల నాచరించి వియోగదుఃఖముచే వ్యాప్తులై ప్రాపంచిక వ్యవహారములన్నింటిని త్యజించివైచి సమాధిని శీలించుట కొఱకై యరణ్యమున కేగిరి.

ధారణానాం సమస్తానాం కా స్యాదుత్తమసిద్ధిదా
ధారణా యన్మయాః సన్తః స్యామ సర్వేశ్వరా వయమ్. 33

ఇతి తే తత్ర సంచిన్త్య బద్ధపద్మాసనా దశ
ఇదం సంచిన్తయామాసుర్నిర్విఘ్నే కన్దరోదరే. 34

'ధారణలన్నిఁటియందును నే కారణ యుత్తమసిద్ధిని గలుగఁజేయునదైయున్నది? ఏ ధారణయందు తన్మయులమైనచో మనమందఱమును సర్వేశ్వరుల (బ్రహ్మదేవుల) మగుదుము?' అని యిట్లు చింతించి యా పదిగురు పుత్రులున్ను హింసకజీవుల యుపద్రవములేనట్టి యొకానొక గుహయందుఁ బద్మాసనమునఁగూరుచున్నవారై యివ్విషయమును విచారింపఁదొడఁగిరి.

పద్మకాధిష్ఠితా శేషజగద్ధారణయా స్థితాః
భవామ పద్మజోపేతం జగద్రూపమవిఘ్నతః. 35

'చతుర్ముఖ బ్రహ్మచే అధిష్ఠితమగు సమస్త బ్రహ్మాండమెయ్యదిగలదో, అదియే నేను' అను నీ ప్రకారమగు నిశ్చలధ్యానముచే మనము బ్రహ్మదేవునితోఁగూడియున్న సమస్త జగద్రూపము నిర్విఘ్నముగఁ గాఁగల్గుదుము.

ఇతి సంచిన్త్య స బ్రహ్మజగద్ధారణయా చిరమ్
నిమీలితదృశ స్తస్థుస్తే చిత్రరచితా ఇవ. 36

ఇట్లు చింతించి వారు బ్రహ్మదేవసహితమగు జగత్తునుగూర్చిన ధారణతోఁగూడియున్న వారై నేత్రములను మూసికొని, చిత్రమందు లిఖింపఁబడిన వారిచందమున నిశ్చలముగఁ చిర కాలము ధ్యానమందుండిరి.

అథై తద్ధారణాబద్ధచిత్తాస్తే తావదచ్యుతాః
ఆసన్మాసాన్దశాష్టౌ చ యావ త్తే తత్ర దేహకాః. 37

తదుపరి యట్టి ధారణయందే వారు పదునెనిమిది మాసములు స్థూలశరీర మున్నంత వఱకును చ్యుతినొందక నిశ్చలముగ నుండియుండిరి.

శుష్కాః కంకాలతాం యాతాః క్రవ్యాదై శ్చర్వితాఙ్గకాః
నాశమభ్యాయయుస్తత్ర ఛాయాభాగా ఇవాతపైః. 38

అటుపిమ్మట వారిదేహములు శుష్కించినవై, ప్రేతాదులచే భక్షింపఁబడి శవరూపత్వ మును బొందినవై, సూర్యరశ్మిచే ఛాయాభాగములవలె నట నశించిపోయెను.

అహం బ్రహ్మ జగచ్చేదం సర్గోయం భువనాన్వితః
ఇతి సంపశ్యతాం తేషాం దీర్ఘకాలోఽభ్యవర్తత. 39

'నేను బ్రహ్మదేవుఁడను; అనేక లోకములతోఁగూడిన యీ జగత్తున్ను నేనే' అని యిట్లు ధ్యానించుచున్నవారికి దీర్ఘకాలము గడచిపోయెను.

తాని చిత్తాన్యదేహాని దశైకధ్యానతస్తతః
సంపన్నాని జగన్త్యేవ దశ దేహానివై పృథక్. 40

అంత, శరీరశూన్యములగు వారి పది చిత్తములున్ను ధ్యానపరిపాకముచే వేఱు వేఱుగ పది బ్రహ్మాండ–శరీరములయ్యెను.

ఇతి తేషాం చిదిచ్ఛా సా సంపన్నా సకలం జగత్
అత్యన్తస్వచ్ఛరూపైవ స్థితా చాకారవర్జితా. 41

ఈ ప్రకారముగ, అత్యంతనిర్మలమైనదియు, నిరాకారమైనదియునగు వారి చైతన్యమే ఇచ్ఛారూపమై సమస్త బ్రహ్మాండరూపముగ నయ్యెను.

సంవిన్మయత్వాజ్జగతాం తేషాం భూమ్యచలాది తత్
సర్వం చిదాత్మకం విద్ధి నో చేదన్యత్కిముచ్యతామ్. 42

కిల యత్త్రిజగజ్జాలం తేషాం కిమాత్మ తత్తథా
సంవిదాకాశశూన్యత్వమాత్రమేవేతరన్న తత్. 43

ఓ రామచంద్రా! ఇట్లు వారి యాసమస్త బ్రహ్మాండములును చిన్మయములేయైయుండుటచే, ఆ భూమి, పర్వతాది సమస్తమును చిద్రూపముగనే నీ వెఱుఁగుము. అట్లుకానిచో వారియొక్క యాదశవిధత్రైలోక్యజాలము మఱేరూపముగలదియో చెప్పుము? కావున నదియంతయును చిదాకాశ మాత్రమేగాని యన్యమేమియునుగాదు.

విద్యతే న యథా కించిత్తరఙ్గః సలిలాదృతే
సంవిత్తత్త్వాదృతే తద్వద్విద్యతే చలనాదికమ్. 44

జలముకంటె వేఱుగ తరంగ మొకింతైనను నెట్లు లేదో, అట్లే చైతన్యముకంటె వేఱుగ చలనాదులొకింతైనను లేవు.

ఐన్దవాని తథైతాని చిన్మయాని జగన్తి ఖే
తథా చిన్మయమేతేషు కాష్ఠలోష్టోపలాద్యపి. 45

ఐందవుల (ఇందుపుత్రుల)చేఁ గల్పితములైన పది బ్రహ్మాండములును నెట్లు చిన్మయములైయున్నవో, అట్లే యీ జగత్తులందలి కాష్ఠ, లోష్ఠ, శిలాదులన్నియునుగూడ చిన్మయములేయైయున్నవి.

యథైవైన్దవసంకల్పాస్తే జగత్త్వముపాగతాః
తథైవాబ్జజసంకల్పో జగత్త్వముపాగతః. 46

ఐందవుల యాసంకల్పములే యెట్లు జగద్రూపత్వమును బొందినవో, అట్లే బ్రహ్మదేవుని యొక్క సంకల్పమే యీ జగద్రూపమును బడసినది

తస్మాదిహేమే గిరయో వసుధా పాదపా ఘనాః
మహాభూతాని సర్వం చ చిన్మాత్రమయమాతతమ్. 47

ఇక్కారణమున నిట ఈ పర్వత, పృథివీ, వృక్ష, మేఘ, మహాభూతాదులన్నియును సర్వవ్యాపకమగు చిన్మాత్రమయములైయున్నవి.

చిద్వృక్షాశ్చిన్మహీ చిద్ద్యౌశ్చిదాకాశం చిదద్రయః
నాచిత్క్వచిత్సంభవతి తేష్వైన్దవజగత్స్వివ. 48

వృక్షములన్నియు చిద్రూపములే; పృథివియు చిత్స్వరూపమే; అంతరిక్షము చిద్రూపమే; ఆకాశము చిద్రూపమే; పర్వతములును చిత్స్వరూపములే, వెయ్యేల, ఐందవబ్రహ్మాండములందువలె నిట చైతన్యముకానిదెచటను సంభవింపనేరదు.

చిన్మాత్రఖకులాలేన స్వదేహచలచక్రకే
స్వశరీరమృదా సర్గః కుతోఽయం క్రియతేఽనిశమ్. 49

చిన్మాత్రాకాశమను కులాలుఁడు (కుమ్మరి) స్వశరీరమైనట్టి చిద్రూపమను చంచల చక్రముపై స్వశరీరమను మృత్తికచే ఈ సృష్టిని నిరంతరము చేయుచున్నాఁడు. (కాని వాస్తవముగ నట్లేమియును జేయుటలేదు.)

సంకల్పనిర్మితే సర్గే దృషదశ్చేన్న చేతనాః
తదత్ర లోష్టశైలాది కిమేతదితి కథ్యతామ్. 50

ఓ రామచంద్రా! సంకల్పనిర్మితమగు సృష్టియందు శిలలు చేతనములు కానిచో నిఁక ఈ పర్వత లోష్టాదులరూపము మఱేమియైయుండునో చెప్పుము?

కలనస్మృతిసంస్కారా దథత్యర్థం చ నోదరే
ప్రాజ్ఞదృష్టం కల్పనాదీనామన్యైవార్థకలావతామ్. 51

అనుభవము స్మృతి, సంస్కారము, ఇచ్ఛ - ఇవియన్నియును చైతన్యముయొక్క యే ఆకార విశేషములైయున్నవి. ఇవి తమ యుదరమున చిత్స్వరూపమునే ధరించుచున్నవి గాని జడపదార్థమును గాదు. కాఁబట్టి యివి చిద్రూపములే యైయున్నవి.అర్థశూన్యులగు అజ్ఞానుల యొక్క స్థితి (సర్వత్ర పదార్థదృష్టి) వేఱైయున్నదియు. తత్త్వావగాహనశాలురగు విజ్ఞులయొక్క స్థితి (సర్వత్ర చిన్మాత్రదృష్టి) వేఱైయున్నదనియు పూర్వమే మాచే విమర్శింపఁబడియుండెను.

తద్ధామ సంవిదో ధామ్ని మణిరాశౌ మణిర్యథా
సర్వాత్మని యథా చిత్తే కశ్చిదర్థ ఉదేత్యలమ్. 52

ఆ పరమచైతన్యధామమే (బ్రహ్మమే) సమష్టి, వ్యష్టిచిత్తమున మణిరాశియందు మణి వలె దేదీప్యమానముగ ఆభ్యంతరముననున్నదై యొకానొకచోట తృణ, కాష్ఠ పర్వతాది రూపములుగ లెస్సగ నుదయించుచున్నది.

అకార్యకరణస్యార్థో న భిన్నో బ్రహ్మణః క్వచిత్
స్వభావ ఇతి తేనేదం సర్వం బ్రహ్మేతి నిశ్చయః. 53

సూర్యుని కాంతి సూర్యునికంటె వేఱుకానట్లు ఈ తృణకాష్ఠాది పదార్థములున్ను, కార్య, కారణరహితమగు బ్రహ్మముకంటె నెచటను వేఱుకావు. మఱియు సూర్యకాంతి సూర్యుని స్వభావమే యగునుగాని, అప్రకాశరూప మెన్నఁటికిని గానట్లు, ఈ పదార్థజాలమంతయును బ్రహ్మస్వభావమే యగును గాని తద్భిన్నముకాదు. కావున, ఈ సమస్తమున్ను బ్రహ్మమేయని నిశ్చితమగుచున్నది.

యథా ప్రవృత్తం దిద్వారి వహత్యావర్తతేఽవనౌ
స్వయత్నే నాతితీవ్రేణ పరాత్మీయాత్మనా వినా. 54

పల్లపు భూమివైపునకు ప్రవృత్తమగు జలము కారణాంతరములేకయే స్వయత్నము చేతనే స్వతః ఆవర్త, తరంగాదిరూపములతో నతి తీవ్రముగఁ బ్రవహించునట్లు చైతన్యమున్ను స్వభావముగనే జగద్రూపముగ ప్రవృత్తమగుచున్నది,

పద్మలీలా జగదివ ప్రకచన్తి జాగన్తి యత్
చిన్మాత్రాద్బ్రహ్మణః స్వప్నాదన్యాని న మనాగపి. 55

ఎట్లు పద్మకల్పమున విష్ణుభగవానునియొక్క నాభికమల లీలచే బ్రహ్మదేవుని రూప ముగను. జగత్తుగను విలసిల్లుచున్నవో, మఱియు నెట్లాజగత్తు ఆ విష్ణువుకంటె భిన్నము కాదో అట్లే చిన్మాత్ర బ్రహ్మమువలన భాసించు ఈయనేక జగత్తులున్ను ఆ బ్రహ్మముకంటె నొకింతైనను వేఱుకావు.

అజాతమనిరుద్ధం చ సన్మాత్రం బ్రహ్మ భాత్మకం
శాన్తం సదసతోర్మధ్యం చిద్వ్యోమమాత్రమిదం జగత్. 56

కావున, జన్మవర్జితమై, అనిరుద్ధమై, సన్మాత్రమై, చిదాకాశరూపమై, శాంతమై, భావాభావరహితమై, చిత్ప్రకాశమాత్రమైనట్టి బ్రహ్మమే యీ జగత్తైయున్నది,

యత్త్వంవిన్మయమద్ర్యాది సంకల్పజగతి స్థితమ్
తదసంవిన్మయమితి వక్తాఽజ్ఞో జ్ఞైర్విహస్యతే. 57

ఇక్కారణమున, సంకల్పరచితమగు ఈ జగత్తునందున్నట్టి చైతన్యమయములగు పర్వత, తృణ, కాష్ఠాదులను చైతన్యరహితములని వచించు అజ్ఞాని జ్ఞానులకు పరిహాసపాత్రుడే యగును.

జగన్త్యాత్మైవ సంకల్పమయాన్యేతాని వేత్తి ఖే
భాత్మాకాని తథేదం చ బ్రహ్మ సంకల్పజం జగత్. 58

జగత్తులన్నిటిని బ్రహ్మదేవుఁడు స్వసంకల్పమయములుగనే స్వయముగ నెఱుగుచున్నాడు. కాబట్టి యాతని సంకల్పముచే నుత్పన్నమైన యీ సమస్త జగత్తున్ను అతని మనోరాజ్యమువలె చిదాకాశరూపమే యైయున్నది.

యావద్యావదియం దృష్టిః శీఘ్రం శీఘ్రం విలోక్యతే
తావత్తావదిదం దుఃఖం శీఘ్రం శీఘ్రం విలీయతే. 59

ఈ ప్రపంచము దృఢమగు చైతన్యదృష్టితో శీఘ్రముగఁ నెంతెంతచూడఁబడుచుండునో, అంతంత ఈ సంసారదుఃఖమున్ను శీఘ్రముగ విలీనమైపోవుచుండును.

యావద్యావదియం దృష్టిః ప్రేక్ష్యతే నాచిరాచ్చితా
తావత్తావదిదం దుఃఖం భవేత్ప్రతిఘనం ఘనమ్. 60

ఈ ప్రపంచము దృఢమగు చైతన్యదృష్టితో శీఘ్రముగ నెంతెంత చూడఁబడక యుండునో, అంతంత యీ సంసారదుఃఖమున్ను శీఘ్రముగ ఘనీభూతమగుచుండును.

దీర్ఘదుష్కృతమూఢానామిమాం దృష్టిమపశ్యతామ్
సంసృతిర్వజ్రసారేయం న కదాచిత్ప్రశామ్యతి. 61

మహాపాపముచే మూఢులై యెవరీ చైతన్యదృష్టితో జగత్తును వీక్షింపరో, అట్టివారికి సంసారము వజ్రమువలె దృఢపడి యెన్నటికిని శమింపకుండును.

నేహాకృతిర్న చ భవాభవజన్మనాశాః
సత్తా న చైవ న చ నామ తథాస్త్యసత్తా
శాన్తం పరం కచతి కేవలమాత్మనీత్థం
బ్రహ్మైవ వా కచన మవ్యలమత్ర నాస్తి. 62

ఓ రామచంద్రా! ఇచట వాస్తవముగ, ఆకారముగాని, భవ, అభవములుగాని, జన్మ, వినాశములుగాని, సత్త, అసత్తలుగానిలేవు. శాంతమగు పరబ్రహ్మమే తనయందిట్లు ప్రకాశించుచున్నది. లేక పరబ్రహ్మముకంటె వేఱుగ ప్రకాశనమనునదియు వాస్తవముగ నొకింతైనను లేకయే యున్నది.

ఆద్యన్తవర్జితమలభ్యలతాగ్రమూల నిర్మాణమూలపరివేశమశేషమచ్ఛమ్
అన్తర్నిరగ్గనసర్గకపుత్రకౌఘం నిత్యం స్థితం ననుఘనం గతజన్మనాశమ్. 63

ఆ బ్రహ్మము స్ఫటికజలమువలె తనయందు సృష్టిరూప ప్రతిమాసమూహముచేఁ బూర్ణమైయున్నప్పటికిని, లభింపనట్టి (వాస్తవముగలేని) జగత్తులను లతలు, వానియగ్ర భాగములు వాని మూలములు, వాని రచనలు, ఆ మూలములయొక్క భూమియందలి ప్రవేశములుగలదై ఆద్యంత రహితమై, జన్మవర్జితమై, అతిస్వచ్ఛమై, చిదానందైకఘనమై కైవల్యరూపమై నిత్యము స్థితినొంది యున్నది.

సన్మాత్రమన్తరహితాఖిలహస్తజాతం
పర్యన్తహీనగణనాఙ్గమముక్తరూపమ్
ఆత్మామ్బరాత్మకమహం త్విదమేవ సర్వం
సుస్తమ్భరూపమజమౌనమలం వికల్పైః. 64

ఇత్యార్షే శ్రీవాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే ఉత్తరార్ధే బ్రహ్మగీతాస్వైన్దవోపాఖ్యానం నామాష్టసప్తత్యధిక శతతమః సర్గః ॥ 178 ॥

ఈ పరబ్రహ్మముయొక్క అముక్తస్వరూపము అసంఖ్యాతమై, ప్రపంచమంతటను వ్యాప్తమై యుండునట్టి హస్తసమూహముగలదియు ప్రక్కలగూడ సర్వత్ర అసంఖ్యాతములైన నేత్ర శ్రోత్ర కంఠపాదాద్యవయవములు గలదియునై యొప్పుచున్నది. ముక్తస్వరూపమో, ఆత్మాకాశ రూపమై ఉత్తమస్తంభమువలె దృఢమైనట్టి సన్మాత్రరూపమై, జన్మరహితమై, మౌనరూపమై వర్ధిల్లుచున్నది. అట్టి సన్మాత్ర పరబ్రహ్మరూపము నేనే అయియున్నాను. కావుననిఁక వికల్పములచే నే ప్రయోజనమున్ను లేదు

ఇది శ్రీవాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున నుత్తరార్ధమున బ్రహ్మగీతలందు ఐందవోపాఖ్యానమను నూటడెబ్బదియెనిమిదవ సర్గము ॥ 178 ॥



## ఏకోనాశీత్యధిక శతతమః సర్గః

[ చిన్మాత్రమఖిలం విశ్వం స్థితమప్రతిఘం యతః
తతః ప్రాగుక్తశఙ్కాయాః కః ప్రసఙ్గ ఇతీర్యతే.

ప్రపంచమంతయు నిరాకారమగు చిన్మాత్రమేయై యున్నందున నిఁక పూర్వ సంశయమున కవకాశమే యెచట? అను విషయ మిచట వర్ణింపఁబడుచున్నది. ]

శ్రీ వసిష్ఠ ఉవాచ:—

ఏవం చిన్మాత్రమేవైకం శుద్ధం సత్త్వం జగత్త్రయమ్
సంభవన్తీహ భూతాని నాజ్ఞబుద్ధాని కానిచిత్. 1

శ్రీ వసిష్ఠుఁడు:— ఓ రామచంద్రా! ఈ ప్రకారముగ జగత్త్రయము ఏకమైనట్టి సచ్చిన్మాత్రమగు బ్రహ్మమేయైయున్నది. ఇట, అజ్ఞానులచే నెఱుఁగబడినట్టి సాకారములగు భూతము లెవ్వియును సంభవింపనేరవు.

తస్మాత్కుతః శరీరాది వస్తు సప్రతిఘం కుతః
యదిదం దృశ్యతే కించిత్తదప్రతిఘమాతతమ్. 2

కాఁబట్టి యిఁక సాకారములగు శరీరాది పదార్థములెచట? ఈ కానుపించునది యంతయు నిరాకారమైన బ్రహ్మమే యిట్లు వ్యాపించియున్నదగును

స్థితం చిద్వ్యోమ చిద్వ్యోమ్ని శాన్తే శాన్తం సమం స్థితమ్
స్థితమాకాశమాకాశే జ్ఞప్తిర్జ్ఞప్తౌ విజృమ్భతే. 3

చిదాకాశమున చిదాకాశమే, శాంతిరూపమున శాంతరూపమె సర్వ వైషమ్యరహితముగ నిల్చి స్థితినొందియున్నది. శృతియు (చిద్రూప) ఆకాశమున (చిద్రూప) ఆకాశమే, జ్ఞానమున జ్ఞానమే యీ ప్రకారముగ విజృంభించుచున్నది.

సర్వం సంవిన్మయం శాన్తం సత్స్వప్న ఇవ జాగ్రతి
స్థితమప్రతిఘాకారం క్వాసౌ సప్రతిఘా స్థితిః. 4

స్వప్నమందువలె ఈ జాగ్రత్తునందును సమస్తము నిరాకారమై, చిన్మయమై, శాంతమైనట్టి బ్రహ్మమెయైయుండ నిఁక సాకారమగు జగత్తుయొక్క స్థితి యెచట?

క్వ దేహావయవాః క్వాన్త్రవేష్టనీ క్వాస్థిపఞ్జరమ్
వ్యోమేవాప్రతిఘం విద్ధి దేహం స్వప్రతిఘోపమమ్. 5

ఓ రామచంద్రా! అంతయు చిన్మాత్రమేయైయుండ నిఁక దేహముయొక్క అవయవము లెచట? ప్రేవులను జుట్టునటువంటి నాడి యెచట? అస్థిరపంజరమెచట? స్వప్నదేతుల్యమగు ఈ దేహమును నిరాకారమగ చిదాకాశముగనే నీవెఱుఁగుము.

సంవిత్కరౌ శిరః సంవిత్సంవిదిన్ద్రియవృన్దకమ్
శాన్తమప్రతిఘం సర్వం న సప్రతిఘమస్తి హి. 6

హస్తద్వయము చిద్రూపమే; శిరస్సు చిద్రూపమే; ఇంద్రియసమూహము చిద్రూపమే; వెయ్యేల, సమస్తజగత్తున్ను శాంతమై, నిరాకారమైనట్టి చిన్మాత్రమేయైయున్నది. ఇట సాకార మొకింతైనను లేదు.

బ్రహ్మవ్యోమ్నః స్వప్నరూపస్వభావత్వాజ్జగత్స్థితేః
ఇదం సర్వం సంభవతి న హేతుకమహేతుకమ్. 7

చిదాకాశమగు బ్రహ్మముయొక్క స్వప్నరూపస్వభావమే యీ జగత్స్థితికి మూలమై యున్నది. కావున, ఈ సమస్తమున్ను ప్రత్యక్షాది ప్రమాణసిద్ధమైనప్పటికిన్ని, ప్రమాణరహితమై సకారణకమైనను అకారణకమై యొప్పుచున్నది. కావుననె 'నేహ నానాస్తికించన' — (ఇట అనేకత్వ మొకింతైనను లేదు.) — ఇత్యాది శ్రుతివాక్యములు జగత్తును నిషేధించినవి.

న కారణం వినా కార్యం భవతీత్యుపపద్యతే
యద్యథా యేన నిర్ణీతం తత్తథా తేన లక్ష్యతే. 8

బ్రహ్మము నిర్వికారమై అద్వయమైయుండుటచేతను, జగత్తునకు మఱియొక కారణము లేకుండుటచేతను, జగత్తు ఉత్పన్నము గాకయేయున్నదనుట (తత్త్వదృష్టిచే) తగుచున్నది. భ్రాంతిదృష్టిచే అనాదికారణ పరంపరసంభవమగుటచేతను, బ్రహ్మము అప్రసిద్ధమగుటచేతను ఉత్పత్త్యాదులు తగును. గావున కార్యకారణ కల్పన యపుడు సంభవించుచున్నది. అత్తఱి ఏది ఎవనిదో నెట్లు నిర్ణయింపఁబడుచున్నదో, అది వానిచే నట్లే గాంచఁబడుచున్నదనుట తగును. ఇట్లు భ్రాంతి దృష్టియందు కార్యకారణములు రెండును వారివారి నిశ్చయముననుసరించి తగుచునే యున్నవి.

కారణేన వినా కార్యం సద్వదిత్యుపపద్యతే
యథా భావితమేవార్థం సంవిదాప్నోత్యసంశయమ్. 9

ఇఁక యుక్తిదృష్టిచే — కారణములేకయే యుత్పన్నమైనదియు, సంవిద్రూపముగ లబ్ధమైన నదియునునగు ఈ జగత్తు అత్యంత అసత్తుకాదు, అత్యంత సత్తున్నుగాదు; సత్తువలెఁ గానుపించుచున్నదనుట తగుచున్నది. సంవిత్తు దేని నెట్లు భావించుచున్నదో దానినట్లే నిక్కముగఁ బొందుచున్నది.

యథా సంభవతి స్వప్నే సర్వం సర్వత్ర సర్వథా
చిన్మయత్వాత్తథా జాగ్రత్యస్తి సర్వాత్మరూపతా. 10

స్వప్నమున ఆత్మయొక్క చిన్మయత్వమువలనను, సర్వరూపత్వమువలనను సర్వథా సర్వత్ర సర్వము సంభవమగునట్లు జాగ్రత్తునందును బ్రహ్మముయొక్క చిన్మయత్వ, సర్వరూపత్వములవలన సమస్తమున్ను సంభవించుచున్నది

సర్వాత్మని బ్రహ్మపదే నానానానాత్మని స్థితా
అస్త్యకారణకార్యాణాం సత్తా కారణజాపి చ. 11

మాయాశబలితమైన సర్వాత్మరూప బ్రహ్మపదమున పదార్థముల సత్త ఏకమగును. అనేకముగనుగూడ స్థితి నొందియున్నది. అట కార్యసత్త కల్పితదృష్టియందు కారణజన్యమై యున్నను, పరమార్థదృష్టియందు కారణరహితమైయే యున్నది.

ఏకః సహస్రం భవతి యథా హ్యేతే కిలైన్దవాః
ప్రమాతా భూతలక్షత్వం సంకల్పైజగతాం గణైః 12

ఐందవులు సంకల్పరచిత జగత్సమూహములచే అసంఖ్యాతములైన ప్రాణులయొక్క రూపమును బడసినట్లు ఒకేచైతన్యము వేలకొలఁది రూపములగుచున్నది

సహస్రమేకం భవతి సంవిదాం చ తథా హి యత్
సాయుజ్యే చక్రపాణ్యాదేః సర్గైరేకం భవేద్వపుః 13

అట్లే విష్ణు, బ్రహ్మ, రుద్రాదులతోటి సాయుజ్యమొందునపుడు ఉపాధిమేళనము ద్వారా వేలకొలఁది సంవిత్తులున్ను ఒకే సంవిత్తుయొక్క రూపమగుచున్నవి.

ఏక ఏవ భవత్యబ్ధిః స్రవన్తీనాం శతైరపి
ఏక ఏవ భవేత్కాల ఋతుసంవత్సరోత్కరైః. 14

వందలకొలది నదులు కలిసి యొకేసముద్రమగుచున్నదిగదా! మఱియు అనేక ఋతు వత్సరాది సమూహములన్నియుఁగలిసి యొకేకాలమగుచున్నవిగదా!

సంవిదాకాశ ఏవాయం దేహః స్వప్న ఇవోదితః
స్వప్నాద్రివన్నిరాకారః స్వానుభూతిస్ఫుటోఽపి చ. 15

అట్లే యొకే చిదాకాశము స్వప్నమందువలె భ్రాంతిచే దేహాది నానారూపత్వమును బొందినదానివలె భాసించుచున్నది. కాని అయ్యది వాస్తవముగ సర్వులయొక్క స్వానుభవముచే స్పష్టమైనట్టి స్వప్నపర్వతమువలె నిరాకారమేయైయున్నది.

సంవిత్తిరేవానుభవాత్మైవానసుభవాత్మికా
ద్రష్టృదృశ్యదృశా భాతి చిద్వ్యోమైకమతో జగత్. 16

అనుభవరూపమైనట్టి యీ చిదాకాశమే ద్రష్టుదర్శనదృశ్యాది భ్రాంతవిభాగదృష్టిచే అనను భవరూపముగ నిట్లు భాసించుచున్నది. కావున వాస్తవముగ ఈ జగత్తంతయును ఏకమైనట్టి చిదాకాశమేయైయున్నది.

వేదనావేదనాత్మైకం నిద్రాస్వప్నసుషుప్తవత్
వాతస్పన్దావివాభిన్నౌ చిద్వ్యోమైకమతో జగత్. 17

నిద్ర, స్వప్నమందు పదార్థజ్ఞానరూపమునగను, సుషుప్తియందు అజ్ఞానరూపముగను నిట్లు ద్వివిధముగ భాసించినప్పటికిని వాస్తవముగ ఏకరూపమేయైయున్నట్లును, వాయు స్పందము లేక రూపములైనట్లును, చిదాకాశజగత్తులున్ను-ఏకరూపములై వెలయుచున్నవి.

ద్రష్టా దృశ్యం దర్శనం చ చిద్వ్యోనం పరమార్థభమ్
శూన్యస్వప్న ఇవాభాతి చిద్వ్యోమైకమతో జగత్. 18

పదార్థశూన్యమగు పరమార్థ చిదాకాశమే స్వప్నమందువలె నిట్లు ద్రష్టృదర్శన దృశ్య రూపముగ భాసించుచున్నది. కావున ఈ జగత్తు ఏకమైనట్టి చిదాకాశమేయైయున్నది,

జగత్త్వమసదేవేశే భ్రాన్త్యా ప్రథమసర్గతః
స్వప్నే భయమివాశేషం పరిజ్ఞానం ప్రశామ్యతి. 19

ఆది సృష్టినుండియు ఈ జగత్తు అసద్రూపమే యగును. భ్రాంతిచే సత్యమైనదానివలె పరమాత్మయందు భాసించుచున్నది. కావుననే స్వప్నమందు జనించిన వ్యాఘ్రాది భయమువలె యెఱుఁగఁబడినంతమాత్రముననే సంపూర్ణముగ శమించిపోవుచున్నది.

ఏకస్యాః సంవిదః స్వప్నే యథా భానమనేకధా
నానాపదార్థరూపేణ సర్గాదౌ గగనే తథా. 20

స్వప్నమున నొకే సంవిత్తు (చైతన్యము) అనేక రూపములుగ నెట్లు భాసించుచున్నదో, అట్లే సృష్ట్యాదియందు చిదాకాశమున నొకే సంవిత్తు వివిధపదార్థరూపముగ భాసించుచున్నది.

బహుదీపే గృహే ఛాయా బహ్వ్యో భాన్త్యేకవద్యథా
సర్వశక్తేస్తథైవైకా భాతి శక్తిరనేకధా. 21

అనేక దీపములుగల గృహమందు ఆ దీపకాంతులన్నియు ఏకరూపముగఁ బ్రకాశించు నట్లు సర్వశక్తిమంతుఁడగు పరమేశ్వరునియొక్క యొకేశక్తి అనేకరూపములుగ ప్రకాశించుచున్నది.

యద్విధకరస్ఫురణమమ్బునిధౌ శివాఖ్యే
వ్యోమ్నీవ వృక్షనికరస్ఫురణం న సర్గః
వ్యోమ్న్యేవ వృక్షనికరో వ్యతిరిక్తరూపో
బ్రహ్మామ్బుధౌ నతు మనాగపి సర్గబిన్దుః. 22

ఇత్యార్షే శ్రీవాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే ఉత్తరార్ధే బ్రహ్మగీతాసు బ్రహ్మమయత్వప్రతిపాదనం నామైకోనాశీత్యధిక శతతమః సర్గః ॥ 179 ॥

ఆకాశమున భ్రాంతిచే స్ఫురించు వృక్షసమూహమువలె పరబ్రహ్మమను సముద్రమందలి జలకణముయొక్క స్ఫురణమేదిగలదో, అదియే యీ సృష్టికాని యీ వృక్షసమూహము శూన్యత్వ ధర్మయుక్తమగు ఆ యాకాశమున భిన్నరూపముగలదైయున్నది. బ్రహ్మమను సముద్రమందు స్ఫురించు సృష్టియను బిందువో ఒకింతైనను భిన్నరూపముగలది కాకయేయున్నది. ఇంతే విశేషము

ఇది శ్రీవాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున నుత్తరార్ధమున బ్రహ్మగీతలందు బ్రహ్మమయత్వ ప్రతిపాదనమను నూట డెబ్బది తొమ్మిదవ సర్గము ॥ 179 ॥

---

## అశీత్యధిక శతతమః సర్గః

[ ఇహ రామోదితే కున్దదన్తాఖ్యానే గిరౌ తరౌ
ప్రలమ్బినస్తాపనస్య వరలాభాన్తమీర్యతే.

శ్రీరామచంద్రునిచేఁ జెప్పఁబడిన కుందదంతాఖ్యానమున, పర్వత వృక్షముపై వ్రేలాడుచుండిన తాపసునియొక్క వరలాభముకొఱకైనట్టి విషయమిచట వర్ణింపఁబడుచున్నది. ]

శ్రీరామ ఉవాచః—

ఇమం మే సంశయం ఛిన్ధి భగవన్భాస్కరం తమః
భువనస్యేవ భావానాం సమ్యగ్రూపానుభూతయే. 1

శ్రీరాముఁడు :— మహాత్మా ! ప్రపంచమందలి సమస్త పదార్థములయొక్క స్వష్టానుభవముకొఱకై సూర్యుఁడంధకారమును ఛేదించివైచునట్లు, సర్వవస్తువులయొక్క పూర్ణబోధకొఱకై తాము నా యీ సంశయమును ఛేదింపవేఁడెద.

> కదాచిదహమేకాగ్రో విద్యాగేహే విపశ్చితామ్
> సంసది స్థితవాన్యావత్తావనః కశ్చిదాగతః 2

మునీంద్రా ! ఒకానొకపుడు నేను పాఠశాలయందు పండితుల సభయందు ఏకాగ్రచిత్తుఁడనై యుండియుండఁగా నయ్యవసరమున నొక తాపసి యటకేతెంచెను

> విద్వాన్ద్విజవరః శ్రీమాన్విదేహ జనమణ్డలాత్
> మహాతపాః కాన్తియుక్తో దుర్వాసా ఇవ దుఃసహః. 3

విదేహదేశమునుండి యేతెంచిన ఆ యుత్తమబ్రాహ్మణుఁడు విద్వాంసుఁడును, శ్రీమంతుఁడును, మహాతపస్వియు, కాంతియుక్తుఁడును, దుర్వాసమహర్షివలె దుస్సహతేజోధారియునైయుండెను.

> స ప్రవిశ్యాఖివాద్యాశు సభామాభాస్వర ద్యుతిమ్
> ఉపవిశ్యాసనే తిష్ఠన్నస్మాభిరభివాదితః. 4

అట్లాతఁడు మహాదీప్తివంతమగు యా బ్రాహ్మణసభయందు శీఘ్రముగఁ బ్రవేశించి నమస్కరించి, మాచే నమస్కృతుఁడై ఆసనముపైఁ గూరుచుండెను

> వేదాన్తసాంఖ్య సిద్ధాన్తవాదాన్సంహృత్య సత్తమమ్
> సుఖోపవిష్టం విశ్రాన్తం తమహం పృష్టవానిదమ్. 5

అతఁడాసనముపై సుఖపూర్వకముగఁగూరుచుండి విశ్రమించినపిదప, నేను నిజపఠితములగు వేదాంతసాంఖ్యసిద్ధాంతవాదముల నుపసంహరించి యా బ్రాహ్మణోత్తముని నిట్లు ప్రశ్నించితిని.

> దీర్ఘాధ్వనా పరిశ్రాన్తః సయత్న ఇవ లక్ష్యసే
> వదాద్య వదతాం శ్రేష్ఠ కుత ఆగమనం కృతమ్. 6

వక్తలలో శ్రేష్ఠుఁడవగు నో మహాత్మా ! తాము దూరమార్గమునుండి యేతెంచుటచే నలసియున్నట్లును, దేనినోపొందుటకు (లేక ఎఱుఁగుటకు) యత్నపరులై యున్నట్లును జూపట్టుచున్నారు. కావున, తమరాక యెచటినుండియో, తెలుపఁగోరెదను.

బ్రాహ్మణ ఉవాచ :—

> ఏవమేతన్మహాభాగ సుమహాయత్నవానహమ్
> యదర్థమాగతోఽస్మీహ తస్యాకర్ణయ నిర్ణయమ్. 7

బ్రాహ్మణుఁడు:— ఓ సౌభాగ్యశీలుఁడా ! నీవు చెప్పినది వాస్తవమే. నేను మహాయత్నపరుఁడనైయున్నాను. ఏ కార్యముకొఱకు నేనిటకేతెంచితినో, అద్దాని నిర్ణయమునుగూర్చి వినుము.

> వైదేహోనామదేశోఽస్తి సర్వసౌభాగ్యసంయుతః
> స్వర్గస్యామ్బరసంస్థస్య ప్రతిబిమ్బమివావనౌ. 8

భూమిపై ఆకాశస్థస్వర్గముయొక్క ప్రతిబింబమువలె నొప్పునట్టి సర్వసౌభాగ్య సంయుతమగు విదేహమను దేశమొండుకలదు.

తత్రాహం బ్రాహ్మణో జాతః ప్రాప్తవిద్యశ్చ సంస్థితః
కున్దావదాతదన్తత్వాత్కున్దదన్త ఇతి శ్రుతః ॥ 9

ఆ దేశమున నొకానొక బ్రాహ్మణకులమున నేను జన్మించితిని. **అచ్చోటనే నేను** విద్యయు సముపార్జించితిని. నా దంతములు కుంద (మొల్ల) పుష్పమువలెఁ దెల్లగనుండుటచే **'కుంద దంతుఁడని'** నేను ప్రసిద్ధికెక్కితిని.

అథాహం జాతవైరాగ్యః పరిహర్తుం ప్రవృత్తవాన్
దేవద్విజమునీన్ద్రాణాం సంభ్రమాచ్ఛమశాన్తయే. 10

అటుపిమ్మట నేను వైరాగ్యమును బొందినవాఁడనై సంసారశ్రమయొక్క శాంతికొఱకై అఖండచేష్టాయుక్తుఁడనై దేవ, బ్రాహ్మణ మునీంద్రుల స్థానములగూర్చి సంచరింపఁ దొడఁగితిని.

శ్రీపర్వతమఖణ్డేహం కదాచిత్ప్రాప్తవానహమ్
తత్రావసం చిరం కాలం మృదు దీర్ఘం తపశ్చరన్. 11

అట్లు సంచరించుచు నొకపుడు శ్రీశైలమును జేరితిని. అచట చాలకాలమువఱకు కోమల తపంబాచరించుచు నుంటిని.

తత్రాస్త్యరణ్యం విదితం ముక్తం తృణవనాదిభిః
శ్రక్తతేజస్తమోభ్రాదిభూమావివ నభస్తలమ్. 12

అచ్చోట, తృణవనాదిరహితమై, ప్రకాశ, అంధకార మేఘాదివర్జితమై, శూన్యత్వమువలన భూమిపై నాకాశమువలెఁ బొచ్చుపడైనట్టి విదితమైన యరణ్యమొకటిగలదు.

తత్రాస్తి మధ్యే విటపీ లఘుః పేలవపల్లవః
స్థిత ఏషోఽమ్బరే శూన్యే మన్దరశ్మిరివాంశుమాన్. 13

శూన్యమగు ఆకాశమున మందకిరణయుక్తుఁడగు సూర్యునివలె ఆ ప్రదేశమధ్యమున ననేక శాఖలుగలదియు, కోమలపల్లవములతోఁ గూడినదియునగు ఒక చిన్న వృక్షముగలదు.

లమ్బతే తస్య శాఖాయాం పురుషః పావనాకృతిః
భానుర్భానావివ రశ్మిగృహీతో గ్రథితాకృతిః. 14

ఆ వృక్షముయొక్క శాఖయందొక పవిత్రాకారయుక్తుఁడగు మనుజుఁడు - బంధింపబడిన కిరణములను బాదములుగల సూర్యునివలె వ్రేలాడుచుండెను

మౌఞ్జిదామని బద్ధోర్ధ్వపాదో నిత్యమవాక్శిరాః
అష్ఠీలత్వం దధదివ మహాష్ఠీలస్య శాల్మలేః. 15

గట్టిత్రాడుచేఁ బైభాగమునఁ గట్టఁబడిన పాదములుగలవాఁడై నిరంతరము క్రింద వ్రేలాడుచున్నట్టి శిరస్సుగల్గి యాతఁడు అనేక కణుపులతోఁగూడిన గొప్ప శాల్మలీ (బూరుగు) వృక్షముయొక్క దీర్ఘమైన కణుపుయొక్క రూపమును ధరించియున్నవానివలె నుండెను.

దృష్టః ప్రాప్తేన తం దేశం స కదాచిన్మయా పుమాన్
విదారితో నికటతో వక్షఃస్థాఞ్జలిసంపుటః 16

యావజ్జీవత్యసౌ విప్రో నిఃశ్వసిత్యహతాకృతిః
శీతవాతాతపస్పర్శా న్స్పర్శాన్వేత్తి చ కాలజాన్. 17

ఒక సమయమున ఆ ప్రదేశమునకేగిన నేనాతనిని జూచుటసంభవించెను. అంత నే నాతని చెంతకేగి యాతని వక్షస్థలముపై జేతినుంచిచూచి ఉత్తమ ఆకారయుతుఁడగు బ్రాహ్మణుఁ డింకను జీవించియేయున్నాఁడు. ఉచ్ఛ్వాస నిశ్వాసములను గావించుచు కాలజనితములగు శీత, వాత, ఉష్ణములయొక్క స్పర్శల నెఱుఁగుచునేయున్నాడు అని నిశ్చయించితిని.

అనన్తరమసావేకో నోపచర్య మయా బహూన్
దివసాతపఖేదేన విశ్రమ్భే పాతితః శనైః 18

తదుపరి దివసముయొక్క ఆతపాది దుఃఖములను సహించుకొని నే ననేకదినములు ఆ వ్రేలాడుచుండు మనుజునియొక్క సేవచేసి మెల్లగ నాతనిని నాయెడల విశ్వాసము గలవానినిగఁ జేసికొంటిని.

పృష్టశ్చ కోఽసి భగవన్కిమర్థం దారుణం తపః
కరోషీదం విశాలాక్ష లక్ష్యాలక్ష్యాత్మజీవితః. 19

పిమ్మట నేనాతని నిట్లు ప్రశ్నించితిని. విశాలనేత్రుఁడవగు నో మహాత్మా! నీవెవరవు? లక్ష్య, అలక్ష్య, రూపమగు జీవితముగలవాఁడవై యిట్టి దారుణ తపంబెందుల కాచరించుచున్నావు?

అథ తేనోక్తమర్థస్తే క ఇవానేన తాపస
అర్థే నాతివిచిత్రా హి భవన్తీచ్ఛాః శరీరిణామ్. 20

అపుడాతఁడిట్లనెను — ఓ తాపసుఁడా! నాయొక్క కుల, దేశ తపః ప్రయోజనాదుల నెఱుఁగుటవలన నీకేమి ప్రయోజనము? ఏలయనిన, యేదైనయొక ప్రయోజనముకొఱకేగదా ప్రాణులకు అతి విచిత్రములైన కోర్కెలు కలుగుచున్నవి. (నిష్ప్రయోజనమైనదానియందు జిజ్ఞాస కలుగదనుట)

ఇత్యుక్తవాన్ప్రయత్నేన సోఽనుబన్ధేన వై మయా
యదాపృష్టస్తదా తేన మమోక్తమిదముత్తరమ్. 21

ఇట్లు పలికినమీదట నేనపుడాతనిని ప్రయత్నపూర్వకముగను, ప్రణయ (స్నేహ) పూర్వకముగను మరల యడుగ నంత నాతడీ ప్రత్యుత్తర మొసంగెను.

మధురాయామహం జాతో వృద్ధిం యాతః పితుర్గృహే
బాల్యయౌవనయోర్మధ్యే స్థితః పదపదార్థవిత్. 22

సమగ్రసుఖసంభారకోశో భవతి భూమిపః
ఇత్యహం శ్రుతవాంస్తత్ర భోగార్థీ నవయౌవనః, 23

అథ సప్త మహాద్వీపవిస్తీర్ణాయా భువః పతిః
స్యామిత్యహముదారాత్మా పరిభిమ్బితవాంశ్చిరమ్. 24

ఇత్యర్థేన సమాగత్య దేశ మిత్థమహం స్థితః
అత్ర ద్వాదశ వర్షాణి సమతీతాని మానద. 25

తదకారణమిత్రత్వం గచ్ఛేష్టం దేశమాశుగః
అహం చాభిమత ప్రాప్తేరిత్థమేవ దృఢస్థితిః. 26

'నేను మధురయందు జనించితిని. తండ్రియింటనే పెరిగి, బాల్య యౌవనముల మధ్య శాస్త్రములయొక్క పద, పదార్థజ్ఞాన యుక్తుఁడనైతి. అపుడు నూతన యౌవనము గలవాఁడను, భోగాభిలాషినినగు నేను, రాజు సమస్తసుఖభోగ సామగ్రికిని ఆశ్రయమైయుండునను విషయమచట వింటిని. అదివినిన పిదప నేను సప్తమహాద్వీపములవఱకు విస్తరించినట్టి భూమియొక్క పాలకుఁడను, అర్థిజనుల మనోరథముల నీడేర్ప సమర్థతగలవాఁడనగు రాజెట్లగుదునని చిరకాలము చింతన చేసితిని. తత్ప్రయోజనము నిమిత్తమే నేనిటకేతెంచి యీ ప్రకారముగ తపస్సుచేయుచున్నాను. మానప్రదా! ఇచ్చోట నాకుఁ బండ్రెండువత్సరములు గడచిపోయినవి. అకారణమిత్రమా! ఇట్లు, నీ వడిగిన ప్రశ్నకుఁ బ్రత్యుత్తర మొసంగితిని. కావున నీవిపుఁడిక నీ యభీష్టస్థానమునకు శీఘ్రముగఁబొమ్ము. నేనైతే, నా మనోరథ ప్రాప్తివఱకిట్లే తపంబున దృఢముగ స్థితినొందియుందును'.

ఇతి తేనాహముక్తః సంస్తమిత్థం ప్రోక్తవాఞ్ఛుభం
ఆశ్చర్యశ్రవణే చేతః ఖేదమేతి న ధీమతః. 27

ఈ ప్రకారముగ నాతఁడు వచింప, నేనపుడాతనితో నేమి చెప్పితినో వినుఁడు. ఎలయనిన ఆశ్చర్యమయమగు వృత్తాంతమును వినుటయందు బుద్ధిమంతుని చిత్తము ఖేదమొందదు.

సాధో యావత్త్వయా ప్రాప్తో న నామాభిమతో వరః
త్వద్రక్షాపరిచర్యార్థమిహ తావదహం స్థితః. 28

నే నిట్లంటిని — ఓ సాధూ నీవు నీ యభీష్టవరమును బొందనంతవఱకు నేనిచటనే యుండి నీయొక్క రక్షణమున్ను సేవయుఁజేయుచునుందును;

మయేత్యుక్తే స పాషాణమౌనవానభవచ్ఛమీ
నిమీలితేక్షణః క్షీణరూపస్త్వకలనో బహిః. 29

నేనిట్లు వచింపనంత ఆ శమశీలుఁడగు తాపసుఁడు శిలవలె మౌనము ధరించి, కనులను, మూసికొని బాహ్యచేష్టలెవ్వియులేక మృతునివంటి రూపముగలవాఁడై యుండెను.

తథాహం పురతస్తస్య కాష్ఠమౌనవతోఽవసమ్
షణ్మాసాన్విగతోద్వేగం వేగాన్కాలకృతాన్సహన్. 30

అట్టుకాష్ఠమౌనమును వహించియున్న యాతపస్వియెదుట నేనున్ను కాలకృతములగు శీతోష్ణాదిదుఃఖములను సహించుకొనుచు చింతా, భయరహితుఁడనై యాఱుమాసములుంటిని.

అర్కబిమ్బాద్వినిష్క్రమ్యతత్ప్రదేశాన్తరే స్థితమ్
ఏకదా దృష్టవానస్మి పురుషం భాసుభాస్వరమ్. 31

అపుడొక సమయమున, సూర్యబింబమునుండి బయల్వెడలి సూర్యునివలెఁ బ్రకాశమానుఁడైనట్టి యొక పురుషుఁడటకేతెంచి యాతపస్వియెదుట నిలఁబడుటను నేను గాంచితిని.

స తేన పూజ్యతే యావన్మనసా కర్మణా మయా
ఉవాచ తావద్వచనమమృతస్యన్దసున్దరమ్. 32

అపుడు నేనున్ను, ఆ తపస్వియుఁగలిసి మనోవాక్కాయములచే నాతనిని బూజించుచుండ నింతలో నమ్మనుఁజుడు అమృతస్రావమువంటి సుందరములైన వాక్యముల నిట్లు పలికెను.

శాఖాప్రలమ్బనపర హే బ్రహ్మన్దీర్ఘతాపస
తపః సంహర సంహారి గృహాణాభిమతం వరమ్. 33

వృక్షశాఖకు వ్రేలాడుటయందు తత్పరుఁడవును, దీర్ఘతాపసుఁడవునగు నో బ్రాహ్మణుఁడా! నీవిఁక నీ తపంబును జాలించి నీయభిమతమైనట్టి మనోహరమగు వరమును గ్రహింపుము.

సప్తాబ్ధిద్వీపవలయాం పాలయిష్యసి మేదినీమ్
సప్తవర్షసహస్రాణి దేహేనానేన ధర్మతః. 34

ఈ నీ శరీరముచేఁ గావింపఁబడిన తపస్సుయొక్క పుణ్యమువలన సప్తసముద్రముల చేతను సప్తద్వీపములచేతను జుట్టఁబడినట్టి యీ భూమిని ఏడువేల సంవత్సరములవఱకు నీవు పాలింపఁగలవు.

ఏవం సమీహితం దత్త్వా స ద్వితీయో దివాకరః
గన్తుమస్తమథార్కాబ్ధిమవిశత్ప్రోదితో యతః. 35

ఈ ప్రకారముగ ఆ తపస్వికి అభిమతవరంబొసంగి యా రెండవసూర్యుఁడు, ఏ సూర్యరూప సముద్రమునుండి బయల్వెడలెనో మరల దానియందే అంతర్ధానమగుటకొఱకై ప్రవేశించెను.

తస్మిన్యాతే మయా ప్రోక్తం తస్య శాఖాతపస్వినః
శ్రుతదృష్టానుభూతాగ్ర్య వరదస్య వివేకినః. 36

అట్లు, ఆ యాదిత్యపురుషుఁడు వెడలినపిమ్మట, శాస్త్రములద్వారా వినఁబడినట్టియు, ప్రత్యక్షముగఁ జూడఁబడినట్టియు, వరదానవ్యవహారముచే ననుభవింపఁబడినట్టియు నుత్తముడైన వరదుఁడగు ఆదిత్యపురుషుఁడుగల యాశాఖాతపస్వితో నేనిట్లంటిని —

సంప్రాప్తాభిమతం బ్రహ్మం స్తరుశాఖావలమ్బనమ్
తపస్త్యక్త్వా యథాప్రాప్తం వ్యవహారం సమాచర. 37

మహాత్మా! నీ విపుడు నీ యభిమతవరమును బొందితివి. కావున నిఁక శాఖావలంబన రూపమగు యీ నీ తపంబును దృజించి. (స్వగృహగమనాది) యథాప్రాప్తమగు వ్యవహారము నాచరింపుము.

ఏవమఙ్గీకృతవతః పాదౌ తస్యమయా తతః
ముక్తౌ విటపిన స్తస్మాద్దాలానాత్కాలభావివ. 38

ఈ ప్రకారమగు నా కథనమును నాతఁడంగీకరింప, అంత నేను, కట్టుకంబమునుండి యేనుఁగును విడదీయునట్లు, ఆ వృక్షశాఖనుండి యాతని రెండుపాదముల నూడఁదీసితిని.

స్నాతః పవిత్రహస్తోఽసౌ చక్రేఽజప్త్వాఘమర్షణమ్
ఫలేన పుణ్యలబ్ధేన విటపాద్వ్రతపారణమ్. 39

తదుపరి స్నానమొనర్చి, పవిత్రహస్తముతోటి యా బ్రాహ్మణుడు అఘమర్షణ మంత్రమును జపించెను. అనంతరము తపస్సిద్ధిబలముచే ఆ వృక్షమునుండి లభించిన ఫలములతోటి యాతడు నాతోఁగూడ వ్రతపారణ మాచరించెను.

తత్పుణ్యవశతః ప్రాప్తైః స్వాదుభిస్తైస్తరోః ఫలైః
సమాశ్వస్తావ సంక్షుబ్ధావావాం తత్ర దినత్రయమ్. 40

తపఃపుణ్యవశముచే లభించిన స్వాదిష్టములగు ఆ వృక్షఫలములను, భుజించుచు, ధైర్యోపేతులమై, క్షోభవర్జితులమై మేమట మూఁడుదినములవఱకు వసించితిమి.

సప్తద్వీపసముద్రముద్రితదిశం భోక్తుం సమగ్రాం మహీం
విప్రః పాదపలమ్బితేన వపుషా తప్త్వోర్ధ్వపాదస్తపః
సంప్రాప్యాభిమతం వరం దినకృతో విశ్రమ్యచాహ్నాంత్రయం
సార్ధం మత్సుహృదా స్వమేవ సదనం గన్తుం ప్రవృత్తోఽభవత్. 41

ఇత్యార్షే శ్రీవాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే ఉత్తరార్ధే బ్రహ్మగీతాసు తాపసోపాఖ్యానం నామాశీత్యధిక శతతమః సర్గః ॥ 180 ॥

సప్తద్వీప, సప్తసముద్రయుక్తమగు పృథివిని బాలించుటకొఱకై, పైన పాదములను క్రింద శిరస్సును నిడుకొని వృక్షశాఖయందు వ్రేలాడుచున్న యా బ్రాహ్మణుడు దీర్ఘకాలము తపం బాచరించి సూర్యపురుషునివలన అభిమతవరమును బొందినవాఁడై, పిమ్మట, పాదపీడయొక్క నివృత్తికొఱకు మూఁడుదినములచట విశ్రమించి తదుపరి మిత్రుఁడనగు నాతోఁగూడ, మధుర యందున్న స్వగృహమున కేగుటకై ప్రవృత్తుఁడాయెను.

ఇది శ్రీవాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున నుత్తరార్ధమున బ్రహ్మగీతలందు తాపసోపాఖ్యానమను నూటయెనుబదవ సర్గము ॥ 180 ॥



## ఏకాశీత్యధిక శతతమః సర్గః

[గచ్ఛతోర్మథురాం మార్గభ్రంశాద్గౌరీవనాగమః
తత్ర తాపసవృద్ధేన సంవాదశ్చాత్ర వర్ణ్యతే.

మథురకుఁ బోవుచుండ త్రోవలో మార్గము తప్పుటచే గౌరీవనమును జేరుట, అట నొక వృద్ధతాపసునితోటి సంభాషించుట యను విషయములిచట వర్ణింపఁబడుచున్నవి.]

కున్దదన్త ఉవాచ :-

> ఆవాసమన్తరే గన్తుం ప్రవృత్తౌ ముదితాకృతీ
> మథురానగరీం చన్ద్రసూర్యావిన్ద్రపురీమివ. 1

కుందదంతుఁడు:— ఓ రామచంద్రా! చంద్ర సూర్యులు ఇంద్రపురమున కేగుటకై సాయంకాలమునఁ బ్రవృత్తులగునట్లు, మధురాపురమునుగూర్చి యేగుచున్న సంతుష్టాకారయుక్తుల మగు మేమిరువురమున్ను దినమంతయు నడిచి సాయంకాలమున మధ్యనొక విశ్రాంతిస్థానమున కేగుటకై ప్రవృత్తులమైతిమి.

> ప్రాప్య రోధాభిధం గ్రామంవిశ్రమ్యామ్రవణాచలే
> ఉషితౌ ద్వే దినే తస్మిన్సాలీసే నగరే సుఖమ్. 2

పోవుచు, పోవుచు త్రోవలో రోధయను గ్రామమును బొంది యచట, ఆమ్ర(మామిడి) వనముచే శోభితమగు ఒక పర్వతముపై విశ్రమించి పిమ్మట సాలీసమను నగరమున రెండు దినములు సుఖముగ నివసించితిమి.

> అథ్వానన్దితచిత్తాభ్యామావాభ్యామతివాహితః
> ద్వితీయేఽహని శీతామ్బుస్నిగ్ధచ్ఛాయా వనద్రుమాః 3
> నదీతీరలతోన్ముక్తపుష్పప్రకరపాణ్డురాః
> తరత్తరఙ్గఝూంకారగాయనానన్దితాధ్వగాః. 4
> స్నిగ్ధద్రుమవనచ్ఛాయరణన్మృగ విహంగమాః
> స్థూలశాద్వలశాఖాగ్రప్రోతావశ్యాయమౌక్తికాః. 5
> జంగలాద్రిపుర గ్రామశ్వభ్రానూపస్థలావనీః
> సముల్లఙ్ఘ్య దినే తస్మిన్పరిశ్రాన్తౌ సరాంసి చ. 6
> నీతవన్తౌ నిశామావాం కదలీకాననే ఘనే
> తుషారశిశిరే శ్రాన్తౌ కదలీదలతల్పకే. 7

మఱుసటిదినమున ప్రసన్నచిత్తులమగు మేమిరువురమును శీతలోదక, ఉత్తమచ్ఛాయా సహితవనవృక్షసమన్వితములైనవియు, నదీతీరములందలి లతలచే విడువఁబడినట్టి పుష్పసమూహ ములచేఁ వెల్లనైనవియు, చంచలతరంగములయొక్క ఝుంకారశబ్దపూర్వకమగు గానముచే నానందము నొందు పదికులచే శోభించునవియు, దట్టమైన వనవృక్షములయొక్క ఛాయయందు శబ్దమొనర్చు మృగ, పక్షులతోఁగూడినవియు, స్థూల, హరిత(పచ్చని) తృణములయొక్క శాఖాగ్రము లందుఁ గ్రుచ్చఁబడిన ముత్తెములవంటి హిమబిందువులచేఁ బూర్ణములైనవియు, అరణ్య, పర్వత, నగర, గ్రామ, గర్తసహితములై యొప్పునవియునగు సజలభూములనుదాటి, సెలయేళ్లను, నదులను, సరస్సులను నతిక్రమించిపోయి, అలసినవారమై, అపుడు మంచుచే జల్లనైనట్టి దట్టమైన కదళీ (అరఁటి)వనమున కదళీదళనిర్మితమగు శయ్యపై నారాత్రిగడిపితిమి.

ప్రాప్తావావాం తృతీయేఽహ్ని ఖణ్డఖణ్డకమణ్డితమ్
జఙ్గలం జనవిచ్ఛేదవిభక్తం ఖమివాకృతమ్. 8

పిమ్మట మూఁడవదినమున, కమల, లతాసమూహములచే భూషితమైనదియు, తృణ కాష్ఠ హారాదులచే నొనర్పఁబడిన విచ్ఛేదములచే విభక్తమై మేఘవిచ్ఛేదములచే విభక్తమైన యాకాశము వలెనంతటఁ గావింపఁబడినదియునగు ఒకానొక అరణ్యమును జేరితిమి.

తత్ర స ప్రకృతం మార్గం పరిత్యజ్య వనాన్తరమ్
ప్రవిశన్ప్రమువాచేదమకార్యకరణం వచః. 9

ఓ రామచంద్రా! అచట, ప్రస్తుతమార్గమును విడిచిపెట్టి మఱియొకవనమందుఁ బ్రవేశించుచు, ఆ తపస్వి అకార్యకరణములగు ఈ వాక్యముల బల్కెను —

గచ్ఛావోఽత్రాశ్రమే గౌర్యా మునిమణ్డలమణ్డితే
భ్రాతరో మే స్థితాః సప్త వనేష్వేవమివార్థివః. 10

భ్రాతరోఽష్టౌ వయమిమే జాతానేకతయా తయా
ఏకసంవిన్మయా జాతా ఏకసంకల్పనిశ్చయాః. 11

తేన తేఽప్యత్ర తపసే స్వనిశ్చయసమాశ్రయాః
స్థితా అగత్య వివిధైస్తపోభిః క్షపితైనసః. 12

తైః సార్ధం భ్రాతృభిః పూర్వమాగత్యాహమిహావనమ్
షణ్మాసానాశ్రమే గౌర్యాస్తేన దృష్టో మయైష సః 13

పుష్పఖణ్డతరుచ్ఛాయాసుప్తముగ్ధమృగార్భకః
పర్ణోటజాగ్రవిశ్రాన్తశుకోద్గ్రాహితశాస్త్రదృక్. 14

మిత్రమా! మునుల సమూహముచే శోభితమగు ఈ గౌర్యాశ్రమమునకుఁ బోవుదము, రమ్ము ఏలయనిన, నావలెనే మనోరథముల వాంఛించునట్టి నా యేడుగురు సోదరులీవనములందుఁ గలరు సప్తద్వీపరాజ్యభోగేచ్ఛచే జనించిన యనేక మనోరథములతోఁగూడి యుండుట వలన మే మెనమండ్రు సోదరులమును తపస్సుకొఱకై యొకేదృఢనిశ్చయము గలవారమైతిమి, ఇక్కారణమున వారివారి నిశ్చయమందు తత్పరులై, అ యేడుగురు సోదరులును, ఈ గౌర్యాశ్రమమున కేతెంచి వివిధతపంబులందు స్థితినొందియున్నవారై, వానిచే పాపరహితులైరి. ఈ నా యేడుగురు సోదరులతోఁగూడఁగలిసి నేనిటకుఁ బూర్వమేతెంచినవాఁడనై యాఱుమాసములవఱకిచటనే యుంటిని. కావున అపుడీయాశ్రమమును నేను జూచియుంటిని. ఈ యాశ్రమము పుష్పసమూహయుక్తములగు వృక్షములయొక్క ఛాయయందు నిదురించు సుందరమృగశిశువులు గలదియు, తాపసుల పర్ణశాలలందు విశ్రమించువవియు, నానాశాస్త్రములను జెప్పునవియునగు చిలుకలతోఁ గూడియున్నదియునై యలరారుచున్నది.

తదబ్రహ్మలోకసంకాశమేహి మున్యాశ్రమం శ్రియే
గచ్ఛావోఽద్భుతరం తత్ర చేతః పుష్యైర్ఘవిష్యతి 15

కావున బ్రహ్మలోకమువంటి ఈ యాశ్రమమునకు నిఃశ్రేయముకొఱకై పోవుదము రమ్ము. తదాశ్రమదర్శనపుణ్యముచే నచట మనయొక్క చిత్తము సర్వదోషక్షయముచే నధిక శుద్ధము కాఁగలదు.

విదుషామపి ధీరాణామపి తత్త్వవిదామపి
త్వరతే హి మనః పుంసామలం బుద్ధివిలోకనే. 16

తత్త్వదర్శనముచే పూర్ణచిత్తులగు మునులయొక్క దర్శనముకొఱకై విద్వాంసుల యొక్కయు, ధీరులయొక్కయు, తత్త్వవేత్తలయొక్కయు, మనస్సుకూడ త్వరపడును. ఇఁక మన వంటివారి విషయమై వేఱు చెప్పవలెనా ?

తేనేత్యుక్తే చ తావావాం ప్రాప్తౌ మున్యాశ్రమం చ తమ్
యావత్తత్ర మహారణ్యే పశ్యావశ్చాన్తరూపిణమ్. 17

న వృక్షం నోటజం కించిన్న గుల్మం న చ మానవమ్
న మునిం నార్భకం నాన్యన్న వేదిం న చ వా ద్విజమ్. 18

కేవలం శూన్యమేవాతి తదరణ్యమనన్తకమ్
తాపోపతప్తమభితో భూమౌ స్థితమివామ్బరమ్. 19

అట్లాతపస్వి వచింపనంత మే మిరువురమును ఆ మున్యాశ్రమమును బొందితిమి. కాని, ఆ మహారణ్యమునఁ బ్రవేశింపగనే యట నంతయు శూన్యముగనే యుండియుండుటఁ జూచి తిమి. అచ్చోట నేదైన వృక్షముగాని, కుటీరముగాని, పొదగాని, మనుజుఁడుగాని మునిగాని, మృగ శిశువుగాని వేదిగాని, బ్రాహ్మణుఁడుకాని, లేక, మఱియేదైనఁగాని లేదు. ఆ విశాలారణ్యము కేవ లము మహాశూన్యమై, తాపముచే సర్వత్ర అతిసంతప్తమై, భూమిపైనున్న యాకాశమువలె నొప్పు చుండెను.

హా కష్టం కిమిదం జాతమితి తస్మిన్వదత్యథ
ఆవాభ్యాం సుచిరం భ్రాన్త్వా దృష్ట ఏకత్ర వృక్షకః. 20

'అయ్యో! కష్టము! ఇదియేమి యిట్లైనది' అని యా తాపసుఁడు పల్కుచుండనంత మే మిరువురమును, చాలసేపచట సంచరించి తుదకొకచోట నొక వృక్షమును గాంచితిమి,

స్నిగ్ధచ్ఛవిర్ఘనచ్ఛాయః శీతలోఽమ్బుధరోపమః
తలే తస్య సమాధానే సంస్థితో వృద్ధతాపసః. 21

ఆ వృక్షము మనోహరమైన శోభతోఁగూడినదియు, దట్టమైన ఛాయగల్గి యున్నదియు మేఘమువలె శీతలమైనదియునై వెలయుచుండెను. దానిక్రింద సమాధిపరాయణుఁడైయున్న యొక వృద్ధ తపస్వియుండెను.

ఆవామగ్రే మునేస్తస్య ఛాయాయాం శాద్వలస్థలే
ఉపవిష్టౌ చిరం యావన్నాసౌ ధ్యానాన్నివర్తతే. 22

అంత మేమాముని సమాధినుండి లేవనంతవఱకును నాతనియెదుటనే వృక్షచ్ఛాయ యందుఁ బచ్చికగడ్డిపైఁ చిరకాలము కూరుచుండియుంటిమి.

తతశ్చిరేణ కాలేన మయోద్వేగేన చాపలాత్
ఉక్తం మునే ప్రబుధ్యస్వ ధ్యానాదిత్యుచ్చకైర్వచః. 23

పిమ్మట చాలకాలమునకు ఉద్వేగయుక్తుఁడనై చపలస్వభావమువలన నేను 'ఓ మునీ! ఇఁక సమాధినుండి లెమ్ము!' అని బిగ్గరగాఁ బల్కితిని.

శబ్దేనోచ్చైర్మదీయేన సంప్రబుద్ధోఽభవన్మునిః
సింహోఽమ్బుదరవేణేవ బ్రూమ్యాం కృత్వోత్యువాచ చ. 24

అపుడు, మేఘగర్జనచే సింహము మేల్కాంచునట్లు, నా యున్నతస్వరముచే ఆ మునివర్యుఁడు సమాధినుండి మేల్కాంచి యావలించి యిట్లుపలికెను.

కౌ భవన్తావిమౌ సాధూ క్వాసౌ గౌర్యాశ్రమో గతః
కేన వాహమిహానీతః కాలోఽయం కశ్చ వర్తతే. 25

ఓ సాధువులారా! మీరెవరు? గౌర్యాశ్రమమేమైనది? నన్నిచటికెవరుకొనివచ్చిరి? ఇపుడేకాలము గడుచుచున్నది?

తేనేత్యుక్తే మయాప్యుక్తం భగవన్వేద్ధి చేద్భృశమ్
న కించిదావాం బుద్ధోఽపి కస్మాజ్ఞానాసి న స్వయమ్. 26

అతఁడిట్లనుగ నంత నే నాతనితో నిట్లంటిని — మహాత్మా! ఈ విషయములను మేమెఱుఁగము. తామే తెలిసికొనుఁడు. సర్వజ్ఞులగు తాము యోగబలముచే స్వయముగనే వాని నేల యెఱుఁగకయున్నారు?

ఇతి శ్రుత్వా స భగవాన్పునర్ధ్యానమయోఽభవత్
దదర్శోదన్తమఖిలమస్మాకం స్వాత్మనస్తథా. 27

ఆ వాక్యములను వినినమీదట మహాత్ముఁడగు ఆ ముని మరల ధ్యానపరాయణుఁడై, తనయొక్కయు, మాయొక్కయు వృత్తాంతమునంతయు వీక్షించెను.

ముహూర్తమాత్రేణోవాచ ప్రబుధ్య ధ్యానతో మునిః
శ్రూయతామిదమాశ్చర్యమార్యౌహి కార్యవేదినౌ. 28

తదుపరి యొకముహూర్త మాత్రకాలములో నమ్ముని ధ్యానమునుండి లేచి యిట్లు పలికెను — ఆర్యులారా! కార్యవేత్తలారా! ఈ యాశ్చర్యకరమగు వృత్తాంతమును వినుఁడు.

యమిమం పశ్యతః సాధూ కదమ్బతరుపుత్రకమ్
మదాస్పదమరణ్యాన్యా ధమ్మిల్లమివపుష్పితమ్. 29

సాధువులారా! బాగుగ పుష్పించినదై, ఈ యరణ్యమను స్త్రీయొక్క కొప్పువలెఁ జూపట్టుచున్నట్టి ఏ యీ చిన్న కదంబ (కడిమి) వృక్షమును మీరిచటఁ జూచుచున్నారో, ఇదియే నా నివాసస్థానము.

కేనాపి కారణే నాప్మిన్నతీ వాగీశ్వరీనతీ
అవసద్దశవర్షాణి సమ స్తర్తునిషేవితా. 30

ఏదోయొక కారణమువలన గౌరీదేవి సరస్వతీరూపమున్ను ధరించి సమస్త ఋతువులచే సేవింపఁబడుచు నిచట పది సంవత్సరములవఱకు నివసించెను.

తదా తేనేహ విస్తీర్ణమభవద్ఘనకాననమ్
గౌరీవనమితి ఖ్యాతం భూషితం కుసుమర్తుభిః. 31

ఆ కారణముచే నపుడిచట నీ యరణ్యమంతయు వృక్షములచే దట్టముగ వ్యాపింపఁ బడినదై, మిగుల విస్తారమును బొందెను. మఱియు నపుడు పుష్పప్రధానములగు సమస్తఋతువులచే నలంకరింపఁబడినదై యిది గౌరీవనమను పేరుచేఁ బ్రసిద్ధికెక్కెను.

భృఙ్గాఙ్గనా జనమనోహరహారిగీత లీలావిలోక కలకణ్ఠవిహంగమఙ్గ
పుష్పామ్బువాహశతచన్ద్రనభోవితానం రాజీవరేణుకణకీర్ణదిగన్తరాలమ్. 32

మన్దారకున్ద మకరన్ద సుగన్ధితాశం సంసూచ్చ్యసత్కుసుమరాశిశశాఙ్కనిష్ఠమ్
సంతానకస్తబకహాసవికాసకాన్త మామోదిమారుతసమస్తలతాఙ్గనౌఘమ్. 33

పుష్పాకరస్య నగరం నవగీతభృఙ్గం భృఙ్గాఙ్గనాకుసుమఖణ్డకమణ్డపాఢ్యమ్
చన్ద్రాంశుజాలపరికోమలపుష్పదోలాదోలాయమానసురసిద్ధవధూసమూహమ్. 34

హారీతహంసశుకకోకిల కోకకాక చక్రాహ్వభాసకలవిఙ్కకులాకులాఙ్గమ్
భేరుణ్డకుక్కుటకపిఞ్జలహేమచూడ రాఢామయూరబకకల్పిత కేలిరమ్యమ్. 35

గన్ధర్వ యక్షసురసిద్ధకిరీట ఘృష్ట పాదాబ్జకర్ణిక కదమ్బ సరస్వతీకమ్
వాతాయనంకనకకోమలచమ్పకౌఘతారామ్బరామ్బుధరపూరగృహీతగన్ధమ్ 36

మన్దానిలస్ఖలిత పల్లవబాలవల్లి విన్యాసగుప్తదివసాధిపరశ్మి శీతమ్
పీతం కదమ్బకరవీరకనాళికేర తాళీతమాలకులపుష్పపరాగపూరైః 37

కహ్లారకీర్ణకుముదోత్పలపద్మఖణ్డ వల్గచ్చకోరబకకోకకదమ్బహంసమ్
తాళీసగుగ్గులకచన్దనపారిభద్రభద్రదుమోదరవిహారివిచిత్రశక్తి 38

ప్రియులగు సాధువులారా! అపుడీవనము ఆడుతుమ్మెదలయొక్క మనోహరములైన గీతములయొక్క లీలలను దర్శించునటువంటి మధురకంఠ సమన్వితములైన కోకిలలచేఁ బూర్ణమైనదియు, పుష్పములను వర్షించు మేఘప్రాయములగు వృక్షములతో గూడియున్నదై నూఱు చంద్రులుగల యాకాశమను వితానమువలెఁ జూపట్టునదియు, కమలములయొక్క పుప్పొడిచే వ్యాప్తమైనట్టి దిగంతరాళముగలదియు, మందార, కుందాది పుష్పములయొక్క మకరందముచే దిక్కులను సుగంధితములుగఁ గావించునదియు అంతటను బాగుగ వికసించినట్టి పుష్పసమూహములను చంద్రబింబముచే శోభించునదియు, కల్పవృక్షములయొక్క హాస్యతుల్యములైనట్టి వికసించిన పూగుత్తులచే నతి రమణీయమైనదియు, సుగంధయుక్తమగు వాయువుచే వ్యాప్తములైన సమస్త

లతలను వనితాసమూహముచేఁ బూర్ణమైనదియు, వసంతునియొక్క నగరమువలెఁ బ్రకాశించు నదియు, నూతనములైన గీతములఁబాడు తుమ్మెదలు గలదియు, అట్టితుమ్మెదలతోఁగూడిన పుష్ప మంటపములచే బరిపూర్ణమైనదియు, చంద్రకిరణసమూహమువలె నంతటను గోమలములైనట్టి పుష్ప యుక్తములగు ఊయెలలందూగుచున్న దేవతా, సిద్ధస్త్రీసమూహము గలదియు. హారీత(పచ్చపిట్ట), హంస, శుక, కోకిల. కోక(జక్కవ) కాక. చక్రవాకాది పక్షిసమూహములచే వ్యాప్తములైన అంగ, ములుగల్గియున్నదియు, భేరుండ, కుక్కుట(కోడి), కపింజల (కముఁజుపిట్ట), తిత్తిరి, రాధా. మయూర, బకాది వివిధపక్షుల క్రీడలచే మనోహరమైనదియు, గంధర్వ, యక్ష, సుర, సిద్ధాదుల కిరీటములచే నొరయిక జెందిన పాదకమల కర్ణిక(దుద్దు)లచే శోభించు కదంబసరస్వతిగలదియు, సుగంధవాయువులకు స్థానమగుటచే సువర్ణమువలెఁ గోమలములైనట్టి చంపకపుష్పసమూహముల నుండి నక్షత్ర, మేఘములచే గ్రహింపఁబడిన సుగంధముతో తులఁదూఁగునదియు, మందవాయువు వలనఁ బడినట్టి పల్లవ బాలలతలయొక్క ప్రసారములచే గుప్తములుగనున్న కుంజము (పొద) లందు నిరోధింపబడిన సూర్యకిరణములచే లోనఁ జల్లగనున్నదియు. కదంబ (కడిమి), కరవీర (గన్నేరు), నారికేళ, తమాల(చీకటిమ్రాను) తాళాదివృక్షసమూహముయొక్క పుష్పపరాగములచే పీతవర్ణముగ నొప్పునదియు, రక్తకమల మిశ్రితములగు శ్వేతనీలకమలములుగల పద్మసరోవరము లందుఁ గ్రీడించు చకోర, బకకోకాది పక్షిసమూహముతోఁగూడిన హంసలచే శోభించునదియు, తాళ, గుగ్గుల, పారిభద్ర(దేవదారు), చందనాది వృక్షములమధ్య విహరించునట్టి విచిత్రమైన సర్వమనోరథ పరిపూరకమగు శక్తి గలదియునై యలరారుచుండెను.

తస్మిన్వనే చిరమువాస హరార్ధదేహా కేనాపి కారణవశేన చిరాయ గౌరీ
భూత్వాప్రసన్నశశిబిమ్బముఖీ కదమ్బవాగీశ్వరీ శశికలేవ శివస్య మూర్ధ్ని.

ఇత్యార్షే శ్రీ వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే ఉత్తరార్ధే బ్రహ్మగీతాసు తాపసోపాఖ్యానే గౌర్యాశ్రమవర్ణనం నామైకాశీత్యధికశతతమః సర్గః ॥ 181 ॥

ఈ ప్రకారమగు ఆ వనమున నేదోయొక కారణముచే నిర్మలచంద్రబింబముఖియు, శివుని అర్ధాంగియునగు గౌరీదేవి కదంబవృక్షస్థ సరస్వతీరూపమును ధరించి, శివుని శిరంబుపైఁ జంద్రకళవలె, చిరకాలము వసించెను (అదియే యావనసంపదలకుఁ గారణమని భావము.)

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున నుత్తరార్ధమున బ్రహ్మగీతలందు తాపసోపాఖ్యానమున గౌర్యాశ్రమవర్ణనమను నూటయెనుబదియొకటవ సర్గము ॥ 181 ॥

## ద్వ్యశీత్యధికశతతమః సర్గః

[కదమ్బతాపసేనాత్ర తద్భ్రాతౄణాం సమాగమః
గృహేషు వరశాపానాం హేతుసిద్ధిశ్చ వర్ణ్యతే.

కదంబతాపసునియొక్క యాతని సోదరులతోటి కలయిక, గృహములందు వర, శాపా దులయొక్క హేతువు, సిద్ధి యనువిషయములిచట వర్ణింపఁబడుచున్నవి.]

వృద్ధతాపస ఉవాచ :-

తస్మిన్నేవ కదమ్బేఽస్మిన్వర్షాణి స్వేచ్ఛయా దశ
స్థిత్వా గౌరీ జగామాథ హరవామార్ధమన్దిరమ్. 1

వృద్ధతాపసుఁడు:— ఓ సాధువులారా! అట్టి యీ నా నివాసభూతమగు కదంబవృక్షము పైననే గౌరీదేవి నిజేచ్ఛచేఁ బదిసంవత్సరములు వసించి పిమ్మట స్వనిలయమగు కైలాసమున కేగెను.

తత్పుర్ణామృతసిక్తోఽయం కదమ్బతరుపుత్రకః
ఉత్పన్న ఇవ చాసీనో న యాత్యేవ పురాణతామ్. 2

ఆ భగవతియొక్క స్పర్శామృతముచేఁ దడుపఁబడినదై యీ చిన్నికదంబవృక్షము, యొడియందున్న బాలునివలె వృద్ధత్వమును బొందకయేయున్నది.

తతో గౌర్యాం ప్రయాతాయాం తద్వనం తాదృశం మహత్
సామాన్యవనతాం యాతం జనవృన్దోపజీవితమ్. 3

ఆ గౌరీభగవతి వెడలినపిదప అటువంటి మహత్తరమైన యావనము తృణ, కాష్ఠ, ఫల పుష్పాదులనమ్ముకొని జీవించుజనులకాశ్రయమై, సామాన్యమైన వనముయొక్క రూపములను బొందెను.

మాలవో నామ దేశోఽస్తి తత్రాహం పృథివీపతిః
కదాచిత్త్యక్తరాజ్యశ్రీర్మునీనామాశ్రమాన్భ్రమన్. 4

ఇదం దేశమనుప్రాప్త ఇహ చాశ్రమవాసిభిః
పూజితోఽస్య కదమ్బస్య ధ్యాననిష్ఠస్తలే స్థితః. 5

ఓ సాధువులారా! మాలవమను దేశమొకటి గలదు. నే నాదేశమునకు రాజయి యుంటిని. ఒకానొకసమయమున వైరాగ్యముచే రాజ్యమును ద్యజించివైచి మునుల యాశ్రమములఁగూర్చి సంచరించుచు ఈ స్థానమునకేతెంచితిని. అపుడీ యాశ్రమవాసులచేఁ బూజితుఁడనై ఈ కదంబ వృక్షముక్రిందనే ధ్యానపరాయణుఁడనైయుంటిని.

కేనచిత్త్వథ కాలేన భ్రాతృభిః సప్తభిః సహ
భవానభ్యాగతః పూర్వం తపోర్థమిమమాశ్రమమ్. 6

అటుపిమ్మట కొంతకాలమునకు నీవు నీయేడుగురు సోదరులతోఁగలిసి తపస్సు నిమిత్తమై పూర్వ మీ యాశ్రమమున కేతెంచితివి.

తపస్వినోఽష్టావిహ తే తథా నామ తదావసన్
యథా తపస్వినోఽన్యే తే తేషాం మాన్యాస్తపస్వినః 7

ఆ మీ యెనిమిదిమందిన్ని – మీకున్ను బూజ్యులైనట్టి తక్కిన తాపసులెట్లు వసించుచుండిరో అట్లే తాపసులై యిచట వసింపఁదొడఁగిరి.

కాలేనానన్తరమసావేకః శ్రీపర్వతం గతః
స్వామినం కార్త్తికేయం చ ద్వితీయస్తపసే గతః. 8

వారాణసీం తృతీయస్తు చతుర్థోఽగాద్ధిమాచలమ్
ఇహైవ తే వరే ధీరాశ్చత్వారోఽన్యే పరం తపన్. 9

తదుపరి కొంతకాలమునకు వారిలో నొకఁడవు శ్రీశైలమునకును, రెండవవాఁడు కార్తికేయస్వామి యుండు ప్రదేశమునకును, మూఁడవవాఁడు కాశికిని, నాల్గవవాఁడు హిమాలయ పర్వతమునకును తపంబాచరించుటకై వెడలిరి. తక్కినవారైన ధీరులగు నలుగురున్ను నిచటనే తీవ్ర తపస్సానర్చిరి.

సర్వేషామేవ చైతేషాం ప్రత్యేకం త్వేతదీప్సితమ్
యథా సమస్తదీపాయా భువోఽస్యాః స్యాం మహీపతిః. 10

వారిలో ప్రతివానికిన్ని 'నేనీ సప్తద్వీపవతియగు పృథివికంతకును రాజు కావలెను' అను కోరిక యుండెను.

అథ సంపాదితం తేషాం సర్వేషామేతదీప్సితమ్
తపస్తుష్టాభిరిష్టాభిర్దేవతాభిర్వరైర్వరైః. 11

పిమ్మట తపస్సుచే సంతుష్టులైనట్టి యిష్టదేవతలవలన వారందఱును నుత్తమ వరములద్వారా తమ యభీష్టమును బడసిరి.

తపతస్తే తతో యాతా భ్రాతరః సదనం నిజమ్
భూమౌ ధర్మయుగం భుక్త్వా వేధా బ్రహ్మపురీమివ. 12

నీ వింకను తపస్సు చేయుచుండగనే యా నీ తక్కిన సోదరులందఱును వరములను బొందినవారై, భూమిపై ధర్మప్రధానమగు కృతయుగము ననుభవించి బ్రహ్మదేవుఁడు బ్రహ్మలోకమున కేగునట్లు, స్వగృహమునకేగిరి.

తైర్భవద్భ్రాతృభిర్భవ్యవరదానవిధౌ తదా
ఇదం వరోద్యతా యత్నాత్ప్రార్థితాః స్వేష్టదేవతాః. 13

దేవ్యస్మాకమిమే సర్వే సప్తద్వీపేశ్వరస్థితా
సత్యాః ప్రకృతయః సన్తు సర్వ ఆశ్రమవాసినః. 14

భవ్యుఁడవగు నో సాధూ! వరములనుగోరు యా సమయమున, ఆ నీ సోదరు లందఱును, వరములొసంగుటకు సంసిద్ధులైయున్న తమ యిష్టదేవతలను బ్రయత్నపూర్వకముగ నిట్లు ప్రార్థించిరి — 'ఓ దేవీ! మేమందఱము నెపుడు సప్తద్వీపవతియగు భూమికి ప్రభువులుగ నుందుమో, అపుడు మా ప్రజలందఱును అసత్యమును త్యజించి సత్యనిరతులై యుందురుగాక! మఱియు సర్వులును వారివారి యాశ్రమ ధర్మములందు సుస్థిరులై మెలగుదురుగాక!'

తమిష్టదేవతాసార్థమురరీకృత్య సాదరమ్
తేషామస్త్వేవమిత్యుక్త్వా జగామాన్తర్ధిమీశ్వరీ. 15

ఆ యిష్టదేవతయగు ఈశ్వరియు వారి యా ప్రార్థన నాదరపూర్వకముగ నంగీకరించినదై, 'అట్లేయగుగాక!' అనిపలికి అంతర్ధానమైపోయెను.

తే తతః సదనం యాతాస్తేషామాశ్రమవాసినః
సర్వ ఏవ గతాః పశ్చాదేక ఏవాస్మి నో గతః. 16

తరువాత వారందఱును నిజగృహమునకుఁ జనిరి. ఆపిమ్మట ఆ యాశ్రమవాసు లంద ఱునుగూడ వెడలిపోయిరి. నేనొక్కఁడనే వెడలక యుంటిని.

అహం కేవలమేకాన్తే ధ్యానైకగతమానసః
వాగీశ్వరీకదమ్బస్య తలే తిష్ఠామి శైలవత్. 17

నేనొంటరిగ కేవలము ధ్యానమందే లగ్నమైనట్టి చిత్తముగలవాఁడనై సరస్వతీనిలయ మగు ఈ కదంబవృక్షముక్రింద పర్వతమువలె నిశ్చలముగ నుండియున్నాను.

అథ కాలే వహత్యస్మిన్నృతుసంవత్సరాత్మని
ఇదం సర్వం వనం ఛిన్నం జనైః పర్యన్తవాసిభిః. 18

అనంతరము ఋతు, సంవత్సరాత్మకమగు కాలము క్రమముగఁ గడచిపోవ ఈ వన మంతయును సమీపవాసులచే ఛేదింపఁబడినదాయెను.

ఇదం కదమ్బమమ్లానం జనతాః పూజయన్త్యలమ్
వాగీశ్వరీగృహమితి మాం చైవైకసమాధిగమ్. 19

సరస్వతీదేవియొక్క గృహమని యెఱిఁగి జనులీ నిత్యవికాసయుక్తమగు కదంబ వృక్ష మును, కేవల సమాధితత్పరుఁడనైయున్న నన్నునుబూజించుచుందురు.

అథైనం దేశమాయాతౌ భవన్తౌ దీర్ఘతాపసౌ
ఏతత్తత్కథితం సర్వం ధ్యానదృష్టం మయాఖిలమ్. 20

ఆ పిమ్మట కొంతకాలమునకు దీర్ఘతపస్సులగు మీ రిరువురున్ను ఈ ప్రదేశమున కేతెం చితిరి. ఇట్లు ధ్యానముచే నేను గాంచినదంతయును మీకుఁ దెలియజేసితిని.

తస్మాదుత్థాయ హే సాధూ గచ్ఛతం గృహమాగతౌ
తత్ర తే భ్రాతరః సర్వే సంగతా దారబన్ధుభిః. 21

కాబట్టి, ఓ సాధువులారా! ఇచటికేతెంచిన యీ మీరిరువురును లేచి యిప్పుడు మీమీ గృహములకుఁ బొండు. అచట నీ సోదరులందఱు నీకంటె బూర్వమే భార్యాబంధ్వాదులతోఁగూడి నివసించుచున్నారు.

అష్టానాం భవతాం భవ్యం సదనే స్వే భవిష్యతి
మహాత్మనాం బ్రహ్మలోకే వసూనామివ సంగమః. 22

బ్రహ్మలోకమందు మహాత్ములఁగు అష్టవసువులయొక్క కలయికవలె అట గృహ మున మీ యెనిమిదిమంది సోదరులయొక్కయు నుత్తమమగు కలయిక సంభవింపఁగలదు.

ఇత్యుక్తే తేన స మయా పృష్టః పరమతాపసః
సందేహాదిదమాశ్చర్యమార్యాస్తద్వర్ణయామ్యహమ్. 23

ఓ (రామాది) ఆర్యులారా! మహాత్ముఁడగు ఆ తాపసుఁడిట్లు వచింప, అంత, సంశయ ముచే నపుడు నే నాతని నేమి యడిగితినో వర్ణించుచున్నాను వినుఁడు —

> ఏకైవ సప్తద్వీపాస్తి భగవన్భూరియం కిల
> తుల్యకాలం భవన్త్యష్టౌ సప్తద్వీపేశ్వరాః కథమ్. 24

మహాత్మా! సప్తద్వీపవతియగు ఈ పృథివి యొకటి మాత్రమే కలదుగదా, అపుడొకే సమయమున నెనిమిదిమంది యద్దానికి, ప్రభువు లెట్లు కాఁగలరు?

కదమ్బతాపస ఉవాచ :—

> అసమఞ్జసమేతావదేవ నో యావదుచ్యతే
> ఇదమన్యదసంబద్ధతరం సంశ్రూయతాం మమ. 25

కదంబతాపసుఁడు:— ఓ సాధూ! ఇంతమాత్రమే అసమంజసముకాదు. దీనికంటెను మిగుల అసమంజసమైనదానిని జెప్పుచున్నాను వినుము.

> ఏతేఽష్టౌ భ్రాతరస్తత్ర తాపసా దేహసంక్షయే
> సప్తద్వీపేశ్వరాః సర్వే భవిష్యన్తి గృహోదరే. 26

ఈ యెనిమిదిమంది తాపస సోదరుల దేహములు నశించినపిదప వారందఱును తమ గృహాకాశమున నేక కాలముననే సప్తద్వీపవతియగు ఈ భూమికి రాజులగుదురు.

> అష్టౌ హ్యేతే మహీపీఠేష్వేతేష్వేతేషు సద్మసు
> సప్తద్వీపేశ్వరా భూపా భవిష్యన్తీహ మే శృణు. 27

ఆ యెనమండ్రున్ను తమ తమ గృహములం దీభూమండలముపై సప్తద్వీపవతియగు ఈ భూమికి ప్రభువులు కాఁగలరు. ఈ విషయమునుగూర్చి నీవింకను వినుము —

> అస్త్యేతేషాం కిలాష్టానాం భార్యాష్టకమనిన్దితమ్
> దిగన్తరాణాం నియతం తారాష్టకమివోజ్జ్వలమ్. 28

పూర్వపశ్చిమదిశలందు నియమింపఁబడిన ప్రకాశవంతములైన యెనిమిది నక్షత్రముల (అష్టతారల)వలె, ఆ యెనిమిదిమంది సోదరులకును నుత్తమగుణవతులగు ఎనమండ్రు భార్యలుగలరు.

> తద్భార్యాష్టకమేతేషు యాతేషు తపసే చిరమ్
> బభూవ దుఃఖితం స్త్రీణాం యద్వియోగో హి దుఃసహః. 29

వారు, తమ భర్తలు చిరకాలము తపమొనర్చుటకై వెడలఁగా మిగుల దుఃఖమొందిరి. భర్తృవియోగము స్త్రీలకు దుస్సహమైనదిగదా!

> దుఃఖితాః ప్రత్యయే తేషాం చక్రుస్తా దారుణం తపః
> శతచాన్ద్రాయణాం తాసాం తుష్టాభూత్తేన పార్వతీ. 30

తమ భర్తలయొక్క స్మరణముచే మిగుల దుఃఖితలై యా స్త్రీలందఱును శతచాంద్రాయణమను కఠినతపం బొనర్చిరి దానిచే భగవతియగు పార్వతీదేవి సంతుష్టురాలయ్యెను.

అదృశ్యోవాచ సా తాసాం వచోఽన్తః పురమన్దిరే
దేవీ సపర్యావసరే ప్రత్యేకం పృథగీశ్వరీ. 81

అపుడు పూజాసమయమున అదృశ్యరూపిణియై యాదేవియగు పరమేశ్వరి అంతఃపుర మందిరమున వారి యందఱితోను వేఱువేఱుగ నీ వాక్యములఁ బలికెను—

దేవ్యువాచ:—

భర్తుర్థమథ చాత్మార్థం గృహ్యతాం బాలికే వరః
చిరం క్లిష్టాసి తపసా నిదాఘేనేవ మఞ్జరీ. 82

దేవి:— పుత్రీ! నీ భర్తకొఱకును, నీకొఱకును వరమును గ్రహింపుము. గ్రీష్మర్తువు యొక్క వేడిమిచే లతవలె, తపస్సుచే చిరకాలము నీవు క్లేశమొందియున్నావు.

ఇత్యాకర్ణ్య వచో దేవ్యా దత్తపుష్పా చిరంటికా
స్వవాసనానుసారేణ కుర్వాణై వేశ్వరీ స్తవమ్. 83

ఆనన్దమన్థరోవాచ వచనం మృదుభాషిణీ
ఆకాశసంస్థితాం దేవీం మయూరీవాభ్రమాలికామ్. 84

దేవియొక్క యా వాక్యములను విని చిరంటికయను పేరుగల మృదుభాషిణియైన భార్య భగవతియొక్క చరణములపై పుష్పాంజలినిడి స్వవాసనానుసారము దేవియొక్క స్తవమును గావించుచు, ఆనందపారవశ్యముచే గద్గదస్వరముతోడ నాకాశమందున్న యా దేవినిఁగూర్చి మయూరము (నెమలి) మేఘసమూహముతోఁ బల్కునట్లు పలికెను.

చిరంటికోవాచ:—

దేవి దేవాధిదేవేన యథా తే ప్రేమ శంభునా
భర్త్రా మమ తథా ప్రేమ స భర్తాస్తు మమామరః. 85

చిరంటిక:— దేవీ! దేవాధిదేవుఁడగు శ్రీ శంకరునియెడల నీ కేరీతి ప్రేమగలదో, ఆరీతి నా భర్తయెడల నాకుఁ బ్రేమ యుండుగాక! మఱియు నా భర్త మృత్యురహితుఁడై వెలయుగాక.

దేవ్యువాచ:—

ఆసృష్టేర్నియతేర్దార్ఢ్యాదమరత్వం న లభ్యతే
తపోదానైరతోఽన్యం త్వం వరం వరయ సువ్రతే. 86

దేవి:— సువ్రతీ! సృష్ట్యాదినుండియు ప్రవృత్తమైయున్నట్టి నియతి (ఈశ్వరాజ్ఞ) యొక్క దృఢత్వము (అనివార్యత్వము)వలన, తపోదానాదులచే మృత్యురాహిత్యపదవి లభింపఁ జాలదు. కావున మఱియొకవరమును గోరుకొనుము.

చిరంటికోవాచ:—

అలభ్యమేతన్మే దేవి తన్మద్భర్తుర్గృహాన్తరాత్
మృతస్య యా వినిర్యాతు జీవో బాహ్యమపి క్షణాత్. 87

దేహపాతశ్చ మే భర్తుర్యదా స్యాదాత్మమన్దిరే
తదేతద స్త్వితి వరో దీయతామమ్బికే మమ. 38

చిరంటిక:— దేవీ! అంబికా! అట్టి అమరపదవి లభింపనిచో, నా గృహమున నా భర్త యెపుడు మరణించునో అపుడాతని జీవుడు నా గృహాంతరమునుండి క్షణకాలమైనను బయటకుఁ బోకుండుగాక! అను నీ వరము నాకనుగ్రహింపవేడెద!

దేవ్యువాచ:—

ఏవమస్తు సుతే త్వంచ పత్యా లోకాన్తరాస్థితే
భవిష్యసి ప్రియా భార్యా దేహాన్తే నాత్ర సంశయః. 39

దేవి:— పుత్రీ! అట్లేయగుగాక! మఱియు నీ భర్త సప్తద్వీపాధిపత్యము వహించినపిమ్మట ఈ దేహాంతమున మరల నీవాతని ప్రియురాలగు భార్యయగుదువు. ఇందేమాత్రమున్ను సందియములేదు.

ఇత్యుక్త్వా విరరామాసౌ గౌర్యా గీర్గగనోదరే
మేఘమాలాధ్వనిరివ నిరవద్యానముద్యతా. 40

ఇట్లువచించి గౌరీదేవియొక్క వాణి నిర్దోషతాపూర్వకముగ జగదానందముకొఱకు ప్రవృత్తమైన మేఘసమూహముయొక్క ధ్వనివలె, ఆకాశమున శమించినదాయెను.

దేవ్యాం గతాయాం భర్తారస్తాసాం కాలేన కేనచిత్
తే కకుబ్భ్యః సమాజగ్ముః సర్వే ప్రాప్తమహావరాః. 41

దేవి వెడలినపిమ్మట కొంతకాలమునకు ఆ స్త్రీల భర్తలందఱును మహావరములను బడసినవారై యన్నిదిక్కులనుండియు గృహమునకేతెంచిరి.

అద్యాయమపి సంయాతు భార్యాయా నికటం పతిః
భ్రాతౄణాం బాన్ధవానాం చ భవత్యన్యోన్య సంగమః. 42

నేఁడీ యెనిమిదవ సోదరుఁడును తన భార్యవద్దకేగుగాక! మఱియు నచట సోదరులందరియొక్కయు, బంధువులయొక్కయు పరస్పరసమ్మేళన మగుగాక!

ఇదమన్యదథై తేషామసమఞ్జసమాకులమ్
శృణు కింవృత్తమాశ్చర్యమార్య కార్యోపరోధకమ్. 43

ఇఁక నిపుడు వీనియన్నిఁటియందును మహాఅసమంజసమైనదియు సత్కర్మఫల నిరోధకమైనదియునగు ఈ యాశ్చర్యకరమైన మఱియొక వృత్తాంతమును గూర్చి వినుము.

తపస్యతాం తప ఏతేషాం పితరౌ తౌ వధూయుతౌ
తీర్థమున్యాశ్రమశ్రేణిం ద్రష్టుం దుఃఖాన్వితౌ గతౌ. 44

ఎపుడీ సోదరులందఱును తపస్సు చేయుచుండిరో, అపుడు పుత్ర వియోగముచే మిగుల దుఃఖితులై వారి మాతాపితరులు తమవధువుల (కోడళ్ళ)తో సహా తీర్థ, మున్యాశ్రమ సమూహమును దర్శించుటకై వెడలిరి.

శరీరనైరపేక్ష్యేణ పుత్రాణాం హితకామ్యయా
గన్తుం కలాపగ్రామం తం యత్నవన్తౌ బభూవతుః. 45

శరీరముయొక్క సుఖమును లక్ష్యముచేయక పుత్రహితాభిలాషచే, ఆ మాతాపితరు లిరువురును ప్రసిద్ధమగు కలాపగ్రామను తీర్థమునకేగుటకై యత్నవంతులైరి.

తౌ ప్రయాతౌ మునిగ్రామమార్గే దదృశతుః సితమ్
పురుషం కపిలం హ్రస్వం భస్మాఙ్గం చోర్ధ్వమూర్ధజమ్. 46

ధూళీలవమనాదృత్య తం జరఠ్యాన్థశఙ్కయా
యదా తౌ జగ్మతుస్తేన స ఉవాచాన్విత క్రుధా. 47

అట్లు మునిగ్రామమునకు బోవుచు మార్గమున వారొక తెల్లనైనట్టియు, కపిల వర్ణము గల్గినట్టియు హ్రస్వాకారముతోఁ గూడినట్టియు, అవయవములకు భస్మమురాచుకొనినట్టియు ఊర్ధ్వజటాధారియైనట్టియు మనుజునిజూచి యాతఁడెవఁడో వృద్ధుఁడగు బాటసారియనియెంచి నమస్కారపూజాదులఁ గావింపక యనాదరించి, పైఁగా గమనత్వరితత్వముచే వాతనిపై నొకింతధూళి నెగురఁగొట్టుచు నెపుడుపోయిరో, అపుడయ్యపరాధమువలనఁ గృద్ధుడై యాతఁడిట్లు పలికెను

సవధూక మహామూర్ఖ తీర్థార్థీదారసంయుత
మాం దుర్వాససముల్లఙ్ఘ్య గచ్ఛస్యవిహితానతిః. 48

వధూనాం తే సుతానాం చ గచ్ఛత స్తపసార్జితాః
విపరీతా భవిష్యన్తి లబ్ధా అపి మహావరాః. 49

పత్నీ. వధూసమేతముగా తీర్థమును సేవింప నేగుచున్న యో మహామూర్ఖుఁడా! దుర్వాసుఁడనగు నాకు నమస్కరింపకనే దాటి పోవుచున్నావు. కావున నీ కోడళ్లకును, కుమారుల కును తపస్సుచే మహావరములు లభించినప్పటికిని, అవి విపరీత (దుఃఖ)ఫల మొసంగునవి యగుగాక!

ఇత్యుక్తవన్తం తం యావత్సదారోఽథ వధూయుతః
సన్మానం కురుతే తావన్మునిర న్తర్ధిమాయయౌ. 50

ఇట్లాముని వచింపవంత, పత్నీ, వధూసమేతముగ నాతఁడామునికి ప్రణామాది సన్మానమును గావించుటకై ప్రవృత్తుఁడుకాఁగా నింతలో నమ్మునివర్యుఁడంతర్ధానమయ్యెను

అథ తౌ పితరౌ తేషాం సవధూకౌ సదుఃఖితౌ
కృశీభూతౌ దీనముఖౌ నిరాశౌ గృహమాగతౌ. 51

అటుపిమ్మట వధూసమేతులగు యా మాతాపితరులిరువురును మిగుల దుఃఖితులై, కృశించినవారై, దీనముఖులై, నిరాశచెందినవారై, యాత్రనుండి మరలి గృహమునకు తిరిగి వచ్చిరి.

అతో వదామ్యహం తేషాం నైకం నామాసమఞ్జసమ్
అసమఞ్జసలక్షణే గన్థే స్ఫోటాః స్ఫుటా ఇవ. 52

కావుననే వారి వృత్తాంతమందు ఒక అసమంజసము (అసంబద్ధత్వముఁలేక(కఠినత) కాదు; కంఠముపై వాపు, ఆ వాపుపై కుఱుపులు, ఆ కుఱుపులు పగులుట — ఇట్టి అనిష్టపరంపర వలె, అట లక్షలకొలది ఆ సమంజసములైన విషయములు గలవని నేను వచించుచున్నాను.

చిదో్యమసంకల్పమహాపురేఽస్మిన్నితం విచిత్రాణ్యసమఞ్జసాని
నిఃశూన్యరూపేఽపి హి సంభవన్తి దృశ్యేయథా వ్యోమని దృశ్యజృమ్భాః. 58

ఇత్యార్షే శ్రీ వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు
నిర్వాణప్రకరణే ఉత్తరార్ధే బ్రహ్మగీతాసు తాపసోపాఖ్యానాన్తర్గత
సప్తద్వీపేశ్వరోపాఖ్యానే సప్తద్వీపేశ్వరవర్ణనం నామ
ద్వ్యశీత్యధిక శతతమః సర్గః ॥ 182 ॥

ఆ ప్రకారముగనే శూన్యరూపమైనట్టి యాకాశమున గంధర్వనగర, ధూమకేతు (తోఁక చుక్క), ఉల్కాపాతాది దృశ్యవిజృంభణములు సంభవించువిధమున చిదాకాశముయొక్క సంకల్ప రచితమగు ఈ జగద్రూపమహాపురమున అనేక విచిత్రములైన అసమంజసవిషయములు సంభవించుచున్నవి.

ఇది శ్రీవాసిష్ఠతాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున నుత్తరార్ధమున బ్రః తాపసోపాఖ్యానాంతర్గత సప్తద్వీపేశ్వరోపాఖ్యానమున సప్తద్వీపేశ్వర వర్ణనమను నూట యెనుబది రెండవ సర్గము ॥ 182 ॥

## త్ర్యశీత్యధిక శతతమః సర్గః

[విరుద్ధవరశాపానాం చతురాననవాక్యతః
మిథో జయోఽన్తః సారాణామిహ సమ్యఙ్నిరూప్యతే.

పరస్పరవిరుద్ధములైనట్టి వర, శాపములఁగూర్చి అభ్యంతరమున సారత్వముగలదియే జయించునని బ్రహ్మదేవుఁడు పలుకుట అపుడు అంతఃసారరూపములగు వరముల జయించుటయను విషయము లిచట బాగుగ నిరూపింపఁబడుచున్నవి.]

కున్దదన్త ఉవాచ:—

తతః పృష్టో మయా తత్ర స గౌర్యాశ్రమతాపసః
తాపసం శుష్కదర్భాగ్ర జరాజర్జరమూర్ధజః. 1

కుందదంతుఁడు:— ఓ రామచంద్రా! తదనంతరము, గ్రీష్మర్తుతాపముచే మిగుల శుష్కించినట్టి దర్భాగ్రములవలె వార్ధక్యముచే శిథిలీభూతములై పరస్పరము పెనవేసికొనియున్న కేశములుగల యాగౌర్యాశ్రమతాపసుని యచట నేనిట్లడిగితిని.

ఏకైవ సప్తద్వీపాస్తి వసుధా యత్ర తత్ర తే
సప్తద్వీపేశ్వరా అష్టౌ భవన్తి కథముత్తమాః. 2

మహాత్మా! ఎచట సప్తద్వీపవతియగు పృథివి యొకటియేకలదో, అచట నేకకాలము ననే యెనిమిదిమంది యుత్తములు సప్తద్వీపప్రభువు లెట్లు కాఁగలరు?

యస్య జీవస్య సదనాన్నాస్తి నిర్గమనం బహిః
స కరోతి కథం సప్తద్వీపేశత్వేన దిగ్జయమ్ 3

ఏ జీవునియొక్క గమనము గృహమునుండి వెలుపలకే సంభవింపకయున్నదో, అట్టి వాఁడు సప్తద్వీపప్రభుత్వముచే దిగ్విజయమెట్లుగావించును?

యైర్వరా వరదైర్దత్తాః శాపైస్తేతద్విరుద్ధతామ్
కథం గచ్ఛన్తి గచ్ఛన్తి కథం ఛాయా హి తాపతామ్. 4

వరదాతలచే నొసంగఁబడిన వరములు శాపములచే విరుద్ధత్వము నెట్లు పొందును? శిశిరఋతువుయొక్క శీతలచ్ఛాయలు గ్రీష్మర్తువుయొక్క ఆతపరూపత్వమెట్లు పొందును?

మిథోఽశక్యం కథం ధర్మౌ స్థితిమేకత్ర గచ్ఛతః
ఆధార ఏవాధేయత్వం కరోతి కథమాత్మని. 5

పరస్పర విరుద్ధములైనట్టి వర, శాపములయొక్క శుభత్వ, అశుభత్వధర్మము లొకే ధర్మియందెట్లు స్థితినొందగలవు. ఒకవేళ, ఆ ధర్మములకే పరస్పరాశ్రయత్వము గలదనినచో, స్వాత్మయందు ఆధారమే అధేయమెట్లు కాఁగలదు?

గౌర్యాశ్రమ తాపస ఉవాచః—

సంపశ్యసి కిమేతేషాం భో సాధో శృణ్వనన్తరమ్
అష్టమేఽస్మిన్ప్ సంప్రాప్తే తం ప్రదేశం సబాన్ధవమ్. 6
ఇతో భవన్తౌ తం దేశమాసాద్య సుఖసంస్థితౌ
స్వబన్ధుసుఖసంస్థానౌ కంచిత్కాలం భవిష్యతః. 7

గౌర్యాశ్రమతాపసుఁడుః— సాధూ! వీరియందు అసమంజసమైనది నీవేమి గాంచుచున్నావు? అనంతరము జరుగఁబోవు వృత్తాంతమునుగూర్చి వినుము. నేఁటి కెనిమిదవ దినమున మరల యిదే రోజునందు మీరిరువురును మథురానగరమును స్వబంధుసహితముగఁ జేరి సుఖముగ వసించుచు, కొంతకాలమువఱకును మీ మీ బంధువులయొక్క సుఖపూర్వకస్థితికి కారణభూతు లగుదురు.

తతస్తేఽష్టౌ మరిష్యన్తి భ్రాతరః క్రమశో గృహే
బన్ధవోఽథ కరిష్యన్తి తేషాం దేహాంస్తదగ్నిసాత్. 8

ఆ పిమ్మట, క్రమముగ, ఆ యెనిమిదిమంది సోదరులును గృహమున మరణింతురు. అపుడు బంధువులు వారి శరీరదహనాదిక్రియలఁ గావింతురు.

తేషాం తే సంవిదాకాశాః పృథక్పృథగవస్థితాః
ముహూర్తమాత్రం స్థాస్యన్తి సుషుప్తస్థా జడా ఇవ. 9

అనంతరము వారి సంవిదాకారములు (జీవులు) వేర్వేఱుగ స్థితినొందినవై ముహూర్త కాలపర్యంతము సుషుప్తియందున్నవిగను, జడములుగను నుండును.

ఏతస్మిన్నన్తరే తేషాం తాని కర్మాణి ధర్మతః
ఏకత్ర సంఘటిష్యన్తి వరశాపాత్మకాని తే. 10

ఇంతలో వారి యా వర, శాపరూపములగు కర్మలన్నియు, అవశ్య ఫలదాతృత్వ స్వభావముతోఁ వారివారి చిత్తాకాశములం దొకచోట సమావేశమగును.

కర్మాణి తాన్యధిష్ఠాతృదేవరూపాణి పేటకమ్
వరశాపశరీరాణి కరిష్యన్తి పృథక్ పృథక్. 11

ఆ కర్మములు ఆయాఫలముల నొసంగు అధిష్ఠానదేవరూపములై, తమతమకనుకూలములైన (వర, శాపరూప) సమూహములను వేఱుచేయును. అట్లు సంపుటీభూతములైన వరములున్ను, శాపములున్ను వేఱ్వేఱు శరీరములను రచించును.

వరాస్తేఽత్ర గమిష్యన్తి సుభగాః పద్మపాణయః
బ్రహ్మదణ్డాయుధాశ్చన్ద్ర ధవలాఙ్గాశ్చతుర్భుజాః. 12

అందు వరములు ఉత్తమ సౌభాగ్యశీలురై, హస్తమందు కమలమును ధరించి బ్రహ్మదండాద్యాయుధములఁ గైకొని, చంద్రునివలె అతిశుభ్రములైనట్టి అవయవములుఁగల్గి విష్ణురూపధారులై యటు కేతెంచును.

శాపాస్తత్ర భవిష్యన్తి త్రినేత్రాః శూలపాణయః
భీషణాః కృష్ణమేఘాభా ద్విభుజా భ్రుకుటీముఖాః. 13

శాపములో త్రినేత్రులై, హస్తమందు శూలమును ధరించి,భయంకరాకారధారులై, నల్లని మేఘములనుబోలిన భుజద్వయముగల్గి, క్రోధముఖులై యటకు విచ్చేయును.

వరా వదిష్యన్తి :—

సుదూరం గమ్యతాం శాపాః కాలోఽస్మాకముపాగతః
ఋతూనామివ తన్నామ కః సమర్థోఽతివర్తితుమ్. 14

అపుడు వరములు యిట్లు పలుకును, ఓ శాపములారా ! మీ రిటనుండి దూరముగఁబొండు. వసంతాది ఋతువులవలె నిపుడు మాకాలమేతెంచినది. దానిని నివర్తించుట కెవరు సమర్థుఁడగును?

శాపా వదిష్యన్తి:—

గమ్యతాం హే వరా దూరం కాలోఽస్మాకముపాగతః
ఋతునామివ తన్నామ కః సమర్థోఽతివర్తితుమ్. 15

శాపములు:— ఓ వరములారా ! మీ రిటనుండి దూరముగఁబొండు. వసంతాది ఋతువులవలె నిపుడు మాకాలమేతెంచినది. దానిని నివర్తించుట కెవఁడు సమర్థుఁడగును ?

వరా వదిష్యన్తి :—

కృతా భవన్తో మునినా వయం దినకృతా కృతాః
మునీనాం బాధికో దేవో భగవన్తం పురా యతః. 16

వరములు:— ఓ శాపములారా! మీరు దుర్వాసమునిచేఁ గావింపఁబడినవారు మేమో, సూర్యభగవానునిచేఁ గావింపఁబడినవారము. బ్రహ్మదేవుఁడు భగవంతుఁడగు సూర్యుని మునుల కంటెఁ బూర్వము సృజించెను. గావున మునులకంటె సూర్యదేవుఁడధికుఁడు.

ప్రవదత్సు వరేష్వేవం శాపాః క్రుద్ధధియో వరాన్
వివస్వతా కృతా యూయం వయం రుద్రాంశతః కృతాః. 17
దేవానామధికో రుద్రో రుద్రాంశప్రభవో మునిః
ఇత్యుక్త్వా ప్రోద్యతా తేషాం చక్రుః శృఙ్గాణ్యగా ఇవ. 18

ఈప్రకారముగ వరములు వచించుచుండ నంత శాపములు క్రుద్ధచిత్తులై వరములగూర్చి యిట్లు పలుకును — 'ఓ వరములారా! మీరు సూర్యునిచే నిర్మింపఁబడినవారు; మేము రుద్రభగవానుని అంశభూతుఁడగు దుర్వాసునిచే నిర్మింపఁబడినవారము. దేవులందఱిలోను రుద్రుఁడధికుఁడు; దుర్వాసమునియో యట్టి రుద్రుని అంశమందు జనించినవాఁడు' ఇట్లు వచించి యా శాపములు క్రుద్ధులై పర్వతములు తమ శిఖరముల నెత్తునట్లు, వరములపైకిఁ దమ త్రిశూలముల యొక్క యగ్రభాగముల నెత్తును.

శాపేషూద్యతశృఙ్గేషు వరా ఇదమరాతిషు
విహసన్తః ప్రవక్ష్యన్తి ప్రమేయాకృతనిశ్చయమ్. 19

ఎపుడు శాపములు త్రిశూలముల నెత్తునో, అపుడు వరములు నవ్వుచు తమ నిశ్చయార్థమును శత్రువులకిట్లు తెలుపును —

హే శాపాః పాపతాం త్యక్త్వా కార్యస్యాన్తో విచార్యతామ్
యత్కార్యం కలహస్యాన్తే తదేవాదౌ విచార్యతామ్. 20
పితామహపురీం గత్వా కలహాన్తే వినిర్ణయః
కర్తవ్యోఽస్మాభిరేతత్కిమాదౌ నేహ విధీయతే. 21

ఓ శాపములారా! మీరు మీ పాపరూపమగు అనుచితకారిత్వమును వదలి కార్యముల యొక్క అంతమునుగూర్చి విచారింపుఁడు. ఏలయనిన, కలహముయొక్క చివఱ యేది కర్తవ్యమై యున్నదోదానిని మొదటనే విచారింపవలయును. కలహముయొక్క చివఱ బ్రహ్మదేవుని నగరమునకేగి మనము మన నిర్ణయమును గావింపవలసియున్నది. అట్టిచో దానిని మొదటనే యిచట నేల చేయరాదు?

శాపైర్వరోక్తమాకర్ణ్య బాఢమిత్యురరీకృతమ్
కో న గృహ్ణాతి మూఢోఽపి వాక్యం యుక్తిసమన్వితమ్. 22

వరముల యా వాక్యములను విని శాపములు 'చాల మంచిది' అనిచెప్పి వాని నంగీకరించెను మూఢుడైనను యుక్తి యుక్తమగు వాక్యమును గ్రహింపనివాఁడెవడుండును?

తతః శాపా వరైః సార్ధం యాస్యన్తి బ్రహ్మణః పురమ్
మహానుభావా హి గతిః సదా సందేహనాశనే. 23

అటుపిమ్మట వరములతోసహాశాపములు బ్రహ్మదేవుని నగరమునకేగును. ఏలయనినఁ సందేహవినాశముకొఱకు మహానుభావులే సదా శరణ్యులైయున్నారు.

ప్రణామపూర్వం తత్సర్వం యథావృత్తం పరస్పరమ్
బ్రహ్మణే కథయిష్యన్తి శ్రుత్వా తేషాం స వక్ష్యతి. 24

అట్లు బ్రహ్మదేవునివద్దకేగి యవి ప్రణామపూర్వకముగ తమ పరస్పర యథార్థ వృత్తాంతమంతయును నాతనికిఁ దెలియఁజేయును. అదివిని బ్రహ్మదేవుఁడు వారితో నిట్లనును—

బ్రహ్మోవాచః—

వరశాపాధిపా భోభో యతః సారా జయన్తి తే
కేఽన్తః సారా ఇతి మిథో నూనమన్విష్యతాం స్వయమ్. 25

బ్రహ్మదేవుఁడు:— ఓ వర, శాపాధిపతులారా! మీయందెవరు లోన సారత్వము (దృఢత్వము) గలవారో, వారే జయింతురు. కావున నట్లు లోన సారత్వముగలవారెవరో మీలో మీరు స్వయముగ పరస్పరము నిక్కవముగ నాలోచించుకొనుఁడు.

ఇతి శ్రుత్వా ప్రవిష్టాస్తే సారతాం సమవేక్షితుమ్
వరాణాం హృదయం శాపాః శాపానాం హృదయం వరాః. 26

అదివిని సారత్వమును గాంచుటకొఱకై వరముల హృదయమందు శాపములును, శాపముల హృదయమందు వరములును నపుడు ప్రవేశించెను (ఒకదానినిగూర్చి మఱియొకటి పర్యాలోచించెనని భావము.)

తే పరస్పరమన్విష్య స్వయం హృదయసారతామ్
జ్ఞాత్వా చ సమవాయేన ప్రవక్ష్యన్తి పితామహమ్. 27

అట్లవి పరస్పరమన్వేషించుకొనినవై యొకదాని సారత్వమును మఱియొకటి స్వయముగ నెఱిఁగి యేకాభిప్రాయముగలవై తుదకు బ్రహ్మదేవునితో నిట్లనును —

శాపా వక్ష్యన్తిః—

జితాః ప్రజానాథ వయం నాన్తఃసారా వయం యతః
అన్తఃసారా వరా ఏవ వజ్రస్తమ్భా ఇవాచలాః. 28

శాపములు:— ప్రజానాథా! మేమోడితిమి; ఏలయనిన, మేము లోన సారత్వముగలవారముకాము. ఈ వరములే వజ్రస్తంభములవలెను, లేక పర్వతములవలెను లోన సారత్వము (దృఢత్వము) గలవై యున్నవి,

వయం కిలేమే భగవన్వరాః శాపాశ్చ సర్వదా
నను సంవిన్మయా ఏవ దేహోఽన్యోఽస్మాకమస్తి నో. 29

మహాత్మా! ఈ వర, శాపములగు మేము నిశ్చయముగ సదా సంవిన్మయ రూపులమైయున్నాము. సంవిత్తు (చైతన్యము)కంటె వేఱైనట్టి స్వరూపము మాకులేదు.

వరదస్య హి యా సంవిద్వరో దత్త ఇతి స్థితా
నైవార్థిని మయా లబ్ధో వరోఽయమితి తిష్ఠతి. 30

వరమొసంగువానియొక్కయే సంవిత్తు 'నేను వరమొసంగితిని' అను ఈ రూపముతోఁ నుండునో అదియే వరముగైకొని వానియందు 'నేను వరమును గైకొంటిని' అను ఈ రూపముతోఁ నుండును.

నిజ్ఞప్తిమాత్రకచనం దేహం సైవ ఫలం తతః
పశ్యత్యనుభవత్యత్తి దేశకాలశతభ్రమైః. 31

ఆ విజ్ఞానమాత్రమగు (వరరూప) సంవిత్తుయొక్క స్ఫురణమే సుఖభోగస్థానమైన శరీరమను ఫలరూపమైయున్నది. పిమ్మట ఆ సంవిత్తే దేహాకారముగనయి దేశకాలాద్యనేక కల్పనా భ్రమలచే ఆయాభోగ్య పదార్థములను గాంచుచు, అనుభవించుచు, భుజించుచు నున్నది.

వరదాత్మా గృహీతత్వాచ్చిత్కాలాన్తర సంభృతా
యదా తదాన్తఃసారాసౌ దుర్జయా న తు శావకా. 32

శాస్త్రీయ తపఃకాలిక దృఢసంకల్పముచే వశీభూతమైనట్టి వరమొసంగువాని సంవిదాత్మచే గ్రహింపఁబడుటవలన వరకల్పనారూప చైతన్యము కాలాంతరమున ఫలావస్థయందు బాగుగ పరిపుష్టమగుచున్నది. కావున నది లోన సారత్వముగలది యగుటచే దుర్జయమై యలరుచున్నది. శాపసంవిత్తుకాదు.

వరప్రదానం వరదైర్వరదానాం వరార్థిభిః
యదా సుచిరమభ్యస్తం వరాణాం సారతా తదా. 33

వరమునొసంగువారును, గ్రహించువారు (అర్థిజనులు)ను వరదానమును చిరకాలమభ్యసించుటవలన వరములందు సారత్వ (దృఢత్వ) మేర్పడుచున్నది.

యదేవ సుచిరం సంవిదభ్యేష్యతి తదేవ సా
సారమేవాశు భవతి భవత్యాశు చ తన్మయీ. 34

ఏ సంవిత్తు చిరకాలము బాగుగ నభ్యసింపఁబడుచున్నదో, అదియే శీఘ్రముగ దృఢత్వమునొందినదై, ఫలాదులందు తన్మయమగుచున్నది.

శుద్ధానామతిశుద్ధైవ సంవిజ్జయతి సంవిదామ్
అశుద్ధానాం త్వశుద్ధైవ కాలాత్సామ్యం న విద్యతే. 35

శుద్ధసంవిత్తులందేది అధిక శుద్ధమైయుండునో, అదియే తక్కినవానికంటె అధిక ప్రబలమైయుండును. కావున నదియే జయించును. అట్లే అశుద్ధసంవిత్తులందేది అధిక ప్రబలమై యుండునో, అదియే కాలక్రమమునఁ దక్కినవానిని జయించును. కాఁబట్టి సంవిత్తుల భేదమువలన ఫలమందునుసామ్యత్వముండదు

[illegible]ణాం శేనాపి యో జ్యేష్ఠో న్యాయస్తేనావపూర్యతే
నార్థే న్యాయాన్తరం కించిత్కర్తుముత్సహతే మధమ్. 36

మఱియు కాలదృష్టితోడను నేది శ్రేష్ఠమైయుండునో, అదియే (అధికదృఢత్వకారణమున) తక్కినవానిని జయించుననుట న్యాయము. కావున, మఱియొకయుపాయ మెద్దియును శాప ప్రాబల్యమును గావించుట కుత్సహింపదు.

సమేనోభయకోటిస్థం మిశ్రం వస్తు భవేత్ప్రమమ్
వరశాపవిలాసేన క్షీరమిశ్రం యథా పయః. 37

ఎచట శుభ, అశుభములను ఉభయవర్గములకు జెందినట్టి విరుద్ధకర్మలందు, లేక వర, శాపములందు, ప్రమాణ, అభ్యాసాదిరూప సామ్యత్వముండునో, అచట నీరక్షీరమువలె, ఉభయ మిశ్రమఫలమే సంభవించును.

సమాభ్యాం వరశాపాభ్యామథవా ద్విద్విరూపకామ్
స్వయమేవానుభవతి స్వప్నేష్వివ పురాత్మికా. 38

స్వప్నములందు నగరరూపధారియగు ఒకేచైతన్యము నగరవాసులగు జనుల భేదముచే విభాగమును బొందినదానివలె నగునట్లు, ఎచట నేకకాలముననే భిన్నదేశభోగ్యములగు సమాన వరశాపములుండునో, అచట (విపశ్చిదుపాఖ్యానమందుఁ దెలుపఁబడిన న్యాయముచే) ఉపాధి యొక్క విభాగమువలన నొకే జీవచైతన్యము, ఏకకాలముననే దేహభేదముతోఁ రెండురూపములను బొందుచున్నది.

శిక్షితం త్వత్త ఏవేతి యత్తదేవ తవ ప్రభో
పునః ప్రతీపం పఠితం శీఘ్రం యామో నమోస్తు తే. 39

ప్రభూ! తమవలన ఏమినేర్చుకొంటిమో దానినే మరల తమయెదుటఁ బఠించితిమి. గావున నట్టి మాదుష్టత్వరూపమగు అపరాధమును క్షమింపుఁడు. నమస్కారము. మేమందఱము నిపుడు శీఘ్రముగ వెడలుచున్నాము.

ఇత్యుక్త్వా స స్వయం శాపః క్వాపి శాపగణో యయౌ
ప్రశాన్తే తిమిరే దృష్టే ర్వ్యోమ్ని కేశోణ్డ్రుకం యథా. 40

ఈప్రకారముగఁ బల్కినదై యా శాపసమూహము లజ్జచేతన్ను తానే శపించుకొనుచు దృష్టియొక్క తిమిరరోగము నశింపనాకసమున కేశాదులెచటికో పోవునట్లు ఎచటికో వెడలిపోయెను.

అథాన్యో వరపూగోఽత్రా గృహానిర్గమరోధకః
స్థానిస్థానమివాదేశః సమానార్థోఽభ్యపూరయత్. 41

అటుపిమ్మట సప్తద్వీపాధిపత్యమునకు విరుద్ధములును, గృహమునుండి యామృత జీవుల నిర్గమనమును నిరోధించునట్టిదియునగు గౌరీదత్తవరసమూహము - వైయాకరణ ప్రక్రియ యందలి 'ఆదేశము' (వ్యాకరణమందు ఒకటిని బోఁగొట్టివచ్చు మఱియొకవర్ణము) స్థానియొక్క స్థానమును పూరించునట్లు సూర్యవరములతో వివాదమొనర్చుటకై శాపస్థానమును బూరించెను.

శాపస్థానకా వదిష్యన్తి :—

సప్తద్వీపేశజీవానాం నిర్యాణం శవసద్మనః
దేవేశ విద్మో న వయమన్ధకూపాదివామ్భసామ్. 42

శాపస్థానమునఁ బ్రవేశించిన (పత్నీ) వరములపుడు బ్రహ్మదేవునిగూర్చి యిట్లుపలుకును.
ఓ దేవేశ్వరా ! భావికాలమున సప్తద్వీపప్రభువులుకానున్న యీ జీవులయొక్క శవగృహమునుండి బాహ్యప్రదేశమునకగు నిర్గమనము - శూన్యకూపమునుండి జలముయొక్క నిర్గమనమునువలె మేమెఱుగము ('మాచే నిరోధింపఁబడుటవలన అని భావము')

సప్తద్వీపేశ్వరానేతానిమే ద్వీపేషు సద్మను
కారయన్తి వరా వర్యా పీరా దిగ్విజయాం రణే. 43

మహాత్మా ! సూర్యదత్తములగు ఈ యుత్తమ, వీరవరములు సప్తద్వీపములను గృహములందీజీవులను సప్తద్వీపేశ్వరులుగను, యుద్ధమందు దిగ్విజయయుక్తులుగను గావింపఁజూచుచున్నవి. కాని మేమాజీవులను గృహమునుండి బయటకు వెడలకుండ నిరోధించుచున్నాము.

తదేవమనివార్యేఽస్మిన్విరోధే విబుధేశ్వర
యదనుష్ఠేయమస్మాభిస్తదాదిశ శివాయ నః. 44

కావున, ఓ దేవేశ్వరా ! అనివార్యమగు ఈ విరోధమున మా యొక్క శ్రేయము కొఱకై యేది మాచేఁజేయఁదగియున్నదో, దాని నాజ్ఞాపింపవేడెద.

బ్రహ్మోవాచ :—

సప్తద్వీపేశ్వరవరా గృహరోధవరాశ్చ హే
కామః సంపన్న ఏవేహ భవతాం భవతామపి. 45

బ్రహ్మదేవుఁడు :— ఓ సప్తద్వీపేశ్వరత్వము నొసంగువరములారా ! మఱియు, ఓ గృహమునుండి బహిర్గమనమును నిరోధించు వరములారా ! మీ మీ కోరికలిచట సిద్ధించియేయున్నవి.

వ్రజతై తదపేక్షత్వం యావన్నేష్టావపిక్షణాత్
చిరం చిరాయ సదనే సప్తద్వీపేశ్వరాః స్థితాః. 46

మీరు పరస్పరము అపేక్షత్వమును బొందుఁడు. ఏలయనిన, మీయొక్క చిరకాలపు అవిష్ట (పరస్పరేచ్ఛా విరోధ) మందును, ఆ యెనిమిదిమంది సోదరులు మరణకాలపు ఉత్తరక్షణముననే చిరకాలమునుండియు తమ గృహములందే సప్తద్వీపేశ్వరులై యున్నారు.

సమనన్తరమేవైతే దేహపాతాత్స్వసద్మను
సప్తద్వీపేశ్వరాః సర్వే సంపన్నాః పరమం వరాః. 47

మహా వరములను బొందిన యాసోదరులందఱున్ను దేహపతనము యొక్క సమకాలమునుండియే తమగృహములందు సప్తద్వీపేశ్వరులై వెలయుచున్నారు.

సర్వే వరా వదిష్యన్తి :—

కుతోభూమణ్డలాన్యష్టాస ప్తద్వీపాని భూతయః
ఏకమేవేహ భూపీఠం శ్రుతం దృష్టం చ నేతరత్. 48

అపుడన్ని వరములును గలిసి యిట్లుచెప్పెను:— మహాత్మా! ఎనిమిది భూమండలములున్ను, వాని అయా సప్తద్వీపములున్ను, వివిధైశ్వర్యములున్ను నెచట? ఒకే భూమండలమునుగూర్చియే మేము వినియుంటిమి, చూచియుంటిమేగాని మఱియొకటికాదు.

కథం చైతాని తిష్ఠన్తి కస్మింశ్చిద్గృహకోశకే
పద్మాక్షకోశకే సూక్ష్మే కథం భాన్తి మతంగజాః. 49

మఱియు, ఓ దేవా! ఒకానొక గృహ కేశమం దీ సప్తద్వీపాదులెట్లు స్థితినొందియున్నవి? ఏలయనిన, కమల బీజకోశమందు అనేక యేనుగులెట్లు పట్టఁగలవు?

బ్రహ్మోవాచ:—

యుక్తం యుష్మాభిరస్మాభిః సర్వం వ్యోమాత్మకం జగత్
స్థితం చిత్పరమాణ్వన్తరన్తః స్వప్నేఽనుభూయతే. 50

బ్రహ్మదేవుఁడు:— ఓ వరములారా! మీతోను, మాతోను, గూడియున్నట్టి (వ్యష్టి సమష్టి సహితమగు) యీ సమస్తజగత్తున్ను చిదాకాశరూపమే యైయున్నది. ఇదియంతయు చైతన్య పరమాణువునందు స్థితినొందియున్నదై స్వప్నమువలె నర్దానియందనుభూత మగుచున్నది.

మాతియత్పరమస్యాణో రన్తస్థ స్వగృహోదరే
స్ఫురితం తత్కిమాశ్చర్యం కః స్మయః ప్రకృతేః క్రమే. 51

ఎపుడట్టి చైతన్య పరమాణువునందు అనేక బ్రహ్మాండములు పట్టుచున్నవో, అపుఁడిక అ చైతన్య పరమాణువు లోపల వర్తించుచున్న స్వగృహోదరమున సప్తద్వీపాదులు స్ఫురించుచున్నవను ఈ ప్రస్తుతక్రమమందేమి యాశ్చర్యముగలదు?

మృతేరనన్తరం భాతి యథాస్థితమిదం జగత్
శూన్యాత్మైవ ఘనాకారం తస్మిన్నేవ క్షణేదితః. 52

వారి మరణానంతరము ఆ క్షణముననే సచ్చిదానంద ఘనాకారమై, పదార్థశూన్యమైనట్టి చైతన్యమే యథారీతి స్థితిగల్గియున్న యీ జగత్తుగ వారికి భాసింపఁదొడగెను.

అణావపి జగన్భాతి యత్ర తత్ర గృహోదరే
సప్తద్వీపా వసుమతీ కచన్తీతి కిమద్భుతమ్. 53

ఎపుడొక అణువునందును బ్రహ్మాండము పట్టుచున్నదో, అపుడిఁక గృహోదరమున సప్తద్వీపవతియగు పృథివి స్ఫురించుచుండుటలో నేమి యాశ్చర్యముగలదు?

యద్భాతీదం చ చిత్తత్త్వం జగత్త్వం న జగత్క్వచిత్
చిన్మాత్రమేవ తద్భాతి శూన్యత్వేన యథామ్బరమ్. 54

ఈ జగత్తెయ్యది భాసించుచున్నదో, అది చైతన్యతత్త్వమే యైయున్నది. కాఁబట్టి వాస్తవముగ (గృహమందు పట్టఁజాలనట్లుగ) ఈ జగత్తెచటను మూర్తముగలేదు. ఆకాశము శూన్యరూపముగ భాసించునట్లు, చిన్మాత్రమే యిట్లు జగద్రూపముగ భాసించుచున్నది.

ఇతి తే బ్రహ్మణా ప్రోక్తావరదేన వరాస్తతః
తానాధిభౌతిక భ్రాన్తి మయాన్సం త్యజ్యదేహకాన్. 55

ప్రణమ్యాజం సమం జగ్మురాతివాహిక దేహినః
సప్తద్వీపే చ దేవానాం గృహకోశాన్కచజ్జనాన్. 56

ఈప్రకారముగ వరదుఁడగు బ్రహ్మదేవుఁడు వచింప అపుడావరములు 'అధిభౌతిక' భ్రాంతిమయములైన తమ దేహములను తత్త్వవిచారణచేఁ ద్యజించివైచి సూక్ష్మశరీరధారులై బ్రహ్మదేవునకు బ్రణమిల్లి విరోధరహితముగ ఆయా సోదరుల మనఃకల్పితములగు సప్తద్వీపములందాయా దేవుల గృహములకు వెడలుదురు.

యావత్తే తత్ర సంపన్నాః సప్తద్వీపాధినాయకాః
అష్టావపీష్టాపుష్టానాం దినాష్టకమహీభుజామ్. 57

ఆ యెనిమిదిమంది సోదరులును నట గృహమందు యజ్ఞాది సత్కర్మలచే పరిపుష్టులైనట్టి స్వాయంభువమనువుల కులమందు జన్మించి అష్టజగద్భేదముతో బ్రహ్మదేవుని యెనిమిది దినములందు సప్తద్వీపాధిపతులై వెలయుచుందురు.

తే పరస్పరమజ్ఞాతా అజ్ఞాశ్చాన్యోన్యబాన్ధవః
అన్యోన్యభూమణ్డలగా అన్యోన్యాభిమతే హితాః. 58

వారు తమసప్తద్వీపేశ్వరత్వ విషయమున పరస్పరము తెలియఁబడక యున్నవారై, తత్త్వజ్ఞానశూన్యులై, అన్యోన్య బంధువులై, అన్యోన్య భూమండల చారులై, అన్యోన్యహిత తత్పరులై వర్తించుచుందురు.

తేషాం కశ్చిద్గృహస్యాన్తరేవ తారుణ్యసున్దరః
ఉజ్జయిన్యాం మహాపుర్యాం రాజధాన్యాం సుఖే స్థితః. 59
శాకద్వీపాస్పదః కశ్చిన్నాగలోకజిగీషయా
విచరత్యబ్ధిజఠరే సర్వదిగ్విజయోద్యతః. 60
కుశద్వీపరాజధాన్యాం నిరాధిః సకలప్రజాః
కృతదిగ్విజయః కశ్చిత్సుప్తః కాన్తావలమ్బితః. 61
శాల్మలిద్వీపశైలేన్ద్రశిరఃపూర్యాః సరోవరే
జలలీలారతః కశ్చిత్సహవిద్యాధరీగణైః. 62
క్రౌఞ్చద్వీపే హేమపురే సప్తద్వీపవివర్ధితే
ప్రవృత్తో వాజిమేధేన కశ్చిద్యష్టుం దినాష్టకమ్. 63
ఉద్యతః శాల్మలిద్వీపే కశ్చిద్ద్వీపాన్తచారిణా
యోద్ధుముద్ధృతదిగ్దన్తి దన్తాకృష్టకులాచలః. 64
గోమేదద్వీపకః కశ్చిత్పుష్కరద్వీపరాట్ సుతామ్
సమానేతుం వశాద్యాతి కషత్వేనోఽష్టమోఽభవత్. 65

పుష్కరః ద్వీపకః కశ్చిల్లోకాలోకాద్రిభూభుజః
దూతేన సహ నిర్యాతో ధనభూమిదిదృక్షయా. 66

అందొకసోదరుఁడు ఆ గృహమందే యౌవనావస్థచే సుందరుఁడై యొప్పుచు రాజధాని యగు ఉజ్జయినీ మహాపట్టణమున సుఖముగ నున్నాఁడు. మఱియొకఁడు శాకద్వీపనివాసియై నాగలోకమును జయింపఁగోర్కెచే సర్వదిక్కులయొక్క విజయమున యత్నశీలుఁడై సముద్ర గర్భమున సంచరించుచున్నాఁడు. ఇంకొకఁడు కుశద్వీప రాజధానియందు మనోవ్యధారహితుఁడై సుఖముగనున్న సమస్త ప్రజలతోఁ గూడియున్నవాఁడై, దిగ్విజయముగావించి పత్నిచే కౌగలింపఁ బడి సుఖముగ నిదురించుచున్నాఁడు. మఱియొకఁడు శాల్మలిద్వీప మహాపర్వత శిఖరమందలి నగరముయొక్క సరోవరమున విద్యాధర స్త్రీలతోఁగూడ జలక్రీడాతత్పరుఁడై యున్నాఁడు. అందొకఁడు సప్తద్వీపములనుండియు గొనిరాబడిన మహాసంపదలచే వృద్ధినొందింపఁబడినట్టి క్రౌంచద్వీప మందలి హేమపురమున ఎనిమిది దినములు అశ్వమేధయాగము గావించుటకు ప్రవృత్తుఁడైయున్నాఁడు. వేఱొకఁడు, పెల్లగింపఁబడిన దిగ్గజములయొక్క దంతములచే కుల పర్వతముల నాకర్షించుచు నొకానొక ద్వీపాంతరచారియైన రాజుతో యుద్ధమొనర్పుటకుఁ బ్రయత్న శీలుఁడైయున్నాఁడు. ఎనిమిదవవాఁడగు సోదరుడు గోమేదద్వీప నివాసియై, శత్రుదేశములను బాధింప సమర్థమగు సైన్యముతోఁ గూడియుండి కామవశముచే పుష్కరద్వీప రాజుయొక్క కొమరితను ఆ రాజుతోటి యుద్ధమొనర్చి తీసికొనివచ్చుటకై పోవుచున్నాడు. అందు మఱియొక సోద రుఁడు పుష్కరద్వీపమున వసించుచు లోకాలోక పర్వతప్రదేశపు రాజుయొక్క దూతతోటి, భూమియందలి ధనమునుగాంచ నిచ్ఛచేఁ బోవుచున్నాఁడు.

ప్రత్యేకమిత్థమేతేషాం ద్వీపద్వీపాధినాథతామ్
కుర్వతాం స్వగృహాకాశే దృష్ట్వా స్వప్రతిభోచితామ్. 67
త్యక్తాభిమానికాకారా ద్వివిధాస్తే వరాస్తతః
తత్పంవిద్భిర్గృహేష్వన్తరేకతాం ఖాని ఖైరివ. 68

ఈప్రకారముగ వారిలో ప్రతిసోదరునిగూడ తన గృహాకాశమున, తనబుద్ధికి యోగ్య మైనట్టి సప్తద్వీప ప్రభుత్వమును జేయుచుండుటఁ జూచి యా ద్వివిధ వరములున్ను నప్పుడు తమ సూక్ష్మదేహాకారమునుగూడ త్యజించి ఆకాశము, ఔపాధికాకాశములతో ఏకత్వమొందునట్లు — ఆ గృహములందు వారియందరియొక్క జీవసంవిత్తులతో ఏకత్వమొందును.

యాస్యన్తి తే భవిష్యన్తి సంప్రాప్తాభిమతాశ్చిరమ్
సప్తద్వీపేశ్వరాస్తుష్టా నన్వష్టావపి తుష్టిమత్. 69

ఇట్లు ఆ యెనిమిదిమంది సోదరులును తమ తమ అభిమతములను బొందినవారై, సంతుష్టులై సప్తద్వీపేశ్వరులై చిరకాలము వెలయగలరు

ఇత్యేతే ప్రవికసితోదితక్రియార్థాః ప్రాప్స్యన్తి ప్రవితతబుద్ధయస్తపోభిః
అన్తర్యత్స్ఫురతి విదస్తదేవ బాహ్యేనాన్తం కైస్తదుచితకర్మభిః కిలేతి. 70

ఇత్యార్షే శ్రీవాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే ఉత్తరార్ధే బ్రహ్మగీతాసు తాపసద్వీపసప్తకాష్టకవర్ణనం నామ త్ర్యశీత్యధికశతతమః సర్గః ॥ 183 ॥

ఈప్రకారముగ, తపస్సులద్వారా బాగుగ వికసించినట్టి వరరూపములగు క్రియాసాధక పదార్థములుగల విశాలబుద్ధులగు ఆ యెనమండ్రు సోదరులును సప్తద్వీపాధిపత్యమును బడయుదురు. ఏలయనిన, సాక్షిచైతన్యముయొక్క ఆభ్యంతరమున దృఢనిశ్చయరూపముగ నేది స్ఫురించునో, అద్దానినే బాహ్యమున తదుచితములైన తపోజపాది కర్మములచే నెవఁడు పొందక యుండును.

ఇది శ్రీవాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున నుత్తరార్ధమున బ్ర తాపసద్వీపసప్తకాష్టకవర్ణనమను నూటయెనుబదిమూడవ సర్గము ॥183॥



## చతురశీత్యధికశతతమః సర్గః

[ గృహస్యాన్తర్జగన్త్యష్టౌ సంభవన్త్యపి కోటిశః
యతోఽప్రబుద్ధ చిన్మాత్రం తథా భాతీతి వర్ణ్యతే.

గృహమందెనిమిది జగత్తు వేల, కోట్లకొలది జగత్తులు సంభవమగును. ఏలయనగా, అజ్ఞాతమగు చిన్మాత్రమే యట్లు జగద్రూపములుగ భాసించును — అను నివ్విషయ మిచట వర్ణింపఁబడుచున్నది. ]

**కున్దదన్త ఉవాచ :—**

ఇత్యుక్తవానసౌ పృష్టఃకదమ్బతలతాపసః
సప్తద్వీపా భువోఽష్టౌ తాః కథం భాతా గృహేష్వితి. 1

కుందదంతుఁడు:— ఓ రామాది సభ్యులారా! ఆ కదంబవృక్షము క్రిందనున్న తాపసుఁ డిట్లువచింప, అంత నేనాతని నిట్లు ప్రశ్నించితిని — మహాత్మా! ఒక్కొక్కటి యేబదికోట్ల యోజనముల విస్తీర్ణముగల సప్తద్వీపవంతములైన యెనిమిదిభూములు, అల్పావకాశయుక్తములగు గృహములందెట్లు భాసింపఁగలవు?

**కదమ్బతాపస ఉవాచ :—**

చిద్ధాతురీదృగేవాయం యదేషవ్యోమరూప్యపి
సర్వగో యత్ర యత్రాస్తే తత్ర తత్రాత్మని స్వయమ్. 2
ఆత్మానమిత్థం త్రైలోక్యరూపేణాన్యేన వా నిజమ్
పరిపశ్యతి రూపం స్వమత్యజన్నేవఖాత్మకమ్. 3

కదంబతాపసుఁడు:—ఓ సాధూ! సర్వవ్యాపకమగు ఈ చైతన్యవస్తువు, ప్రపంచశూన్యమై నప్పటికిని తానెచటెచట నుండునో, ఆచటచట స్వయముగ తనయందు తన్ను త్రైలోక్యరూపముగ

గాని, సుషుప్త, తురీయరూపముగఁగాని, తన పరమార్థరూపమునుత్యజింపకయే గాంచుచుండును. అట్లు గాంచుట దాని స్వభావమేయైయున్నది.

**కున్దదన్త ఉవాచ :—**

ఏకస్మిన్విమలే శాన్తే శివే పరమకారణే
కథం స్వభావసంసిద్ధా నానాతా వాస్తవీ స్థితాం. 4

కుందదంతుఁడు :— మహాత్మా! ఏకమై, నిర్మలమై, శాంతమై, మంగళకరమైన పరమకారణమైనట్టి పరబ్రహ్మమందు తద్విరుద్ధస్వభావసిద్ధమగు వాస్తవమైన నానారూపత్వము ఎట్లు స్థితిగల్గియున్నది?

**కదమ్బతాపస ఉవాచ :—**

సర్వం శాన్తం చిదాకాశం నానాస్తీహ న కించన
దృశ్యమానమపి స్ఫారమావర్తాత్మా యథామ్బసి. 5

కదంబతాపసుఁడు - ఓ సాధూ! ఈ నానారూపత్వము వాస్తవముకాదు. భ్రాంతికృతమేయగును. సమస్తమున్ను శాంతమగు చిదాకారమేయైయున్నది. ఈ దృశ్యజగత్తు విశాలముగఁ గన్పట్టినను, జలమందు ఆవర్తరూపము వాస్తవముగ లేనట్లు, ఇచట నానాత్వమొకింతైనను లేదు.

అసత్స్వేషు పదార్థేషు పదార్థా ఇతి భాన్తియత్
చిత్తం స్వప్నసుషుప్తాత్మ తత్తస్యాచ్ఛం నిజం వపుః. 6

అసత్యములైనను సత్యములవలె భాసించు ఏయీ పదార్థములు గలవో, అవి స్వప్న సుషుప్తులవలె విస్మరింపఁబడినట్టి చిదాకాశముయొక్క నిజనిర్మల యథార్థస్వరూపమేయగును.

సస్పన్దోఽపి హి నిఃస్పన్దః పర్వతోఽపి న పర్వతః
యథా స్వప్నేషు చిద్భావం స్వభావోఽర్థగతస్తథా. 7

స్వప్నములందు సన్మాత్రాత్మ సంచలనసహితమైయున్నను సంచలనరహితమైనదియు, పర్వతరూపమైనను పర్వతముకానిదియు నెట్లగునో, అట్లే జాగ్రత్తునందును అది పదార్థరూపమైయున్నను పదార్థరహితమేయగును.

న స్వభావా న చైవార్థాః సన్తి సర్వాత్మకోచితే
సర్గాదౌ కచితం రూపం యద్యథా తత్తథాస్థితమ్. 8

సర్వస్వరూపమగు పరమాత్మయొక్క వాస్తవరూపమున సృష్ట్యాదిస్వభావములుగాని, తత్కృతములగు పదార్థములుగానిలేవు. సృష్ట్యాదియందు బ్రహ్మదేవుని సంకల్పముచే నేది యెట్లు స్ఫురించుచున్నదో, అది యట్లే నేఁటివఱకును స్థితినొందియున్నది.

న చ నామ పరం రూపం కచనాకచనాత్మకమ్
ద్రవ్యాత్మా చిచ్చ చిద్వ్యోమ స్థితమిత్థం హి కేవలమ్. 9

చిదాకాశమగు పరబ్రహ్మముయొక్క స్వరూపము ప్రకాశ, అప్రకాశాత్మకముగాని, పదార్థరూపముగాని, అచిద్రూపముగాని కాదు. అది కేవలమిట్లు తన శుద్ధ చిద్రూపముతోనే స్థితినొందియున్నది.

ఏకైవ చిద్యథాస్వప్నే సేనాయాం జనలక్షతాం
గతేవాచ్ఛైవ కచతి తథైవాస్థా పదార్థతా. 10

ఒకే చైతన్య మెట్లు స్వప్నసైన్యమున లక్షలకొలఁది జనులయొక్కరూపమును బొందిన దానివలె నున్నప్పటికిని, తన నిర్మలరూపముతోనే యెట్లు ప్రకాశించుచున్నదో, అట్లే జాగ్రత్తు నందును వివిధపదార్థరూపములఁ బొందినట్లున్నను, నిజశుద్ధ చిద్రూపముతోనే సదా వెలయుచున్నది

యత్స్వతః స్వాత్మని స్వచ్ఛే చిత్త్వం కచకచాయతే
తత్తేనైవతదాకారం జగదిత్యనుభూయతే. 11

చిదాకాశము స్వతః తన నిర్మలస్వరూపమున నేరూపముతోడ స్ఫురించుచున్నదో, అట్టి స్ఫురణాకారమును, ఆచిదాకాశమే జగత్తుగ ననుభవించుచున్నది.

అసత్యపి యథా వహ్నావుష్ణసంవిద్ధి భాసతే
సంవిన్మాత్రాత్మకే వ్యోమ్ని తథార్థః స్వస్వభాసకః. 12

స్వప్నమున వాస్తవముగ అగ్ని లేకున్నను స్వప్నచైతన్యమే యట్లు ఉష్ణత్వ రూపముగ భాసించునట్లు, జాగ్రత్తునందును సంవిన్మాత్రమగు చిదాకాశమున నిజచిత్స్వభావమే పదార్థాకారముగ భాసించుచున్నది.

అసత్యపి యథా స్తమ్భే స్వప్నే ఖే స్తమ్భతా విదః
తథేదమస్యా నానాత్వమనన్యదపి చాన్యవత్. 13

స్వప్నమున స్తంభములేకున్నను జీవునకు స్తంభబుద్ధి యెట్లుకలుగుచున్నదో, అట్లే జాగ్రత్తునందును, ఈ నానారూపత్వము వాస్తవముగ చైతన్యముకంటె భిన్నముగాక యున్నను, భిన్నమైనదానివలె భాసించుచున్నది.

ఆదిసర్గే పదార్థత్వం తత్స్వభావాచ్ఛమేవ చ
చిద్వ్యోమ్నా యద్యథా బుద్ధం తత్తథాద్యాపి విద్యతే. 14

ఆదిసృష్టియందు పదార్థరూపత్వము నిర్మలచిద్రూపమేయైయున్నది. అపుడు చిదాకాశము ఏపదార్థము నేరీతి అర్థక్రియా రూపముతోడ నెఱిఁగెనో, అది నేఁటివఱకారీతిగనే వర్తించుచున్నది.

పుష్పే పత్రే ఫలే స్తమ్భే తరురేవ యథా తతః
సర్వం సర్వత్ర సర్వాత్మ పరమేవ తథాఽపరమ్. 15

పుష్పమందును, పత్రమందును, ఫలమందును, స్తంభమందును వృక్షమే యెట్లు వ్యాపించి యున్నదో, అట్లే ఈ జగత్తంతయును సర్వత్ర సర్వరూపమగు పరబ్రహ్మమేయైయున్నది.

పరమార్థామ్బురామ్భోధావాపః సర్గపరమ్పరా
పరమార్థమహాకాశే శూన్యతా సర్గసంవిదః. 16

పరమార్థ (చిద్రూప) మహాసముద్రమున ఈ సృష్టిపరంపర జలమువంటిదైయున్నది. మఱియు పరమార్థ మహాకాశమున ఈ సృష్టి ప్రతిభాసములు శూన్యత్వమువంటివైయున్నవి.

పరమార్థశ్చ సర్గశ్చ పర్యాయౌ తరువృక్షవత్
బోధాదేతదబోధాత్తు ద్వైత దుఃఖాయ కేవలమ్. 17

తత్త్వబోధచే, పరమార్థము (చిద్రూపము) సృష్టియను నీరెండున్ను తరు, వృక్షములవలె పర్యాయవాచకములే యగును. అజ్ఞానముచేతనో, ఈ ద్వైతము కేవలము దుఃఖము కొఱకే యగును

పరమార్థో జగచ్చేదమేకమిత్యేవ నిశ్చయః
అధ్యాత్మశాస్త్రబోధేన భవేత్సైషా హి ముక్తతా. 18

అధ్యాత్మశాస్త్రజ్ఞానముచే, పరమార్థము జగత్తు అను నీ రెండును నొకటియేయను నిశ్చయము కలుగును. అట్టి స్థితియే (అపరోక్షానుభూతియే) ముక్తి.

సంకల్పస్య వపుర్బ్రహ్మ సంకల్పకచిదాకృతేః
తదేవ జగతో రూపం తస్మాద్బ్రహ్మాత్మకం జగత్. 19

సంకల్పకుఁడగు చిదాకారము (బ్రహ్మము)యొక్క సంకల్పముయొక్క స్వరూపమున్ను బ్రహ్మమేయైయున్నది. మఱియు ఆ సంకల్పమే జగత్తుయొక్క రూపమైయున్నది. కాఁబట్టి జగత్తు బ్రహ్మాత్మకమేయగును.

యతో వాచో నివర్తన్తే న నివర్తన్త ఏవవా
విధయః ప్రతిషేధాశ్చ భావాభావదృశ స్తథా. 20

దేనిని బొందఁజాలక వాక్కులు, విధినిషేధములు, భావాభావ దృష్టులు వెనుకకు మరలుచున్నవో, లేక సమస్తపదార్థములయొక్క అధిష్ఠానమగుటచే నెద్దానినుండి యవి మరలకయే యున్నవో అదియే బ్రహ్మము.

అమౌనమౌనం జీవాత్మ యత్పాషాణవదాసనమ్
యచ్చ దేవాసదాభాసం తద్బ్రహ్మాభిధముచ్యతే. 21

అమౌన, మౌనములమధ్య జీవస్వరూపముయొక్క శిలవంటి చిద్ఘనస్థితి యేదికలదో, మఱియు నేది సద్రూపమైనను, శరీరాది అసద్రూపములయొక్క తాదాత్మ్యాధ్యాసముచే అసత్తువలె భాసించుచున్నదో, అదియే బ్రహ్మమనుపేరుచేఁ జెప్పఁబడుచున్నది.

సర్వస్మిన్నేకనుఘనే బ్రహ్మణ్యేవ నిరామయే
కా ప్రవృత్తిర్నివృత్తిః కా భావాభావాదివస్తునః. 22

సర్వరూపమై, ఏకమై, మహాచిద్ఘనమై, నిర్వికారమైనట్టి బ్రహ్మమందు, భావాభావాది రూపపదార్థములయొక్క సృష్టియేమి ? ప్రళయమేమి ?

ఏకస్యామేవ నిద్రాయాం సుషుప్తస్వప్నవిభ్రమాః
యదా భాన్త్యవిచిత్రాయాం చిత్రా ఇవ నిరన్తరాః. 23
ఏకస్యాం చిత్థసత్తాయాం తథా మూలకసర్గకా
బహవో భాన్త్యచిత్రాయాం చిత్రా ఇవ నిరన్తరాః. 24

అవిచిత్ర (సమానరూప)మైనట్టి ఏకమగు నిద్రయందు చిత్ర విచిత్రములైనట్టి సుషుప్తి, స్వప్నాది అనేక విభ్రమములెట్లు నిరంతరము భాసించుచున్నవో, అట్లే అవి చిత్రమైనట్టి యీ చిదాకాశసత్తయందును విచిత్రములైన అనేక బీజభూతములగు ప్రళయములున్ను సృష్టులున్ను నిరంతరము భాసించుచున్నవి.

ద్రవ్యే ద్రవ్యాన్తరశ్లిష్టం యత్కార్యాన్తరమాక్షిపేత్
తద్వదన్తస్తథాభూత చిత్స్ఫారం స్ఫురణం మిథః. 25

ఎట్లు దధి (పెరుగు) మున్నగు పదార్థములందు శర్కరాది (చెక్కెర మున్నగు) ఇతర పదార్థములు కలిసినవై వాని ప్రత్యేక కార్యముకంటె వేఱైనట్టి (రుచి, పుష్టి, పిత్తోపశమాది) కార్యమును సిద్ధింపఁజేయుచున్నవో, అట్లే, ప్రాణులయొక్క అంతఃకరణమున అభివ్యక్తమైన ప్రయాత యను చైతన్యసారము బాహ్యమున నేత్రాదులద్వారా వెడలి ఘటపటాద్యాకారవృత్తులతోకలిసి యా ఘటపటాది విషయాంతరములయొక్క అధిష్ఠానమగు చైతన్యముయొక్క ఆవరణభంగము ద్వారా పరస్పరము త్రిపుటీస్ఫురణమను కార్యమును సిద్ధింపఁజేయుచున్నది.

సర్వే పదార్థాశ్చిత్స్ఫారమాత్రమప్రతిఘాః సదా
యథా భాన్తి తథా భాన్తి చిన్మాత్రైకాత్మతావశాత్. 26

కావుననే ఘటపటాది సమస్తపదార్థములున్ను తమ అధిష్ఠానమగు చైతన్యమున కధీనమైనట్టి సత్తాస్ఫూర్తిగలవగుటచే సదా చిత్స్ఫారమాత్రములై, యొప్పుచున్నవి. మఱియు, చిన్మాత్రముయొక్క ఏకత్వవశమున సృష్ట్యాదియందెట్లు స్ఫురించియుండెనో, అట్లే యిపుడును స్ఫురించుచున్నది.

చిన్మాత్రైకాత్మసారత్వాద్యథా సంవేదనం స్థితాః
నిఃస్పన్దా నిర్మనస్కారాః స్ఫురన్తి ద్రవ్యశక్తయః. 27

ఏకమై, నిశ్చలమైనట్టి చిన్మాత్రాత్మయే అధిష్ఠానముగాఁ గలవగుటచే సమస్త పదార్థ శక్తులున్ను నట్టి చిన్మాత్రముననుసరించియే స్థితిగల్గియున్నవి. కావుననే యవి వాస్తవముగ నిశ్చలములై, అమనస్కరూపములై వెలయుచు చైతన్యముయొక్క స్ఫురణముచేతనే స్ఫురించుచున్నవగును.

అవిద్యమానమేవేదం దృశ్యతేఽథానుభూయతే
జగత్స్వప్న ఇవాశేషం సరుద్రోపేన్ద్రపద్మజమ్. 28

బ్రహ్మ, విష్ణు, రుద్రాదిసహితమగు ఈ జగత్తంతయును లేనిదేయగుచు స్వప్నమువలె కానుపించుచు, అనుభూతమగుచున్నది.

విచిత్రాః ఖలు దృశ్యన్తే చిజ్జలే స్పన్దరీతయః
హర్షామర్షవిషాదోత్థ జఙ్గమస్థావరాత్మని. 29

స్థావరజంగమాత్మకమగు చిద్రూపమను జలమందు హర్ష, క్రోధ, విషాదాదులచే జనించిన విచిత్రస్పందరూపతరంగములు స్వప్నమువలె కానుపించుచున్నవి.

స్వభావవాతాధూతస్య జగజ్జాలచమత్కృతేః
హా చిన్మరీదిపాం శ్వభ్ర నీహారస్య విసారితా, 30

అహా ! అజ్ఞాతచిత్స్వభావనిష్ఠమగు విక్షేపశక్తియను వాయువుచే కంపితములైనవియు, జగత్సమూహాకారమను చమత్కారముగలవియునగు — సత్వగుణమను ప్రకాశముతోఁగూడిన కిరణములయొక్కయు, రజోగుణమను దూళిసమూహముయొక్కయు, తమోగుణమను, ఆవరణ, జడత్వ ప్రాధాన్యసహితములైన జననమరణాద్యనేక అనర్థములను మేఘ, హిమాదులయొక్కయు చిదాకాశమున నెట్టి ఖేదజనకమైన విస్తారమిది ?

యథా కేశోణ్డ్రకం వ్యోమ్ని భాతి వ్యామలచక్షుషః
తథైవేయం జగద్భ్రాన్తిర్భాత్యనాత్మవిదోఽమ్బరే. 31

తిమిరరోగయుక్తమగు దృష్టిగలవానికి ఆకసమున కేశాదులెట్లు భాసించునో, అట్లే, అజ్ఞానావృతచైతన్యదృష్టిగలవానికి నిజచిదాకాశమున ఈ జగద్భ్రాంతియు భాసించును.

యావత్సంకల్పితం తావద్యథా సంకల్పితం తథా
యథా సంకల్పనగరం కచతీదం జగత్తథా. 32

సంకల్పనగరమువలె ఈ జగత్తున్ను ఎంతవఱకు సంకల్పింపఁబడునో అంతవఱకును, ఏయే ప్రకారముగ సంకల్పింపఁబడునో ఆయా ప్రకారముగను స్ఫురించుచున్నది.

సంకల్పనగరే యావత్సంకల్పసకలా స్థితిః
భవత్యేవాప్యసద్రూపా సతీవానుభవే స్థితా. 33

సంకల్పనగరమున సంకల్పస్థితియంతయు నెంతవఱకుండునో, అంతవఱకును నది (సంకల్పనగరము) అసద్రూపమైనప్పటికిని సత్యమైనదానివలెనే యనుభవమున వర్తించును.

ప్రవహత్యేవ నియతిర్నియతార్థప్రదాయినీ
స్థావరం జఙ్గమం చైవ తిష్ఠత్యేవయథాక్రమమ్. 34

బ్రహ్మదేవునియొక్క నియతపదార్థముల నొసంగు అసంకల్పరూప నియతియే యిపుడును నడుచుచున్నది. అదియే ముందును నడువఁగలదు. ఆ నియతిచేతనే స్థావరజంగమాది ప్రాణి సమూహమంతయు యథాక్రమముగ నియతరూపమున స్థితినొందియున్నది.

జాయతే జఙ్గమం జీవాత్స్థావరం స్థావరాదపి
నియత్యాధో వహత్యమ్బు గచ్ఛత్యూర్ధ్వమథానలః. 35

అట్టి నియతిచేతనే జంగమప్రాణి జంగమప్రాణినుండియు, స్థావరము స్థావరమునుండియు నుత్పన్నమగుచున్నది. మఱియు నద్దానిచేతనే జలము అధఃప్రదేశమునకును, అగ్నియూర్ధ్వ ప్రదేశమునకును జనుచున్నవి.

వహన్తి దేహయన్త్రాణి జ్యోతీంషి ప్రతపన్తి చ
వాయవో నిత్యగతయః స్థితా శైలాదయః స్థిరాః. 36

అట్టి నియతిచే నియమితములైయే శరీరములను యంత్రములు నడుచుచున్నవి; జ్యోతిర్మయులగు సూర్యాదులు తపించుచున్నారు; వాయువు నిత్యము గమనశీలమై యొప్పుచున్నది; పర్వతాదులు స్థిరముగనున్నవి.

జ్యోతిర్మయం వివృత్తం తు ధారాసారామ్బరీకృతమ్
యుగసంవత్సరాద్యాత్మ కాలచక్రం ప్రవర్తతే. 37

అట్టి నియతియొక్క ప్రభావముచేతనే జ్యోతిర్మయమగు కాలచక్రము దక్షిణాయన రూపముగ, దిరుగ, వర్షర్తువునందాకాశము వర్షధారలచే వ్యాప్తమగుచున్నది. మఱియు, యుగ, సంవత్సరాదిరూపమగు కాలచక్రము ఆ నియతిచేతనే తిరుగుచున్నది.

భూతలై కాన్తరాబ్ధ్యద్రిసంనివేశః స్థితాయతే
భావాభావగ్రహోత్సర్గద్రవ్యశక్తిశ్చ తిష్ఠతి. 38

అట్టి నియతివలననే భూతలముపై ద్వీపభేదములతోటి మధ్య మధ్య సముద్రముల యొక్కయు పర్వతాదులయొక్కయు రచన స్థితినొందియున్నది. మఱియు, యుత్పత్తి, నాశ, గ్రహణ, త్యాగాది పదార్థ శక్తులున్ను; ఆ నియతియొక్క బలముచేతనే వర్తించుచున్నవి.

కున్దదన్త ఉవాచః—

ప్రాగ్దృష్టం స్మృతిమాయాతి తత్స్వసంకల్పనాన్యతః
భాతి ప్రథమసర్గే తు కస్య ప్రాగ్దృష్టభాసనమ్. 39

కుందదంతుఁడు:— మహాత్మా! పూర్వమనుభవించిన విషయమే స్మరణకు వచ్చును గదా! అస్మదాది సర్వజనుల వ్యవహారమున్ను బ్రహ్మదేవునియొక్క సంకల్పరూపనియతిచే వ్యవస్థితమైయున్నది. కాని సృష్టికి పూర్వానుభవజన్యసంస్కారము తప్ప వేఱొక హేతువు లేనందు చేతను, ఆదిసృష్టియందు పూర్వానుభవము అప్రసిద్ధమైయుండుటచేతను, అట్టి ఆదిసృష్టియందు బ్రహ్మదేవునకు సంస్కారమెట్లు సిద్ధించును? పూర్వజగదనుభవ సంస్కారములేకయే యాతనికి జగత్తు అపుడెట్లు భాసించును?

తాపన ఉవాచః—

అపూర్వం దృశ్యతే సర్వం స్వప్నే స్వమరణం యథా
ప్రాగ్దృష్టం దృష్టమిత్యేవ తత్రైవాభ్యాసతః స్మృతిః. 40

కదంబతాపసుఁడు:— ఓ సాధూ! స్మృతి సంస్కారాదులులేకయే, స్వప్నమందు స్వమరణమువలె బ్రహ్మదేవునకు ఆక్షణమున (దివ్యజ్ఞానముచే) అతీత, అనాగతమగు సమస్త జగత్తున్ను అపూర్వముగనే కానుపించును. అట్లు గాంచిన దాని ననుసరించి చైతన్యవివర్తరూపమగు సాంకల్పికసృష్టియపుడు ప్రవర్తించుచున్నది. అచ్చోటనే అభ్యాసవశమున 'నేను దీనిని బూర్వము గాంచితిని' అను నీ ప్రకారమగు స్మృతియొక్కయు అధ్యాసమాతనికి సంభవించుచున్నది.

చిత్త్వాచ్చిద్వ్యోమ్ని కచతి జగత్సంకల్పపత్తనమ్
న సన్నాసదిదం తస్మాద్భాతాభాతం యతః స్వతః. 41

చిద్రూపమగుటచే చిదాకాశమున ఈ జగత్తు సంకల్పనగరమువలె స్ఫురించుచున్నది మఱియు నొకపుడు స్వయముగ భాసించుచు ఒకపుడు భాసింపకయు నున్నందున ఇయ్యది సత్తుగావి, అసత్తుగాని కాకయున్నది.

చిత్ప్రసాదేన సంకల్పస్వప్నాద్యాద్యనుభూయతే
శుద్ధం చిద్వ్యోమ సంకల్పపురం మా స్మర్యతాం కథమ్. 42

స్మరణములేకనే జీవునకు చైతన్యముయొక్క ప్రభావముచే స్వప్న సంకల్పాదులందు కల్పనామాత్రముచే జగత్తుయొక్క స్మృతి అనుభవము కలుగుచుండ, ఇఁక శుద్ధచిదాకాశమునకు సంకల్పమాత్రముచే జగద్రూప నగరముయొక్క స్మృతి, అనుభవమేల కలుగకుండును ?

హర్షామర్షవినిర్ముక్తైర్దుఃఖేన చ సుఖేన చ
ప్రకృతేనైవ మార్గేణ జ్ఞైశ్చక్రైరివ గమ్యతే. 43

కావుననే గుణదోషాదుల అస్మరణమువలన హర్ష, క్రోధ, సుఖ, దుఃఖాదిరహితులగు తత్త్వజ్ఞానులు కుమ్మరివాని చక్రమువలె ప్రారబ్ధవేగముచేతనే ప్రవాహ పతిత మార్గము ననుసరించి చనుచున్నారు.

నిద్రావ్యవగమే స్వప్ననగరే యాదృశం స్మృతౌ
చిద్వ్యోమాత్మ పరం విద్ధి తాదృశం త్రిజగద్భ్రమమ్. 44

ఓ సాధూ! నిద్ర నశింప స్వప్ననగరమున కేవలము స్మృతిమాత్రమే యుండును. గాని మనుత్వాదులెట్లుండవో, కావుననే యది వాస్తవముగ స్మృతి యెట్లుకాదో, అట్లే జ్ఞానికి త్రైలోక్యభ్రమ నశించుటఁబట్టి, అట్టిబాధిత త్రైలోక్యమునుగూర్చి స్మృతి యాతని కున్నప్పటికిని, అది వాస్తవముగ స్మృతి కానేరదు. అధిష్ఠానమాత్రమగు పరమ చిదాకాశముగనే దాని నెఱుఁగుము.

సంవిదాభాసమాత్రం యజ్జగదిత్యభిశబ్దితమ్
తత్సంవిద్వ్యోమ సంశాన్తం కేవలం విద్ధి నేతరత్. 45

చైతన్యముయొక్క అభాస (స్ఫురణ) మాత్రమే జగత్తని చెప్పఁబడుచున్నది. అట్టి చైతన్య స్ఫురణమున్ను కేవలము పరమశాంతమైనట్టి చిదాకాశమేగాని అన్యము కాదని నీవెఱుఁగుము.

యస్మిన్సర్వం యతః సర్వం యత్సర్వం సర్వతశ్చ యత్
సర్వం సర్వతయా సర్వం తత్సర్వం సర్వదా స్థితమ్. 46

దేనియందు సమస్తము గలదో, దేనినుండి సమస్తమావిర్భవించుచున్నదో, ఏది సర్వ రూపమై సర్వత్ర వ్యాపించియున్నదో, అట్టి చిద్రూపమే సదా సర్వత్ర సర్వరూపముగ స్థితి నొందియున్నది.

యథేయం సంసృతిర్బ్రాహ్మీ భవతో యద్భవిష్యతి
యథా భానం చ దృశ్యస్య తదేతత్కథితం మయా. 47

ఓ సాధువులారా! ఈప్రకారముగ, బ్రహ్మదేవునియొక్క యీ సృష్టి యెటువంటిదో ఈ దృశ్యముయొక్క భావమెట్టిదో, మీకేది సంభవింపనున్నదో, అదియంతయును మీకు నేనుజెప్పితిని.

ఉత్తిష్ఠతం ప్రణత మాస్పద మేహ్ని వద్యం
శృఙ్గారివాళిమత మాశు విధీయతాం స్వమ్
తిష్ఠామి దుఃఖమలమ త్ర సమాధిసంస్థం
భూయః సమాధిమహమఙ్గ చిరం విశామి. 48

ఇత్యార్షే శ్రీవాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే ఉత్తరార్ధే బ్రహ్మః తాపః కున్దదన్తోపదేశోనామ చతురశీత్యధిక శతతమః సర్గః ॥ 184 ॥

ప్రియులగు నో బ్రాహ్మణులారా! ఇఁక మీరిపుడు లెండు; ప్రాతఃకాలమున భ్రమర ద్వయము కమలమునుగూర్చి యేగునట్లు మీరిరువురును నిఁక మీ గృహములకుఁ బొండు, అచట అభిమతములైన సత్కర్మలను స్వయముగ సత్వరముగ నాచరింపుఁడు ఏలయనిన, యిపుడు సమాధి లేక యున్నందున నేను మిగుల దుఃఖముతోఁ గూడియున్నాను. అట్టి దుఃఖముయొక్క పరిహారము, కొఱకై తిరిగి సమాధియందిపుడు చిరకాలముండుటకుగాను బాగుగ, బ్రవేశించుచున్నాను.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున నుత్తరార్ధమున బ్రః తాః కుందదంతోపదేశమను నూట యెనుబది నాల్గవ సర్గము ॥ 184 ॥

~~~~~~~~~~~~

## పఞ్చాశీత్యధిక శతతమః సర్గః

[ తయోర్గృహాగమస్తత్ర భ్రాతౄణాం క్రమశః క్షయః
కున్దదన్తస్య రామాప్త్యా మోహోచ్ఛిత్తిశ్చ వర్ణ్యతే.

వారిరువురును గృహమునకేగుట, క్రమముగ సోదరులు మరణించుట, కుందదంతుని యొక్క రామచంద్రునితోటి కలయికచే మోహము నశించుట మున్నగు విషయములిచట వర్ణింపఁ బడుచున్నవి. ]

కున్దదన్త ఉవాచః—

ఇరస్మ్యసిర పిత్యుక్త్వా ధ్యానమీలితలోచనః
ఆసీదస్పన్దిత ప్రాణమనాశ్చిత్ర ఇవార్పితః.

కుందదంతుఁడు;— ఓ రామాది సభ్యులారా! ఆ వృద్ధ గౌరీవనతపస్వి యిట్లుచెప్పి ధ్యానమందుఁ బ్రవేశించుటవలన మూయఁబడిన నేత్రములుగలవాఁడై, ప్రాణ, మనశ్చేష్టా రహితుఁడై, చిత్రమందు లిఖింపఁబడినవానివలె నిశ్చలముగనుండెను.

ఆవాభ్యాం ప్రణయోదారైః ప్రార్థితోఽపి పునః పునః
వాక్యైః సంసారమవిదన్న వచో దత్తవాన్పునః. 1

అపుడు నమ్రత్వ ఉదారత్వ సహిత వాక్యములతో మేమిరువురమును నాతనిని మరల మరల ప్రార్థించినప్పటికిని ప్రత్యుత్తరమీయక నేయుండెను. ఏలయనిన బాహ్యావృత్తియొక్క అభా సముచే నాతడపుడు ప్రపంచము నెఱుగక యుండెను.
~~~~~~~~~~~~

ఆవాం ప్రదేశతస్తస్మాచ్చలిత్వా మన్దముత్సుకౌ
దినైః కతిపయైః ప్రాప్తౌ గృహం ముదితబాన్ధవమ్. 3

పిమ్మట మేము మునియొక్క వియోగముచే దుఃఖితులమై యా స్థానమును వీడి కొలది దినములకు, (మా రాకచే) సంతోషాన్వితులైయున్న బంధువులతోఁగూడిన గృహమును బొందితిమి.

అథ తత్రోత్సవం కృత్వా కథాః ప్రోచ్య చిరన్తనీః
స్థితాస్తావద్వయం యావత్ప్రాపి భ్రాతరోఽథ తే. 4
క్రమేణ విలయం ప్రాప్తాః ప్రలయేష్వర్ణవా ఇవ
ముకోఽసౌ మే సుఖైవైక ఏకార్ణవ ఇవాష్టకః. 5

తదుపరి యా గృహమున దేవతారాధనాదిరూపమైన యుత్సవమును గావించి, పూర్వకాలిక కథలను జెప్పుకొనుచు నుంటిమి. కొంతకాలమున కా తక్కిన యేడుగురు సోదరులును ప్రళయారంభమున ద్వాదశసూర్యుల తాపముచే సప్తసముద్రములవలె క్రమముగ విలయము నొందిరి. అత్తఱి, జలప్రళయమున ఏకమగు మహాసముద్రమువలె, అష్టమసోదరుఁడగు ఆ నా మిత్రుఁడొకఁడుమాత్రము శేషించెను.

తతః కాలేన సోఽప్యస్తం దినాన్తేఽర్క ఇవాగతః
అహం దుఃఖపరీతాత్మా పరం వైధుర్యమాగతః. 6

పిదప కాలక్రమమున నాతఁడున్ను దినాంతమున సూర్యునివలె నస్తమించెను. అపుడు నేను మిత్రవియోగమువలన మహాదుఃఖముచే వ్యాప్తుఁడనైతిని.

తతోఽహం దుఃఖితో భూయః కదమ్బతరుతాపసమ్
గతో దుఃఖోపఘాతాయ తజ్జ్ఞానం ప్రష్టుమాదృతః. 7

అట్లు, అత్యంత దుఃఖితుఁడనైయున్న నేనంత తద్దుఃఖ వినాశముకొఱకై యా పూర్వము వచింపఁబడిన ఆత్మజ్ఞానమునుగూర్చి యాదరముతో నడుగుటకుగాను మరల యా కదంబవృక్షతలమందలి తాపసునివద్దకు వెడలితిని.

తత్ర మాసత్రయేణాసౌ సమాధివిరతోఽభవత్
ప్రణతేన మయా పృష్టః సన్నిదం ప్రోక్తవానథ. 8

అచట మూఁడునెలలైనపిదప యాతఁడు సమాధినుండి లేచెను. అంత నేనాతనిని వినయపూర్వకముగఁ బ్రశ్నింప నాతఁడిట్లు వచించెను —

**కదమ్బతాపస ఉవాచ :—**

అహం సమాధి విరతః స్థాతుం శక్నోమి న క్షణమ్
సమాధిమేవ ప్రవిశామ్యహమాశు కృతత్వరః. 9

కదంబతాపసుఁడు :— ఓ సాధూ! నేను సమాధిని జాలించి యొకక్షణమైనను నుండఁజాలను. కావున శీఘ్రముగ సమాధియందే మరల ప్రవేశించుచున్నాను.

పరమార్థోపదేశస్తే నాభ్యాసేన వినానఘ
లగత్యత్ర పరాం యుక్తిమిమాం శృణు తతః కురు. 10

పాపరహితుఁడా! అభ్యాసములేనందుచే పరమార్థోపదేశము నీకు అంటుటలేదు. కావున నివ్విషయమున, ఈ మతియొక జ్ఞానప్రాప్త్యుపాయమునుగూర్చి వినుము. అపిదప తదనుసార మాచరింపుము.

అయోధ్యానామ పూరస్తి తత్రాస్తి వసుధాధిపః
నామ్నా దశరథస్తస్య పుత్రో రామ ఇతి శ్రుతః. 11

సకాశం తత్ర గచ్ఛత్వం తస్మై కులగురుః కిల
వసిష్ఠాఖ్యో మునిశ్రేష్ఠః కథయిష్యతి సంసది. 12

అయోధ్యయను నగరముకలదు. అచట దశరథుఁడను రాజుకలఁడు. అతని కుమారుఁడు రాముఁడను పేరుచేఁ బ్రసిద్ధికెక్కియుండెను. నివాతనివద్దకుఁ బొమ్ము అతనికొఱకై యిక్ష్వాకు కుల గురువైనట్టి మునిశ్రేష్ఠుఁడనునాతఁడు సభామధ్యమున మోక్షోపాయమును జెప్పును.

మోక్షోపాయకథాం దివ్యాం తాం శ్రుత్వా సుచిరం ద్విజ
విశ్రాన్తిమేష్యసి పరే పదేఽహమివ పావనే. 13

ఓ బ్రాహ్మణుఁడా! దివ్యమైన యా మోక్షోపాయ కథను వినినచో, పరమపావనమైనట్టి బ్రహ్మపదమున నావలెనే నీవు చిరకాలము విశ్రాంతినొందఁగలవు.

ఇత్యుక్త్వా స సమాధాన రసాయన మహార్ణవమ్
వివేశాహమిమం దేశం త్వత్ప్రకాశముపాగతః. 14

ఇట్లు చెప్పి యా తాపసుఁడు సమాధియను అమృతమహాసముద్రమునఁ బ్రవేశించెను. నేనున్ను అతని యాజ్ఞానుసారము నీవద్దకేతెంచితిని.

ఏషోఽహమేతద్వృత్తం మే సర్వం కథితవానహమ్
యథావృత్తం యథాదృష్టం యథాశ్రుతమఖణ్డితమ్. 15

ఓ రామచంద్రా! ఈప్రకారముగ నా వృత్తాంతమంతయును చూచినరీతి వినినరీతి యథార్థముగ నీకు వచించితిని.

శ్రీరామ ఉవాచః—

నకున్దదన్త ఇత్యాది కథా కథనకోవిదః
స్థిత స్తతః ప్రభృత్యేవ మత్సమీపగతః సదా. 16

శ్రీరాముఁడు:—వసిష్ఠమునీంద్రా! ఈప్రకారమగు కథను జెప్పుటయందు ప్రవీణుఁడగు ఆ కుందదంతబ్రాహ్మణు డప్పటినుండియు నావద్దనే యెల్లపుడును నుండుచున్నాఁడు.

స ఏష కున్తదన్తాఖ్యో ద్విజః పార్శ్వే సమాస్థితః
శ్రుతవాన్సంహితామేతాం మోక్షోపాయాభిధామిహ. 17

స ఏష కున్దదన్తాఖ్యో మమ పార్శ్వ గతో ద్విజః
అద్య నిఃసంశయో జాతో న వేతి పరిపృచ్ఛ్యతామ్. 18

ఓ మునీశ్వరా! నా ప్రక్కన గూరుచున్న యీతఁడే యా కుందదంత బ్రాహ్మణుఁడై యున్నాఁడు. కావున, ఇట నింతవఱకును జెప్పఁబడినట్టి యీ మోక్షోపాయమును సంహితసీతఁడు వినియేయున్నాఁడు. దీనిని విని యీతఁడు సందేహరహితుఁడయ్యెనో, లేదో ప్రశ్నింపుడు.

శ్రీ వాల్మీకి రువాచః—

ఇత్యుక్తే రాఘవేణాథ ప్రోవాచ వదతాం వరః
స వసిష్ఠో మునిశ్రేష్ఠః కున్దదన్తం విలోకయన్. 19

శ్రీ వాల్మీకి — ఓ భరద్వాజా! శ్రీరామచంద్రుఁడిట్లు పచింప, వక్తలలో శ్రేష్ఠుంతును. మునివర్యుఁడునగు వసిష్ఠుఁడు కుందదంతుని జూచి యిట్లు పలికెను.

శ్రీ వసిష్ఠ ఉవాచ :—

కున్దదన్త ద్విజవర కథ్యతాం కిం త్వయానఘ
బుద్ధం శ్రుతవతా జ్ఞేయం మదుక్తం మోక్షదం పరమ్. 20

శ్రీవసిష్ఠుఁడు:— పాపరహితుఁడవును, ఉత్తమబ్రాహ్మణుఁడవునగు నో కుందదంతుఁడా! నేను జెప్పినదానిని వినినందువలన నీవు మోక్షప్రదమై, జ్ఞేయమైనట్టి యుత్తమ బ్రహ్మపదము నెఱింగితివా?

కున్దదన్త ఉవాచః—

సర్వసంశయ విచ్ఛేది చేత ఏవ జయాయ మే
సర్వసంశయ విచ్ఛేదో జ్ఞాతం జ్ఞేయమఖణ్డితమ్. 21

కుందదంతుఁడు:— మహాత్మా! సర్వసంశయములను ఛేదింపసమర్థమగు నా చిత్త మిపుడు విజయముకొఱకే అయియున్నది. నా సమస్తసందేహములు నశించినవి. ఏలయనిన, భేదరహితమగు జ్ఞేయవస్తువును తమ యుపదేశముచే నేను బూర్ణముగ నెఱిఁగితిని.

జ్ఞాతం జ్ఞాతవ్యమఖిలం దృష్టం ద్రష్టవ్యమక్షతమ్
ప్రాప్తం ప్రాప్తవ్యమఖిలం విశ్రాన్తోఽస్మి పరే పదే. 22

మహాశయా! నేనిపుడు తెలిసికొనఁదగిన నిర్మలవస్తువును దెలిసికొంటిని; చూడఁదగిన అఖండవస్తువును జూచితిని; పొందఁదగినదంతయును బొందితిని ఇపుడు నేనుత్తమమగు బ్రహ్మపదమున విశ్రాంతి నొందియున్నాను.

బుద్ధేయం త్వదిదం సర్వం పరమార్థఘనం ఘనమ్
అనన్యేనాత్మనో వ్యోమ్ని జగద్రూపేణ జృమ్భితమ్. 23

మహాత్మా! నిజచిదాకాశమున తనకంటె వేఱుకానివిధమున జగద్రూపముగ విజృంభించినట్టి మహాపరమార్థఘనమైన యీ ఆత్మచైతన్యమునంతయు తమవలన నే నెఱిఁగితిని.

సర్వాత్మకతయా సర్వరూపిణః సర్వగాత్మనః
సర్వం సర్వేణ సర్వత్ర సర్వదా సంభవత్యలమ్. 24

సర్వవ్యాపకమై, సర్వాత్మకత్వముచే సర్వస్వరూపమై వెలయు పరమాత్మయందు సర్వత్ర, సర్వదా, సర్వవిధముల సమస్తము పూర్ణముగ సంభవమగుచున్నది.

సంభవన్తి జగన్త్యన్తః సిద్ధార్థకరకోటరే
న సంభవన్తి చ యథా జ్ఞాతమేతదశేషతః. 25

ఒక్క ఆవగింజయొక్క లేశమందునుగూడ, సర్వశక్తియుతమగు చైతన్యముయొక్క సత్తవలన మాయాదృష్టిచే అనేక బ్రహ్మాండములు సంభవించుచున్నవి. కాని, పరమార్థదృష్టిచే నేమియు సంభవింపకనేయున్నవి—అను నివ్విషయమును తమకృపవలన బాగుగ నెఱింగితిని.

గృహేఽన్తః సంభవత్యేవ సప్తద్వీపా వసుంధరా
గేహం చ శూన్యమేవాస్తే సత్యమేతదసంశయమ్. 26

గృహమందు సప్తద్వీపవతియగు భూమి సంభవమేయగును. కాని వాస్తవముగ ఆ గృహమున్ను శూన్యరూపమేయైయున్నది — అను విషయము నిక్కముగ సత్యమైయున్నది.

యద్యద్యదా వస్తు యథోదితాత్మ భాతీహ భూతైరనుభూయతే చ
తత్తత్తదా సర్వమనన్తదాస్తే బ్రహ్మైకమాద్యన్తవిముక్తమస్తి. 27

ఇత్యార్షే శ్రీ వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే ఉత్తరార్ధే బ్రహ్మ॥ తా॥ కున్దదన్తప్రబోధో నామ పఞ్చాశీత్యధిక శతతమః సర్గః ॥ 185 ॥

ఏయే వస్తువెచటెచట నెపుడెపు డేయే ప్రకారముగ భాసించుచున్నదో, మఱియు జీవులచే ననుభూతమగుచున్నదో, అదియది యచటచట నపుడపు డాయాప్రకారముగ, మహా చిద్ఘనమై, ఆద్యంతరహితమై, ముక్తస్వరూపమైనట్టి బ్రహ్మమే యట్లు వర్తించుచున్నదగును. దాని కంటె భిన్నముగ నొకింతైనను నెవనిచేతను నెచటను ననుభూతమగుటలేదు.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున నుత్తరార్ధమున బ్ర॥ తా॥ కుందదంత ప్రబోధమను నూట యెనుబది యైదవ సర్గము ॥ 185 ॥

## షడశీత్యధిక శతతమః సర్గః

[సర్వం బ్రహ్మేతి సిద్ధాన్తో యుక్తిభిః క్రియతేఽచలః
వరశాపార్థసిద్ధిశ్చ ధాతుః సంకల్పతశ్చితః.

అంతయు బ్రహ్మమేయను సిద్ధాంతము యుక్తులద్వారా స్థిరమొనర్పబడుట, చిద్రూపు లగు బ్రహ్మాదులయొక్క సంకల్పముచే వరశాపాదులయొక్క సిద్ధి యిచట గానవగును.]

**శ్రీ వాల్మీకి రువాచ:—**

కున్దదన్తే వదత్యేవం వసిష్ఠో భగవాన్మునిః
ఉవాచేదమనిన్ద్యాత్మా పరమార్థోచితం వచః. 1

శ్రీ వాల్మీకి:—ఓ భరద్వాజా! కుందదంతుఁ డీప్రకారముగ వచించుచుండ, నంత అనింద్య స్వరూపుఁడగు భగవంతుఁడైన వసిష్ఠమునీంద్రుఁడు పరమార్థయోగ్యములైన యీవాక్యములఁబల్కెను

**శ్రీ వసిష్ఠ ఉవాచ:—**

బత విజ్ఞానవిశ్రాన్తిరస్య జాతా మహాత్మనః
కరామలకవద్విశ్వం బ్రహ్మేతి పరిపశ్యతి. 2

శ్రీ వసిష్ఠుఁడు :— అహా! ఓ రామచంద్రా! ఇది సంతోషకరమైన విషయము! మహాత్ముఁడగు కుందదంతునకు, ఆత్మసాక్షాత్కారజ్ఞానముయొక్క విశ్రాంతి జనించినది. ఇపుడితఁడు ప్రపంచము నంతయు కరతలామలకముగ (ప్రత్యక్షముగ) బ్రహ్మరూపముగఁ గాంచుచున్నాఁడు.

కిలేదం భ్రాన్తిమాత్రాత్మ విశ్వం బ్రహ్మేతి భాత్యజమ్
భ్రాన్తిర్బ్రహ్మైవ చ బ్రహ్మశాన్తమేకమనామయమ్. 3

భ్రాంతియు బ్రహ్మరూపమేగావున భ్రాంతిమాత్రాత్మకమగు ఈప్రపంచమున్ను వాస్తవముగ నట్టి జన్మరహితమగు బ్రహ్మరూపముగనే భాసించుచున్నది. కావున, సమస్తమున్ను శాంతమై, ఏకమై, నిర్వికారమైనట్టి బ్రహ్మమేయైయున్నది

యద్యథా యేన యత్రాస్తి యాదృగ్యావద్యదా యుతః
తత్తథా తేన తత్రాస్తి తాదృక్తావత్తదా తతః. 4

ఏది, ఏ ప్రకారముగ, దేనిచే, ఎట్లు, ఎంత, ఎపుడు, ఏకారణమువలన ఎచట నుండునో, అది అప్రకారముగ, దానిచే, అట్లు, అంత అపుడు, ఆకారణమువలన, అచట బ్రహ్మమే యా రూపముగ వర్తించుచున్నదగును.

శివం శాన్తమజం మౌనమమౌనమజరం తతమ్
సుశూన్యాశూన్యమభవమనాదినిధనం ధ్రువమ్. 5

శివరూపమై శాంతమై, జన్మరహితమై, మౌనస్వరూపమై జడత్వవర్జితమై, అజరమై (వార్ధక్యములేనిదై), పదార్థశూన్యమై, ప్రపంచవర్జితమై, అనాదియై, సుస్థిరమైనట్టిబ్రహ్మమే యీ సమస్తమున్ను అయియున్నది.

యస్యాం యస్యాం త్వవస్థాయాం క్రియతే సంవిదా భరః
సా సా సహస్రశాఖత్వమేతి సేకైర్యథా లతా. 6

మాయాశబలిత చైతన్యము ఏయే యవస్థయొక్క దృఢసంకల్పముచేయునో, ఆయా యవస్థలు జలసేచనముచే లతవలె వేలకొలఁది శాఖలుగ వికసించుచున్నది.

పరో బ్రహ్మాణ్డమేవాణుశ్చిద్వ్యోమ్నోన్తః స్థితో యతః
పరమాణురేవ బ్రహ్మాణ్డమన్తః స్థితజగద్యతః. 7

చిదాకాశమందుండుటవలన, బ్రహ్మాండమే (చిత్) పరమాణువైయున్నది. మఱియు, అభ్యంతరమందు జగత్తుండుటవలన, (చిత్) పరమాణువే బ్రహ్మాండమైయున్నది (పరమాత్మ యొక్క మాయాశక్తి యింతప్రబలమైనది!)

తస్మాచ్చిదాకాశమనాదిమధ్యమఖణ్డితం సౌమ్యమిదం సమస్తమ్
నిర్వాణమస్తం గతజాలబన్ధో యథాస్థితం తిష్ఠ నిరామయాత్మా. 8

ఓ రామచంద్రా! కావున యీ సమస్తజగత్తున్ను, ఆదిమధ్యాంతరహితమై, పరిపూర్ణమై శాంతమైనట్టి చిదాకాశమేయైయున్నది. ఇక్కారణమున, శరీరాదివైచిత్ర్యరూపమగు బంధము నశించినవాడవై, నిర్వికారమై నిర్వాణరూపమైనట్టి యథాస్థితమగు బ్రహ్మముయొక్క స్వరూపము గలవాడవై యుండుము.

స్వయం దృశ్యం స్వయం ద్రష్టృ స్వయం చిత్త్వం స్వయం జడమ్
స్వయం కించిన్న కించిచ్చ బ్రహ్మాత్మన్యేవ సంస్థితమ్. 9

వ్యవహారదృష్టిచే బ్రహ్మము స్వయముగనే ద్రష్టృ, దృశ్య చిత్, జడ, పదార్థాది రూపములుగ స్థితినొందియున్నది. కాని, పరమార్థదృష్టిచే నయ్యది పదార్థ రూపముగానిదై అద్వితీయ స్వప్రకాశానందైకరస స్వరూపమగు ఆత్మయందే స్థితినొందియున్నదగుచున్నది.

యథా యత్ర జగత్యేతత్స్వయం బ్రహ్మ ఖమాత్మని
స్వరూపమజహచ్ఛాన్తం యత్ర సంపద్యతే తథా. 10

ఈ బ్రహ్మము ప్రపంచమున నెచట నేవాసనచే నేరూపమును ధరించుచున్నదో, అచట నిజచిదాకాశమందు తనయథార్థ సచ్చిత్స్వరూపమును త్యజింపకయే ఆ యా రూపముతోడ వర్తించుచున్నది.

బ్రహ్మ దృశ్యమితి ద్వైతం న కదాచిద్యథా స్థితమ్
ఏకత్వమేతయోర్విద్ధి శూన్యత్వాకాశయోరివ. 11

ఓ రామచంద్రా! 'బ్రహ్మముమాయచే దృశ్యజగత్తుగ నగుచున్నది' - అనుదానిచేద్వైతము కలదని నెపుడును తలంపరాదు. ఏలయనిన శుక్తి రజతముగ భాసించినను వాస్తవముగ తననిర్వికారరూపముతోనే స్థితినొందియున్నట్లు బ్రహ్మమున్ను దృశ్యముగ భాసించినను తనపారమార్థిక నిర్వికారరూపముతోనే సదా వెలయుచున్నది. కావున, ఆకాశశూన్యత్వములవలె, ఈ బ్రహ్మ, దృశ్యములకు ఏకత్వమే కలదని యెఱుగుము

దృశ్యమేవ పరం బ్రహ్మ పరం బ్రహ్మైవ దృశ్యతా
ఏతన్న శాన్తం నాశాన్తం నానాకారం న చాకృతిః. 12

దృశ్యమే పరబ్రహ్మము, పరబ్రహ్మమే దృశ్యము, ఈ బ్రహ్మము శాంతముకాదు, అశాంతముకాదు; ఆకారవంతముకాదు? ఆకారరహితముకాదు, ఏలయనగా శాంత, అశాంతాది పదములు సాపేక్షములైయున్నవి.

యాదృగ్ప్రబోధే స్వప్నాదిస్తాదృగ్దేహో నిరాకృతిః
సంవిన్మాత్రాత్మ ప్రతిఘః స్వానుభూతోఽవ్యసన్మయః. 13

మేల్కొనిన పిదప స్వప్నపదార్థములెట్లు నిరాకారములుగ భాసించునో, అట్లే, జ్ఞాన ప్రాప్త్యనంతర మీ జాగ్రద్దేహమున్ను నిరాకారముగ భాసించును. స్వప్నమందు చిన్మాత్రాత్మ సాకారముగ స్వయముగ ననుభూతమైనను, వాస్తవముగ నట్టి యా యాకారాదు లన్నియును, అసన్మయములె యైయున్న విగదా! అట్లే జాగ్రత్తునందును, ఈ దేహాద్యాకారములన్నియు అనుభూతములైనను అసన్మయములేయై యొప్పుచున్నవి.

సంవిన్మయో యథా జన్తుర్నిద్రాత్మాస్తే జడోఽభవన్
జడీభూతా తథైషాస్తే సంవిత్స్థావరనామికా. 14

చిన్మయుఁడైనను జీవుఁడు నిదురయందు జడుఁడగునట్లు స్థావరదశను బొందిన యీ చైతన్యమున్ను జడీభూతమై యొప్పుచున్నది.

స్థావరత్వాజ్జడాచ్చిత్త్వం జంగమాత్మప్రయాతి చిత్
జీవః సుషుప్త్యాత్మా స్వప్నం జాగ్రచ్చైవ జగచ్ఛ్రుతైః. 15

సుషుప్తిదశనుండి జీవుఁడు స్వప్న, జాగ్రత్తుల కేతెంచుచు అనేక జగత్తులఁ గూర్చిన కల్పనలతోఁ గూడియుండునట్లు, చైతన్యమున్ను జడీభూతమగు స్థావరదశనుండి జంగమ చేతన దశను బొందుచున్నది.

ఆమోక్షమేషా జీవస్య భువ్యమ్బ్వన్యనిలేఽనలే
ఖే ఖాత్మభిర్జగల్లక్షైః స్వప్నాభైర్భాసతే స్థితిః. 16

ముక్తి కలుగునంతవఱకును జీవున కిప్పుడివి, జల, అగ్ని, వాయు, ఆకాశములందు వాస్తవముగ స్వప్నతుల్యములై, శూన్యరూపములైనట్టి యనేక జగత్తులయొక్క స్థితి భాసించును.

చిచ్చినోతి తథా జాడ్యం నరో నిద్రాస్థితిర్యథా
చినోతి జడతాం చిత్త్వం న నామ జడతావశాత్. 17

మనుజుఁడు నిద్రాస్థితియొక్క అధ్యాసము గావించునట్లు, చైతన్యమున్ను జడత్వము యొక్క అధ్యాసమును గావించుచున్నది. అధ్యస్తమగు జడత్వముయొక్క వశముచేతనే అదియట్లు జడత్వమును ధరించియున్నట్లు తోఁచుచున్నదేగాని వాస్తవముగ నది జడత్వము నెప్పుడును ధరించుటలేదు.

చితా వేదన వేత్తారం స్థావరం క్రియతే వపుః
చితా వేదన వేత్తారం జంగమం క్రియతే వపుః. 18

జడత్వమనుభవించు జీవునిఁగూర్చి యా చైతన్యము స్థావరశరీరమును నిర్మించుచున్నది అట్లే చేతనత్వ మనుభవించు జీవునిఁగూర్చి జంగమశరీరమును నిర్మించుచున్నది.

యథా పుంసో నఖాః పాదాదేకమేవ శరీరకమ్
తథైకమేవాప్రతిఘం చితః స్థావరజంగమమ్. 19

మనుజునకు చేతనములగు హస్తపాదాదులు, అచేతనములగు నఖ, కేశాదులు, అన్నియు ఏకశరీరరూపమై యెట్లున్నవో, అట్లే నిరాకారమగు చైతన్యమునకున్ను స్వావ్యస్తములగు జడ, చేతన రూపములైన సమస్తస్థావరజంగమములున్ను ఏకశరీరరూపమై (అవయవభూతములై) యున్నవి.

> ఆదిసర్గే స్వప్న ఇవ యత్ప్రథామాగతం స్థితమ్
> చితో రూపం జగదితి తత్తథైవాన్త ఉచ్యతే. 20
>
> తచ్చైవాప్రతిఘం శాన్తం యథాస్థితమవస్థితమ్
> న ప్రథామాగతం కించిన్నాసీదప్రథితం హితమ్. 21

బ్రహ్మదేవునియొక్క ప్రథమసృష్టి హేతువగు సంకల్పమున చిద్రూపము స్వప్నమువలె స్థావర, జంగమాత్మకమగు జగత్తు నే ప్రకారముగ వ్యక్తత్వమును బొందునో, ఆ ప్రకారముగనే ఇది నేటివఱకును స్థితినొందియున్నది. ఇట్లు చిరకాలమువఱకును జడరూపముతో నున్నప్పటికిని వాస్తవముగ నది చిన్మయమే యగుటచే సత్యమై, శాంతమై, నిరాకారమైనట్టి బ్రహ్మమేయై వెలయుచున్నది — ఈ ప్రకారముగ (అధ్యస్త) జగత్తుయొక్క అపవాదముద్వారా సృష్టియొక్క నాశము చెప్పఁబడుచున్నది. ఏలయనిన, పరమార్థమున, ఈ జగత్తెపుడును లేకయేయున్నది. గనుక నది యొకింతైనను వ్యక్తత్వమును బొందకయేయున్నదనుట హితమైయున్నది.

> అయమాదిరయం చాన్తం సర్గస్యేత్యవభాసతే
> చితః సుఘననిద్రాయాః సుషుప్తస్వప్నకోష్ఠతః. 22

స్వప్నముయొక్క ఆది, అంతములు నిద్రాకోష్ఠమందే కల్పింపఁబడుచున్నవిగాని జాగ్రత్కోష్ఠమందెట్లు కాదో, కావుననే యెటు మిథ్యమైయున్నవో, అట్లే త్రికాలములందును లేనిదే యగు ఈ జగత్తుయొక్క ఆద్యంతములగూర్చిన కల్పనయు మిథ్యయే యైయున్నది.

> స్థిత ఏకో హ్యనాద్యన్తః పరమార్థఘనో యతః
> ప్రలయస్థితిసర్గాణాం న నామాప్యస్తి మాం ప్రతి. 23

ఆద్యంతరహితమై, పరమాత్మఘనమైనట్టి చైతన్యమొకటితప్ప మఱియేద్దియు లేదందున సృష్టి, స్థితి, లయములయొక్క నామమైనను నా (ప్రబుద్ధుని) దృష్టియందు లేకయున్నది. (ఇఁక వాని రూపము విషయమై వేఱు చెప్పవలెనా, అని భావము.)

> ప్రలయస్థితిసర్గాది దృశ్యమానం న విద్యతే
> ఏతన్న చాత్మనశ్చాన్యచ్చిత్రే చిత్రవధూర్యథా. 24

ఈ సృష్టి, స్థితి, లయములు దృశ్యమానములైనప్పటికిని — చిత్రమందలి స్త్రీ చిత్రము కంటె వేఱుకానట్లు — ఆత్మకంటె వేఱుగాకయేయున్నవి.

> కర్తృవ్యచిత్రసేనాస్మాద్యథా చిత్రాన్న భిద్యతే
> నానాఽనానైవ ప్రతిభా చిత్తత్త్వే సర్గతా తథా. 25

చిత్రకారునిచే చిత్రింపఁబడనున్న చిత్రసేన యాతని బుద్ధియందున్న చిత్రముకంటె నెట్లు వేఱుకాదో, అట్లే సాకారమై, నానారూపయుతమైనట్టి సృష్టియు స్రష్ట (సృజించువానిని) యొక్క చిత్తముకంటె వేఱుకాదు. కావున, ఈ జగత్తంతయు అద్వైతరూపమేయైయున్నది.

విభాగహీనయా ప్యేష భాగశ్చిద్ఘననిద్రయా
సుషుప్తాన్ముచ్యతే మోక్ష ఇతి స్వప్నస్తు చిత్తకమ్. 26

విభాగరహితమైనను చిద్ఘన - నిద్రయను అవిద్య సుషుప్తియను ఆవరణముచే వాస్తవ స్వరూపభూతమగు మోక్షమను ప్రసిద్ధమైన భాగమును మఱుఁగుపఱచి, పైఁగా చిత్తరూపమయి యీ 'జాగ్రత్. స్వప్న'భాగమును దర్శింపఁజేయుచున్నది.

ప్రలయోఽయమియం సృష్టిరయం స్వప్నో ఘనస్త్వయమ్
భానోఽప్రతిఘరూపస్య చిత్ప్రహ్రసరుచేరితి. 27

'ఇది సృష్టి. ఇది ప్రళయము, ఇది స్వప్నము, ఇది జాగ్రత్తు' అనునవియన్నియును నిరాకారమై, ప్రజ్ఞానఘనమై, అనేకచిద్రూప కిరణసహితమైనట్టి ఆత్మయను మహాసూర్యునియొక్క ప్రకాశభేదములైయున్నవి.

చిన్నిద్రాయాః స్వప్నమయో భాగశ్చిత్తముదాహృతమ్
తదేవ ముచ్యతే భూతం జీవో దేవాసురాదిదృక్. 28

చైతన్యమను నిద్రయొక్క వాసనారూపమగు స్వప్నభాగము ఉపాధ్యంశ ప్రాధాన్యముచే చిత్తమనియు, చిదంశప్రాధాన్యముచే జీవుఁడనియుఁ జెప్పఁబడినది. ఆ జీవుఁడే దేవ మనుష్యాది అధికారిశరీరములను బొంది తత్త్వజ్ఞానముచే అవిద్యను బారద్రోలి ముక్తుఁడగుచున్నాఁడు.

ఏష ఏవ పరిజ్ఞాతః సుషుప్తిర్భవతి స్వయమ్
యదా తదా మోక్ష ఇతి ప్రోచ్యతే మోక్షకాఙ్క్షిభిః. 29

ఈ జీవుఁడే (చతుర్థ, పంచమభూమికలందు) ఎపుడెఱుఁగఁబడుచున్నాడో, అపుడు (షష్ఠభూమికయందు) స్వయముగనే సుషుప్తిరూపుఁడగుచున్నాఁడు. మఱియు నపుడాతఁడు(సప్తమ భూమికయందు) మోక్షరూపుఁడగుచున్నాఁడనియు మోక్షమునుగోరువారిచే జెప్పఁబడుచున్నది.

శ్రీరామ ఉవాచః—

చిత్తం దేవాసురాద్యాత్మ చిన్నిద్రాస్వాత్మదర్శనమ్
కియత్ప్రమాణం భగవన్కథమస్యోదరే జగత్. 30

శ్రీరాముఁడుః— మహాత్మా ! చిత్తము దేవ, అసురాదిభేదములచే నెంతపరిణామము గల్గియున్నది ? దానిస్థితి యెట్టిది ? చైతన్యమను నిద్రయు, అనిద్రయందున్న యీ జగత్తున్ను నెంత పరిమితి గల్గియున్నవి. అవి యెంతకాలమువఱకుండును ? చైతన్య-నిద్రయొక్క యుదరమున యీ జగత్తెట్లు స్థితిగల్గియున్నది?

శ్రీవసిష్ఠ ఉవాచః—

విద్ధి చిత్తం నరం దేవమసురం స్థావరం స్త్రియమ్
నాగం నగం పిశాచాది ఖగకీటాదిరాక్షసమ్. 31

శ్రీ వసిష్ఠుఁడు:— ఓ రామచంద్రా? మనుష్య, దేవ, అసుర, స్థావర, స్త్రీ నాగ, పర్వత, పిశాచ, రాక్షస, పక్షి, కీటాదులన్నియును చిత్తమనియే నీవెఱుఁగుము.

ప్రమాణం తస్య చానన్తం విద్ధి తదత్ర రేణుకామ్
ఆబ్రహ్మస్తమ్భపర్యన్తం జగద్యాతి సహస్రశః. 82

మఱియు, ఆ చిత్తముయొక్క పరిమాణము అనంతమనియు నెఱుఁగుము. అద్దానియందు బ్రహ్మాదిస్తంబపర్యంతముగల యిట్టి జగత్తులువేలకొలదిఁగూడ పరమాణురూపత్వమునే పొందు చున్నవి.

యదేతదాదిత్యపథాదూర్ధ్వం సంయాతి వేదనమ్
ఏతచ్చిత్తం విద్ధి తతమేతదపర్యన్తామలాకృతి. 83

ఊర్ధ్వభాగమునకు దృష్టిని బ్రసరింప, సూర్యమార్గముకంటెను నూర్ధ్వప్రదేశమునకు ఏ నేత్రజ్ఞానము పోవుచున్నదో, అది ఇంత యనంత పరిమాణముగల నిర్మలాకారయుక్తమగు చిత్తమేయైయున్నది. ఇట్లది యతివిశాలమైయుండుట సర్వానుభవసిద్ధమైయున్నది

ఏతదుగ్రం చితో రూపమస్యాస్తత్ప్రవనర్దయః
యదాయాన్తి తదా సర్గశ్చిత్తాదాగత ఉచ్యతే. 84

దుస్సహసంసార దుఃఖములచే, బరిపూర్ణమగుటచే నిది భయంకరమై యొప్పుచున్నది. యీ చిత్తము వాస్తవముగ చైతన్యముయొక్కయే రూపమైయున్నది. దీని సమష్టిరూపమందెపుడు బ్రహ్మాండకల్పనవలన లోకసమృద్ధులు వచ్చిచేరుచున్నవో, అపుడు చిత్తమునుండి సృష్టియేతెంచిన దని చెప్పఁబడుచున్నది.

చిత్తమేవ విదుర్జీవం తదాద్యన్తవివర్జితమ్
ఖం ఘటేష్వివ దేహేషు చాస్తే నాస్తే తదిచ్ఛయా. 85

ఆద్యంతరహితమగు యీ చిత్తమునే జీవుఁడందురు. ఘటములం దాకాశమునలె, నది సర్వదేహములందును గలదు. బ్రహ్మదేవుని యిచ్ఛచే వ్యష్టిరూపముతోటి దేహమునుండి వెడలుటచే నది లేకనుయున్నది.

నిమ్నోన్నతాన్ప్రవాహోభాగాన్ గృహ్ణాతి చ జహాతి చ
సరిత్ప్రవాహోఽఙ్గ యథా శరీరాణి తథా మనః. 86

ప్రియుఁడవగు రామచంద్రా! నదీప్రవాహము నిమ్నోన్నతములగు భూభాగములనెట్లు గ్రహించుచు, త్యజించుచున్నదో, అట్లే మనస్సున్ను, ఉత్తమ అధమశరీరములను గ్రహించుచు, త్యజించుచున్నది.

అస్య త్వాత్మపరిజ్ఞానాదేష దేహాదిసంభ్రమః
శామ్యత్యాశ్వవబోధేన మరువాః ప్రత్యయో యథా. 87

మరుభూమియొక్క వాస్తవజ్ఞానముచే మృగతృష్ణాజలజ్ఞానమునశించునట్లు, ఈ చిత్తమును ఆత్మరూపము (చిత్స్వరూపము)గ నెఱుఁగుటచే, ఈదేహాదిభ్రమ శీఘ్రముగ నశించుచున్నది.

జగత్యన్తరజుర్యత్ర తత్ప్రమాణం హి చేతనః
సదేవ చ పుమాంస్తస్మాత్పుంసామన్తఃస్థితం జగత్, 88

జగత్తును తన గర్భమందు ధరించునట్టిదియైన యీ చిత్తముయొక్క పరిమాణము అణు రూపమేయైయున్నది. అట్టి అణుస్వరూపముగు చిత్తమే జీవుఁడు. కాఁబట్టి జీవుని యాభ్యంతర మున జగత్తు వెలయుచున్నది.

యావత్కించిదిదం దృశ్యం తచ్చిత్తం స్వప్నభూమ్ష్వివ
తదేవ చ పుమాంస్తస్మాత్కో భేదో జగదాత్మనోః. 39

స్వప్నభూములందువలె ఈ కానుపించు దృశ్యమంతయు చిత్తమేయైయున్నది. ఆ చిత్తమే జీవుఁడు. కాఁబట్టి జగజ్జీవుల కేభేదమున్ను లేదు.

చిదేవాయం పదార్థౌఘో నాస్త్యన్యస్మిన్పదార్థతా
వ్యతిరిక్తా స్వప్న ఇవ హేమ్నీవ కటకాదితా. 40

చైతన్యమునకు అన్యమైనదానియందు సత్తలేమి, పదార్థత్వమే యట సంభవింపదు. గనుక ఈ పదార్థ సమూహమంతయు చిత్స్వరూపమే యైయున్నది. స్వప్నమందువలెను, సువర్ణ మందు కటకాద్యాభరణములవలెను, ఈ పదార్థసమూహము చైతన్యముకంటె భిన్నముకాదు.

యథైకదేశే సర్వత్ర స్ఫురన్త్యాపోఽమ్బుధౌ పృథక్
బ్రహ్మణ్యనన్యా నిత్యస్థాశ్చితో దృశ్యాత్మికాస్తథా. 41

సముద్రమందు ఏకరూపమగు జలమున, తరంగ, ఆవర్తాది భిన్న భిన్న రూపములు సర్వత్ర యెట్లు స్ఫురించుచున్నవో. అట్లే చిద్రూపమగు బ్రహ్మమందును తదభిన్నరూపముగ అనేక దృశ్యరూప పదార్థములు స్ఫురించుచున్నవి.

యథా ద్రవత్వమమ్భోధావాపో జఠరకోశగాః
స్ఫురన్త్యేవం విధాఽనన్యాః పదార్థౌఘాస్తథాపరే. 42

సముద్రముయొక్క యుదరమున విద్యమానములగు జల, ద్రవత్వము లెట్లు అభిన్న రూపముగ స్ఫురించుచున్నవో, అట్లే పరమాత్మయందును, పదార్థ సమూహములు చైతన్యము కంటె వేఱుగాక స్ఫురించుచున్నవి,

యథాస్థితం జగచ్ఛాలభఞ్జికాకాశరూపధృక్
చిత్స్తమ్భోయమవస్పన్దః స్థిత ఆద్యన్తవర్జితః. 43

యథారీతి స్థితిగల్గియున్న యీ జగద్రూప ప్రతిమలకు పదార్థశూన్యమై, ఆద్యంత వర్జితమైనట్టి యీ చైతన్యమనుస్తంభమే యాధారభూతమై నిశ్చలముగ స్థితినొందియున్నది.

యథాస్థితమిదం విశ్వం సంవిద్వ్యోమ్ని వ్యవస్థితమ్
స్వరూపమత్యజచ్ఛాన్తం స్వప్నభూమావివాఖిలమ్. 44

యథారీతి స్థితిగల్గియున్న యీ జగత్తంతయును తనకాంత చిత్స్వరూపమును త్యజింపక యే స్వప్నభూమివలె చిదాకాశమున వ్యవస్థితమైయున్నది.

సమతా సత్యతా సత్తా చైకతా నిర్వికారితా
ఆధారాధేయతాన్యోన్యం చైతయోర్విశ్వసంవిదోః. 45

స్తంభ. తద్గతప్రతిమలకువలె, సమత్వము, సత్యత్వము, సత్త, ఏకత్వము, నిర్వికారత్వము, పరస్పర ఆధారాధేయత్వము, అనువీనియందు జగత్, చైతన్యములకు సాదృశ్యముగలదు.

స్వప్నసంకల్పసంసారవరశాపదృశామిహ
సరోబ్ధిసరిదమ్బూనామివాన్యత్వం న వాథవా. 46

స్వప్న, సంకల్ప ప్రపంచములందువలెను, వర, శాపములవలనఁ గలుగు (వరము చేనందికిఁ గల్గిన దేవరూపము, శాపముచే నహుషునకుఁగల్గిన సర్పభావము ఇత్యాది) ప్రతిభాసము లందువలెను సరోవర సముద్ర, నదీజలములందువలెను జగత్, చైతన్యములందు వ్యవహారపమర్థమగు భేదము గలదేగాని పరమార్థముగ భేదములేదు.

శ్రీరామ ఉవాచ:—

వరశాపార్థసంవిత్తౌ కార్యకారణతా కథమ్
ఉపాదానం వినాకార్యం నాస్త్యేవకిల కథ్యతామ్. 47

శ్రీరాముఁడు:— మహాత్మా! వర, శాపములయొక్క సంవిత్తునందు కార్య కారణత్వ మెట్లు సంభవించును? (నందికి మనుష్యశరీరమున దేవశరీరముయొక్క ఉపాదానమగు చంద్రామృత భాగములేదు అట్లే నహుషునకు దేవశరీరమున సర్పశరీరముయొక్క ఉపాదానమగు (సర్ప) అంగాదులులేవు.) ఉపాదానకారణములేక ప్రపంచమున నెచటను కార్యము సంభవింపదుగదా. అట్టిచో, ఆ వరశాపాదులందు (దేవ, సర్పశరీరాది) తత్తత్కార్యము లెట్లు సిద్ధించునో, వచింపవేఁడెద?

శ్రీ వసిష్ఠ ఉవాచ :—

స్వవదాత చిదాకాశ కచనం జగదుచ్యతే
స్ఫురణే పయసామబ్ధావావర్త చలనం యథా. 48

శ్రీ వసిష్ఠుఁడు:— ఓ రామచంద్రా! సముద్రమందు జలముయొక్క స్ఫురణమున తరంగ, ఆవర్తాదుల సంచలనమువలె, తత్వజ్ఞానమువలన అతినిర్మలమగు చిదాకాశముయొక్క సత్యసంకల్పము ననుసరించి గల్గునట్టి స్ఫురణమేదిగలదో, అదియే జగత్తని చెప్పఁబడుచున్నది. (నిరావరణ విజ్ఞానము గల రుద్ర, అగస్త్యాదుల సత్యసంకల్పయుక్తమగు చైతన్యమే యట దేవ, సర్పశరీరాదిరూపములుగ వివర్తభావమును బొందుచున్నదనియు, కావున నట ఉపాదానము యొక్క యావశ్యకతలేదనియు భావము.

ధ్వనన్తోఽబ్ధి జలానీవ భాన్తి భావాశ్చిదాత్మకాః
సంకల్పాదీని నామాని తేషామాహుర్మనీషిణః. 49

సముద్రమందు ధ్వనించు జలమువలె, బ్రహ్మదేవునియొక్క స్వాత్మచైతన్యమున, చిద్రూపములేయగు జగద్భావములు అకస్మాత్తుగ భాసించుచున్నవి. అట్టి భాసనములకే శ్రుతు లును, ఋషులును సంకల్పాది నామములను కల్పించిరి.

కాలేనాభ్యాసయోగేన విచారేణ సమేన చ
జాతేర్వా సాత్త్వికత్వేన సాత్త్వికే నామలాత 50

సమ్యగ్జ్ఞానవతో జ్ఞస్య యథా భూతార్థ దర్శినః
బుద్ధిర్భవతి చిన్మాత్రరూపాద్వైతైక్యవర్జితా. 51

నిరావరణ విజ్ఞాన మయీ చిద్బ్రహ్మరూపిణీ
సంవిత్ప్రకాశ మాత్రైక దేహాదేహావివర్జితా. 52

కాలక్రమమున అభ్యాసయోగముచేతను, తత్త్వవిచారణచేతను, శత్రు మిత్రాదులందలి సమదర్శనముచేతను, లేక దేవాది జాతుల యొక్క నిర్మల సాత్విక భావము యొక్కయుదయము చేతను, సమ్యక్ - జ్ఞానవంతుఁడును, యథార్థతత్త్వదర్శియునగు జ్ఞానియొక్క బుద్ధి ద్వైత, ఏకత్వ వర్జితమైనదియు, చిన్మాత్రరూపమైనదియు, ఆవరణరహితమైనదియు, విజ్ఞానమయమైనదియు చిద్బ్రహ్మరూపమైనదియు కేవలము చిత్ప్రకాశమాత్ర స్వరూపమైనదియు, దేహాదేహవర్జితమైనదియు నగుచున్నది.

సోఽయం పశ్యత్య శేషేణ యావత్సంకల్పమాత్రకమ్
స్వమాత్మకచనం శాన్తమనన్యత్పరమార్థతః. 53

అట్టినిరావరణ జ్ఞానయుక్తుఁడగు మనుజుఁడుదేనిని సంకల్పించునో, అద్దానినంతయు నాతఁడు స్వాత్మయొక్క స్ఫురణముగను, ప్రశాంతరూపముగను, పరమార్థ చిద్రూపముకంటె వేఱు కానిదిగను గాంచును

అస్యా ఇదం హి సంకల్పమాత్రమేవాఖిలం జగత్
యథా సంకల్పనగరం యథాస్వప్న మహాపురమ్. 54

సంకల్పనగరమువలెను, స్వప్నమహాపురమువలెను ఈ జగత్తంతయును నిట్టి శుద్ధ నిరావరణ చైతన్యము (హిరణ్యగర్భుని) యొక్క సంకల్పమాత్రమే యైయున్నది.

ఆత్మాస్వసంకల్పవరః స్వవదాతో యథా యథా
యద్యథా సంకల్పయతి తథా భవతి తస్య తత్. 55

అట్లే శుద్ధాత్ములగు తదితరులున్ను వరాదిరూపములచే దేనినేయేప్రకారముగ సంకల్పించుచుందురో, అది వారికాయావిధముగనే శీఘ్రముగ నగుచున్నది.

సంకల్ప నగరే బాలః శిలాప్రోడ్డీయనం యథా
సత్యం వేత్త్యనుభూయాశు స్వవిధేయనియన్త్రణమ్. 56

స్వసంకల్పాత్మభూతేఽస్మిన్పరమాత్మా జగత్త్రయే
వరశాపాదికం సత్యం వేత్త్యనన్యత్తథాత్మనః. 57

సంకల్పనగరమున బాలుఁడు శిలాదులయొక్క యెగురుటను సత్యముగనే యెఱుఁగుచు, అట్లే శీఘ్రముగ దానిననుభవించుచు. అద్దాని నియమనము తనయధీనమున నెట్లుగల్గియున్నాఁడో, ఆ ప్రకారముగనే స్వసంకల్పభూతమగు యీ త్రైలోక్యమున హిరణ్యగర్భాది నిరావరణ విజ్ఞానాత్ములు వరశాపాది నిజసంకల్పమును తమకంటె అభిన్నముగను సత్యముగను నెఱుఁగుచున్నారు.

స్వసంకల్పపురే తైలం యథా సిద్ధ్యతి సైకతాత్
కల్పనాత్సర్గసంకల్పైర్వరాదీహ తథాత్మనః. 58

స్వసంకల్పపురమున బాలునకు ఇసుకనుండియు, తైలము లభించునట్లు కల్పనాజనితములగు సృష్ట్యాదిసంకల్పములచే బ్రహ్మాదులకు వరశాపాదులున్ను నిట సిద్ధించుచున్నవి.

అనిరావరణజ్ఞప్తేర్యతః శాన్తా నభేదధీః
తతః సంకల్పనా ద్వైతా ద్వరాద్యస్య న సిద్ధ్యతి. 59

ఆవరణసహిత జ్ఞానముకలవానికి భేదబుద్ధినశింపనందున ద్వైతభావనతోఁ గూడి యుండుటఁబట్టి అట్టి యా ద్వైతసంకల్పముచే వరాదులతనికి సిద్ధింపనేరవు.

యా యథా కలనా రూఢా తావత్సాద్యాపి సంస్థితా
న పరావర్తితా యావద్యత్నాత్కల్పనయాన్యయా. 60

నిరావరణ జ్ఞానయుక్తులకు బ్రహ్మాదుల యొక్క దృఢకల్పన పూర్వ మెట్లుండియుండెనో ఇపుడును నట్లేయున్నది. మఱియు అట్టిదియేయగు మఱియొక దృఢకల్పనచే బ్రయత్న పూర్వకముగ మఱియొక విధముగఁ గావింపఁబడనంతవఱకును నది యట్లేయుండును.

బ్రహ్మణ్యవయవోన్ముక్తేద్విత్వైకత్వే తథా స్థిరే
యథా సావయవే తత్త్వే విచిత్రావయవక్రమః. 61

అవయవసహితమగు పదార్థమందు విచిత్రమైనట్టి అవయవ క్రమమెట్లు స్థితిగల్గి యున్నదో, అట్లే, అవయవరహితమై, సుస్థిరమైనట్టి బ్రహ్మమందు ద్వైత, ఏకత్వాదులున్ను వరశాపాదులున్ను స్థితిగల్గియున్నవి.

శ్రీరామ ఉవాచ :—

అనిరావరణాజ్ఞానాత్కేవలం ధర్మచారిణః
శాపాదీన్సంప్రయచ్ఛన్తి యథా బ్రహ్మంస్తథా వద. 62

శ్రీరాముఁడు:— మహాత్మా! ఆవరణసహిత జ్ఞానము గలవారును కేవలము తపోధర్మాదినిరతులునగు మనుజులు వరశాపాదుల నెట్లొసంగఁ గల్గుచున్నారో, అవియెట్లు సత్యములగుచున్నవో, వచింపవేడెద.

శ్రీవసిష్ఠ ఉవాచ : —

సంకల్పయతి యన్నామ సర్గాదౌ బ్రహ్మ బ్రహ్మణి
తత్తదేవానుభవతి యస్మాత్తత్రాస్తి నేతరత్. 63

శ్రీవసిష్ఠుఁడు:— ఓ రామచంద్రా! సృష్ట్యాదియందు చిద్రూపమగు బ్రహ్మ స్వరూపమున బ్రహ్మదేవుఁడు 'తపోధర్మాదులచే వరశాపాదులు సత్యములగుగాక !' అనుదేనిని సంకల్పించుచున్నాడో దానిని ఆత్మయట్లే యనుభవించుచున్నది. అట దానిప్రతిబంధక మేమియునులేదు.

బ్రహ్మ వేత్తి యదాత్మానం స బ్రహ్మాయం ప్రజాపతిః
స చ నో బ్రహ్మణో భిన్నం ద్రవత్వమివ వారిణః. 64

ఆ ప్రజాపతియగు బ్రహ్మదేవుఁడు ఆత్మరూపమైన సత్యమగు బ్రహ్మము నెఱుఁగుచున్నాఁడు. గావున నాతఁడు సత్యసంకల్ప యుక్తుడై వెలయుచున్నాఁడు. కాని ద్రవత్వము జలముకంటె వేఱుకానట్లు, అతఁడు వాస్తవముగ ఆ బ్రహ్మముకంటె వేఱుకాఁడు.

సంకల్పయతి యన్నామ ప్రథమోఽసౌ ప్రజాపతిః
త త్తదేవాశు భవతి తస్యేదం కల్పనం జగత్. 65

కాఁబట్టి, ఈ ప్రథమ ప్రజాపతియగు బ్రహ్మదేవుఁడు దేనినెట్లుసంకల్పించునో అది యట్లే శీఘ్రముగ నగుచున్నది. ఈ జగత్తు అతనికల్పనయే యైయున్నది.

నిరాధారం నిరాలమ్బం వ్యోమాత్మ వ్యోమ్ని భాసతే
దుర్దృష్టేరివ కేశోణ్డ్రం దృష్టముక్తావలీవ చ. 66

దోషయుక్తమగు దృష్టిగలవానికి ఆకసమున కేశములు, ముత్యముల సమూహము భాసించునట్లు, నిరాధారమై, నిరాలంబమైనట్టి చిదాకాశమే చిదాకాశమున జగదాకారముగ భాసించుచున్నది.

సంకల్పితాః ప్రజాస్తేన ధర్మో దానం తపో గుణాః
వేదాః శాస్త్రాణి భూతాని పఞ్చ జ్ఞానోపదేశనాః. 67

ఆ ప్రజాపతియే ప్రజలను, ధర్మమును, దానమును, తపస్సును, సౌశీల్యాది గుణములను, చతుర్వేదములను, షట్ఛాస్త్రములను, సమస్తభూతములను, వేద, సాంఖ్య, యోగ, పశుపతి, వైష్ణవములను పంచ జ్ఞానోపదేశకమతములను సంకల్పించెను.

తపస్వినోఽథ వాదైశ్చ యద్బ్రూయురవిలమ్బితమ్
యద్యద్వేదవిద స్తత్స్యాదితి తేనాథ కల్పితమ్. 68

పిమ్మట నాతఁడు 'వేదవేత్తలగు తాపసులు వాదములతోగాని లేక సహజ వృత్తితో గాని యేది యేది చెప్పుదురో, అదియది తప్పక యగుగాక !' అనియును సంకల్పించెను.

ఇదం చిద్బ్రహ్మచ్ఛిద్రం ఖం వాయు శ్చేష్టాగ్నిరుష్ణతా
ద్రవోఽమ్బుః కఠినం భూమిరితి తేనాథ కల్పితాః. 69

ఈ చిద్రూపమగు బ్రహ్మము ఛిద్రస్వభావయుక్తమగు ఆకాశమగుగాక ! చలన స్వభావయుక్తమగు వాయువగుగాక ! ఉష్ణత్వస్వభావయుక్తమగు అగ్నియగుగాక ! ద్రవత్వ స్వభావయుక్తమగు జలమగుగాక ! కఠినత్వ స్వభావయుక్తమగు పృథివియగుగాక ! అను నీ ప్రకారముగ సమస్తపదార్థములయొక్క స్వభావములున్ను, ఆ బ్రహ్మదేవునిచే గల్పింపఁబడినవి.

చిద్ధాతురీదృశో వాసౌ యద్యత్థాత్మాపి చేతతి
త త్తథానుభవత్యాశు త్వమహం స ఇవాఖిలమ్. 70

ఈ ప్రకారమగు సమస్తకల్పనయు ప్రజాపతి వేషధారియగు చైతన్యము యొక్కయే యైయున్నది. ఆ చిదాకాశము దేనిదేనిని కల్పించునో, దాని దాని నంతయు నీవలెను, నావలెను ఇతరునివలెను శీఘ్రముగ ననుభవించుచున్నది.

యద్యథా వేత్తి చిద్వ్యోమ తత్తథా తద్భవత్యలమ్
స్వప్నే త్వమహమాదీవ సదాత్మాప్యసదాత్మకమ్. 71

స్వప్నమందు నీవు, నేను మున్నగువారము, పదార్థములను, అసద్రూపములైనను నెట్లు సద్రూపములుగ నెఱుఁగుచున్నామో, అట్లె చిదాకాశ మేవస్తువు నేరీతియెఱుఁగుచున్నదో, ఆ రీతిగనే పూర్ణముగ నగుచున్నది.

శిలానృతం యథా సత్యం సంకల్పనగరే తథా
జగత్సంకల్పనగరే సత్యం బ్రహ్మణ ఈప్సితమ్. 72

సంకల్పనగరమున శిలయొక్క నృత్యమున్ను సత్యముగనేభాసించునట్లు, జగత్తును సంకల్పనగరమున బ్రహ్మదేవునియొక్క అధికారప్రారబ్ధభోగముకొఱకైనట్టి యిచ్ఛయు సత్యముగనే భాసించుచున్నది.

చిత్స్వభావేన శుద్ధేన యద్బుద్ధం యచ్చ యాదృశమ్
తదశుద్ధోఽన్యథా కర్తుం న శక్తః కీటకో యథా. 73

శుద్ధచిత్స్వభావము దేనినేరీతి యెఱుఁగునో. దానిని అశుద్ధచిత్స్వభావము కీటమువలె మఱియొకవిధముగఁ జేయనశక్యమైయుండును.

అత్యన్తం బహులం సంవిత్పశ్యతీతరదల్పకమ్
స్వప్నే జాగ్రత్స్వరూపే చ వర్తమానేఽఖిలం చ సత్. 74

అశుద్ధచిత్స్వభావయుతుఁడగు (మాయాగ్రస్తుఁడగు) జీవుఁడు వర్తమాన జాగ్రత్తునందును, స్వప్నమందునుగూడ, అభ్యాసదార్ఢ్యముచే సమస్తజగత్తును సత్యముగనే గాంచుచున్నాఁడు. ఏల యనిన, అస్వతంత్ర్యకల్పనయొక్క యభ్యాసదార్ఢ్యమువలన నాతనికి తద్విరుద్ధకల్పన, గూర్చిన స్వాతంత్ర్యములేకయున్నది. (నేను శృంఖలాబద్ధుఁడనని జాగ్రత్తునందు దృఢముగ ననుభవించు వాఁడు, స్వప్నమందును నట్టి బంధన పారతంత్ర్యమే యనుభవించును గదా!)

సదా చిద్వ్యోమ చిద్వ్యోమ్ని కచదేకమిదం నిజమ్
ద్రష్టృదృశ్యాత్మకం రూపం పశ్యదాభాతి నేతరత్. 75

ఏకమై, సత్యమైనట్టి చిదాకాశమే చిదాకాశమున సదా ద్రష్టృ, దర్శన దృశ్యమగు ఈ త్రిపుటీరూపమును గాంచుచు నిట్లు జగదాకారముగ భాసించుచున్నది. గాని మఱియొకటి యేది యునుగాదు.

ఏకం ద్రష్టా చ దృశ్యం చ చిన్మాత్రః సర్వగం యతః
తస్మాద్యథేష్టం యద్యత్ర దృష్టం తత్తత్ర సత్సదా. 76

ద్రష్టయు, దృశ్యమున్ను ఏకరూపమేయైయున్నవి. ఏలయనిన, ఏకమై, సర్వవ్యాపకమైనట్టి చిత్సత్తచేతనే యవి యుపజీవింపఁబడుచున్నవి కావున చిదాకాశము తన యిచ్ఛచొప్పున నెచట దేనిని గాంచునో, అది యచట సదా సత్యమేయగుచున్నది

వాయ్వబ్ధిగస్పందనవజ్జలాబ్ధిద్రవభావవత్
యథా బ్రహ్మణి బ్రహ్మత్వం తథాజస్యాబ్జజం జగత్. 77

వాయువునకు చలనమున్ను జలమునకు ద్రవత్వమున్ను, బ్రహ్మమునకు జగదాకార వృద్ధిహేతువగు మాయాశక్తిత్వమున్ను నెట్లు, అవయవరూపములైయున్నవో, అట్లే యీ జగత్తున్ను చిద్రూపుఁడగు విరాట్పురుషునియొక్క అవయవమైయున్నది.

బ్రహ్మైవాహం విరాడాత్మా విరాడాత్మాసపుర్జగత్
భేదో న బ్రహ్మజగతోః శూన్యత్వామ్బరయోరివ. 78

ఏలయనిన, విరాట్పురుషునకు 'నేను బ్రహ్మమునే' అను అనుభవము కలదు ఈ జగత్తో. విరాట్టుయొక్క శరీరమైయున్నది కాఁబట్టి, ఆకాశ, శూన్యత్వములకువలె, బ్రహ్మమునకును జగత్తునకును భేదములేదు.

యథా ప్రపాతే పయసో విచిత్రాః కణపఙ్క్తయః
విచిత్రదేశకాలాన్తా నిపతన్త్యుత్పతన్తి చ. 79

నివత్త్యైవైకయా కల్పం మనోబుద్ధ్యాదివర్జితాః
ఆత్మన్యేవాత్మనో భాన్తి తథా యా బ్రహ్మసంవిదః. 80

పర్వతాగ్రమునుండి గంగాదినదీజలధారలు క్రిందఁబడుచోట. జలముయొక్క విచిత్రకణ సమూహములు విచిత్రదేశకాలయుక్తములై పడుచు. లేచుచునెట్లుండునో, మఱియు నొకేధారచే కల్పాంతమువఱకును బడుచు, మనోబుద్ధ్యాదివర్జితములగు అనేక కోట్లజలకణములుగ విభక్తములై తిరిగి ఏకత్వమునుబొందినవై, తమయొక్క యేకమైన గంగాదిప్రవాహరూపముగనే యెట్లు భాసించునో, అట్లే బ్రహ్మసంవిత్తుయొక్క విచిత్రజగద్భేదములను గూర్చియు నెఱుఁగవలయును

తాభిః స్వయం స్వదేహేషు బుద్ధ్యాదిపరికల్పనాః
కృతోర్వీరరీకృతా సర్గశ్రీరద్భిర్ద్రవతా యథా. 81

కాని, రెంటియందును విశేషమేమనఁగా, జలకణములు మనోబుద్ధ్యాదిరహితములై యున్నవి. బ్రహ్మసంవిత్తో, స్వయముగఁ నిజశరీరములందు మనోబుద్ధ్యాదులయొక్క కల్పనను గావించి. తన భోగ్యమగు ఈ సృష్టిని జలముద్రవత్వము నంగీకరించునట్లు అంగీకరించెను.

తదేవం జగదిత్యస్తి దుర్బోధేన మమత్విదమ్
అకారణకమద్వైతమజాతం కర్మ కేవలమ్. 82

మనోబుద్ధ్యాదిజనితమగు అజ్ఞానముయొక్క రూపమైన దుర్బోధచేతనే యీ జగత్తు విద్యమానమైయున్నదగును అట్టి దుర్బోధరహితుఁడనగు నాయొక్క దృష్టియందో, ఈ జగత్తను కర్మ కేవలము కారణవర్జితమై, అద్వైతరూపమై, త్రికాలములందును జనింపనిదియేయైయున్నది.

అన్తస్థితిః శరీరేఽస్మిన్యాద్వృగ్రూపానుభూయతే
ఉపలాదౌ జడా సత్తా తాదృశీ పరమాత్మనః. 83

ఈశరీరమున మనోబుద్ధ్యాదిరహితమగు మృతావస్థ యెట్టిది యనుభవింపబడుచున్నదో, లేక శిలాదులందు విక్షేపరహితమగు జడసత్త యెట్టిదిగలదో, అట్టిదానివలెనే పరమాత్మయొక్క సత్తయు మనోబుద్ధ్యాదిరహితమై, నిర్విక్షేపమై, సదా చిద్రూపమై యలరుచుండును.

యథైకస్యాం సునిద్రాయాం సుషుప్తస్వప్నకౌ స్థితౌ
తథైతే సర్గసంహారభాసౌ బ్రహ్మణి సంస్థితే. 84

ఒకే నిద్రయందు స్వప్న, సుషుప్తులు రెండును నెట్లు స్థితిగల్గియున్నవో, అట్లే బ్రహ్మమందు సృష్టి, ప్రళయములున్ను స్థితిగల్గియున్నవి.

సుషుప్తస్వప్నయోర్భాతః ప్రకాశతమసీ యథా
ఏకస్యామేవ నిద్రాయాం సర్గాసర్గౌ తథా పరే. 85

ఒకే నిద్రయందు స్వప్న, సుషుప్తిదశలలో ప్రకాశ, అంధకారములెట్లు భాసించునో, అట్లే పరబ్రహ్మమందు సృష్టి, ప్రళయములు రెండును భాసించుచున్నవి

యథా నరోఽనుభవతి నిద్రాయాం దృషదః స్థితిమ్
పరమాత్మానుభవతి తథైతజ్జడసంస్థితిమ్. 86

నిద్రయందు మనుజుఁడెట్లు శిలయొక్క స్థితి ననుభవించుచున్నాఁడో, అట్లే పరమాత్మయు ఈ జడపదార్థములయొక్క స్థితి ననుభవించుచున్నాఁడు.

అబుద్ధస్యాథవాబ్దులాయా వాతాద్యస్పర్శనే సతి
యోఽన్యచిత్తస్యానుభవో దృషదాదౌ న ఆత్మనః. 87

మఱియొకచోట సంలగ్నమైనట్టి చిత్తముగల మనుజునియొక్క బొటనవ్రేలును గాని, లేక, తక్కిన వ్రేళ్లనుగాని వాయు, ఆతప, ధూళ్యాదులు స్పృశించినను, స్పృశింపనట్లే యాతఁడెట్లనుభవించునో, అట్లే, శిలాదులందు ఆత్మకు జడత్వానుభవము విద్యమానమైయున్నను, అవిద్యమాన ప్రాయమేయగును.

వ్యోమోపలజలాదీనాం యథా దేహానుభూతయః
తథాస్మాకమచిత్తానామద్య నానానుభూతయః. 88

ఆకాశ, శిలా (పృథివీ), జలాదులకు విరాడ్దేహభావముయొక్కగాని, లేక, ఆయా అధిష్ఠాన దేవతల దేహభావముయొక్కగాని యనుభవ మెట్లు కలుగుచున్నదో, అట్లే చిత్తరహితులమగు మాకీసృష్టికాలమున వివిధవిషయములయొక్క యనుభవమున్ను గలుగుచున్నది.

కాలే కల్పేషు భాన్త్యేతా యథాహోరాత్రసంవిదః
తథాఽసంఖ్యాః పరే భాన్తి సర్గసంహారసంవిదః. 89

అఖండకాలమున బ్రహ్మదేవునియొక్క దినభేదరూపములగు కల్పములందు మనకీదినరాత్రులెట్లు భాసించుచున్నవో, అట్లే పరమాత్మయందు అసంఖ్యాతములగు సృష్టి, ప్రళయములున్ను భాసించుచున్నవి.

ఆలోకరూపమననానుభవైషణేచ్ఛా
ముక్తాత్మని స్ఫురతి వారిఘనే స్వభావాత్
ఆవర్తవీచివలయాది యథా తథాయం
శాన్తే పరే స్ఫురతి సంహృతిసర్గపూగః. 90

ఇత్యార్షే శ్రీవాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే ఉత్తరార్ధే బ్రహ్మగీతాసు సర్వం ఖల్విదం బ్రహ్మేతిప్రతిపాదన యోగోపదేశోనామ షడశీత్యధిక శతతమః సర్గః ॥ 186 ॥

ఓరామచంద్రా! జలమాత్రమగు సముద్రమున స్వభావముగనే ఆవర్త, తరంగ ాదులెట్లు స్ఫురించునో, అట్లే విషయములయొక్క దర్శనమున్ను, వానిరూపమున్ను, వాని ... వాని భోగరూపమగు అనుభవమున్ను. వానిఁగూర్చిన రాగమున్ను, వానిఁబొంద నిచ్ఛయు మున్నగునవి యెవ్వియును లేనట్టి శాంతస్వరూపమగు పరమాత్మపదమున సృష్టి, ప్రళయ సమూహము స్వభావముగనే స్ఫురించుచున్నది.

ఇది శ్రీవాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున నుత్తరార్ధమున బ్రహ్మగీతలందు సర్వం ఖల్విదం బ్రహ్మేతి ప్రతిపాదనయోగోపదేశమను నూట యెనుబది యాఱవ సర్గము ॥ 186 ॥

---

## సప్తాశీత్యధిక శతతమః సర్గః

[ సర్వభావస్వభావోఽత్రనియతిశ్చోపవర్ణ్యతే
ఉత్పత్తిర్జీవతాప్రాప్తిహేతునాం బ్రహ్మశుద్ధతా.

సమస్తపదార్థములయొక్క స్వభావమగు నియతియు, జీవత్వప్రాప్తియొక్క హేతువుల యుత్పత్తిస్థానమగు శుద్ధబ్రహ్మరూపత్వమును నిచట వర్ణింపఁబడుచున్నది ]

శ్రీరామ ఉవాచః—

విచిత్రాణామసంఖ్యానాం భావానాం నియతిః కుతః
కథం స్వభావో భావానామేకరూపః స్థితోఽచనః. 1

శ్రీరాముఁడు:- మహాత్మా! అసంఖ్యాతములగు యీవిచిత్రపదార్థములయొక్క నియతి (కార్యకారణభావాది నియమము) యెట్లు సంభవించినది? అగ్న్యాదులయొక్క యుష్ణత్వము వలెను, జలాదులయొక్క ద్రవత్వమువలెను, పదార్థములయొక్క స్వభావము సదా యేకరూపము గను, సుస్థిరముగను, ఏ కారణముచే స్థితినొందియున్నది? ఏలయనిన, స్వప్న మనోరథాది మిథ్యా పదార్థములం దిట్టిదృఢనియతి కానుపించుట లేదుకదా!

సత్స్వసంఖ్యేషు దేవేషు సూర్య ఏవోగ్రభాః కథమ్
దీర్ఘత్వమథ హ్రస్వత్వం దివసానాం తు కిం కృతమ్. 2

అసంఖ్యులగు దేవతలున్నప్పటికిని, అందుసూర్యుఁడే మహాప్రచండప్రకాశయుక్తుఁడై యేల వర్తించుచున్నాఁడు? మఱియు, దిన, రాత్రులయొక్క దీర్ఘత్వహ్రస్వత్వము లెవనిచే గావింపఁబడినవి ?

శ్రీ వసిష్ఠ ఉవాచ:—

కాకతాలీయవద్భానం యత్పురే నియతం స్వతః
యథా స్థితం యథారూపం స్థితే తజ్జగదుచ్యతే. 3

శ్రీవసిష్ఠుఁడు:— ఓ రామచంద్రా! ఆదిసృష్టియందు కాకతాలీయన్యాయముచే బ్రహ్మదేవునకేపదార్థమేయేరీతిగ స్వయముగ భాసించెనో, అది యాప్రకారముగనే అర్థక్రియాదులతోడ నియతమై నేఁటివఱకును స్థితినొందియున్నది. అట్లు నియతమై, కార్యకారణ రూపముతో యథారీతి వర్తించుచున్నదే జగత్తని చెప్పఁబడుచున్నది. కావున, పదార్థములయొక్క అచంచలస్వ[illegible] బ్రహ్మదేవునియొక్క యిచ్ఛయే హేతువైయున్నది.

సర్వశక్తేర్యథా యద్యద్భాతి తత్తత్తథైవ సత్
సంవిత్సారతయా యాయాత్కథం భాతమభాతతామ్. 4

సర్వశక్తిమంతుఁడగు ఈశ్వరునియొక్క సత్యసంకల్పసంవిత్తుచే నేయేపదార్థమేయే ప్రకారముగ సృష్ట్యాదియందు భాసించెనో, అదియది యా ప్రకారముగనే నియతస్వభావరూపత్వము నెట్లు పొందఁగలదు ?

యథా స్థితం యథా భాతి చిత్త్వాద్బ్రహ్మ చిరాయ యత్
తస్య భానమభానాభం నియత్యాభిదమేవ తత్. 5

మాయాశబలితమగు బ్రహ్మమందు యథారీతి స్థితిగల్గియున్న జగత్తు సృష్టికాలమున చిరకాలమువఱకు సద్భాని చైతన్యశక్తిచే భాసించుచు, ప్రళయకాలమున సూక్ష్మత్వమును బొందుటచే భాసింపనిదానివలెనున్నదై వెలయుచున్నది ఈ ప్రకారముగ సర్వవస్తువులయొక్క అర్థక్రియాశక్తి అనాదియే యైయున్నది. అదియే నియతియను పేరుచే జెప్పఁబడుచున్నది.

ఇదమిత్థమిదం చేత్థం సర్వం బ్రహ్మేతి భాతి యత్
తన్నియత్యాభిదం ప్రోక్తం సర్గసంహారరూపధృక్. 6

'ఇది యిట్టిది ఇదియిట్టిది (అగ్ని యుష్ణమైనది జలము శీతలమైనది) అనునీప్రకారముగ సర్వపదార్థరూపముచే నేబ్రహ్మము స్వయముగ భాసించుచున్నదో, అట్టి సృష్టిసంహారరూపధారియగు బ్రహ్మమే నియతియనియుఁ బేర్కొనఁబడుచున్నది.

జాగ్రత్స్వప్నసుషుప్తాఖ్యం యత్స్వతః కచనం చితి
తత్తతోఽనన్యదేకాచ్ఛం ద్రవత్వమివ వారిణి. 7

జాగ్రత్, స్వప్న, సుషుప్తిరూపముతోడ చైతన్యమున స్వయముగ నేస్ఫురణము సంభవించుచున్నదో, అదియంతయు, జలముకంటె ద్రవత్వము వేఱుకానట్లు, నిర్మలమై, ఏకమైనట్టి యా చిద్రూపబ్రహ్మముకంటె వేఱుకాదు (కావుననే నియతియొక్క ప్రతిష్ఠ సిద్ధించుచున్నదనిభావము)

యథా శూన్యత్వమాకాశే కర్పూరే సౌరభం యథా
యథౌష్ణ్యమాతపే సాన్యజ్జాగ్రదాది తథా చితి. 8

ఆకాశమున శూన్యత్వము, కర్పూరమున సుగంధము, ఆతపమున నుష్ణత్వము, ఆయా పదార్థములకంటె నెట్లు వేఱుగాకయున్నవో, అట్లే చైతన్యమున జాగ్రదాద్యవస్థలున్ను నట్టి చైతన్యము కంటె వేఱుగాకయున్నవి.

సర్గప్రలయనామ్న్యైక ప్రవాహో నన్యసత్తయా
చిన్మాత్రగగనాత్మైక బ్రహ్మాత్మన్యేవ సంస్థితమ్. 9

సృష్టి. ప్రళయములు, అనాదిప్రవాహరూపముగ బీజాంకురన్యాయముచే చిన్మాత్రా కాశ స్వరూపమగు ఏకమైన బ్రహ్మమందే, తదభిన్నమైనసత్తతోడ స్థితిగల్గియున్నవి, కావునను నియతమగు అర్థక్రియవానికి సంభవించుచున్నది

సర్గోఽయమితి తద్బుద్ధం క్షణం యత్కచనం చితః
కల్పోఽయమితి తద్బుద్ధం క్షణం యత్కచనం చితః. 10

'ఇది సృష్టి' అను చైతన్యముయొక్క స్ఫురణము దేనినెఱిఁగెనో, అది నియమరూపముతో సృష్టిగ నలరుచున్నది. అట్లే, క్షణకాలమైనప్పటికిని 'ఇది కల్పము' అని చైతన్యముయొక్క స్ఫురణము దేనినెఱిఁగెనో, అది నియమరూపముచే కల్పమగు వెలయుచున్నది. కావున చైతన్యము యొక్క స్ఫురణము ననుసరించియే సర్వనియమవ్యవస్థ వర్తించుచున్నది.

తత్కాలస్తత్క్రియా తత్ఖం దేశద్రవ్యోదయాది తత్
యత్స్వప్న ఇవ చిన్మాత్రకచనం స్వస్వభావతః. 11

స్వప్నమందువలె స్వభావముగనే వర్తించు యే చిన్మాత్రస్ఫురణముగలదో అదియే కాలము, అదియే క్రియ; అదియే యాకాశము, అదియే దేశము, అదియే పదార్థము; ఉదయాదు లదియే; స్వప్నమందు చైతన్యస్ఫురణమే సమస్తమునయి యున్నదిగదా!

రూపాలోకమనస్కార దేశకాలక్రియాది తత్
చిత్త్వం కచతి చిద్వ్యోమ్ని యన్నామానాకృతి స్వతః. 12

అట్లే బాహ్యమందలి రూపాదులు, అభ్యంతరమందలి మనస్సంకల్పాదులు, దేశకాల క్రియాదులు, ఆ చైతన్య - స్ఫురణమే యైయున్నవి. ఈ సమస్త జగద్రూపముచే చైతన్యమే చిదాకాశ మున స్ఫురించుచున్నదగును ఏలయనిన, పదార్థములకు స్వయముగ నేయాకారమున్ను లేదు. ఈ ప్రకారముగ సర్వవస్తుస్వభావమగు నియతియు చిత్ స్ఫురణమేయైయున్నది.

యద్యథా కచితం కాలం యత్కించిత్కల్పితం తథా
తేనైవేయం హి నియతిరిత్యప్యాకాశరూపకమ్. 13

ఏకాలము చైతన్యముచే నెట్లు స్ఫురింపఁజేయఁబడినదో, ఏ పదార్థము చైతన్యముచే నెట్లు కల్పింపఁబడినదో, అట్టి నియతిరూపమంతయును చిదాకాశముయొక్క స్ఫురణమాత్రమే యైయున్నది.

ఆకల్పాఖ్యం నిమేషం యత్క్వచనం చైకరూపకమ్
స్వాభావికాః స్వభావం తం ప్రాహుః ప్రసృతబుద్ధయః. 14

బ్రహ్మముయొక్క నిమిషము మొదలుకొని కల్పమువఱకు నుండునట్టి పదార్థముల గూర్చిన యేకరూపమైన (అగ్నికి నుష్ణత్వము, జలమునకు శీతలత్వము, ఇత్యాది) స్ఫురణ మేదిగలదో, అదియే స్వభావతత్త్వమెఱిగిన విశాలబుద్ధులగు మహనీయులచే స్వభావమని చెప్పఁబడినది.

ఏకస్య సంవిన్మాత్రస్య పదార్థశతతా తథా
యథేదం సంవిదంశస్య రూపం స్వంస్వమనుజ్ఝితః. 15

చైతన్యముయొక్క అంశరూపుడగు ఒకేజీవుఁడు మనుష్య, దేవ, పశు, పక్ష్యాద్యనేకరూపములుగ స్థితినొందియున్నను సర్వానుగతమగు తన చిత్స్వభావము నెట్లు త్యజింపకయుండునో, అట్లే, చిన్మాత్రరూపమగు ఒకే అగ్న్యాది పదార్థము దేశకాలభేదముచే అనేక ప్రకారములుగ స్థితి నొందియున్నను, తనయుష్ణత్వ, ప్రకాశత్వాది స్వభావమును త్యజింపకయే యుండును.

సంవిన్మయే సంవిదో యాః కచన్తీవ పరే తథా
తాస్తేషాం స్వదేహానాం యాసాం సా కలనా కృతా. 16

చిన్మయమగు పరబ్రహ్మమున పృథివీ, జలాది చిదాభాససంవిత్తులు ఏవి స్ఫురించుచున్నవో, స్వదేహప్రాయములగు వృత్తిభేదములందు, ఏ యే వృత్తుల కే యే యాకారకల్పన గావింపఁబడినదో, ఆ యాకారమే యద్దాని స్వభావమగును.

చిదుర్వీ సలిలం తేజః స్పన్దః శూన్యత్వమేవ చ
ప్రత్యేకమాకరస్త్వేషాం తాని స్వప్న ఇవామ్బరమ్. 17

వాస్తవముగ, పృథివీ, జల, అగ్ని, వాయు, ఆకాశములయొక్క పారమార్థికస్వభావము, అధిష్ఠానమగు చిదాకాశమేయైయున్నది. ఆ పృథ్వ్యాదికారణములు ప్రత్యేకముగ తమ తమ సమస్త కార్యములయొక్కయు ఆకరమై (గనియై)యున్నవి. మరల, ఆ పృథ్వ్యాదులన్నింటియొక్క ఆకరమో, స్వప్నముయొక్క ఆకరమువలె చిదాకాశమైయున్నది.

తత్ర సప్రతిఘస్యాస్య కఠినస్యాకరో మహాన్
భూపీఠం జనతాధారో రాజన్రాజేవ రాజతే. 18

ఓ రామచంద్రా! అందు సాకార, కఠినపదార్థములన్నిఁటియొక్క ఆకరమై సర్వజనాధారమైన యీ మహత్తరభూపీఠము రాజువలె జీవనప్రదమై చెన్నొందుచున్నది.

అపామబ్ధిః ప్రధానానాం తేజసామేవ భాస్కరః
స్పన్దస్య పవనో వ్యోమ శూన్యతాయా జగద్గతమ్. 19

అట్లే గంగానదీజలములకు సముద్రమున్ను అగ్న్యాది తేజోమయ పదార్థములకి సూర్యుడున్ను, చలనమునకు వాయువున్ను, శూన్యత్వమునకు ఆకాశమున్ను ఆకరములై యొప్పుచున్నవి. ఈ ప్రకారముగ ఆ పృథ్వ్యాదులు జగత్తునందలి తమ తమ సర్వకార్యములందును అనుగతమైనట్టి స్వభావముగలవైయున్నవి.

పఞ్చానామితి భూతానామాకరత్వేన సంవిదః
పఞ్చతాన్యుచితా బ్రాహ్మః ప్రశ్నః కిం భాస్కరం ప్రతి. 20

ఓ రామచంద్రా! ఈరీతిగ, ఆ పంచభూత - ఆకరముల రూపమున పంచబ్రహ్మ సంబంధ సంవిత్తుచే యుదయించినవగును. గనుక బ్రహ్మమే వాని యన్నింటియందును అనుగతమైనట్టి సత్య్వభావమైయున్నది. అట్టిచో, మరల సూర్యుని విషయమందు నీ ప్రశ్నయేల?

బుధా సంవిచ్చిదిత్యుక్తా సర్వగా సర్వరూపిణీ
సర్వత్ర స్వమహిమ్నైషా సర్వేణై వానుభూయతే. 21

సర్వప్రకాశకమగుటచే సర్వజ్ఞమైనట్టి యే సంవిత్తుచైతన్యమని చెప్పఁబడినదో, అదియే సర్వవ్యాపకమై, సర్వరూపమై స్వప్రకాశత్వరూపమగు (తనమహిమచేతనే సర్వత్ర సర్వస్వభావములకు ఆకరమై పరమనియతియై వెలయుచుండుట విజ్ఞులందఱిచేతను ననుభవింపబడుచున్నది.

బ్రహ్మాత్మా బ్రహ్మబాలోఽయం స్వసంవిత్స్ఫురణామిమామ్
వ్యోమాత్మకామభూనామ్నీం స్ఫారయత్యమ్బరాకృతిః. 22

చిదాకాశరూపుఁడైన యీ చతుర్ముఖ బ్రహ్మయను బాలకుఁడు స్వాత్మసంవిత్-స్ఫురణరూపమైనదియు, ఆకాశమను సూక్ష్మవస్త్రమును ధరించినదియునగు పృథివియను పేరుగలదానిని విస్తరింపఁజేయుచున్నాఁడు.

సా యదైత త్తథైతచ్చ చిరమత్యఃణ సంవిదా
తదా తదఙ్గస్యార్కాదేర్నాతో నోత్పాది చఞ్చలమ్. 23

ఎపుడా మాయాశబలమగు సర్వజ్ఞ - సంవిత్తు చతుర్ముఖబ్రహ్మదేవుని సంవిత్తుతోసహా యీ సమస్త స్థూల, సూక్ష్మ ప్రపంచమును చిరకాలము భక్షించుచున్నదో (తనయందుపసంహరించుకొనుచున్నదో) అపుడిఁక చతుర్ముఖ సంవిత్తును అంగమునకు సూర్యాదుల భ్రమణస్వరూపము ఉత్పన్నము కానేరదు.

సంకల్పపూర్వమశకజాలవద్ధిష్ణ్యచక్రకమ్
ఆవర్తవర్తినా భాతి చిద్వ్యోమేదం చ దృశ్యవత్. 24

సాలెపురుగుచే సంకల్పపూర్వకముగ బాహ్యసాధనముల నపేక్షింపకయే రచింపఁబడు మశక (దోమల) బంధనజాలమువలె (బ్రహ్మదేవుని సంకల్పమాత్రముచే యీ జ్యోతిశ్చక్రము రచింపబడినది. అందు దక్షిణాయణ, ఉత్తరాయణములను ఆవర్తరూపమార్గమందు సంచరించు సూర్యునియొక్క గతిభేదముచే దివసములయొక్క లఘుత్వ. దీర్ఘత్వములు భాసించుచున్నవి. వాస్తవముగఁ చిదాకాశమే యీ సమస్తజ్యోతిశ్చక్రాదిదృశ్యరూపమువలె భాసించుచున్నది.

తత్ర ప్రభాస్వరాః కేచిత్కేచిదవ్యల్పభాస్వరాః
కేచిద్భాభాస్వరా భూతాః పదార్థాశ్చిత్రరూపిణః. 25

ఆ జ్యోతిశ్చక్రమందుఁగొన్ని (సూర్యాదులు) మహాప్రకాశశీలములైయు, కొన్ని (చంద్ర నక్షత్రాదులు) అల్పప్రకాశశీలములైయు, మఱికొన్ని (రాహువుమున్నగునవి) ప్రకాశరహితములైయునున్నవి. ఇట్లాపదార్థములన్నియు చిత్రవిచిత్రములుగ భాసించుచున్నవి.

పదార్థజాతం త్వేతావన్న జాతం న చ దృశ్యతే
జ్ఞస్యాజాతమిదం భాతి ఖమాత్మా స్వప్నదృశ్యవత్. 26

వాస్తవముగ, ఈ పదార్థసమూహమంతయును నుత్పన్నముకానిదై, కానిపింపనిదై యున్నది. జ్ఞాని కీసమస్తమున్ను స్వప్నదృశ్యమువలె అనుత్పన్నముగను, చిదాకాశరూపముగను భాసించును.

చిన్మాత్రమాత్మా సర్వేశః సర్వ ఏవాతి దృశ్యవత్
నశ్యతీవ విదేహే స్వే న చ భాతి న నశ్యతి. 27

సర్వేశ్వరస్వరూపమగు చిన్మాత్రాత్మయే 'నీవు, నేను' ఇత్యాదిరూపమగు ఈ ప్రసిద్ధ దృశ్యమువలె భాసించుచున్నది. మఱియు దేహము నశింప, అయ్యది నశించుచున్నదానివలెను గోచరించుచున్నది. కాని వాస్తవముగనది దృశ్యరూపముగ భాసించుటలేదు, నశించుటలేదు.

స్వప్నదర్శనవద్భాతి యచ్చిద్వ్యోమ చిదమ్బరే
చిద్వ్యోమత్వాదృతే రూపం తదస్య జగతః కుతః. 28

చిదాకాశము చిదాకాశములనే స్వప్నదృశ్యమువలె, ఈ జగదాకారముగ భాసించు చున్నది. ఏలయనిన, చిదాకాశముతప్ప యీ జగత్తునకు మఱియొకరూపమెచట ?

యద్యథా స్ఫురితం తస్య యావత్ప్రత్తం స్ఫురద్వపుః
తత్స్వభావనియత్యాఖ్యైః శబ్దైరిహ నిగద్యతే. 29

ఆ చైతన్యమునకు సృష్ట్యాదియం దే పదార్థ మే ప్రకారముగ స్ఫురించెనో, ఆ ప్రకారము గను, మఱియు నెంతవఱ కాకుటాదిపదార్థములు విద్యమానములైయున్నవో, అంతవఱకును వాని తోడ తాదాత్మ్యమునొంది స్ఫురించినరూపముగలదై యొప్పుచున్నది చైతన్యముయొక్క స్ఫురణమే స్వభావము, నియతి మున్నగు శబ్దములచేఁ జెప్పఁబడుచున్నది.

గగనాఙ్గస్య సత్తాన్తః శబ్దతన్మాత్రకల్పయా
కుశూలబీజాఙ్కురవత్స్థితా వ్యాశాన్తరూపిణీ. 30

ఆ బ్రహ్మసత్త చిదాకాశరూపుఁడగు బ్రహ్మదేవునియొక్క శరీరమున శబ్దతన్మాత్రరూప స్థితిచే ధాన్యపుకొట్టునందలి బీజములందు ఆవిర్భవింపని అంకురశక్తివలె - వాయ్వాదిరూపమగు జగత్తుయొక్క బీజశక్తిగ మహాప్రశాంతముగ స్థితినొందియున్నది.

సంపద్యతే త్వత్ర ఇదమితీయం రచనేహయా
కృతాసౌ ముగ్ధబోధాయ మూర్ఖైర్విరచితా ముధా. 31

ఆ శబ్దతన్మాత్రమునుండి వాయు, అగ్ని, జల, పృథివీరూపమగు భూతభౌతికాత్మకమైన యీ జగత్తు క్రమముగ నుత్పన్నమగుచున్నది. అను ఈ కల్పన, అజ్ఞానులయొక్క తత్త్వబోధ కొఱకై జగద్రచనను ప్రతిపాదించు నిచ్ఛచేతనే శ్రుతులచేతను, మునులచేతను గావింపఁబడినదిగాని, సృష్టి వాస్తవముగ సత్యమని ప్రతిపాదించుటకుఁగాదు. ఈ సృష్టియొక్క సత్యత్వము మూర్ఖుల చేతనే వ్యర్థముగ రచింపఁబడినదగును.

నాస్తమేతీహ నోదేతి తత్కదాచన కించన
శిలాజఠరవచ్ఛాన్తమిదం నిత్యం సదప్యసత్. 32

పరమార్థబ్రహ్మరూప మొకింతైనను నెపుడును నుదయింపదు. అస్తమింపదు, శిలా గర్భమువలె నది నిత్యము శాంతరూపమై వెలయుచుండును కావున ఈ జగత్తంతయు పరమార్థ సత్తచే సత్యమైనను, స్వతః అసత్తైయున్నది.

యథావయవినో నాన్తః సద్దైవావయవాణవః
నాస్తం యాన్తి న చోద్యన్తి జగన్త్యాత్మపదే తథా. 33

అవయవియగు పరమాత్మ యెట్లు అనంతరూపమైయున్నదో, అట్లే యద్దానికంటె వేఱు కానివై. తదవయవప్రాయములుగ నున్నట్టి ఈ యసంఖ్యాతములగు జగద్రూపాణువులున్ను పరమార్థమున అనంతరూపములై వెలయుచు, ఆ పరమాత్మపదమున నెపుడును నుదయింపకయు, అస్తమింపకయు నున్నవి.

బ్రహ్మ వ్యోమ్ని జగద్వ్యోమ వ్యోమ వ్యోమ్నీవ విద్యతే
తత్కథం కిల సంశుద్ధమస్తమాయాత్యుదేతి వా. 34

ఆకాశమున నాకాశమువలె బ్రహ్మమను చిదాకాశమున జగత్తను చిదాకాశము గలదు, ఇట్లు బ్రహ్మసత్తకంటె వేఱుగ జగత్సత్తలేనందుచే జగత్తు శుద్ధబ్రహ్మముగనే పర్యవసించుటఁబట్టి అట్టి శుద్ధచిద్రూపమిఁక నెట్లుదయింపఁగలదు అస్తమింపగలదు ?

తస్యానన్తప్రకాశాత్మ రూపస్యాతతచిన్మణేః
సత్తామాత్రాత్మకచనం యదభిన్నం స్వభావతః. 35
తదాత్మనా స్వయం కించిచ్చేత్యతామివ గచ్ఛతి
అగృహీతాత్మకం సంవిదూహామర్శనసూచకమ్. 36
భావినామార్థకలనైః కించిదూహితరూపకమ్
ఆకాశాదణు శుద్ధం చ సర్వస్మిన్భావిబోధనమ్. 37

అనంతప్రకాశరూపమై సర్వవ్యాపకమైనట్టి చైతన్యమను మణియొక్క సత్తామాత్రము యొక్క నిత్యము స్వభావముగనగు స్ఫురణమేదిగలదో, అది యథార్థరూపముయొక్క విస్మరణముచే స్వయముగ నొకింత విషయాభిముఖమైనదానివలె నగుచున్నది. పిదప, ఆ అజ్ఞానసంవిత్తు అన్యథా భావముచే పరామర్శపూర్వకముగ భావికాలప్రపంచముయొక్క నామ, అర్థకల్పనలతో ఆకాశము కంటెను అతిసూక్ష్మమై, శుద్ధమైనట్టి రూపముగలదై, సర్వపదార్థములఁగూర్చిన భావికాల నామ, రూపములయొక్క పర్యాలోచన చేయుచున్నది

తతః సా పరమా సత్తా సతీ తచ్చేతనోన్ముఖీ
చిన్నామయోగ్యా భవతి కించిల్లభ్యతయా తయా. 38

పిమ్మట, ఆ పరమసత్త అట్లు పర్యాలోచించినదానినిఁ బ్రకాశింపఁజేయుట కభిముఖమై, (చేతయతీతి చిత్ అనునట్లు) ప్రకాశింపఁజేయుటఁబట్టి చైతన్యమను నామమునకు యోగ్యమగు చున్నది.

ఘనసంవేదనాత్పశ్చాద్భావిజీవాదినామికా
సా భవత్యాత్మకలనా యద్భవ త్రీపరం పదమ్. 39

తదుపరి శరీరాదులందలి ఘనీభూతమగు అభిమానముచే, ఆ యాత్మసత్త భావికాల జీవాది సంజ్ఞలు గలదియగుచున్నది. అట్లగుచు, క్రమముగ అధికారిజన్మను బొంది తిరిగి పరమపదమగు బ్రహ్మరూపమగుచున్నది.

గర్భీకృత్య స్థితానాఖ్యా చిదాకాశాపిధానతామ్
సంప్రతి త్వతిశుద్ధస్య పదస్యానన్యరూపిణీ. 40

ఆ యాత్మసత్త జీవదశయందు, చిదాకాశమును గప్పునదియైన అవిద్యను తన గర్భమందు ధరించియుండుచున్నది. కావుననే, అప్రకటితమైన నిర్మలచిద్రూపపరమపదము గల్గి వర్తించుచున్నది. ఇపుడో, జ్ఞానలాభముచే అతిశుద్ధమగు బ్రహ్మముకంటె వేఱుకానిదై నిక్కముగ భాసించుచున్నది.

స్వత్రైకభావనామాత్ర సారసంసరణోన్ముఖీ
తదా వినాభావకృతా అనుతిష్ఠన్తి తామిమాః. 41

అట్టి ఆవృత (జీవ) దశయందు దేహేంద్రియాదులతోటి ఆత్మయొక్క తాదాత్మ్యాధ్యాసముచే నట్టి దేహాదులద్వారా వివిధజన్మలందుఁ దిరుగుట కభిముఖమగుచున్నది. అందుచే నది, శుద్ధస్వరూపముయొక్క వియోగముచే జనించిన మలినకర్మల నాచరించుచున్నది.

శూన్యరూపా స్వసత్తైకా శబ్దాదిగుణగర్భిణీ
చిద్భావనాభిసంపన్నా భవిష్యదభిధార్థకా. 42

ఆ యద్వితీయమగు బ్రహ్మసత్త శబ్దాదిగుణములను దనగర్భమున ధరించినదై సవికల్ప చిద్భావనచే, భావికాల ఆకాశాది పంచభూతముల నామములయొక్క అర్థప్రవృత్తికి కారణభూతమగు సూక్ష్మపంచభూతరూపమగుచున్నది.

అహన్తోదేతి తదను సహ వై కాలసత్తయా
భవిష్యదభిధార్థే తే బీజం ముఖ్యం జగత్స్థితేః 43

ఆ సూక్ష్మభూతరూపమగు బ్రహ్మసత్తనుండి లింగ (సూక్ష్మ) శరీరముయొక్క ప్రాణక్రియచే ప్రేరితమగు కాలసత్తతోసహా అహంకార ముదయించుచున్నది. భావికాల పంచభూతాది పదార్థములను ధరించునట్టి యా అహంకార, కాలసత్తలు రెండును జగత్తుయొక్క స్థితికి ముఖ్య బీజములైయున్నవి.

చితిశక్తేః పరాయాస్తు స్వసంవేదనమాత్రకమ్
జగజ్జాలమసద్రూపం చేతనాత్సదివ స్థితమ్. 44

ఆ పరాచిత్ - శక్తియొక్క నిజస్ఫురణమాత్రమైన యీ అసద్రూపమగు జగత్సమూహము అధిష్ఠానచైతన్యమువలన సత్తువలె స్థితినొందియున్నది.

ఏవం ప్రాయాత్మికా సా చిద్బీజం సంకల్పశాఖినః
అహన్తాం భావయత్యన్తః సైవ వేహ భవతి క్షణాత్. 45

ఈ ప్రకారముగ సంకల్పమను వృక్షమునకు బీజమైనట్టి యా చైతన్యము అహంత్వము (అహంకారము)ను భావించుచు క్షణకాలములో అహంత్వరూపమైపోవుచున్నది.

జీవాభిధానా సైషాద్య భావాభావప్లవభ్రమైః
భ్రమత్యాత్మపదే వీచిరూపైర్వారీవ వారిణి. 46

హిరణ్యగర్భజీవుఁడను పేరుగల యీ చైతన్యమపుడు, ఉత్పత్తి, వినాశములను భ్రమలతో, జలము జలమందు తరంగరూపములతో పరిభ్రమించునట్లు, ఆత్మ (బ్రహ్మ)పదమున పరిభ్రమించుచున్నది.

చిదేవం భావనవశీ వ్యోమతన్మాత్రభావనామ్
స్వతో ఘనీభూయ శనైః ఖతన్మాత్రం ప్రచేతతి. 47

ఇట్లు సూక్ష్మభూతములను భావించు హిరణ్యగర్భరూప చైతన్యము, అపుడు సూక్ష్మాకాశతన్మాత్రభావనను స్వతః ఘనీభూతముగ నొనర్చి మెల్లగ సూలాకాశరూపమును ప్రకటముచేయుచున్నది.

భావినామార్థరూపం తద్బీజం శబ్దౌఘశాఖినః
పదవాక్యప్రమాణాఢ్య వేదార్థాది వికారి చ. 48

ఈ చైతన్యమే భావికాలనామ, అర్థరూపమున్ను, శబ్దసమూహమను వృక్షముయొక్క బీజమున్ను, పద, వాక్య, ప్రమాణములచేఁ బూర్ణములగు వేదశాస్త్రాదుల కాధారభూతమున్ను నయియున్నది.

తస్మాదుదేష్యద్యఖిలా జగచ్ఛ్రీః శబ్దతస్త్వతః
శబ్దౌఘనిర్మితార్థౌఘపరిణామవిసారిణీ. 49

వేదరూపశబ్దముల కాధారభూతమైనట్టి యీ చైతన్యమునుండియే సమస్తజగత్తున్ను నుదయించును. మఱియు నియ్యది శబ్దసమూహముద్వారా పదార్థసమూహమును రచించి తత్పరిణామముచే విస్తారమును బొందునదైయున్నది 'స భూరితి వ్యాహరత్ భువమసృజత' (అచైతన్యము 'భూః' అను శబ్దము నుచ్చరించి భూమిని సృజించెను ) ఇత్యాది శ్రుతివాక్యములఁబట్టి.]

చిదేవం వ్యవసాయా సా జీవశబ్దేన కథ్యతే
భావిశబ్దార్థజాలేన బీజం భూతౌఘశాఖినః. 50

ఈ ప్రకారముగ విచిత్రసంకల్పములఁగావించు ఈ చైతన్యమే జీవుఁడను (హిరణ్యగర్భజీవుఁడను) పేరుచేఁజెప్పఁబడుచున్నది. మఱియు నియ్యది భావికాలశబ్దార్థసమూహముతోడ ప్రాణిసమూహమను వృక్షముయొక్క బీజమై యలరుచున్నది.

చతుర్దశవిధం భూతజాతమావలితామ్బరమ్
జగజ్జఠరకర్త్రౌఘం తస్మాత్సం ప్రసరిష్యతి. 51

ఆకాశమున వ్యాప్తమై, జగత్తుయొక్క గర్భమున వసించునదైనట్టి (పదునాల్గులోకములందలి) పదునాల్గువిధములైన ప్రాణిసమూహము, ఆచైతన్యమునుండియే ప్రసరించును.

అసం(ప్రాప్తాభిధాచారా జీవత్వాచ్చేతనేన చిత్
కాకతాలీయవత్స్పన్దం చిన్మాత్రం చేతతి స్వయమ్. 52

అంతపఱకింకను శబ్దవ్యవహారమున్ను, శరీరాదులతో వ్యవహారమున్ను బొందని యా హిరణ్యగర్భచైతన్యమపుడు, చి(ద్రూపమగుటవలన కాకతాళీయన్యాయముగ (అకస్మాత్తుగ) స్వయముగ స్పంద (చలన) చిన్మాత్రమును కల్పించుచున్నది.

పవనస్కన్ధరూపస్య బీజం త్వక్స్పర్శశాఖినః
సర్వభూత(క్రియాస్పన్దస్తస్మాత్సం(ప్రసరిష్యతి. 53

అట్టి యాచైతన్యము వాయుసమూహముయొక్కయు, త్వక్ (చర్మ)సంబంధమైన స్పర్శమను వృక్షముయొక్కయు బీజమైయున్నది. ఏలయనిన, సమస్త ప్రాణులయొక్క క్రియల సంచలనహేతువగువాయువు అద్దానినుండియే యుత్పన్నమగును.

తత్ర యచ్చిద్విలాసస్య (ప్రకాశానుభవో భవేత్
రూపతన్మాత్రకం తద్వద్భవిష్యదభిధార్థదమ్. 54

అట్లు వాయుసమూహరూపమును బొందిన హిరణ్యగర్భ చైతన్యమున చిద్విలాసమునకు '(ప్రకాశమును'గూర్చిన యనుభవమేది కలుగునో, అది యా(ప్రకారముగనే రూపతన్మాత్రమై, భావికాల 'తేజ' శబ్దార్థమునకు బీజభూతమై యలరును.

(ప్రకాశ చేతనం తేజో న తేజోఽన్యకృతం భవేత్
స్పర్శసంవేదనం స్పర్శో నేతర స్పర్శసంభవః. 55

తేజమందే(ప్రకాశముగలదో, అది చైతన్యముయొక్కయే (ప్రకాశమైయున్నది. గాని మఱి యొకదానిచేఁ గావింపఁబడినదికాదు. అట్లే స్పర్శజ్ఞానమున్ను చైతన్యరూపమేయైయున్నది. తదన్యమగు స్పర్శరూప మెద్దియును సంభవింపనేరదు.

శబ్దసంవేదనం శబ్దః స్వతః ఏవానుభూయతే
ఖంఖేనైవ స్వయం కోశే నాన్యచ్ఛబ్దకృద స్తి హి. 56

ఆకాశకోశమున చైతన్యమే స్వయముగ శబ్దరూపమై శబ్దజ్ఞానము ననుభవించుచున్నది. చైతన్యమున కన్యముగ శబ్దజనకమైన దేదియునులేదు.

కిల తస్యామవస్థాయాం కోఽపరః శబ్దకృద్భవేత్
యథా తథా తదాద్యాపి ద్వైతైక్యస్యాత్యసంభవాత్. 57

సృష్ట్యాదియందు సమష్టిదశయందు చైతన్యమున కన్యమగు శబ్దాదిజనకమెద్దియును నెట్లు సంభవింపఁజాలదో, ఎట్లు చైతన్యమే యపుడు సర్వరూపముగ భాసించుచున్నదో, అట్లే యిపుడు సృష్టిదశయందును, ద్వైత ఏకత్వముల అత్యంత అభావమువలన చైతన్యమే సర్వపదార్థరూపముగ వెలయుచున్నదగును.

ఏవం హి రసతన్మాత్రం గన్ధతన్మాత్రమేవ చ
అసత్యమేవ సదివ స్వప్నాభమివ చేత్యతే. 58

ఆ ప్రకారముగనే, రసతన్మాత్రను, గంధతన్మాత్రనుగూడ, ఆ చైతన్యము వాస్తవముగ నవి స్వప్నమువలె అసత్యములైనప్పటికిని - సత్యరూపములవలెనే కల్పించుచున్నది

తేజః సూర్యాది జృమ్భాభిర్బీజమాలోకశాఖినః
తస్మాద్రూపవిభేదేన సంసారః ప్రసరిష్యతి. 59

తేజోరూపమును బొందిన యా చైతన్యము సూర్యాదుల ప్రకాశమను వృక్షమునకు బీజమైయున్నది. ఏలయనిన, రూపవిభేదముతోడ ప్రపంచమర్దానినుండియే ప్రసరించును.

భవిష్యదబ్ధిస్యాథ ఖతః స్వత ఇవాసతః
స్వదనం తస్య సంఘస్య రసతన్మాత్రముచ్యతే. 60

వికార రహితమగు ఆకాశమునుండి స్వతః నిలత్వాదులు జనించునట్లు, నిర్వికారమగు ఆ తేజోరూప చైతన్యమునుండి యపుడు భావికాల 'జల' శబ్దార్థము జనించుచున్నది. పంచీకృతములగు అన్నపానాదులయొక్క మాదుర్యసంవిత్తు రసతన్మాత్రమని చెప్పఁబడుచున్నది.

భవిష్యద్రూపసంకల్పో నామాసౌ సకలో గణః
సంకల్పాత్మాథ తన్మాత్రం గన్ధాద్యమనుచేతతి. 61

భవిష్యత్పదార్థములఁగూర్చి సంకల్పించువాఁడును, సమస్త కార్యకారణ సముదాయ రూపుఁడును, సంకల్పమయుఁడునగు ఈ హిరణ్యగర్భుఁడను జీవుఁడు ఆ పిమ్మట గంధ తన్మాత్రను కల్పించుచున్నాడు.

భావిభూగోలకత్వేన బీజమాకృతిశాఖినః
సర్వధారాత్మనస్తస్మాత్సంసారః ప్రసరిష్యతి. 62

భావికాల భూగోళాకారమను వృక్షమునకీ చైతన్యమేబీజము ఏలయనిన, సర్వాధార రూపమగు దీనినుండియే పృథివ్యాదిరూపమగు ప్రపంచము జనించును.

అజాత ఏవ సంజాతస్తన్మాత్రాణాం గణస్త్వితి
అనాకారోఽపి సాకారః సంపన్నః కల్పనావశాత్. 63

ఈ రీతిగ ఈ శబ్దాది తన్మాత్ర సమూహమంతయు వాస్తవముగ నుత్పన్నము కాకయే యున్నప్పటికిని, ఉత్పన్నమైన దానివలెనున్నది. మఱియు నిరాకారమైనప్పటికిని, మాయాశబలిత చైతన్యముయొక్క కల్పనావశముచే సాకారమువలె భాసించుచున్నది.

ఏషతన్మాత్రకగణః కాకతాలీయవత్స్వయమ్
రూపం యేన ప్రదేశేన వేత్త్యక్షితి తదుచ్యతే. 64

శబ్దం యేన ప్రదేశేన వేత్తి శ్రోత్రం తదుచ్యతే
స్పర్శం యేన ప్రదేశేన వేత్తితత్తు త్వగిన్ద్రియమ్. 65

రసం యేన ప్రదేశేన వేత్తి తద్రసనేన్ద్రియమ్
గన్ధం యేన ప్రదేశేన వేత్తి ఘ్రాణేన్ద్రియం తు తత్. 66

చైతన్యసహితమగు ఈ తన్మాత్రసమూహము కాకతాళీయముగ నేస్థానమునుండి స్వయముగ రూపము నెఱుఁగుచున్నదో అది నేత్రమనియు, ఏ స్థానమునుండి శబ్దమునెఱుఁగుచున్నదో అది శ్రోత్రమనియు, స్పర్శము నెఱుఁగుచున్నదో అది త్వగింద్రియమనియు, రసము నెఱుఁగుచున్నదో అది జిహ్వయనియు, గంధము నెఱుఁగుచున్నదో, అది ఘ్రాణేంద్రియమనియుఁ జెప్పఁబడుచున్నది.

దిక్కాలభేదాజ్జీవోఽయం నియతామాకృతిం గతః
సర్వేణాఙ్గేన నో సర్వం వేత్త్యసర్వాత్మతావశాత్. 67

పిమ్మట నియతమగు ఆకృతిఁబొందిన యీ జీవుఁడు దిక్కులు కాలము మున్నగు భేదములను గల్పించుచున్నాఁడు, మఱియు వ్యష్టిభావమును బొందిన యాతఁడు అసర్వరూపత్వదోషముచే నేత్ర శ్రోత్రాది సర్వాంగములచే రసగంధాది సర్వమును నెఱుఁగుటలేదు. అట్లే సమస్తశరీరములచే సమస్తభోగ్యమును నెఱుఁగుటలేదు

ఇతికలనమనన్తమాత్మనో న్తర్గతమనుమేయమనన్యదాత్మభూతమ్
న తదుదయముపైతి నాస్తమేతి స్థితముపలోదరవద్ఘనం సుమౌనమ్. 68

ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు
నిర్వాణప్రకరణే ఉత్తరార్ధే జీవత్వసంస్థితిప్రతిపాదనం
నామ సప్తాశీత్యధికశతతమః సర్గః ॥ 187 ॥

ఓ రామచంద్రా! ఈ ప్రకారముగనే ప్రతిజీవుని ఆత్మయందును అనంతమైన జగత్తుయొక్క కల్పన(గూర్చి (చెప్పకపోయినను) యూహింపవలయును. ఆ యనంతమగు జగత్తు ఆత్మకంటె వేఱుగాకయున్నదై, ఆత్మభూతమై యొప్పుచున్నది. కాఁబట్టి యది పరమార్థమున నుదయించుటలేదు. అస్తమించు (నశించు)ట లేదు. శిలయొక్క యుదరమువలె సచ్చిదానందైకఘనమై మౌనముగనే స్థితినొందియున్నది.

ఇది శ్రీ వాసిష్ఠతాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున నుత్తరార్ధమున జీవత్వసంస్థితి ప్రతిపాదనమను నూటయెనుబదియేడవ సర్గము ॥ 187 ॥



## అష్టాశీత్యధికశతతమః సర్గః

[జీవో బ్రహ్మైవ తస్యేయముత్పత్తిరుపచారతః
లిఙ్గదేహస్య విభ్రాన్త్యేత్యత్ర స్పష్టం నిరూప్యతే.

జీవుఁడు బ్రహ్మమేయనియు, లింగదేహముయొక్క భ్రాంతిచే నాతనికిట్టి (జీవ) ఉత్పత్తి ఉపచారము (అప్రధాన్యము)గఁ జెప్పఁబడినదనియు నిచట స్పష్టముగ నిరూపింపఁబడుచున్నది.]

శ్రీవసిష్ఠ ఉవాచ :—

ఆదిమత్త్వమిదం ప్రోక్తమేతస్య కలనస్య యత్
పరస్మాదద్వితీయం తత్త్వబోధాయ న వాస్తవమ్. 1

శ్రీ వసిష్ఠుఁడు:— ఓ రామచంద్రా! ఇట్లు చిదాభాసరూపుఁడగు జీవునియొక్క యే యుత్పత్తినిగూర్చి నీకుఁ జెప్పితినో, అది యా జీవుఁడు పరబ్రహ్మముకంటె వేఱుకాఁడని నీకు బోధించుటకొఱకే జెప్పఁబడినదియగునేగాని వాస్తవముగ జీవునకు ఉత్పత్త్యాదులు కలవను నాశయముచేఁ గాదు.

ఏవంవిధం తత్కలనమాత్మనోఽఙ్గమకృత్రిమమ్
చేతోన్ముఖచిదాభాసం జీవశబ్దేన కథ్యతే. 2

ఈ ప్రకారమైనట్టి, ఆత్మయొక్క అకృత్రిమ అవయవరూపుఁడగు విషయాభిముఖుఁడైన చిదాభాసుఁడు జీవుఁడను పేరుచేఁ జెప్పఁబడుచున్నాఁడు.

కలనస్యాస్య నామాని బహూని రఘునన్దన
శృణు తాని విచిత్రాని చేతోన్ముఖచిదాత్మనః. 3

ఓ రఘునందనా! విషయాభిముఖమైన చిదాత్మయొక్క స్వరూపుఁడగు ఈ చిదాభాసున కనేక విచిత్రములైన పేర్లు గలవు. వానిఁగూర్చి నీవు వినుము.

జీవనాచ్చేతనాజ్జీవో జీవ ఇత్యేవ కథ్యతే
చేతోన్ముఖతయా చిత్తం చిదిత్యేవ నిగద్యతే. 4

ఇద మిత్థమితి స్పష్టబోధాద్బుద్ధిరిహోచ్యతే
కల్పనాన్మననజ్ఞత్వాన్మన ఇత్యభిధీయతే. 5

అస్మీతి ప్రత్యయాద న్తరహంకారశ్చ కథ్యతే
చేతనాద్యమృతం చిత్తమితి శాస్త్రవిచారిభిః. 6

ప్రౌఢసంకల్పజాలాత్స పుర్యష్టకమితి స్మృతమ్
సంసృతేః ప్రకృతత్వేన ప్రాథమ్యాత్ప్రకృతి స్మృతా. 7

బోధాదవిద్యమానత్వాదవిద్యేత్యుచ్యతే బుధైః
ఇత్యాదికలనస్యాస్య నామాని కథితాని తే. 8

జీవనము (ప్రాణము)ను, కర్మేంద్రియ జ్ఞానేంద్రియములను ధరించుటచే నాతఁడు జీవుఁడని చెప్పఁబడుచున్నాఁడు. అట్లే, విషయాభిముఖుఁడగుటచే చిత్తమనియు, లేక 'చిత్' అనియు, 'ఇది యిట్టిది' అను స్పష్టమగు బోధగలిగియుండుటచే బుద్ధియనియు, సంకల్పించుటచేతను, ఊహాపోహలఁనుగూర్చిన జ్ఞానము గలిగియుండుటచేతను మనస్సనియు, 'నేనున్నాను' అను అభిమానపూర్వకమగు వృత్తితోఁ గూడియుండుటచే అహంకారమనియు, చైతన్యపరిపూర్ణమగు ఆత్మవస్తుస్వరూపుఁడగుటచే ('చితీ సంజ్ఞానే' అను ధాతువ్యుత్పత్తినిబట్టి) చిత్తమనియు, దృఢసంకల్పసమూహముచే పూరితుఁడై యుండుటచే పుర్యష్టకమనియు, సృష్ట్యాదికాలమున ప్రథమమున విద్యమానుఁడై (ప్రకృతరూపుఁడై) యుండుటచే ప్రకృతియనియు, తత్త్వజ్ఞానముచే ఔపాధికరూపముతోడ అవిద్యమానుఁడై వర్తించుటచే అవిద్యయనియు, శాస్త్రవిచారపరులచేతను విజ్ఞులచేతను నాతఁడు చెప్పఁబడుచున్నాఁడు. ఓ రామచంద్రా! ఈ ప్రకారముగ చిదాభాసుఁడగు జీవుని యొక్క వివిధనామములను నేను నీకుఁ జెప్పితిని.

ఏతత్కలనమాద్యన్తమనాకారమనామయమ్
అతివాహికదేహోక్త్యా సముదాహ్రియతే బుధైః. 9

ఈ జీవుఁడు వాస్తవముగ నిరాకార, నిర్వికారస్వరూపుఁడైయున్నాఁడు. కాని లింగ శరీరముయొక్క కల్పనచే నీతనిని ఆద్యంతములు కలవానినిగ విజ్ఞులు పేర్కొనుచున్నారు.

ఇత్యేవం స్వప్నసంకల్పపురవత్త్రిజగద్భ్రమః
భాత్యర్థకార్యవ్యవపుః శూన్యమప్రతిఘాత్మకమ్. 10

ఈ ప్రకారముగ స్వప్న, సంకల్పపురమువంటి భ్రమరూపమగు ఈ త్రైలోక్యము అర్థక్రియా సమర్థమైయున్నను వాస్తవముగ శరీరహితమై, పదార్థశూన్యమై, నిరాకారమై భాసించుచున్నది.

ఇత్యాతివాహికః ప్రోక్తో దేహో దేహభృతాం వర
చిన్నభశ్చిత్తదేహోఽసౌ శూన్య ఆకాశతోపి చ. 11

దేహధారులలో శ్రేష్ఠుఁడవగు నో రామచంద్రా! ఈ రీతిగ చిదాకాశమునే నేను లింగ శరీరముగఁ జెప్పితిని. ఈ చిత్తశరీరము యథార్థముగ ఆకాశముకంటెను శూన్యమై (సూక్ష్మమై) యొప్పుచున్నది.

నాస్తమేతి న చోదేతి జగత్యామోక్షసంవిదః
చతుర్దశవిధస్యైకా భూతసర్గస్య చిత్తభూః. 12

పదునాల్గువిధములైన భూతసృష్టికి నుత్పత్తిస్థానమగు ఈ చిత్తభూమి ప్రపంచమున మోక్షపర్యంతము ఉదయింపకయు, అస్తమింపకయు నెప్పటియట్లు స్థిరముగ నుండుచున్నది.

అత్ర సంసారలక్షాణి భవిష్యన్తి భవన్తి చ
భూతాని చ ఫలానీవ యథా కాలవ్యవస్థయా. 13

కాలముయొక్క వ్యవస్థననుసరించి వృక్షమందు ఫలమువలె, ఈ చిత్తభూమియందు లక్షలకొలఁది ప్రపంచములు, ప్రాణులు, ఉద్భవింపఁగలవు. ఉద్భవించుచున్నవి, ఉద్భవించినవి.

ఏష చిత్తమయో దేహో జగన్త్యన్తర్బహిస్త్వపి
ప్రతిబిమ్బమివాదర్శః శూన్య ఏవ నభో యథా. 14

అద్దము ప్రతిబింబమును ధరించునట్లు ఈ చిత్తమయమగు దేహము బాహ్యాభ్యంతరములందును, అనేక జగత్తులను ధరించుచున్నది. అయినను ఆకాశమువలె శూన్యమేయైయున్నది.

మహాకల్పస్య పర్యన్తే సర్వనాశే స్థిరే స్థితే
మహాశూన్యపదే ప్రౌఢే బ్రహ్మాత్మని నిరామయే. 15

స్వతశ్చితిఘనోఽచిత్త్వాచ్చిద్భానమిదమాత్మనః
అతివాహికదేహోఽథం క్రమేణానేన చేతతి. 16

మహాకల్పము (ప్రాకృతప్రళయము) యొక్క అంతిమక్షణమందు సర్వనాశము స్థిరమై యుండ మహాశూన్యమై, నిర్వికారమైనట్టి బ్రహ్మాత్మపదము శేషించియుండ నపుడు చైతన్యమున, శుద్ధచిత్స్వరూపమును గప్పునట్టి అజ్ఞానమువలన, చిదాకాశము స్వయముగ పూర్వోక్తక్రమమున సూక్ష్మశరీరమును కల్పించుచున్నది.

స అతివాహికో దేహ స్తదాలోకప్రవర్తితః
కైశ్చిద్బ్రహ్మేతి కథితః స్మృతః కైశ్చిద్విరాడితి. 17

కశ్చిత్సనాతనాభిఖ్యః కశ్చిన్నారాయణాభిధః
కశ్చిదీశ ఇతి ఖ్యాతః కశ్చిదుక్తః ప్రజాపతిః. 18

ఆతివరూపముగ సూక్ష్మశరీరముయొక్క జగదాలోకనరూపమగు ప్రకాశముతోఁ ప్రవర్తితమైన యొకానొకభాగమును కొందఱు బ్రహ్మదేవుఁడనియు, మఱికొందఱు విరాట్టనియుఁ జెప్పుచున్నారు. మఱియు నట్టి సూక్ష్మశరీరరూపుఁడగు (మాయాశబలిత) పరమాత్మయొక్క యొకానొకభాగము సనాతన పురుషుఁడనియు, వేఱొకభాగము నారాయణుఁడనియు, మఱియొకభాగము ప్రజాపతియనియు శాస్త్రములందుఁ జెప్పఁబడుచున్నది.

కాకతాలీయవద్భూతాః పఞ్చస్వేన్ద్రియసంవిదః
యత్ర యత్ర తథా తేషాం స్థితా స్తత్ర తథా స్థితాః. 19

కాకతాలీయన్యాయముగ నేయే భాగమం దే యే ప్రకారముగ పంచేంద్రియ సంవిత్తులు భాసించుచున్నవో, ఆ యాభాగమం దాయా ప్రకారముగనే వాని ఇంద్రియార్థ (విషయ) ములున్ను స్థితినొందియున్నవి.

ఏవమత్యన్తవితతే సంపన్నే దృశ్య విభ్రమే
న కించిదపి సంపన్నే సర్వశూన్యం తతం యతః 20

ఈ ప్రకారముగ అతివిశాలమైన యీ దృశ్యవిభ్రమము పొందబడినదైనప్పటికిని, వాస్తవముగ నొకింతైనను బొందఁబడకయేయున్నది. ఏలయనిన, సర్వత్రవ్యాప్తమగు ఆత్మతత్త్వము సర్వదృశ్యశూన్యమైయే యలరుచున్నది.

అనాదిమత్పరం బ్రహ్మ న సద్యన్నాసదుచ్యతే
తదేవేదమనాద్యన్తం తథా స్థితమవేదనమ్. 21

ఆద్యంతరహితమగు పరబ్రహ్మము సత్తు (ఆవిర్భూతము) కాదు; అసత్తు (అనావిర్భూతము) కాదు; అదియే స్వరూపసాక్షాత్కారహీనత్వముచే నిట్లు సదసదాకార జగద్రూపముగ స్థితి నొందియున్నది

అతివాహికదేహస్య తస్యానుభవతః స్వయమ్
యాతి వ్యసనినః స్వప్నః కాన్తేవ పరిపుష్టతామ్. 22

సూక్ష్మశరీరరూపుఁడగు ఆ బ్రహ్మదేవునియొక్క యనుభవముచే నాతనిసంకల్పమే స్వయముగ స్త్రీవ్యసనముగలవానియొక్క స్వప్నస్త్రీవలె ఇట్లు జగద్రూపముగ పరిపుష్టమగుచున్నది.

శూన్యోఽప్యనాకృతిరపి ఘటాకారోఽనుభూయతే
స్వప్నసంకల్పయోః స్వప్నః దేహస్య జగతో యథా. 23

స్వప్న, సంకల్పములందు శూన్యమైనను, ఆకారరహితమైనను ఘటాకారమెట్లనుభూత మగుచున్నదో, అట్లే జాగ్రత్తునందును నిజదేహమున్ను, జగత్తున్ను వాస్తవముగ ఆకారరహితములే యైనను అనుభూతమగుచునున్నవి

భవత్యర్థకరోత్యుచ్చైః స్తద్వత్స్వప్నవస్తువత్
ఆకాశాత్మక ఏవోగ్రః పదార్థ ఇవ భాసతే. 24

ఆ చిదాకాశము నిరాకారమై పదార్థశూన్యమైయున్నప్పటికిని, స్వప్నవస్తువువలె బూర్ణముగ అర్థక్రియాసమర్థమగుచున్నది. మఱియు, పదార్థమువలె కఠినాకారముగను నగుచున్నది.

ఆతివాహికదేహోఽసౌ స్వతోఽనుభవతి క్రమాత్
అనాకారోఽపి శూన్యోఽపి స్వప్నాభోఽసన్నపి స్థితః. 25

ఈ సూక్ష్మశరీరరూపుఁడగు జీవుఁడు నిరాకార శూన్యస్వరూపుఁడును, స్వప్నసదృశుఁడు నైయున్నప్పటికిని స్వయముగ క్రమముగ ఆకారముననుభవింపఁదొడఁగుచున్నాడు

చేతత్యస్థిగణః స్థూలం కరాద్యవయవావలిమ్
త్రికలోమశిరాస్నాయు సంనివేశతయా స్థితమ్. 26

సూక్ష్మశరీరరూపుఁడగు ఈ జీవుఁడు అస్థిసమూహములచే స్థూలమైనదియు, హస్తపాదాద్యవయవములతోఁగూడినదియు, పృష్ఠాదిప్రదేశములందలి అస్థి, రోమ, నాడీ, మాంసాదులచే ఆకారవంతముగ నున్నదియునగు స్థూలదేహమును కల్పించుచున్నాఁడు.

జన్మకర్మేహితస్థానం పరిణామవయః స్థితమ్
దేశకాలక్రమాభోగాభావార్థాయోద్భవభ్రమమ్ 27

ఆదేహమందే జన్మ, కర్మముల అభిలషితస్థానమును, వయస్సుయొక్క పరిణామస్థితిని, దేశకాలక్రమముల విస్తారముతోఁగూడిన పదార్థములయొక్క భోగార్థముజన్మనుగూర్చిన భ్రమమ కల్పించుచున్నాఁడు.

జరామరణమాధానదశదిఙ్మణ్డలక్రమమ్
జ్ఞానజ్ఞేయజ్ఞాతృభావమాదిమధ్యాన్తవేదనమ్. 28

మఱియు ఆదేహమందే వార్ధక్య, మరణములను, గుణదోషాదుల ధారణమును, దశదిక్కులందలి సంచారమును, జ్ఞాతృజ్ఞానజ్ఞేయములను త్రిపుటిని, సమస్త పదార్థములయొక్క ఆది, మధ్య, అంతములగూర్చిన జ్ఞానమునుగూడ కల్పించుచున్నాఁడు.

క్షితిజలగగనదివాకర జనతావ్యవహారనగరశిఖరాత్మా
స్వాధారాధేయమయం పశ్యతి వపుషః పురాతనః పురుషః. 29

ఇత్యార్షే శ్రీవాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు
నిర్వాణప్రకరణే ఉత్తరార్ధే జీవరూపవర్ణనం
నామాష్టాశీత్యధిక శతతమః సర్గః ॥ 188 ॥

ఓ రామచంద్రా! ఈ ప్రకారముగ సూక్ష్మదేహ (చతుర్ముఖ) రూపత్వమును బొందిన సనాతన పురుషుఁడు (పరమాత్మ) స్వకల్పితమగు వ్యష్టి, సమష్టి స్థూలశరీరములయొక్క నిమిత్తము వలన స్వయముగ నేపృథివీ, జల, అకాశ, సూర్య, జనసమూహవ్యవహార, నగర, శిఖరరూపుఁడయి, తనకు పృథ్వ్యాదులాధారములు, తాను వానియాధేయము అని తలంచుచు, ఈ ప్రకారముగ భ్రాంతిమయమైన సంసారస్వప్నమును గాంచుచున్నాఁడు.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున నుత్తరార్ధమున శివరూపవర్ణనమను నూట యెనుబది యెనిమిదవ సర్గము ॥ 188 ॥

---

## ఏకోననవత్యధిక శతతమః సర్గః

[అతివాహితదేహాత్మ ప్రజాపతి మనోరథే
అధి భౌతికతా భ్రాన్తిర్జగత్యత్రోపవర్ణ్యతే.

సూక్ష్మశరీరరూపుఁడగు ప్రజాపతియొక్క సంకల్పమున స్థూలత్వమునుగూర్చిన భ్రాంతి యిచట వర్ణింపఁబడుచున్నది.]

శ్రీ వసిష్ఠ ఉవాచ :—

అతివాహికదేహోఽసౌ తస్యాద్యస్య ప్రజాపతేః
కాకతాలీయవచ్చిత్త్వాద్య ద్యథేత్యాది చేతతి. 1

తత్తథా స్థితిమాయాతి చిరం సంవిత్స్వభావతః
ఇత విశ్వమిదం భాతమత్రాసత్యే కుతః స్మయః. 2

శ్రీవసిష్ఠుఁడు:— ఓ రామచంద్రా! ఆ ఆదిప్రజాపతియొక్క సూక్ష్మశరీరము చిద్రూపత్వమువలనను, సత్యసంకల్ప సంవిత్స్వభావమువలనను, కాకతాళీయన్యాయముగ నెపుడు దేనినెట్లు సంకల్పించుచున్నదో, అపుడది యా విధముగనే చిరకాలము స్థితిఁబొందినదగుచున్నది. అహా! ఈ ప్రకారముగ నట్టి సంవిత్తుయొక్క సంకల్పమాత్రముచేతనే యీ జగత్తు భాసించుచున్నది! కావున నీక నిద్దాని అసత్యత్వమందేమి యాశ్చర్యము గలదు?

ద్రష్టాఽసత్య మసత్యం దృగసత్యం దర్శనం తతమ్
సత్యమేవాథవా సర్వం బ్రహ్మైవాత్మతయా తయా. 3

భ్రాంతిమాత్రములగుటచే ద్రష్టయు, దృశ్యమున్ను, దర్శనమున్ను (త్రిపుటి) మూఁడును అసత్యములేయైయున్నవి. లేక, అధిష్ఠానదృష్టిచే సమస్తము వ్యాపకమగు బ్రహ్మరూపమేయగుటఁ బట్టి అవియన్నియును సత్యములున్ను నగును.

శ్రీరామ ఉవాచః—

ఇత్యాతివాహికాలోకః స తస్యాద్య ప్రజాపతేః
కఠినత్వం కథం యాతః కథం స్వప్నస్య సత్యతా. 4

శ్రీరాముఁడు:— మహాత్మా! ఈ ప్రకారముగ, ఆ ఆదిప్రజాపతియొక్క సూక్ష్మశరీర సంకల్పము భ్రాంతిమాత్రమేయగుచో నపురది శిలాది కఠినరూపము నెట్లు పొందఁగలదు? ఏలయనిన, స్వప్నపదార్థములకు సత్యత్వము (పారలౌకిక ఫలాది అర్థక్రియాసామర్థ్యము) యెట్లుండఁగలదు?

**శ్రీ వసిష్ఠ ఉవాచ:—**

ఆతివాహిక ఆలోకః స్వత ఏవానుభూయతే
సదానవరతం తేవ స ఏవాభాతి పుష్టవత్. 5

శ్రీవసిష్ఠుఁడు:— ఓ రామచంద్రా! ఈ సూక్ష్మశరీర సంకల్పము నిరంతర మెడతెగక స్వయముగ ననుభూతమగుచున్నవి. కావుననే యది చిరకాలాభ్యాసమువలన ఘనీభూతమైన దానివలె భాసించుచున్నది.

యథా స్వప్నస్య పుష్టత్వం చిరానుభవనోచితమ్
అతిసత్యమివాభాతి స్వాతివాహికతా తథా. 6

(హరిశ్చంద్రాదులకువలె) చిరకాలానుభవముచే స్వప్నమెట్లు పుష్టత్వమొందినదై అతి సత్యముగఁ గానుపించుచున్నదో, అట్లే సూక్ష్మశరీర సంకల్పమున్ను చిరకాలాభ్యాసముచే సత్యముగను, ఘనీభూతముగను గానుపించుచున్నది.

ఆతివాహికదేహస్య చిరస్వానుభవోదయే
ఆధిభౌతికతాబుద్ధిరుదేతి మృగవారివత్. 7

సూక్ష్మశరీరముయొక్క చిరకాలానుభవమందు స్థూలత్వబుద్ధి మృగతృష్ణాజలమువలె నుదయించుచున్నది.

జగత్స్వప్నభ్రమాభాసం మృగతృష్ణాంబువత్స్థితమ్
అసదేవేదమాభాతి సత్యప్రత్యయకార్యపి. 8

స్వప్నభ్రమవలెను మృగతృష్ణాజలమువలెను స్థితినొందియున్నట్టి యీజగత్తు సత్యమను విశ్వాసము గల్గించుచు భాసించుచున్నను, వాస్తవముగ అసత్యమేయైయున్నది.

ఆతివాహికరూపాణామాధిభౌతికతా స్వయమ్
అసతీ సత్యవద్దూరమర్వాగ్దర్శిభిరర్థితా. 9

సూక్ష్మ (సంకల్పమయ) పదార్థరూపములకు స్థూలత్వము మిగుల అసత్యమైయున్నప్పటికిని, అవివేకులు స్వయముగ తమ యాసక్తిచే నద్దానిని స్వీకరించిరి

అయం సోఽహమిదం తన్మ ఇమా గిరినభోదిశః
ఇతి మిథ్యాభ్రమో భాతి భాస్వరస్వప్నశైలవత్. 10

'ఇవి నా శరీరాదులు. వాఁడు నాకంటె వేఱైయున్నాడు. ఇవి పృథ్వ్యాదులు, వీరు నా పుత్రాదులు ఇవి పర్వత, ఆకాశ దిగాదులు, ఈ ప్రకారముగ స్వప్నమందలి ప్రకాశమానమగు పర్వతమువలె ఈ జగద్రూప మిథ్యాభ్రమ భాసించుచున్నది

ఆతివాహికదేహోఽసౌ భ్రష్టురాద్యస్య భావితః
ఆధిభౌతికతాం చైత త్పిణ్డాకారం ప్రపశ్యతి. 11

ఆదిస్రష్టయగు బ్రహ్మదేవునియొక్క సూక్ష్మశరీరము చిరకాలపు దృఢభావనచే తన యందేస్థూలత్వమును, పిండాకార (స్థూలాకార) పృథివ్యాదిరూపములను గాంచుచున్నది.

చిన్నభచ్చేతనం త్యక్త్వా బ్రహ్మాహమితి పశ్యతి
అయం దేహోఽయమాధార ఇతి బధ్నాతి భావనామ్. 12

చిదాకాశము 'నేను బ్రహ్మమును' అనునీప్రకారమగు తన యదార్థచేతన స్వరూపమును త్యజించి 'ఈ మనుష్యాదిశరీరమును నేను, ఈపృథ్వ్యాదులు నా యొక్క ఆధారము అని యిట్లు గాంచుచు నట్టి ఆసక్తియు గల్గియున్నది.

అసత్యే సత్యబుద్ధ్యైవ బద్ధో భవతి భావనాత్
బహుశో భావయత్యన్తర్నానాత్వమనుధావతి. 13

అసత్యములగు శరీరాదులందు సత్యబుద్ధియొక్క భావనచేతనే జీవుఁడు బద్ధుఁడగు చున్నాఁడు. మఱియు, తన స్వరూపముననే యాతఁడు నానాత్వమును భావించుచు, దానిని ననుసరించుచు నున్నాడు.

శబ్దాన్కరోతి సంకేతం సంజ్ఞాశ్చస్పన్దనాని చ
ఓమిత్యుక్తే తతో వేదాఞ్ఛబ్దరాశీన్ప్రగాయతి. 14

ప్రథమమున బ్రహ్మదేవుఁడు వైదిక లౌకిక శబ్దములను సృజించుచున్నాడు. పిమ్మట వానియొక్క ఆయా యుపాధివంతములగు అర్థములందు సంకేతముల ద్వారా సంజ్ఞలను రచించు చున్నాఁడు. ఎట్లనిన, 'ఓమ్' అని యుచ్చరించి పిమ్మట శబ్దరాశిభూతములగు వేదములయొక్క రచనను గావించెను.

తైరేవ కల్పయత్యాశు వ్యవహారమితస్తతః
మనో హ్యసౌ కల్పయతి యచ్చేతతి తదేవ హి. 15

ఆ వేదశబ్దములచేతనే యాతఁడు శీఘ్రముగ ప్రపంచమంతటను వ్యవహారమును కల్పించు చున్నాఁడు. ఏలయనిన, ఈ మనస్సు దేనిని కల్పించుచున్నదో, దానితోడ తన్మయ మగుచున్నది.

యో హి యన్మయ ఏవాసౌ స న పశ్యతి తత్కథమ్
అసత్యైవ జగద్భ్రాన్తిరేవం ప్రౌఢిముపాగతా. 16

ఎవఁడు దేనియందు తన్మయుఁడగునో, ఆతఁడు దానినెట్లు గాంచకుండును? ఈ ప్రకారముగ అసత్యమైనను, ఈ జగద్భ్రాంతి యివ్విధమున దృఢత్వమును బొందినదైయున్నది

అబ్రహ్మణో ముధా భాతి చిరస్వప్నేన్ద్రజాలవత్
ఇత్యాతివాహికస్యేయమాధిభౌతికతోదితా. 17

బ్రహ్మాదిస్తంబపర్యంతముగల యీ జగత్తంతయును చిరకాల స్వప్న, ఇంద్రజాలముల వలె మిథ్యగనే భాసించుచున్నది. కాని దృఢసంకల్పముచే సూక్ష్మదేహముయొక్క స్థూలరూపత్వము ఉచితమే యైయున్నది.

అధిభౌతికతా నాస్తి కాచిత్కించిదపి క్వచిత్
అతివాహికతైవైనామభ్యాసాద్యాతి భావనామ్. 18

వాస్తవముగ స్థూలరూపత్వమేమియు నెచటను నొకింతైనను లేకయున్నది. సూక్ష్మరూపమే అభ్యాసముచే నిట్టి స్థూలత్వభావనను బొందుచున్నది.

మూలాదేవైవ మాయాతో మిథ్యానుభవనాత్మకః
మోహో బ్రహ్మణ ఏవాయమిత్యస్త్యేష మహాత్మనామ్. 19

మిథ్యానుభవాత్మకమైనట్టి జగత్తుయొక్క యీ స్థూలత్వరూప మోహము మూలభూతుఁడగు ఆదిస్రష్టయైన బ్రహ్మదేవునివద్దనుండియే యేతెంచినది. ఇక్కారణమున ఈ జగద్దర్శనము భ్రమ తత్త్వవేత్తలకున్ను ప్రారబ్ధక్షయపర్యంతముండియేయున్నది.

ఏవమిత్థం దశా రామ పిణ్డబన్ధః క్వ విద్యతే
భ్రాన్తిరేవేదమఖిలం బ్రహ్మైవాభాతమేవ వా. 20

ఓ రామచంద్రా! చిదేకరసమగు బ్రహ్మమునకిట్టి (జగద్రూపమగు) దుర్దశ యెచట గలదు? (లేదని భావము) ఈ సమస్తజగత్తున్ను వాస్తవముగ భ్రాంతి మాత్రమే యైయున్నది. లేక బ్రహ్మమే లీలార్థము నిజశక్తిచే జగజ్జీవాదిరూపములతో నిట్లు భాసించుచున్నది యగును.

న శాశ్వతాదన్యదిహాస్తి కారణాన్న కారణం తత్ఖలు కార్యతాం వినా
న కార్యతా కారణతాదిసంభవోఽన్త్యనామయే తత్క్రమపీదమాతతమ్. 21

ఇత్యార్షే శ్రీవాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే ఉత్తరార్ధే బ్రహ్మైకతాప్రతిపాదనం నామైకోననవత్యధిక శతతమః సర్గః ॥ 189 ॥

శాశ్వతమగు బ్రహ్మముకంటె వేఱుగ నిట జగత్తునకు మఱియొక కారణమెద్దియును లేదు. ఆ కారణత్వమున్ను కార్యత్వములేక సంభవింపజాలదు. మఱియు నిర్వికార, కూటస్థ, చిదానంద, అద్వయ బ్రహ్మమున కార్యకారణత్వాదులు సంభవములే కావు. కాఁబట్టి ఈ జగదాకారము భ్రాంతిమాత్రముగనే విస్తారమును బొందియున్నదేగాని వాస్తవముగ సత్యము కాదని నిశ్చితమగుచున్నది.

ఇది శ్రీవాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున నుత్తరార్ధమున బ్రహ్మైకతాప్రతిపాదనమను నూట యెనుబది తొమ్మిదవ సర్గము ॥ 189 ॥

◆◆◆◆◆◆◆◆◆◆

## నవత్యధిక శతతమః సర్గః

[అతీతానాగతాః శఙ్కాః సర్వాః సంమృజ్యయుక్తిభిః
జ్ఞానస్య జ్ఞేయతాశాన్తిర్ముక్తిరత్రోపపాద్యతే.

భూత, భవిష్యత్ సందేహములన్నింటిని యుక్తుల ద్వారా నివారించి జ్ఞానముయొక్క జ్ఞేయత్వ (విషయరూపత్వ) శాంతియే ముక్తి యని తెలుపఁబడుట యిచట గాననగును.]

శ్రీ వసిష్ఠ ఉవాచ :—

జ్ఞానస్య జ్ఞేయతాప త్తిర్బన్ధ ఇత్యభిధీయతే
తస్యైవ జ్ఞేయతాశాన్తిర్మోక్ష ఇత్యభిధీయతే. 1

శ్రీవసిష్ఠుఁడు:— ఓ రామచంద్రా! జ్ఞానముయొక్క జ్ఞేయ (విషయ) రూపత్వ ప్రాప్తియే బంధమనియు, అట్టి జ్ఞేయ (విషయ) రూపత్వ శాంతి (కేవల జ్ఞాన స్వరూపస్థితి)యే మోక్షమనియుఁ జెప్పఁబడుచున్నది.

శ్రీరామ ఉవాచ:—

జ్ఞానస్య జ్ఞేయతాశాన్తిః కథం బ్రహ్మన్ప్రవర్తతే
సా రూఢా బన్ధతా బుద్ధిః కథం వాత్ర నివర్తతే. 2

శ్రీరాముఁడు:— మహాత్మా! జ్ఞానముయొక్క విషయరూపత్వనాశమెట్లు సిద్ధించును? దృఢముగ అభ్యస్తమైన యా బంధరూపమగు విషయత్వబుద్ధి యెట్లు నివర్తింపఁగలదు?

శ్రీ వసిష్ఠ ఉవాచ:—

సమ్యగ్జ్ఞానేన బోధేన మన్దబుద్ధిర్నివర్తతే
నిరాకారా నిజా శాన్తా ముక్తిరేవం ప్రవర్తతే. 3

శ్రీవసిష్ఠుఁడు:— ఓ రామచంద్రా! శమదమాది సాధనములచే దృఢముగ నభ్యసింపఁబడిన సమ్యక్-జ్ఞానరూపమగు ప్రబోధముచే విషయరూపత్వ భ్రాంతి నివర్తించుచున్నది. అట్లు భ్రాంతి నశింప, నిరాకారమై, సత్యమై, శాంతమైనట్టి ఆత్మస్వరూప ప్రాప్తియను ముక్తి ప్రవర్తించు చున్నది.

శ్రీరామ ఉవాచ:—

బోధః కేవలతారూపః సమ్యగ్జ్ఞానం కిముచ్యతే
యేన బన్ధాదయం జన్తురశేషేణ విముచ్యతే. 4

శ్రీరాముఁడు:— మహాత్మా! దేనిచే ఈ జీవుఁడు బంధమునుండి సర్వదా విముక్తుఁడగునో, అట్టినిర్మల బోధస్వరూపమగు సమ్యక్-జ్ఞానమెద్ది?

శ్రీవసిష్ఠ ఉవాచ :—

జ్ఞానస్య జ్ఞేయతా నాస్తి కేవలం జ్ఞానమవ్యయమ్
అవాచ్యమితి బోధోన్తః సమ్యగ్జ్ఞానమితి స్మృతమ్. 5

శ్రీ వసిష్ఠుఁడు :— ఓ రామచంద్రా! 'జ్ఞానము (అధిష్ఠాన చిన్మాత్ర)మునకు జ్ఞేయ (విషయ)త్వమెన్నఁడునులేదు; ఈజగత్తు భ్రాంతిరూపమేయైయున్నది; ఇట కేవలము నాశరహితమై అనిర్వచనీయమైనట్టి జ్ఞానము (చిద్రూపము) మాత్రమే కలదు' అను నీప్రకారమగు అభ్యంతర మందలి దృఢనిశ్చయమే సమ్యక్-జ్ఞానమని చెప్పఁబడినది.

శ్రీరామ ఉవాచ :—

జ్ఞానస్య జ్ఞేయతా భిన్నా త్వన్తః కేతి మునే వద
ఉత్పాద్యో జ్ఞాన శబ్దశ్చ భావే వా కరణేఽథ కిమ్. 6

శ్రీరాముఁడు:— ఓ మునీంద్రా! చిదేకరసమగు జ్ఞానమందు (ఆత్మయందు) తద్భిన్నమగు జ్ఞేయ (విషయ)త్వమేమి? మఱియు, ఈ జ్ఞానశబ్దముయొక్క వ్యుత్పత్తి భావమందు (జ్ఞప్తిర్ జ్ఞానమ్-జ్ఞప్తిమాత్రమగు చైతన్యమే జ్ఞానము-అను అర్థమందు) గలదా? లేక కరణమందు (జ్ఞాయతేఽనేనేతి జ్ఞానమ్ - దేనిచే నెఱుఁగఁబడునో అని జ్ఞానము-అను అర్థమందు) గలదా? తెలుప ప్రార్థన.

శ్రీవసిష్ఠ ఉవాచ : —

బోధమాత్రం భవేజ్జ్ఞానం భావసాధనమాత్రకమ్
న జ్ఞాన జ్ఞేయయోర్భేదః పవనస్పన్దయోరివ. 7

శ్రీవసిష్ఠుఁడు:— ఓ రామచంద్రా! జ్ఞానశబ్దముయొక్క వ్యుత్పత్తి భావమందేగలదు. కావుననట్టి భావసాధనమాత్రకమైనట్టి బోధమాత్రమే జ్ఞానమగును. ఈ జ్ఞేయ (దృశ్య జగత్) రూపమున్ను జ్ఞానము (చిద్రూపము) యొక్కయే మాయక వికల్పమైయున్నది. గావున, వాయు, చలనములకువలె వాస్తవముగ జ్ఞాన, జ్ఞేయములకు భేదమేమియునులేదు.

శ్రీరామ ఉవాచ:—

ఏవం చేత్తత్కథమయం జ్ఞాన జ్ఞేయాదివిభ్రమః
సిద్ధః శశవిషాణాభో భవిష్యద్భూత భవ్యశః. 8

శ్రీరాముఁడు:— మహాత్మా! అట్లైనచో, శశశృంగము (కుందేటికొమ్ము) వంటి యీ జ్ఞేయ (దృశ్య) రూప భ్రమ యెట్లు సిద్ధించినది? మఱియు నయ్యది ప్రత్యక్షాది ప్రమాణములచేతను భూత, భవిష్యద్వర్తమానాది విభాగములచేతను వ్యవహార సమర్థమెట్లైనది?

శ్రీ వసిష్ఠ ఉవాచ :—

బాహ్యార్థభ్రాన్తితో జ్ఞేయా భ్రమబుద్ధిరిహోదితా
బాహ్యశ్చాభ్యన్తరశ్చార్థో న సంభవతి కశ్చన. 9

శ్రీవసిష్ఠుఁడు:— ఓరామచంద్రా! బాహ్యపదార్థభ్రాంతిననుసరించియే నిచటవిషయాకారభ్రమబుద్ధి చెప్పఁబడినది. అంతేగాని వాస్తవముగ బాహ్యమునగాని, అభ్యంతరమునగాని, ఆత్మకంటె భిన్నముగ నేపదార్థమున్ను సంభవింపనేరదు.

శ్రీరామ ఉవాచ:—

యోఽయం ప్రత్యక్ష దృశ్యోఽర్థో మునే త్వమహమాదికః
భూతాదిరనుభూతాత్మా స కథం నాస్తి మే వద. 10

శ్రీరాముఁడు:— ఓ మునీంద్రా! 'నీవు, నేను' ఇత్యాది రూపమైనదియు, జీవ, శరీర, పృథ్వ్యాదిస్వరూపమైనదియు, ప్రత్యక్షమై, అనుభవసిద్ధమై యొప్పుచున్నదియునగు ఈ దృశ్య జగత్తెట్లు లేదో వచింపఁ ప్రార్థన.

**శ్రీ వసిష్ఠ ఉవాచ:—**

ఆదిసర్గ విధావేవ విరాడాత్మాదికోఽనఘ
జాతో న కశ్చిదేవార్థో జ్ఞేయస్యాతో న సంభవః. 11

శ్రీవసిష్ఠుఁడు:— పాపరహితుఁడవగు రామచంద్రా! ఆదిసృష్టియందే విరాడ్రూపాది పదార్థమేదియు నుత్పన్నము కాకయున్నందున నిపుడున్ను నే పదార్థమున్ను వాస్తవముగ లేకయే యున్నదగును. కాఁబట్టి జ్ఞేయమగు దృశ్యజగత్తు సంభవింపనేరదు. (లౌకికదృష్టిచే ప్రత్యక్షముగ నున్నప్పటికిని ఈ దృశ్యజగత్తు శ్రుతి యుక్తులచే బాధితమగుచున్నది గావున, స్వప్నమువలె అసత్యమేయగునని భావము.)

**శ్రీరామ ఉవాచ:—**

భవిష్యద్భూత భవ్యస్థా జగద్దృష్టిరియం మునే
నిత్యానుభూయమానాపి న జాతేతి కిముచ్యతే. 12

శ్రీరాముఁడు:— ఓ మునీంద్రా! భూత, భవిష్యద్వర్తమానకాల వ్యవస్థతోఁగూడినదై సమస్తప్రాణులకును ప్రత్యక్షసిద్ధమై నిత్యము సర్వులచే ననుభవింపఁబడుచున్నదై నప్పటికిని ఈ జగత్తు ఉత్పన్నమేకాకయున్నదని తామేల వచించుచున్నారు? (అనేకకోట్ల జీవులయొక్కయు, వస్తువుల యొక్కయు నొక్కతత్త్వజ్ఞానముచే బాధ (నిషేధము) యెట్లుసంభవించునని భావము.)

**శ్రీవసిష్ఠ ఉవాచ :—**

స్వప్నార్థమృగతృష్ణాంబుద్వీన్దుసంకల్పితార్థవత్
మిథ్యా జగదహం త్వం చ భాతి కేశోణ్డుకం యథా. 13

శ్రీవసిష్ఠుఁడు :— ఓ రామచంద్రా! స్వప్న, సంకల్ప పదార్థములున్ను మృగతృష్ణా జలమున్ను ద్విచంద్రభ్రాంతియు, ఆకాశమందలి కేశాదులున్ను వాస్తవముగ నుత్పన్నములు కాకున్నను నెట్లు భాసించుచున్నవో, ఒక్క జాగరణముచేగాని లేక యథార్థజ్ఞానముచేగాని నవి యన్నియు నెట్లు బాధితములగుచున్నవో, అట్లే 'నీవు, నేను' ఇత్యాది జగత్తున్ను వాస్తవముగ నుత్పన్నము కాకున్నను భాసించుచున్నది. మఱియు నొక్కతత్త్వజ్ఞానముచే నదియంతయు నివారిత మగుచున్నది

**శ్రీరామ ఉవాచ:—**

అహం త్వమయమిత్యాది జగజ్జఠరమవ్యలమ్
కథం న జాతం భగవన్సర్గాదావనుభూతిమత్. 14

శ్రీరాముఁడు :— మహాత్మా! 'నేను, నీవు' ఇత్యాది అనుభవ సిద్ధమైన సమస్త జగత్తున్ను సృష్ట్యాదియందెట్లు జనింపకయున్నది. (ఏయుక్తిచే నది బాధితమగుచున్నది.)

**శ్రీ వసిష్ఠ ఉవాచ:—**

కారణాజ్జాయతే కార్యం నాన్యథేత్యేవ నిశ్చయః
సర్వోపశాన్తౌ జగతాముత్పత్తౌ నాస్తి కారణమ్. 15

శ్రీ వసిష్ఠుఁడు:— ఓ రామచంద్రా! కారణమునుండియే కార్యము జనించును గాని మఱియొక విధముగ గాదనుటనిశ్చయము. సృష్ట్యాదియందు సర్వకారణములు శమించి యుండుటఁ బట్టి కారణముయొక్క అభావమువలన జగత్తుయొక్క యుత్పత్తియందు కారణము లేకయే యున్నది. కావున, ఈ జగత్తు సృష్ట్యాదియందు జనింపకయేయున్నదగును.

శ్రీరామ ఉవాచ:—

మహాప్రలయ సంపత్తౌ శిష్టం యదజమవ్యయమ్
తత్కథం నామ సర్గస్య న భవేత్కారణం మునే. 16

శ్రీరాముఁడు:— ఓ మునీంద్రా! మహాప్రళయము సంభవించిన తదుపరి జన్మ రహితమై అవ్యయమైనట్టి బ్రహ్మము శేషించియుండునుగదా. ఆ బ్రహ్మమేసృష్టికి కారణమేల కాఁగూడదు?

శ్రీ వసిష్ఠ ఉవాచ:—

యదస్తి కారణేకార్యం తత్తస్మాత్సంప్రవర్తతే
న త్వసజ్జాయతే రామ న ఘటాజ్జాయతే పటః. 17

శ్రీ వసిష్ఠుఁడు:— ఓ రామచంద్రా! కారణమం దేకార్యముగలదో, అదియే యా కారణమునుండి యుత్పన్నమగునుగాని, అందు లేనిదికాదు. ఎట్లనిన, ఘటమునుండి పట (వస్త్ర) మెన్నటికిని నుత్పన్నము కానేరదు. బ్రహ్మము చిదేకరసమై యొప్పుచున్నదిగావున నందు జగద్బీజశక్తి లేనందున జగత్తద్దానినుండి యుద్భవింపజాలదు.

శ్రీరామ ఉవాచ:—

జగత్సూక్ష్మేణ రూపేణ మహాప్రలయ ఆగతే
ఆస్తే బ్రహ్మణి తత్తస్మాత్పునరేవ ప్రవర్తతే. 18

శ్రీరాముఁడు:— మహాత్మా! మహాప్రళయమేతెంచ, అపుడు జగత్తు సూక్ష్మరూపముగ బ్రహ్మమందుండునుగదా! తిరిగియది యాబ్రహ్మమునుండియే ప్రవర్తించుచున్నదనుట యేలసరికాదు?

శ్రీ వసిష్ఠ ఉవాచ:—

మహాప్రలయ పర్యన్తే కేన సర్గాస్తితానఘ
అనుభూతా మహాబుద్ధే తత్రస్థాసా చ కీదృశీ. 19

శ్రీవసిష్ఠుఁడు:— పాపరహితుఁడవును, మహాబుద్ధివినగు నో రామచంద్రా! మహా ప్రళయమున సృష్టియొక్క బీజసత్తను బ్రహ్మమందెవఁడనుభవించెను? అట్లు సాధకాభావము చేతను, శ్రుతిచే బాధితమొనర్పఁబడుటచేతను, అటనున్న యా జగద్బీజసత్త యెట్టిది? (వాస్తవముగ లేదని భావము)

శ్రీ రామ ఉవాచ:—

జ్ఞప్త్యాత్మికా శ్రీస్తత్రస్థా తాదృశైరనుభూయతే
వ్యోమాత్మికా తు న భవేన్న సత్తామసద్దేతి హి. 20

శ్రీరాముఁడు:— మహాత్మా! జ్ఞప్తిరూప (చిద్రూప) సత్తయైతే బ్రహ్మమందు తత్త్వజ్ఞానులచే నా సమయమందును ననుభవింపఁబడుచున్నది. కావున అట్టి స్వప్రకాశ చిద్రూపము కంటె అభిన్నముగ జగత్సత్తయు నపుడుండునుగాని మాయాకాశరూపముగఁగాదు. ఏలయనిన, మాయాకాశరూపము అసత్స్వరూపమగుటచే నద్దానినుండి సద్రూపముతో సృష్టి యుద్భవించుట అయుక్తమైయున్నది.

శ్రీ వసిష్ఠ ఉవాచ :—

> ఏవం చేత్తన్మహాబాహో జ్ఞప్తిరేవ జగత్త్రయమ్
> విశుద్ధజ్ఞానదేహస్య కుతో మరణజన్మనీ. 21

శ్రీ వసిష్ఠుఁడు:— గొప్ప బాహువులుగల ఓ రామచంద్రా! అట్లు చిద్రూపమగు బ్రహ్మమే జగత్తుయొక్క బీజసత్తయని నమ్మచో, అపుడు ముల్లోకములున్ను జ్ఞప్తి (చిద్రూపము) మాత్రములే యగును. ఏలయనిన. విశుద్ధజ్ఞాన (సచ్చిదానంద) దేహధారియగు ఆత్మకు జనన మరణాదు లెట్లుండును?

శ్రీరామ ఉవాచ :—

> తదేవమాహితో నాస్తి సర్గస్తదియమాగతా
> కుతః కథమివ భ్రాన్తిరితి మే భగవన్వద. 22

శ్రీరాముఁడు:— మహాత్మా! సృష్టి మొదటినుండియు లేకయున్నచో, బ్రహ్మము మాత్రమే యుండియున్నచో. అపుడేజగద్భ్రాంతి యేకారణముచే నేతెంచినది?

శ్రీ వసిష్ఠ ఉవాచ :—

> కార్యకారణతాభావాద్భావాభావౌ స్త ఏవ నో
> ఇదం చ చేత్యతే యద్యత్స్వాత్మా చేతతి చేతితమ్. 23

శ్రీ వసిష్ఠుఁడు:— ఓ రామచంద్రా! బ్రహ్మమందు కార్యకారణత్వముయొక్క అభావమువలన నందు సృష్టి, ప్రళయములు లేనేలేవు. ఏ యీ జగత్తెఱుఁగఁబడుచున్నదో, ఎవనిచే నెఱుఁగఁబడుచున్నదో, ఎఱుక ఏదిగలదో (జ్ఞాతృజ్ఞాన జ్ఞేయరూపమగు త్రిపుటి,) అదియంతయును స్వాత్మయగు బ్రహ్మమేయైయున్నది

శ్రీరామ ఉవాచ :—

> చేతితా చేతతి యన్త్రం ద్రష్టా దృశ్యత్వమీశ్వరః
> కథమేతి కథం వహ్నిం దహేత్కాష్ఠం కదా కిల. 24

శ్రీరాముఁడు:— మహాత్మా! యంత్రమువలె జడమైనట్టి కార్యకారణ సంఘాతము (శరీర ఇంద్రియాదులు) చేతనమువలె నెఱుఁగుననుటయు, సర్వద్రష్టయైన యీశ్వరుఁడు (పరమాత్మ) జడమగు దృశ్యరూపత్వమును బొందుననుటయు విపరీతముగానున్నది. కాష్ఠము దహించునదియై, అగ్నిని దహింపఁబడు దానినిగఁచేసి యెపుఁడద్దానిని దహింపఁజేయగలదు? (అసంభవమని భావము)

శ్రీ వసిష్ఠ ఉవాచ :—

ద్రష్టా న యాతి దృశ్యత్వం దృశ్యస్యాఽసంభవాదతః
ద్రష్టైవ కేవలో భాతి సర్వాత్మైకఘనాకృతిః. 25

శ్రీ వసిష్ఠుఁడు:— ఓ రామచంద్రా! దృశ్యము సర్వథా అసంభవమగుటవలన ద్రష్ట దృశ్యత్వ మెన్నఁటికిని బొందదు. దృఙ్మాత్రమై, చిద్ఘనాకారమై, సర్వాత్మయైనట్టి ద్రష్టయే త్రిపుటీ రూపముతో నిజ మాయాశక్తిచే భాసించుచున్నదగును.

శ్రీరామ ఉవాచ :—

చిన్మాత్రం తదనాద్యన్తం చేత్యం చేతయతే తదా
తదిదం జగదాభానం కుతః స్యాచ్చేత్యసంభవః. 26

శ్రీరాముఁడు:— మహాత్మా! సృష్ట్యాదియందు అనాదియై, అనంతమైనట్టి శుద్ధ చిన్మాత్రమే జగత్తును కల్పించుటవలన ఈ జగత్తు భాసించుచున్నదనుట నిక్కమే. అయితే, ఆ సమయమున నట చిద్రూప బ్రహ్మమందు చేత్య (దృశ్యవిషయ) మెట్లు సంభవించును?

శ్రీ వసిష్ఠ ఉవాచ :—

చేత్యం హి కారణాభావాన్న సంభవతి కించన
చేత్యాభావాచ్చేతనస్య ముక్తతాఽవాచ్యతా సదా. 27

శ్రీ వసిష్ఠుఁడు:— ఓ రామచంద్రా! కారణముయొక్క అభావమువలన చేత్యము (దృశ్య జగత్తు) ఒకింతైనను సంభవింప నేరదు. చేత్యముయొక్క అభావమువలన చైతన్యము (బ్రహ్మము) యొక్క నిత్యముక్తత్వము వాగగోచరత్వము సదా సిద్ధించుచున్నవి.

శ్రీరామ ఉవాచ : —

ఏవం చేత్తదహన్త్వాది చేత్యం కథమిదం కుతః
కథం జగద్వేదనం చ కథం స్పన్దాదివేదనమ్. 28

శ్రీరాముఁడు:— మహాత్మా! ఈ ప్రకారముగ ఆత్మ నిత్యముక్తమైయున్నచో అహంకారాది రూపమగు సమస్త జగత్తున్ను ఎట్లు ఎచటనుండి యుత్పన్నమైనది? జగత్తుయొక్కయు స్పందాది విషయములయొక్కయు జ్ఞానమెట్లు కలుగుచున్నది? (ఆత్మ నిత్యముక్తమైయున్నచో నపుడు గురు, శాస్త్రాదులన్నియుగూడ నిష్ఫలములగునుగదా!)

శ్రీ వసిష్ఠ ఉవాచ:—

కారణాసంభవాదాదావేవోత్పన్నం న కించన
కుతశ్చేత్యమతః శాన్తం సర్వం సర్గస్తు విభ్రమః. 29

శ్రీ వసిష్ఠుఁడు:— ఓ రామచంద్రా! కారణము అసంభవమగుటచే సృష్ట్యాదియందే యీ జగత్తొకింతైనను నుత్పన్నము గాకయేయున్నది. కావున నిఁక దృశ్యమెచట? అంతయు శాంతమగు పరబ్రహ్మమే యైయున్నది. ఈ సృష్టి కేవలము భ్రమమాత్రమే (ఇట్లు జగద్బంధము శమించుటయే గురు శాస్త్రాదుల ఫలమగును.)

శ్రీరామ ఉవాచ:—

అత్ర మే విగతోల్లేఖే నిశ్చేత్య చలనాదికే
సకృద్విభాతే విమలే విభ్రమః కస్య కీదృశః. 80

శ్రీరాముఁడు:— మహాత్మా! చేత్య (దృశ్య) చలనాదిరహితమై వాక్కునకు విషయము కానిదై సదాస్వప్రకాశస్వరూపమై నిర్మలమైనిత్యముక్తమైనట్టి బ్రహ్మమందు (ద్వైతమేలేనందుననిక) భ్రమయెవనికి నే కారణముచే నెట్లుకలుగునో యిటనాకుఁ దెలుపప్రార్థన.

శ్రీ వసిష్ఠ ఉవాచ:—

కారణాభావతో రామ నాస్త్యేవ ఖలు విభ్రమః
సర్వం త్వమహమిత్యాది శాన్తమేకమనామయమ్. 81

శ్రీవసిష్ఠుఁడు:— ఓ రామచంద్రా! గురు, శాస్త్రాదులద్వారా బ్రహ్మతత్త్వమును బొందిన వానిదృష్టియందు కారణముయొక్క అభావమువలన ఈ జగత్తు ఉత్పన్నమేకాకయున్నది. కావుననిఁక దానిఁగూర్చిన భ్రమయేలేకయున్నది. 'నీవు, నేను' ఇత్యాది జగత్తంతయును శాంతమై ఏకమై నిర్వికారమైనట్టి ఆత్మయేయగును.

శ్రీరామ ఉవాచ:—

బ్రహ్మభ్రమమివాపన్నః ప్రష్టుం జానామి నాధికమ్
నాత్యన్తం చ ప్రబుద్ధోస్మి పృచ్ఛామి కిమిహాధునా. 82

శ్రీరాముఁడు:— మహాత్మా! నేనిపుడు భ్రమనుబొందినవానివలెనయితిని. కావుననిఁక అధికముగ ప్రశ్నింపఁజాలను నేను అత్యంతప్రబుద్ధుఁడనుగాను కాబట్టి నేనిపుడిచట ఏమి ప్రశ్నించుదును?

శ్రీ వసిష్ఠ ఉవాచ:—

కారణస్యైవ నికషం పృచ్ఛ మా కారణక్షయాత్
పరే స్వభావేఽనిర్వాచ్యే స్వయం విశ్రాన్తిమేష్యసి. 83

శ్రీవసిష్ఠుఁడు:— ఓ రామచంద్రా! నిరుత్తరుఁడవైనంత మాత్రమున ప్రశ్నించుట నుండి విరమింపవద్దు. ప్రశ్నకారణమగు సంశయమునకు ఒరపిడిరాయివలె సారాసారత్వ పరీక్షా స్థానమైయున్న నన్ను కారణమగు అవిద్యక్షయించునంతవఱకు నిరాటంకముగ ప్రశ్నింపుము, దానిచే ప్రశ్నల కారణమగు సంశయములయొక్కయు, సంశయముల కారణమగు అవిద్యయొక్కయు సర్వథాక్షయమగుటచే అనిర్వాచ్యమై సర్వోత్తమస్వభావమైనట్టి ఆత్మయందు స్వయముగ విశ్రాంతి నొందగలవు.

శ్రీరామ ఉవాచ:—

మన్యేఽహం కారణాభావాత్పూర్వమేవ న సర్గతా
ఉదితా తేన కస్యాయం చేత్య చేతనవిభ్రమః. 84

శ్రీరాముఁడు:— మహాత్మా! కారణముయొక్క అభావమువలన సృష్ట్యాదియందే యీ సృష్టి యుత్పన్నముకాకయున్నదని తాముచెప్పిన సిద్ధాంతమును నేను దెలిసికొంటిని, కాని

ఈ చేత్య చేతన (త్రిపుటీరూప) విభ్రమమెవనికి గల్గుచున్నదను సంశయము నాకింకను దొలగ లేదు. కావున నద్దానిని నివారింప ప్రార్థన.

శ్రీ వసిష్ఠ ఉవాచ:—

అకారణత్వాత్సర్వత్ర శాన్తత్వాద్భ్రాన్తిర స్తి నో
అనభ్యాసవశా దేవ న విశామ్యతి కేవలమ్. 35

శ్రీవసిష్ఠుఁడు:— ఓ రామచంద్రా! నేనుజెప్పిన సిద్ధాంతము నెఱిఁగినవాఁడవగుచో అపుడు కారణముయొక్క అభావమువలనజగత్తేలేనందుననను, సర్వత్రశాంతమగుపరమాత్మయే యుండియున్నందునను నిఁక భ్రాంతియేలేవిదగును. కేవలము అభ్యాసములేనందువలననే 'శుద్ధ పరమాత్మయే సర్వత్రగలదు' అనుజ్ఞానముయొక్క దృఢత్వము నీకింకను కలుగకున్నది. కావుననే విశ్రాంతిని బొందక యున్నావు. (అట్టి అవిశ్రాంతియే వ్యర్థముగ నీకు నానా సంశయములను గలిగించుచున్నది.

శ్రీరామ ఉవాచ:—

కుతో భవేదనభ్యాసో భవేదభ్యసనం కుతః
కుతోఽభ్యాసాత్మికా భ్రాన్తిరేషా పునరుపస్థితా. 36

శ్రీరాముఁడు:— మహాత్మా జగద్భ్రాంతికే కారణములేనపుడు ఇఁక అభ్యాస, అన భ్యాసము లెటనుండి సంభవించును? ఈ యభ్యాసరూపమగు భ్రాంతియెట్లు సంభవించినది.

శ్రీ వసిష్ఠ ఉవాచ:—

అనన్తత్వాదనన్తస్య భ్రాన్తిర్నాస్తి చ సంప్రతి
అభ్యాసభ్రాన్తిరఖిలం మహాచిద్ఘనమక్షతమ్. 37

శ్రీవసిష్ఠుడు:— ఓ రామచంద్రా! వాస్తవముగ నేభ్రాంతియులేదు. అనంతరూపుఁ డగుటవలన పరమాత్మ నిజమాయచే నిట్లనంతముగ భాసించుచున్నాడు. జీవన్ముక్తులకు మహా చిద్ఘనమై నాశరహితమైనట్టి పరబ్రహ్మముయొక్క స్వరూపములగు నమస్తవస్తువులతోడ వ్యవహార ప్రవృత్తి యెట్లుండునో అట్లే పరమార్థముననట్టి చిద్ఘనరూపమేయైనట్టి సమస్త ఆభ్యాసప్రవృత్తియు నీకుండుగాక!

శ్రీరామ ఉవాచ:—

ఉపదేశ్యోపదేశాదావనయా శబ్దసంపదా
కిమన్యద్వద మే బ్రహ్మన్సర్వస్మిఞ్ఛాన్తతాం గతే. 38

శ్రీరాముఁడు:— మహాత్మా! జీవన్ముక్తులైన తమవంటివారికి జగద్భ్రమయంతయు శమింప, ఈ యధ్యాత్మ శాస్త్రరూపమగు శబ్దసంపత్తిచే నిఁక ఉపదేశార్థులగు మావంటివారికినుప దేశించుటయందు మఱియొక కారణమేమి గలదు?

శ్రీ వసిష్ఠ ఉవాచ:—

ఉపదేశ్యోపదేశాత్మ బ్రహ్మ బ్రహ్మణి సంస్థితమ్
బోధాత్మని న మోక్షోస్తి న బన్ధోస్తీతి నిశ్చయః. 39

శ్రీ వసిష్ఠుఁడు:— ఓ రామచంద్రా! జీవన్ముక్తుల దృష్టియందు ఉపదేశ్య ఉపదేశ రూపమగు సమస్తమున్ను బ్రహ్మమే. బ్రహ్మమందు నెలకొనియున్నదగును. ఏలయనిన బోధ స్వరూపమగు పరమాత్మయందు బంధముగాని మోక్షముగాని లేదనుట నిశ్చయమైయున్నది.

**శ్రీరామ ఉవాచ :—**

> దేశకాలక్రియాద్రవ్యభేదవేదన చేతసామ్
> సర్వస్యాసంభవే సర్వసత్తా కథముపస్థితా. **40**

శ్రీరాముఁడు:— మహాత్మా! సమస్తపదార్థములు అసంభవమైయుండ నిఁక దేశ, కాల క్రియాద్రవ్యాది భేదమునుగాంచు అజ్ఞానుల దృష్టియందీ జగత్సత్తయంతయు నెట్లుస్థితిగల్గియున్నది.

**శ్రీరామ ఉవాచ :—**

> దేశకాలక్రియాద్రవ్య భేదవేదేన చేతసామ్
> అజ్ఞానమాత్రాదితరాసత్తా నాన్యాస్తి నో పురా. **41**

శ్రీ వసిష్ఠుఁడు:—ఓ రామచంద్రా! దేశ, కాల క్రియా, ద్రవ్యాది భేదమును గాంచు అజ్ఞానుల దృష్టియందీ జగత్సత్తయంతయు స్థితిగల్గియుండుటకు కారణము అజ్ఞానముతప్ప వేఱేమియునుగాదు.

**శ్రీరామ ఉవాచ :—**

> బోధ్యబోధకతాపత్తేరభావాద్బోధతా కథమ్
> ద్వైతైక్యాసంభవే బ్రహ్మన్కారణాసంభవే సతి. **42**

శ్రీరాముఁడు:— మహాత్మా! తత్త్వదృష్టిచే కారణముయొక్క అభావమువలన ద్వైత, ఏకత్వములు అసంభవముకాఁగా బోధ్య, బోధకభావములయొక్కయు అభావము సిద్ధింప నపుడిఁక బోధ్యత్వమెటుల సంభవింపగలదు? (అకర్మకమగు బోధశబ్దము లోకమున నప్రసిద్ధమై యున్నదిగదా!)

**శ్రీవసిష్ఠ ఉవాచ :—**

> బోధేనబోధతామేతి బోధశబ్దస్తు బోధ్యతామ్
> భవద్విషయమేవాయముచితో నాస్మదాదిషు. **43**

శ్రీవసిష్ఠుఁడు:—ఓ రామచంద్రా! అజ్ఞాతమగు బ్రహ్మమే తనయొక్క అజ్ఞానక్షయమను ఫలాశ్రయత్వమువలన బోధకర్మత్వమును బొందుచున్నది. కావున బోధశబ్దమున్ను బోధఫలరూపమగు సకర్మత్వమును బడయుచున్నది. ఈ సమస్తమున్ను అజ్ఞానయుక్తులగు నీవంటివారియందే యుచితమైయున్నదిగాని, (అజ్ఞానము క్షయించిన జీవన్ముక్తులగు) మావంటి వారియందుగాదు.

**శ్రీరామ ఉవాచ:—**

> బోధ ఏవ యథాహన్త్వమేతి బోధాన్యతా తదా
> కుతః ఏషా పరేఽనన్తే నాసావతిజలే ఒమలే. **44**

శ్రీరాముఁడు:— మహాత్మా! 'మావంటివారియందుగాదు' అని తాము వచించుటచే జీవన్ముక్తులందుఁ అస్మచ్ఛబ్ద ప్రవృత్తికి నిమిత్తభూతమగు అహంత్వముఁ తమచే దర్శింపఁజేయ

బడినది. జీవన్ముక్తులందు అజ్ఞానము లేకుండును, గావున, ఆ అహంత్వము అజ్ఞానకార్యము గానేరదు. అందుచేత, బోధయే (జ్ఞానమే) అహంత్వరూపపరిణామమును బొందుచున్నదని చెప్పవలసియుండును. కాని, వాస్తవముగ బోధకంటె అహంత్వము భిన్నమైయుండుట దుర్వారమై యున్నది. మఱియు ఈ అహంత్వాదులచే జీవరూపమే చెప్పఁబడుచున్నది. అట్టిచో నది పరమై, అనంతమై, త్రివిధపరిచ్ఛేదశూన్యమై జలముకంటెను అతి నిర్మలమైనట్టి శుద్ధ చిన్మాత్రస్వరూపమును ధరించియున్న తమయందెట్లుండఁగలదు ?

శ్రీ వసిష్ఠ ఉవాచ:—

యత్తద్బోధస్య బోధత్వం తదేవాహన్త్వ ముచ్యతే
ద్విత్వమత్రానిలస్పన్ద వ్యశోరివ నిగద్యతే. 45

శ్రీ వసిష్ఠుఁడు:— ఓ రామచంద్రా! బోధయొక్క బోధరూపత్వమేదిగలదో, అదియే వాయువుయొక్క స్పందమువలె భిన్నరూపముగ 'అహంత్వమను' పేరుచే మావంటివారియందుఁ జెప్పఁబడుచున్నదేగాని, అజ్ఞానులయొక్క అభిమానప్రధానమగు అహంత్వరూపముఁ చేగాదు,

శ్రీరామ ఉవాచ:—

సౌమ్యాబ్ధ్యేస్తరఙ్గాదిర్యథాదత్తే యథాస్థితమ్
తథాస్వరూపమాత్రాత్మ బోధ్యం బోధోఽవబుద్ధవాన్. 46

శ్రీరాముఁడు:— మహాత్మా! అట్లైనచో, శాంతసముద్రము తరంగాదిరూపములను ధరించునట్లు జీవన్ముక్తుల దృష్టికి చిన్మాత్రమగు ఆత్మయే అహంత్వాది జగత్తునున్ను బోధ్య బోధాది త్రిపుటీరూపమునున్ను ధరించుచున్నదని తేలినది

శ్రీ వసిష్ఠ ఉవాచ:—

ఏవం చేత్తత్కథం కః స్యాద్దోషోద్విత్వాదిదోషతః
అనన్తే స్థిత ఏకస్మిఞ్ఛాన్తే పూర్ణే పరే పదే. 47

శ్రీ వసిష్ఠుఁడు:— ఓ రామచంద్రా! ఇట్లు అనంతమై, శాంతమై, ఏకమై, పరిపూర్ణమైనట్టి పరమపదరూపమగు కేవల పరబ్రహ్మమే సర్వరూపముగ స్థితినొందియున్నచో, అపుడిఁక నీవు వచించిన ద్వైతాదిజనిత అద్వైత హానిరూపదోషమెయ్యది యెట్లుండఁగలదు ?

శ్రీరామ ఉవాచ:—

కోఽత్ర కల్పయితాహన్త్వం భుక్త్వే భోక్తా చ కశ్చవా
యన్మూలం యజ్జగన్నాన్తిరనన్తా ప్రవిజృమ్భతే. 48

శ్రీరాముఁడు:—మహాత్మా! శుద్ధ అద్వైతపక్షమే సరియగుచో నపుడు దేనిమూలమున ఈ యనంత సంసారభ్రమ విజృంభించుచున్నదో, అట్టి అహంత్వరూప వికల్పమును కల్పించువాడెవఁడు? అట్లు కల్పించి వ్యవహారము ననుభవించువాడెవఁడు?

శ్రీ వసిష్ఠ ఉవాచ:—

జ్ఞేయసత్తావబోధే హి బన్ధనం సచ్చ నాస్త్యలమ్
జ్ఞప్తేః సర్వార్థరూపత్వాద్బన్ధ మోక్షావతః కుతః. 49

శ్రీవసిష్ఠుడు :— ఓరామచంద్రా! పరబ్రహ్మముకంటె భిన్నముగ జ్ఞేయ (దృశ్య) పదార్థముయొక్క సత్తయందలి అభినివేశముచేతనే బంధనములగును. తత్త్వవేత్తల కట్టి జ్ఞేయ (దృశ్య) మొకింతైనను లేదు. వారికి జ్ఞానస్వరూపమగు పరమాత్మయే సర్వపదార్థాకారముగ భాసించును. కావున నిఁక బంధ, మోక్షముల కల్పనయే వారికెచట?

**శ్రీరామ ఉవాచ:—**

జ్ఞప్తేర్బాహ్యార్థతా దీపాన్నీలాదీవ ప్రవర్తతే
బాహ్యాస్త్వర్థోఽస్తి సద్రూపో నను దృష్టోపలమ్భతః. 50

శ్రీ రాముఁడు:— మహాత్మా! జ్ఞప్తి (జ్ఞానస్వరూపము) సర్వపదార్థరూపముకాదు. ఏలయనిన ప్రకాశకమగు దీపముచేగాని, సూర్యునిచేగాని నీల, పీతాదివర్ణములుగల ఘటపటాదు లెట్లు తమస్థితిఁబొందుచున్నవో, అట్లే, జ్ఞానస్వరూపమగు పరమాత్మయొక్క సత్తచే బాహ్యఘట పటాదుల స్థితి బొందుచున్నది. ఇట్లు ప్రత్యక్షాది సిద్ధమగు బాహ్యపదార్థము జ్ఞప్తి (చైతన్యము కంటె వేఱుగ స్థితినొందియున్నదై, సద్రూపముగ వెలయుచున్నదని సిద్ధించుచున్నది గదా!

**శ్రీ వసిష్ఠ ఉవాచ:—**

అకారణస్య కార్యస్య బాహ్యస్యార్థస్య సత్యతా
యేయం సా భ్రాన్తిమాత్రాత్మరూపిణీ నేతరాత్మికా. 51

శ్రీవసిష్ఠుడు :— ఓరామచంద్రా! కార్యరూపములగు పృథివ్యాది బాహ్యపదార్థములు కారణశూన్యములైయుండుటచే వంధ్యాపుత్ర సదృశములేయైయున్నవి. వీనియొక్క సత్యత్వమెయ్యది ప్రత్యక్షముగ భాసించుచున్నదో, అది శుక్తిరజతముయొక్క సత్యత్వమువలెఁ కేవలము భ్రాంతి మాత్రమేయైయున్నదిగాని యథార్థముకాదు.

**శ్రీరామ ఉవాచ:—**

స్వప్నః సత్యో స్త్వసత్యో వా దుఃఖం తావత్ప్రయచ్ఛతి
తథైవేయం జగద్భ్రాన్తిః క ఉపాయోఽత్ర కథ్యతామ్. 52

శ్రీ రాముఁడు :— మహాత్మా! స్వప్నము సత్యమైనను, అసత్యమైనను నగుగాక! దుఃఖమును మాత్రమది కలిగించుచునేయున్నది. అట్లే యీ జగద్భ్రాంతియున్ను దుఃఖమును గలిగించుచున్నది. కావున, దీని నివారణకొఱకై యుపాయమేది కలదో వచింపప్రార్థన.

**శ్రీ వసిష్ఠ ఉవాచ:—**

ఏవం తావద్యథా స్వప్నస్తథేయం చేజ్జగత్స్థితిః
తత్పిణ్డగ్రహకార్థానాం సర్వైవ భ్రాన్తితోదితా. 53

శ్రీవసిష్ఠుడు:— ఓరామచంద్రా! ఎపుడీ జగత్తుయొక్క స్థితి స్వప్నమువంటిదని సిద్ధించినదో అపుడిఁక మేల్కానినపుడప స్వప్నపదార్థములు బాధితములగుటచే దుఃఖమెట్లు నివర్తించుచున్నదో, అట్లే ఆత్మజ్ఞానముచే జగత్పదార్థములంతటి పిండగ్రహత్వము (సాకారత్వ

జ్ఞానము) బాధితమగుటచే సమస్తదుఃఖమున్ను శమించుచున్నది. స్వప్నమందువలె ఈ సమస్త పదార్థములయొక్కయు సత్యత్వము భ్రాంతిచేతనే యుదయించినదగును.

**శ్రీరామ ఉవాచః—**

**కిమేతావతి సంపన్నే సంపన్నం భవతి ప్రియమ్**
**కథం చ శామ్యత్యర్థానాం స్వప్నాదౌ పిణ్డరూపతా. 54**

శ్రీ రాముఁడు :— మహాత్మా ఈ ప్రపంచమును మిథ్యామాత్రముగ నెఱిఁగినంత మాత్రముననే ఆనందము కలుగునా? కేవలము మిథ్యాజ్ఞానమాత్రముచే స్వప్న, జాగ్రత్తులందు పదార్థముల యొక్క స్థూలరూపత్వ మెట్లు శమించును?

**శ్రీ వసిష్ఠ ఉవాచః—**

**పూర్వాపరవరామర్శాత్క్షీణితార్థేషు శామ్యతి**
**స్వప్నే ప్యేవం స్థితే స్థూలా భావనా వినివర్తతే. 55**

శ్రీవసిష్ఠుఁడు:— ఓ రామచంద్రా! పూర్వాపర (అధ్యాత్మశాస్త్ర)విచారణచే జ్ఞానోదయము కాఁగా నపుడు పదార్థములందలి స్థూలత్వము నివర్తించుచున్నది. అట్లే స్వప్నమునుండి మేల్కొనిన మీదట స్వప్నపదార్థములందలి స్థూలభావన (సత్యత్వబుద్ధి)యు నివర్తించుచున్నది.

**శ్రీరామ ఉవాచః—**

**భావనా తనుతాం యాతా యస్యాసౌ కిం ప్రపశ్యతి**
**కథం శామ్యతి తస్యాయం సంసారకుహరభ్రమః. 56**

శ్రీరాముఁడు:— మహాత్మా! పూర్వాపరవిచారణచే నెవనికి జగత్తుయొక్క స్థూలత్వ భావన సన్నగిల్లునో, అట్టి జీవన్ముక్తుఁడు ప్రపంచము నేప్రకారముగఁగాంచును? మఱియు నాతనికి సంసారకూపమునుగూర్చిన భ్రమ యెట్లు శమించును?

**శ్రీ వసిష్ఠ ఉవాచః—**

**ఉద్ధ్వస్తమసదాభానముత్పన్ననగరోపమమ్**
**వర్షప్రోన్మృష్టచిత్రాభం జగత్పశ్యత్యవాసనః. 57**

శ్రీవసిష్ఠుఁడు:— ఓ రామచంద్రా! వాసనారహితుఁడగు జీవన్ముక్తుఁ డీప్రపంచమును నశించిన దానివలెను, అసత్తుగను, గంధర్వనగరమువలెను, వర్షముచే బాగుగ తుడిచివేయ బడిన చిత్రమువలెను గాంచును

**శ్రీరామ ఉవాచః—**

**తతః కిం తస్య భవతి వాసనాతానవే స్థితే**
**పిణ్డగ్రహే గతేఽర్థానాం స్వప్నోపమజగత్స్థితేః. 58**

శ్రీరాముఁడు:— మహాత్మా! వాసనలు సన్నగిల, స్వప్నమువంటి యీ జగత్తుయొక్క పదార్థములందు స్థూలత్వబుద్ధి నివర్తింప ఆ పిమ్మట మనుజునకేమి గలుగును?

శ్రీవసిష్ఠ ఉవాచ:—

సంకల్పరూపజగతః క్రమాత్స్వాపి విలీయతే
వాసనా తస్య తేనాశు స నిర్వాతి వివాసనః. 59

శ్రీవసిష్ఠుఁడు:— ఓరామచంద్రా! సంకల్పరూపమగు ఈజగత్తునుగూర్చిన స్థూలత్వబుద్ధి నశింప అతనికి ఉత్తరోత్తరభూమికాపరిపాకముచేఁ గ్రమముగ అసూక్ష్మవాసనయు నశించిపోవును. దానిచే వాసనారహితుఁడగు ఆజీవుఁడు ఆత్మానుభవమునొంది శీఘ్రముగ పరమశాంతిని బొందును.

శ్రీరామ ఉవాచ:—

అనేకజన్మసంరూఢా శాఖా ప్రసవశాలినీ
భవబన్ధకరీ ఘోరా కథం శామ్యతి వాసనా. 60

శ్రీరాముఁడు: మహాత్మా! అనేకజన్మలందు బాగుగ దృఢపడినట్టి మూలముగలదియు, పెక్కుశాఖలతోఁగూడినదియు, సంసారబంధమును కలుగఁజేయునదియు, భయంకరమై యొప్పునదియునగు ఈ వాసన యెట్లు శమించును?

శ్రీవసిష్ఠ ఉవాచ:—

యథాభూతార్థవిజ్ఞానాద్భ్రాన్తిమాత్రాత్మని స్థితే
పిణ్డగ్రహవియుక్తేఽస్మిన్దృశ్యచక్రే క్రమాత్క్షయః. 61

శ్రీవసిష్ఠుఁడు:— ఓరామచంద్రా! భ్రాంతిమాత్రరూపమగు ఈ దృశ్యచక్రము యథార్థమగు ఆత్మవిజ్ఞానముచే స్థూలత్వరహితమై (దగ్ధపటన్యాయముగ) యెప్పుడుండునో, అపుడు క్రమముగ, అవాసన క్షయించును.

శ్రీరామ ఉవాచ:—

పిణ్డగ్రహవిముక్తేఽస్మిన్దృశ్యచక్రే క్రమాన్మునే
సంపద్యతే కిమపరం కథం శాన్తిః ప్రజాయతే. 62

శ్రీరాముఁడు:— ఓమునీంద్రా! అట్టి దృశ్యచక్రము క్రమముగ స్థూలత్వరహితము కాఁగా నపుడేమి సంప్రాప్తించును? మఱియు నమ్మనుజునకుఁ బూర్ణశాంతి యెట్లు జనించును?

శ్రీవసిష్ఠ ఉవాచ:—

పిణ్డగ్రహభ్రమే శాన్తే చిత్తమాత్రాత్మతాం గతే
నిరోధకారవోన్ముక్తే జగత్యాస్థోపశామ్యతి. 63

శ్రీవసిష్ఠుఁడు:— ఓరామచంద్రా? జగత్తుయొక్క స్థూలత్వమునుగూర్చిన భ్రమశమింప, దృశ్యమంతయు చిత్తమాత్రస్వరూపత్వమును బొంద మఱియు జగత్తునిరోధకార రహితము సూక్ష్మముకాఁగా నపుడు మనుజునకు భోగములందాసక్తి శమించును. (పరమవైరాగ్య ముదయించును.)

శ్రీరామ ఉవాచ:—

బాలసంకల్పరూపేఽస్మిన్స్థితే జగతి భాసురే
కథమాస్థోపశమనం తాదృగ్దుఃఖాయ కిం నరః. 64

శ్రీరాముఁడు:— మహాత్మా ! ఈజగత్తు బాలుని సంకల్పమువలె అతికోమలమై, ప్రకాశ శీలమై భాసించినప్పటికిని, దుఃఖహేతువగు భోగాసక్తి మనుజునకెట్లు శమించును? మఱియు నట్టి అతికోమలమైన సంకల్పముగలవాఁడైనను బాలకుఁడు దుఃఖముల ననుభవించుచు నేల కానఁబడు చున్నాఁడు?

**శ్రీ వసిష్ఠ ఉవాచ:—**

సంకల్పమాత్రసంపన్నే నష్టే దుఃఖం కథం భవేత్
సంకల్ప చిత్తమాత్రం యత్తత్త్వాత్త్వవిచార్యతామ్. 65

శ్రీవసిష్ఠుడు:— ఓ రామచంద్రా! ఎపుడీ జగత్తు సంకల్పమాత్రమని సిద్ధించినదో, అపుడిఁక దుఃఖమెట్లు కలుగును? అవిచారణచే ఈ జగత్తుయొక్క సూక్ష్మ (సంకల్ప, చిత్త) రూపత్వముయొక్క అపరిజ్ఞానమువలననే బాలునకును దుఃఖముకలుగును. విచారణచే నద్దాని పరిజ్ఞానమువలన జగత్తుయొక్క నాశాదులచేఁ గూడ దుఃఖముకలుగదు. ఇవ్విషయమునుఁగూర్చి నీవున్ను విచారింపుము

**శ్రీరామ ఉవాచ:—**

కీదృశం భగవంశ్చిత్తం కథం తత్త్వవిచార్యతే
కించ సంపద్యతే బ్రూహి తస్మిన్సమ్యగ్విచార్యతే. 66

శ్రీరాముఁడు:— మహాత్మా ! చిత్తముయొక్క స్వరూపమెట్టిది? అదియెట్లు విచారింపఁ బడును? మఱియు, దానిఁగూర్చి బాగుగ విచారించిన పిమ్మట నేమి కలుగును? తెలుపప్రార్థన.

**శ్రీ వసిష్ఠ ఉవాచ:—**

చితశ్చేతోన్ముఖత్వం యత్తచ్చిత్తమితి కథ్యతే
విచార ఏష వివాస్య వాసనానేన శామ్యతి. 67

శ్రీవసిష్ఠుడు:— ఓ రామచంద్రా! చైతన్యముయొక్క విషయముల వైపునకు అభిముఖ మగుటచే చిత్తముయొక్క స్వరూపమైయున్నది. మఱియు నిపుడు నీవు నా యెదుట గావించుచున్న (యోగవాసిష్ఠ) మహారామాయణముయొక్క శ్రవణమేదిగలదో అదియేయాచిత్తము యొక్క విచారణమైయున్నది. ఇట్టి విచారణచే వాసననశించును.

**శ్రీరామ ఉవాచ:—**

కియన్మాత్ర భవేద్బ్రహ్మన్న చేతోన్ముఖతా చితేః
చిత్తస్యాచిత్తతోదేతి కథం నిర్వాణకారిణీ. 68

శ్రీ రాముఁడు:— మహాత్మా! చిత్తము విద్యమానమైయుండ, తన్నిరోధముద్వారా గావింపబడు యద్దాని విషయోన్ముఖతారాహిత్య మెంతకాలము వఱకుండును? మఱియు, నిర్వాణ ప్రదమైనట్టి, చిత్తముయొక్క అచిత్తత్వరూపమగు స్థితి యెట్లుదయించును?

**శ్రీ వసిష్ఠ ఉవాచ:—**

చేత్యం న సంభవత్యేవ చిత్కం చేతయతే కుతః
చేత్యాసంభవతశ్చిత్తసత్తా నాస్తి తతశ్చిరమ్. 69

శ్రీవసిష్ఠుడు :— ఓ రామచంద్రా! వాస్తవముగ దృశ్యమే సంభవింపకయుండనీక చైతన్యము దేని నెట్లు ప్రకాశింపఁజేయగలదు? కావున, దృశ్యమే లేకయున్నందున చిత్తముయొక్క సత్తలేదని చిరకాలము భావించుటయే చిత్తనాశమున కుపాయమైయున్నది.

**శ్రీరామ ఉవాచః—**

**కథం న సంభవత్యేతచ్చేత్యం యదనుభూయతే**
**అపహ్నవశ్చానుభవే క్రియతే కథమీదృశః. 70**

శ్రీరాముఁడు:— మహాత్మా! ప్రత్యక్షముగ సదా సర్వులచే ననుభవింపఁబడుచున్నట్టి యీ దృశ్యజగత్తెట్లు లేనిదగును? ఈ ప్రకారముగ ప్రత్యక్షానుభవముయొక్క నిషేధమును తామెట్లు చేయుచున్నారు?

**శ్రీ వసిష్ఠ ఉవాచః—**

**యాదృక్స్వాదజ్ఞవిషయం జగత్తస్య న సత్యతా**
**యాదృక్చ తజ్జ్ఞవిషయం తదనాఖ్యం యదద్వయమ్. 71**

శ్రీవసిష్ఠుఁడు:— ఓ రామచంద్రా! ఇట అజ్ఞానులకేది యనుభూతమగుచున్నదో, అట్టి సాకారమైన జగత్తు సత్యముకాదు. జ్ఞానులకేదియనుభూతమగుచున్నదో, అది వాగతీతమై, అద్వయమైనట్టి సత్యమగు పరబ్రహ్మమే యైయున్నది.

**శ్రీరామ ఉవాచః-**

**త్రిజగత్కీదృగజ్ఞానాం కథం తస్య న సత్యతా**
**తజ్జ్ఞానాం తు జగద్యాదృక్తద్వక్తుం కిం న యుజ్యతే. 72**

శ్రీరాముఁడు:— మహాత్మా! అజ్ఞానుల కీత్రైలోక్యమెట్లు భాసించునే? అయ్యది సత్యమేలకాదు? జ్ఞానుల కిజగత్తెట్లు భాసించునో, అది వాక్కునకు విషయమేల కాదు?

**శ్రీ వసిష్ఠ ఉవాచః—**

**ఆద్యన్తద్వైతమజ్ఞానాం తజ్జ్ఞానాం తన్న విద్యతే**
**జగచ్ఛ నో సంభవతి నిత్యానుత్పన్నమాదితః. 73**

శ్రీవసిష్ఠుఁడు;— ఓ రామచంద్రా! అజ్ఞానుల కిజగత్తు ఆద్యంతసహితముగను, అనేగా దేశకాలవస్తు పరిచ్ఛేదయుక్తముగను, ద్వైతరూపముగను భాసించును. జ్ఞానుల కవ్విధమున భాసింపదు. వారికిది ఆరంభమునుండియు నెప్పుడును నుత్పన్నముకానిదిగను, వంధ్యాపుత్రునివలె నేకాలమందును. సంభవింపనిదిగను. అసద్రూపముగను భాసించును.

**శ్రీరామ ఉవాచః—**

**ఆదితో యదనుత్పన్నం న సంభవతి కర్హిచిత్**
**అసద్రూపమనాభాసం కథం తదనుభూయతే. 74**

శ్రీరాముఁడు :– మహాత్మా ! ఏజగత్తు ప్రారంభమునుండియు నుత్పన్నముకానిదేయై, ఎపుడును సంభవింపనిదై, అసద్రూపమై, భాసింపనిదైయున్నదో, అయ్యది సర్వులకును అర్థక్రియా సమర్థముగ నేల యనుభూతమగుచున్నది ?

**శ్రీ వసిష్ఠ ఉవాచ:—**

అసదేవ సదాభాసమనుత్పన్నమకారణమ్
జాగ్రత్స్వప్నవదుద్భూతమర్థ కృచ్చాను భూయతే. 75

శ్రీవసిష్ఠుఁడు:– ఓ రామచంద్రా ! కారణశూన్యమై, ఉత్పత్తిరహితమై, అసద్రూపమేయై యున్నప్పటికిని, ఈ జగత్తు స్వప్నమువలె నుద్భవించినదై, అర్థక్రియాసమర్థముగ ననుభూతమగు చున్నది.

**శ్రీరామ ఉవాచ:—**

స్వప్నాదౌ కల్పనాదౌ చ యద్దృశ్యమనుభూయతే
తజ్జాగ్రద్రూపసంస్కారాదనుష్ఠానానుభూతితః. 76

శ్రీరాముఁడు:— మహాత్మా ! స్వప్నాదులందును, మనోరాజ్యాది కల్పనలందును ఏ దృశ్యమనుభవింపఁబడుచున్నదో, అది జాగ్రద్వ్యవహారముయొక్క అనుష్ఠాన, అనుభవములచే గల్గిన సంస్కారమువలన ననుభవింపఁబడుచున్నదగును గదా !

**శ్రీ వసిష్ఠ ఉవాచ:—**

కిం జాగ్రద్రూపమాహోస్విదన్యత్స్వప్నేఽను భూయతే
సంకల్పే చ మనోరాజ్యే ఇతి మే వద రాఘవ. 77

శ్రీవసిష్ఠుడు:— ఓ రామచంద్రా ! స్వప్న, సంకల్ప, మనోరాజ్యాదులం దేపదార్థము లనుభవింపఁబడుచున్నవో, అవి జాగ్రత్ప్రసిద్ధ పదార్థములేనా ? లేక, అన్యములాయను విషయము నాకుఁజెప్పుము ?

**శ్రీరామ ఉవాచ:—**

స్వప్నేషు కల్పనాద్యేషు జాగ్రదేవావభాసతే
సంస్కారాత్మతయా నిత్యం మనోరాజ్యభ్రమేషు చ. 78

శ్రీ రాముఁడు :– మహాత్మా ! స్వప్నములందును, కల్పనాదులందును, మనోరాజ్య భ్రమాదులందును నేపదార్థములు భాసించుచున్నవో, అవి జాగ్రత్ప్రసిద్ధ పదార్థములే సంస్కార రూపముచేనట్లు భాసించుచున్నవగును.

**శ్రీ వసిష్ఠ ఉవాచ:—**

తదేవ జాగ్రత్సంస్కారాత్స్వప్నశ్చేదవ భాసతే
తత్స్వప్నే లుఠితం గేహం కథం ప్రాతరవాప్యతే. 79

శ్రీవసిష్ఠుఁడు:— ఓ రామచంద్రా ! జాగ్రత్పదార్థములే సంస్కారమువలన స్వప్నాదు లందు భాసించుచో రాత్రిస్వప్నమున పడిపోయినట్టి గృహము మరల ప్రాతఃకాలమున నెట్లు లభించుచున్నది.

శ్రీరామ ఉవాచ:—

న జాగ్రద్రాజతే స్వప్నే తద్బ్రహ్మాన్యత్తదేవ హి
బుద్ధమేతత్కథం త్వన్యదపూర్వమివ భాసతే. 80

శ్రీరాముఁడు:— మహాత్మా! స్వప్న, సంకల్పాదులం దేజగత్తుభాసించుచున్నదో, అది జాగ్రజ్జగత్తుకాదనియు, బ్రహ్మమే యాయావిధముగ నట పదార్థరూపముగ భాసించుచున్నదనియు నగు తమ యభిప్రాయమును నేనెఱిఁగితిని. కాని ఆ బ్రహ్మము అపూర్వమైన జగత్తువలెనేల భాసించుచున్నదో, తెలుపవేఁడెద.

శ్రీవసిష్ఠ ఉవాచ :—

నానుభూతోఽనుభూతశ్చ చేతస్యర్థోఽవభాసతే
సర్గాద్యన్తాదిమధ్యేషు స్వభ్య స్త స్త్వితి భాసతే. 81

శ్రీవసిష్ఠుఁడు:— ఓ రామచంద్రా! కొన్నిపదార్థములు చిత్తముచేఁ బూర్వమనుభవింపఁబడకయున్నందున అపూర్వములుగను, మఱికొన్నియనుభవింపఁబడుటవలన అపూర్వములు గాకయు భాసించుచున్నవి. మఱియు నయ్యవి సృష్టియొక్క ఆద్యంతమధ్యములం దేయే యాకారముతో బాగుగ అభ్యస్తములైయున్నవో, ఆయా యాకారముతోనే భాసించును. బ్రహ్మాకారముగ లెస్సగ నభ్యసింపఁబడుచో బ్రహ్మముగనే భాసించును.

శ్రీరామ ఉవాచ:—

ఏవం స్వప్నాత్మకం భాతి జగదిత్యేవ బుద్ధవాన్
గ్రహవత్స్వప్నయక్షోఽయం కథం బ్రహ్మంశ్చికిత్స్యతే. 82

శ్రీరాముఁడు:— మహాత్మా! ఈ ప్రకారముగ తమచే బోధితుఁడనై ఈ జాగ్రజ్జగత్తును స్వప్నమువలె మిథ్యగభాసించుచున్నదను విషయమును నేనెఱిఁగితిని. కాని గ్రహమువలె ఈసంసార స్వప్నమను పిశాచము బాధించుచున్నది. కావున దీనిచికిత్స యెట్లొనర్పఁబడునో తెలుపప్రార్థన.

శ్రీ వసిష్ఠ ఉవాచ:—

యోఽయం సంసరణస్వప్నః సకింకారణకో భవేత్
కార్యాన్న కారణం భిన్నమితి దృష్టం విచారయ. 83

శ్రీవసిష్ఠుఁడు:— ఓ రామచంద్రా! కార్యము కారణముకంటె భిన్నముకాదు. కాఁబట్టి ఈ సంసారస్వప్నమునకు కారణమేమియో నీవుమొదట విచారింపుము. అటుపిమ్మట ఆకారణము యొక్క నాశముచే ఈ కార్యమగు సంసారభ్రమయు నశించును.

శ్రీరామ ఉవాచ:—

చిత్తం స్వప్నోపలమ్భానాం హేతుస్తస్మాత్తదేవ తే
విశ్వం చాద్యన్తరహితమనాసారమనామయమ్. 84

శ్రీరాముఁడు:— మహాత్మా! స్వప్నరూపములగు ఈ జగత్పదార్థముల యొక్క హేతువు చిత్తమేయైయున్నది. కావున ఈ పదార్థములన్నియును చిత్తరూపములేయగును. మఱియు అసార మగు ఈ ప్రపంచము వాస్తవముగ ఆద్యంతరహితమై నిర్వికారమైనట్టి బ్రహ్మమేయైయున్నది.

శ్రీ వసిష్ఠ ఉవాచ:—

ఏవం చిత్తం మహాబుద్ధే మహాచిద్ఘనమేవ తత్
తథాస్థితం న స్వప్నాది కించనాస్తీతరాత్మకమ్. 85

శ్రీవసిష్ఠుఁడు:— మహాబుద్ధివగు ఓ రామచంద్రా! చిత్తము విషయోన్ముఖమగు చైతన్యమే కావుననయ్యది మహాచిద్ఘన రూపమే యైయున్నది. ఇక్కారణమున స్వప్న జాగ్రదాదులు బ్రహ్మముకంటె భిన్నముగ నొకింతైననులేవు.

శ్రీరామ ఉవాచ:—

అవయవావయ వినోర్యథా భిన్నాస్తథా స హి
తత్రానవయవే బ్రహ్మణ్యేకతా జగదాదినా. 86

శ్రీరాముఁడు:— మహాత్మా! అవయవములగు శాఖాదులకును అవయవియగు వృక్షమునకును భేదసహిష్ణువైన తాదాత్మ్యరూపమగు ఏకీభావమెట్లుగలదో, అట్లే చైతన్య జగత్తులకును నట్టి యేకీభావమేల యుండరాదు? జగత్తుయొక్క ఆదియగు సమష్టి చిత్తములతోడ, అవయవరహితమగు బ్రహ్మమునకు ఏకత్వమేల సంభవింపరాదు

శ్రీ వసిష్ఠ ఉవాచ:—

ఏవం న సంభవత్యేవ నిత్యానుత్పన్నమాదితః
జగత్తేనాజరం శాన్తమజం సర్వమవేధితమ్. 87

శ్రీవసిష్ఠుఁడు:— ఓ రామచంద్రా! ఇట్టికల్పన సంభవింపనేరదు. ఏలయనిన ఈ జగత్తు ప్రారంభమునుండియు నుత్పన్నమేకాకయున్నది. కావున కల్పితజగత్తునకు బ్రహ్మముతోడ భేదాభేద సంబంధముగాని అవయవావయవ సంబంధముగాని సంభవింపనేరదు. కాఁబట్టి యీ జగత్తంతయును శాంతమై, జన్మజరావర్జితమై, అఖండమైనట్టి పరబ్రహ్మమే అయియున్నది.

శ్రీరామ ఉవాచ:—

కాకతాలీయవన్మన్యే సర్గాద్యన్తాదయో భ్రమాః
భ్రాన్తిద్రష్టృత్వభోక్తృత్వసహితాః పరమే పదే. 88

శ్రీరాముఁడు:— మహాత్మా! భ్రాంతిరూపములైన ద్రష్టృత్వ, భోక్తృత్వాది సహితములగు సృష్టియొక్క ఆద్యంతాది భ్రమలుకాకతాళీయన్యాయముగ (అకస్మాత్తుగ) పరమపదమగు బ్రహ్మమందు స్థితిగల్గియున్నవని నేను దలంచుచున్నాను.

శ్రీ వసిష్ఠ ఉవాచ:—

యా వ్యాపారవతీ రసాన్ద్రసవిదాం కాచిత్కవీనాం నవా
దృష్టిర్యా పరినిష్ఠితార్థవిషయోన్మేషా చ వైపశ్చితీ
తే ద్వే అప్యవలమ్బ్య విశ్వమఖిలం నిర్వర్ణితం నిర్వృతం
యావద్దృష్టిదృశో న సన్తి కలితా నో శూన్యతా నో భ్రమః. 89

ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకియే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే ఉత్తరార్ధే రామవిశ్రాన్తిర్నామ నవత్యధిక శతతమః సర్గః ॥ 190 ॥

శ్రీవసిష్ఠుఁడు:- ఓ రామచంద్రా! పామరదృష్టి, యౌక్తిక దృష్టి, తత్త్వదృష్టి అని దృష్టి మూఁడువిధములుగ బ్రసిద్ధమైయున్నది. అందు మొదటిదృష్టి రెండవదృష్టిచేతను, రెండవది మూఁడవదానిచేతను నిరాకరింపఁదగియున్నవి. కావున నేను, సారమునుండియు సారమును బాగుగమథించి యద్దాని నెఱుఁగ సమర్థులును, ప్రమాణ, ప్రమేయతత్త్వ పరీక్షాకుశలురునునగు, పండితులయొక్క దృఢవిచార వ్యాపార రూపమైనదియు, నూతనమైనదియునగు రెండవ (యౌక్తిక) దృష్టిని అధ్యాత్మ శాస్త్రములయొక్క శ్రవణ. మనన, నిదిధ్యాసనములచే సిద్ధించు పరమతత్త్వము యొక్క అపరోక్ష స్ఫురణము తనయొక్క చరమసాక్షాత్కార వృత్తియందుగలదియు, జీవన్ముక్తులందుఁ బ్రసిద్ధమైనదియునగు మూఁడవ (తత్త్వ) దృష్టిని నవలంబించి ఎంతవఱకుదృష్టులుగాని, ద్రష్టలగు జీవులుఁగాని కాలత్రయమందును లేక యుందురో, జగత్తుయొక్క శూన్యత్వముగాని, భ్రమయనునదిగాని వర్తింపకయుండునో, అంత వఱకును, అనఁగా నిత్యాపరోక్ష పరమానంద బ్రహ్మైకవస్తుస్థితి పర్యంతమును, ఈ సమస్తజగత్తును నీకు వర్ణించి చెప్పితిని.

ఇది శ్రీ వాసిష్ఠతాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున నుత్తరార్ధమున రామవిశ్రాంతియను నూటతొంబదవ సర్గము ॥ 190 ॥



## ఏకనవత్యధికశతతమః సర్గః

[ బ్రహ్మైవ జగదాకారం యథా భాత్యప్రబోధతః
ప్రబుద్ధమాత్రనిర్వాణం తత్పమ్యగిహ వర్ణ్యతే.

అజ్ఞానముచే బ్రహ్మమే జగదాకారముగ భాసించుచున్నదనియు, జ్ఞానముచే కేవలము నిర్వాణ రూపమగు బ్రహ్మమే శేషించుచున్నదనియు నిచట బాగుగ వర్ణింపఁబడుచున్నది. ]

శ్రీరామ ఉవాచ:—

ఏవం చేత్తన్మునిశ్రేష్ఠ పరమార్థమయం జగత్
సర్వదా సర్వభావాత్మా నోదేతి న చ శామ్యతి. 1

శ్రీరాముఁడు:— ఓ మునిశ్రేష్ఠా! అట్లైనచో ఈ జగత్తంతయును పరమార్థభూతమగు బ్రహ్మముయొక్క వివర్తమాత్రమేయగును. సదా సర్వస్వరూపమైవెలయు ఆబ్రహ్మమెప్పుడును నుదయింపదు, శమింపదు.

భ్రాన్తిరేవేయమాభాతి జగదాకారరూపిణీ
భ్రాన్తిరేవాపి వా నైవ బ్రహ్మసత్తైవ కేవలా. 2

యౌక్తిక (తర్క) దృష్టిచే కేవలము భ్రాంతి (విక్షేపశక్తి ప్రధానమగు అవిద్య)యే యిట్లు జగద్రూపముగ భాసించుచున్నది. తత్త్వదృష్టిచే, ఆభ్రాంతియున్ను లేదు. కేవలము బ్రహ్మ సత్తమాత్రమేగలదు.

**శ్రీ వసిష్ఠ ఉవాచ:—**

> కాకతాలీయవద్బ్రహ్మ యద్భాతీవాత్మనాత్మని
> స తేనైవాత్మనాత్మైవ జగదిత్యవబుధ్యతే. 3

**శ్రీవసిష్ఠుఁడు:—** ఓ రామచంద్రా! నీవుయథార్థము వచించితివి. కాకతాళీయన్యాయముగ అవిద్యచే బ్రహ్మము స్వయముగ తనయందేరూపముతో భాసించుచున్నదో, అట్టి తన రూపమును జీవభూతమైన యదియే స్వయముగ జగత్తుగ నెఱుఁగుచున్నది.

**శ్రీరామ ఉవాచ:—**

> కథం తపత్యహో దిక్కాం సర్గస్యాదౌ పరత్ర చ
> కథం భిత్త్యా వినా భాతి వద దీపప్రభామునే. 4

**శ్రీరాముఁడు:—** ఓ మునీంద్రా! ఆహా! ఆశ్చర్యము! మహాప్రళయమందును సృష్ట్యాదియందును, మోక్షదశయందును, అవలంబన భూతములైన దిక్కులు మున్నగు విభాగములులేక అపరిచ్ఛిన్నమైన చిత్ప్రకాశమెట్లు ప్రకాశించును? ఏలయనిన, ప్రకాశ్యమగు భిత్త్యాదిరూప అవలంబనములేక దీపకాంతి యెట్లుప్రకాశించును? తెలుపవేడెద.

**శ్రీ వసిష్ఠ ఉవాచ:—**

> ఇత్థం రూపమిదం భాతి చితిరూపప్రభాప్రభా
> పశ్య సైవాత్మనాస్తేయత్ప్రకాశాదిభిరేవ చ. 5

**శ్రీవసిష్ఠుఁడు:—** ఓ రామచంద్రా! పరమాత్మయొక్క యిట్టిస్వరూపము అత్యాశ్చర్యమేయైయున్నది. ఈ విషయమును నీవే స్వయముగ విచారదృష్టిచే గాంచుము. సూర్యాది ప్రకాశములనుగూడఁ బ్రకాశింపఁజేయునట్టి యీ చిత్ప్రకాశము రాత్రియందు సూర్యచంద్రాదులు లేనపుడును, అయ్యంధకారమున స్వయముగ బ్రకాశించుచు వర్తిల్లుచున్నది. మఱియు సూర్యాదుల యుదయానంతరమును, ఆప్రకాశాదులను బ్రకాశింపఁజేయుచు వానితోసహా వర్తిల్లుచున్నది. ('తమేవభాన్తమనుభాతిసర్వమ్, తస్యభాసా సర్వమిదం విభాతి' శ్రుతి.)

> భిత్తౌ ప్రకాశో భాతీవ తత్కుడ్యం భాసనం చ తత్
> దృశ్యస్యాసంభవాదాదౌ వక్తా ద్రష్టా ప్రదృశ్యతామ్. 6

సూర్యాదుల ప్రకాశమున్ను భిత్త్యాదుల అపేక్ష లేకయే యీ భిత్త్యాదులందుఁ బ్రకాశించుచున్నది. వానియాప్రకాశము భిత్తిజనితముకాదు. పైఁగా భిత్తియు తత్ప్రకాశనమున్ను ఆత్మప్రకాశబలముచేతనే సిద్ధించుచున్నవి. మఱియు భిత్త్యాదుల సంబంధమునకుఁ బూర్వమున్ను ఆకాశమున ప్రకాశమెట్లు కానుపించుచున్నదో, అట్లే సృష్ట్యాదియందును, ప్రళయమందును, మోక్షదశయందును వక్తయు, శ్రోతయునైన యీ ఆత్మ విషయరహితమైయే ప్రకాశించునను విషయమును స్వయముగ నీవనుభవింపుము.

తస్మాద్ద్రష్టాస్తి నో దృశ్యం నైవాస్తీదమనామయమ్
చిత్ప్రభైవాత్మనా భిత్తిర్భవత్యాభాసనం తథా. 7

ఇక్కారణమున ద్రష్టృ, దృశ్యాది త్రిపుటి యొకింతైనను వాస్తవముగలేదు. సృష్ట్యాది యందు చిత్ప్రకాశమే స్వయముగ భిత్త్యాది ఆలంబనముగను, తత్ప్రకాశనముగను నగుచున్నది

ద్రష్టృదృశ్యాత్మికైకైవ స్వాత్మనైవ విరాజతే
స్వప్నాదిషు యథేహాద్య ద్రష్టృదృశ్యాత్మికా సతీ. 8

స్వప్నాదులందు 'ఒకే చైతన్యము ద్రష్టృ, దృశ్యాది త్రిపుటీరూపముగ నెట్లు ప్రకాశించు చున్నదో, అట్లే జాగ్రత్తునందును, ఒకే చైతన్యము ద్రష్ట్రాదిరూపమును ధరించి ప్రకాశించుచున్నది.

చిద్భాత్యేవ హి సర్గాదౌ కచన్తీ భాతి సర్గవత్
భాసనీయం చ భానం చ రూపం యత్ర స్వయంప్రభా. 9

ఎచట ప్రకాశ్య, ప్రకాశకములు మూఁడును చిత్ప్రకాశమే స్వయముగ అయియున్నవో, అట్టి సృష్ట్యాదికాలమున సృష్టివలెఁ బ్రకాశించుచు చైతన్యమే వెలయుచున్నది.

ఏకైవ చిత్త్రయం భూత్వా సర్గాదౌ భాతిసర్గవత్
ఏషఏవ స్వభావోఽస్యా యదేవం భాతి భాసురా. 10

ఒకే చైతన్యము సృష్ట్యాదియందు ద్రష్టృ, దర్శన, దృశ్యములను మూఁడురూపములుగ నయి సృష్టివలె భాసించుచున్నది. ఈ ప్రకారముగ ప్రకాశశీలమై జగద్రూపముగ భాసించుట ఆ చైతన్యముయొక్క (మాయాశక్తిప్రధానమగు) స్వభావమే అయియున్నది.

ఏతత్తు స్వప్న సంకల్ప నగరేష్వనుభూయతే
ఇత్థం నామ తపత్యేషా చిద్దీప్తిః ప్రథమోదితా. 11

సర్వప్రథమమున నుదయించినదైన యీ చిత్ప్రకాశమే యిట్లు జగద్రూపముగఁ బ్రకాశించుట స్వప్న సంకల్ప నగరములం దనుభవింపఁబడుచున్నది.

నభస్యేవ నభోరూప యదిదం భాసతే జగత్
అనాద్యన్తమిదం తస్మాః సర్గాః సర్గాత్మభాసనమ్. 12

ఆద్యంతరహితమైనట్టి చిదాకాశమే చిదాకాశమున యిట్లు జగద్రూపముగ భాసించు చున్నది. మఱియు నిట్లాచిదాకాశముయొక్క సృష్టిరూపముగ భాసించుటయే సృష్టులయొక్క స్వరూపమగును.

స్వభావభూతమస్మాకం త్విదం భాతి మహాత్మనామ్
భాస్యభాసకసంవిత్తిర్నశ్యతి ప్రతిభామితా. 13

ఈ జగత్తు అజ్ఞానులకే ఆశ్చర్యముగ భాసించునుగాని జ్ఞానులకుఁగాదు. జ్ఞానులమైన మహాత్ములమగు మాకియ్యది బ్రహ్మస్వభావభూతముగనే భాసించును. ప్రకాశ్యప్రకాశక సంవిత్తి

(త్రిపుటీజ్ఞానము) మాకు అకస్మాత్తుగ నెపుడైన స్ఫురించినను, తత్త్వానుసంధానముచే మరల వెంటనే యది నశించును.

తదా తు నామ సర్గాదౌ నాసీద్భాస్యో న భాసకః
మిథ్యాజ్ఞానవశాదేవ స్థాణౌ పుంప్రత్యయో యథా. 14

'సృష్టికి పూర్వము ప్రకాశ్యముగాని, ప్రకాశకముగానిలేదు. ఆ తదుపరి యే స్థాణువు (మోడు)నందు పురుషునిగూర్చిన బుద్ధివలె మిథ్యాజ్ఞానవశముచేతనే పరమాత్మయం దీజగత్తు యొక్క భ్రమ యుదయించినది అను నీప్రకారముగ తత్త్వాను సంధానము చేయవలయును.

తథాత్మని ద్విత్వాభానాచ్చితే ద్వైతవిభాననమ్
సర్గాదౌ న చ భాస్యో౽స్తి న చ వా నాస్తి భాసకః. 15

ఆత్మయందు ద్వైతముయొక్క భాసనములేదు. చిత్తమందే ద్వైతము భాసించుచున్నది. సృష్ట్యాదియందు ప్రకాశ్యమగు జగత్తులేదు. కాని చిదాత్మ అవశ్యముగలదు

కారణాభావతో ద్వైతం చిద్వ్యోమాభాతి కేవలమ్
కిం నామ కారణం బ్రూహి సర్గాదౌ చితి వస్తుతః. 16

కారణముయొక్క అభావమువలన కేవలము చిదాకాశమే ద్వైతరూపముగ భాసించు చున్నదగును. ఏలయనిన, వాస్తవముగ సృష్ట్యాదియందు శుద్ధచైతన్యమున కారణమేమిగలదో చెప్పుము ?

అభావాదర్థదృష్టీనాం చిదేవేత్థం ప్రకాశతే
జగద్భానమిదం యత్తన్న జాగ్రన్న సుషుప్తకమ్. 17

పదార్థములయొక్క అభావమువలన చైతన్యమే యిట్లు జగదాకారముగఁ బ్రకాశించు చున్నదగును. ఇక్కారణమున ఈ జగత్తంతయును జాగ్రత్స్వప్న సుషుప్తిరహితమగు తురీయ బ్రహ్మస్వరూపమే యైయున్నది.

న స్వప్నో౽సంభవాద్దృశ్యం కేవలం బ్రహ్మభాసతే
చిన్మాత్రవ్యోమసర్గాదావిత్థం కచకచాయతే. 18

స్వప్నరూపమగు ఈ దృశ్యము వాస్తవముగ సంభవింపనేరదు. కేవలము బ్రహ్మమే యిట భాసించుచున్నది. సృష్ట్యాదియందు చిన్మాత్రాకాశమే యిట్లు జగద్రూపముగ స్ఫురించుచున్నది.

యత్స్వమేవ వపుర్వేత్తి జగదిత్యజగన్మయమ్
చిన్మాత్రవ్యోమసర్గాదావిత్థం భాతి వికాసనమ్. 19

జగద్రహితమైనట్టి యే చిన్మాత్రాకాశము నిజస్వరూపమునే జగత్తుగ నెఱుఁగుచున్నదో, అట్టిచిన్మాత్రబ్రహ్మమే సృష్ట్యాదియందిట్లు జగద్రూపముగ భాసించుచున్నది.

యదిదం జగదిత్యేవ శూన్యత్వాంబరయోరివ. 20

ప్రకాశరూపమగు పరబ్రహ్మమే యీ జగత్తు, ఆకాశ, శూన్యత్వములందువలె, పరబ్రహ్మ మందును జగత్తునందును భేదములేదు.

బుద్ధ్వా చ యావత్స్వానుభూతియుక్తం స్థాతవ్యమేతేన వికల్పముక్తమ్
పాషాణమౌనం కుజనేన తూక్తం న గ్రాహ్యమజ్ఞేన హి భుక్తముక్తమ్. 21

ఇత్యార్షే శ్రీవాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే ఉత్తరార్ధే మహావాదబోధనం (తత్త్వానుసంధానం) నామైకనవత్యధిక శతతమః సర్గః ॥ 191 ॥

ఓ రామచంద్రా! ఈ ప్రకారముగ నాచే వచింపఁబడిన తత్త్వానుసంధానోపాయముచే ఆత్మతత్త్వము నెఱిఁగి భూమికాపరిపాక క్రమమున నది స్వానుభూతియుక్తమై దృఢపడునంత వఱకును వికల్పరహితుఁడవై వాగాదీంద్రియ వ్యాపార నిరోధముద్వారా శిలవలె మౌనమును ధరించి నిర్వికల్ప సమాధియందు స్థితినొంది యుండవలయును. అజ్ఞానదశయందు నీచేతను, ఇతరుల చేతనుగూడ అనాదియైన సంసారమున మరల మరల ననుభవింపఁ బడినదియు, వైరాగ్యాతిశయముచే నిపుడు త్యజింపఁబడినదియునగు బాహ్యవిషయ సమూహమును 'అనుభవింపుఁడని' దుర్జనులు చెప్పినను గూడ మరల ఎన్నటికని గ్రహింపరాదు. ఏలయనిన విషయసుఖము సమాధి యొక్క విఘాతకమైయున్నది

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున నుత్తరార్ధమున మహావాదబోధన(తత్త్వానుసంధాన)మను నూటతొంబదియొకటవసర్గము ॥191॥

## ద్వి న వ త్య ధి క శ త త మః స ర్గః

[ ఇహ ప్రబుద్ధో రామః స్వం ప్రబోధం గురుసన్నిధౌ
యథా చిన్మాత్రమేవేదం తథా విస్తరశోఽబ్రవీత్.

ప్రబుద్ధుఁడైన శ్రీరామచంద్రుఁడు ఈ జగత్తు చిన్మాత్రమే అయియున్నదను విషయమును గూర్చి గురుసన్నిధియందు విస్తారముగ వచించుట యిచటఁ గాననగును. ]

శ్రీరామ ఉవాచః—

అహోను సుచిరం కాలం సంభ్రాన్తా వయమన్తరే
అపరిజ్ఞాత మాత్రేణ సంసారపరమామ్బరే. 1

శ్రీరాముఁడు :— ఆహా! మునీంద్రా! ఆశ్చర్యము! సంసారరూపమగు ఈ అనంతాకాశమున యీ బ్రహ్మాండమందలి ఏకదేశమున కేవలము ఆత్మతత్త్వముయొక్క అజ్ఞానమాత్రముచే మేమందఱమును చిరకాలమునుండియు పరిభ్రమించుచునున్నాము.

బుద్ధేయావదియం నామ జగద్భ్రాన్తిర్న కించన
న చాభూన్న చ వాస్తీయం న చ నామ భవిష్యతి. 2

ఆత్మతత్త్వము బాగుగ నెఱుఁగఁబడ ఈ జగద్భ్రాంతి యొకింతైనను పూర్వముండియుండలేదనియు, ఇపుడును లేదనియు, ముందును నుండఁబోదనియు తెలియును.

సర్వం శాన్తం నిరాలమ్బం విజ్ఞానం కేవలం స్థితమ్
అనన్తం చిద్ఘనం వ్యోమ నీరాగమపకల్పనమ్. 3

ఈ జగత్తంతయును శాంతమై, నిరాలంబమై, విజ్ఞానఘనమై, అనంతమై, చిద్ఘనమై, కల్పనారహితమై, రాగవర్జితమైనట్టి కేవలపరబ్రహ్మముగనే స్థితినొందియున్నది.

పరమాకాశ మేవేదమపరిజ్ఞాతమాత్రకమ్
సంసార తామివాస్మాకం గతం చిత్రమహో ను భోః. 4

ఓ మునీంద్రా! ఇది యెట్టి యాశ్చర్యకరమైన విషయము! ఈ పరమ చిదాకాశమే అజ్ఞాన మాత్రముచే జగద్రూపమును బొందినదానివలె మనకు భాసించుచున్నది.

ఇత్థం ద్వైతమిదం భాతమిమే లోకా ఇమేఽద్రయః
పరమాకాశమిత్యచ్ఛమేవానచ్ఛమివ స్థితమ్. 5

పరమనిర్మలమగు చిదాకాశమే యిట్లు మలిన రూపమును బొందిన దానివలెనున్నదై, ఈ ప్రకారముగ ద్వైతరూపముగను, లోక, పర్వతాది రూపముగను భాసించుచున్నది.

సర్గాదౌ పరలోకాదౌ స్వప్నాదౌ కల్పనాదికే
చిదేవ చేత్యవద్భాతి కుతోఽన్యా కిల దృశ్యధీః. 6

సృష్ట్యాదియందును, పరలోకాదులందును, స్వప్నాదులందును, మనోరాజ్యాది కల్పనాదులందును చిద్రూపమగు పరమాత్మయే దృశ్యరూపముగ భాసించుచున్నది. కావున నిఁక చైతన్యమునకన్యమగు దృశ్యమెచట?

స్వర్గే వా నరకే వాపి స్థితోఽస్మీతి మతిర్యది
తత్రస్యా నరకస్యాన్తో దృశ్యం నంవిన్మయాత్మకమ్. 7

'నేను స్వర్గమందుగాని, నరకమందుగాని యున్నాను' అను భ్రాంతి యేదిగలదో, అదియే మనుజునకు నరకబంధమైయున్నది కావున, ఈ దృశ్యమంతయును వాస్తవముగ చిన్మయస్వరూపమే యైయున్నది

నేదం దృశ్యం చ ద్రష్టా న సర్గో న జగన్న చిత్
న జాగ్రత్స్వప్న సిద్ధాది కిమపీదం తదప్యసత్. 8

వాస్తవముగ ఈ దృశ్యముగాని, ద్రష్టగాని, సృష్టిగాని, చిదాభాసుఁడు (జీవుఁడు) గాని, జాగ్రత్తుగాని, స్వప్నముగాని, సుషుప్తిగాని లేవు. అనిర్వచనీయమైన యీ అవిద్యయు అసత్తే యైయున్నది.

కుతోఽస్యాః సంభవో భ్రాన్తేరితి చేద్దృశ్యతే మునే
తదేతదపి నోయుక్తం భ్రాన్త్యభావానుభూతితః. 9

ఓ మునీంద్రా! ఈ భ్రాంతి యెచటనుండి యుత్పన్నమైనదను విచారణయు అయోగ్యమే యైయున్నది. ఏలయనఁగా భ్రాంతి అసద్రూపమగుటచే సద్దాని కారణమును గూర్చిన చింత వ్యర్థమేయగును.

భ్రాన్తిర్న సంభవత్యేవ నిర్వికారే జ్ఞతాపదే
యత్త్విదం భ్రాన్తితాజ్ఞానం తత్తదేవేతరన్నతత్. 10

నిర్వికారమైన తత్త్వజ్ఞాన ప్రదమగు ఆత్మయందు భ్రాంతి సంభవింపనేరదు. మఱియు, ఈ భ్రాంతి జ్ఞానమెయ్యది గలదో, అదియును చిత్స్వరూపమగు పరమాత్మయేకాని అన్యముకాదు.

నిరన్తరే నిరాద్యన్తే వ్యోమ్ని శైలోదరేఽథవా
కుతోఽన్యతాకల్పకం స్యాజ్జపదే చావికారిణి. 11

అంతరాళవర్జితమగు స్ఫటికశిలాగర్భమునగాని ఆద్యంత రహితమైనట్టి ఆకాశమునగాని నిర్వికారమై, తత్త్వజ్ఞానపదమైనట్టి ఆత్మయందుగాని ద్వైతభేదకల్పన యొనర్చువాడెవడుండగలడు?

మిథ్యైవానుభవో భ్రాన్తేః స్వప్నేస్వమరణోపమః
యదనాలోకనం నామ శామ్యతీదం విలోకనాత్. 12

విచారింపని కారణముచేగల్లు భ్రాంతియొక్క యనుభవమేదిగలదో, అదిస్వప్నమందలి స్వమరణమువలె మిథ్యయేయైయున్నది. ఏలయనిన విచారణచే నది నశించిపోవుచున్నది.

మృగతృష్ణామ్బుగన్ధర్వనగరద్వీన్దువిభ్రమః
తథా విద్యాభ్రమశ్చాయం విచారాన్నోపలభ్యతే. 13

మృగతృష్ణాజలము, గంధర్వనగరము, రెండుచంద్రులఁగూర్చిన భ్రమ విచారించి చూచిన యెట్లు లభింపవో, అట్లే యీ అవిద్యాభ్రమయు జ్ఞానప్రాప్త్యనంతరము లభించుటలేదు.

బాలవేతాలవద్భ్రాన్తిర్న విద్యా బాగ్రగాపి హి
అవిచారేణ సంరూఢా విచారేణోపశామ్యతి. 14

బాలునియొక్క బేతాళమువలె. ఈ భ్రాంతి జాగ్రత్తునందు ప్రత్యక్షముగ, గానుపించి నప్పటికిని యథార్థముకాదు. అవిచారణచే నిది దృఢమగుచున్నది. విచారణచే నశించుచున్నది.

కుత ఆసీదితి మునే నాత్ర ప్రశ్నో విరాజతే
సత ఏవ విచారేణ లాభో భవతి నాసతః. 15

ఓ మునీంద్రా! ఈ భ్రాంతి యే కారణమువలనఁ గలిగినదను ప్రశ్నయు నిట శోభింపదు. ఏలయనిన సత్తుయొక్క విచారణచేతనే లాభముగలదుగాని, అసత్తుయొక్క విచారణచేఁగాదు. ఈ భ్రాంతియొక్క మూలమైనట్టి అజ్ఞానము అసత్తగుటవలన నిద్దాని విచారణ యోగ్యమైనదికాదు.

ప్రామాణికవిచారేణ ప్రేక్షితం యన్న లభ్యతే
తదేతదసదేవాది తత్తర్హ్యనుభవో భ్రమః. 16

ఏవస్తువు ప్రామాణిక విచారణచేఁ గాంచఁబడినపుడు లభింపదో, అది అసత్తేయగును. ఈ జగత్తుయొక్క మూలము అజ్ఞానమైయున్నది. అది యనుభవమువలన భ్రమరూపమే (అసత్తే)యై యెప్పుచున్నది.

యన్నాస్తీతి పరిచ్ఛిన్నం ప్రమాణైః సువిచారితామ్
ఖపుష్పశశశృఙ్గాభం తత్కథం లభ్యతే సతః. 17

శ్రుతిప్రమాణములచే బాగుగ విచారింపఁబడినప్పటికిని యేది లేకయున్నదో, కావుననే పరిచ్ఛిన్నరూపమై వర్తిల్లుచున్నదో, ఆకాశపుష్ప, శశశృంగములవంటి యట్టి అసద్వస్తువు సత్తునుండి యెట్లు లభించును ?

సర్వతః ప్రేక్షమాణోఽపి యః కుతశ్చిన్న లభ్యతే
తస్య స్యాత్కీదృశీ సత్తా వన్ధ్యాతనయరూపిణః. 18

అంతటను జూచినప్పటికిని, ఎయ్యది యే ప్రమాణముచేగాని, కారణముచేగాని, లభింపకయున్నదో, వంధ్యాపుత్రరూపమగు యద్దానియొక్క సత్త యింక నెట్టిదైయుండును ?

భ్రాన్తిర్న సంభవత్యేవ తస్మాత్కాచిత్కదాచన
నిరావరణవిజ్ఞానఘనమేవేదమాతతమ్. 19

కాఁబట్టి భ్రాంతియేదియు నెపుడును సంభవింపనేరదు. నిరావరణవిజ్ఞానఘనరూపమగు ఆత్మయే యీ సమస్త జగద్రూపముగ వ్యాపించియున్నది.

యత్కించిజ్జగదద్యాత్ర భాతీదం పరమేవ తత్
పరం పరే పరాపూర్ణే పూర్ణమేవావతిష్ఠతే. 20

ఏ జగత్తు ఇపుడిచట భాసించుచున్నదో, అది పరబ్రహ్మస్వరూపమే అయియున్నది. ఏలయనిన, నిరతిశయానందముచేఁ బరిపూర్ణమగు బ్రహ్మస్వరూపమున, ఆ పూర్ణమగు బ్రహ్మమే యివ్విధమున స్వమహిమయందు స్థితిగల్గియున్నది.

న భాతం న చ నాభాతమిహ కించిత్కదాచన
ఇదమిత్థం స్థితం స్వచ్ఛం శాన్తమేవ జగద్వపుః. 21

ఇట జగత్తు ఒకింతైనను నెపుడును భాసింపలేదు భాసింపకనులేదు. నిర్మలమై, శాంతమైనట్టి పరబ్రహ్మమే యిట్లు జగద్రూపముగ వెలయుచున్నది.

అజమమరమహార్యమార్యజుష్టం పరమవికారి నిరామయం సమన్తాత్
పదమహముదితం తతం హి శుద్ధం నిరహమనేకమథాద్వయం వికాసి. 22

ఇత్యార్షే శ్రీవాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు
నిర్వాణప్రకరణే ఉత్తరార్ధే విశ్రాన్త్యుపగమవర్ణనం
నామ ద్వినవత్యధిక శతతమః సర్గః ॥ 192 ॥

మహాత్మా ! జరామరణరహితమైనదియు, అపహరింపబడ జాలనిదియు, ఉత్తములచే సేవింపఁదగినదియు, వికారరహితమైనదియు, నిరామయమైనదియు, సర్వత్ర పరిపూర్ణమైనదియు, అహంభావమే బోధచే నిరహంభావమై యుదయించినదియు, సర్వవ్యాపకమైనదియు, శుద్ధమైనదియు,

అనేక రూపమైనప్పటికిన్ని ఏకస్వరూపమున్ను, ఆవరణరహితమగుటచే సర్వత్ర ప్రకాశించునది యువగు పరబ్రహ్మమే తనయందిట్లు జగద్రూపముగ స్థితినొందియున్నది.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున నుత్తరార్ధమున విశ్రాంత్యుపగమవర్ణనమను నూటతొంబదిరెండవ సర్గము ॥ 192 ॥

◆◆◆◆◆◆◆◆◆◆◆

## త్రినవత్యధికశతతమః సర్గః

[ఇహ రామః ప్రబోధేనాఽజ్ఞాననిద్రాక్షయే క్షణాత్
నిర్మృష్టనిఖిలద్వైతనిత్యాత్మ స్థితిమబ్రవీత్.

జ్ఞానముద్వారా క్షణకాలములో అజ్ఞాననిద్ర క్షయించుటచే, సమస్తద్వైతనిషేధపూర్వకముగ నిత్యాత్మస్థితిని శ్రీరామచంద్రుఁడు వర్ణించుట యిచటఁగాననగును.]

**శ్రీరామ ఉవాచ:—**

అనాదిమధ్యపర్యన్తం న దేవా నర్షయో విదుః
యత్పరం తదితం భాతి క్వ జగత్క్వ చ దృశ్యతా. 1

శ్రీరాముఁడు:— ఓ మునీంద్రా! కర్మోపాసనాసిద్ధులగు దేవతలుగాని, తపస్సిద్ధులగు (జ్ఞానసిద్ధులుకానట్టి) ఋషులుగాని (లేక, నేత్రాదిబాహ్య, అంతరేంద్రియములుగాని) ఆది మధ్యాంత రహితమగు యే పరబ్రహ్మపదము నెఱుఁగజాలరో, అట్టి పరబ్రహ్మమే యీ జగద్రూపముగ భాసించుచున్నది. కావున నిఁక జగత్తెచట, దృశ్యమెచట?

ద్వైతాద్వైతసముద్భేదవాక్యసందేహవిభ్రమైః
అలమస్మాకమాశాన్తమాద్యం రూపమనామయమ్. 2

ఓ మునీశ్వరా! ద్వైత, అద్వైతముల అనుసంధానముచే మనస్సునం దుత్పన్నమైన భేదమువలన జనించిన సందేహములతోను, విభ్రమములతోను మాకేప్రయోజనమున్ను లేదు. ఆద్య స్వరూపమై (సృష్టికిఁబూర్వమున్ను ప్రసిద్ధమైయున్నదై, సర్వథా శాంతమై, నిర్వికారమైనట్టి యే బ్రహ్మముగలదో, అదియే యీ సమస్తజగద్రూపముగ భాసించుచున్నది.

వ్యోమని వ్యోమభావానాం ప్రశాన్తం యాదృగాసితమ్
తాదృక్చిద్వ్యోమని స్ఫార త్రిజగద్వ్యోమ భాసనమ్. 3

ఆకాశమున, ఆకాశత్వ, కేశ, ముక్తావళి, గంధర్వనగరాదులెట్లు అభేదరూపమున స్థితి నొందియున్నవో, అట్లే చిదాకాశమున ఈ విశాలత్రైలోక్యమున్ను అభిన్నరూపముగ స్థితినొంది యున్నది.

యథా వ్యోమని వ్యోమత్వం దృషత్త్వం దృషది స్థితమ్
జలత్వం చ జలస్యాన్తర్జగత్త్వం చిద్ఘనే తథా. 4

ఆకాశమున ఆకాశత్వము, శిలయందు శిలాత్వము, జలమందు జలత్వము, అభేదరూపముతో నెట్లు వర్తించుచున్నవో, అట్లే చిద్ఘనబ్రహ్మమం దీప్రపంచత్వమున్ను వర్తించుచున్నది

సాహన్తాదిజగద్దృశ్యమాశాకాశవిసార్యపి
మహాచిదుదరం విద్ధి ఖం శాన్తం శూన్యతోదితమ్. 5

అహంత్వాది సహితమగు ఈ దృశ్యరూపజగత్తు దిక్కులందును, ఆకాశమందును ప్రసరించి విశాలమైయున్నప్పటికిని, శాంతముగను, పదార్థశూన్యముగను నుదయించిన మహాచిదాకాశముయొక్క యుదరముగనే దీనిని తామెఱుఁగుఁడు.

జీవస్యాస్మిన్విమూఢస్య పరే పరిమితోదయే
ప్రస్ఫురంత్యాపి సంసారపిశాచ ఉపశామ్యతి. 6

అపరిచ్ఛిన్నమైనట్టి యీ పరబ్రహ్మము సాక్షాత్కరింపఁబడినంతమాత్రమున మూఢుఁడగు జీవునకు సంచారపిశాచము - లెస్సగ స్ఫురించుచున్నదియైనప్పటికిని - శమించిపోవుచున్నది.

భేదోపలబ్ధిర్గలతి వ్యవహారవతోఽప్యలమ్
జడస్యేవాజడస్యైవ వీచేరివ జలోదరే. 7

వ్యవహారమందు మిగుల తత్పరుడైయున్నను చిద్రూపుఁడగు జ్ఞానికి, జలమందు తరంగములయొక్క భేదమువలె, భేదప్రాప్తి నశించిపోవుచున్నది.

క్వాప్యజ్ఞానరవౌ యాతే ప్రతాపాద్యాకరే భృశమ్
సంసారసత్తాదివసో యాత్యస్తం స నిశాగమః. 8

అజ్ఞానమను సూర్యుఁడెచటికో వెడలిపోఁగా, ఆధ్యాత్మికాదితాపత్రయము, విషయతృష్ణ మున్నగునవి నశించిపోవుచున్నవి. మఱియు నపుడు సంసారసత్తయను పగలు అస్తమించినదై, మోక్షసుఖ విశ్రాంతిరూపమగు రాత్రి యేతెంచుచున్నది.

భావాభావేషు కార్యేషు జరామరణజన్మసు
జ్ఞ ఆజవం జవీభావే తిష్ఠన్నపి న తిష్ఠతి. 9

ఉత్పత్తి, వినాశయుక్తములగు కార్యములందును, జన్మ, జరాఁమరణములందును, వ్యవహార విక్షేపమందు వర్తించినప్పటికిని జ్ఞాని వర్తింపనివాఁడేయగును.

నావిద్యాస్తి హ న భ్రాన్తిర్న దుఃఖం న సుఖోదయః
విద్యాఽవిద్యా సుఖం దుఃఖమితి బ్రహ్మైవ నిర్మలమ్. 10

వాస్తవముగనిట అవిద్యగాని, భ్రాంతిగాని, దుఃఖముగాని, (విషయ) సుఖోదయముగానిలేవు. విద్యావిద్యలు సుఖదుఃఖములు మున్నగునవియన్నియును నిర్మలబ్రహ్మమేయైయున్నవి.

పరిజ్ఞాతం సదేతత్తు యావద్బ్రహ్మైవ నిర్మలమ్
అపరిజ్ఞాతమస్మాకమబ్రహ్మాత్మ న విద్యతే. 11

ఎఱుఁగఁబడినచో యిదియంతయును నిర్మలమగు బ్రహ్మమేయగును. మావంటివారికి (తత్త్వవేత్తలకు) యిటనెఱుఁగబడనిదియు, బ్రహ్మస్వరూపముకానిదియు నైనదేదియునులేదు.

ప్రబుద్ధోఽస్మి ప్రశాన్తా మే సర్వా ఏవ కుదృష్టయః
శాన్తం సమం సోహమిదం ఖం పశ్యామి జగత్త్రయమ్. 12

మహాత్మా ! నేనిపుడు ప్రబుద్ధుఁడనైతిని. నాకు దృష్టులన్నియు (భ్రాంతులన్నియు) బాగుగ శమించిపోయినవి. ఇపుడీ త్రైలోక్యమునంతయు సర్వథా ద్వైతవిషమత్వ రహితముగను, ప్రశాంతముగను, స్వాత్మరూపముగను, చిదాకాశముగనే గాంచుచున్నాను.

సమ్యగ్జ్ఞాతం యావదిదం జగద్బ్రహ్మైవ కేవలమ్
అజ్ఞాతాత్మాభవద్బ్రహ్మ జ్ఞాతాత్మన్యధునా స్థితమ్. 13

బాగుగ నెఱుఁగబడినచో, ఈ జగత్తంతయును కేవలము బ్రహ్మమేయగుచున్నది. ఓ మునీంద్రా ! నేను పూర్వకాలమున నొకఁడను, ఇపుడు మఱియొకఁడనునై యుండలేదు. ఏ బ్రహ్మము పూర్వమీ నాయందు తనయాత్మ నెఱుఁగకయుండెనో, ఆ బ్రహ్మమే యిపుడు తన యాత్మ నెఱిఁగి స్వస్వరూపమున నెలకొనియున్నది.

జ్ఞాతాజ్ఞాతమనిర్భాసం బ్రహ్మైకమజరం తథా
శూన్యత్వైకత్వనీలత్వరూపమేకం నభో యథా. 14

ఆకాశమొకటియే శూన్యత్వ, నీలత్వ, ఏకత్వరూపమైయున్నట్లు, జరామరణరహితమై తనకంటె భిన్నమైన జ్ఞానాజ్ఞానములు లేనిదైనట్టి బ్రహ్మమొకటియే జ్ఞాత, అజ్ఞాతరూపమంతయును నైయున్నది.

నిర్వాణమాసే గతశఙ్కమాసే నిరీహమాసే సుసుఖేఽహమాసే
యథాస్థితం నిత్యమనన్తమాసే తదేవమాసే న కథం సమాసే. 15

మహాత్మా ! ఇట్టి జ్ఞానోదయమువలన నేనిపుడు నిర్వాణరూపుఁడనైయున్నాను; అజ్ఞాన జ్ఞానమువలన సంశయరహితుఁడనై యొప్పుచున్నాను మఱియు, ఏ కోర్కెయు లేకయున్నాను; విక్షేపరహితమగు ఆత్మసుఖమున నిత్యము స్థితినొందియున్నాను; యథాస్థితమై, నిత్యమై, అనంతమైనట్టి ఆత్మయందు వెలయుచున్నాను; బ్రహ్మభావమునుండి చ్యుతిని గల్గించు అజ్ఞానాదులయొక్క అభావమువలన నేనిపుడు సర్వరూపమగు బ్రహ్మమందేల వర్తింపకయుందును ? (తప్పక వర్తించు చున్నానని భావము.)

సర్వం సదైవాహమనన్తమేకం న కించిదేవాప్యథవాతిశాన్తః
సర్వం న కించిచ్చ నదేశమస్మి న చాస్మి చేతీయమహో ను శాన్తిః. 16

నేను సర్వదా సర్వరూపమై, అనంతమై, ఏకమైనట్టి బ్రహ్మమేయైయున్నాను; లేక సర్వోపద్రవరహితమై, పదార్థరూపమొకింతైననుగానిదై, సర్వాధారమై, అద్వితీయమైనట్టి సద్రూపమై వెలయుచున్నాను; దేశకాలాది ఆధారములయొక్క అభావముచే నెచటను లేక యున్నాను. ఆహా ! ఇట్టి నిర్వాణమను పరమశాంతి ఆశ్చర్యరూపమైయున్నది !

అధిగతమధిగమ్యం ప్రాప్తమప్రాప్తమన్య
ద్గతమిదమలమస్తం వస్తుజాతం సమస్తమ్
ఉదితముదితబోధం తాదృశం యత్ర భూయో
స్తమయసముదయానాం నామ నామాపి నాస్తి. 17

ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు
నిర్వాణప్రకరణే ఉత్తరార్ధే విశ్రాన్తికథనం నామ
త్రినవత్యధికశతతమః సర్గః ॥ 193 ॥

మునీంద్రా! తెలిసికొనఁదగిన పరమపురుషార్థరూపమగు బ్రహ్మతత్త్వమును నేనిపుడు తెలిసికొంటిని; అజ్ఞానులచే బొందఁబడని మోక్షసుఖమును బొందితిని. సంసారానర్థ రూపమగు ఈ వస్తుసమూహమంతయును నాకుఁ బూర్ణముగ శమించిపోయినది. ఎచట మరల మరణ దుఃఖాద్యనర్థములయొక్క పేరైననునుండదో, అట్టి, చరమసాక్షాత్కారోదిత ప్రబోధరూపమగు నిజస్వరూపము నాకుదయించినది.

ఇది శ్రీవాసిష్ఠతాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున నుత్తరార్ధమున
విశ్రాంతికథనమను నూటతొంబది మూడవ సర్గము ॥ 193 ॥

## చతుర్నవత్యధిక శతతమః సర్గః

[ఆత్మతత్త్వం జగత్తత్త్వం యథా నిర్వాణసాధనమ్
ఇహ రామః స్వయం బుద్ధం గురవే ప్రత్యవేదయత్.

మోక్షసాధనమగు ఆత్మతత్త్వమును, మఱియు జగత్తుయొక్క తత్త్వమును తానెట్లు స్వయముగ నెఱిఁగెనో యా క్రమమును శ్రీరామచంద్రుఁడు గురువగు వసిష్ఠునకుఁ దెల్పుట యిచట వర్ణింపఁబడుచున్నది ]

శ్రీరామ ఉవాచ:—

సర్వాత్మ సర్వభావేషు యేన యేన యదా యదా
యథా భాతి స్వయం బోధస్తథానుభవతి స్వయమ్. 1

శ్రీరాముఁడు :— మహాత్మా! సమస్త జీవులతును మనోవృత్తులన్నింటియందును నెపుడెపుడేయే భోగకారణముచే నేయే ప్రకారముగ స్వప్రకాశ రూపమగు చిదాత్మ వివర్తభావమును బొందుచున్నదో, అపుడపుడాయాప్రకారముగనే యద్దానిని భోక్త్రాది త్రిపుటీ రూపములతోఁడ ఆ యాత్మ స్వయముగ ననుభవించుచున్నది

స్వభావ ఏవ తిష్ఠన్తి సర్గాః సంమిలితా అపి
అత్రాపి స్వీకృతా ఏవ నానారత్నాంశవో యథా. 2

సూక్ష్మములై వివిధరత్నములయొక్క కిరణములు గృహమునఁ బరస్పరము సమ్మిళిత ములైయున్నను, అసమ్మిళితములుగనే తోచునట్లు ఏకమై, అవయవరహితమై, పరమసూక్ష్మమైనట్టి బ్రహ్మమందు సర్వజీవులయొక్క యొకేసమయమున అధ్యాసమువలన అనంతములగు సృష్టులు సమ్మిళితములైయున్నను, ప్రత్యేకజీవునకు బ్రహ్మాండ, భువనాదిభేదములచే అతివిస్తీర్ణస్వభావము గలవై, పరబ్రహ్మమందు పరస్పరము అసమ్మిళితములుగనే యున్నవి. ఏలయనిన ఆ సృష్టులు అవయవరహితమగు ఈ బ్రహ్మమున తాదాత్మ్యాధ్యాసముచే స్వాత్మీకరింపఁబడినవి. (మహా సూక్ష్మములుగఁ గావింపఁబడినవి.) (స్వాత్మయందు దేనికిని అవరోధముగాని, అనవకాశముగాని లేదని భావము.)

అత్ర దృష్టమదృష్టం చ మిథో విశతి గచ్ఛతి
జగద్రశ్మిఘనం రత్నం నానారత్నఘనం యథా. 3

ఈ విశాలమగు పరబ్రహ్మస్వరూపమున దృష్ట (సమీపస్థ), అదృష్ట (దేశకాల వ్యవ ధానమువలన అపరోక్ష)ములైన వివిధజగత్తులను రత్నకిరణములు, ఒకేగృహమందలి వివిధరత్న ముల కిరణములవలె పరస్పరము అసంబంధ పూర్వకముగవచ్చుచు, బోవుచున్నవి.

దీపానామివ సర్గాణాం బహూనాం జ్వలతాం పరమ్
కేషాం చిదన్త్యనుభవో మిథః కేషాం చిదేవ నో. 4

ఒకేసమయమున జ్వలించుచున్న యనేకదీపములఁగూర్చి, సమాననేత్రాదీంద్రియములు గల జీవులకందఱికిని పరస్పరమనుభవమగునట్లు సమానకర్మ వాసనలచే అధ్యస్తులైన జీవుల కందఱికిని పరస్పరము సృష్టులయొక్క యనుభవముకలుగును గాని తక్కినవారికి గలుగదు.

అప్స్వప్స్వివ రసోఽమ్భోదావావర్తరమణావనౌ
సర్గేస్తి ప్రత్యణుం తస్మిన్నాపి సర్గాస్తథా క్రమః. 5

ఆవర్తాదుల క్రీడాస్థానమగు సముద్రమున ప్రతిజల కణమందును లవణాది రస మెట్లుకలదో, అట్లే సృష్టియొక్క ప్రతి అణువునందును అనేక బ్రహ్మాండములుకలవు, మరల, ఆ బ్రహ్మాండములయొక్క ప్రతి అణువునందును అసంఖ్యాతములైన సృష్టులుకలవు. కాని, పర మార్థమున ఆ సృష్టులుగాని, వాని క్రమముగాని యేమియునులేదు

సర్వత్ర సర్వతో నిత్యం చిద్ఘనస్యామ్బు వేదనమ్
సంఖ్యాతుం కేన శక్యన్తే సర్గాధారపరమ్పరాః. 6

సముద్రమందు జలపరమాణువుయొక్క రసమువలె సర్వత్ర వెలయునదై, సర్వవ్యాపకమై, నిత్యమైనట్టి చిద్ఘనపరమాత్మయందువర్తించు సృష్టిపరంపరలను లెక్కింప నెవరికిఁ దరము?

యథావయవితా భిన్నా నైవావయవినః క్వచిత్
శబ్దభేదాదృతే భిన్నా న తథా సర్గతా పరే. 7

శబ్దభేదము తప్ప అవయవికంటె అవయవిత్వము ఎట్లెచటను భిన్నముకాదో, అట్లే పరబ్రహ్మముకంటె సృష్టిత్వమును భిన్నముకాదు.

ఏకస్యానన్తరూపస్య కారణాభావతః స్వయమ్
నోదేతి న చ యాత్యస్తం జగదాదిః స్వభావతః. 8

ఏకమైనదియు మాయచే అనంతరూపమై యొప్పునదియునగు అధిష్ఠానమైన ఆత్మ యొక్క స్వభావమువలనను కారణముయొక్క అభావమువలనను, ఈ జగత్తు వాస్తవముగ నుదయించుటలేదు. అస్తమించుటలేదు. కేవలము ఆత్మరూపముగనే వెలయుచున్నది.

> ఇపస్తీ జ్ఞప్తిరేవేయమఖణ్డా జ్ఞేయతామిమామ్
> కరోత్యకర్తృరూపైవ సమాలోక మివార్కభాః. 9

ఈ అఖండ చిద్రూపమగు జ్ఞప్తియే తాను స్వయముగఁ బ్రకాశించుచు, కర్తగాకయే సూర్యప్రకాశమువలె ఈ ఘటపదాదిజ్ఞేయ (దృశ్య) రూపములను బ్రకాశింపఁజేయుచునున్నది.

> వైతృష్ణ్యాత్సర్వభావానాం సమాప్త్యైవాక్షయం స్వయమ్
> సంపద్యతే సమాధానం యత్తన్నిర్వాణముచ్యతే. 10

ఆ తత్త్వజ్ఞానమువలన సమస్తపదార్థములు బాధితములగుటచే వానియందలి తృష్ణారాహిత్యమువలన తత్పదార్థసమాప్తి రూపమైనదియు, స్వయముగ దేహాది నశ్వర పదార్థములయొక్క తాదాత్మ్యాధ్యాసములేనిదియునగు ఏ అక్షయస్వరూపము జీవునకు సంప్రాప్తించుచున్నదో, అదియే సర్వవిక్షేపశూన్యమగుటచే సమాధానమనియు, నిర్వృతి (శాంతి) రూపమగుటచే నిర్వాణమనియుఁ జెప్పఁబడుచున్నది.

> న బుద్ధ్యా బుద్ధ్యతే బోధో బోధాబుద్ధేర్న బోధ్యతే
> న బుద్ధ్యతే వా తేనాపి బోధ్యో బోధః కథం భవేత్. 11

అట్లు సమస్త అధ్యాసపరంపరయొక్క సమాప్తిచే జీవునకు శేషించు నిర్వాణము స్వయముగ నెట్లు పరమపురుషార్థరూపమగుననియు, బుద్ధిచే ననుభవింపఁబడిననే పురుషార్థత్వము సిద్ధించుననియు కావుననే పురుషార్థప్రయోజికయగు చరమసాక్షాత్కారబుద్ధి ముక్తి యందావశ్యక మనియు నదినచో, అట్లుకాదు. ఏలయనిన, బుద్ధి జడమగుటచే పరమపురుషార్థరూపమైన బోధరూపమగు ఆత్మ నది యెఱుగఁజాలదు. నిద్రించు రాజు వందిజనులచే మేలుకొలుపఁబడునట్లు, బోధరూపమగు పరమాత్మ బుద్ధిచే మేలుకొలుపఁబడుననినచో, అదియును సరికాదు. ఏలయనఁగా, నిద్రించు రాజును నెఱిఁగినవారై వందిజను లాతనిని మేలుకొలుపుటకుఁ బ్రవర్తింతురు. కాని బుద్ధి బోధరూపమగు ఆత్మ నెఱుఁగ.జాలదు. కావున నద్దానినెట్లు మేలుకొలుపఁగలదు? బోధ (ఆత్మ) చేతనే బోధ యెఱుఁగఁబడుననినచో, అదియునుగాదు. ఏలన, ఆత్మ నిష్క్రియము నిర్వికారము నగుటచే నందు కర్మకర్తృభావములు సంభవింపనేరవు.

> ప్రబుద్ధ ఏవసుప్తాభః స్వయం బోధో విబుధ్యతే
> దేశాకాలాద్యభావేఽపి మధ్యాహ్నేఽర్కాతపో యథా. 12

కాఁబట్టి స్వప్రకాశత్వమువలన ప్రబుద్ధమైయే యున్నట్టి బోధరూపమగు ఆత్మ, దేశకాలాదులులేని స్వస్వరూపమున మంచుచేఁగప్పఁబడుటవలన సుప్తప్రాయుఁడుగనున్నవాఁడై మధ్యాహ్నకాలమున మంచంతయు నశింప బ్రబుద్ధుఁడగు సూర్యునివలెను, అతని ఆతపము (ఎండ)వలెను అధ్యాసపరంపరాసమాప్తియందు స్వయముగనే ప్రబుద్ధమగుచున్నది.

సర్వకర్మ వితృష్ణానాం శాన్తేచ్ఛానాం ప్రబోధతః
సత్తామనిచ్ఛతామేవ నిర్వాణం సంప్రవర్తతే. 13

సమస్త కర్మలందును (ఐహిక, పారలౌకిక ఫలములందును) అపేక్షలేనివారును, కోర్కెలు నశించినవారును, వాసనారహితులునగు సజ్జనులకు ప్రబోధమువలన, దానిచ్ఛగింప కున్నను నిర్వాణము (మోక్షము) లభించుచున్నది.

ప్రబుద్ధబోధో ధ్యానస్థః స్వభావే కేవలే స్థితః
న కించదపి గృహ్ణాతి న కించదపి చోజ్ఝతి. 14

మోహనిద్రనుండి మేల్కొనిన చిదాత్మగలవాఁడును, ధ్యానస్థుఁడును, కేవలచిత్స్వభావ మున వర్తించువాఁడునునగు మహాత్ముఁడు, ఒకింతైనను దేనిని గ్రహింపఁడు. త్యజింపఁడు.

యో యథాస్థితవివాస్తే పశ్యన్దీప ఇవాక్రియః
అమనో మానమననో మనోమననవానపి. 15

వ్యవహారమందు తత్పరుఁడైయున్నను, మనస్సుతోటి మననముచేయుచునున్నను, విషయములందాసక్తిలేనందువలన నట్టి మహాత్ముఁడు అమనస్కుఁడై చూచుచున్నను దీపమువలె అక్రియుఁడేయైయుండును. ప్రకాశించుచున్నను దీపము అక్రియముగనేయుండునట్లు, క్రియా వంతుఁడైనను నాతఁడు నిష్క్రియుఁడుగనే యుండునని భావము.

వ్యుత్థానేవిశ్వరూపాఖ్యమన్యత్ర బ్రహ్మ సంజ్ఞితమ్
సర్గాసర్గాత్మ చిన్మాత్రం సత్యం సర్వత్ర భాసతే. 16

వ్యుత్థానకాలమున (సమాధినుండి లేచినపిదప) అట్టి జ్ఞానికి ఈవిశ్వరూపమగు సృష్టి స్ఫురించినప్పటికిని, అయ్యది బ్రహ్మమను పేరుగలదియు, సృష్టి అసృష్టిరూపమున్ను, సత్య స్వరూపమునగు చిన్మాత్రముగనే యాతనికి సర్వత్ర భాసిల్లును.

అభిన్నబోధ సద్రూప స్వరూపానుభవే స్థితః
వ్యుత్థితః సంనిరుద్ధశ్చ యః పశ్యతి స శామ్యతి. 17

ఎవఁడు వ్యుత్థానకాలమందును సమాధియందలి బోధకంటె భిన్నముకానట్టి సద్రూప స్వరూపానుభవమందే స్థితిగల్గి ఉదాసీనవృత్తితోఁ ప్రపంచమును వీక్షించుచునుండునో, ఈప్రకార ముగ సమాధియందును వ్యుత్థానకాలమందునుగూడ సమానమైన బోధస్థితియందుండునో, అతఁడే సంసార విక్షేపశాన్తి ప్రశమనమును బొందునుగాని మఱియొకఁడు కాఁడు.

జగత్పదార్థసార్థానాం బోధమాత్రైకనిష్ఠతామ్
వినా నాన్త్యపరాసత్తా వ్యోమ్నః శూన్యేతరా యథా. 18

శూన్యత్వముకంటె భిన్నముగ ఆకాశమునకు వేఱొక సత్తలేనట్లు జగత్పదార్థసమూ హము లన్నిటికిని బోధ (ఆత్మ) మాత్రస్వరూపముకంటె భిన్నముగ వేఱొక సత్తలేదు.

శిష్యతే స్ఫీతబోధానాం కేవలానన్తబోధతా
సాపి స్వపరిణామేన పరేణాయాత్య వాచ్యతామ్. 19

సాక్షి చిన్మాత్ర సాక్షాత్కారరూపమగు నిర్మలబోధతోఁగూడిన మహాత్ములకు జగత్తు బాధితమగుటచే కేవలము అనంతబోధ (ఆత్మ) రూప సత్తయేవారికి శేషించుచున్నది. అట్టి ప్రత్యగాత్మరూపమగు బోధత్వమున్ను తనయొక్క బ్రహ్మసన్మాత్ర పరిశేషరూపమైన అఖండాకార వాక్యార్థరూపమగు ఉత్తమ పరిణామముచే వాగతీతత్వము (అఖండార్థకవాక్యలక్ష్యత్వము) ను బొందుచున్నది.

తద్విశ్రాన్తౌ పరా సత్తా శిష్యతే వా న శిష్యతే
యా కాప్యత్యన్త శాన్తానాం న వాగ్గోచరమేతి సా. 20

అట్టి బ్రహ్మభావముతో స్థితినొంద పరిపూర్ణ ఆత్మజ్ఞానులకు అపూర్వమైనట్టి పరమాత్మ సత్త శేషించునో లేక శేషింపదో ఆ స్థితి వాక్కునకు విషయముకానిదైయున్నది. (పరబ్రహ్మము వాగతీతమైనదనియు, అనుభవైక వేద్యమేయనియు బావము)

యా సమస్య పరాకాష్ఠా సైవ బోధస్య సన్మయీ
సర్గ స్తన్మయ ఏవాతః సకలం శాన్తమవ్యయమ్. 21

ఏది సత్తాసామాన్యముయొక్క పరమావధి (శోధిత తత్పదార్థరూపము) అయియున్నదో అదియే బోధయొక్కయు పరమావధి (శోధిత త్వంపదార్థరూపము) అయియున్నది ఆకాశాది రూపమున్ను, జాగ్రదాద్యవస్థాత్రయరూపమున్ను నగు సృష్టియంతయును 'అస్తి, భాతి, ప్రియ' రూపమగు అనుభవమువలన సద్రూపబోధమయమే అయియున్నది. కావున, ఈ సమస్తమున్ను శాంతమై, నాశరహితమైనట్టి బోధ (ఆత్మ) స్వరూపమేయగును.

ణాయ వితృష్ణాయ స్వచ్ఛ శీతలసంవిదే
స్పృహయన్తి సదాసత్తాం బ్రహ్మవిష్ణుహరా అపి. 22

నిర్వాణరూపమై, తృష్ణారహితమై, స్వచ్ఛమై, శీతలమై (సుఖస్వరూపమై) పరమప్రేమాస్పదమైనట్టి యా బోధ (ఆత్మ) సత్తకొఱకై బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులుకూడ సదా వాంఛించుచుందురు.

సర్వార్థాత్మైవ సర్వత్ర సర్వదా సర్వథోదితమ్
చేతనం శుద్ధమేవాస్తి నాశో నాస్యోపపద్యతే. 23

శుద్ధమై, స్వప్రకాశరూపమై సర్వులకుసదా ప్రేమాస్పదమైనట్టి చైతన్యమే సర్వదేశకాలమందును సర్వథా సర్వపదార్థరూపముగ నుదయించినదైయున్నది అద్దానికి నాశమెన్నఁటికిని తగదు.

అత్యన్తతప్తః సంసారో నిర్వాణమతిశీతలమ్
అతిశీతలమేవాస్తి తప్తస్త్వేవ న విద్యతే. 24

సంసారము మిగుల సంతప్తమై (మహాదుఃఖరూపమై) యు, నిర్వాణము (ఆత్మరూపము) పరమ శీతలమై (నిరతిశయసుఖరూపమై) యు నున్నది. అట్టి పరమశీతలమైనట్టి నిర్వాణరూపమగు ఆత్మ స్వరూపమే వాస్తవముగగలదు. అతి సంతప్తమైనట్టి దుఃఖరూపమగు సంసారములేదు (కల్పితమే [illegible] యున్నది)

సంచేతన్తి శిలాన్తస్థా యథాలం శాలభఞ్జికాః
అనుత్కీర్ణాస్తథా బ్రహ్మ చేతతీదమఖణ్డితమ్. 25

శిలయందింకను జెక్కఁబడనట్టి విగ్రహములు శిల్పియొక్క బుద్ధియందెట్లు అతని యిచ్ఛననుసరించి లెస్సగ స్ఫురించుచున్నవో, అట్లే, అఖండ పరిపూర్ణ బ్రహ్మమందీ జగత్తంతయును స్ఫురించుచున్నది.

యథా చేతతి సౌమ్యామ్బుకోశస్థం వీచిమణ్డలమ్
తథా చేతతి కోశస్థం మహాచిచ్చైత్యమవ్యయమ్. 26

శాంతసముద్రాది జలాశయములందున్న జలము స్వయముగ తరంగసమూహరూపముగ స్ఫురించునట్లు, అన్నమయాదికోశమందును, బ్రహ్మాండకోశమందును నున్న నాశరహితమగు మహాచైతన్యము స్వయముగనే దృశ్యరూపమయి స్ఫురించుచున్నది.

అవిభక్తో విభాగస్థైరివ శాన్తైరనన్తకైః
పరమార్థామ్బరాభోగై స్త్వబోధాత్మత్వమన్థరైః. 27

యై ర్యైర్యథాస్వ ఆత్మా న్తర్భావితశ్చేతితశ్చిరమ్
భోగమోక్ష ప్రభేదేషు తేషాం తేషాం తథోదితః. 28

వాస్తవముగ అవిభక్తరూపమైనట్టి, అజ్ఞానావృతమై జడప్రాయములైనట్టి చిదాకాశము యొక్క యనేకకృత్రిమవేషములను ధరించుచు, విభక్తమైనదానివలెనున్నదై, ఏ జీవులచే నేయే ప్రకారముగ చిరకాలము భావింపఁబడుచున్నదో, వారివారికి ఆయా ప్రకారముగనే భోగమోక్షాది భేదములందు ప్రాదుర్భవించుచున్నది.

మృతేవాప్య మృతే బన్ధౌ స్వప్నే స్వప్నవిబోధినః
న యథోదేతి సత్యాస్థా తథా దృశ్యేషు తద్విదః. 29

స్వప్నమునుండి మేల్కొనినవానికి స్వప్నమందలి తనబంధువు మరణించినను, జీవించినను అతనియందు సత్యత్వబుద్ధి యెట్లుదయింపదో, అట్లే తత్త్వవేత్తకును దృశ్యపదార్థములన్నిఁటి యందును సత్యత్వబుద్ధి యుదయింపదు. కావుననే యాతనికి హర్ష శోకాదులు కలుగనేరవు.

యదిదం కిల దృశ్యాది తచ్ఛాన్తమఖిలం శివమ్
భావితేఽవగతేఽప్యన్తరితి భ్రాన్తేః క ఉద్భవః. 30

ఈ దృశ్యాదిజగత్తంతయును శాంతమై, శివమైనట్టి పరబ్రహ్మస్వరూపమేయని అంతరంగమున దృఢముగ భావించి యెఱిఁగినచో మరల భ్రాంతియొక్క యుద్భవమెచట ?

సర్వథా దేహసంశ్లేషు వైతృష్ణ్యముపజాయతే
సమ్యగ్బోధే సతిస్వప్న ఇవాపి స్వార్థకాదిషు. 31

మేల్కొనిన పిదప స్వప్నపదార్థములందలి తృష్ణ శమించునట్లు, పూర్ణజ్ఞానము కలుగఁగా దేహసంబంధములగు భోగములందును తదుపాయములందును తృష్ణారాహిత్యము జనించుచున్నది.

వైతృష్ణ్యాద్వర్ధతే బోధో బోధాద్వైతృష్ణ్య వర్ధనమ్
పరస్పరేణ ప్రకటే ఏతే కుడ్యప్రకాశవత్ 32

తృష్ణారాహిత్యము (వైరాగ్యము)చే ఆత్మజ్ఞానమునున్ను, ఆత్మజ్ఞానముచే తృష్ణారాహిత్యమున్ను వర్ధిల్లుచున్నవి. ఈ రెండును కుడ్య (గోడ), ప్రకాశములవలె పరస్పరమొకదానిచే నొకటి ప్రకటమగుచున్నవి.

యేన బోధేన వైతృష్ణ్యం ధనదారసుతాది వా
స్వనూనమపి సంపన్నం జాడ్యం తత్సంస్థితం తథా. 33

ఎచట తృష్ణారాహిత్యముయొక్క వృద్ధియుండునో, అచట జడత్వముయొక్క అభావమున్ను, బోధ (ఆత్మజ్ఞానము) యొక్క వృద్ధియుండునో, ఎచట ధనదారపుత్రాదులందలి తృష్ణయొక్క వృద్ధియుండునో, అచట ఆరీతిగనే జడత్వముయొక్క వృద్ధియు, బోధయొక్క అభావమున్ను వర్తించును.

ఏతావదేవ బోధస్య బోధత్వం యద్వితృష్ణతా
పాణ్డిత్యం నామ తన్మౌర్ఖ్యం యత్ర నాస్తి వితృష్ణతా. 34

బోధయొక్క బోధత్వమను పాండిత్యముయొక్క స్వరూపము తృష్ణలేకయుండుట మాత్రమేయగును; మఱియు మూర్ఖత్వముయొక్క స్వరూపము తృష్ణగల్గియుండుట మాత్రమేయగును.

నతు వైతృష్ణ్యబోధాఢ్యో న పరస్పరవర్ధితా
అసత్యావేవ తౌ నామ నష్టే చిత్రహుతాశవత్. 35

తృష్ణారాహిత్యము (వాసనాక్షయము)న్ను, బోధయొక్క ఆధిక్యతయు, పరస్పరము వృద్ధినొందినను, అవి అసత్యములనియు, చిత్రమందలి అగ్నివలె కార్యాసమర్థములనియు, నష్టప్రాయములనియుఁ దలంపగూడదు

పరమాబోధవైతృష్ణ్య సంపత్తిర్మోక్ష ఉచ్యతే
తత్రానన్తే పదేశాన్తే వసతా చ న శోచ్యతే. 36

ఏలయనిన బోధ, తృష్ణారాహిత్యములయొక్క యుత్తమ సంపత్తియే (నిరతిశయానందరూపత్వమువలనను, ఆత్యంతిక దుఃఖక్షయరూపత్వమువలనను) మోక్షమని చెప్పఁబడుచున్నది. అట్టి అనంతమై, శాంతమైనట్టి మోక్షపదముననున్న జీవుడెన్నఁడును శోకింపఁడు

గతం గమ్యం కృతం కార్యం దృష్టం దృశ్యమశేషతః
యావత్సర్వం శివం శాన్తమేకమాద్యమనామయమ్. 37

మహాత్మా! (అట్లు వృద్ధినొందిన బోధ తృష్ణారాహిత్యములవలననే) నేనిపుడు పొందఁదగిన దానిని బొందితిని, చేయఁదగినదానిని జేసితిని; చూడఁదగినదానిని పరిపూర్ణముగఁ జూచితిని; ఈ సమస్తమున్ను నిపుడు శివమై, శాంతమై, ఏకమై, అద్యమై, నిర్వికారమైనట్టి బ్రహ్మముగనే నాకు భాసించుచున్నది.

ఆత్మారామస్య శాన్తస్య వైతృష్ణ్యస్యానహంకృతేః
అసంకల్పైవ భవతి స్థితిః ఖస్యేవనిర్మలా. 38

ఆత్మారాముఁడును, శాంతుఁడును, తృష్ణారహితుఁడును, అహంకారవర్జితుఁడునగు మనుజునియొక్క స్థితి సంకల్పరహితమైనదియు, ఆకాశమువలె నిర్మలమైనదియునగును.

సహస్రేభ్యః సహస్రేభ్యః కశ్చిదుత్థాయ వీర్యవాన్
భినత్తి వాసనాజాలం పఞ్జరం కేసరీ యథా. 39

ప్రయత్నమొనర్చు లక్షలకొలఁది మనుజులలో వీర్యవంతుఁడగు ఒకానొకఁడుమాత్రమే లేచి సింహము పంజరము (బోను)ను విఱుగఁగొట్టునట్లు వాసనాజాలమును ఛేదించి వైచుచున్నాఁడు.

ప్రాప్తజ్యోతిర్ప్రోధశుద్ధిః పరమన్తఃప్రకాశవాన్
నీహారః శరదీవాశు స్వయమేవోపశామ్యతి. 40

శుద్ధబోధయుక్తుఁడును, ఆత్మజ్యోతిని బొందినవాఁడును, అభ్యంతరమున పరమ ప్రకాశయుతుఁడునగు మనుజుఁడు, శరత్కాలమున మంచువలె స్వయముగనే శీఘ్రముగ ప్రశాంతిని బొందుచున్నాఁడు.

జ్ఞాతజ్ఞేయస్త్వసంకల్పః సంకల్పాతిశయాశయః
అవాసనో వ్యవహృతౌ వాతవత్స్పన్దతే న వా. 41

జ్ఞేయమగు ఆత్మనెఱిఁగినవాఁడును, సంకల్పరహితుఁడును, వాసనా వివర్జితుఁడును సంకల్పముల నతిక్రమించిన యాశయముగలవాఁడునగు మనుజుఁడు వ్యవహారమున వాయువువలె చేష్టసల్పును, సల్పకయునుండును.

అసిద్ధిరాన్మనస్కారైర్భ్రాన్తిమాత్రైకనిర్ణయాత్
యః సర్వత్ర భవద్భావస్తదవాసనమాసితమ్. 42

సమస్త పదార్థములందును తత్త్వమననములద్వారా భ్రాంతిమాత్రైకనిశ్చయము దృఢపడుటవలన మనుజునకుఁగలుగు ఆకాశమువంటి నిర్మల దృశ్యరహిత భావమేదిగలదో, అదియే వాసనారహిత స్థితియైయున్నది.

నిర్వాసనే భావ ఉదారసత్త్వే బ్రహ్మాఖిలం దృశ్యమితి ప్రబుద్ధే
స్థిరైకనిర్వాణమతావనన్తో మోక్షాభిధానః ప్రశమోఽభ్యుదేతి. 43

ఇత్యార్షే శ్రీవాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు
నిర్వాణప్రకరణే ఉత్తరార్ధే రామవిశ్రాన్త్యుపగమో నామ
చతుర్నవత్యధిక శతతమః సర్గః ॥ 194 ॥

శుద్ధాంతఃకరణుఁడగు మనుజునియందు (పైనఁదెల్పిన) వాసనారహితభావ ముదయింపనపుడీ సమస్తదృశ్యమున్ను బ్రహ్మమేయను ప్రబోధముకలుగఁగా, స్థిరనిర్వాణమతియగు యతియొక్క దాని యందు అనంతమోక్షమను పేరుగల సర్వసంసారప్రశమనము స్వయముగనే ప్రకటమగుచున్నది

**ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున నుత్తరార్ధమున రామవిశ్రాన్త్యుపగమమను నూటతొంబదినాల్గవ సర్గము ॥ 194 ॥**

## పఞ్చనవత్యధికశతతమః సర్గః

[శుభాః ప్రబుద్ధరామోక్తీః ప్రశస్య గురుణా స్వయమ్
పరీక్షార్థం కృతాః ప్రశ్నా రామేణాత్ర సమాహితాః.

ప్రబుద్ధుఁడైన శ్రీరామచంద్రుని శుభవచనములను విని ప్రసన్నుఁడై గురువగు వసిష్ఠుఁడు స్వయముగ నాతనిని బ్రశంసించి పరీక్షార్థము ప్రశ్నించుట, శ్రీరామచంద్రుఁడు సమాధాన మొసంగుట; ఇచటఁ గాననగును.]

**శ్రీ వసిష్ఠ ఉవాచః—**

అహో ను సంప్రబుద్ధోఽసి లాఘవాఘవిఘాతినీ
వాగియం తవ సంపన్నా ప్రబుద్ధేష్వవహాసినీ. 1

శ్రీవసిష్ఠుఁడు:-- ఆహా! ఓ రామచంద్రా! నీవు ప్రబుద్ధుఁడవైతివి ఈ నీ వచనములు అజ్ఞానులయొక్క పాపములను హరింపఁజేయునవియు. అనుభవ సిద్ధమైన యర్థము ననువదించుట వలనను యుక్తియుక్తములై యుండుటవలనను జ్ఞానుల కానందమును గొల్పునవియునైయున్నవి.

విభాతీవాసదేవేదమసంకల్పేన శామ్యతి
వీతభ్రాన్తిస్తు నిర్వాణమిత్యేవ పరమార్థతా. 2

ఓ రామచంద్రా! నీవు చెప్పినది సత్యమే. అసత్తేయగు ఈ జగత్తు సంకల్పమువలన భాసించుచున్నదానివలెనున్నది. మఱియు, అసంకల్పముచే నియ్యది శమించిపోవుచున్నది అట్టి శాంతియే నిర్వాణము; అదియే పరమార్థత్వము.

కల్పనాకల్పనే రూపం పరస్యైవేతరస్య నో
స్పన్దనాస్పన్దనే వాయోర్యథా నాత్రైకతాద్వితే. 3

చలనము చలనముయొక్క అభావము వాయువుయొక్కయే రూపములైయున్నట్లు, కల్పనారూపమగు బంధమున్ను, అకల్పనారూపమగు మోక్షమున్ను రెండును పరబ్రహ్మము యొక్కయే రూపములైయున్నవి గాని మఱియొక దానివి కావు. ఈ పరబ్రహ్మమందు ఏకత్వ, ద్వైతములు లేవు.

ప్రబుద్ధస్యైవ యా పుంసః శిలాజఠరవత్స్థితిః
శాన్తౌ వ్యవహృతౌ వాపి సామలా ముక్తతోచ్యతే. 4

ప్రబుద్ధుఁడైన (జ్ఞానియగు) మనుజునియొక్క సమాధికాలమందలిగాని, వ్యవహారకాల మందలిగాని శిలాగర్భమువంటి నిశ్చల (చిద్ఘనరూప) స్థితియేదిగలదో, అదియే నిర్మలముక్తి పదమని చెప్పఁబడుచున్నది.

వయమస్మిన్పదే స్థిత్వా రాఘవాఘ విఘాతినీ
శాన్తత్వే వ్యవహారే చ సమమిత్థమవస్థితాః. 5

ఓ రాఘవా! అట్టి పాపవినాశకరమైన నిర్వాణపదమందు స్థితిగల్గియే మేము (జీవన్ముక్తులు) సమాధియందును. వ్యవహారమందునుగూడ నివ్విధమున సమానరూపముగ వర్తించుచున్నారము.

అస్మిన్నేవ పదే నిత్యం బ్రహ్మవిష్ణుహరాదయః
తిష్ఠన్తి వ్యవహారస్థా అపి శాన్తా జ్ఞరూపిణః. 6

ప్రబుద్ధులగు బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులున్ను, తదితర జీవన్ముక్తులున్ను వ్యవహారమందున్నను, సమాధియందున్ననుగూడ ఇట్టి నిత్య చిద్ఘనపదమందే సదా వెలయుచున్నారు.

శైలోదరస్థితిమతాం ప్రబుద్ధానామనామయమ్
అస్మాకం పదమేవం తదాలక్ష్యైతదిహాస్యతామ్. 7

పర్వతగర్భమువలె విక్షేపరహితమైనట్టి స్థితిగల మావంటి ప్రబుద్ధులయొక్క యీ చిన్మయపదమును నీవున్ను మావలెనే పొందినవాడవై జీవన్ముక్తియందు వసింపుము.

శ్రీరామ ఉవాచ:—

బ్రహ్మణ్యేవ మసద్రూపమనుత్పన్నమభాసురమ్
అనారమ్భమనాకారమేవేదం భాసతే జగత్. 8

శ్రీరాముఁడు:— మహాత్మా! ఈ జగత్తు బ్రహ్మమందు, అసద్రూపముగను, ఉత్పత్తిరహితముగను, అప్రకాశరూపముగను, ఆరంభవర్జితముగను, ఆకారశూన్యముగను (మిథ్యగను) భాసించుచున్నది.

మృగతృష్ణామ్బుసదృశం తరఙ్గావర్తవారివత్
రుచకాదీవ కనకే స్వప్న సంకల్ప శైలవత్. 9

మఱియు, మృగతృష్ణయందు జలమువలెను, జలమందు తరంగ ఆవర్తాదులవలెను, సువర్ణమందాభరణములవలెను, స్వప్న సంకల్పములందుఁ బర్వతమువలెను, పరబ్రహ్మమందీ జగత్తు భాసించుచున్నది.

శ్రీవసిష్ఠ ఉవాచ:—

బుద్ధవానసి చేద్రామ తత్స్వబోధవివృద్ధయే
కురు సంశయవిచ్ఛేదం పృచ్ఛతః ప్రచ్ఛకస్య మే. 10

శ్రీ వసిష్ఠుఁడు:— ఓ రామచంద్రా! నీవాత్మతత్త్వము నెఱింగినవాడవైనచో అనీ బోధయొక్క వృద్ధికొఱకై నేనడుగు ఈ ప్రశ్నకు సమాధానమొసంగి సంశయవిచ్ఛేదమును గావింపుము.

ఇత్థం నిత్యానుభూతోఽపి శిరస్థోఽప్యతి భాసురః
జగదాఖ్యోఽయమాభాసః కథం నామ న విద్యతే. 11

ఇట్లు ప్రత్యక్షాది ప్రమాణములచే దృఢీకరింపబడినదై అర్థక్రియాసాధకమై సర్వులచే నిత్యమనుభూతమగుచు, శిరస్సుపైనున్నదానివలె నొప్పుచు మహాప్రకాశశీలమై యున్నప్పటికిని, ఈ జగత్తను అభాసమేల లేకయున్నదో వచింపుము?

శ్రీరామ ఉవాచ:—

పూర్వమేవేదముత్పన్నం న కించన కదాచన
తేన వన్ధ్యాసుతస్యేవ న సత్తా కల్పనాదృతే. 12

శ్రీరాముఁడు:— మహాత్మా! కారణముయొక్క అభావముచే ఈ జగత్తు సృష్ట్యాదియందే యొకింతైనను నెపుడును నుత్పన్నముకాకయేయున్నది. కాఁబట్టి వంధ్యాపుత్రునివంటి యిద్దానికి కల్పన (భ్రమ)తప్ప వేఱేమియును సత్తలేదు.

కిమివాస్యా జగద్భ్రాన్తేః కారణం ప్రోత్థితా యతః
న కారణం వినా కార్యం కించిత్సంభవతి క్వచిత్. 13

దేనినుండి యీ జగద్భ్రాంతి యుత్పన్నమైనదో, అట్టికారణము దీనికేమిగలదు' (ఏమియును లేదని భావము) కారణము లేనిచో కార్యమొకింతైనను నెచటను సంభవింపనేరదు.

న చావికారమజరం సవికారం క్షయాదృతే
కారణం క్వచిదేవేహ కించిద్భవితుమర్హతి. 14

నిర్వికారమై, జరామరణ రహితమైనట్టి బ్రహ్మము దీనికారణమెపుడును గాఁజాలదు. ఏలయనిన, పూర్వావస్థయొక్క నాశములేక సవికారమగు పదార్థమొకింతైనను నెచటను సంభవింపనేరదు.

బ్రహ్మైవేదమనాఖ్యాత్మ కారణం ప్రవిజృమ్భతే
తత్క్వ కస్య కథం నామ జగచ్ఛబ్దార్థసంవిదః. 15

అవాచ్యమై, నిర్వికారమైనట్టి బ్రహ్మమే (రజ్జు సర్పన్యాయమందువలె) వివర్తోపాదాన కారణమయి మాయచే జగదాకారముగ విజృంభించుచున్నదనినచో అపుఁడిక జగత్తుయొక్క శబ్దార్థమెచట, ఎవనికి, ఎట్లు సత్యముగ లభింపగలదు ?

తదనాఖ్యే పదే శాన్తే చిరాత్ప్రథమచేతనమ్
కంచిత్కాలలవం తిష్ఠత్యాతివాహిక దేహభృత్. 16

అవాచ్యమై, శాంతమైనట్టి యా బ్రహ్మపదమున హిరణ్యగర్భుఁడను ప్రథమ చైతన్యము ద్విపరార్ధ పరిమితమగు ఒకింతకాలము, వివర్తరూపమైన సూక్ష్మశరీరమును ధరించియుండుచున్నది.

క్షణే వత్సరసంవిత్తిం స్వప్నే త్వమివ చేతతి
కాకతాలీయవత్తత్ర చన్ద్రార్కాదీంశ్చ పశ్యతి. 17

స్వప్నమందు తమవలె, ఆ ప్రథమచైతన్యము (బ్రహ్మదేవుఁడు) క్షణకాలమందును అనేకవత్సరములఁగూర్చిన భ్రమను గాంచుచున్నది. మఱియు, ఆ భ్రమయందు కాకతాలీయ న్యాయముగ చంద్రసూర్యాదిరూప జగత్తునుగూడ నవలోకించుచున్నది.

సంకల్పైకాత్మనస్తస్య దేశకాలక్రియాన్వితమ్
అత్యన్తమేవ వ్యోమ్నేవ భువనం భాసతే స్వయమ్. 18

సత్య సంకల్పరూపుఁడగు ఆ బ్రహ్మదేవునకు దేశకాల క్రియాసహితమగు ఈ జగత్తంతయును చిదాకాశమందే స్వయముగ భాసించును.

తస్మిన్మిథ్యోపసంపన్నే స మిథ్యాపురుషస్తతః
మిథ్యైవ తత్సమాచారం కుర్వన్నపరివర్తతే. 19

మిథ్యాభూతమగు ఈ జగత్తునందు మిథ్యారూపుఁడేయగు ఆ బ్రహ్మదేవుఁడు మిథ్యగనే భూత, భువనాది సమాచారమును గావించుచు వివర్తభావమును బొందుచున్నాఁడు.

అధస్తాదూర్ధ్వమాయాతి పునరూర్ధ్వాదధ్వ్రజత్యధః
కల్పితాననన్తసంభార పదార్థానర్థ సంభ్రమః. 20

మఱియు నాతఁడే అనర్థరూపములైన అనేక పదార్థసంభారములఁగూర్చిన భ్రమను గల్పించి స్వకల్పితములగు లోకములందు వ్యష్టిజీవ రూపముతోడ పుణ్యపాపఫల భోగార్థము పైకిని, క్రిందికిని దిరుగుచున్నాఁడు.

కాకతాలీయవత్తస్య సంకల్పస్య శివేద్యది
యద్యథా తత్తథాద్యాపి సుస్థిరామాత్తవాన్స్థితిమ్. 21

అతని సంకల్పముయొక్క పూర్వస్థితి యెట్టిదో, నేఁటిస్థితియు కాకతాళీయ న్యాయముగ నట్టిదే అయియున్నది. కావున నాతఁడు జగత్తునందు సుస్థిరమైన స్థితిని గ్రహించినవాఁడాయెను.

శిలావన్ధ్యాసుతముఖే వ్యోమచూర్ణేన రఞ్జనమ్
కరోతీత్యాదివదిదం మిథ్యా జగదుపస్థితమ్. 22

'శిల కామినియై వంధ్యాపుత్రుఁడను తన పతి యొక్క ముఖమున ఆకాశముయొక్క చూర్ణముతోటి తిలకమునురచించి శోభాతిశయమును గావించుచున్నది. అను నీమున్నగు వాక్యముల యర్థమువలె, ఈ జగత్తు మిథ్యగనే స్థితి నొందియున్నది.

సత్యమేవేదమథవా మిథ్యాత్వం తు కుతః కిల
న మిథ్యాత్వం న సత్యత్వం కిమపీదమజం తతమ్. 23

లేక అధిష్ఠానమగు బ్రహ్మముయొక్క సత్తచే ఈ జగత్తు సత్యమే ఆయియున్నది. అట్టి బ్రహ్మరూపమగు ఇద్దానికి మిథ్యాత్వ మెచట ? లేక, వ్యావర్తనీయమగు మిథ్యాత్వము యొక్క అప్రసిద్ధిచే వ్యావర్తకమగు సత్యత్వమున్ను నట ఘటింపదని విచారించుచో నపుడియ్యది వాక్కునకు విషయము కానిదై, జననమరణరహితమై, సర్వవ్యాపకమైనట్టి పరబ్రహ్మ స్వరూపమేయగును.

ఆకాశ కోశ వత్స్వచ్ఛం శిలాజఠర వద్ఘనమ్
పాషాణమౌనవచ్ఛేదం శాన్తమేవాక్షయం జగత్. 24

ఈ జగత్తు వాస్తవముగ ఆకాశ కోశమువలె స్వచ్ఛమై, శిలాగర్భమువలె చిద్ఘనమై, శిలవలె మౌనరూపమై, శాంతమై, నాశరహితమై వెలయుచున్నది.

చిన్మాత్రే సర్వసంకల్పే విరాడాత్మాతివాహికే
దేహే సంవేదనం వ్యోమ జగదిత్యవభాసతే. 25

సర్వాకార, సర్వసంకల్పధారియు, చిన్మాత్ర రూపుఁడునగు విరాట్పురుషుని యొక్క సూక్ష్మశరీరమున విషయాభిముఖమైన స్ఫురణమేదిగలదో, అదియే జగద్రూపముగ భాసించుచున్నది.

ఏవం బ్రహ్మ మహాకాశమేవేదం క్వ జగత్కథా
శాన్తం సమ సమాభోగమేకమాద్యన్త వర్జితమ్. 26

ఈ ప్రకారముగ, ఈ సమస్తమున్ను సర్వథా విషమత్వాది దోషరహితమై సచ్చిదానంద రూపమై, శాంతమై, ఏకమై, ఆద్యంతవర్జితమైనట్టి బ్రహ్మాకాశమే అయియున్నది. ఇఁక జగత్తుయొక్క ప్రసంగమే యెచట ?

యథా పయసి వీచీనాముస్మజ్జననిమజ్జనైః
న జలాన్యత్వమేవం హి భావా భావైః పరైః పదే. 27

జలమందు తరంగములయొక్క యుత్పత్తి, వినాశములు సంభవించినను వానిచే జలముకంటె భిన్నత్వము ఆతరంగముకెట్లు లేదో అట్లే బ్రహ్మమందు జగత్తుయొక్క సృష్టి, ప్రళయములచే బ్రహ్మముకంటె భిన్నత్వము ఆ జగత్తునకున్ను లేదు.

పరావరవిదః కేచిదేతస్మిన్పరమే పదే
శుద్ధే పరిణమన్త్యన్తర్వారిబిన్దురివామ్భసి. 28

సారాసారములఁగూర్చిన వివేకముగల తత్త్వజ్ఞానులు కొందఱు, అట్టి పరమపదమగు శుద్ధబ్రహ్మమున జలబిందువు జలమందువలె ఏకరసత్వమును పొందుచున్నారు.

పరేఽపరమిదం భాతి పరస్యేవ పరాత్మకమ్
సంభవన్త్యమలే శాన్తే న జగన్తి న తత్క్రియాః. 29

ఆ పరబ్రహ్మమున నద్దాని అవయవమువలె లేక, కార్యమువలె ఈ జగజ్జీవరూపము తద్భిన్నమైనదాని చందమున భాసించుచున్నది. కాని విచారించిచూచిన నది పరబ్రహ్మమేయైయున్నది. ఏలయనిన శాంతమై, నిర్మలమైనట్టి బ్రహ్మమున జగత్తులుగాని, తద్వ్యవహారములుగాని సంభవింపనేరవు.

స్వాత్మేన్వే స్వప్న ఇతి జ్ఞాతే దృశ్యే బ్రహ్మతయాపి చ
మృగామ్బుని పరత్వేన కో భావయతి భావనామ్. 30

స్వప్నపదార్థములు స్వాత్మరూపముగను, దృశ్యము బ్రహ్మరూపముగను, మృగతృష్ణాజలము ఊషరభూమిమాత్రముగను నెఱుఁగఁబడిన మీఁదట నిఁక ఆ స్వప్నాదులందెవఁడు సత్యత్వబుద్ధిగల్గియుండును ?

పరమార్థ చమత్కారమన్తః స్థానుభవం వినా
అన్యస్యాన్యం న జానాతి సీధుస్వాదుమివ ద్విజః. 31

బ్రాహ్మణుఁడు మద్యముయొక్క మాధుర్యము నెఱుఁగనట్లు, జ్ఞాని తన యంతఃకరణమున పరమార్థచిత్ - చమత్కారమగు దృశ్యముయొక్క యనుభవములేకయున్నందున, అశుచిరూపమగు ఈ ప్రపంచముయొక్క భోగరసము నెఱుఁగకయే యుండును.

నిర్వాయ నిజ ఆత్మాయం పరిపృత్యావలోకితః
చేతోఽన్ముఖత్వముత్సృజ్య సంతిష్ఠేద్భ్రాన్త ఆత్మని. 32

మనుజుని ఈ స్వకీయమగు ఆత్మ బాహ్యదృష్టినుండి వదలి, విషయోన్ముఖత్వమును విడి సమాధియందు నెలకొని, చరమసాక్షాత్కారవృత్తిచే నిజశుద్ధస్వరూపమునుగాంచినదై, నిత్యముక్తమగు అట్టి ప్రశాంతాత్మయందు వర్తించుగాక !

**శ్రీ వసిష్ఠ ఉవాచః—**

> దృశ్యం బీజాఙ్కుర ఇవ స్థితం బ్రహ్మణి కారణే
> ఇతి సర్గాది సద్భావః కస్మాన్నేహోపపద్యతే. 33

శ్రీవసిష్ఠుఁడు:— ఓ రామచంద్రా! బీజాంకురన్యాయముచే కారణభూతమగు బ్రహ్మమున ఈ జగద్రూపమగు దృశ్యము విద్యమానమైయున్నది. అను నీ ప్రకారముగ నిట సృష్టియొక్క సత్తనుగూర్చి యేల వచింపఁదగదు ?

**శ్రీరామ ఉవాచః—**

> బీజేఽఙ్కురోఽఙ్కురతయా సంస్థితో నోపలభ్యతే
> బీజోదరే తు యా సత్తా బీజమేవ హి సా భవేత్. 34

శ్రీరాముఁడు:— మహాత్మా! బీజమందు అంకురము అంకురరూపముతో నుండుచో, బీజమును భేదించుకొని బాహ్యప్రదేశమున కది యేతెంచుచున్నదని చెప్పవచ్చును. కాని, బీజమును భేదించి చూచినను, అంకురము లభించుటలేదు. మఱియు బీజమందలి సూక్ష్మభాగములయొక్క సత్తయేదిగలదో అది బీజమేయగును. గాని, అంకురముకాదు. కాఁబట్టి, బీజమే అంకురాదిరూపముగ పరిణతమగుచున్నదని సిద్ధించుచున్నది.

> బ్రహ్మణోఽన్తర్జగత్త్వేవం జగత్త్వేనోపలభ్యతే
> అస్తి చేత్తద్భవేన్నిత్యం సా బ్రహ్మైవావికారి తత్. 35

కాని బ్రహ్మమందు జగత్సత్త యట్లుకాదు. అది (రజ్జుసర్పమువలె) జగత్తుగనే లక్ష్యమగుచున్నది. ప్రళయకాలముననున్నచో నప్పుడది బ్రహ్మమేయగును. ఏలయనిన బ్రహ్మము సదానిర్వికారమైయున్నది. కావున బీజాంకురన్యాయమిచటఁదగదు.

> అవికారాదనాకారాద్వికార్యాకృతి భాసురమ్
> ఉదేతీతి కిలాస్మాభిర్నైవ దృష్టం న చ శ్రుతమ్. 36

మునీంద్రా! నిర్వికారమునుండి సవికారము, నిరాకారమునుండి సాకారము ఉత్పన్నమగుటను మేమెచటను జూడలేదు, వినలేదు.

> అనాకృతావాకృతిమన్న చైతత్స్థాతుమర్హతి
> పరమాణౌ న చైవాన్తరివ సంభాన్తి మేరవః. 37

నిరాకారమై అవయవ రహితమైనట్టి వస్తువునందు సాకారమై సావయవమైనట్టి వస్తువెన్నఁటికిని నుండఁజాలదు. పరమాణువునందు మేరుపర్వతము లెచటనైన నుండునా ?

> సముద్గకే రత్నమివ జగద్బ్రహ్మణి తిష్ఠతి
> మహాకాశం నిరాకార శూన్యన్మాత్రవతో భవేత్. 38

'పేటికయందు రత్నమువలె బ్రహ్మమందు జగత్తుగలదు. నిరాకారమైన దానియందు గొప్ప యాకారముగల వస్తువుగలదు.' అనుట యున్మత్తుని ప్రలాపమేఁగుగును.

శాన్తం పరం చ సాకారస్యాధార ఇతి రాజతే
న వక్తుం రాజతే క్వేవ సాకారస్యావినాశితా. 39

సర్వవస్తురహితమైనట్టి శాంతమగు పరబ్రహ్మము అభేదసంబంధముచే సాకారమగు జగత్తుయొక్క అధారమని వచించుట శోభింపదు. ఏలయనిన, సాకారమైనదానికి అవినాశిత్వ మెచట శోభించును ?

బోధ ఏవాయమాకార ఇతి కల్పనయాపి ధీః
అపూర్వైః స్వప్నవద్రూఢైః సంస్కారైర్నోపలభ్యతే. 40

అపూర్వములును, స్వప్నమువలె రూఢములునగు ఆకారములతోడ బోధయే క్షణిక సాకారరూపముగ నుత్పన్నమగుచున్నదను బౌద్ధకల్పనయు అయుక్తమైయున్నది.

అపూర్వ ఏవ స్వప్నోఽయం యద్వై సర్గోఽనుభూయతే
స్వప్నః కిలానుభూతార్థః స్వభ్యస్త ఇవ దృశ్యతే. 41

ఏలయనిన, ఈ సృష్టియను స్వప్నము పూర్వకాలమున అనుభవింపఁబడనిదే అయి నేత్రాది ప్రమాణములచే ననుభూతమగుచున్నది. స్వప్నమో, జాగ్రత్తునందనుభవింపఁబడి బాగుగ అభ్యస్తమైనట్టి పదార్థమే సంస్కారమాత్రముచే నట గానుపించుచున్నదగును. ఇవ్విషయము సర్వజన ప్రసిద్ధమైయున్నది.

యదేవ జాగ్రత్తత్స్వప్న ఇతి నాత్రోపపద్యతే
స్వప్నే ప్రదగ్ధః పురుషః కథం ప్రాతర్విలోక్యతే. 42

కాఁబట్టి ఏది జాగ్రత్తో అదియే స్వప్నమను బౌద్ధులకథనమున్ను నిట యుక్తముకాదు. ఏలయనిన, అట్లైనచో స్వప్నమందు మరణించి, శ్మశానమున దహింపఁబడినట్టి మనుజుఁడు మరల ప్రాతఃకాలమున నెట్లు కానుపించుచున్నాఁడు? [కావున చైతన్యముయొక్క సాకారత్వక్షణిక త్వాదికల్పనచే ప్రపంచమునకు స్వప్నసామ్యము సిద్ధించుటలేదు; కూటస్థబ్రహ్మమం దధ్యస్తమగుట వలన బాధ్యత్వముచేతనె స్వప్నసామ్యము సిద్ధించుచున్నదగును.]

అశరీరస్య న స్వప్న ఇత్యేతదపి నోచితమ్
సంభవన్తి పిశాచాద్యాస్తేషాం చ స్వప్నవత్స్థితిః. 43

'స్థూలశరీరరహితుఁడగు సూక్ష్మశరీరధారియైన జీవునకు స్వప్నస్థితిలేద'ను చార్వాకుల కథనమున్ను సరికాదు. ఏలయనిన. పిశాచాదులున్ను, వానియొక్క స్వప్నమువంటి స్థితియు సంభవించుచునేయున్నవి.

తస్మాత్స్వప్నవదాభాసః సంవిదాత్మని సంస్థితః
సర్గాదినానా కృతినా పరమాత్మా నిరాకృతి 44

ఇక్కారణమున నిరాకారమైనట్టి పరమాత్మయే తన చిత్స్వరూపమున స్థితిగల్గియున్నదై, స్వప్నమువలె వివర్తరూపములగు సృష్ట్యాది వివిధాకారములుగ వర్తించుచున్నదను సిద్ధాంతము ప్రతిష్ఠింపబడినదాయెను.

స్వప్నే చిదేవ శైలాదిరూపేణాత్మని తిష్ఠతి
బ్రహ్మైత్మాఖిలముక్తోఽసావన్యేనాసౌ కృతో యది. 45

నేహాస్తిత్వం న నాస్తిత్వముపలబ్ధేఽనుభూయతే
నైవానుభవితృత్వం చ న చానుభవనక్రమః. 46

స్వప్నమున చైతన్యమే పర్వతాదిరూపములుగ తనయందు స్థితిగల్గియుండుట స్పష్టమే అయియున్నది. ఈ సాక్షి చైతన్యము (ప్రత్యగాత్మ) సర్వబంధరహితమగు బ్రహ్మమేయై వెలయుచున్నది. మఱియు, యీ ప్రపంచము అజ్ఞానముచేతనే స్వప్నమువలె గావింపఁబడినదను సిద్ధాంతమున నిట్టి అస్తిత్వ నాస్తిత్వాదులు (కలదు లేదు మున్నగునవి) గాని, అనుభవించువాఁడు, అనుభవము మున్నగువాని క్రమముగాని అనుభవింపబడవు గావున మిథ్యాత్వమే శేషించుచున్నది.

కిమపీదమనాఖ్యేయం బుద్ధే నైవానుభూయతే
స్వసంవేదనసంవేద్యం సత్తాసత్తా విజృమ్భితమ్. 47

సదసద్రూపముగ విజృంభించినదియు, అనిర్వచనీయమైనదియు, స్వానుభవవేద్యమైనదియు నగు ఈ జగత్తు అజ్ఞానదశయందే యనుభవింపబడుచున్నది. ఆత్మజ్ఞానము కలుగఁగా నియ్యది యనుభవింపఁబడక యుండును అత్తఱి బ్రహ్మస్వరూపమే శేషించును.

అభావరూపిణో భావా అభావా భావరూపిణః
సర్వదా సర్వథా సర్వే భాన్తి భాసురతాం గతాః. 48

భావ, అభావరూపములన్నియును సదా సర్వథా ఆత్మప్రకాశ రూపత్వమును బొందినవై భాసించుచున్నవి.

బృంహతి బ్రహ్మణి బ్రహ్మ వ్యోమ వ్యోమని వర్తతే
న చోపపద్యతే కించిద్బ్రహ్మ వ్యోమ్ని విబృంహణమ్. 49

బ్రహ్మాకాశమున బ్రహ్మాకాశము జగద్రూపముగ వర్తిల్లుచున్నది. కాని వాస్తవముగ నిర్వికారమగు బ్రహ్మాకాశమున జగదాకారముతోటి వర్తనము యుక్తము కానేరదు.

ద్రష్టృదృశ్యదృగాత్మాయమహం సర్గాదివిభ్రమః
శాన్తచిద్వ్యోమవిస్తారో న కుడ్యాద్యుపపద్యతే. 50

ద్రష్ట, దృశ్యము, దర్శనము, వీడు, నేను, ఇత్యాదిసృష్టి విభ్రమమంతయును శాంతమైనట్టి చిదాకాశముయొక్కయే విస్తారమైయున్నది. కావున నిట కుడ్యాదులు (సాకారత్వము) వాస్తవముగఁ దగవు.

యథా న సన్తి కుడ్యాది స్వసంకల్పనవర్తనమ్
తథైవాయం జగదితి శాన్తమేకమనామయమ్. 51

స్వప్న, సంకల్పపట్టణమెట్లు సత్యముకాదో అందలి కుడ్యాదులొకింతైనను నెట్లు సత్యములుకావో, అట్లే ఈ జగత్తున్ను సత్యముగాదు. ఇది శాంతమై, ఏకమై నిర్వికారమైనట్టి బ్రహ్మమే యగును.

పూర్ణం హి పరమం శాన్తమిదం సర్వమఖణ్డితమ్
అనిఙ్గనమనాభాసమనాద్యన్తమచేతితమ్. 52

ఈ ప్రపంచమంతయును, పూర్ణమై, పరమశాంతమై, నిష్క్రియమై, విషయాభాసరహితమై ఆద్యంతశూన్యమై, స్వప్రకాశరూపమై, అఖండమై, అద్వితీయమైనట్టి బ్రహ్మమే అయియున్నది.

అజన్మమరణం శాన్తమనాదినిధనం మహత్
అనుపాధి నిరాకారం స్వపదం బుద్ధవానహమ్. 53

మహాత్మా! జననమరణరహితమై, శాంతమై, ఆద్యంతవర్జితమై, మహత్తరమై, ఉపాధి శూన్యమై, నిరాకారమైనట్టి స్వాత్మపదమును తమయనుగ్రహమువలన నేనెఱిగితిని.

యా సంవిదన్తః స్ఫురతి సైవోపాయాతి వాక్యతామ్
యద్బీజం లీనమవనౌ తద్యాత్యఙ్కురతాం కిల. 54

మునీంద్రా! ఈ నా వాక్యము సత్యమేకాని, అసత్యముకాదు. ఏలయనిన అంతఃకరణమున నేవృత్తిస్ఫురించునో, అదియే వాక్యరూపత్వమును బొందును. ఏ బీజము భూమియందు లీనమగునో, అదియే అంకురత్వమును బొందునుగదా!

శుద్ధజ్ఞానమయైకాత్మా ద్వైతైక్యపరివర్జితః
మనాగపి న జానామి ద్వైతైక్యకలనాకలామ్. 55

శుద్ధజ్ఞానమయమై, ద్వైత, ఏకత్వవర్జితమైనట్టి ఆత్మయే నేనైయున్నాను. మఱియు ద్వైత, ఏకత్వకల్పన నొకింతైనను నే నెఱుగకయున్నాను.

సర్వే తూష్ణీమయా ఏవ జీవన్ముక్తా ఇమే జనాః
సంశాన్తసర్వసంరమ్భాః ఖే ఖఖా ఇవ స్థితాః. 56

ఈ జీవులందఱును నాయొక్క దృష్టియందు శాంతరూపులై, సర్వేంద్రియ వ్యాపార రహితులై, సర్వక్రియావర్జితులై బ్రహ్మమాత్రత్వమువలన జీవన్ముక్తులై ఆకాశమున శూన్యత్వమువలె బ్రహ్మమున స్థితినొందియున్నారు.

జగత్సర్గమహారమ్భమపి తూష్ణీమిదం స్థితమ్
చిత్రం భిత్తావివ కృతం మనోరాజ్య ఇవోదితమ్. 57

శబ్దస్పర్శాదిగుణయుక్తమై, వివిధమహాకార్యారంభ సహితమై యున్నప్పటికిని ఈ జగత్తు నా దృష్టియందు మౌనముగను, భిత్తి (గోడ) పైని చిత్రమువలె ఆభాసమాత్రముగను మనోరాజ్యమువలెను నుదయించినదై యున్నది.

శైలాదివోత్కీర్ణసమం శాలభఞ్జీవ వర్జితమ్
శమ్బరేణేవ రచితం వ్యోమ్ని స్వప్న ఇవోదితమ్. 58

మఱియు, ఈ జగత్తు శిలయందుఁ జెక్కఁబడిన విగ్రహముపలెను, కథయందు వర్ణింపఁబడిన వృత్తాంతముపలెను, ఆకాశమున శంబరాసురుని మాయచే నిర్మితమైనదానివలెను స్వప్నము వలెను నుదయించినదిగ నాకు భాసించుచున్నది.

కిల స్వప్నవదేవేదం సర్గాదావేవ భాతి యత్
అభిత్తికం నిష్ప్రతిఘం జగత్కేవాస్య సత్యతా. 59

మహాత్మా! ఎయ్యది సృష్ట్యాదియందే స్వప్నమువలె నుదయించినదై, ఆలంబన రహితమై, నిరాకారమై భాసించుచున్నదో, అట్టి దీనియందిఁక సత్యత్వమేమి?

జగద్బుద్ధావిదం సత్యం పరిజ్ఞానవతో మృషా
బ్రహ్మాత్మక ఇదం బ్రహ్మ శాన్తే శాన్తం పరామ్బరమ్. 60

ఈ జగత్తు అజ్ఞానిదృష్టియందు సత్యమై, వివేకిదృష్టియందు మిథ్యయై, బ్రహ్మ స్వరూపమును గాంచువాని దృష్టియందు బ్రహ్మమై, భూమికల యారోహణ క్రమముచే ప్రశాంతి నొందు మనుజుని దృష్టియందు క్రమముగ శమించి తుదకు మహాకాశమువలె శూన్యముగ పర్యవసించునదై యొప్పుచున్నది.

సర్వ ఏవ ఇమే భావాః సహ స్థావరజంగమాః
అస్మదాదయ ఆకాశం జగజ్జవిషయం తథా. 61

మహాత్మా! అస్మదాదిసహితములగు ఈ స్థావరజంగమరూప పదార్థములన్నియును బూర్ణజ్ఞానియొక్క దృష్టియందు చిదాకాశరూపములే అయియున్నవి.

ఖమహం ఖం భవాంశ్చిత్తం జగత్ఖం ఖం ఖమేవ చ
చిదాకాశైకతామేత్య భజైకాకాశరూపతామ్. 62

గురువర్యా! నేను చిదాకాశరూపుఁడను; తామున్ను చిదాకాశరూపులే; ఈ జగత్తున్ను చిదాకాశమే; ఆకాశమున్ను చిదాకాశమే; నా వాక్యమును పరీక్షించుటకొఱకై తాము చిదాకాశముతో ఏకత్వమొంది చిదాకాశ రూపత్వమును బడయుఁడు

జ్ఞానేనాకాశకల్పేన సర్వాత్మ గగనోపమమ్
జ్ఞేయాభిన్నేన సంబోధాత్తం వన్దే ద్విపదాం వరమ్. 63

మహాత్మా! అట్టి బ్రహ్మాకాశరూపమును బొందిన మనుజశ్రేష్ఠులగు తమ్ములను, ఆకాశమువలె నిర్మలమైనట్టి నిజస్వరూపజ్ఞానముచే సర్వరూపమై, ఆకాశసదృశమైనట్టి (నిర్మలమై విశాలమైనట్టి) జ్ఞేయమగు పూర్ణానందైక బ్రహ్మముకంటె అభిన్నులుగ నెఱుఁగుటవలన, అట్టి తమకు నమస్కరించుచున్నారు.

చిద్రూపత్వాదుదేతీదం జగత్తత్రైవ లీయతే
అకారణకమేవాన్తః పరం వ్యోమైవ నిర్మలమ్. 64

కారణములేకయే యీ జగత్తు చిద్రూపమునుండి యుత్పన్నమగుచు మరల యా చిద్రూప బ్రహ్మమందే లయించుచున్నది. కావున నిది నిర్మలచిదాకాశరూపమే అయియున్నది.

వీతత్సర్వపదాతీతం సర్వశాస్త్రకలాతిగమ్
పదమాసాద్య నిర్ద్వన్ద్వం త్వమాకాశాత్మకోఽభవః. 65

మునీంద్రా! సమస్త శాస్త్రయుక్తులను అతిక్రమించి చనునదియు, సర్వపదాతీతమైనదియు, ద్వంద్వవర్జితమైనదియునగు (బ్రహ్మ) పదమును బొంది తాము సదా చిదాకాశరూపులే అయియున్నారు

అహం జగచ్చ నో పాదపాణ్యాది న ఘటాది చ
సర్వమాకాశమాకాశమేవాచ్ఛం సూక్ష్మచిద్భవేత్ 66

నేను నా హస్తపాదాద్యవయవములు; బాహ్యమందలి ఘటపటాదులు - ఇత్యాది సమస్త జగత్తున్ను వాస్తవముగలేదు. ఏలయనిన , ఇదియంతయును మహానిర్మలమై, అతిసూక్ష్మమైనట్టి చిదాకాశమే అయియున్నది.

సర్వావహ్నవ వీవాయం మయా యో దర్శిత స్తవ
సనిన్ద్యో వాదినాం వాదేష్వాత్మజ్ఞానేషు రాజతే. 67

మహాత్మా! ఈ ప్రకారముగ ఏ యీ సమస్తపదార్థములయొక్క అభావమును తమ యెదుట నేను దర్శింపఁజేసితినో అది 'నా తల్లివంధ్య (గొడ్రాలు) నా నోటియందు నాలుక లేదు' మున్నగు వాక్యములవలె వ్యాఘాతాది దోషారోపముచే తార్కికాది వాదుల సభయందు నింద్యమై, శోభింపకయున్నను ఆత్మజ్ఞానమునుగూర్చి విచారించుచు, పరమపురుషార్థ రూపమగు జ్ఞానమెయ్యది యని పరీక్షించువారియొక్క సభయందు తప్పక శోభించును. ఏలయనిన; సమస్తపదార్థములయొక్క అభావములేనిచో, ఆత్యంతిక అనర్థనివృత్తి రూపమగు నిరతిశయానందము సిద్ధింపనేరదు.

కాష్ఠమౌనాత్మకో వాదే న సర్వాపహ్నవో యదా
క్రియతే తేన వాదేషు నాత్మజ్ఞానం ప్రసీదతి. 68

కాష్ఠమౌనరూపమగు సర్వపదార్థాభావము వాదమందుఁ గావింపఁబడఁజాలదు. కావున శుష్క వాదములచే ఆత్మజ్ఞానముదయింపదు. (నిర్మల విచారణచేతనే యుదయించును.)

ప్రత్యక్షాది ప్రమాణానాం యదగమ్యమచిహ్నితమ్
స్వానుభూతిభవం బ్రహ్మ వాదైస్తల్లభ్యతే కథమ్. 69

ఏది ప్రత్యక్షాది (ఇంద్రియజన్మ) ప్రమాణములచేఁ బొందఁబడదో, దేనియందేచిహ్నమున్నులేదో. అట్టి స్వానుభవరూపమైనట్టి బ్రహ్మము వాదములచే నెట్లు లభించును?

సర్వాగమార్థ సమతీతమచిహ్నమచ్ఛ
మాకాశమేకమజమాద్యమనామరూపమ్
శుద్ధం చిదాత్మక మిహాస్త్యనుభూతిమాత్రం
శాన్తాభిధానకలనం మలశఙ్కయాలమ్. 70

ఇత్యార్షే శ్రీ వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు
నిర్వాణప్రకరణే ఉత్తరార్ధే బోధప్రకాశీకరణయోగోపదేశో నామ
పఞ్చనవత్యధిక శతతమః సర్గః ॥ 195 ॥

మునీంద్రా! సమస్త శాస్త్రములయొక్క అర్థములకంటె నతీతమైనట్టి అనుభవ మాత్ర మను ప్రమాణముగలదై, చిహ్నరహితమై, అతినిర్మలమై, చిదాకాశరూపమై, ఏకమై, జన్మవర్జితమై, అదృశ్యస్వరూపమై, నామరూపరహితమై, శుద్ధమై, నామకల్పనాశూన్యమై, అనుభవమాత్రమైనట్టి చిద్రూపబ్రహ్మమే యిచట గలదు. గాని తదన్యముగ నెద్దియునులేదు. అట్టి బ్రహ్మమందు వికారాది మలమునుగూర్చిన శంకవలన ఏ ప్రయోజనమున్ను లేదు.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున నుత్తరార్ధమున బోధప్రకాశీకరణయోగోపదేశమను నూటతొంబదియైదవ సర్గము ॥ 195 ॥

షణ్ణవత్యధికశతతమః సర్గః

[ గురుశాస్త్రాద్యుపాయేన యథా బ్రహ్మేహ లభ్యతే
దారువైవధికాఖ్యానం తథా సంక్షిప్య వర్ణ్యతే.

గురు, శాస్త్రాద్యుపాయములచే బ్రహ్మమెట్లు లభించునో, ఆవిషయమును దెలుపుటకై దారువైవధికాఖ్యానమిచట సంక్షేపముగ వర్ణింపఁబడుచున్నది.]

శ్రీ వాల్మీకి రువాచ:—

ఏవముక్త్వా మహాబుద్ధే రామో రాజీవలోచనః
ముహూర్తమాత్రం విశ్రమ్య తూష్ణీం స్థిత్వా పరే పదే. 1

పరమాం తృప్తిమాపన్నో విశ్రాన్తః పరమాత్మని
మునిం పునరపృచ్ఛత్తం జానన్నపి హి లీలయా. 2

శ్రీవాల్మీకి :—మహాబుద్ధివగునో భరద్వాజా! ఈ ప్రకారముగ పచించి కమలనేత్రుఁ డగు శ్రీరామచంద్రుఁడు ముహూర్తమాత్రకాలము (రెండుగడియలసేపు) పరమాత్మపదమున విశ్రమించి (సమాధిస్థుఁడై) మౌనముగనున్నవాఁడై, పరబ్రహ్మానందముచే సంతృప్తుఁడై, తదుపరి, తానెఱిఁగియుండియును గురుముఖతః మరల విన కుతూహలము గలవాడై, లీలాపూర్వకముగ నమ్మునివర్యునిట్లు ప్రశ్నించెను.

శ్రీరామ ఉవాచ:—

భగవన్సంశయామ్భోదశరత్కాల మునీశ్వర
ఇదానీం సంశయోఽయం మే జాతో మనసి పేలవః. 3

శ్రీరాముఁడు:— సంశయమను మేఘమునకు శరత్కాలమువంటి యో మునీశ్వరా! మహాత్మా! ఇపుడు నా మనంబున ఈ తుచ్ఛసందేహము జనించినది.

ఏవమేతన్మహాజ్ఞానం సంసారార్ణవతారణమ్
సమస్తమేవ వాగ్జాలం సమతీత్యావతిష్ఠతే. 4

మునీంద్రా! పరమాత్మ సమస్తవాగ్జాలమున కతీతమైయున్నదనునదియే సంసార సముద్రమును దాటింపఁజేయునట్టి మహాజ్ఞానమైయున్నదిగదా!

యదిదం కిల సద్బ్రహ్మ స్వసంవిన్మాత్ర నిశ్చయమ్
తదవాచ్యం కిల గిరాం మహతామపి మానద. 5

మానప్రదుఁడవగు గురువర్యా! స్వానుభవమాత్ర నిశ్చయస్వరూపమైనట్టి యీసద్రూప బ్రహ్మమేది గలదో, అది అవాచ్యమై మహాత్ములయొక్కయు వాక్కునకు విషయముకానిదై యున్నది.

ఏవం స్థితే పరం జ్ఞేయం సర్వసంకల్పనోజ్ఝితమ్
స్వసంవిత్తుర్యతన్మాత్రలభ్యం దుర్గమతాం గతమ్. 6

కావున, జ్ఞేయస్వరూపమై, సర్వసంకల్పవర్జితమై, స్వానుభవరూపమై, అవస్థాత్రయమున కతీతమై, తురీయస్వప్రకాశవస్తుమాత్రముగ లభ్యమగునట్టి ఈ పరబ్రహ్మము జాగ్రదవస్థాంతర్గతములగు గురుశాస్త్రాదులచే దుర్జ్ఞేయమైయున్నది.

ప్రతియోగివ్యవచ్ఛేదసంఖ్యాభేదైషిణాం కిల
కథం శాస్త్రపదైస్తుచ్ఛైః సవికల్పైరవాప్యతే. 7

(జగత్తు పరమాత్మయందు లేదు ఇత్యాది) 'ప్రతియోగి'ని (పరబ్రహ్మముకంటె భిన్నముగ ఏపదార్థమున్ను సత్యముకాదు. ఇత్యాది) 'వ్యవచ్ఛేదము'ను (ఏకమైన బ్రహ్మమే కలదు-ఇత్యాది) 'సంఖ్య'ను (పరబ్రహ్మము పంచకోశములకంటె భిన్నమైనది-ఇత్యాది) భేదమును అపేక్షించునవియు, కావుననే తుచ్ఛములును, సవికల్పరూపములునగు శాస్త్రపదములచే (యతోవాచో నివర్తన్తే అప్రాప్యమనసా సహ - అపరబ్రహ్మమును పొందఁజాలక (వాక్కు, మనస్సుకూడ నివర్తించుచున్నవి - అనునీరీతిగ)-వాక్కునకు పరమైనట్టి అపరమాత్మపదమెట్లు పొందఁబడును?

వికల్పసారశబ్దాద్యైర్జ్ఞానం శాస్త్రైర్న లభ్యతే
తత్కిమర్థమనర్థాయ గురుశాస్త్రాది కల్పితమ్. 8

వికల్పపూర్ణములైన శబ్దాదులతోఁ గూడియుండుటచే శాస్త్రములచే ఆత్మజ్ఞానములభింపదు. అట్టిచో, (వివిధవికల్పసహితమైన భ్రాంతి పరంపరా రూపమగు) అనర్థముకొఱకై గురుశాస్త్రాదులేల కల్పింపఁబడినవి?

గురుశాస్త్రాది విజ్ఞానే కారణం వాప్యకారణమ్
తదత్ర నిశ్చయం బ్రహ్మన్బ్రూహి మే వదతాం వర. 9

వక్తలలో శ్రేష్ఠుఁడవగు నో మహాత్మా! ఇక్కారణమున, ఆత్మజ్ఞానవిషయమున గురుశాస్త్రాదులు కారణములగునా, కావా, అను ఈ నాసంశయమున నిర్ణయమేదియో తెలుపవేడెద.

శ్రీ వసిష్ఠ ఉవాచ:—

ఏవమేతన్మహాబాహో న శాస్త్రం జ్ఞానకారణమ్
నానాశబ్దమయం శాస్త్రమనామ చ పరం పదమ్. 10

శ్రీవసిష్ఠుఁడు :— మహాబాహుఁడవగు నో రామచంద్రా! నీవుచెప్పినది యథార్థమే. బ్రహ్మజ్ఞానముయొక్క కారణము (సాక్షాత్తుగ) గురు శాస్త్రాదులుకావు. ఏలయనిన శాస్త్రములు నానావిధ శబ్దవికల్పాదులచే బూర్ణములైయున్నవి. బ్రహ్మపదమో అనామమై, (శబ్దప్రవృత్తికి నిమిత్తభూతములైన ధర్మములులేనిదై) యున్నది.

తథాపి రాఘవశ్రేష్ఠ యదైతద్ధేతుతాం గతమ్
శాస్త్రాద్యుత్తమబోధస్య తత్సమాసేన మే శృణు. 11

శ్రేష్ఠుఁడవగు నో రాఘవా! అట్లయినప్పటికిని ఈ గురు, శాస్త్రాదులు ఉత్తమ బ్రహ్మజ్ఞానము యొక్కయు, తత్ఫలమగు మోక్షము యొక్కయు కారణ మేప్రకారముగ నయినవో, ఆ విషయమునుగూర్చి సంక్షేపముగ ఈ వచింపఁబోవు దారువైవధికాఖ్యానముద్వారా వినుము.

సన్తి క్వచిద్వైవధికాః కీరకాశ్చిరదుర్భగాః
దుఃఖేనాఖ్యాగతాః శోషం గ్రీష్మేణేవ జరద్ద్రుమాః. 12

ఓ రామచంద్రా! ఒకానొక ప్రదేశమున 'కీరక' జాతికి (శూద్రజాతి భేదమునకు) చెందినవారును, చిరకాలము దౌర్భాగ్యముతో గూడియున్నవారు నగు కొందఱు వైవధికులు (కావడి మోయువారు) కలరు. గ్రీష్మర్తువుయొక్క ప్రచండసూర్యరశ్మిచే వృక్షములు శైథిల్యము నొందునట్లు వారు దుఃఖముచే మిగుల దుర్బలత్వము నొంది కృశించియుండిరి.

దారిద్ర్యేనదురన్తేన కన్థాసంస్థాన కారిణా
దీనాననాశయాః పద్మా నిర్గతేనేవ వారిణా. 13

మహాదారిద్ర్యముతోఁ గూడినవారై చినిఁగిన బొంతలచే దేహమును గప్పుకొనుచు వారు సరోవరముయొక్క గట్టు తెగి జలము కాఱిపోవ యందలి కమలములవలె దీనముఖులై యుండిరి.

దౌర్గత్య పరితప్తాస్తే జీవితార్థమచిన్తయన్
జఠరస్య కయా యుక్త్యా వయం కుర్మః ప్రపూరణమ్. 14

దారిద్ర్యబాధచే మిగుల దుఃఖితులై వారంత 'ఈ దుష్ట యుదరమును మనమేప్రకారముగఁ బూరింపఁగలము?' అని చింతన జేసిరి.

సంచిన్త్య విధినా దినాన్తేన దినం ప్రతి
దారుభారేణ జీవామో విక్రీతేనేతి సంస్థితాః. 15

అట్లు విచారించి దైవవశాత్తుగ వారిట్టి నిశ్చయమును బొందినవారైరి. 'ప్రతిదినము పగలంతయు పరిశ్రమ చేసి అరణ్యమున కట్టెలు నఱికి సాయంకాలమున వానిని కావళ్లపై వేసికొని నగరమునకు దీసికొనిపోయి విక్రయించి దానిచే జీవించెదము,'

ఇతి సంచిన్త్య తే జగ్ముర్దార్వర్థం విపినాన్తరమ్
యత్రైవాజీవ్యతే యుక్త్యా సైవాపది విరాజతే. 16

ఈ ప్రకారముగ నిశ్చయించి కట్టెలకొఱకై వారరణ్యములోనికిఁబోయిరి. ఆపత్కాలమున నేయుపాయముచేఁ బ్రాణరక్షణయగునో, అదియే యక్కాలమున శోభించునుగదా!

ఇతి తే ప్రత్యహం గత్వా కాననం భవదారిణః
దారూణ్యానీయ విక్రీయ చక్రుర్దేహస్య ధారణమ్. 17

ఈప్రకారముగ వారు ప్రతిదిన మరణ్యమునకేగి కట్టెలు కొట్టుకొని నగరమునకుఁదీసికొనివచ్చి విక్రయించి, ఆయాదినమున లభించిన ద్రవ్యముతో అన్నాదులను భుజించి తమ శరీరమును రక్షించుకొనుచుండిరి.

యత్ప్రయాన్తి వనాన్తం తే తస్మిన్సన్త్యఖిలాన్తి హి
గుప్తాగుప్తాని రత్నాని దారూణి కనకాని చ. 18

ఏయరణ్యమునకు వారు పోవుచుండిరో, అచట గుప్తములైనవియు, ప్రకటములైనవియునగు అనేకవిధములైన రత్నములు, సువర్ణము, ఉత్తమకాష్ఠములు ఉండియుండెను.

తేషాం భారభృతాం మధ్యాత్కేచిత్కతిపయైర్వనాత్
నానారూపాణి రత్నాని తాని సంప్రాప్నువన్తి హి. 19

కావున, ఆ యరణ్యమునకుఁ బోవుచుండిన భారవాహులలో భాగ్యశీలురైన కొందఱు ఉత్తమసువర్ణమును, రత్నములను నటఁబొందుచుండిరి.

కేచిచ్చన్దనదారూణి కేచిత్పుష్పాణి మానద
కేచిత్ఫలాని విక్రీయ జీవన్తి చిరకీరకాః. 20

మానప్రదుఁడవగు రామచంద్రా! చిరకాలాభ్యాసముచే దృఢపడినట్టి 'కీరక' జాతివృత్తులు గల యా కాష్ఠవాహకులలోఁ గొందఱు చందనపుకొయ్యలను. కొందఱు పుష్పములను, కొందఱు ఫలములను, అమ్మి తమ జీవనమును గడుపుకొనుచుండిరి.

కేచిత్సర్వమనాసాద్య దుర్దారూణ్యేవదుర్ధియః
నీత్వా విక్రీయ జీవన్తి వనవీథ్యుపజీవనః. 21

అరణ్యమువలన జీవించువారగు వారిలో భాగ్యహీనులును, ఉత్తమవస్తువు నెఱుఁగజాలు కుశలబుద్ధిలేనివారునగు కొందఱు పాడుకట్టెలనే తీసికొనివచ్చి, అమ్మి దానిచే పొట్టపోసికొనుచుండిరి.

దార్వర్థముద్యతాః సర్వే తే సంప్రాప్య మహావనమ్
కేచిత్ప్రావ్యవస్థితాః సర్వే యుయుటీత్యేవం గతజ్వరమ్. 22

వారందఱును నమ్మహారణ్యమును బొందినవారై కట్టెలకొఱకే యత్నించుచుండిరి. కాని, అందు గొందఱు రత్నాదులను బొంది శీఘ్రముగ దారిద్ర్యసంతాపరహితులై విలసిల్లుచుండిరి.

ఇతి యావదజస్రం తే సేవన్తే తన్మహావనమ్
ప్రదేశాత్ప్రావదేశస్మాత్ప్రాప్తశ్చిన్తామణిర్మణిః. 23

ఈప్రకారముగ వారామహారణ్యమును నిరంతరము సేవించుచుండ, ఒకపుడట నొకా నొక ప్రదేశమున వారికి చింతామణి (వాంఛితపదార్థముల నొసంగుమణి) లభించెను.

తస్మాచ్చిన్తామణేః ప్రాప్తాః సమగ్రావిభవశ్రియః
పరమం సుఖమాయాతా స్తత్ర తే సంస్థితాః సుఖమ్ 24

ఆ చింతామణివలన వారు సమస్తైశ్వర్యములను బొందినవారై, పరమసుఖమునొంది యచ్చోట సుఖముగ వసింపసాగిరి.

దార్వర్థముద్యతాః సన్తః ప్రాప్య సర్వార్థదం మణిమ్
సుఖం తిష్ఠన్తి నిర్ద్వన్ద్వా దివి దేవవరా ఇవ. 25

కట్టెలకొఱకై వారు ప్రయత్నము సల్పిరి; కాని భాగ్యవశమున సర్వపదార్థముల నొసంగునట్టి చింతామణి వారికిలభించినదాయెను. దానిచే వారు శీతోష్ణాది దుఃఖరహితులై, స్వర్గమున నుత్తమ దేవతలవలె సుఖముగ నివసింపఁదొడఁగిరి.

సర్వార్థసారపరిపూర్ణతయా తయా తే
కాష్ఠోద్యమాధిగతసన్మణయో మహాన్తః
తిష్ఠన్తి శాన్తభయమోహవిషాదదుఃఖ
మానన్దమన్థరధియః సమతా ముపేతాః 26

ఇత్యార్షే శ్రీవాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే ఉత్తరార్ధే కాష్ఠవైవధికోపాఖ్యానే చిన్తామణిలాభో నామ షణ్ణవత్యధిక శతతమః సర్గః ॥ 196 ॥

ఓ రామచంద్రా! ఆ కాష్ఠవాహకులు కాష్ఠములఁ గూర్చిన యత్నముచేతనే మహత్తరమైన చింతామణిని బొందినవారై, సమస్త ఉత్తమ ధనములతోఁగూడి, భయ, మోహ, విషాద, దుఃఖరహితులై, ఆనందముచేఁ బరిపూర్ణమైనట్టి బుద్ధిగల్గి, ఇతరలాభాలాభాదులందు సమత్వముగలవారై వసింపసాగిరి.

ఇది శ్రీవాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున నుత్తరార్థమున కాష్ఠవైవధికో పాఖ్యానమున చింతామణి లాభమను నూటతొంబదియాఱవ సర్గము ॥ 196 ॥

## సప్తనవత్యధిక శతతమః సర్గః

[స్ఫుటం వైవధికాఖ్యాన తాత్పర్యవివృతి క్రమాత్
హేతుత్వం గురుశాస్త్రాదేరాత్మజ్ఞానేఽత్ర వర్ణ్యతే.

వైవధికాఖ్యానముయొక్క తాత్పర్యము స్పష్టముగ వివరింపఁబడుచు, ఆత్మజ్ఞానమున గురు శాస్త్రాదులయొక్క హేతుత్వమిచట వర్ణింపఁబడుచున్నది.]

శ్రీరామ ఉవాచ:—

తథా కురు మునిశ్రేష్ఠ యథా వైవధికక్రమమ్
అసందేహమిమం సమ్యగవగచ్ఛామి మానద. 1

శ్రీరాముఁడు:— మానప్రదుఁడవగు నో మునిశ్రేష్ఠా! ఈ వైవధికాఖ్యానము యొక్క తాత్పర్యమును నేను సందేహరహితుఁడనై యెఱుఁగఁగల్గులాగున వివరింప ప్రార్థన!

శ్రీ వసిష్ఠ ఉవాచ:—

యే తే వైవధికా రామ త ఏతే మానవా భువి
తేషాం దారిద్ర్యదుఃఖం య త్తదజ్ఞానం మహాతపః. 2

శ్రీవసిష్ఠుఁడు:— ఓ రామచంద్రా! ఏ వైవధికుల (కాష్ఠవాహకుల) గూర్చి నేను జెప్పితినో వారీప్రపంచమునఁగల సమస్తమానవులని యెఱుఁగుము; వారి దారిద్ర్యదుఃఖమేదిగలదో, అదియే అజ్ఞాన జనితమైన త్రివిధ సంసారతాపమని తెలిసికొనుము.

య త్తన్మహావనం ప్రోక్తం గురుశాస్త్రక్రమాది తత్
యదుద్యతాస్తే గ్రాసార్థం జనా భోగార్థినో హి తే. 3

అట మహారణ్యమేది చెప్పఁబడెనో, అది గురుశాస్త్రాది క్రమమైయున్నది. తమ ప్రాణ రక్షణకొఱకై వారు ప్రయత్నించుట యేదిగలదో, అది జనులు భోగార్థులై తద్భోగప్రాప్త్యు పాయ ములకొఱకు (శాస్త్రాదులందు) ప్రయత్నించుటయగును.

భోగౌఘాః సిద్ధిమాయాన్తు మమ విత్యల్పకో జనః
అనపేక్షితకార్యార్థః శాస్త్రాదౌ సంప్రవర్తతే. 4

మిగుల అల్పబుద్ధిగల మనుజుఁడు పరమార్థము నపేక్షింపక 'నాకుభోగ సమూహ ములు సిద్ధించుగాక!' అని యెంచి తదుపాయముకొఱకై శాస్త్రాదులందు ప్రవృత్తుఁడగుచున్నాఁడు.

భోగార్థం సంప్రవృత్తోఽపి ప్రాప్నోత్యభ్యాసతః క్రమాత్
జన్తుశ్చిన్తితమేవాద్య పదం పరవశోఽపి సన్. 5

అట్లు భోగములకొఱకే మొదట శాస్త్రాదులందు ప్రవృత్తుఁడైనను, భోగఫలలాభముచే వానియందు విశ్వాసము దృఢపడ, పిమ్మట క్రమముగనందు వచింపఁబడిన సాధనలయొక్క యభ్యాసముచే నాతఁడు తచ్ఛాస్త్రములయొక్క పరమతాత్పర్య విషయమగు మోక్షపదమైన బ్రహ్మ మును వివశుఁడై చింతించుచున్నాఁడు.

దార్వర్థముద్యతో భావీ యథా సంప్రాప్తవాన్మణిమ్
భోగార్థమాత్రశాస్త్రోఽయం తథాప్నోతి జనః పదమ్. 6

కాష్ఠము (కట్టె)లకొఱకు ప్రయత్నమాచరించినప్పటికిని, ఆకాష్ఠవాహకుఁడెట్లు చింతా మణిని బొందఁగల్గెనో, అట్లే భోగములకొఱకై శాస్త్రముల నవలంబించినను మనుజుఁడు క్రమముగ పరమ పదమగు మోక్షమును బొందగల్గుచున్నాఁడు.

కిం స్యాచ్ఛాస్త్రవిచారాభ్యామితి సందేహలీలయా
కశ్చిత్ప్రవర్తతే పశ్చాదాప్నోతి పదముత్తమమ్. 7

'శాస్త్రపఠనం, తద్విచారములచే నేమి కలుగునో' అను సంశయమువలన జనించిన కుతూహలముచే నట్టిశాస్త్రమం దొకానొకఁడు ప్రవర్తించుచు, తుదకు అత్యుత్తమమైన మోక్షపదమును బొందుచున్నాఁడు.

అదృష్టోత్తమతత్త్వార్థః శాస్త్రాదౌ సంప్రవర్తతే
సందేహానార్థభోగార్థం జనః ప్రాప్నోతి తత్పదమ్. 8

మొదట ఉత్తమ బ్రహ్మతత్త్వమును గాంచనివాఁడై మనుజుఁడు విషయభోగార్థము సంశయముచే శాస్త్రాదులందు ప్రవృత్తుఁడై ఆపిమ్మట క్రమముగ పరబ్రహ్మపదము నొందుచున్నాఁడు.

అన్యథా సంప్రవర్తన్తే శాస్త్రైర్వాసనయా జనాః
అన్యదాసాదయన్త్యాద్యం మణిం వైవధికా ఇవ. 9

తమతమ వాసనల ననుసరించి మనుజులు పరమార్థభిన్నమైనట్టి భోగఫలమును వాంఛించుచు శాస్త్రములందు ప్రవృత్తులైనను, కాష్ఠవాహకులు చింతామణిని బొందినట్లు, క్రమముగ తదన్యమైనట్టి మోక్షఫలము (నిరతిశయానందము)ను బొందుచున్నారు

పరోపకారేఽవిరతం స్వభావేన ప్రవర్తతే
యః స సాధురితి ప్రోక్తః ప్రమాణం త్వస్య చేష్టితమ్. 10

ఎవఁడు స్వభావముగనే పరోపకారార్థము శాస్త్రములందును, తదితర కార్యములందును ప్రవర్తించునో అతఁడే సాధువని చెప్పఁబడును. అతని యాచరణయే సర్వలోకమునకును ప్రమాణమై యలరుచున్నది.

సాధ్వాచారవశాల్లోకో భోగసంప్రాప్తిశఙ్కయా
సందేహశ్చాప్యతత్త్వజ్ఞః శాస్త్రాదౌ సంప్రవర్తతే. 11

సజ్జనుడు సాధు ఆచరణకొఱకును, అద్దాని భోగప్రాప్తిని గూర్చిన సంశయముచేతను శాస్త్రాదులందు ప్రవర్తించుచున్నాడు.

భోగార్థం సంప్రవృత్తోఽసౌ భోగమోక్షావుభావపి
తస్మాత్ప్రాప్నోతి దార్వర్థీ వనాచ్చిన్తామణిం యథా. 12

అట కాష్ఠార్థి యరణ్యమునుండి చింతామణిని బొందినట్లు భోగఫలముకొఱకై మనుజుఁడు శాస్త్రమందుఁ బ్రవృత్తుఁడై యద్దానినుండి భోగ, మోక్షఫలముల రెండింటినిగూడఁ బడయుచున్నాఁడు.

కేచిచ్చన్దనదారూణి కేచిచ్చిన్తామణిం మణిమ్
కేచిత్ప్రామాన్యరత్నాని ప్రాప్నువన్తి యథా వనాత్. 13

కేచిత్కామం కేచిదర్థం కేచిద్ధర్మత్రయం తు వా
కేచిన్మోక్షమశేషం చ లభన్తే శాస్త్రతస్తథా. 14

మఱియు నచట కాష్ఠాద్ధులలో గొందఱు చందనపుకొయ్యలను, కొందఱు చింతామణి యను మణిని, మఱికొందఱు సామాన్యరత్నములను అయ్యరణ్యమునుండి పొందినట్లు శాస్త్రముల నుండి కొందఱు కామమును, కొందఱు అర్థమును, కొందఱు ధర్మమును, కొందఱు ధర్మార్థ కామముల మూటిని మఱికొందఱు మోక్షమును (ఇట్లాయా పురుషార్థములను) పూర్ణముగఁ బొందుచున్నారు.

వర్గత్రయోపదేశో హి శాస్త్రాదిష్వస్తి రాఘవ
బ్రహ్మప్రాప్తిస్త్వవాచ్యత్వాన్నాస్తి తచ్ఛ్రాసనేష్వపి. 15

ఓ రాఘవా! ధర్మార్థకామములను వర్గత్రయముయొక్క యుపదేశము శాస్త్రాదులందు వాచ్య (ముఖ్య) వృత్తిచేఁగలదు. కాని బ్రహ్మప్రాప్తి వాక్కునకు విషయముకానిదగుటచే నయ్యది బ్రహ్మ ప్రతిపాదక శాస్త్రమునందునుగూడ వాచ్య (ముఖ్య) వృత్తిచేలేదు. (లక్షణావృత్తిచేత నేగలదు.)

కేవలం సర్వవాక్యార్థైర్ధ్వన్యమానావగమ్యతే
కాలశ్రీః ప్రసవేనేవ స్వయం స్వానుభవేన సా. 16

వసంతాదికాల శోభ ఆయా కాలములందలి పుష్పఫలాదులచే సూచింపఁబడునట్లు సమస్త వేదాన్త వాక్యార్థములచే సూచితమై యా బ్రహ్మప్రాప్తి లక్షణావృత్తిజన్యమగు కేవలము స్వానుభవమాత్రముచేతనే స్వయముగ నెఱుఁగఁబడుచున్నది.

సర్వార్థాతిగతం శాస్త్రే విద్యతే బ్రహ్మవేదనమ్
సర్వగాతిగతం స్వచ్ఛం లావణ్యమివ యోషితి. 17

మణి, దర్పణ, చంద్రాదులందలి సౌందర్యము నతిక్రమించినట్టి సౌందర్యము స్త్రీయందున్నట్లు, సమస్తపదార్థములను (లేక ధర్మార్థకామములను) అతిక్రమించినట్టి బ్రహ్మజ్ఞానము శాస్త్రములందు లక్షణాద్యుపాయములతోఁడ అధికారి జనులకొఱకు గల్గియేయున్నది.

న శాస్త్రైర్న గురోర్వాక్యాన్న దానాన్నేశ్వరార్చనాత్
ఏష సర్వ పదాతీతో బోధః సంప్రాప్యతే పరః. 18

సమస్తపదములకంటె అతీతమైనట్టి యుత్తమ బ్రహ్మబోధ శాస్త్రముచేగాని, గురు వాక్యముచేగాని, దానముచేగాని, ఈశ్వరార్చనముచేగాని (సాక్షాత్తుగ) లభింపజాలదు.

ఏతాన్యకారణాన్యేవ కారణత్వం గతాన్యలమ్
పరమాత్మైకవిశ్రాన్తౌ యథారాఘవ తచ్ఛృణు. 19

ఓ రాఘవా! ఈ గురుశాస్త్రాదులు పరమాత్మైక విశ్రాంతికి కారణములు కాకున్నను, ఎట్లు పూర్ణముగ కారణత్వమును బొందినవో వినుము.

శాస్త్రాదభ్యాసయోగేన చిత్తం యాతం విశుద్ధతామ్
అనిచ్ఛదేవమేవాశు పదం పశ్యతి పావనమ్. 20

శాస్త్రాభ్యాసముచే చిత్తమెపుడు మిగుల శుద్ధత్వమును బొందునో, అపుడది సర్వ భోగేచ్ఛా రహితమై, ప్రతిదినము అంతర్ముఖత్వముచే ప్రత్యగాత్మ తత్పరమై పరమపావనమైనట్టి బ్రహ్మపదమును శీఘ్రముగఁ గాంచును.

ఏతచ్ఛాస్త్రాదవిద్యాయాః సాత్త్వికో భాగ ఉచ్యతే
తామసః సాత్త్వికేనాస్యా భాగేనాయాతి సంక్షయమ్. 21

శాస్త్రముయొక్క యభ్యాసమువలన అవిద్యయొక్క సాత్త్వికభాగము వృద్ధినొందును. అట్టి యా సాత్త్వికభాగముచే నద్దాని తామసభాగము క్షయించును.

నూనం మలం ప్రధానేన క్షాలయచ్ఛాస్త్రరూపిణా
పురుషః శుద్ధతామేతి పరమాం వస్తుశక్తితః. 22

శాస్త్రమను జలముచే చిత్తముయొక్క మాలిన్యమును గడిగివైచుచు, మనుజుఁడు తచ్ఛాస్త్రప్రభావము చేతను తద్బోధ్యమగు నిత్యశుద్ధాత్మవస్తు సామర్థ్యము చేతను నిక్కముగ పరమ శుద్ధత్వమును బొందుచున్నాఁడు.

అనిచ్ఛయోరేవ యథా సప్తసప్తిసముద్రయోః
ప్రాగదృశ్యం తృతీయత్వం స్వభావవశతః స్వతః. 23
స్వసంనిధానమాత్రేణ విదితప్రతిభాసనమ్
సదసన్మయమాభోగి ప్రతిబిమ్బం ప్రవర్తతే. 24
ముముక్షుశాస్త్రయోరేవం మిథః సంబన్ధమాత్రతః
సర్వసంవిత్పదాతీతమాత్మజ్ఞానం ప్రవర్తతే. 25

ఇచ్ఛగింపకున్నను, సూర్యునియొక్కయు, సముద్రముయొక్కయు సన్నిధానమాత్రముచే మూఁడవవస్తువైనట్టి సదసన్మయమైన విశాలమగు ప్రతిబింబము అనుభవసిద్ధమగు స్ఫురణముతోఁ గూడినదై, అంతకుఁ బూర్వము కానుపింపకయున్నదైనను సముద్రమందు స్వభావవశమున స్వయముగ నెట్లు జనించుచున్నదో, అట్లే, ఇచ్ఛగింపకున్నను ముముక్షువుయొక్కయు, శాస్త్రముయొక్కయుఁ పరస్పరసంబంధమాత్రముచే సమస్త ఇంద్రియ సంబంధజ్ఞానముల కతీతమైనట్టి ఆత్మజ్ఞానము జనించుచున్నది.

అనయోః ప్రేక్షణాద్దేహే వివేకో జాయతే యథా
తథా స్వభావతః శాస్త్రవివేకాజ్ఞేయవేదనమ్. 26

సూర్య, సముద్రములను గాంచుటవలన ఆ రెంటి యొక్క అత్యంతభేదాది జ్ఞానరూపమగు వివేకమెట్లుదయించునో, అట్లే శాస్త్రజనిత వివేకముచే స్వభావముగనే దేహమందు (జీవునియందు) సర్వోపాధిరహితమైన జ్ఞేయమగు ఆత్మనుగూర్చిన జ్ఞానముదయించుచున్నది.

లోష్టేన లోష్టం సలిలే క్షాలయన్బాలకో యథా
క్షణేన లోష్టయోర్హస్తనైర్మల్యం లభతే పరమ్. 27
తథా శాస్త్రవికల్పౌఘైర్వికల్పాం శ్చేతనాద్బుధః
క్షాలయన్స్వవిచారేణ పరమాం యాతి శుద్ధతామ్. 28

బాలుఁడు నీటియందు మట్టిగడ్డచే మట్టిగడ్డను కడుగుచు, క్రమముగ నా రెండును నశింప హస్తముయొక్క మిక్కిలి నైర్మల్యము నెట్లు పొందునో, అట్లే వివేకి శాస్త్రజనితములగు

విచార వికల్ప సమూహములచే భ్రాంతిజనితములగు వికల్పములను దొలగించుచు మరల మరల ఆత్మతత్త్వపరీక్షణమను స్వకీయవిచారణచే పరమశుద్ధత్వమును బొందును.

మహావాక్యార్థనిష్యన్దం స్వాత్మజ్ఞానమవాప్యతే
శాస్త్రాదేరిక్షురసతః స్వాద్వివ స్వానుభూతితః. 29

యంత్రాద్యుపాయములచే పిండఁబడిన చెఱకురసమునుండి మాధుర్యముయొక్క యాస్వాదనము స్వానుభవముచే లభించునట్లు, ఉపనిషదాది శాస్త్రములయొక్క శ్రవణ, మనన, నిదిధ్యాసనాది ఉపాయములవలన తత్త్వమస్యాది మహావాక్యముల అఖండార్థ (లక్ష్యార్థము యొక్క అపరోక్షానుభవరూపమగు స్వాత్మజ్ఞానము మనుజునకు స్వానుభవముచే లభించుచున్నది.

ప్రభాభిత్త్యోః సమాసఙ్గాద్యథాఽఽలోకోఽనుభూయతే
శ్రుతశ్రుతవతోః సఙ్గాదాత్మజ్ఞానం తథా భవేత్. 30

ఆకాశమున సూర్యప్రకాశమంతటను వ్యాపించియున్నను భిత్తి (గోడ) యొక్క సంయోగముచే స్ఫుటముగ అనుభూత మగునట్లు, నిత్యస్వప్రకాశ రూపమైనను ఆత్మ జ్ఞానము శాస్త్రము యొక్కయు, దాని నభ్యసించువానియొక్కయు సంయోగముచే స్పష్టముగ అనుభూతమగుచున్నది.

త్రివర్గమాత్రసిద్ధ్యై యన్న మోక్షాయ చ తచ్ఛ్రుతమ్
విపులశ్రుతచర్చాసు తుచ్ఛమశ్రుతమేవ తత్. 31

ధర్మార్థ కామములను 'త్రివర్గము' యొక్క సిద్ధికొఱకు మాత్రము గావింపఁబడినదియు, మోక్షముకొఱకుఁ గావింపఁబడనిదియునగు (శాస్త్ర) శ్రవణము శ్రవణముకానేరదు. ఏలయనిన తత్త్వజ్ఞులయొక్క తత్త్వబోధోపాయచర్చలందలి (మిథ్యావిషయత్వమువలన తుచ్ఛమైనదియగుటచే) మూర్ఖత్వమే యగును.

తచ్ఛ్రుతం యత్కిల జ్ఞప్త్యై సా జ్ఞప్తిః సమతా యయా
తత్సామ్యం యత్ర సౌషుప్తీ స్థితిర్జాగ్రతి జాయతే. 32

ఓ రామచంద్రా! జ్ఞానము కొఱకైనట్టి శ్రవణమే శ్రవణము, దేనిచే ఆత్మదర్శనము వలన సర్వత్ర సమత్వముదయించునో, అదియే జ్ఞానము; ఎచట జాగ్రత్తునందును సుషుప్తి (నిర్వికల్పమైన ఆత్మ స్వరూపస్థితి) జనించునో, అదియే సమత్వము.

ఏవం హి సర్వమేతత్తచ్ఛాస్త్రాదేః సమవాప్యతే
తస్మాత్సర్వప్రయత్నేన శాస్త్రాద్యభ్యాసమాహరేత్. 33

ఈ ప్రకారముగ ఈ సమస్తమున్ను శాస్త్రాదులవలననే లభించుచున్నది. గావున సర్వ ప్రయత్నముచే శాస్త్రాదులయొక్క యభ్యాసమును తప్పక గావింపవలయును.

శాస్త్రార్థభావనవశేన గిరా గురూణాం
సత్సఙ్గమేన నియమేన శమేన రామ
తత్ప్రాప్యతే సకలవిశ్వపదాదతీతం
సర్వేశ్వరం పరమమాద్యమనాది శర్మ. 34

ఇత్యార్షే శ్రీ వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు
నిర్వాణప్రకరణే ఉత్తరార్ధే శాస్త్రమాహాత్మ్యం నామ
సప్తనవత్యధికశతతమః సర్గః ॥ 197 ॥

ఓ రామచంద్రా! శాస్త్రార్థమును భావించుట వలనను, గురువుల యొక్క యుపదేశాను సారము ప్రవర్తించుట వలనను, సత్సాంగత్య, నియమ శమముల చేతను, సమస్త ప్రపంచ పదముల కంటెను (బ్రహ్మలోకము వఱకైన సమస్త సుఖములకంటెను) అతీతమైనదియు, సర్వేశ్వర రూపమైనదియు, అద్యంతరహితమైనదియు, సమస్తమునకును ఆదియు. పరమపావన స్వరూపమున్నునగు మోక్షమను నిరతిశయ సుఖము సంప్రాప్తించుచున్నది.

ఇది శ్రీవాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున నుత్తరార్ధమున
శాస్త్రమాహాత్మ్యమను నూట తొంబది యేడవ సర్గము ॥ 197 ॥

## అష్టనవత్యధిక శతతమః సర్గః

[వర్ణ్యతేఽత్ర ప్రబుద్ధానాం నిర్విక్షేపసుఖస్థితౌ
హేతుః సేతురివామ్భానాం సర్వత్ర సమదర్శనమ్.

జలముయొక్క స్థితికి సేతికట్టు కారణమైనట్లు, జ్ఞానులయొక్క విక్షేపరహితమగు సుఖ స్థితికి సర్వత్ర సమదర్శనము హేతువని యిచట వర్ణింపఁబడుచున్నది.]

శ్రీ వసిష్ఠ ఉవాచః—

భూయో నిపుణబోధాయ శృణు కించిద్రఘూద్వహ
పునః పునర్యత్కథితం తదజ్ఞేఽవ్యవతిష్ఠతే. 1

శ్రీవసిష్ఠుఁడు:— రఘుకులోత్తముఁడవగు రామచంద్రా! బోధయొక్క దృఢత్వము కొఱకై మరల ఈ చెప్పఁబోవు రహస్య మొకింతవినుము. పూర్వ ప్రసంగమున నిద్దానినిగూర్చి చెప్పియున్నప్పటికిని మరల మరల వచింపఁబడినది అజ్ఞానులయొక్క హృదయమందును బాగుగ నాటును.

రాఘవ ప్రథమం ప్రోక్తం స్థితిప్రకరణం మయా
యేనేదమిత్థముత్పన్నమితి విజ్ఞాయతే జగత్. 2

ఓ రాఘవా! పూర్వము నేను వచించిన ఉత్పత్తి, స్థితి ప్రకరణములవలన ఈ జగత్తు భ్రాంతిమాత్రముగనే యుత్పన్నమై యిట్లు స్థితినొందియున్నదని తెలియఁబడుచున్నది.

తతో జగతి జాతేన పరోపశమశాలినా
భవితవ్యమితి ప్రోక్తం మయోపశమయుక్తిభిః. 3

ఉపశాన్తిప్రకరణే ప్రోక్తైరుపశమక్రమైః
పరమోపశమం గత్వా వస్తవ్యమిహ విజ్వరమ్. 4

పిమ్మట ఉపశమప్రకరణమున ఉపశమమునుగూర్చిన యుక్తులచే 'ఈ ప్రపంచమున జనించినట్టి మనుజుఁడు శాంతుఁడై, సర్వత్రసమదర్శియై యుండవలయునని' నాచేఁజెప్పఁబడినది. ఈ ప్రకారముగ నట ఉపశమ క్రమములద్వారా చెప్పఁబడిన యట్టి సమదర్శనముగల్గి, మనుజుఁడు పరమశాంతి యుతుఁడై, సంతాపరహితుఁడై నిర్వాణసుఖమున వర్తింపవలయును.

ప్రాప్తప్రాప్యేన తజ్జ్ఞేన యథా సంసారదృష్టిషు
విహర్తవ్యం హి నః కించిత్స్వల్పం శ్రోతవ్యమస్తి తే. 5

ఓ రామచంద్రా! ప్రాప్యవస్తువగు ఆత్మను బొందినట్టి జ్ఞాని ప్రపంచవ్యవహారమందెట్లు వ్యవహరింపవలయునో, అవ్విషయమునుగూర్చి యొకింత నీవు నా వలన వినవలసియున్నది.

జన్మ సంప్రాప్య జగతి బాల్య ఏవ జగత్స్థితిమ్
యథా భూతమిమాం బుద్ధ్వా వర్తవ్యమిహ విజ్వరమ్. 6

ఈ ప్రపంచమున జన్మించిన మనుజుఁడు బాల్యావస్థయందే జగత్తుయొక్క స్థితిని ముగ (భ్రాంతి మాత్రమని) ఎఱిఁగి, ఈ వచింపఁబోవు రీతి సంతాప రహితుఁడై నిర్విక్షేపముగ నిట వసింపవలయును.

సర్వసౌహార్దజననీం సర్వస్యాశ్వాసకారిణీమ్
సమతామలమాశ్రిత్య విహర్తవ్యమిహానఘ. 7

పాపరహితుఁడవగు రామచంద్రా! జ్ఞానియగు వాఁడు, సర్వజీవుల యెడల మిత్రత్వమును గలుగఁజేయునదియు, సమస్తప్రాణుల నూఱడించునదియునగు సమత్వమును (సర్వ జీవు లందును నొకే. ఆత్మను దర్శించుటవలన గలుగు సర్వత్ర సమబుద్ధిని, సర్వవైషమ్యరహితమగు బ్రహ్మదృష్టిని) దృఢముగ నవలంబించి యీ ప్రపంచమున విహరింపవలయును.

సర్వసంపత్తిసుభగం సర్వసౌభాగ్యవర్ధనం
సమతాసులతాయాస్తు ఫలం భవతి పావనమ్. 8

సమస్త సంపదలందును నుత్తమమైనదియు, సర్వసౌభాగ్యములను (సద్గుణములను) వృద్ధినొందించునదియునైన సమత్వమను శ్రేష్ఠలతయొక్క ఫలము మిగుల పవిత్రమైన దగుచున్నది.

సమతాసుభగేహానాం కుర్వతాం ప్రకృతం క్రమమ్
సర్వైవేయం జగల్లక్ష్మీర్భృత్యతామేతి రాఘవ. 9

ఓరాఘవా! సమత్వముతోఁగూడి సర్వజీవులయొక్కహితము నాచరించుచు, యథా ప్రాప్తమగు వ్యవహారమొనర్చుచునుండు మనుజుల కీజగత్తుయొక్క యైశ్వర్యమంతయును దాసి యగును.

న తదాసాద్యతే రాజ్యాన్న కాన్తాజనసంగమాత్
అనపాయి సుఖం సారం సమత్వాద్యదవాప్యతే. 10

సమత్వమువలన వినాశరహితమైనట్టి యుత్తమసుఖము లభించునో, అది రాజ్యముచే గాని, వనితాజన సంగమముచేగాని లభింపనేరదు.

ద్వన్ద్వోపశమసీమాన్తం సంరమ్భజ్వరనాశనమ్
సర్వదుఃఖాతపామ్భోదం సమత్వం విద్ధి రాఘవ. 11

ఓ రామచంద్రా! సమత్వమును ద్వంద్వము లన్నింటిని బూర్ణముగ నశింపఁజేయునదిగను, భయమును జ్వరము వినాశమొనర్చునదిగను, సమస్త దుఃఖములను సూర్యతాపమునకు మేఘమువంటిదిగను నెఱుఁగుము.

మిత్రీభూతాఖిలరిపుర్యథాభూతార్థదర్శనః
దుర్లభో జగతాం మధ్యే సామ్యామృతమయో జనః. 12

శత్రువుల నందఱిని మిత్రులుగ గాంచువాడును, తత్త్వదర్శియు, సమత్వమను అమృతముచేఁ బరిపూర్ణుఁడునగు మనుజుఁడే ముల్లోకములందును దుర్లభుఁడయియున్నాఁడు.

ప్రబుద్ధస్య స్వచిత్తేన్దోర్నిష్యన్దమమృతాధికమ్
సామ్యమాస్వాద్య జీవన్తి సర్వే వై జనకాదయః. 13

జ్ఞానియొక్క ప్రబుద్ధమగు నిజ చిత్తమను చంద్రునినుండి బయల్వెడలునదియు, అమృతముకంటెను అధికమగు అస్వాదము గలదియునగు సమత్వమను రసము నాస్వాదించి జనకాది తత్త్వజ్ఞులందఱును జీవించుచున్నారు.

సామ్యమభ్యస్యతో జన్తోః స్వదోషోఽపి గుణాయతే
దుఃఖం సుఖాయతే నిత్యం మరణం జీవితాయతే. 14

సమత్వము నభ్యసించు జీవునియొక్క నిజ కామక్రోధాది దోషములున్ను క్రమముగ శాంతి, ఉదారత్వాది గుణములుగ పరిణమించుచున్నవి; అట్టివానికి దుఃఖమున్ను, సుఖరూపమగుచున్నది. మరణమున్ను జీవిత సదృశమే యగుచున్నది.

సామ్యసౌన్దర్యసుభగం వనితా ముదితాదికాః
ఆలిఙ్గన్తి మహాత్మానం నిత్యం వ్యసనితా ఇవ. 15

సమత్వమను సౌందర్యముచే మనోహరుఁడగు మహాత్ముని మైత్రి, కరుణ, ముదిత, ఉపేక్ష మొదలగు ఉత్తమస్త్రీలు కాముకస్త్రీలు తమ పతిని కౌగిలించుకొనునట్లు కౌఁగిలించుకొనుచున్నవి.

సమః సముదితో నిత్యం సమోఽనుదితధీః సదా
న కాశ్చిదిహ తాః సన్తి యాః సమస్య హి నిర్ధయః. 16

సమదర్శిత్వము పూర్ణముగ నుదయించినవాఁడును, ఉత్తమ గుణములతోడ నిత్యము కూడియుండువాఁడును, చింత యెన్నఁడును లేనివాఁడునగు మనుజునకీ ప్రపంచమున ప్రాప్తింపనట్టి సంపద లెవ్వియును లేవు.

సర్వకార్యసమం సాధుం ప్రకృతి వ్యవహారిణమ్
చిన్తామణిమివోదారం ప్రశంసన్తి నరామరాః. 17

తనకార్యమందును, ఇతరుల కార్యములందునుగూడ సమానముగ వర్తించువాఁడును, క్షమ, ఉదారత్వాది గుణసంపన్నుఁడును, యథాప్రాప్తమగు ప్రస్తుత వ్యవహారమును గావించు వాఁడును, త్యాగశీలుఁడును, ఉదారచరితుఁడును, చింతామణివంటివాఁడునగు సాధుపుంగవుని సమస్త మనుజులును, దేవతలునుగూడ వాంఛించుచున్నారు.

సమ్యక్కారిణముద్దామముదితం సమచేతసమ్
న దహన్త్యగ్నయో రామ నాపః సిఞ్చన్తి మానవమ్. 18

సదాచారతత్పరుఁడును, సర్వ జనహితకారియు, నిరంకుశ (బంధరహిత. సర్వస్వతంత్ర) స్వభావయుతుఁడును సమచిత్తుఁడునగు మనుజుని అగ్ని దహింపఁజాలదు. జలము తడుపఁజాలదు. (దుఃఖమును గలుగఁజేయఁజాలవని భావము.)

యద్యథా తత్తథా యేన క్రియతే దృశ్యతే తథా
ఆనన్దోద్వేగముక్తేన కస్తం తోలయితుం క్షమః. 19

ఏ కార్యము నెట్లు చేయవలయునో దాని నట్లే చేయువాఁడును హర్ష, విషాదరహితుఁడును, సమస్తకార్యములను సమత్వముతోఁగూడియే యాచరించుచు జూపట్టువాఁడునగు మహనీయుని తులతూచుట కెవఁడు సమర్థుఁడగును?

మిత్రాణి బన్ధురిపవో రాజానో వ్యవహారిణః
సమ్యక్కారిణి తత్త్వజ్ఞే విశ్వసన్తి మహాధియః. 20

సమత్వముగలవాఁడై, ఉత్తమ ఆచరణగల్గియుండు తత్త్వజ్ఞునియందు మిత్రులును, బంధువులును, శత్రువులును, రాజులును, వ్యవహారపరులును, గొప్పధీమంతులును, సర్వులును విశ్వాసము గల్గియుందురు.

నానిష్టాత్ప్రపలాయన్తే నేష్టాదాయాన్తి తుష్టతామ్
ప్రకృతక్రమసంప్రాప్తాస్తత్త్వజ్ఞాః సమదర్శినః. 21

యథాప్రాప్తమగు ప్రస్తుతవ్యవహారము నాచరించువారును, సమదర్శులునగు తత్త్వజ్ఞులు అనిష్టము సంప్రాప్తించినపుడు భయపడి పారిపోరు; ఇష్టము సంప్రాప్తించినపుడు సంతుష్టి నొందరు.

త్యక్త్వా సర్వానుపాదేయాన్నామ భావాననిన్దితాన్
సమతాయామదుఃఖాయాం దధానా వృత్తిముత్తమామ్. 22

విహసన్తి జగజ్జాలం జీవయన్తి నిరామయాః
పూజ్యన్తే విబుధైః సర్వైః సమతాముదితాశయాః. 23

ఓ రామచంద్రా! ఇతరులు గ్రహింపనిచ్ఛగించునట్టి అనిందితములైన గృహ క్షేత్రాది పదార్థములఁగూడ త్యజించి నిర్లోభత్వ సంతోషరూపమగు ఉత్తమవృత్తిని ధరించి సమత్వమందు నెలకొనినవారై, దుఃఖరహితులై, ప్రసన్నచిత్తులై, తత్త్వజ్ఞులు ఈ జగజ్జాలమునుజూచి నవ్వుచు, వివేక ఉపదేశాదులచే నితరులను జీవింపఁజేయుచు సమస్తదేవతలచేతను బూజింపఁబడుచునుందురు,

ప్రకృతక్రమసంప్రాప్తం ముఖేన్దౌ కోపమేవ యః
సమాశయో ధారయతి స్యాత్సోమృతవజ్జనః. 24

సమత్వముతోఁగూడిన యంతఃకరణముగల మనుజుఁడు ప్రస్తుతక్రమము ననుసరించి సంప్రాప్తమగు వ్యవహారమున తన ముఖరూపచంద్రుని యందెప్పుడైన కోపమును ధరించుచో, అదియు అమృతమువంటి ఫలమునే గలుగఁజేయునదగునుగాని యెవనికిని క్షోభకరముగానేరదు.

యత్కరోతి యదశ్నాతి యద్బ్రాకామతి నిన్దతి
సమదృష్టిస్తద స్యేయం స్తౌతి నిత్యం జనావలిః. 25

సమదృష్టిగల మనుజుఁడేది చేయునో, భుజించునో, ఎచటికిఁబోవునో అనుచితమని యెఱిఁగి దేనిని నిందించునో. ఆయా కర్మలన్నింటిని జనులు నిత్యము స్తుతించుచుందురు.

యచ్ఛుభం వాశుభం యచ్చ యచ్చిరేణ యదద్య వా
సమదృష్టికృతం సమ్యగభినన్దతి తజ్జనః. 26

శుభముగాని, అశుభముగాని, శీఘ్రముగగాని, చిరకాలమునకుగాని సమదృష్టిగల మనుజుఁడేది చేయునో దానిని జనులు ప్రశంసించుదురు.

సుఖదుఃఖేషు భీమేషు సంతతేషు మహత్స్వపి
మనాగపి న వైరస్యం ప్రయాన్తి సమదృష్టయః. 27

చిరకాలమువఱకు ఘోరసంకటములు సంప్రాప్తించినను సమదృష్టిగల మహాత్ములొకింతైనను భీతిల్లరు.

శిబిర్నృపః కపోతాయ మాంసమఙ్గవికర్తనమ్
దదౌ ముదితయా బుద్ధ్యా సమదృష్టితయానయా. 28

ఇట్టి సమదృష్టిగల్గి యున్నందువలననే ప్రసన్నచిత్తముతోడ శిబిచక్రవర్తి తన్ను శరణ బొందిన కపోతపక్షికి (పావురమునకు) తన శరీరమందలి మాంసమును గోసియిచ్చెను.

ప్రాణేభ్యోఽపి ప్రియతమాం కాన్తామగ్రే వికాలితామ్
దృష్ట్వాప్యఙ్గ మహీపాలో న ముమోహ సమాశయః. 29

సమచిత్తుఁడగు అంగదేశపు భూపాలుఁడు తన యెదుట ప్రాణములకంటెను ప్రియతమ మైనట్టి తన భార్య శత్రువులచే బాధితమగుచుండుటఁజూచియు చిత్తవైకల్యము నొందకయుండెను.

మనోరథశతప్రాప్తం తనయం సమయా ధియా
రాక్షసాయ త్రిగర్తేశో దదౌ స్వపణహారితమ్. 30

సమదృష్టి గల్గియుండుటవలననే త్రిగర్తదేశపురాజు అనేక మనోరథములుగావించిన తదుపరి సంప్రాప్తించిన కొమరునిగూడ జూదమందోడిపోవుటవలన రాక్షసున కిచ్చివైచెను.

నగర్యాం దహ్యమానాయాం భూషితాయాం తథోత్సవే
సమ ఏవ మహీపాలో జనకో భూభృతాం వరః. 31

ఉత్సవమందు బాగుగ నలంకరింపఁబడినదై ధనధాన్యసమృద్ధితోఁగూడి శోభాయమానముగ వెలయుచున్న మిథిలానగరము కాలిపోవుచున్నప్పటికిని రాజశ్రేష్ఠుఁడగు జనక భూపాలుఁడు సమభావముగల్గియే (చింతారహితుఁడై) యుండెను.

న్యాయతః పరివిక్రీతం సాల్వరాట్ సమదర్శనః
స్వమేవ విచకర్తాశు శిరః పద్మదలం యథా. 32

'నీవు కోరిన దక్షిణ నొసంగుదునని' ప్రతిజ్ఞచేసి బ్రాహ్మణునకు విక్రీతునిపగిదియైనట్టి సమదర్శియగు సాళ్వమహారాజు శీఘ్రముగ కమలమునువలె తనశిరంబును ఛేదించివైచి యా బ్రాహ్మణున కొసంగెను

కున్దప్రకరనిర్భాసం యజ్ఞే పాణ్డుమివాచలమ్
జహౌ జరత్తృణమివ సౌవీరః సమయా ధియా. 33

కుంద (మొల్ల) పుష్పసమూహమువలెఁ దెల్లనైనదియు కైలాసపర్వతమువలె నొప్పుచున్నదియునగు ఐరావతమును ఇంద్రునిజయముచే తాము బొందినప్పటికిని యజ్ఞమున ఋత్విక్కుల వచనమువలన నద్దానిని సౌవీరదేశప్రభుపు సమచిత్తముతోడ తిరిగి యింద్రునకిచ్చివేసెను.

సమయైవ ధియా నిత్యం నిజమభ్యాహరత్క్రమమ్
మాతఙ్గః కుణ్డపో నామ ప్రాప వైమానిక స్థితిమ్. 34

తనయొక్క దేహయాత్రా నిమిత్తమగు వ్యవహారమును సమబుద్ధితో నాచరించుచు కుండపమను ఏనుఁగు, ఒక్కయావును వేతనముగఁబొంది యొకానొక బ్రాహ్మణునియైదావులను బురదనుండి లేవఁదీసి, తిరిగి తనయావేతనరూపగోవును సమబుద్ధితో పుష్కరతీర్థమున బ్రాహ్మణున కిచ్చివైచి, అపుడే యేతెంచిన విమానమెక్కి దేవపదమును బొందెను.

సర్వభూతక్షయకరీం సామ్యాభ్యాసేన భూరిణా
తత్యాజ రాక్షసీం వృత్తిం కదమ్బవనరాక్షసః. 35

సమస్తప్రాణులను నశింపఁజేయునట్టి తన రాక్షసవృత్తిని కదంబవనమందలి రాక్షసుఁడు సమత్వముయొక్క విశేషమగు అభ్యాసముచేతనే త్యజించివేసెను.

బాలచన్ద్రాభిజాతోఽపి సమబుద్ధితయా జడః
గుడమోదకవన్న్యాయప్రాప్తమగ్నిమభక్షయత్. 36

బాలచంద్రునివలె శుద్ధుఁడై జన్మించిన జడభరతుఁడు భిక్షాపాత్రయందు భిక్షవలె సంప్రాప్తమైన అగ్నిని సమబుద్ధిచేతనే గుడమోదకము (బెల్లపులడ్డు) వలె భక్షించివైచెను.

సమబుద్ధితయా క్రూరవ్యవహారపరోఽపి సన్
ధర్మవ్యాధస్తనుం త్యక్త్వా జగామ పరమం పదమ్. 37

సమబుద్ధితో గూడియున్నందువలననే ధర్మవ్యాధుఁడు, హింసాది క్రూరవ్యవహారతత్పరుడైయున్నను దేహమును వీడి పరమపదమగు మోక్షమును బొందఁగల్గెను.

నన్దనోద్యానసంస్థోఽపి పురుషోఽపి కపర్దనః
లులుభే న సురస్త్రీషు నూనం ప్రణయినీష్వపి. 38

ఆత్మజ్ఞాన జనితమగు సమదర్శిత్వమువలననే కపర్దనుఁడను రాజర్షినందనోద్యానమందున్నను సురస్త్రీ భోగసమర్థుఁడైయున్నను, తనయందనురాగము గల్గియున్న యా దేవస్త్రీల మధ్య నిక్కముగ కామవశుఁడు కాకయేయుండెను.

సమచిత్తతయాస్పన్దః కరఞ్జగహనేష్వపి
విన్ధ్యాకాన్తారకచ్ఛేషు రాజ్యం త్యక్త్వావసచ్చిరమ్. 39

మఱియు సమచిత్తత్వము వలననే యా రాజర్షి తనరాజ్యమును త్యజించివైచి కరంజ వృక్షములచేఁ బరిపూర్ణములగు వింధ్యారణ్య జలప్రాయ ప్రదేశములందు నిశ్చలముగ చిరకాలము వసించెను.

ఋషయో మునయశ్చైవ యే సిద్ధాః సురపూజితాః
సమదృష్టితయోద్విగ్నా న తే తాసు ప్రవతర్థషు. 40

దేవతలచేతను పూజితులగు గొప్ప గొప్పఋషులు, మునులు, సిద్ధులున్ను తపఃక్లేశము లందును భోగదాయకములగు సిద్ధులందును సమదృష్టివలననే యేమియు నుద్వేగమును (భయ దుఃఖాదులను) బొందకయుండిరి.

రాజానః ప్రాకృతాశ్చైవ ధర్మవ్యాధాదయోఽపరే
సమదృష్టిపదాభ్యాసాన్మహతాం పూజ్యతాం గతాః. 41

అనేకమంది రాజులున్ను, తక్కిన ధర్మవ్యాధాది సామాన్యజనులున్నుగూడ సమదృష్టి (సర్వత్ర ఏకాత్మదృష్టి)యొక్క అభ్యాసమువలననే మహాత్ములకున్ను పూజనీయులైరి.

ఇహాముత్ర చ సిద్ధ్యర్థం పురుషార్థప్రవృత్తయే
సమదృష్టితయా నిత్యం విచరన్తి సుబుద్ధయః. 42

ఇహ, పరలోకములందలి సిద్ధికొఱకును, పరమపురుషార్థమగు ఆత్మజ్ఞానముయొక్క ప్రవృత్తికొఱకును, ఉత్తమధీమంతులు సదా సమదృష్టితోడనే విహరించుచున్నారు.

అభివాఞ్ఛేన్న మరణమభివాఞ్ఛేన్న జీవితమ్
యథాప్రాప్తసమాచారో విచరేదవిహింసకః. 43

మనుజుఁడు మరణమునుగాని, జీవితమునుగాని యిచ్ఛగింపక యథాప్రాప్తమగు వ్యవహారము నాచరించుచు, అహింసాతత్పరుఁడై లోకమున విహరింపవలయును.

సమకలితగుణాగుణైకభావః సమసుఖదుఃఖపరావరో విలాసీ
ప్రవిచరతి సమావమానమానః ప్రకృతవరవ్యవహారపూతమూర్తిః. 44

ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు
నిర్వాణప్రకరణే ఉత్తరార్ధే సమదృష్టిప్రశంసా
నామాష్టనవత్యధికశతతమః సర్గః ॥ 198 ॥

ఓ రామచంద్రా! సమత్వమువలన గుణ, దోషములను సమభావముతో గాంచువాఁడును, ఉత్కృష్ట, నికృష్ట జన్మలందును సుఖదుఃఖములను సమముగ నెంచువాఁడును, మానావమానములందు సమభావము గల్గియుండువాఁడును, ప్రస్తుతవ్యవహారమును ఆసక్తిరహితుఁడై యాచరించుటచే పవిత్రమూర్తియు, ప్రకాశశీలుఁడునగు జీవన్ముక్తుఁడు లోకోపకారము కొఱకై యీ ప్రపంచమున సంచరించుచుండును.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున నుత్తరార్ధమున సమదృష్టి ప్రశంసయను నూటతొంబదియెనిమిదవ సర్గము ॥ 198 ॥

❖❖❖❖❖❖❖❖❖❖❖

## నవనవత్యధికశతతమః సర్గః

[ ముక్తానాం న కృతైరర్థో నాకృతైః కర్మభిః క్షతిః
తథాపి తేఽనువర్తన్తే సత్కర్మాణీతి వర్ణ్యతే.

జీవన్ముక్తులకు కార్యముల నాచరించుటవలన ప్రయోజనముగాని, ఆచరింపకయుండుట వలన హానిగాని యేమియునులేదు. అయినను వారు లోకసంగ్రహార్థము సత్కర్మల నాచరించుచునే యుందురను విషయమిచట వర్ణింపఁబడుచున్నది.]

శ్రీరామ ఉవాచః—

నిత్యం జ్ఞానైకనిష్ఠత్వాదాత్మారామతయా తథా
ముక్తైః కర్మపరిత్యాగః కస్మాన్న క్రియతే మునే. 1

శ్రీరాముఁడు:— ఓ మునీంద్రా! నిత్యము బ్రహ్మజ్ఞానమందే పరాయణులైయుండుట వలనను, సదా ఆత్మారాములై వెలయుచుండుటచేతనే జీవన్ముక్తులు కర్మపరిత్యాగము చేయవలసియున్నదిగదా! అట్లేల చేయుటలేదు?

శ్రీవసిష్ఠ ఉవాచ :—

హేయోపాదేయదృష్టీ ద్వే యస్య క్షీణే హి తస్య వై
క్రియాత్యాగేన కోఽర్థః స్యాత్క్రియాసంశ్రయణేన వా. 2

శ్రీ వసిష్ఠుఁడు:— ఓ రామచంద్రా! త్యాజ్య, గ్రాహ్యదృష్టులురెండును నశించినట్టి జీవన్ముక్తునికిఁక కర్మలను త్యజించుటచేఁగాని, గ్రహించుటచేగాని యేమి ప్రయోజనముండును?

న తదస్తీహ యత్త్యాజ్యం జ్ఞస్యోద్వేగకరం భవేత్
న వాస్తి యదుపాదేయం తజ్జ్ఞసంశ్రేయతాం గతమ్. 3

జ్ఞానికిట త్యజింపఁదగినట్టి దుఃఖకరమైన కర్మగాని, గ్రహింపఁదగినట్టి అవశ్యమాచరింపవలసిన కర్మగాని యేదియునులేదు.

జ్ఞస్య నార్థః కర్మత్యాగైర్నార్థః కర్మసమాశ్రయైః
తేన స్థితం యథా యద్యత్తత్తథైవ కరోత్యసౌ. 4

జీవన్ముక్తుఁడగు జ్ఞానికి కర్మత్యాగములచేగాని, కర్మగ్రహణములచేగాని, యే ప్రయోజనమున్నులేదు. వర్ణాశ్రమోచితమైన ప్రవాహపతితమగు ఏ కార్యమెట్లు స్థితినొందియుండునో, దాని నాతఁడట్లే యాచరించును.

యావదాయురియం రామ నిశ్చితం స్పన్దతే తనుః
తద్యథాప్రాప్తమవ్యగ్రం స్పన్దతామపరేణ కిమ్. 5

ఓ రామచంద్రా! ఆయువున్నంతవఱకును దేహము తప్పక చేష్టసల్పుచునేయుండును. అట్లు సల్పుట దేహముయొక్క ధర్మమైయున్నది. కావున యథాప్రాప్తమగు ధర్మపూర్వక వ్యవహారము నది నిశ్చింతగఁజేయుగాక! అట్లు చేయకుండుటచేగాని మఱియొకవిధముగ (అధర్మపూర్వకముగ) చేయుటచేగాని యేమి ప్రయోజనము గలదు?

అన్యథాన్యత్ర చేత్కార్యా క్రియా త్యక్త్వా నిజం క్రమమ్
సమానే హి క్రియాస్పన్దే కో దోషః సత్క్రమే కిల. 6

జీవన్ముక్తునకు శాస్త్రీయ, అశాస్త్రీయకర్మలు రెండును సమానములై నప్పటికిని శాస్త్రీయ సదాచారమందేదియు దోషములేనందున ఆతఁడు తన ధర్మపూర్వక వ్యవహారక్రమమును వదలి అన్యథా చరణమేల గావింపవలయును? స్వగృహము నిర్దోషమైయుండ దానినివదలి మఱియొక చోట నుండనేల?

సమయా స్వచ్ఛయా బుద్ధ్యా సతతం నిర్వికారదయా
యథా యత్క్రియతే రామ తదదోషాయ సర్వదా. 7

ఓ రామచంద్రా! కార్యముయొక్క సిద్ధి అసిద్ధులందు సమమై నిర్మలమై ఎల్లపుడు నిర్వికారమైనట్టి బుద్ధితో మనుజుఁడేది యెట్లు చేయునో అదియంతయును సదా దోషరహితమే యగును.

ఇహ మహ్యాం మహాబాహో బహవో బహుదృష్టయః
బహుధా బహుదోషేషు విహరన్తి విచక్షణాః. 8

మహాబాహూ! ఈ పృథివిపై సర్వశాస్త్రలోకరహస్యము నెఱిఁగినవారును, తమ దర్శనబలముచే లోకోపకారమున నేర్పరులునగు ఎందఱో జనులు పలువిధముల బహుదోష ప్రసక్తిగల ద్రవ్యార్జనాది కర్మలందును ప్రవర్తించుచుందురు. (అయినను వారియొక్క యా సమదర్శనత్వములచే ఆ దోషములు సులభముగ పరిహరింపబడునని భావము.)

గతసఙ్గతయా బుద్ధ్యా విహరన్తి యథా స్థితేః
గృహస్థారమ్భిణః కేచిజ్జీవన్ముక్తాః స్థితా భువి. 9

కొందఱు జీవన్ముక్తులు సంగరహితమగు బుద్ధితో యథాప్రాప్తములగు కార్యముల నాచరించుచును, మఱికొందఱు గృహస్థాశ్రమధర్మముల నిర్వహించుచును ఈ ప్రపంచమున వర్తించుచున్నారు,

తజ్జా రాజర్షయశ్చాన్యే వీతరాగా భవాదృశాః
అసంసక్తధియో రాజ్యం కుర్వన్తి విగతజ్వరాః. 10

ఓ రామచంద్రా! మఱియు నీవలె రాజర్షులును, రాగరహితులును, సంగరహితమగు బుద్ధిగలవారునగు కొందఱు తత్త్వజ్ఞులు సంతాపరహితులై రాజ్యమేలుచున్నారు.

కేచిత్ప్రకృతవేదార్థవ్యవహారానుసారిణః
యజ్ఞశిష్టాశినో నిత్యమగ్నిహోత్రే వ్యవస్థితాః. 11

కొందఱు జీవన్ముక్తులు వేదార్థముననుసరించి ప్రస్తుతవ్యవహారమాచరించువారును, యజ్ఞశిష్టమును భుజించువారును, నిత్యాగ్నిహోత్రులునై యున్నారు.

కేచిచ్చతుర్షు వర్ణేషు ధ్యానదేవార్చనాదికామ్
స్వక్రియామనుతిష్ఠన్తః స్థితా వివిధయేహయా. 12

మఱికొందఱు జీవన్ముక్తులు నాల్గు వర్ణాశ్రమములందును తమ తమ వర్ణాశ్రమయోగ్యములైన ధ్యాన, దేవార్చనాది కార్యములఁ గావించుచు వివిధచేష్టలతోఁగూడి వర్తించుచున్నారు.

కేచిత్సర్వపరిత్యాగమన్తః కృత్వా మహాశయాః
సర్వకర్మపరా నిత్యం తజ్జ్ఞా ఏవాజ్ఞవత్స్థితాః. 13

కొందఱు జీవన్ముక్తులగు మహాశయులు అంతరంగమున సర్వకర్మఫల త్యాగము గావించి నిత్యము సర్వకర్మతత్పరులై జ్ఞానులైనను (పైకి) అజ్ఞానులవలె స్థితినొందియున్నారు.

స్వప్నేఽప్యదృష్టలోకాసు ముగ్ధముగ్ధమృగాసు చ
వనావనీషు శూన్యాసు కేచిద్ధ్యానపరాయణాః. 14

కొందఱు జీవన్ముక్తులు స్వప్నమందును మనుజులు కానఁబడనివియు (నిర్జనములును) మిగుల సుందరములైన లేళ్లు మున్నగు జంతువులుగలవియునగు శూన్యవనప్రదేశములందు ధ్యానపరాయణులై యున్నారు.

పుణ్యవద్భిః సదా జుష్టే పుణ్యోపచయకారిణి
శమశాలిసమాచారే కేచిదాయతనే స్థితాః. 15

మఱికొందఱు, పుణ్యాత్ములగు సాధుజనులచే నిత్యము సేవింపఁబడునవియు కావుననే పుణ్యవర్ధకములును, శాంతి, సమత్వాది సదాచారములచేఁ బూర్ణములైనవియునగు తీర్థ, మున్యాశ్రమాదులందు వసించుచున్నారు.

రాగద్వేషప్రహాణార్థం త్యక్త్వా దేశం సమాశయాః
కేచిదన్యత్ర దేశే చ వదమాలమ్బ్య సంస్థితాః. 16

కొందఱు సమచిత్తులు, బంధుజనసంసర్గమున రాగద్వేషాది విక్షేపసహస్రములు సంభవించుటవలన, తన్నాశార్థము స్వదేశమునువీడి మఱియొక ప్రదేశము నాశ్రయించి ఆత్మ ధ్యానపరాయణులై యుండుచున్నారు.

వనాద్వనం పురాద్గ్రామం స్థానాత్స్థానం గిరేర్గిరిమ్
భ్రమన్తః సంస్థితాః కేచిత్సంసారోచ్ఛిత్తయే బుధాః. 17

కొందఱు జ్ఞానులు (సంగ్రహదోష పరిహారార్థము) ఒకచోట నుండక, ఒక వనము నుండి మఱియొకవనమునకును, ఒక నగరమునుండి మఱియొక నగరమునకును, ఒక గ్రామము నుండి మఱియొక గ్రామమునకును, ఒక పర్వతమునుండి మఱియొక పర్వతమునకును, ఒక స్థానమునుండి మఱియొక స్థానమునకునుజనుచు కాలము గడుపుచున్నారు.

వారాణస్యాం మహాపుర్యాం ప్రయాగే చైవ పావనే
శ్రీపర్వతే సిద్ధపురే బదర్యాశ్రమకేతథా. 18

శాలగ్రామే మహాపుణ్యే కలాపగ్రామకోటరే
మథురాయాం చ పుణ్యాయాం తథా కాలఞ్జరే గిరౌ. 19

మహేన్ద్రవనగుల్మేషు గన్ధమాదనసానుషు
దర్దురాచలవప్రేషు సహ్యాకాచలభూమిషు. 20

విన్ధ్యశైలస్య కచ్ఛేషు మలయస్యోదరేషు చ
కైలాసవనజాలేషు ఋక్షవత్కుహరేషు చ. 21

ఏతేష్వన్యేషు చాన్యేషు వనేష్వాయతనేషు చ
తపస్వినస్తథా రామ బహవో బహుదృష్టయః. 22

ఓ రామచంద్రా! తాపసులును, వివిధదృష్టులతోఁ గూడియున్నవారునగు తత్త్వజ్ఞులెందఱో మహాపట్టణమగు కాశియందును, పవిత్రమగు ప్రయాగయందును, శ్రీశైలమందును సిద్ధపురమందును, బదరికాశ్రమమందును, మహా పుణ్యవంతమగు శాలగ్రామమందును కలాప గ్రామమందును, పవిత్రమగు మధురయందును, కాలంజరపర్వతముపైనను మహేంద్రవన లతా కుంజములందును, గంధమాదన పర్వత శిఖరములపైనను, దర్దుర పర్వతముయొక్క తటప్రదేశములందును, సహ్యాపర్వత భూములందును, వింధ్యపర్వతముయొక్క జలప్రాయ ప్రదేశములందును, మలయపర్వత భూములందును, కైలాసపర్వత వనసమూహములందును ఋక్షవంత పర్వత గుహలందును తదితర పవిత్రతీర్థాది స్థానములందును వసించుచున్నారు,

కేచిత్త్యక్తనిజాచారాః కేచిచ్ఛ్రమసంస్థితాః
కేచిత్ప్రబుద్ధమతయో నిత్యమున్మత్తచేష్టితాః. 23

కేచిత్స్వదేశరహితాః కేచిత్త్యక్తనిజాస్పదాః
ఏకస్థానరతాః కేచిద్భ్రమన్తః కేచిదాస్థితాః. 24

కొందఱు జ్ఞానులు సంన్యాసవిధిచే తమ వర్ణాశ్రమా చారములను త్యజించియున్నారు. కొందఱు బ్రహ్మచర్యాద్యాశ్రమ ధర్మములందు వర్తించుచున్నారు, కొందఱు ఉన్మత్తునిభంగి చేష్టసల్పుచున్నారు. అట్లే మఱికొందఱు జ్ఞానులు స్వదేశమును త్యజించియు, కొందఱు స్వస్థానమును వీడియు, కొందఱు ఒకేప్రదేశమునఁ బ్రీతిగల్గియు, కొందఱు సంచారశీలురైయు నున్నారు.

ఏతేషాం మహతాం మధ్యే నభస్తలనివాసినామ్
పాతాలనిరతానాం చ దైత్యాదీనా [illegible] శమతే. 25

విజ్ఞాతలోకపర్యాయాః సమ్యగ్దర్శననిర్మలాః
కేచిత్ప్రబుద్ధమతయో దృష్టదృశ్యపరావరాః. 26

మహామతియగు రామచంద్రా! ఇట్టి మహాత్ములమధ్య. ఆకాశ, పాతాళవాసులగు దేవదైత్యాదులతోను ఎందఱో లోకస్థితియొక్క రహస్యము నెఱింగినవారును, సమ్యక్ – జ్ఞాన (ఆత్మ) దర్శనముచే నిర్మలురును, దృశ్యముయొక్క పరాపరములను గాంచినవారునగు ప్రబుద్ధులు గలరు,

అప్రబుద్ధధియః కేచిద్దోలాన్దోలితచేతసః
నివృత్తాః పాపకాచారాత్సుజనానుగతాః స్థితాః 27

ఓ రామచంద్రా! జనులలోఁ గొందఱు అల్ప ప్రబుద్ధులును కావుననే ఇటునటు నూఁగులాడు చిత్తముగలవారును, పాపాచారమునుండి తొలఁగినవారును, సజ్జనుల మార్గము ననుసరించి చనువారునై యున్నారు.

అర్ధప్రబుద్ధమతయః కేచిజ్జ్ఞానావలేపతః
పరిత్యక్తక్రియాచారా ఉభయభ్రష్టతాం గతాః. 28

అట్లే మఱికొందఱు అర్ధప్రబుద్ధులు మేము బ్రహ్మస్వరూపులము, కావున నిషిద్ధాచరణము మమ్ముల నేమిచేయగలదు? అనునీప్రకారమగు గర్వముతోగూడినవారై సదాచారములను త్యజించి యుభయలోకములనుండియు భ్రష్టులగుచున్నారు

ఇత్థమస్మిఞ్జనానీకే జన్మసంతరణార్థినః
బహవః సంస్థితా రామ బహుధా బహుదృష్టయః. 29

ఓ రామచంద్రా! ఈప్రకారముగా ఈ జనసమూహమందెందఱో జననమరణ సముద్రమును దాటివేయ నభిలాషగలవారును, వివిధరీతుల యనేకదృష్టులతోఁ గూడియున్నవారును గలరు.

సంసారోత్తరణే తత్ర న హేతుర్వనవాసితా
నాపి స్వదేశవాసిత్వం న చ కష్టతపః క్రియాః. 30

సంసారమును దాటుటయందు వనవివాసముగాని, స్వదేశనివాసముగాని, కష్టదాయకములైన తపఃక్రియలుగాని కారణములు కాఁజాలవు.

న క్రియాయాః పరిత్యాగో న క్రియాయాః సమాశ్రయః
నాచారేషు సమారమ్భవిచిత్రఫలపాలయః. 31

అట్లే కర్మపరిత్యాగముగాని, కర్మగ్రహణముగాని, వివిధ కార్యానుష్ఠానములచేఁ గల్గు సిద్ధి, ఖ్యాతి, లాభ, ఐశ్వర్య, వర, పాప సామర్థ్యాది రూపములగు విచిత్ర ఫలసమూహములుగాని, సంసారోత్తరణమున కారణముకాజాలవు.

స్వభావః కారణం నామ సంసారోత్తరణం ప్రతి
అసంసక్తం మనో యస్య స తీర్ణో భవసాగరాత్. 31

తనయొక్క శుద్ధ సచ్చిత్స్వభావమందలి స్థితియే సంసారసాగరమును దాటుటయందు కారణమగును. ఏలయనిన, తత్త్వజ్ఞానముచే నెవనిమనస్సు సాంసారికవిషయములందు ఆసక్తము గాక యున్నదో, ఆతఁడు సంసారసాగరమును దాటినవాఁడే యగుచున్నాఁడు.

శుభాశుభాః క్రియా నిత్యం కుర్వన్పరిహరన్నపి
పునరేతి న సంసారమసంసక్తమనా మునిః. 83

సంగరహితుఁడై నిత్యము శుభకార్యముల నాచరించుచు, అశుభకార్యములను పరిహరించుచు నున్నప్పటికిని, అసంగచిత్తుఁడైన జీవన్ముక్తుఁడు మరల సంసారమును బొందనేరఁడు.

శుభా శుభాః క్రియా నిత్యమకుర్వన్నపి దుర్మతిః
నిమజ్జత్యేవ సంసారే పరిత్యక్తమనాః శఠః. 84

నిత్యము శుభకార్యములనాచరింపక, అశుభకార్యములను పరిహరింపకనున్నప్పటికిని, విషయములందు ఆసక్తమైనట్టి చిత్తముగల శఠుఁడు (స్వాత్మవంచకుఁడు) సంసారమున మగ్నుఁడే యగును.

మక్షికేవాన్తః సారజ్ఞా దుఃఖాదుఃఖ ప్రదాయినీ
ననివారయితుం శక్యా న చ మారయితుం మతిః. 85

విషయరసము నాస్వాదించినదియు ఆనేకదుఃఖపరంపరలను గలుగఁజేయునదియునగు బుద్ధితత్త్వాభ్యాసములేనిచో తేనెకుండయందుఁ దగుల్కొనిన యీఁగవలె తొలగింపఁబడుటకుగాని నశింపఁజేయఁబడుటకుగాని శక్యముకాదు.

కాకతాలీయ యోగేన కదా చిత్స్వస్య చేతసః
ప్రవృత్తిర్జాయతే సిద్ధ్యై స్వయమాత్మావలోకనే. 86

ఒకానొకపుడు సౌభాగ్యవశమున మనుజునకు సాధనచతుష్టయ సంపత్తి సంప్రాప్తింపఁగా నపుడు కాకతాలీయయోగముచే నాతని చిత్తమునకు ఆత్మసాక్షాత్కార సిద్ధికొఱకై శ్రవణాద్యుపాయములచే ఆత్మావలోకనమున స్వయముగనే ప్రవృత్తి జనించును.

అవలోకనతో లబ్ధ్వా తత్త్వం నైర్మల్యమాగతమ్
చేతో భవతి నిర్ద్వన్ద్వమసంసక్తమనామయమ్. 87

నిర్మలత్వమునొందిన యా చిత్తమపుడు ఆత్మదర్శనమాత్రముచే తత్త్వమునెఱిగినదై ద్వంద్వరహితమై అనాసక్తమై నిర్వికారమైనట్టి బ్రహ్మమే యగుచున్నది.

అచిత్తత్వం ప్రయాతేన సత్వరూపేణ చేతసా
సమో భూత్వా సుఖం తిష్ఠ పరాకాశాంతరూపధృత్. 88

ఓ రామచంద్రా! అచిత్తత్వమును బొందిన సత్య (బ్రహ్మ)రూపమగు చిత్తముతోఁ గూడి సమదర్శివై (సర్వత్ర ఆత్మనేగాంచుచు) సర్వప్రపంచాధిష్ఠానమగు చిదాకాశరూపమును ధరించి సుఖముగ వెలయుము?

అధిగతపరమార్థస్త్యక్తరాగాదిదోషః
సమమతిరుదితాత్మా త్వం మహాత్మా మహాత్మన్
రఘుతనయ విశోక స్తిష్ఠ నిఃశఙ్కమేకో
జననమరణముక్తం పావనం తత్పదం త్వమ్. 39

రఘువంశజుఁడవైన మహాత్ముఁడవగు నో రామచంద్రా! నీ విపుడు పరమార్థ తత్త్వము బొందినవాఁడవును, రాగాదిదోషరహితుఁడవును ఉదయించిన ఆత్మగలవాఁడవును, సమబుద్ధివియు మహాత్ముఁడవునైయున్నావు. కావున దుఃఖరహితుఁడవై, ఏ సంశయమును లేక యుండుము. ఏలయనిన ఏకమై జననమరణ వర్జితమై, పరమపవిత్రమైనట్టి యా బ్రహ్మపదమును నీవేయై యున్నావు.

ప్రకృతిమలవికారోపాధిబోధాదిరూపం
జగతి విమలరూపే నాస్తి కించిత్క్వచిచ్చ
స్ఫుటమకృతకమస్తి బ్రహ్మ చిద్ధామ తచ్చ
స్వయమహమితి మత్వా తిష్ఠ నిఃశఙ్కమేకః. 40

మఱియు నిర్మలబ్రహ్మస్వరూపమగు ఈ జగత్తునందు ప్రకృతిరూపముగాని, మల రూపముగాని, వికారరూపముగాని, ఉపాధిరూపముగాని, ఆ యుపాధియొక్క బోధరూపముగాని, అద్దాని యిచ్ఛా, ప్రయత్న, గ్రహణ, త్యాగ, భోగాదిరూపముగాని యొకింతైనను నెచటనులేదు స్పష్టమై అకృతక (అనిర్మిత) మైనట్టి చిన్మయమగు బ్రహ్మమేగలదు. స్వానుభవముచే 'అదియే నేనని'యెఱిఁగి సంశయవర్జితుఁడవై అద్వైతరూపముతో చెన్నొందుము.

అధికవచనగమ్యం నాన్యదస్త్యత్రకించి
త్తవ శుభముపదేశ్యం జ్ఞానసంబోధనాయ
ఉదితమఖిలమాద్యం జ్ఞానసారం సమగ్రం
విదితసకలవేద్యో రాఘవ త్వం హి జాతః. 41

సౌభాగ్యశీలుఁడవగు నో రామచంద్రా? ఇఁక నీ కింతకంటె నధికముగ జ్ఞానముకొఱకై చేయఁదగిన శుభోపదేశములేదు. ఏలయనిన ఆద్యస్వరూపమై, అక్షయమైనట్టి జ్ఞానసారమంతయు నీ హృదయమున నిపుడుదయించినది, కావున నీ విపుడు వేద్య (ఆత్మ) వస్తువును సంపూర్ణముగ నెఱిఁగినవాఁడవైతివి.

శ్రీ వాల్మీకిరువాచః—

ఇత్యుక్త్వా మునినాయకో వ్యపగతాశేషైషణే రాఘవే
సర్వస్మింశ్చ సభాజనే స్థితవతి ధ్యానైకతానోపమే
ప్రాప్తే బ్రహ్మపదం ధియా ధవలయా తూష్ణీమభూత్తత్పదః
కృత్వేవారజితం సరోజపటలే పాతుం ప్రవృత్తో రసమ్. 42

ఇత్యార్షే శ్రీ వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు
నిర్వాణప్రకరణే ఉత్తరార్ధే ముక్తపురుషస్థితివర్ణనం
నామ నవనవత్యధికశతతమః సర్గః ॥ 199 ॥

శ్రీ వాల్మీకి:— ఓ భరద్వాజా! మునిశ్రేష్ఠుఁడగు వసిష్ఠుఁడిట్లు పలుకనంత శ్రీరామచంద్రుఁడు తన నిర్మల పవిత్రబుద్ధిచే బ్రహ్మపదమునుబొంది నశించిన సమస్త కోర్కెలుగలవాఁడాయెను మఱియు నపుడు సభాసదులందఱును కేవలము ధ్యానమందు నిమగ్నులై తుమ్మెదకమలసమూహమున ధ్వనిసల్పి యా పిమ్మట యందలి మకరందమును ద్రావుటకు ప్రవృత్తమై నిశ్శబ్దముగనుండునట్లు స్వయముగ బ్రహ్మరసాస్వాదనతత్పరులై మౌనముగ నుండిరి.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున నుత్తరార్ధమున
ముక్తపురుషస్థితి వర్ణనమనునూట తొంబదితొమ్మిదవ సర్గము ॥ 199 ॥

---

## ద్విశతతమః సర్గః.

[సిద్ధానాం సాధువాదోఽత్ర పుష్పవృష్టిః సదున్దుభిః
వర్ణ్యతే ప్రకృతః సర్వైర్గురు పూజామహోత్సవః.

సిద్ధులు స్తుతించుట, దుందుభులు మ్రోగుట, పుష్పవృష్టి కురియుట, సర్వులచే గురుపూజా మహోత్సవము గావింపఁబడుట — ఇచట వర్ణింపఁబడుచున్నది.]

శ్రీ వాల్మీకిరువాచ —

నిర్వాణ వాక్యసందర్భసమాప్తౌ మునినాయకే
పాశ్చాత్యవాక్యవిరతిం కుర్వతి క్రమపాలితామ్. 1

నిర్వికల్పసమాధానసమతాం సముపాగతే
శాన్తస్వచ్ఛమనోవృత్తౌ సర్వస్మింశ్చ సభాజనే. 2

సత్త్వకోటిముపారూఢే పరాం పావనతాం గతే
సంవిత్తత్త్వే సమగ్రస్య జనస్య శ్రుతశాలినః. 3

ఝటిత్యేవామ్బరవ్యాప్తా పూర్వముక్తధియాం ముఖాత్
సిద్ధానాం సాధువాదేన వ్యోమకోటరవాసినామ్. 4

తథా సభాస్థితానాం చ మునీనాం భావితాత్మనామ్
గాధేయ ప్రముఖానాం చ సాధువాదగిరోచ్చయా. 5

కోలాహలః సముదభూద్భూరి పూరితదిఙ్ముఖః
మధురః పవనాత్తానాం కీచకానా మివారవః. 6

శ్రీ వాల్మీకి:— ఓ భరద్వాజా! నిర్వాణవాక్యములఁగూర్చిన సందర్భము పరిసమాప్తి కాగా మునిశ్రేష్ఠుఁడగు వసిష్ఠుఁడు క్రమప్రాప్తమగు వాక్యవిరామ రూపమైన మౌనమును

ధరించుచుండ, దేవ, మనుష్య ఋష్యాది సభాసదులందఱును మునివాక్య శ్రవణమువలన నిర్వికల్ప సమాధిద్వారా బ్రహ్మైకరసత్వమును సమత్వమునుబొంది, శాంతమై, స్వచ్ఛమైనట్టి మనోవృత్తిగలవారుకాఁగా, శ్రోతలందఱియొక్క చిత్తము నిర్వికల్పసమాధిక్రమముచే సాక్షిచైతన్యమగు సన్మాత్రమునఁ బూర్ణముగ స్థితినొందినదై పరమపావనత్వమును బడయ ఆకాశవాసులగు సిద్ధులయొక్కయు, పూర్వ ముక్తులగు సనకాదులయొక్కయు ముఖమునుండి వెలువడిన స్తుతివాక్యములాకాశమున శీఘ్రముగ వ్యాపింప, అత్తఱి సభయందున్నవారును, తత్త్వజ్ఞులునగు విశ్వామిత్రాది మునులయొక్క యున్నత స్వరముతో గావింపఁబడిన ప్రశంసావాక్యములతోఁ గూడిన మధుర కోలాహలము దిక్కులన్నింటిని శీఘ్రముగఁ బూరించుచు. వాయువుచేఁ బూర్ణములగు రంధ్రములు గల వెదుళ్ళయొక్క ధ్వనులవలె నుద్భవించినదాయెను.

సిద్ధానాం సాధువాదేన సహ వై సహసా తతా
దేవదున్దుభయో నేదుః ప్రతిశ్రుత్పూరితాచలాః. 7

మఱియు నపుడా సిద్ధులయొక్క స్తుతివాక్యములతోఁగూడ దేవదుందుభులు తమ ప్రతిధ్వనులచే పృథివీ, పర్వతాదులను బూర్ణమొనర్చుచు శీఘ్రముగ మ్రోగసాగెను.

దేవదున్దుభిభిః సార్ధం తుషారాసారసున్దరీ
దిగ్వ్యాప్తిః స్థగితదిక్చక్రా పుష్పవృష్టిః పపాత హ. 8

ఆ దేవదుందుభులతోఁగూడ, మంచువలెఁ దెల్లనైనదియు, దిఙ్మండలములను గప్పునదియు నగు పుష్పవర్షము కురిసెను.

పుష్పౌఘపూరితస్థానః శబ్దాపూరితకన్దరః
రజఃసంరఞ్జితాకాశో గన్ధరఞ్జిత మారుతః. 9
ససాధువాదశబ్దస్య దేవతూర్యరవస్య చ
కుసుమాసారఘోషస్య సమవాయో రరాజ హ. 10

పుష్పసమూహముచే సభాస్థానమును పూరించునదియు, శబ్దములచే గుహలను పరిపూర్ణమొనర్చునదియు. పుష్పపరాగములచే నాకాశమును వర్ణయుక్తముగఁ గావించునదియు. వాయువును సుగంధయుతముగ నొనర్చునదియునగు, ఆ పుష్పవృష్టియొక్కయు, సిద్ధులస్తుతివాక్యములయొక్కయు దేవతల దుందుభులయొక్కయు శబ్దసమూహమపుడు మిగుల శోభను బొందెను.

ఉన్ముఖాఖిలసభ్యాక్షిరశ్మిశ్యామలితాన్తరః
ఉత్కర్ణమృగమాతఙ్గహయపక్షి పశుశ్రుతః. 11
సవిస్మయభయోన్నేత్ర బాలకాన్తాజనేక్షితః
విస్మయస్మేర వదనరాజిలోకావలోకితః. 12

ఆ శబ్దసమూహము కంఠమెత్తి చూచు సభాసదులందఱియొక్క నేత్రకిరణములచే దిగంతరాళమును శ్యామవర్ణయుతముగఁ గావించునదియు. చెవులు పైకెత్తుకొనియున్న హరిణ. గజ, అశ్వ, పక్షి, పశు, పక్ష్యాదులచే వినఁబడునదియు, ఆశ్చర్య, భయములచే కనులు విప్పుకొని

యున్న బాలక, స్త్రీజనంబులచేత వీక్షింపఁబడునదియు, ఆశ్చర్య, ప్రసన్నత్వములతోఁగూడిన ముఖములుగల రాజసమూహముచే నవలోకింపఁబడునదియునై యొప్పుచుండెను.

కుసుమాసారసారేణ శబ్దశోభాతిశాయినా
సంరమ్భేణ జగామాశు రోదోరన్ధ్రమపూర్వతామ్. 13

ఆ మహా పుష్పవర్షధారాజనితమగు శబ్దములచేతను, సిద్ధాదుల స్తుతివాక్యముల యొక్కయు. దుందుభాదులయొక్కయు శోభాతిశయముతోఁగూడిన శబ్దసంరంభముచేతను, భూమ్యాకాశముల అంతరాళము అపూర్వ శోభను బడసెను.

పుష్పవర్ష సుధాధౌతం రటదుద్భూత సుఘుంఘుమమ్
సమతాం సదనేనాగాత్ ధ్మాతశఙ్ఖశతేన ఖమ్. 14

పుష్పవర్ష (మకరంద) ధారలచేఁ గడుగఁబడినదియు, జయజయధ్వనుల సల్పు ప్రాణుల యొక్క పవిత్ర శబ్దములచే వ్యాప్తమైనదియు, శంఖధ్వనులచేఁ బరిపూర్ణమైనదియునగు ఆ యాకాశ మపుడు దశరథ రాజగృహముతోడ సమత్వమును నొందినదాయెను.

భువనం భూరిఝాంకారభాసురం సురచారణైః
వృతం మత్తోత్సవం రేజే సమం కుసుమమణ్డితమ్. 15

దేవ, సిద్ధాదుల మహాజయజయారావములచే భాసిల్లుచు, గంధర్వాది ఖేచరులచే వ్యాప్తమై మహోత్సవముచేఁ బరిపూర్ణమై పుష్పవృష్టిచే విభూషితమై లోకమత్తఱి దశరథ రాజ గృహమువలె శోభించెను.

శనైర్దున్దుభి సిద్ధౌఘవాక్యపుష్పభరః సమమ్
ప్రయయౌ రోదసీరన్ధ్రే వేలాచలమివామ్బుధౌ. 16

సముద్రమందలి తరంగసమూహము తీరమందలి పర్వతములను బొందునట్లు అపుడా దేవదుందుభులయొక్కయు సిద్ధుల వాక్యములయొక్కయు పుష్పవర్షముయొక్కయు శబ్దసమూహము మెల్లగ సమకాలముననె భూమ్యాకాశముల యంతరాళమును, దిగంతములను బొందెను.

తస్మిన్విబుధసంరమ్భే క్షణేన సమయే గతే
వాక్యానీమాని సిద్ధానామభివ్యక్తిముపాయయుః. 17

తదుపరి దేవతలయొక్క యా పుష్పవర్ష కోలాహలము క్షణకాలములో నుపశమింప అపుడు సిద్ధులయొక్క యీ వాక్యములు జనులకు వినఁబడెను.

సిద్ధా ఊచుః:—

ఆకల్పం సిద్ధసఙ్ఘేషు మోక్షోపాయాః సహస్రశః
వ్యాఖ్యాతాశ్చ శ్రుతాశ్చాలమీదృశాస్తు న కేచన. 18

సిద్ధులు:— ఓ సభ్యులారా! కల్పారంభమునుండియు మా సిద్ధసంఘములందు మోక్షోపాయమునుగూర్చిన యెన్నియో గ్రంథములు బాగుగ వ్యాఖ్యానము గావింపఁబడినవి. మఱియు నితరులవలన వినఁబడినవి. కాని యీప్రకారమగు (యోగవాసిష్ఠమువంటి) గ్రంథములను మాత్రము మే మెపుడును కని విని యెఱుగము

తిర్యఞ్చో వనితా బాలా వ్యాలాశ్చానేన నిర్వృతిమ్
మునేర్వాక్యవిలాసేన యాన్తి నాస్త్యత్ర సంశయః. 19

శ్రీ వసిష్ఠమునీంద్రునియొక్క యీ గ్రంథరూపమగు వాక్యవిలాసముయొక్క శ్రవణముచే పశుపక్ష్యాది తిర్యగ్జీవులు, స్త్రీలు, బాలురు, నాగులుకూడ పరమశాంతిని బొందుచున్నవి. ఇవ్విషయమున సందియములేదు.

దృష్టాన్తైర్హేతుభిర్యుక్త్యా యథా రామోఽవబోధితః
తథా బారున్ధతీ సాక్షాత్సంబోధయతి వా నవా. 20

దృష్టాంతములచేతను, హేతువులచేతను, యుక్తులచేతను, వసిష్ఠమునీంద్రునిచే శ్రీరామచంద్రు డెవ్విధమున నిపుడు బోధింపఁబడెనో అవ్విధమున సాక్షాత్తు అరుంధతీదేవి (వసిష్ఠమునీంద్రుని పత్ని)యు బోధింపబడెనో లేదో!

అనేన మోక్షోపాయేన తిర్యఞ్చోఽపి గతామయాః
స్థితా ముక్తా భవిష్యన్తి కేనామ భువి నో నరాః. 21

ఈ మోక్షోపాయమను మహారామాయణముయొక్క శ్రవణముచే పశుపక్ష్యాదులున్ను సంసార రోగరహితములై, ముక్తినొంద ఇక నద్దానిని వినిన ఏ మనుజుల్ప్రపంచమున విముక్తులు గాకయుందురు.

శ్రవణాఞ్జలిభిః పీత్వా జ్ఞానామృతమిదం వయమ్
పరాం పూర్ణనవీభూతసిద్ధయః శ్రియమాగతాః. 22

ఓ సభ్యులారా! ఈ జ్ఞానామృతమును మా కర్ణములను అంజలులచే (దోసిళ్ళచే) త్రాగి పరమ తృప్తికరమగు నూతనసిద్ధి బొందినవారమై మేమపూర్వమగు శోభను బడసితిమి.

ఇతి శృణ్వన్కథాం లోకో విస్మయోత్ఫుల్లలోచనః
కుసుమాసారసంపూర్ణాం రాజీవానాం దదర్శ తామ్. 23

ఈ ప్రకారముగ ఆశ్చర్యముచే వికసితములైన నేత్రములుగల అయోధ్యానగర నివాసులు సిద్ధులయొక్క యీ వాక్యములను వినుచు, ఆ సభను కమలాది పుష్పములయొక్క వృష్టిచే పరిపూర్ణమైనదానినిగఁ జూచిరి.

మన్దారాది మహాపుష్పచ్ఛన్నచ్ఛాదనసంచయామ్
పారిభద్రలతాగుచ్ఛనీరన్ధ్రాజిరభూమికామ్. 24
పారిజాతప్రసూనాఢ్యామహీతలవిరాజితామ్
సంతానకమహామోదవ్యాప్తసభ్యశిరఃకరామ్. 25
మౌలిరత్నవితంకాగ్రవిశ్రాన్తహరిచన్దనామ్
వారిపూరప్రవలమ్బ్రశ్రవదాలమ్బవితానకామ్. 26

మఱియు వారు ఆ సభను మందారాది మహాపుష్ప సమూహములచేఁ గప్పఁబడినదిగను, పారిభద్రాది కల్పలతాగుచ్ఛములచే దట్టమైనట్టి ముంగిలి ప్రదేశముగలదిగను, పారిజాత పుష్పములచేఁ బరిపూర్ణమైన భూతలముచే శోభించుచుండెను, సంతానకము (కల్పవృక్ష విశేషము) యొక్క పుష్పములను గొప్పమేఘముచే వ్యాప్తములైనట్టి సభాసదుల శిరోహస్తాదులు గలదిగను కిరీటములందలి రత్నములయొక్క యగ్రభాగములందు విశ్రమించిన హరిచందనముచే మనోహరమై యున్నదిగను, జలప్రవాహములచేఁ బూర్ణములై ప్రేలాడుచున్నట్టి మేఘముల ప్రేలాడుచున్న పుష్పములతోఁ గూడిన వితానకము (మేలుకట్టు) చే భూషితమైనదిగను గాంచిరి.

ఇతి పశ్యన్సభాం లోకః సాధువాదేన భూరిణా
తత్కాలోచితవాక్యేన తేన తేన తథోద్యతః. 27

అనేక స్తుతి వాక్యములచే బరిపూర్ణమైనట్టి యీ ప్రకారమగు ఆ సభను గాంచుచు జనులందఱును నపుడు తత్తత్కాలోచితమగు ప్రశంసావాక్యములతోడ వసిష్ఠమునీంద్రుని పూజింపఁ దొడగిరి.

వసిష్ఠం పూజయామాస సర్వేన్ద్రియగణానతః
కుసుమాఞ్జలిమిశ్రేణ ప్రణామసహితేన చ. 28

వినమ్రములైన సర్వేంద్రియములతోఁ గూడినవారై జనులు తమ దోసిళ్ళయందుఁ బుష్పముల గ్రహించి ప్రణామపూర్వకముగ నపుడు వసిష్ఠమునీంద్రుని బూజించిరి.

నృపప్రణామమాలాసు కించిచ్ఛాన్తాసు తాన్వత
మునిమాపూజయన్నాహ సార్ఘ్యపాత్రకరో నృపః. 29

అటుపిమ్మట రాజులయొక్క ప్రణామక్రమ మొకింత శాంతి అయిన పిదప హస్తమందర్ఘ్యపాత్రనిడుకొని దశరథ మహారాజు వసిష్ఠ మునీంద్రుని బూజించుచు నిట్లు పలికెను.

దశరథ ఉవాచ :—

క్షయాతిశయముక్తేన పరమేణాత్మవస్తునా
పరాన్తః పూర్ణతోత్పన్నా బోధేనారున్ధతీపతే. 30

దశరథుఁడు :— అరుంధతీ నాథుఁడవగు ఓ వసిష్ఠమునీంద్రా! తమ యీ దివ్యోపదేశముచే లభించిన బోధవలన వృద్ధిక్షయరహితమై, నిర్వికారమై, నిరతిశయానంద రూపమైనట్టి ఆత్మవస్తువుయొక్క ప్రాప్తిచే మా యంతఃకరణమున సర్వోత్కృష్టమైన పూర్ణత్వముదయించినది.

న తదస్తి మహీపీఠే దివి దేవేషు వాపి చ
మహత్కించిద్యదప్రాప్తం తవ పూజ్యస్య పూజనమ్. 31

ఓ మునీశ్వరా! ఇట్టి పరమపురుషార్థము నొసంగిన పూజ్యులగు తమకు యోగ్యమైనట్టి వస్తువుభూలోకమునగాని, స్వర్గమునగాని, పాతాళమునగాని యేదియునులేదు.

తథాప్యాత్మక్రమం బ్రహ్మన్నిమం నేతుమవస్థితామ్
అహం వచ్మి యథాప్రాప్తం న కోపం కర్తుమర్హసి. 32

అయినను, ఈ నా అవశ్యకర్తవ్యమై, శాస్త్రలోకప్రసిద్ధమై, యథాప్రాప్తమైనట్టి గురుపూజాక్రమమును సఫలత్వ మొందించుటకొఱకై తమ్ములనొకింత ప్రార్థించుచున్నాను; కోపగింప వలదు.

ఆత్మనా సకలత్రేణ లోకద్వయశుభేన చ
రాజ్యేనాఖిలభృత్యేన భవన్తం పూజయామ్యహమ్. 83

పత్నీసమేతముగ నన్నును, లోకద్వయమందు (భూలోకస్వర్గలోకములందు) నాచేఁ గూడ బెట్టఁబడిన సుకృతమును, సమస్తభృత్య, సామంతాది సహితమగు ఈ నారాజ్యమును సమస్తమును తమకర్పించి తమ్ములనిపుడు పూజించుచున్నాను.

ఏతత్సర్వం తవ విభో స్వాయత్తం స్వ ఇవాశ్రమః
నియోజయ యథాదేశం యథాభిమతయేచ్ఛయా. 84

ప్రభూ! మత్సహితముగ ఈ రాజ్యాది సమస్తమును నిపుడు తమదేయైయున్నది. ఇది యంతయును తమ యధీనమేయైయున్నది. కాఁబట్టి తాము దీనికంతకును ప్రభువులై తమ కోర్కెననుసరించి యాజ్ఞాపింపుఁడు.

శ్రీవసిష్ఠ ఉవాచః—

ప్రణామమాత్రసంతుష్టా బ్రాహ్మణా భూపతే వయమ్
ప్రణామేనైవ తుష్యామః స ఏవ భవతా కృతః. 85

శ్రీవసిష్ఠుఁడు:— ఓ రాజా! బ్రాహ్మణులమగు మేము ప్రణామమాత్రముచేతనే సంతుష్టి నొందువారమైయున్నాము. కావున నద్దానితోనే మేము సంతుష్టులమగుదుము. అదియో, మీచే, గావింపఁబడియేయున్నది.

పాతుం త్వమేవ జానాసి రాజ్యం భాతి తవైవ చ
భవత్యేతత్త్వయైవేహ బ్రాహ్మణాః క్వ మహీభృతః. 86

ఈ రాజ్యమును, ప్రజలను రక్షించుటను మీరే (క్షత్రియులే) యెఱుఁగుదురు. రాజ్యమును బాలించుట క్షత్రియులగు మీకే శోభించును. కావున నిదియంతయును మీకేయుండుగాక! బ్రాహ్మణులెచట రాజులైయుండిరో చెప్పుఁడు

దశరథ ఉవాచః—

కియన్మాత్రం తు రాజ్యం స్యాదితి లజ్జామహే మునే
ప్రకర్షేణాత్రతేనేశ యథా జానాసి తత్కురు. 87

దశరథుఁడు:— ఓ మునీంద్రా! మనుష్యానందముయొక్క పరమావధి నిష్కంటక సప్తద్వీపాధిపత్యమువలనఁ గలుగు ఆనందము; దానికంటె నూఱురెట్లధికమైనది. మనుష్యగంధర్వుల యానందము దానికంటెను నూఱురెట్లధికమైనది దేవగంధర్వుల యానందము. ఈ ప్రకారముగ వర్ధిల్లు విషయానందముయొక్క పరమావధి హిరణ్యగర్భానందము. అదియో! తాము మాకొసంగిన మోక్షానంద సముద్రమున నొక్కబిందువుతోనైనను సమానముగాకయున్నది. కావున, ఈ మోక్ష

దానమను తమ యుపకారముయొక్క ప్రత్యుపకారమున ఈ రాజ్యాది దానమిట నెంతమాత్రమై యున్నదోచూచి నేను లజ్జితుఁడ నగుచున్నాను. కాఁబట్టి ప్రభూ! ఇవ్విషయమున తామెట్లెఱుఁగుచున్నారో యట్లాచరింపుఁడు.

**శ్రీ వాల్మీకి రువాచః—**

> **ఇత్యుక్తవతి భూపాలే రామః పుష్పాఞ్జలిం దదత్**
> **ఉవాచ ప్రణతో వాక్యం పురస్తస్య మహాగురోః. 38**

శ్రీ వాల్మీకి:— ఓ భరద్వాజా! దశరథమహారాజిట్లు ప్రకారముగ వచించినమీదట నంత శ్రీరామచంద్రుఁడా మహాగురువుయొక్క చరణములపై పుష్పాంజలిని సమర్పించుచు వినమ్రుఁడై తన గురువగు వసిష్ఠమునీంద్రుని యెదుట ఈ వాక్యమును బల్కెను

> **నిరుత్తరీకృత మహారాజ బ్రహ్మన్నమామి తే**
> **ప్రణామమాత్రసారోఽహం రామః పాదావిమౌ ప్రభో. 39**

దశరథమహారాజును నిరుత్తరునిగఁ గావించిన ఓ మహాత్మా! ప్రభూ! తమయొక్క యీ మహాపురుషార్థ ప్రదానమను నుపకారమునకు బ్రత్యుపకార యోగ్యమగు పదార్థమెద్దియు లేనందువలనను 'ప్రణామమాత్రముచే మేము సంతుష్టులమగుదుమని, తాము వచించుటవలనను, కేవలము ప్రణామమాత్రమే సారముగాఁగల రాముఁడనగు నేను తమ చరణారవిందములకు నమస్కరించుచున్నాను.

> **ఇత్యుక్త్వా పాదయోస్తస్య శిరోవన్దనపూర్వకమ్**
> **తత్యాజాఞ్జలిపుష్పాణి హిమానీవ వనం గిరేః. 40**

ఇట్లు వచించి శ్రీరామచంద్రుఁడు వనము, పర్వతముయొక్క పాదములపై హిమజలమును విడుచునట్లు శిరోవందనపూర్వకముగ తన గురువుయొక్క చరణములందు పుష్పాంజలిని విడిచెను.

> **ఆనన్దబాష్పసంపూర్ణనయనో నయకోవిదః**
> **గురుం పరమయా భక్త్యా ప్రణనామ పునః పునః. 41**

ఆనందబాష్పములచేఁ బరిపూర్ణములైయున్న నేత్రములు గలవాఁడును, నీతి విశారదుఁడు నగు శ్రీరామచంద్రుఁడు పరమభక్తితో గురువునకు మరలమరల ప్రణామ మాచరించెను.

> **శత్రుఘ్నో లక్ష్మణశ్చైవ తథాన్యే తత్సమాశ్రయే**
> **నికటస్థాస్తథైవాశు తే ప్రణేముర్మునీశ్వరమ్. 42**

అటుపిమ్మట శత్రుఘ్నుఁడు లక్ష్మణుడుఁ, వారితోసమానులై వారిసమీపమున నున్న వారైన తదితరులగు శ్రీరామచంద్రుని సఖులును నట్లే శీఘ్రముగ నమ్మునీశ్వరునకు బ్రణమిల్లిరి.

> **దూరప్రణామైర్దూరస్థాః పుష్పాఞ్జలి సమీరణైః**
> **రాజానో రాజపుత్రాశ్చ ప్రణేముర్మునయశ్చ తమ్. 43**

దూరముననున్న రాజులు, రాజపుత్రులు మునులు మున్నగువారు దూరస్థులకుఁ దగినట్లుగ దూరముననుండియే పుష్పాంజలులను సమర్పించుచు నమ్మునివర్యునకు ప్రణామమాచరించిరి,

అస్మిన్నవసరే తత్ర కుసుమాఞ్జలివర్షణైః
హేమైరివ హిమాద్రీన్ద్రో మునిరన్తర్ధిమాయయౌ. 44

ఆ క్షణమే యా మునీశ్వరుఁడు, హిమసమూహములచే హిమాలయపర్వతమువలె, పుష్పాంజలి వర్షముచే గప్పఁబడెను.

అథ శాన్తే సభాక్షోభే ప్రణామనివహే తథా
సంస్మరఞ్చాసనం కంచిత్ప్రత్యే కృష్ణసితాశనమ్. 45

మునిః కుసుమరాశిం తం బాహుభ్యాం ప్రవిచాల్య సః
ముఖం సందర్శయామాస సితాభ్రాదివ చన్ద్రమాః. 46

ఆ పిదప ప్రణామసమూహ జనితమగు సభాక్షోభ శాంతమొంద 'నా యుపదేశము బుద్ధియొక్క మాలిన్యముచే దోషయుక్తమైనదా, లేక బుద్ధియొక్క నిర్మలత్వముచే నిర్దోషమైనదా అని చింతించుచు వసిష్ఠమునీంద్రుఁడపుడు మునులగూర్చి ప్రశ్నింపవలసినదాని నొకింత సంస్మరించి తన చరిత్రచే జనులకు వినయమును బోధింప నిచ్చగించినవాఁడై, తన బాహువులచే ఆ పుష్పరాశిని దొలగించి, తెల్లని మేఘములను దొలగించి చంద్రుఁడు తన ముఖమును జూపునట్లు, నిజముఖచంద్రుని దర్శింపజేసెను.

శాన్తే సిద్ధవచోరాశౌ తథా మన్దుభినిఃస్వనే
నష్టే కుసుమవర్షే చ సభాకలకలే తథా. 47

ప్రణామానన్తరం తస్మిన్నామాద్యైః స్వసభాజనే
శాన్తవాత ఇవామ్భోదే జనేసౌమ్యత్వమాగతే. 48

ఆకర్ణయన్సాధువాదం విశ్వామిత్రం మృదుస్వనమ్
ఉవాచేదమనిన్ద్యాత్మా వసిష్ఠో మునినాయకః. 49

తదుపరి యా సిద్ధుల వచనసమూహమున్ను, దుందుభిశబ్దములున్ను, పుష్పవర్షమున్ను సభా కోలాహలమున్ను శాంతినొంద, ప్రణామమైన పిదప శ్రీరామచంద్రాది సభాజనులు, శమించిన వాయువుగల మేఘమువలెఁ బ్రశాంతముగనుండ, మధురస్వరయుక్తములగు సాధువాక్యములను వినిపించుచు దోషరహితుఁడును, మునినాయకుఁడునగు వసిష్ఠుఁడపుడు విశ్వామిత్రాదులఁ గూర్చి యిట్లుపలికెను.

మునేగాధికులామ్భోజ వామదేవ నిమే క్రతో
భరద్వాజ పులస్త్యాత్రే మ్భృష్టే నారద శాణ్డిత. 50

హే భాసభృగుభారణ్డ వత్సవాత్స్యయనాదయః
మునయస్తు చ్ఛృమేతత్తు భవద్భిర్మద్వచః శ్రుతమ్. 51

యదత్రానుదితం కించిత్త దనుగ్రహతోఽధునా
దురర్థం విగతార్థం వా భవన్తః కథయన్తు మే. 52

గాధికులకమలుఁడవగు ఓ విశ్వామిత్రమునీ! ఓ వామదేవ నిమి క్రతు, భరద్వాజ, పులస్త్య అత్రి, మ్భృషి, నారద, శాండిల బాస, భృగు, భారండ, వత్స్య వాత్స్యాయనాది మునులారా!

మాన్యులగు మీరందఱునుగూడ ఈనాతుచ్ఛములగు వాక్యములను దయచేసివింటిరి. ఈ నా వాక్యములందు అనుచితమైనదిగాని, దోషయుక్తమైనదిగాని, అసంగతమైనదిగాని, మిథ్యార్థయుక్తమైనదిగాని, లోపించినదిగాని యగు ఏదేని యొకింత విషయముండుచో నద్దాని నిపుడు నాపై యనుగ్రహముంచి తెలుపఁగోరెదను.

సభ్యా ఊచుః —

వసిష్ఠవచనే బ్రహ్మన్పరమార్థైకశాలిని

దురర్థో భవతీ త్యద్య నవైవ ఖలు గీః శ్రుతా. 53

సభ్యులు:—మహాత్మా ! కేవలము పరమార్థమువే శోభించు వసిష్ఠమునీంద్రుని వాక్యములందు అసంగతమైన యర్థముగలదను ఈ నూతనవాక్కును మేము నేఁడే వింటిమి.

యత్సంభృతమనన్తేన జన్మదోషేణ నో మలమ్

తత్త్వమృష్టం త్వయేహాద్య హేమ్నామివ హవిర్భుజా. 54

సువర్ణముయొక్క మాలిన్యము అగ్నిచే నశింపఁజేయఁబడునట్లు, అనేక జన్మరూపదోషముచే గూడఁబెట్టఁబడిన మాయొక్క మాలిన్యము తమచే నిచట నశింపఁజేయఁబడినది.

బ్రహ్మబృంహితయా వాచా విభో వికసితా వయమ్

కుముదానీన్దుదీప్త్యేవ పరమామృతశీతయా. 55

ప్రభూ చంద్రుని ప్రకాశముచే కలువలు వికసింపఁజేయఁబడునట్లు, బ్రహ్మప్రకాశముచే విస్తారమును బొందినవియు, పరమామృతమువలె శీతలములునగు తమవచనములచే మేము వికసింపఁ జేయఁబడితిమి.

సర్వసత్త్వ మహాబోధదాయినం మునినాయకమ్

భవన్తమేకాన్తగురుం ప్రణమామ ఇమే వయమ్. 56

మహాత్మా ! సర్వసత్త్వస్వరూపమైన బ్రహ్మజ్ఞానమను మహాబోధ (మోక్షము) నొసంగువాఁడవును, మునినాయకుఁడవును సర్వథా పరమగురురూపుఁడవునగు తమకు ఈ మేము నమస్కరించుచున్నాము.

శ్రీ వాల్మీకి రువాచ :—

ఇత్యుక్త్వామునినాథాయ నమస్త ఇతి తే పునః

వదన్త ఏకశబ్దేన తారేణాబ్దరవౌజసా. 57

అర్ఘ్యాత్పుష్పాఞ్జలివ్రాతైః ఖాత్సిద్ధైః సముజ్ఝితైః

వసిష్ఠం పూరయామాసుర్హిమైరబ్దా ఇవాచలమ్. 58

వాల్మీకి:— ఓ భరద్వాజా ! ఇట్లు పలికి యా సభ్యులందఱును మునీశ్వరుఁడవగు తమకు మరల నమస్కారము అని యేక కాలమున మేఘశబ్దమువలె నుచ్చస్వరముతోటి పలుకుచు, మేఘములు హిమసమూహములచే పర్వతమును గప్పునట్లు, ఆకాశమునుండి వెనువెంటనే సిద్ధులచే విడువఁబడిన పుష్పాంజలి సమూహములతోఁగూడ నిజపుష్పాంజలులచే వసిష్ఠమునీంద్రుని గప్పిరి.

ఇత్థం దశరథం భూపం శశంసుశ్చాథ రాఘవమ్
మాధవం చతురాత్మానం రాఘవోద స్తకోవిదాః. 59

ఈ ప్రకారముగనే వారు దశరథమహారాజును, అటుపిమ్మట, రామునియొక్క విష్ణ్వవతార వృత్తాంతకోవిదులగుటఁబట్టి లక్ష్మీపతియైన చతురశీలుఁడగు శ్రీరామచంద్రుని వారు ప్రశంసించిరి.

సిద్ధా ఊచుః—

నమామ చతురాత్మానం నారాయణ మివాపరమ్
రామం సభ్రాతరం జీవన్ముక్తం రాజకుమారకమ్. 60

సిద్ధులు:— చతురశీలుఁడును, రెండవనారాయణుని వంటివాఁడును, భ్రాతృసహితుఁడును దశరథరాజ కుమారుఁడును, జీవన్ముక్తుఁడునగు శ్రీరామచంద్రునకు మేమందరమును నమస్కరించుచున్నాము.

చతురబ్ధినిఖాతా న్తధరావలయ పాలకమ్
త్రికాలస్థమహీపాల చిహ్నం దశరథం నృపమ్. 61

చతుస్సముద్రములను అగడ్తలవఱకు వ్యాపించియున్న యీ భూగోళమును బాలించువాఁడును, త్రికాలములందును రాజ చిహ్నములు గలవాఁడును, శ్రీరామచంద్రుని జనకుఁడునగు దశరథ నృపాలునకు నమస్కారము.

మునిసేనాధిపం భూపం భాస్కరం భూరితేజసమ్
వసిష్ఠం సుప్రవాదాఢ్యం విశ్వామిత్రం తపోనిధిమ్. 62

మునిసేనానాయకుఁడును, మహాతేజస్వియు, సూర్యునివలెఁ బ్రకాశమానుఁడును, ముక్తికథాపరిపూర్ణుఁడునగు వసిష్ఠమునీంద్రునకును, తపోనిధియగు విశ్వామిత్రునకును నమస్కారము.

ఏషామేవ ప్రభావేన జ్ఞానయుక్తిం పరామిమామ్
శ్రుతవన్తో వయం సర్వే భ్రాన్తి సంరమ్భనాశినీమ్. 63

ఈ దశరథ, శ్రీరామచంద్ర, విశ్వామిత్రుల ప్రభావమువలననే, జ్ఞానయుక్తి పరమైనదియు, సమస్త సంసారభ్రమసమూహమును నశింపఁజేయునదియునగు ఈ వసిష్ఠమునీంద్రుని వాక్కును మేమందరమును వినఁగల్గితిమి.

శ్రీ వాల్మీకి రువాచ :—

ఇత్యుక్త్వా గగనాత్సిద్ధా భూయః పుష్పాణి చిక్షిపుః
సభామామథ తూష్ణీం చ తస్థుర్ముదితచేతసః. 64

శ్రీ వాల్మీకి.— ఓ భరద్వాజా! ఇట్లు వచించి యా సిద్ధులాకాశమునుండి మరల పుష్పవర్షమును గురిపించిరి. అటుపిమ్మట, ప్రసన్నచిత్తులై వారు సభయందు మౌనముగనుండిరి.

తత్రైవ వ్యోమగాః సిద్ధాః శంశసుస్తం జనం పునః
తత్రైవ సభ్యాస్తాంస్తత్ర సమానర్చుర్ఘనస్తవమ్. 65

ఆ ప్రకారముగనే తక్కిన ఆకాశచారులగు సిద్ధులున్ను వసిష్ఠాదులను ప్రశంసించిరి. తిరిగి సభాసదులు మహాస్తుతితోడ ఆ సిద్ధాదులనట బూజించిరి.

నభశ్చరా ధరణిచరా మునీశ్వరా మహర్షయో విబుధగణాద్విజా నృపాః
అపూజయన్నితి జనమోజసైవ తే గిరోచ్చయా సహ కుసుమార్ఘ్యదానయా. 66

ఇత్యార్షే శ్రీ వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు
నిర్వాణప్రకరణే ఉత్తరార్ధే సాధువాదసపర్యాది వర్ణనం
నామ ద్విశతతమః సర్గః ॥ 200 ॥

ఓ భరద్వాజా ! ఆకాశచారులు, పృథివీచారులు, మునీశ్వరులు, మహర్షులు, సిద్ధ, దేవతాసమూహములు, బ్రాహ్మణులు, రాజులు పైరీతిగనే తమ తమ సామర్థ్యముననుసరించి పుష్పార్ఘ్యప్రదానముతోడ ఉన్నతస్వరముచే వసిష్ఠమునీంద్రుని బూజించి, పరస్పర మొకరికొకరు పూజించుకొనిరి

ఇది శ్రీవాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున నుత్తరార్ధమున
సాధువాదసపర్యాది వర్ణనమను రెండువందలవ సర్గము ॥ 200 ॥

---

## ఏ కా ధి క ద్వి శ త త మః స ర్గః

[అత్ర రామేణ భూయోఽపి పృష్టేన గురుణాదరాత్
పూర్ణానన్దపదే స్వస్య విశ్రాన్తిః ప్రకటీకృతా.

గురువగు వసిష్ఠమునీంద్రుఁడడుగ. ఆదరపూర్వకముగ మరల శ్రీరామచంద్రుఁడు పూర్ణానంద బ్రహ్మపదమందలి తనయొక్క విశ్రాంతిని ప్రకటించుట యిచటఁ గాననగును.]

**శ్రీవాల్మీకిరువాచః—**

అథార్యాక్సాధువాదేషు ప్రశాన్తేషు శనైః శనైః
జ్ఞానోపదేశమాసాద్య ప్రోల్లసత్స్వివ రాజసు. 1

ప్రశాన్తసంసృతిభ్రాన్తౌ జనే చరితమాత్మనః
స్వయం హసతి చిత్తేన సత్యం సమనుధావతా. 2

వలచ్చిత్తకలం జ్ఞానసమాస్వాదనతత్పరే
వివేకిని సభాలోకే శాన్తే ధ్యానమివాస్థితే. 3

బద్ధపద్మాసనే రామే స్వభ్రాతరి గురోః పురః
స్థితే కృతాఞ్జలౌ దీప్తగురువక్త్రగతేక్షణే. 4

పార్థివే కిమపి ధ్యానమివాశ్వాదయతి స్థితిమ్
జీవన్ముక్తాత్మికామన్తరాదిమధ్యాన్తపావనీమ్. 5

గృహీతుమర్ఘ్యం భక్తానాం మానితార్థజనో మునిః
తూష్ణీం క్షణమివ స్థిత్వా ప్రోవాచానుకులాక్షరమ్. 6

శ్రీ వాల్మీకి:— ఓ భరద్వాజా! పిమ్మట, సభాప్రదేశమున సాధువాక్యములు మెల్ల మెల్లగ శమింప, జ్ఞానోపదేశమును బొంది రాజులు వికసితహృదయులు కాఁగా, సంసారభ్రమ నశించుటచే జనులయొక్క చిత్తముస్వయముగనే బ్రహ్మజ్ఞానమువైపునకుఁ బరుగిడుచు, యథార్థ తత్త్వము నెఱిఁగినదై తన పూర్వపు అజ్ఞానచరిత్రమునుగూర్చి నవ్వుచునుండ, సభ్యుల చిత్తము ప్రత్యగాత్మపరాయణమై బ్రహ్మానందమును లెస్సగ ననుభవించుటయందు తత్పరమైయుండ, సభాసదులెల్లరు వివేకవంతులై ప్రశాంతచిత్తులై, ధ్యానస్థులపగిది వెలయుచుండ, పద్మాసనము వైచికొని శ్రీరామచంద్రుఁడు సోదరసమేతముగ గురువుయెదుట అంజలిబద్ధుఁడై శోభాయమానమగు గురుముఖమును వీక్షించుచునుండ, దశరథమహారాజు ధ్యానమందున్నవానివలె వెలయుచు, ఆదిమధ్యాంతరహితమై, అనిర్వచనీయమై, పరమపావనమైనట్టి జీవన్ముక్తస్థితి నాస్వాదించుచుండ నపుడు మాన్యప్రదుఁడగు వసిష్ఠమునీంద్రుఁడు రాజాదిభక్తుల పూజను గ్రహించు నిమిత్తము క్షణకాలము మౌనముగనున్నవాఁడై, ఆ పిమ్మట వ్యాకులత్వరహితముగ ఈ వాక్యములఁబల్కెను:—

స్వకులాకాశశీతాంశో రామ రాజీవలోచన
కిమన్యదిచ్ఛసి శ్రోతుం కథయాభిమతేచ్ఛయా. 7

స్థితిం చ కీదృశీమేనామద్యానుభవసి స్వయమ్
కిం రూపమిదమాభాసం జాగతం వద పశ్యసి. 8

నిజసూర్యవంశమను ఆకాశమునకుఁ జంద్రుఁడవును, కమలనేత్రుఁడవునగు ఓ రామచంద్రా! ఇఁక నిపుడింకను నీవేమి వినఁదలంచితివో స్వేచ్ఛాపూర్వకముగ వచింపుము. మఱియు నిపుడు నీవెట్టి స్థితిని స్వయముగ ననుభవించుచున్నావో, ఈ జగత్తుయొక్క యాభాసము నెట్లు గాంచుచున్నావో తెలుపఁగోరెద.

ఇత్యుక్తే మునినా తేన ప్రాహ రాజకుమారకః
అవిహ్వలం మృదు స్పష్టం గురోరాలోకయన్ముఖమ్. 9

వసిష్ఠమునీంద్రుఁడిట్లు వచింప నంత రాజకుమారుఁడగు శ్రీరామచంద్రుఁడు గురుముఖమును వీక్షించుచు, అవిహ్వలతాపూర్వకముగ నిట్లు కోమల, స్పష్టవాక్యములఁబల్కెను.

శ్రీరామ ఉవాచ :—

త్వత్ప్రసాదేన యాతోఽస్మి పరాం నిర్మలతాం ప్రభో
శాన్తాశేషకలఙ్కాభ్రం శరదీవ నభస్తలమ్. 10

శ్రీరాముఁడు:— ప్రభూ! కళంకమంతయు నశించిన పూర్ణచంద్రుఁడను చిహ్నము గల శరత్కాలపు ఆకాశమువలె నేను తమ యనుగ్రహముచే పరమనిర్మలత్వ మొందితిని.

సర్వా ఏవోపశాన్తా మే భ్రాన్తయో భవభఙ్గదాః
స్వరూపేణావదాతేన తిష్ఠామ్యచ్ఛమివామ్బరమ్. 11

మహాత్మా! సంసారప్రదములగు భ్రాంతులన్నియు నాకుపశమించినవి. నిర్మలమగు ఆత్మస్వరూపముతోడ నేనిపుడాకాశమువలె స్వచ్ఛముగ వెలయుచున్నాను.

స్థితోఽహం గలితగ్రన్థిః శాన్తాశేషవిశేషణః
స్ఫటికాలయమధ్యస్థస్ఫటికామలధీరహమ్. 12

నా హృదయ గ్రంధులన్నియు నశించినవి. నేనిపుడు సర్వవిశేషణరహితుఁడనైయున్నాను. మఱియు స్ఫటికస్థానమధ్యమందలి స్ఫటికవలె నిర్మల బ్రహ్మరూపమగు ఈ జగత్తునందు నిర్మల బ్రహ్మరూపమగు బుద్ధిగల నేను స్థితిబొందియున్నాను.

అన్యచ్ఛ్రోతుమథాహర్తుం శాన్తం నేచ్ఛతి మే మనః
పరాం తృప్తిముపాయాన్తం సుషుప్తమివ సంస్థితమ్. 13

పరమతృప్తిని బొందినదై సుషుప్తరూపమువలెనున్న శాంతమగు ఈ నా మనస్సిపుడు అన్యమగు దేనినిగూడ వినుటకుగాని, సంపాదించుటకుగాని యిచ్ఛగించుటలేదు.

శాన్తాశేషపరామర్శం విగతాశేషకౌతుకమ్
సంత్యక్తాశేషసంకల్పం శాన్తం మమ మునే మనః. 14

ఓ మునీంద్రా! నా మనస్సిపుడు విషయస్మరణమున్ను తద్విషయభోగమందలి యభిలాషయు పూర్ణముగ నశించినదై సమస్త సంకల్పములను త్యజించినదై ప్రశాంతముగ నొప్పుచున్నది.

పరినిర్వామి శామ్యామి జాగ్రదేవ జగత్స్థితౌ
అస్వప్నమపునర్బోధం స్వపిమీవ నిరామయమ్. 15

ఈ జాగ్రత్-జగత్స్థితియందు నేను మానసిక, ఇంద్రియసంబంధ విషయవిచారరహితుఁడనై పరమశాంతిని తృప్తిని బొందుచున్నాను. కావుననే యిట సుషుప్తియందున్నవానివలె నిర్వికారుఁడనై చెన్నొందుచున్నాను.

ఆశావిధురితామాత్మసంస్థితిం ప్రాక్తనీం తనౌ
ప్రవిహస్య స్ఫురత్ప్రోక్తైః స్వస్థస్తిష్ఠామ్యసంశయమ్. 16

అనేక ప్రకారములైన విషయములఁగూర్చిన యాశలచే వ్యాకులత్వమొందిన పూర్వకాలపు దేహాత్మబుద్ధిరూపమగు స్థితినిగూర్చి నవ్వుచు ప్రకాశశీలములగు తమ యుపదేశవాక్యములచే నేనిపుడు సంశయరహితముగను, స్వస్థముగను ఆత్మస్వరూపమందు స్థితిగల్గియున్నాను.

నోపదేశేన నార్థేన న శాస్త్రైర్న చ బన్ధుభిః
త్యాగేన చ న చైతేషామధునా మమకారణమ్. 17

ఇపుడు నాకుపదేశముచేగాని తదితర పదార్థముచేగాని, శాస్త్రములచేగాని, బంధువులచేగాని, వీనియన్నిఁటియొక్క త్యాగముచేగాని యే ప్రయోజనమున్నులేదు.

సామ్రాజ్యస్యాథవా వ్యోమ్ని యా స్థితిః క్షోభవర్జితా
తామేవానుభవామ్యత్రమచ్చిత్తామనపాయినీమ్. 18

లేక (లోకదృష్టిచే) రాక్షసాదులక్షోభలేనట్టి స్వర్గమందలి సామ్రాజ్యముయొక్క సుఖస్థితిఁబోలినదియు, ప్రత్యగాత్మయందు ప్రతిష్ఠితమైన చిత్తముగలదియు, నాశరహితమైనదియునగు ఆత్మన్యస్తస్థితి ననుభవించుచున్నాను.

బాదప్యతీతరామచ్చం చిదాకాశాం శమాత్రక
జగదిత్యేవ పశ్యామి లోచనాద్యఙ్గతాం గతః. 19

బాహ్యదృష్టిచే నేత్రాద్యవయవరూపత్వమును బొందినప్పటికిని నేను జగత్తును ఆకాశము కంటెను నిర్మలమైనట్టి చిదాకాశమాత్రముగనే గాంచుచున్నాను. (అజ్ఞానులవలె జడముగఁగాదు)

ఆకాశమాత్రమేవేదం జగదిత్యేకనిశ్చయః
దృశ్యనామ్ని నభస్యస్మిన్నష్టే జాగర్మి చాక్షయః. 20

ఈ జగత్తు పరమార్థమున చిదాకాశమాత్రమే యనుట పరమనిశ్చయమైయున్నది. ఏల యనిన దృశ్యమను పేరుగల యీ జగత్తు మోహనిద్రతో సహా జ్ఞానముద్వారా క్షయింప నాశరహితుఁడను, చిత్స్వరూపుఁడనునైనట్టి నేనే సదా మేల్కొనియున్నాను

యథాకామం యథాప్రాప్తం యథాస్థితమవస్థితమ్
యద్వ్యక్తి తదవిఘ్నేన కరోమ్యపగతైషణమ్. 21

ఓ మునీంద్రా! యథా కామమగు భవిష్యత్కార్యమును యథా ప్రాప్తమై యథాస్థితమైనట్టి వర్తమానకార్యమును దేనిని తాము చేయనుపదేశింతురో, దానిని ఫలాభిసంధిరహితముగ గురుశాస్త్రానుసార మాచరింతును.

న తుష్యామి న హృష్యామి న పుష్యామి రోదిమి
కార్యం కార్యం కరోమ్యేకో భ్రాన్తిర్దూరం గతామమ. 22

ఇష్టప్రాప్తిచే నేను సంతుష్టుఁడనుగాని, ప్రసన్నుఁడనుగాని, పరిపుష్టుఁడనుగాని యగుటలేదు. అనిష్టప్రాప్తిచే, దుఃఖమున్ను బొందుటలేదు. అవశ్యము చేయఁదగిన లౌకిక, వైదిక కార్యములను నేను జేయుదును. ఏలయనిన, నా భ్రమ యిపుడు తొలఁగిపోయినది.

అన్యతామేతు సర్గోఽయం వాతు వా ప్రలయానిలః
సౌమ్యో భవతు వా దేశః స్వస్థోఽహం స్వాత్మని స్థితః. 23

ఈ సృష్టి విపరీతదశను బొందినను సరియే, ప్రళయవాయువు వీచినను సరియే. దేశమంతయు శూన్యమైపోయినను సరియే, దానిచే నాకనర్థమేమియును సంప్రాప్తింపదు. ఏలయనిన, నేను స్వాత్మయందు నిర్విక్షేపముగ స్థితినొందియున్నాను.

విశ్రాన్తోఽస్మి విలక్ష్యోఽస్మి దుర్లక్ష్యోఽస్మి నిరామయః
నాశాభిర్బన్ధమాప్నోమి మునే ఖమివ ముష్టిభిః. 24

మునీంద్రా! నేనిపుడు విశ్రాంతుఁడనై, బాహ్యేంద్రియములచేగాని, మనస్సుచేగాని లక్షింపఁబడవీలుఁగానై, నిర్వికారుఁడనైయున్నాను. పిడికిళ్లచే ఆకాశము బంధింపఁబడనట్లు నేనిపుడు విషయములఁగూర్చిన యాశలచే బంధింపఁబడకయున్నాను

యథా తరుగతాత్పుష్పాద్గన్ధః ప్రాప్య నభఃపదమ్
తిష్ఠత్యేవమహం దేహాదతీతం సంస్థితః సమః 25

వృక్షమందలి పుష్పమందున్న సుగంధమటనుండి బయల్వెడలి యాకాశమందుండునట్లు దేహమందున్న నేను దేహముకంటె అతీతమైనట్టి చిదాకాశమందు సమరూపమున వెలయుచున్నాను.

యథైవ సర్వేరాజానో విహరన్తి యథాసుఖమ్
అప్రబుద్ధాః ప్రబుద్ధాశ్చ రాజ్యేషు బహుకర్మసు. 26

శాన్తహర్షవిషాదాశః స్థిరైకసమదర్శనః
స్థిత ఆత్మని నిఃశఙ్కం తథైవ విహరామ్యహమ్. 27

జ్ఞానులును, అజ్ఞానులునగు రాజులందఱును, రాజ్యపాలనాద్యనేక కార్యములందు సుఖపూర్వకముగ నెట్లు విహరించుచున్నారో, అట్లే నేనున్ను విహరింతును. కాని, అజ్ఞానులవలె గాక హర్ష విషాద రహితుఁడనై, స్థిరబుద్ధిగల్గి కేవలము సమదర్శినై, సంశయరహితుఁడనై ఆత్మయందు స్థితిగలవాఁడనై బాహ్యమున సమస్త వ్యవహారము లాచరించుచుందును.

సర్వేష్వప్యర్థేష్వపి సుఖీ సుఖమ్ నేహామి మే ప్రభో
జనసామ్యేన తిష్ఠామి యథేచ్ఛం మాం నియోజయ. 28

ప్రభూ! సమస్త విషయానందములకంటె అతీతమైనట్టి బ్రహ్మానందముచే నేనిపుడు సుఖవంతుఁడనై యున్నాను. కావుననే దేహమందలి విషయసుఖమును వాంఛించుటలేదు. లోకదృష్టిచే నేను సర్వజనులతోడ సమానముగనే స్థితినొందియున్నాను. మునీంద్రా! తమ యిచ్ఛానుసారము నన్ను సేవాకార్యములందు నియోగింపుఁడు;

బాలో లీలామివ త్యక్తశఙ్కం సంసారసంస్థితమ్
యావద్దేహమిమాం సాధో పాలయామ్యమలైకదృక్. 29

సాధూ! మహాత్మా! బాలుఁడు తన వయస్సునకు దగిన క్రీడ నాచరించునట్లు దేహముండునంతవఱకును నిర్మలదృష్టిచే నేనీ యథాప్రాప్తమగు ప్రపంచస్థితిని పాలింతును.

భుఞ్జే పిబామి తిష్ఠామి పాలయామి నిజక్రియామ్
జాతోఽహం విగతాశఙ్క స్త్వత్ప్రసాదాన్మునీశ్వర. 30

మునీశ్వరా! తమ యనుగ్రహముచే నేనిపుడు సందేహరహితుఁడనైతిని ఇపుడు సర్వత్ర సమదృష్టిగల్గి నిజక్రియను పాలించెదను, భోజన, పాన, వసనాది వ్యవహారముల నాచరించెదను.

శ్రీ వసిష్ఠ ఉవాచ:—

అహో బత మహాపుణ్యం పదమాసాదితం త్వయా
అనాదిమధ్యపర్యన్తమిదం యత్ర న శోచ్యతే. 31

శ్రీ వసిష్ఠుఁడు:— ఆహా! ఓ రామచంద్రా! మహాసంతోషకరమైన విషయము! ఏ నిర్మల పదమున స్థితినొంది జీవుఁడిక శోకింపఁడో, అట్టి మహాపవిత్రమై ఆదిమధ్యాంతరహితమైనట్టి బ్రహ్మపదమును నీ విపుడు పొందితివి.

సమ్యక్ప్రమసమాలోకే శీతలే స్వాత్మని స్వయమ్
నభసీవ నభః శాన్తే విశ్రాన్తిమసి లబ్ధవాన్. 32

సర్వత్ర సర్వథా సమరూపమై, అతి విశాలమై, దుఃఖరహితమై, నిరతిశయానందరూపమైనట్టి స్వాత్మయందు, శాంతమగు ఆకాశమున ఆకాశమువలె, నీవు స్వయముగ విశ్రాంతిని బొందినవాడవైతివి.

> దిష్ట్యా జాతో విశోకస్త్వం దిష్ట్యాసమ్యగవస్థితః
> దిష్ట్యా లోకద్వయేఽనర్థశఙ్కా తే శమమాగతా. 33

ఓ రామచంద్రా! సౌభాగ్యవశమున నీవు దుఃఖరహితుఁడవైతివి; సౌభాగ్యవశమున బ్రహ్మపదమున లెస్సగ స్థితినొందితివి; సౌభాగ్యవశమున ఇహ, పరలోకములందలి అనర్థమును గూర్చిన సంశయము నీకిపుడు తొలగినది.

> దిష్ట్యారఘూణాం తనయ సంజ్ఞః పాలితవానసి
> భూతభవ్యభవిష్యస్థాం బోధేన కులసంస్థితమ్. 34

పుత్రకా! సౌభాగ్యవశమున నీవిపుడు ఆత్మవేత్తవై భూతభవిష్యద్వర్తమాన రఘుకుల సంతతిని బోధచే పవిత్రమొనర్చినవాఁడవైతివి.

> అధునా మునినాథస్య విశ్వామిత్రస్య రాఘవ
> పూరయిత్వార్థితాం భుక్త్వా పిత్రా సహ మహీమిమామ్. 35

ఓ రాఘవా! ఇఁక నీవిపుడు మునిశ్రేష్ఠుఁడగు విశ్వామిత్రునియొక్క (యజ్ఞవిఘ్ననివారణమను) కోర్కెను పూర్ణమొనర్చి, తండ్రియాజ్ఞచే రాక్షసవధాది కార్యములఁ గావించి యాతనితో సహ యీ భూమండలమును బాలింపుము.

> త్వయాన్వితాః సతనయభృత్య బాన్ధవాః
> పదాతయః సరథగజాశ్వమణ్డలాః
> నిరామయా విగతభయాః స్థిరశ్రియః
> సదోదయాః సుభగ భవన్తు రాఘవాః. 36

ఇత్యార్షే శ్రీవాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే ఉత్తరార్ధే విశ్రాన్తిప్రకటీకరణం నామైకాధికద్విశతతమః సర్గః ॥ 201 ॥

సౌభాగ్యశాలివగు రామచంద్రా! నీతోఁగూడియున్న పుత్ర, పౌత్ర సహితులగు భృత్య, బాంధవులున్ను, రథ, గజ, అశ్వసమూహయుక్తులగు పదాతి (కాలిబంటు) సైనికులున్ను, రఘువంశీయులందఱును నీవలన రోగరహితులై, భయవర్జితులై స్థిరసంపత్తిగలవారై సదా అభ్యుదయము (వృద్ధి)తో గూడియున్నవారై వెలయుదురుగాక!

ఇది శ్రీవాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున నుత్తరార్ధమున విశ్రాన్తిప్రకటీకరణమను రెండువందలొకటవ సర్గము ॥ 201 ॥

## ద్వ్యధికద్విశతతమః సర్గః.

[ ప్రబోధహృష్టా రాజానో రామశ్చాత్రోపవర్ణితాః
రామేణ చ స్థితిః స్వీయా నిర్మ్ల ప్తా జ్ఞానసిర్మలా.

జ్ఞానముచే ప్రసన్నులైన రాజాదులయొక్కయు, శ్రీరామచంద్రుని యొక్కయు వర్ణనము శ్రీరామచంద్రునిచేఁ తన నిర్మల జ్ఞానస్థితి వర్ణింపఁబడుట యిచటఁ గాననగును.]

**శ్రీ వాల్మీకి రువాచః—**

> ఏతచ్ఛ్రుత్వా వసిష్ఠస్య వచః సంసది పార్థివాః
> సిక్తా ఇవామృతాపూరైరన్తః శీతలతాం యయుః. 1

శ్రీవాల్మీకి:— ఓ భరద్వాజా ! వసిష్ఠమునీంద్రుని యావాక్యములనువిని సభయందలి రాజులందఱును అమృతప్రవాహములచేఁ దడుపఁబడినవారివలె నంతఃకరణమున పరమశాంతిని, సుఖమును బొందిరి.

> రామః కమలపత్రాక్షో రరాజ వదనేన్దునా
> క్షీరోద ఇవ సంపూర్ణః సుధాపూరేణ చారుణా. 2

కమలనేత్రుఁడగు శ్రీ రామచంద్రుఁడును, మనోహరమై, అమృతపూర్ణమైనట్టి పూర్ణ చంద్రునిచే సముద్రమువలె, తనముఖచంద్రునిచే శోభించెను.

> వామదేవాదయః సర్వే తత్త్వజ్ఞానవిశారదాః
> అహో భగవతా జ్ఞానముక్తమిత్యూచురాదరాత్. 3

తత్త్వజ్ఞానవిశారదులగు వామదేవాది మునులందఱును 'ఆహా! వసిష్ఠ భగవానుఁడు ఆశ్చర్య జనకమైనట్టి జ్ఞానమును వచించెను' అని యాదరముతో పలికిరి.

> శాన్తాన్తఃకరణో రాజా ముదా దశరథో బభౌ
> తుష్ట్యైవ సంప్రహృష్టాఙ్గో నవాం ద్యుతిముపాగతః. 4

దశరథమహారాజు సంతోషాతిరేకముచే పులకితశరీరుఁడై, శాంతమనస్కుఁడై నూతన శోభను బొందినవాఁడై యొప్పెను.

> జ్ఞాతజ్ఞేయేషు బహుషు సాధువాదకథాస్వథ
> ఉవాచ గలితాజ్ఞానో రామో వాక్యమిదం పునః. 5

జ్ఞేయమగు ఆత్మనెఱిఁగినట్టి జ్ఞానులయొక్క సాధువాదకథలు పరిసమాప్తియైనపిదప అజ్ఞానరహితుఁడగు శ్రీరామచంద్రుఁడు మరల యీ వాక్యములబల్కెను.

**శ్రీరామ ఉవాచః—**

> భగవన్నూతభవ్యేశ త్వయాస్మాకమలం మలమ్
> సంప్రమృష్టమిదం హేమ్నః శామ్యత్వమివ వహ్నినా. 6

శ్రీరాముఁడు :— భూత భవిష్యద్వర్తమానములకు ప్రభువగు ఓ మహాత్మా! అగ్ని సువర్ణముయొక్క మాలిన్యములు దొలగించునట్లు తాము మా అజ్ఞానమును సంపూర్ణముగఁ దొలగించివైచితిరి.

అభూమ వయమాత్మీయకాయమాత్రదృశః పురా
ప్రభో సంప్రతి సంపన్నా విష్వగ్విశ్వావలోకినః. 7

ప్రభూ! పూర్వము మేము పరిచ్ఛిన్నమైన దేహమాత్రమునే ఆత్మగ గాంచువారమై యుంటిమి. ఇపుడు సమస్త ప్రపంచమును ఆత్మగ గాంచువారమైయున్నాము.

స్థితోఽస్మి సర్వసంపూర్ణః సంపన్నోఽస్మి నిరామయః
జాతోఽస్మి విగతాశఙ్కో బుధో జాగర్మి సంప్రతి. 8

ఇపుడు నేను సర్వత్ర సర్వథా పరిపూర్ణుఁడనై శారీరిక, మానసిక వ్యధారహితుఁడనై, నిర్వికారుడనై సంశయవర్జితుఁడనై, జ్ఞానయుక్తుడనై ఆత్మస్వరూపమున మేల్కొనియున్నాను.

ఆనన్దితోఽస్మ్యఖేదాయ సుఖితోఽస్మి చిరాయ చ
స్థితోఽనస్తమయాయైవ శాశ్వతార్థోదయో మమ. 9

నేనానందయుక్తుడనై ఎన్నఁడును దుఃఖములేక చిర (శాశ్వత) కాలము సుఖవంతుఁడనై యున్నాను. మఱియు మఱల ఎన్నఁడును అస్తమింపని నిత్యోదయస్థితి నాకిపుడు లభించినది. ఏల యనిన శాశ్వతమగు పరమపురుషార్థము (ఆత్మ) నాకుదయించినదైనది.

అహో బత పవిత్రేణ శీతేన జ్ఞానవారిణా
త్వయా సిక్తోఽస్మి హృష్యామి పద్మవద్ధృదయే స్వయమ్. 10

ఆహా! మహాత్మా! తమయొక్క జ్ఞానరూపమగు పవిత్ర శీతలజలముచే శరత్కాల కమలమువలె నిజహృదయమున స్వయముగ తడుపఁబడినవాఁడనై నేను కడుముదంబొందుచున్నాను.

ఇయమద్య మయా లబ్ధా పదవీ త్వత్ప్రసాదతః
యస్యాం స్థితస్య మే సర్వమమృతత్వం గతం జగత్ 11

మునీంద్రా! ఏద్దానియందు స్థితినొందిన నాకీసమస్తజగత్తును అమృత (బ్రహ్మ) రూపత్వమును బొందినదో, అట్టి యీ ఆత్మసామ్రాజ్యపదవిని తమ యనుగ్రహముచే నేనిపుడు పొందితిని.

అన్తః ప్రసన్నమతిరస్తసమస్తశోకః
శోభాం గతోఽహమమలాశ ఇవ శాన్త్యా
ఆనన్దమాత్మని గతః స్వయమాత్మనైవ
నైర్మల్యమభ్యుపగమోఽస్మి నమోఽస్తు మహ్యమ్. 12

ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు
నిర్వాణప్రకరణే ఉత్తరార్థే ఆత్మవిశ్రామాఙ్గీకరణం
నామ ద్వ్యధిక ద్విశతతమః సర్గః ॥ 202 ॥

మహాత్మా! నేనిపుడు లోన ప్రసన్నచిత్తుఁడను నశించిన సమస్తదుఃఖములుగలవాఁడను, పరమ శోభను బొందినవాడను, జ్ఞానముద్వారా కార్యసహితముగ మూలాజ్ఞానము నశించుటఁబట్టి నిర్మలమగు స్వాత్మయందే నిరతిశయానందమును బొందినవాడను, స్వయముగ బాగుగ పరీక్షించి (తత్త్వవిచారణచేసి) సాక్షి చైతన్యముయొక్క దర్శనముచే స్వతఃసిద్ధమగు పరమ నైర్మల్యమును బడసినవాఁడను అయియున్నాను. కావున అట్టి పరమాత్మస్వరూపుడనగు నాకు నమస్కారము.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున నుత్తరార్థమున ఆత్మవిశ్రామాంగీకరణమను రెండువందల రెండవ సర్గము ॥ 202 ॥

◆◆◆◆◆◆◆◆◆◆◆

## త్ర్యధికద్విశతతమః సర్గః

[ మధ్యాహ్నతూర్యఘోషోఽత్ర దినకృత్యం నిశాక్రమః
ప్రాతః సభాయాం రామస్య నిస్పందేహాశ్చ వర్ణ్యతే.

మధ్యాహ్నకాలిక తూర్య శంఖాది శబ్దములు దినకృత్యము, రాత్రియేతెంచుట, ప్రాతఃకాలమైనమీదట సభయందు శ్రీరామచంద్రుఁడు తన నిస్పందేహా స్థితిని వర్ణించుట మున్నగు విషయములిచటఁ దెలుపఁబడుచున్నవి. ]

శ్రీ వాల్మీకి రువాచ:—

> ఇత్థం విచారపరయోర్మునిరాఘవయో స్తయోః
> భాస్కరః శ్రమణాయేవ వ్యోమిమధ్యముపాయయౌ. 1

శ్రీ వాల్మీకి:— ఓ భరద్వాజా! ఈప్రకారముగ వసిష్ఠమునీంద్రుఁడును, శ్రీరామచంద్రుడును ఆత్మతత్త్వవిచారపరులైయుండ నపుడు వారి వాక్యములను వినుటకా యనునట్లు సూర్యభగవానుఁడు ఆకాశమధ్యమును బొందెను.

> తీక్ష్ణతామాజగామాశు సర్వదిక్కమథాతపః
> పదార్థౌఘవికాసార్థం రామస్యేవ మహామతిః. 2

అత్తఱి పదార్థసమూహముయొక్క స్ఫుటదర్శనముకొఱకై శ్రీరామచంద్రుని మహాబుద్ధి తీక్ష్ణత్వమును జెందినట్లు దిక్కులందంతట ఆతపము (ఎండ) శీఘ్రముగ తీక్ష్ణత్వమును బొందినదాయెను.

> ఉత్ఫుల్లహృదయామ్భోజస్ఫారాకారతయా తదా
> లీలాపద్మాకరా రేజు స్తత్రస్థాః పార్థివా ఇవ. 3

వికసితములై, విశాలాకారయుక్తములైనట్టి హృదయకమలములుగల యుద్యానసరోవరములపుడు తత్సభయందలి రాజసమూహమువలె శోభించెను.

> కాలం ముక్తాకలాపాన స్తరమాత్రా స్తభాస్కరమ్
> నన స్తేవ తరద్వ్యోమ విజ్ఞానశ్రవణాదివ. 4

అత్తఱి, ముత్తెముల సమూహములచే దట్టముగ వ్యాప్తములైయున్న స్ఫటికవాతాయనములు (కిటికీలు) ప్రతిబింబించిన సూర్యునితోడ శోభించుచు. వసిష్ఠమునీంద్రునియొక్క విజ్ఞాన శ్రవణముచే బ్రహ్మాకాశమునఁ దేలియాడుచున్నవాయనునట్లు అధికకాంతిచే నాకాశమున దేలియాడుచున్నట్లును, నాట్యమొనర్చుచున్నట్లును జూపట్టుచుండెను.

> పుస్ఫురుః పద్మరాగేషు లగ్నార్కతరుణత్విషః
> భాసో వ్యోమతలోడ్డీనా ధియో జ్ఞానకలా ఇవ. 5

ఆకాశతలమునుండి యెగిరి పద్మరాగమణులందు సంలగ్నములైనట్టి నూతన సూర్య ప్రతిబింబకాంతులు, ఉపదేశ జ్ఞాన కళాపరిపూర్ణములగు బుద్ధులవలె స్ఫురింపఁదొడగెను.

> ఏవం నిర్వృతిమాయాతే రామే స్వకులకైరవే
> మునీన్ద్రవదనాలోకాత్సవికాసమివస్థితే. 6
> రవావార్ణోవమే వ్యోమ మహోష్ఠేర్నాభితాం గతే
> తేజఃపుఞ్జలసజ్జ్వాలే సమ్యగ్రసపాయిని. 7
> నభోనీలోత్పలే నీలే గలద్రజసి రాజతి
> ఘర్మాంశుకర్ణికాకాన్తే స్ఫురత్కిరణకేసరే. 8
> అవతంసే జగల్లక్ష్మ్యా స్త్రిలోకీకర్ణకుణ్డలే
> అన్తర్లీనస్ఫురత్తారా రత్నరాజివిరాజితే. 9
> దిగ్వధభిర్భృహత్పృష్ఠపాణి భిర్మకురేష్వివ
> ధృతేషు తావభిన్నేషు మహాభ్రేషు నిరమ్బుషు. 10
> సూర్యకాన్తరవోత్థేన వహ్నినేవ సమేధితే
> ద్విగుణం ప్రజలత్యర్క శూన్యే గగనధామని. 11
> వినేదుర్మేదురోద్దామముఖమారుత పూరితాః
> మధ్యాహ్నశఙ్ఖాః కల్పాన్తవాతపూర్ణా ఇవార్ణవాః. 12

ఈ ప్రకారముగ పరమశాంతిని బొందిన స్వకుల - కైరవుఁడగు (నిజకులమను సరోవరమునకు కలువవంటివాఁడగు) శ్రీరామచంద్రుఁడు వసిష్ఠమునీంద్రుని ముఖచంద్ర దర్శనము వలన వికాసయుక్తుని పగిది చెన్నొందుచుండ, తేజః పుంజములచేఁ బ్రకాశించునట్టి జ్వాలలుఁగలవాఁడును, సమస్తపదార్థములందలి రసమును ద్రాగువాఁడునగు సూర్యభగవానుఁడు బడబాగ్నివలె ఆకాశమను మహాసముద్రముయొక్క మధ్యభాగమును బొంద ధూళివర్జితమై సూర్యుఁడను కర్ణిక (దుద్దు)చే మనోహరమై ప్రకాశమానములగు కిరణములను కేసరములతోఁ గూడినదై జగలక్ష్మియొక్క శిరోభూషణమై యొప్పుచు త్రైలోక్యమను స్త్రీయొక్క కర్ణకుండలమై భాసించుచు, అభ్యంతరమున లీనములైయున్న ప్రకాశమానములగు నక్షత్రములను రత్నసమూహముచే విరాజిల్లుచు, ఆకాశమను నీలకమలము శోభించుచుండ, దిక్కులను స్త్రీలు గొప్ప పర్వతశిఖరములను హస్తములతో ఆతపముచే విభక్తములైనట్టి జలరహితములగు మహామేఘములను అద్దములను బట్టుకొనియుండ సూర్యరహితమైయున్నను ఆకాశ ప్రదేశము ఉత్తమసూర్యకాంత మణులచే నుత్పన్న

మైన అగ్నిచే తాపవృద్ధిని బొందినదై సూర్యునికంటె రెండింతలధికముగఁ బ్రజ్వలించుచునుండ నట్టి సమయమున వజ్ర (పిడుగు) శబ్దమువంటి శబ్దమునుగలుగఁజేయునవియు, గొప్ప ముఖ వాయువుచే పూరింపఁబడినవియునగు మధ్యాహ్నసూచక శంఖములును, కల్పాంతవాయువుచే పూరితములైన సముద్రములవలె మ్రోగెను.

ప్రాలేయశ్రీరివాబ్జేషు ఘర్మశ్రీర్వదనేష్వివ
చకార పదమాకీర్ణ శుద్ధముక్తాఫలోపమా. 13

ఆ సమయమున, కమలములపై హిమ (మంచు) బిందువులవలె జనులయొక్క ముఖములపై వెదచల్లబడిన ముత్తెములఁబోలినట్టి, స్వేద (చెమట) బిందువుల శోభవర్తించుచుండెను.

గృహభిత్తిపరావృత్తా సత్వసంరమ్భ మాంసలా
శబ్దశ్రీః పూరయామాస కర్ణమర్ణ ఇవార్ణవమ్. 14

మఱియు, వర్ష, నద్యాకుల జలము సముద్రమును పూరించునట్లు అత్తఱి గృహకుడ్యములకు దగుల్కొని వెనుకకు మరలునదియు, మనుజుల కార్య శీఘ్రత్వముఁగూర్చిన శబ్దసంరంభములచే పరిపుష్టమైనదియునగు ఆ శంఖాదుల శబ్దము జనుల కర్ణగోళములను పూరించెను.

పురస్త్రీభిర్నిదాఘౌఘ శాన్త్యయే సముదీరితా
ఉల్లలాస నవా పాణ్డుకర్పూర జలదావలిః. 15

ఉష్ణత్వశాంతికొఱకై స్త్రీలచే వెదచల్లఁబడిన నూతనకర్పూరజలమను తెల్లని మేఘసమూహమపుడు శోభించెను.

స రాజా సహసామన్తః సభూపః సపరిచ్ఛదః
సవసిష్ఠః సముత్తస్థౌ సహరామః ససంసదః. 16

అంత, ఆ దశరథమహారాజు మండల, దేశాధిపతులగు సామంత, భూపాలుర తోడను, మంత్ర్యాది పరివారముతోడను వసిష్ఠ శ్రీరామచంద్ర, తదితర సభాసదులతోడను లేచి నిలఁబడెను.

రాజనో రాజపుత్రాశ్చ మన్త్రిణో మునయస్తథా
అన్యోన్యం పూజితా జగ్ముర్ముదితాః స్వం నివేశనమ్. 17

అపుడు రాజులు, రాజపుత్రులు, మంత్రులు, మునులు పరస్పరమొకరినొకరు పూజించుకొని సంతోషాన్వితచిత్తులై తమ తమ నివాసస్థానముల కేగిరి.

అన్తః పురగృహాగ్రేషు తాలవృన్తానిలాహృతైః
కర్పూరధూలిభిరభూన్నవై వామ్బుదమాలికా. 18

అంతఃపుర గృహముఖములందు విసనకఱ్ఱల వాయువులచేఁ గొనిరాఁబడిన కర్పూరధూళులచే నూతనమేఘ సమూహమపుడు విరాజిల్లెను.

అథ మధ్యాహ్నతూర్యాణాం రవే స్ఫూర్జతి భిత్తిషు
ఉవాచ వచనం వాక్యకోవిదో మునినాయకః. 19

తదుపరి మధ్యాహ్నకాలముయొక్క శంఖ, భేర్యాదులశబ్దము కుడ్యాదులకుఁదగుల్కొని ప్రతిధ్వనులచే నెపుడు వృద్ధిబొందియుండెనో, అపుడు వాక్యకోవిదుఁడగు మునినాయకుఁడైన వసిష్ఠుఁడిట్లుపలికెను.

సర్వమేవ శ్రుతం శ్రావ్యం జ్ఞేయం జ్ఞాతమశేషతః
త్వయా రాఘవ భో నాస్తి జ్ఞాతవ్యమపరం వరమ్. 20

ఓ రాఘవా! వినఁదగినదంతయును నీవిపుడు వింటివి; ఎఱుఁగఁదగినదంతయును పూర్ణముగ నెఱిఁగితివి; ఇఁక నీచే నెఱుఁగఁదగిన శ్రేష్ఠమైనది మఱియొకటెద్దియునులేదు

యథా మయోఽపదిష్టోఽసి యథాపశ్యసి శాస్త్రతః
యథానుభవసి శ్రేష్ఠమేకవాక్యం తథా కురు. 21

ఓ రామచంద్రా! నేను నీకేది యుపదేశించితినో, శాస్త్రములవలన నీవేదియెఱుఁగు చున్నావో, స్వయముగ శ్రేష్ఠమగు ఎద్దాని ననుభవించుచున్నావో, వాని యన్నిఁటియొక్క (ఏకార్థ నిష్ఠత్వరూపమగు) ఏకవాక్యత్వమును గావింపుము.

ఉత్తిష్ఠ తావత్కార్యాయ వయం స్నాతుం మహామతే
మధ్యాహ్నసమయోఽస్మాకమయమద్యాతివర్తతే. 22

మహాధీమంతుఁడవైన ప్రియుఁడవగు రామచంద్రా! ఇఁక లెమ్ము! మధ్యాహ్నస్నాన సమయ మతిక్రమించుచున్నది.

అపరం యత్త్వయా భద్ర స్వాకాఙ్క్షావినివృత్తయే
ప్రష్టవ్యం తచ్ఛ్రుతం ప్రాతః ప్రష్టవ్యం భవతా పునః. 23

మంగళకరుఁడవగు రామచంద్రా! పూర్వోక్తవిషయములన్నింటిని మననునిదిధ్యాసనముల ద్వారా బాగుగ పర్యాలోచించి ఏదైనయడుఁగవలసియున్నచో స్వసందేహనివృత్తికొఱకై యద్దానిని మరల ప్రాతఃకాలమున తప్పక యడుగుము, ఉపేక్షింపవలదు.

శ్రీ వాల్మీకి రువాచః—

ఇత్యుక్తే మునినాథేన రాజా దశరథః స్వయమ్
పూజయామాస తాన్సభ్యాన్సర్వాన్సాధూన్సపర్యయా. 24

శ్రీవాల్మీకి:— ఓ భరద్వాజా! మునీశ్వరుఁడగు వసిష్ఠుఁడిట్లువచింపనంత దశరథమహారాజు స్వయముగ ఆసభ్యులను, సాధువులను అందఱిని భక్తిపూర్వకముగఁ బూజించెను.

సహ యామేన ధర్మాత్మా మునివిప్రాన్నృపాంశ్చ సః
వసిష్ఠాద్యుపదిష్టేన క్రమేణ వ్యోమగాంస్తథా. 25
మణిముక్తాగణార్ఘేన దివ్యేన కుసుమేన చ
మణిరత్నప్రదానేన ముక్తాహారార్పణేన చ. 26
ప్రణయేన ప్రణామేన ప్రదానేనార్థశాలినా
వస్త్రాసనాన్నపానేన కనకేన తథా భువా. 27

ధూపేన గన్ధమాల్యాభ్యాం యథోదితమనిన్దితః
పూర్వాన్సంపూజయామాస సర్వానేవ మహీపతిః 28

వసిష్ఠమునీంద్రునియొక్క యుపదేశానుసారము ధర్మాత్ముఁడగు ఆ దశరథమహారాజు శ్రీరామచంద్రునితోసహామునులను, బ్రాహ్మణులను, రాజులను, ఆకాశచారులను క్రమముగ దానమానాదులచే బూజించెను మణిముక్తాసమూహములతోడను ధనముతోడను దివ్యపుష్పములతోడను మణిరత్నాదులదానముచేతను, ముత్యాలహారముల నర్పించుటచేతను, వినయ ప్రణమముచేతను, ధన, అన్న, ఆసన, పాన, సువర్ణ, భూమ్యాదుల దానముచేతను. ధూప, దీప, గంధమాల్యాదులతోడను, యథాప్రకారము వారినందఱిని అనిందితుఁడగు యాదశరథ మహారాజు అపుడు పూజించెను.

అథోత్తస్థౌ సభామధ్యాత్స్వభయా సహ మానదః
సవసిష్ఠాదిదేవర్షిః సాయమిన్దురివామ్బరాత్. 29

పిమ్మట మానప్రదుఁడగు ఆ దశరథమహారాజు సభాసదులతోడను, వసిష్ఠాది దేవర్షులతోడను, ఆ సభామధ్యమునుండి సాయంకాలమున ఆ కాశమునుండి చంద్రునివలె-లేచెను.

స సభోత్థానసమయః ససంరమ్భో వ్యరాజత
జానుదఘ్నసురోన్ముక్తపుష్పసంజాతకర్దమః. 30

మోఁకాటిలోఁతువఱకుగల దేవతలచే విడువఁబడిన పుష్పపరాగ, చందనాదుల పంకముతోగూడియున్నదియు, సంరంభ (త్వరితత్వ) యుక్తమైనదియునగు ఆసభయొక్క లేచు సమయము అపూర్వరూపముతో శోభించెను.

సంఘట్టాఘట్టకేయూరరత్న చూర్ణారుణావనిః
ఛిన్నహారస్ఫురన్ముక్తాతారాజితనిశామ్బరః. 31

మఱియు, ఆ సభయొక్క లేచుసమయము జనుల యొక్క పరస్పర ఘర్షణము చేతను, ఆఘాతముల చేతను చూర్ణములైన కేయూరాద్యాభరణములచే నెఱ్ఱనైనట్టి భూమి గలదియు, చిన్నభిన్నములైన హారములయొక్క ప్రకాశమానములైన ముత్తెములను నక్షత్రములతోఁగూడి సాయంకాలాకాశమును జయించుచున్నదియునై యొప్పుచుండెను.

దేవర్షి మునివిప్రేన్ద్రపార్థివస్పన్దసంకులః
వ్యగ్రభృత్యాఙ్గనాహస్తకేశచఞ్చలచామరః. 32

దేవర్షి, ముని, బ్రాహ్మణోత్తమ, రాజాదుల సంచలనముచే వ్యాప్తమై, వేగిరపాటుతోఁ గూడినభృత్యులయొక్కయు, స్త్రీలయొక్కయు చంచలహస్త, కేశాదులచే చామరయుక్తముగ నున్నట్లు తోచునదై, ఆ సభోత్థాన సమయము శోభించుచుండెను.

జ్ఞానప్రమేయీకరణస్పన్దమానో న దారుణః
శిరఃకరత్రినయనజిహ్వాక్షేవ విరాజితః. 33

ఆ సర్వజనులును వసిష్ఠమునీంద్రునిచే నుపదేశింపఁబడిన జ్ఞానమును మనసాదుల ద్వారా భూమికాక్రమమున అనుభవమొనర్చుకొనుటకే చలించుచుండిరిగాని స్వార్థత్వరితత్వముచే

గారు. కావుననే వారి యీ సంచలనము భయంకరముకానిదైయుండెను. ఒకవేళ యెపుడైన ఒకింత అవయవసంఘర్షణము సంభవించినను, పరస్పరక్షమాపణకొఱకై శిరస్సుపై చేతులు జోడించుకొనునట్టియు, ఎదుటను, ఇరుప్రక్కలను జూచుటకొఱకు ప్రవృత్తములైన నేత్రములును, క్షమాపణ వేడుకొనుటకొఱకుఁప్రవృత్తమైన జిహ్వయు గల్గియుండునట్టియు జనులచేతనే యీసభ విరాజిల్లుచుండెను.

పరస్పరమథాపృచ్ఛ్య పూజితాః పేశలోక్తయః.
రాజానో మునయశ్చైవ సర్వే దశరథాదయః. 34

స్వాశ్రమాన్బాంధవో జగ్ముస్తుష్టస్నిగ్ధాశయా మిథః
లోకసప్తకవాస్తవ్యా దేవాః శక్రపురాదివ. 35

తదుపరి, పరస్పరము పూజించుకొనినవారును, మృదుమధురభాషులును, పరస్పరగుణప్రశంసచే సంతుష్టమైనట్టియు, స్నేహయుక్తమైనట్టియు అంతఃకరణము గలవారునగు సప్తలోకవాస్తవ్యులైనట్టి దశరథాదిరాజులు. మునులు, సాధువులు - అందఱును పరస్పరము అజ్ఞగైకొని, ఇంద్రపురమునుండి దేవతలవలె, అయోధ్యనుండి తమతమ స్థానములకేగిరి.

అన్యోన్యం ప్రణయాత్సర్వే పూజయిత్వా యథాక్రమమ్
తద్విసృష్టా స్వమాగత్య గృహం చక్రుర్దినక్రియామ్. 36

ప్రేమతో యథాక్రమముగ పరస్పరము పూజించుకొని యీ జనులెల్లరును దశరథమహారాజుచే సాగనంపఁబడినవారై తమతమ గృహములకుబోయి దినకృత్యములఁ గావించుకొనిరి

అథ సర్వే వసిష్ఠాద్యాస్తథా దశరథాదయః
చక్రుర్దివసకార్యాణి రాజానో మునయస్తథా. 37

అనంతరము వసిష్ఠాది మునులున్ను, ఋషులున్ను. దశరథాది రాజులున్ను అందఱును దైనిక కార్యముల నాచరించిరి.

యథాప్రాప్తం క్రియాం తేషు కృతవత్స్వథ దైవసీమ్
క్రమేణాకాశపథికో భాస్కరోఽస్తముపాయయౌ. 38

జనుల యథాప్రాప్తములగు దివసకార్యములు సమాప్తములైనపిదప ఆకాశ పథికుఁడగుసూర్యభగవానుఁడు క్రమముగ అస్తాద్రిఁగ్రుంకెను,

తయైవ కథయా తేషాం రామస్య చ మహామతేః
ప్రబోధవశతః శీఘ్రం సా వ్యతీతాయ శర్వరీ. 39

వసిష్ఠప్రోక్తములగు యీ జ్ఞానకథలఁగూర్చి చింతించుచుండ, ఆ సర్వజనులకును, మహామతియగు శ్రీరామచంద్రునకును నాఁటిరాత్రి జాగరణముచే శీఘ్రముగ గడచిపోయెను.

ఉత్సారితతమఃపాంసుతారాకుసుమనిర్భరమ్
భువనం భవనీ కుర్వన్నాజగామ దివాకరః. 40

అపుడు, ప్రాతఃకాలమున గృహమును ఊడ్చువిధమున, తన కిరణములచే అంధకార మను ధూళికణములను, నక్షత్రములను, పుష్పసమూహమును దొలఁగించుటద్వారా జగత్తను గృహమును నిర్మల మొనర్చుచు సూర్యభగవానుఁడేతెంచెను.

కరవీరకుసుమాభైః కరైరరుణయన్ దిశః
వివేశ గగనామ్భోధిమథ బాలదివాకరః. 41

కరవీర (గన్నేరు) పుష్పములఁబోలిన కిరణములతో దిక్కులను రక్తవర్ణ యుతములుగఁ గావించుచు నపుడు బాలసూర్యుఁడాకాశమను సముద్రమునఁ బ్రవేశించెను.

రాజానో రాజపుత్రాశ్చ మన్త్రిణో మునయస్తథా
వసిష్ఠాద్యాః సమాజగ్ముః పునర్దాశరథీం సభామ్. 42

అత్తఱి రాజులు, రాజపుత్రులు, మంత్రులు, వసిష్ఠాదిమునులు మరల దశరథసభకు వేంచేసిరి.

యథాక్రమం యథాసంస్థం యథాదేశం యథాసనమ్
సా వివేశ సభా తత్ర ధిష్ణ్యశ్రీరమ్బరే యథా. 43

యథాయోగ్యములగు స్థాన, ఆసనములందు వెలసిన జనులతోఁగూడినదై, యథాక్రమ ముగ ఆ సభ, ఆకాశమందు నక్షత్రములవలె మరల యటఁ బ్రవేశించెను.

తతో దశరథాద్యేషు సుమన్త్రాదిషు వాప్యలమ్
వసిష్ఠం సం ప్రశంసత్సు మునిమాసనసంస్థితమ్. 44
వసిష్ఠస్య పితుశ్చాగ్రే రాజీవదలలోచనః
ఉవాచ రాఘవో ధీమాన్మృదువర్ణమిదం వచః. 45

అనంతరము, ఆసనముపై సమాసీనుఁడైన వసిష్ఠమునీంద్రుని దశరథాది రాజులున్ను, సుమంత్రాది మంత్రులున్ను లెస్సగఁ బ్రశంసించుచుండ నపుడు వసిష్ఠమునీంద్రుని యొక్కయు, తన తండ్రియొక్కయు నెదుట కమలనేత్రుఁడును ధీమంతుఁడునగు శ్రీరామచంద్రుఁడు కోమల వాక్కుతో నిట్లు పలికెను.

శ్రీరామ ఉవాచ:—

భగవన్సర్వధర్మజ్ఞ సర్వజ్ఞానమహార్ణవ
సర్వసందేహపరశో పరశోకభయాపహ. 46
శ్రోతవ్యమపరం కిం మే విద్యతే వేద్యమేవ వా
శ్రోతవ్యం విద్యతే యద్వా తత్సర్వం వక్తుమర్హసి. 47

శ్రీరాముఁడు:— సర్వధర్మజ్ఞుఁడవును, సర్వజ్ఞానమహాసముద్రుఁడవును, సమస్త సందేహములకు కుఠారము (గండగొడ్డలి) వంటివాఁడవును, సర్వజీవులయొక్క భయ, శోకములను వినాశమొనర్చువాఁడవునగు ఓ మహాత్మా! నాకింకను వినఁదగినదిగాని, ఎఱుఁగదగినదిగాని యేదైనయున్నచో దానినంతయు వచింపవేడెద.

శ్రీవసిష్ఠ ఉవాచ :—

రామ సంప్రాప్తబుద్ధిస్త్వం శ్రోతవ్యం తే న విద్యతే
కృతకృత్యా తవైషా ధీః ప్రాప్తప్రాప్యా స్థితాత్మని. 48

శ్రీ వసిష్ఠుఁడు:— ఓ రామచంద్రా! నీకిపుడు ఆత్మబుద్ధి సంప్రాప్తించినది; కావున నిఁక వినఁదగినదేదియును నీకులేదు. పొందఁదగిన వస్తువు (ఆత్మ)ను బొందినదియు కృతకృత్యమైనదియునగు నీ బుద్ధి యిపుడు స్వాత్మయందు నెలకొనియున్నది.

త్వమేవ తావత్కథయ ప్రవిచార్య ధియాత్మనా
కిద్భశోఽద్య భవానన్తః కిం శేషం శ్రావ్యమస్తి తే. 49

ఇపుడు నీవే స్వబుద్ధిచే విచారించి అంతఃకరణమున స్వానుభవముచే నీ వెట్టివాఁడవై యున్నావో, వినఁదగినదేది నీకింకను శేషించియున్నదో వచింపుము.

శ్రీరామ ఉవాచః—

బ్రహ్మన్నేవమహం మన్యే యథాహం కృతకృత్యధీః
నిర్వాణోఽస్మి ప్రశాన్తోఽస్మి నాకాఙ్క్షా మమ విద్యతే. 50

శ్రీరాముఁడు:— మహాత్మా! నన్ను నేనిపుడు కృతకృత్యునిగను పరమానంద యుక్తునిగను ప్రశాంతునిగను నమ్ముచున్నాను. నాకిఁక ఏ కోరికయునులేదు.

వక్తవ్యముక్తం భవతా జ్ఞాతం జ్ఞేయం మయాఖిలమ్
తవ విశ్రాన్తిమాయాతు కృతకృత్యా సరస్వతీ. 51

మునీంద్రా! చెప్పఁదగిన దంతయును తాము చెప్పితిరి; (దానిననుసరించి) ఎఱుఁగఁ దగినదంతయును నేనెఱిఁగితిని; కావున కృతకృత్య (సఫల)మైనట్టి తమ వాక్కు ఇఁక విశ్రాంతిని బొందుగాక!

అధిగతమధిగమ్యం జ్ఞేయమాప్తం మయేదం
విగతమఖిలమైక్యం ద్వైతమస్తం ప్రయాతమ్
పరిగళితమశేషం దృశ్యభేదావభానం
నను నిపుణమపాస్తాశేషసంసారితాస్థాః. 52

ఇత్యార్షే శ్రీ వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే ఉత్తరార్ధే నిర్వాణవర్ణనం నామ త్ర్యధికద్విశతతమః సర్గః ॥ 208 ॥

ఓ మునీంద్రా! పొందఁదగినట్టి (బ్రహ్మ) వస్తువును నేను బొందితిని. జగత్తుయొక్క బ్రహ్మైకరసత్వమును బాగుగ నెఱిఁగితిని; జీవబ్రహ్మ భేదరూపమగు ద్వైతము నాకు నశించినది, దృశ్య భేదముయొక్క స్ఫురణము పూర్ణముగ విలీనమైపోయినది; ఏలయనిన, నేను బాగుగ విచారించి సంసారమందలి సత్యత్వబుద్ధిని విడనాడితిని

ఇది శ్రీవాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు నిర్వాణప్రకరణమున నుత్తరార్థమున నిర్వాణవర్ణనమను రెండువందలమూఁడవ సర్గము ॥ 208 ॥

## చతురధికద్విశతతమః సర్గః

[నిష్కృష్టయుక్త్యా భూయోఽత్ర దృశ్యం చితి విమార్జ్యతే
వసిష్ఠేన చ రామేణ చిదాత్మపరిశుద్ధయే.

చిదాత్మపరిశుద్ధి స్థాపనకొఱకు వసిష్ఠమునీంద్రుఁడును, శ్రీరామచంద్రుఁడును మరల ఉత్తమ యుక్తులద్వారా చైతన్యమున దృశ్యమును తుడిచివేయుట యిచటఁ గాననగును.]

**శ్రీ వసిష్ఠ ఉవాచ :—**

భూయ ఏవ మహాబాహో శృణు మే పరమం వచః
ఆదరోఽ రాజతేఽత్యర్థం పౌనఃపున్యేన మార్జితః. 1

శ్రీవసిష్ఠుఁడు:— గొప్ప బాహువులుగల ఓ రామచంద్రా! ఈ నా యుత్తమ వచనములను నీవు మరల వినుము. ఏలయనిన, మరల మరల తుడుచుటచే అద్దము అధికముగఁ బ్రకాశించునుగదా!

అర్థో వేదనసంకేతః శబ్దో జలరవోపమః
దృశ్యమేతచ్చిదాభానం స్వప్నవత్కాస్త్యథవజ్జగత్. 2

ఓ రామచంద్రా! రూప (పదార్థ) నామములని దృశ్యము రెండువిధములు. ఒకే పదార్థమందు జాతి, గుణ, క్రియా, సంస్థానములను నాల్గును శబ్దభేద ప్రవృత్తిచేఁ గల్పింపఁబడినవై భ్రాంతివేదన సంకేతములే యగునుగాని వాస్తవములుకావు. ఇట్లే నాల్గున్ను భ్రమరూపములే యగుటచే రూపము (పదార్థము) వాస్తవముగ లేకయేయున్నది. ఎపుడు అర్థము (పదార్థము) లేకయున్నదో, అపుడు నిరర్థకమైన శబ్దము (నామము) జలధ్వనివలె వ్యర్థమయి, తన నామత్వమును త్యజించుచు అర్థత్వమునే బొందినదై, అర్థాని నిషేధముచే తానును దొలఁగుచున్నది. ఈ ప్రకారముగ ఈ రెండు విధములగు దృశ్యములున్ను వాస్తవముగలేనిదై, చైతన్యముయొక్క ఆభాసమాత్రమే యగుచు స్వప్నమువలె వర్తించుచున్నది. కావున నిఁక జగత్తెచట?

జాగ్రద్వై స్వప్న సందృష్టః స్మరణాత్మ స్థితం పురః
సంవిద్వేదనమాత్రం సత్తదన్యాకారవత్తతమ్. 3

ఎపుడు జాగ్రత్తే మిథ్యయైయున్నదో, అపుడు స్వప్నమున్ను జాగ్రత్సంస్కారముచే నేర్పడుటచే మిథ్యయేయైయున్నది. అట (స్వప్నమున) స్మరణమువలె పదార్థ శూన్యమగు ఆత్మయే నెదుట గన్పించుచున్నదగును. కావున చిద్రూపమగు ఆత్మయే అన్యపదార్థాకారముగ నటు వ్యాపించియున్నది. ఈ ప్రకారముగ చైతన్యమున కన్యముగ నచటను నొకించైనను లేకయేయున్నది.

యథాచ్ఛం సంవిదాకాశం మయి స్వప్న పురాత్మకమ్
సరూపమపి నీరూపం తథేదం భువనత్రయమ్. 4

ప్రత్యగాత్మయందు స్వప్ననగరాదులెట్లు నిర్మలచిదాకాశమాత్రమే అయియున్నవో, అట్లే యీ ముల్లోకములున్ను రూపసహితములుగ భాసించుచున్నను, వాస్తవముగ రూపరహితమగు చిన్మాత్రమే అయియున్నవి.

**శ్రీరామ ఉవాచ:—**

సంపన్నేయం కథం భూమిః సంపన్నా గిరయః కథమ్
కథం సంపన్నమమ్బుశ్చ సంపన్నా ఉపలాః కథమ్. 5

కథంచ తేజః సంపన్నం సంపన్నా చ కథం క్రియా
కథం చ కాలః సంపన్నః సంపన్నః పవనః కథమ్. 6

కథం చ శూన్యం సంపన్నం సంపన్నం చిన్నభః కథమ్
ఇతి జ్ఞాతం మయా భూయో బోధాయ వద మే ప్రభో. 7

శ్రీరాముఁడు:— మహాత్మా! చైతన్యమున జడత్వమున్ను, ఈ భూమ్యాదివైచిత్ర్యమున్ను నెట్లేర్పడినవి? ఈ పర్వతములు, జలము, శిలలు, అగ్ని, క్రియ, కాలము, వాయువు, శూన్యము, చిత్తాకాశము మున్నగునవి చైతన్యమున నెట్లు సంభవించినవి? ఈ విషయములన్నియును పూర్వము తమ యుపదేశముచే నేనెఱిఁగి యున్నప్పటికిని, అసంభావన నశించుట కొఱకును, బోధాభివృద్ధి కొఱకును మరల వచింపవేఁడెద.

**శ్రీ వసిష్ఠ ఉవాచ :—**

బ్రూహి రాఘవ తత్త్వేన స్వప్నదృష్టమహాపురే
సంపన్నా భూః కథమిహ సంపన్నం కథమమ్బరమ్. 8

కథం వారి చ సంపన్నం సంపన్నా ఉపలాః కథమ్
కథం చ తేజః సంపన్నం సంపన్నాశ్చ కథం దిశః. 9

సంపన్నశ్చ కథం కాలః సంపన్నా చ కథం క్రియా
కథమేతన్నిమిత్తాది సర్వం సంపన్న ముచ్యతామ్. 10

కేనేదం నిర్మితం దగ్ధమానీతం రచితం చితమ్
ఉత్పాదితం ప్రకటితం కిమాధారం కిమాత్మకమ్. 11

శ్రీ వసిష్ఠుఁడు:— ఓ రామచంద్రా! స్వప్నమందుఁ గాంచఁబడిన మహానగరమున పృథివి, ఆకాశము, జలము, శిలలు, అగ్ని, దిక్కులు, కాలము, క్రియ, కార్యకారణ వ్యవహారము, ఇత్యాది సమస్తమున్ను నెట్లేర్పడినవో నిజముగఁ జెప్పుము? అచట దానినంతయు నెవరు నిర్మించిరి? దగ్ధమొనర్చిరి? తీసికొనివచ్చిరి? రచించిరి ప్రకాశయుక్తముగఁ గావించిరి? ఉత్పన్నముచేసిరి? ఆ స్వప్నముయొక్క యాధారమేమి? అందలి నగరాదులయొక్క స్వరూపమెట్టిది?

**శ్రీరామ ఉవాచ :—**

ఆత్మాస్య కేవలం వ్యోమ న సద్భూమ్యచలాదికమ్
జగతః స్వప్నరూపస్య నిరాకారో నిరాస్పదః. 12

శ్రీరాముఁడు:— మహాత్మా! స్వప్నరూపమగు ఈ జగత్తుయొక్క స్వరూపము కేవలము నిరాకారమై, నిరాశ్రయమైనట్టి చిదాకాశమే అయియున్నది. ఈ భూమి, పర్వతాదు లన్నియును సత్యములుకావు,

ఆత్మైవ వ్యోమరూపోఽస్య నిరాధారో నిరాకృతిః
వినాకృతేర్వా వ్యోమ్నోఽస్య కిమాధారేణ కారణమ్. 13

నిరాధారమై, నిరాకారమైనట్టి చిదాకాశమే యీ జగత్తుయొక్క స్వరూపమైయున్నది. నిరాకారమైనట్టి చిదాకాశమునకు మఱియొక ఆధారముయొక్క యావశ్యకతలేదు.

న కించిదేతత్సంపన్నం సద్యత్త్రైతన్న సంవిదః
ఏతచ్చిత్కచనం నామ మన ఏవ తథాస్థితమ్. 14

ఈ దృశ్యజగత్తు వాస్తవముగ నొకింతైననులేదు. ఈ జగదాకారమగు చైతన్య స్ఫురణము స్వప్నమువలె మనస్సే యావిధముగ స్థితినొందియున్నదగునుగాని మఱియొకటికాదు.

దిక్కాలాద్యత చిద్భానం చిద్భానమచలాదికమ్
చిజ్జలాది తథా బోధాచిత్త్వం వాయ్వాది తద్విదః. 15

తత్త్వవేత్తలకు జ్ఞానముచే నిట నీ దిక్కాలాదులున్ను, పర్వతాదులున్ను, జల వాయ్వాదులున్ను, అన్నియును చైతన్యముయొక్క స్ఫురణమాత్రములుగనే గోచరించును.

సంవిదేవ కిల వ్యోమ తిష్ఠతి వ్యోమతామితా
దృషత్త్వయాస్తే కాఠిన్యాద్ద్రవాజ్జలమివ స్థితా. 16

చైతన్యమే శూన్యరూపమును బొందినదై యాకాశముగను, కాఠిన్యరూపమును బొందినదై శిలగను, ద్రవరూపమును బొందినదై జలముగను వర్తించుచున్నది.

వస్తుతస్తు న భూమ్యాది కించిత్తన్న చ దృశ్యతా
చిదాకాశమనన్తం తత్సర్వమేకం తదాత్మకమ్. 17

వాస్తవముగ భూమ్యాదులుగాని, దృశ్యరూపత్వముగాని యొకింతైనను లేవు. అది యంతయును అనంతమై, ఏకమైనట్టి చిదాకాశమే తద్రూపముగ వర్తించుచున్నదగును

ద్రవత్వాదమ్బుపూర్వాద్యైర్భ్నానావృత్తితయా యథా
అనానైవ భవేన్నానా చిద్వ్యోమాత్మని వై తథా. 18

ఏకరూపమేయైయున్నను నిర్మలసముద్రము యొక్క జలము ద్రవత్వమువలన తరంగ, ఫేన (నురుగు) ఆవర్తాది నానారూపములుగ భాసించునట్లు, చిదాకాశమున్ను ఏకరూపమేయై యున్నను తనయందే జగదాది నానారూపములుగ భాసించుచున్నది.

కాఠిన్య వేదనాదుర్వీ గిరితామాగతేవ చిత్
శూన్యతావేదనాచ్ఛూన్యం వేత్తి వ్యోమేవ చిద్వపుః. 19

ద్రవత్వవేనాద్వేత్తి వారిస్పన్దతయానిలమ్
ఔష్ణ్యం సంవిత్తతో వహ్నిమత్యజస్త్రీనిజం వపుః. 20

చైతన్యము తన పారమార్థిక చిద్రూపమును త్యజింపకయే కాఠిన్యమును గూర్చిన యనుభవముచే తన్ను పృథివీ, పర్వతరూపములుగను, శూన్యత్వమునుగూర్చిన యనుభవముచే ఆకాశ

రూపముగను ద్రవత్వమునుగూర్చిన యనుభవముచే జలముగను, స్పందత్వముయొక్క యనుభవముచే వాయువుగను, ఉష్ణత్వమునుగూర్చిన యనుభవముచే అగ్నిగను నెఱుఁగుచున్నది

ఏవం స్వభావ ఏవాయం చిద్ధాతుర్గగనాత్మకః
యదేవం నామకచతి నిష్కారణ గుణక్రమమ్. 21

ఇట్లు నిష్కారణముగనే నామరూపములతో స్ఫురించుట చిదాకాశముయొక్క స్వభావమే అయియున్నది.

నచైతద్వ్యతిరేకేణ కించిన్నానేహ విద్యతే
అన్యచ్ఛూన్యత్వవారిభ్యామృతే ఖార్ణవయోరివ 22

జలముకంటె వేఱుగ సముద్రమునకు మఱియొక రూపమెట్లులేదో, శూన్యత్వముకంటె వేఱుగ ఆకాశమునకు మఱియొక రూపమెట్లులేదో, అట్లే చిదాత్మకంటె వేఱుగ జగత్తునకు వేఱొక రూపమొకింతైనను లేదు.

న తు చిద్గగనాదన్యన్న సంభవతి కించన
ఇదం త్వమహమిత్యాది తస్మాదాశాన్తమాస్యతామ్. 23

'ఇది, నీవు, నేను' ఇత్యాది రూపమగు జగత్తంతయును చిదాకాశముకంటె వేఱుగ నొకింతైనను సంభవింపనేరదు కాఁబట్టి సర్వులును నట్టి చిదాకాశరూపముతో ప్రశాంతముగ వెలయుదురు గాక !

త్వం యథాస్మిన్ గృహేకుర్వన్నగ్నిశైలాదికాం విదమ్
తదేవ పశ్యస్య వపురేవం చిద్గగనం తథా. 24

స్వప్నమందు తాము నిరాకారరూపులైనను, అగ్ని, శైలాదులను రచించుచు తత్సంబంధ క్రియలనెట్లు గావించుచునున్నారో, అట్లే నిరాకారమైనను చిదాకాశము జాగ్రత్తునందును అగ్ని, పర్వతాదులఁగూర్చిన దర్శన స్పర్శనాది క్రియలఁ గావించుచునున్నవి.

చిద్వ్యోమ భాతి దేహాభం సర్గాదౌ నతు దేహకః
అకారణత్వాదసతశ్చిదుదేతీతి చిన్త్యతామ్. 25

స్వప్నమందు దేహములేకున్నను చైతన్యము దేహాకారమువలె ప్రకటమగునట్లు సృష్ట్యాదియందును చిదాకాశము జగదాకారమువలె నుదయించుచున్నది. కాని వాస్తవముగ నది జగదాకారముకాదు. జగత్తునకు కారణము లేనందుచే అజ్ఞానము వలననే చైతన్యము జగదాకారముగ నుదయించుచున్నదగునని విజ్ఞులు చింతింపవలయును.

మనోబుద్ధిరహంకారో భూతాని గిరయో దిశః
శిలాజఠరవన్మౌనమయం సర్వం యథాస్థితమ్. 26

మనోబుద్ధి చిత్తాహంకారములున్ను, పంచభూతములున్ను, పర్వత, దిగాదులున్ను, యథాస్థితియగు ఈ సమస్త ప్రపంచమున్ను శిలాగర్భమువలె మౌనమయమై, అనిర్వాచ్యమైనట్టి చిదాకాశమే అయియున్నది.

ఏవం న కించిదుత్పన్నం నష్టం న చ న కించన
యథాస్థితం జగద్రూపం చిద్బ్రహ్మాత్మని తిష్ఠతి. 27

ఈ ప్రకారముగ వాస్తవముగ నిట నొకింతైనను ఉత్పన్నముకాలేదు, నశింపలేదు యథారీతి స్థితిగల్గియున్న యీ జగద్రూపమంతయును చిద్బ్రహ్మాత్మయందు సద్బ్రహ్మరూపముగనే వెలయుచున్నది.

చితౌ యత్కచనం నామ స్వరూపప్రవిజృమ్భణమ్
తదేతజ్జగదిత్యుక్తం ద్రవ ఏవ యథా జలమ్. 28

చైతన్యమందు జగత్స్వరూపముయొక్క స్ఫురణమేదిగలదో, అది చిత్స్వరూపము యొక్కయే విజృంభణమైయున్నది. అట్టి చైతన్యముయొక్క విజృంభణమే జగత్తని చెప్పఁబడు చున్నది. కావున ద్రవము జలరూపమే యగునట్లు జగత్తు చిద్రూపమే అయియున్నది.

ఇదం జగద్భానమభానమేవ చిద్వ్యోమ శూన్యం పరమార్థ ఏవ
యథార్థసందర్శనబుద్ధబుద్ధే రబుద్ధబుద్ధేస్తు యథా తథాస్తు. 29

ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకీయేదేవదూతోక్తే మోక్షోపాయేషు
నిర్వాణప్రకరణే ఉత్తరార్ధే చిదాకాశైకతాప్రతిపాదనం నామ
చతురధికద్విశతతమః సర్గః ॥ 204 ॥

ఓ మునీంద్రా! యథార్థసందర్శనముగల జ్ఞానియొక్క దృష్టియం దీజగత్తు భాసించు చున్నను భాసింపనిదే యగును. ఇయ్యది యాతనికి దృశ్యశూన్యముగు పరమార్థ చిదాకాశముగనే గోచరించును. అజ్ఞానదృష్టియందిది యెట్లుండునో అట్లే యుండుగాక! దానిఁగూర్చిన విచారణచే మన కేప్రయోజనమున్ను లేదు.

ఇది శ్రీవాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున నుత్తరార్ధమున
చిదాకాశైకతా ప్రతిపాదనమను రెండువందల నాల్గవ సర్గము ॥ 204 ॥

---

## పఞ్చాధికద్విశతతమః సర్గః

[వివర్తమాత్రరూపేయం స్వప్నతుల్యా జగత్స్థితిః
నోద్భూతా న స్థితా నాస్తా చిన్మాత్రమితి వర్ణ్యతే.

ఈ జగత్స్థితి స్వప్నమువలె వివర్తమాత్రరూపమై ఎపుడును నుద్భవింపకయు, స్థితి నొందకయు నశింపకయునున్నదై చిన్మాత్రముగనే వెలయుచున్నదను విషయమిచట వర్ణింపఁబడు చున్నది.]

**శ్రీరామ ఉవాచ:—**

ఏవం యథైతద్భగవన్స్వప్నే దృశ్యం పరం నభః
తథైవ జాగ్రతీత్యత్ర నచేత్పందేహజాలికా. 1

శ్రీరాముఁడు:— మహాత్మా! సంశయసమూహము లేకున్నచో స్వప్నమందు దృశ్య మెట్లు చిదాకాశమైయున్నదో, అట్లే యిట జాగ్రత్తునందును దృశ్యము చిదాకాశమే అయియుండుట సంభవించుచున్నది. [కాని, నాకు సంశయము గలదని భావము.]

కథం మే భగవన్బ్రూహి మహాప్రశ్నమనుత్తమమ్
కథం భవత్యదేహాచ్చిజ్జాగ్రత్స్వప్నే స్వదేహవత్. 2

మహాత్మా! దేహరహితమై, కూటస్థమై, అద్వయమైనట్టి చిన్మాత్రము జాగ్రత్స్వప్నములందు దేహయుక్తముగ నెట్లగుచున్నది? అను నీ యుత్తమ మహాప్రశ్నకు సమాధానమొసంగ ప్రార్థన.

శ్రీ వసిష్ఠ ఉవాచః—

దృశ్యం జాగ్రత్యథ స్వప్నే భాదారం భాత్మకం భదమ్
ఖం చ నాన్యత్పరం జాతు సందేహోఽస్త్యుపపత్తితః. 3

శ్రీవసిష్ఠుఁడు:— ఓ రామచంద్రా! ఈ దృశ్యము జాగ్రత్స్వప్నములందును కారణరహితమై యుత్పన్నమగుచున్నది. కావున శూన్యమే యాధారముగాఁగలదై, శూన్యరూపమే యైయున్నది. ఆ శూన్యమున కాధారమో, పరబ్రహ్మమేకాని మఱియొకటికాదు. కావున నట్టి జగద్రూప వివర్తమువలన బ్రహ్మముయొక్క అద్వైతత్వమున కేహానియును లేదు.

సమస్తకారణాకారపత్యస్తమయరూపిణి
సర్గాదావేవ భూతాని సంభవన్తి న కానిచిత్. 4
పృథ్వ్యాదినియతస్తేన దేహోఽయం నాస్తి కించన
భూతాన్యేవ కిలైతాని దేహస్తాని న సన్త్యలమ్. 5

సమస్త కారణములయొక్కయు అభావముచే సృష్ట్యాదియందు పంచభూతము లెవ్వియును సంభవింపనేరవు. పృథ్వ్యాదులెపుడులేవో, అపుడే దేహాదులున్ను పంచభూతమయములేగావున నొకింతైనను లేనివేయగును.

తేన స్వప్నవదాభాస మిదం పశ్యతి చిన్నభః
స్వరూపమాత్రకచనమాకారవదివాకులమ్. 6

కావున చిదాకాశమే, స్వస్వరూప మాత్రము యొక్క స్ఫురణమున్ను మాయాగుణముచే ఆకారవంతముగ విక్షుబ్ధమైనదియునగు యీ జగత్తుయొక్క ఆభాసమును స్వప్నమువలె తనయందు గాంచుచున్నది.

భానమాభానమాత్రత్వమిదం యత్తచ్చిదాత్మనా
నభసా స్వప్న శబ్దేన కథ్యతే జగదాకృతిః. 7

చిదాకాశముయొక్క ఆభాసమే (స్ఫురణమే) స్వప్నముయొక్క భానమైయున్నది. అట్టి జగదాకారమగు చిదాకాశముయొక్క ఆభాసమే స్వప్న వివర్త, జగదాది శబ్దములచేఁ జెప్పఁబడుచున్నది.

యదేతద్వేదనం నామ చిద్వ్యోమ్నో వ్యోమనిర్మలమ్
ఏతద న్తస్థితో రూపం స్వప్నో జగదితి స్థితమ్. 8

చిదాకాశమందు సూక్ష్మరూపముగ భాసించు జగత్తుయొక్క రూపము స్వప్నమనియు స్థూలరూపముగ భాసించు జగత్తుయొక్క రూపము జాగ్రత్తనియుఁ జెప్పఁబడుచున్నది. వాస్తవముగ నారెండును నిర్మలచిదాకాశరూపములే యైయున్నవి

ఏతస్మిన్నేవ తేనాథ స్వభావకచనే తతే
చిద్రూపేణ కృతాః సంజ్ఞాః పృథక్పృథ్వ్యాదికా ఇమాః. 9

ఇట్టి వ్యాప్తమగు చిత్స్వభావస్ఫురణమందు అటుపిమ్మట ఆ చిద్రూపమే యీపృథ్వ్యాది భిన్నభిన్న నామములను గల్పించెను.

చిద్భానమేవ తత్స్వప్న జగచ్ఛబ్దైః ప్రకథ్యతే
భానం చాస్యాః స్వభావః ఖం తత్కదాచిన్న శామ్యతి. 10

ఈ ప్రకారముగ చిత్స్వరూపముయొక్క స్ఫురణమే స్వప్న, జగదాది (జాగ్రదాది) శబ్దములచేఁ జెప్పఁబడుచున్నది. అట్టి స్ఫురణము అధిష్ఠానస్థితిచే ఆ చైతన్యముయొక్క స్వభావమే అయియున్నది. స్వప్న, జగదాదులు నశించినను ఆ చిదాకాశ మెన్నఁడును నశింపకయే యుండును.

బహ్వ్యః సర్గదృశో భిన్నా బ్రహ్మైవ బ్రహ్మఖే చ తాః
శూన్యతా నభసీ వాత స్తిష్ఠన్తి చ ఏతన్తి చ. 11

శూన్యత్వము ఆకాశమందు వర్తించునట్లు, బ్రహ్మరూపములేయగు అనేక భిన్నభిన్న సృష్టులు ఆ బ్రహ్మాకాశమున స్థితిగల్గియు, ప్రవేశించుచును నున్నవి.

శ్రీరామ ఉవాచః —

సర్గణాం కోటయః ప్రోక్తా భగవన్భవతా కిల
కాశ్చిద్బ్రహ్మాణ్డకోశస్థాః కాశ్చిదణ్డవివర్జితాః. 12

కాశ్చిన్మహీకోశగతాః కాశ్చిదాకాశసంస్థితాః
తేజఃకోశగతాః కాశ్చిత్కాశ్చిత్పవనకోశగాః. 13

కాశ్చిద్వ్యోమస్థభూపీఠా ఊర్ధ్వాధస్థవినిశ్చయాః
బద్ధాకాశా దూర్ధ్వఖురా లమ్బమానవనాచలాః. 14

కాశ్చిద్వాతాత్మభూతౌఘాః కాశ్చిన్నిష్క్రియం తమోధరాః
వ్యోమసంస్థానకాః కాశ్చిక్కాశ్చిత్క్రిమికులాకులాః. 15

కాశ్చిదాకాశకోశస్థాః కాశ్చిచ్ఛిలాకోశగాః
కాశ్చిత్పఙ్కకోశస్థాః కాశ్చిత్తే ఖగవత్స్థితాః. 16

శ్రీరాముడు:— మహాత్మా! పూర్వము తామనేక కోట్లవిధములైన సృష్టుల(గూర్చి (లీలోపాఖ్యాన, భుశుండోపాఖ్యానాదులందు) వచించియుంటిరి. అందు(గొన్ని బ్రహ్మాండకోశమందు గలవియు, కొన్ని బ్రహ్మాండవర్జితములును (మానసికములును), కొన్ని భూకోశమందున్నవియు, కొన్ని యాకాశమందు వర్తించునవియు, కొన్ని తేజఃకోశమందు వెలయునవియు, కొన్ని వాయుకోశమందుండునవియు, కొన్ని యాకాశమందు వర్తించు గోళాకారములైన భూపీఠములు గలవై యందు జీవులవలె నూర్ధ్వాధోభాగములందు మేమూర్ధ్వమున నున్నారము, మేమూర్ధ్వమున నున్నారము, అను నీప్రకారములగు వివిధనిశ్చయములుగల దేవాసురులతో(గూడియున్నవియు, కావుననే భూమిమూలాకాశమునుండి యూర్ధ్వప్రదేశమున పాదములును, అధోదేశమున శిరస్సును గల్గి వ్రేలాడుచున్న భూమియొక్క యధోభాగమందలి వనపర్వతాదులుగలవియు, కొన్ని వాయుమయ శరీరులగు ప్రాణిసమూహములు గలవియు, కొన్ని క్రిమిసమూహములచే( బూర్ణములైయున్నవియు, కొన్ని యాకాశకోశమందు గలవియు, కొన్ని సదా అంధకారముచే వ్యాప్తములైయున్నవియు, కొన్ని యాకాశమే ప్రాణుల నివాసస్థానముగ(గలవియు కొన్ని శిలాకోశమున వర్తించునవియు, కొన్ని గృహమండపాదులందుండునవియు, కొన్ని యాకాశమున( బక్షులవలె స్థితిగల్గియుండునవియునై యొప్పుచున్నవిగదా!

> తాసాం మధ్యే యథాహీదం బ్రహ్మాణ్డం యాదృశం స్థితమ్
> అస్మాకం భగవంస్తన్మే బ్రూహి తత్త్వవిదాం వర. 17

తత్త్వవేత్తలలో శ్రేష్ఠు(డవగు ఓ మునీంద్రా! ఆ సృష్టులన్నిటి మధ్య ఈ మన బ్రహ్మాండమేరీతి స్థితి గల్గియున్నదో తెలుపప్రార్థన

**శ్రీ వసిష్ఠ ఉవాచ :—**

> యదపూర్వమదృష్టం వా నానుభూతం న వా శ్రుతమ్
> తద్వర్ణ్యతే సుదృష్టాన్తైర్గృహ్యతేతే చ తదూహ్యతే. 18

శ్రీవసిష్ఠుడు:— ఓ రామచంద్రా! ఎయ్యది అపూర్వమై, అదృష్టమై, ఇంద్రియాదులచే అనుభూతముకానిదై, విన(బడనిదై (ప్రత్యక్ష, అనుమాన, ఆగమాదిప్రమాణముల కతీతమై)యున్నదో అట్టి బ్రహ్మవస్తువే యుత్తమదృష్టాంతములద్వారా గురువుచే వర్ణింప(బడుచు, శిష్యునిచే శ్రవణ, మననాదులద్వారా గ్రహింప(బడుచు, చింతింప(బడుచున్నదిగాని మఱియొకటి కాదు

> ఇదం తు రామ బ్రహ్మాణ్డమాగమైర్మునిభిః సురైః
> శతశో వర్ణితం తచ్చ జ్ఞాతమేతత్త్వయాఽఖిలమ్. 19

ఓ రామచంద్రా! ఈ బ్రహ్మాండము జ్యోతిషాది శాస్త్రములచేతను, మునులచేతను, దేవతలచేతను అనేకవిధములుగ వర్ణింప(బడియున్నది దానినంతయు నీవెఱిగియేయున్నావు.

> యథేదం భవతా జ్ఞాతమాగమైర్వర్ణితం యథా
> స్థితం తదేతదఖిలం కిమన్యదిహ వర్ణ్యతే. 20

ఈ బ్రహ్మాండమేప్రకారము స్థితిగల్గియున్నదో, దానినంతయు నీవు శాస్త్రాదులద్వారా బాగుగ నెఱిగియేయున్నావు కావున దానిగూర్చి యిక నేమి వర్ణింపవలయును? (దానినే మరల వర్ణించుట నిరుపయోగమున్ను, అయుక్తమున్ను నని భావము.)

శ్రీరామ ఉవాచ :—

కథమేతద్వద బ్రహ్మన్సంపన్నం చిన్మహానభః
కియత్ప్రమాణమేతద్వా కియత్కాలం చ వా స్థితమ్. 21

శ్రీరాముఁడు:— మహాత్మా! అయితే చిదాకాశరూపమగు బ్రహ్మము బ్రహ్మాండాకారముగ నెట్లయినదో, దాని పరిమాణమెంతయో, ఎంతకాలమువఱకది యాప్రకారముగనుండునో వచింపవేడెద.

శ్రీవసిష్ఠ ఉవాచ :—

అనాదినిధనం బ్రహ్మ నిత్యమస్త్యేతదవ్యయమ్
ఆదిమధ్యాన్తతా నాస్తినాకారాః పరమాత్మ్బరే. 22

శ్రీవసిష్ఠుఁడు :—ఓ రామచంద్రా! బ్రహ్మము ఆదిమధ్యాంతరహితమై, నిత్యమై, అవ్యయమై యున్నది. అట్టి బ్రహ్మరూపమగు పరమాకాశమున ఆదిమధ్యాంతములుగాని. ఆకారములుగాని యేవియునులేవు.

బ్రహ్మాకాశ మనాద్యన్తమేతదవ్యయమాతతమ్
ఏతన్మయమిదం విశ్వం విష్వదాద్యన్తవర్జితమ్. 23

బ్రహ్మాకాశము అనాదియై, అనంతమై, అవ్యయమై, సర్వవ్యాపకమైయున్నది. ఈ జగత్తున్ను బ్రహ్మమయమైయెప్పుడు నట్లే ఆద్యంత వర్జితమై, సర్వవ్యాపకమై వెలయుచున్నది.

పరమస్యాస్య చిద్వ్యోమ్నః స్వయం యద్భానమాత్మని
తదేతద్విశ్వ మిత్యుక్తం స్వయం తేనైవ తన్మృషా. 24

ఈ పరమచిదాకాశముయొక్క తనయందలి స్ఫురణమేదిగలదో, అద్దాని నదియే స్వయముగ జగత్తనిపేర్కొనినది. ఆజగత్తే మిథ్యయైయున్నది.

పురుషస్య యథా స్వప్నపురసందర్శనం తథా
తత్తస్య భానం పురవత్తదిదం విశ్వముచ్యతే. 25

మనుజునకు స్వప్నమున పురసందర్శనమెయ్యది కలుగుచున్నదో, అట్టి స్వప్నపురము వంటిదైయైన, చైతన్యముయొక్క స్ఫురణమే యీ జగత్తని చెప్పఁబడుచున్నది.

కఠినా నేహ గిరయో న ద్రవ్యాణి జలాని చ
న శూన్యమేతదాకాశం కాలో న కలనాత్మకః. 26

చిదేకస్వభావమగు బ్రహ్మమున పర్వతాదులు కఠినములుకావు, జలముద్రవరూపము కాదు; ఆకాశము శూన్యముకాదు; కాలము కల్పనామయముకాదు. (చిదేకస్వభావమగు బ్రహ్మమున తద్విరుద్ధములైన కాఠిన్యాది స్వభావములు లేవని భావము.)

యద్యథా భావ్యయం యత్ర స్వతః సంచేతితం చితా
తత్తథా తత్ర చిత్తత్త్వే అలం శైలాదివత్స్థితమ్. 27

మాయాశబలితమగు అవ్యయమైన చైతన్యము తనయందు స్వతః యేపదార్థము నెచట నెట్లెఱుఁగుచున్నదో, ఆపదార్థమచట ఆ ప్రకారముగనే లెస్సగ పర్వతాదిరూపములుగ స్థితినొంది యున్నదగుచున్నది.

అశిలైవ శిలాస్వప్నే నభ ఏవానభో యథా
భవేత్తథేహ సర్గాది స్వప్నే దృశ్యస్థితిశ్చితా. 28

చైతన్యము శిలా ఆకాశములుకాకున్నను స్వప్నమునయెట్లు, శిలా, ఆకాశరూపములగుచున్నదో, అట్లే జాగ్రత్తునందును చైతన్యము దృశ్యజగద్రూపమగుచున్నది.

అనాకారైవ చిచ్ఛాన్తా స్వప్నవద్యత్స్వచేతనమ్
వేత్తి తజ్జగదిత్యుక్తం తచ్చానాకారమేవ సత్. 29

నిరాకారమై, శాంతమైనట్టి చైతన్యము స్వప్నమువంటి యేనిజస్ఫురణము నెఱుఁగుచున్నదో అదియే జగత్తని చెప్పఁబడుచున్నది కావున నదియు వాస్తవముగ చైతన్యమువలె నిరాకారమై, సద్రూపమైయే యొప్పుచున్నది. ఇవ్విషయమును నేననేక పర్యాయము లిదివఱలో, జెప్పియుంటిని.

వాయోః స్పన్దో యథాన్తస్థో వాత ఏవ నిరన్తరః
తథేదం బ్రహ్మణి బ్రహ్మ న చోదేతి న శామ్యతి. 30

వాయువుయొక్క స్పందము (చలనము) వాయువునందున్నదై సదా వాయురూపమేయై యున్నట్లు, బ్రహ్మమందీజగత్తు బ్రహ్మరూపముగనే యున్నదై, యెన్నఁడును ఉదయింపకయు, అస్తమింపకయు వెలయుచున్నది.

ద్రవత్వమమ్బుని యథా శూన్యత్వం నభసో యథా
యథా వస్తుని వస్తుత్వం బ్రహ్మణీదం జగత్తథా. 31

జలమందు ద్రవత్వము, ఆకాశమున శూన్యత్వము, వస్తువునందు వస్తుత్వము, ఎట్లు గలవో, అట్లే బ్రహ్మమందు జగత్తున్ను గలదు.

న ప్రయాతం న వా యాతమకారణమకారణాత్
న చ నాస్తి న వాస్తీదం భిన్నం బ్రహ్మపదే జగత్. 32

కారణరహితమగు బ్రహ్మమునుండి, కారణముయొక్క అభావమువలన, ఈ జగత్తు సృష్టికాలమున ఆవిర్భవించుటలేదు, ప్రళయకాలమున నశించుటలేదు మఱియు బ్రహ్మపదమున నియ్యది కలదనిగాని, లేదనిగాని, భిన్నముగనున్నదనిగాని చెప్పుటకు వీలులేదు.

న చానాది నిరాభాసం నిరాకారం చిదమ్బరమ్
దృశేః కారణమన్యస్యాః క్వచిద్భవితుమర్హతి. 33

అనాదియై, ఆభాసరహితమై, నిరాకారమైనట్టి చిదాకాశము జగత్తునకు కారణమెచటను గాఁజాలదు.

తస్మాద్యథావయవినోఽవయవాః స్వాత్మమాత్రకాః
తథానవయవే బ్రహ్మ వ్యోమ్ని వ్యోమ జగత్స్థితమ్. 34

కాఁబట్టి, అవయవికి అవయవములెట్లు నిజస్వరూపమాత్రము లై, వేఱుగాక యెట్లుండునో, అట్లే అవయవరహితమైన చిదాకాశరూపమగు బ్రహ్మమందు చిదాకాశరూపమేయగు ఈ జగత్తు తదభిన్నముగ స్థితినొందియున్నది.

సర్వం శాన్తం నిరాలమ్బం జ్ఞప్తిమాత్రమనామయమ్
నేహ సత్తా న వా సత్తా న చ నానాస్తి కించన. 85

ఈ జగత్తంతయును శాంతమై నిరాధారమై, నిర్వికారమైనట్టి చిన్మాత్రమగు బ్రహ్మమే అయియున్నది. ఇట బ్రహ్మముకంటె భిన్నముగ సత్తగాని, అసత్తుగాని అనేకత్వముగాని యొకింతైనను లేదు (నేహ నానాస్తికించన — — శ్రుతి)

సంకల్పస్వప్నగరవృత్తవత్సర్వమాతతమ్
స్థితమేవ సమం శాన్తమాకాశమజమవ్యయమ్. 86

సంకల్ప, స్వప్నసగరముల నృత్యమువలె ఈ జగత్తంతయును సమమై, శాంతమై, జన్మరహితమై, అవ్యయమై, సర్వవ్యాపకమైనట్టి చిదాకాశముగనే స్థితినొందియున్నది.

పరమచిదమ్బరహృదయం చిత్త్వాద్యత్కచతి కాన్తమమలమలమ్
తదిదం జగదితి కలితం తేనైవ తదాత్మరూపమాకల్పమ్. 87

ఇత్యార్షే శ్రీవాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే ఉత్తరార్ధే సర్గకారణనిరాసో నామ పఞ్చాధికద్విశతతమః సర్గః ॥ 205 ॥

ఓ రామచంద్రా! స్వచ్ఛమై, ప్రకాశరూపమై, సారభూతమైనట్టి చిదాకాశముయొక్క స్వరూపము చిత్స్వభావమువలన నే యే యాకారముగ భ్రాంతిచే లెస్సగ స్ఫురించుచున్నదో, అట్టి స్వకల్పితమగు తనరూపమునే యది కల్పాంతమువఱకు జగత్తుగ నెఱిఁగినది.

ఇది శ్రీవాసిష్ఠతాత్పర్యప్రకాశికయందు నిర్వాణప్రకరణమున నుత్తరార్ధమున సర్గకారణనిరాసమను రెండువందలైదవ సర్గము ॥ 205 ॥

## షడధికద్విశతతమః సర్గః

[బ్రహ్మైవ సజ్జగన్నాస్తీత్యేతన్నిర్ణయహేతవః
కుశద్వీపేశ్వరప్రోక్తాః ప్రశ్నా ఇహ నిరూపితాః.

బ్రహ్మమే సత్యము, జగత్తు లేదు అను ఈ నిర్ణయమునకు కారణములైనట్టి కుశద్వీపభూపాల ప్రోక్తములగు ప్రశ్నలిచట నిరూపింపఁబడుచున్నవి.]

**శ్రీ వసిష్ఠ ఉవాచ:—**

యదకారణకం భాతి భానం తన్నైవ కించన
తత్తథా వరమారేన పరమార్థః స్థితోఽనఘ. 1

శ్రీ వసిష్ఠుఁడు:— పాపరహితుఁడవగు రామచంద్రా! కారణములేకయే ఏ యీజగత్తు భాసించుచున్నదో, అది వాస్తవముగ నొకింతైనను లేనిదేయగును. పరమార్థమగు బ్రహ్మమే యథార్థముగ నట్లు స్థితినొందియున్నది.

అత్రేమం కేనచిత్పృష్టోఽయమహం తం మహామతే
సమ్యగ్బోధస్య పుష్ట్యర్థం మహాప్రశ్నం పరం శృణు. 2

ఓ మహామతీ! ఇవ్విషయమున ఒకానొకఁడు నన్నడిగి నట్టి యీ శ్రేష్ఠమైన మహా ప్రశ్నను సమ్యక్ - జ్ఞానముయొక్క పుష్టికొఱకై నీవు వినుము.

అస్త్యబ్ధిఖ్యాముభయతో వ్యాప్తం ఖ్యాతం జగత్త్రయే
కుశద్వీపమితి ద్వీపం భూమౌ వలయవత్థ్సితమ్. 3

ముల్లోకములందును, ప్రసిద్ధికెక్కినదియు, సురోద ఘృతోదములను రెండు సముద్రములచే వలయము (కడియము)వలెఁ జుట్టఁబడినదియునగు కుశద్వీపమను ద్వీపమీభూమి పైఁగలదు.

తత్రాస్తీలావతీనామ హైమీ పూర్వోత్తరే పురీ
దీప్తిజ్వాలామయస్తమ్భప్రోతావని నభస్తలా. 4

అచ్చోట దీప్తిరూపములైన జ్వాలామయస్తంభములచే భూమ్యాకాశములను గ్రుచ్చునట్టి సువర్ణరచితమైన 'ఇల'యను బట్టణము పూర్వోత్తరదిగ్భాగమందుఁ గలదు.

పూర్వే తస్యామభూద్రాజా ప్రజ్ఞప్తిరితి విశ్రుతః
అనురక్తజగద్భూతః శక్రః స్వర్గ ఇవాపరః. 5

పూర్వమాపట్టణమున సమస్తజగత్తునకును ప్రేమపాత్రుఁడైన విఖ్యాతుఁడగు ప్రజ్ఞప్తి యను రాజు, స్వర్గమందింద్రునివలె నుండియుండెను.

కేనచిత్కారణేనాహం కదాచిత్తస్య భూపతేః
ప్రాప్తః సమీపం నభసః ప్రలయార్క ఇవ చ్యుతః. 6

ఒకానొకపుడేదోయొకకారణముయొక్క వశముచే నేను ప్రళయకాలమున జ్యోతిశ్చక్రము నుండి జారిన సూర్యునివలె, ఆకాశమునుండి యారాజుసమీపమును బొందితిని.

పుష్పార్ఘ్యాచమనీయైర్మాం పూజయిత్వోపవిశ్య సః
మధ్యే కథాయాం కస్యాంచిదపృచ్ఛత్ప్రణయాదిదమ్. 7

అపుడాతఁడు పుష్ప, అర్ఘ్య, ఆచమనీయాదులచే నను బూజించి, కూర్చొనినవాఁడై యొకానొక కథాసందర్భమున మధ్య ప్రేమతో నన్నిట్లడిగెను.

భగవన్సర్వసంహారే జాతే శూన్యతతే స్థితే
అవాచ్యే పరమే వ్యోమ్ని సర్వకారణసంక్షయే. 8

సర్గారంభస్య భూయః స్యాద్వద కిం మూలకారణమ్
కాని వా సహకారీణి కారణాని కుతః కథమ్. 9

మహాత్మా! ప్రళయకాలమున సర్వనాశము సంభవింప, ఎల్లెడల శూన్యత్వము వ్యాపింప, పృథ్వ్యాదిసర్వకారణములు క్షయింప, అనిర్వాచ్యమగు చిదాకాశము శేషించియుండ నపుడు మరల సృష్ట్యారంభమునకు మూల (ఉపాదన)కారణమెద్ది? మఱియు సహకారి (నిమిత్త) కారణములెవ్వి? సర్వనాశము తటస్థించియుండుటచే నపుడీకారణము లెచట నెట్లు సంభవించును?

కిం జగత్కిం చ సర్గాది కాశ్చిన్నిత్యం తమోధరాః
వ్యోమసంస్థార్ణవాః కాశ్చిత్కాశ్చిత్కృమికులాకులాః. 10

కాశ్చిదాకాశకోశస్థాః కాశ్చిచ్ఛోపలకోశగాః
కిం చ వా భూతభూతాని కుతో బుద్ధ్యాదయః కథమ్. 11

మఱియును, ఈ జగత్తు వాస్తవముగ నేమి? సృష్ట్యాదినుండి ప్రళయాంతమువఱకుగల యద్దాని వికారములేమి? కొన్నిసృష్టులు నిరంతరము అంధకారముచేఁ బరిపూర్ణములైయు, కొన్ని యాకాశమున స్థితినొందియున్న సముద్రములతోఁగూడియు కొన్ని కృమిసమూహములచే వ్యాప్తములైయు, కొన్ని ఆకాశకోశమందున్నవియు, కొన్ని శిలాకోశమందు వర్తించునవియునై యున్నవిగదా? ఇట్టి వైచిత్ర్యమునకు కారణమేమి? పృథ్వ్యాది భూతములున్ను, వానియందలి అండజాది చతుర్విధ ప్రాణి సమూహాదులున్ను వాస్తవముగ నేమి? బుద్ధ్యాదులున్ను నేమి? అవి యెట్లేర్పడినవి?

కః కర్తా కోఽథవా ద్రష్టా కాధారాధేయతా కథమ్
న కదాచిన్మహానాశో జగతామితి నిశ్చయః. 12

సమస్తవేదశాస్త్రార్థావిరోధాయ సమర్థితః
యథా సంవేదనం నామ తథా నామానుభూతయః. 13

యతస్తతో వేదనం స్యాత్కిమనాశమనన్మయమ్
అన్యచ్చ జమ్బూద్వీపాదౌ దేశేద్య మునినాయక. 14

మృతానామగ్నిదగ్ధానామిహ వా దేహనాశినామ్
నరకస్వర్గభోగాయ విదేహే దేహకారణమ్. 15

కిం తత్స్యాత్సహకారీణి కారణాన్యథ కాని వా
ధర్మాధర్మావమూర్తౌ ద్వౌ తస్యామూర్తస్య మూర్తతా. 16

మహాత్మా! ఈ లోకములన్నిటియొక్క కర్త యెవరు? లేక ద్రష్టయెవరు? ఏని యొక్క ఆధార ఆధేయత్వమెట్లు సంభవించినది? సమస్త వేద, శాస్త్రార్థములయొక్క అవిరోధము కొఱకై మాయాకాలమున జగత్తుల కెన్నఁడును మహానాశములేదు. ఆయా ప్రాణులయొక్క కర్మానుసారము సదా వ్యవహారములు ప్రవర్తించుచున్నవి అను నిశ్చయము సమర్థింపఁబడుచో సంవేదనము (జ్ఞానము) ననుసరించియే అనుభవములు గలుగుచుండుట ప్రసిద్ధమైయున్నది. గావున, సంవేదనమే దేహాదులకు కారణమా లేక మఱియొకటియా? మొదటి పక్షమందు, ఆ సంవేదనము నిత్యమా లేక అనిత్యమా? నిత్యమైనచో ...ది కూటస్థమేయగును. గావున నట్టిదాని

నుండి వికారవంతములగు దేహాదులెట్లుకలుగును? అనిత్యమగుచో దానియుత్పత్తికై కారణము చెప్పవలసియుండును ఆ కారణమో సంవేదనములేనిచో వచింపఁబడఁజాలదు ఇఁక సంవేదనము కంటె వేఱైనది దేహాదులకు కారణమను రెండవపక్షమందు, ఓ మునిశ్రేష్ఠా! ఈ కుశద్వీపాదులందు మరణించి నట్టిగాని, లేక అగ్నియందు దహింపఁబడినట్టిగాని, లేక దేహము నశించినట్టిగాని జనులకు దేహోత్పాదకమైన మాతా పిత్రాదికారణములేని ప్రవేశమందు నరకస్వర్గభోగముకొఱకై వలసిన దేహముయొక్క ఉపాదాన, సహకారి కారణములెవ్వి? ధర్మాధర్మములు అమూర్త (నిరాకార) పదార్థములు గావున నవి మూర్తివంతములైన దేహాదులకు కారణము కాఁజాలవు.

నిర్ద్రవ్యం కురుతే ద్రవ్యైర్యుక్తిరిత్యసమఞ్జసా
మాతాపిత్రాద్యభావే హి బీజం కిం తత్ర కారణమ్. 17

పదార్థరహితమైనదిగాని, లేక, పదార్థభిన్నమైనదిగాని పదార్థములచే దేహాదులను నిర్మించుచున్నదను యుక్తి అసమంజసమేయగును. మఱియు నపుడు మాతాపిత్రాదుల అభావము వలన బీజములేనందున శరీరాదులకు కారణమే మైయుండును?

అన్యే వా హేతవః కే స్యుః కథం ద్రవ్యాదిసంభవః
పరలోకోఽస్య నాస్తీతి యథాసంవేదనం స్థితేః. 18
సమస్తలోక వేదాదివిరోధాచ్చాసమఞ్జసమ్

లేక, ఈ దేహాదులకు మఱియేకారణములు గలవు? ఈ పదార్థాదులెట్లు సంభవించుచున్నవి? ధర్మాధర్మముల కర్తకు పరలోకములేదను నాస్తికుని మతమున్ను సరికాదు. ఏలయనిన, ఈ జన్మ పూర్వజన్మకు పరలోకమగుటవలనను ఈ జన్మయో సంవేదనానుసారము స్థితిగల్గి ప్రత్యక్షమైయుండుటచేతను, పరలోకములేదనుట సమస్తలోక, వేదాదులకు విరుద్ధమైయుండుట వలనను నాస్తికుల యామతము అసమంజసమైయున్నది

అనిచ్ఛితేహితైర్దూర దేశాన్తరగతైః ఫలమ్. 19
ప్రజా ప్రాప్నోత్యసంబన్ధైరమూర్తైరత్ర కః క్రమః

మఱియు, ఈ ప్రజలు నిజఇచ్ఛా, చేష్టారహితములును, దేశాంతరగతములును కావుననే అసంబంధములును, అమూర్తములునగు రాజాజ్ఞాదులచే వధదండనాది ఫలముల నొందుటయందు హేతువేమి?

స్తమ్భో వరేణ సౌవర్ణో వినా హేమగమాగమైః. 20
క్షణాత్సంపద్యతే తత్ర సంపత్తిః కథముచ్యతామ్

సువర్ణసంపాదనమునకైన గమనాగమనాదిరూప ప్రయత్నములేకయే దేవ, మున్యాదుల వరముచే క్షణకాలములో సువర్ణస్తంభ మేర్పడుటయందు కారణమేమి?

విధీనాం ప్రతిషేధానాం నిర్నిమిత్తం వివల్గతామ్. 21
రూఢానామప్యరూఢానాం కిం ప్రయోజనముచ్యతామ్

అచేతనత్వమువలన ప్రయోజనసిద్ధిరూపములగు కారణములేకయే ప్రవర్తించునవియు, లోకమందు ప్రచారముచే మిగుల యథార్థములైనవియు కొందఱిచే ననుష్ఠింపఁబడకయుండుటచే అరూఢము లైనవియునగు (శాస్త్రముల) విధినిషేధములయొక్క ప్రయోజనమేమి?

అసదాసీజ్జగత్పూర్వం సత్సంపన్న మనన్తరమ్. **22**
ఇతి శ్రుతేః కథం బ్రహ్మన్కథ్యతాం సర్గతార్థతా

మహాత్మా! "అసదేవేదమగ్ర ఆసీత్తతోవై సదజాయత" (సృష్టికి పూర్వము అసత్తే యుండెను. దానినుండి సత్తు జనించెను) 'సదేవ సౌమ్యేదమగ్ర ఆసీత్' (ఓ సౌమ్యుఁడా! సృష్టికి పూర్వము సత్తే యుండెను). ఏకమేవాద్వితీయం బ్రహ్మ, (ఈజగత్తంతయును 'ఏకమై సద్రూపమైనట్టి పరబ్రహ్మమే అయియున్నది), 'నాసదాసీన్నో సదాసీత్తదానీమ్, (సృష్టికి పూర్వము సత్తుగాని, అసత్తుగాని లేదు). ఇత్యాది పరస్పర విరుద్ధార్థములుగల శ్రుతివాక్యములకు పరస్పరము సంగతమైన యర్థమెట్లు సంభవించును.

అయం భవేత్కథం బ్రహ్మాభవేచ్చేత్తన్మహామునే. **23**
ఏవం ప్రభావాన్నభసః కిం సర్వస్మాన్న జాయతే

ఓ మహామునీ! సృష్ట్యాదియందు పదార్థశూన్యమగు చిదాకాశమునుండి బ్రహ్మదేవుఁ డెట్లుత్పన్నుఁడగును? చిదాకాశమున కట్టి ప్రభావము గలదని యనుచో చిదాకాశము సర్వత్ర వర్తించుచున్నది. గావున సర్వస్థానములనుండి బ్రహ్మదేవుఁడేల జనించుటలేదు?

ఓషధీనామథార్థానాం సర్వేషాం వా స్థితిం గతాః. **24**
కథం స్వభావాః కథయ యథాబోధం మునీశ్వర

ఓ మునీశ్వరా! చిదాకాశ మొకటియే అయియున్నను, ఓషధులయొక్క తమ తమ భిన్నభిన్న బీజాదుల నుత్పన్నమొనర్చునట్టి వేర్వేఱు స్వభావములు, అగ్ని, జలాదులయొక్క యుష్ణత్వ శీతలత్వాది స్వభావములు నెట్లేర్పడినవో నాకు బోధయగులాగున వచింపవేడెద.

ఏకస్య జీవితం పుంసః సుహృదా మరణం ద్విషా. **25**
మృత్వార్థితం ప్రయాగాదౌ క్షేత్రే తత్కథముచ్యతామ్

మహాత్మా! ఒకేమనుజునిగూర్చి ప్రయాగాది కామనాప్రదక్షేత్రములందాతని మిత్రుడు, జీవింపవలయుననియు, శత్రువు మరణింపవలయుననియు కోరి వారిరువురును మరణించినచో, ఆపిమ్మట ఆ విరుద్ధస్వభావయుక్తములగు కార్యములెట్లు సంభవింపఁగలవు?

ఖే స్యామక్షయపూర్ణేన్దురితి ధ్యాయిభిస్తైః ఫలైః. **26**
తుల్యకాలమనుప్రాప్తైః సహస్రేన్దు న కిం నభః

'నేనాకాశమునఁ బూర్ణచంద్రుఁడగుదును' అని యేకకాలముననే అనేకమనుజులు తచ్చంద్రరూపప్రాప్త్యనుకూలమగు ఉపాసనావిధిననుసరించి ధ్యానించుచో, అపుడేకకాలముననే తత్ఫలము సంప్రాప్తించుటచే ఆకాశము అనేక చంద్రయుక్తముగ నేల యగుటలేదు?

అన్యచ్చ ధ్యాయినాం లక్షైర్ధ్యాతైకా స్త్రీ యథాక్రమమ్. **27**

జాయత్వేన సమం కాలం లబ్ధం ధ్యానఫలం చ తైః
సాధ్వ్యసాధ్వీ గృహే భర్తుః సంస్థితా తపసా పరా. 28
తేషాం చ జాయా సంపన్నా కథమేతన్మహామునే

ఓ మహామునీ! ఒకేస్త్రీని బొందుటకొఱకై లక్షలకొలఁది పురుషు లేకకాలముననే ధ్యానించుచో, తద్ధ్యానఫలము వారికి సంప్రాప్తింప, భిన్నభిన్నదేశ, గృహములందొకేకాలమున నామె యొకతెయే యెట్లు వర్తింపగలదు? మఱియు నామె యేకకాలమున స్వకీయతపంబుచే బ్రహ్మచారిణిగను, వారియందఱియొక్క ప్రత్యేకతపంబుచే సాధ్విగను, బహుపురుష భోగ్యత్వమువలన అసాధ్వియునై యెట్లుండఁగలదు?

గృహాన్నిర్గచ్ఛ మా కల్పం నృపః సద్వీపసప్తకే. 29
వరత్వం వరశాపాఖ్యామితి అన్తః క్వ తిష్ఠతి

'నేను గృహమునుండి బయటకు పోవకనే కల్పాంతమువఱకును సప్తద్వీపముల యొక్క రాజైయుందును. అనునీప్రకారమగు వరమునగాని, శాపమునగాని యెవఁడైన పొందినచో నప్పుడాతనికి అవరాదుల ననుసరించి గృహమందు సప్తద్వీపములందలి సమస్తభోగ్యము లెచట నెట్లుండఁగలవు?

దానధర్మాదితపసామౌర్ధ్వ దేహికకర్మణామ్. 30
ఇహస్థానామమూర్తానాం మూర్తం ప్రేత్యాస్తి సత్ఫలమ్
వ్యవహర్తా న మూర్తోఽత్ర విద్యతే లోకయోర్ద్వయోః. 31
దేశాన్తరే భృశం జీవో భృశం కాలాన్తరేఽపి వా
ఫలం సంభవతీ యత్తద్వినానుభవనం మునే. 32

ఓ మునీంద్రా! దాన ధర్మాదితపస్సుల యొక్కయు, శ్రాద్ధాది ఔర్ధ్వదేహిక కర్మల యొక్కయు ఫలము క్రియోత్పత్తి ప్రదేశమందే యుత్పన్నమగుచో, ఇచటనుండువారికి తత్క్రియోత్పత్తి రహితప్రదేశమగు పరలోకమున ఫల మెట్లుకలుగును? మఱియు అదృష్టములైన పుణ్యాపాపాదులు మూర్తివంతమగు శరీరమందే ఫలమొసఁగఁగల్గును. జీవుఁడో, ఇహ, పరలోకములందును అమూర్తుఁడైయున్నాఁడు ఇచటి దేహములున్ను మరణానంతరము దేశాంతర, కాలాంతరములందుండుటలేదు కావుననిక ఫలమెవనికిఁగలుగునో వచింపవేడెద

అసమఞ్జసమేవాతి కథం స్యాత్సుసమఞ్జసమ్
ఇత్యాదిసంశయగణం గిరా శీతావదాతయా
ఛిన్ధిమేఽభ్యుదితం భాసా సాన్ధ్యమాన్ధ్య మివోడుపః. 33

మహాత్మా! ఈప్రకారములైన అసమంజసవిషయములన్నియు సమంజసములెట్లగును? ఇట్లు నాకుదయించిన యీ సంశయసమూహమును శీతల, శుద్ధవాక్కుచే తాము, సాయంకాలాంధకారమును చంద్రుఁడు ఛేదించివేయునట్లు ఛేదింపవేయ ప్రార్థన.

పరమవస్తుని సంశయనాశనా దుభయలోకహితం భవతి స్ఫుటమ్
తదిహ మే కురు సాధుసమాగమ సదుఫలో భవతీహ న కస్యచిత్. 34

ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు
నిర్వాణప్రకరణే ఉత్తరార్ధేమహాప్రశ్నోనామ
షడధికద్విశతతమః సర్గః ॥ 206 ॥

మునీంద్రా! పరమాత్మ వస్తువునుగూర్చిన యుపదేశము సంశయములను నశింప జేయుటవలన నద్దానిచే ఉభయలోకములయొక్కయు హితము స్పష్టముగ సంభవించుచున్నది. మఱియు అనేక విరుద్ధఫలములున్ను బాగుగ అవిరుద్ధములగుచున్నవి, కావున నాకట్టి పరమాత్మ వస్తువు (బ్రహ్మము)ను గూర్చిన బోధచేయుఁడు. ఏలయనిన, దమవంటి మహాత్ములయొక్క సాంగత్యమెవనికిని అల్పఫలమును గలుగఁజేయఁజాలదు (మహాఫలమునే గలుగఁజేయుననిభావము.)

ఇది శ్రీవాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున నుత్తరార్ధమున
మహాప్రశ్నమను రెండువందలాఱవ సర్గము ॥ 206 ॥

---

## సప్తాధికద్విశతతమః సర్గః.

[ క్రమవ్యుత్క్రమతః ప్రశ్నాః కేచిదత్ర సమాహితాః
సమాధాస్యత్యథాన్యాంశ్చ సర్గైస్త్రిభిరుదారధీః,

క్రమ, విపరీతక్రమములచే మహాత్ముఁడగు వసిష్ఠమునీంద్రుడిచట కొన్ని ప్రశ్నలకును, మిగిలినవానికి తక్కిన మూఁడు సర్గములందును సమాధాన మొసంగుచున్నాఁడు. ]

**శ్రీవసిష్ఠ ఉవాచ:—**

శృణు రాజన్యథా స్పష్టమేతత్తే కథయామ్యహమ్
యేన తే సర్వసందేహా యాస్యన్త్యలమమూలతామ్. 1

శ్రీ వసిష్ఠుడు:— ఓ ప్రజ్ఞప్తిరాజా! నేను నీకు ఆత్మతత్త్వమును స్పష్టముగఁ జెప్పుచున్నాను వినుము. దానిచే నీ సందేహములన్నియును పూర్ణముగ నిర్మూలములు కాఁగలవు.

సర్వే తావజ్జగద్భావా అసద్రూపాః సదైవ హి
సద్రూపాశ్చ సదైవేమే యథా సంవేదనం స్థితేః. 2

సంవిత్తు (చైతన్యము)యొక్క అనుభవానుసార మీ జగత్తునందలి పదార్థములన్నియును సదా సద్రూపములున్ను, అసద్రూపములున్ను నయియున్నవి. దేనిగూర్చి సంవిత్తు 'ఇది కలదు' అను భావము కల్గియున్నదో అది సద్రూపమున్ను, 'ఇది లేదు' అను భావము కల్గియున్నదో, అది అసద్రూపమున్ను నయియున్నది.

ఇదమిత్థమితి ప్రోతా యత్ర సంవిత్తదేవ తత్
భవత్యవశ్యం తత్త్వజ్ఞ సదేవాస్త్వసదేవ వా. 3

ప్రియుఁడవగు రాజా! ఏ వస్తువునుగూర్చి సంవిత్తు 'ఇది నీలవర్ణమైనది, ఇది పీతవర్ణ యుక్తమైనది, ఇది ఘటము, ఇది పటము (వస్త్రము) అనునట్టి దృఢనిశ్చయముతో వ్యాప్తమై యుండునో, ఆ వస్తువు ఆ ప్రకారముగనే తప్పక యగును — అది సత్తైనను, అసత్తైనను సరియే.

ఈదృక్స్వభావా సంవిత్తిస్తయా దేహో విభావ్యతే
ఏక ఏవ స్వరూపేణ తస్యాస్తి న చ తద్విదా. 4

తన చిత్స్వరూపమును దేహమునుగూర్చిన భావనచేయుట ఈ (అజ్ఞానావృత) సంవిత్తు యొక్క స్వభావమైయున్నది. ఆ సంవిత్తు మొదట దేహమొకదానినే ఆత్మ రూపముగ భావించుచున్నది. పిమ్మట ఆ దేహముద్వారా యా సంవిత్తుయొక్క అభివ్యక్తి భావింపబడుచున్నది. ఈ ప్రకారముగ దేహధర్మమును ఆ సంవిత్తు తనయందు అధ్యాసమొనర్చుకొనుచున్నది.

విదమేవ విదుర్దేహం స్వప్నాదావితరేతరా
సంవిత్కాచిత్సంభవతి న చాన్యాస్తి శరీరతా. 5

కావుననే (అజ్ఞానయుక్తులగు) జనులు స్వప్న, జాగ్రత్తులందు శరీరము తానని యెఱుగు సంవిత్తునే యనుభవించుచున్నారు. గాని, యితరమగు సంవిత్తునుగాదు కాబట్టి భ్రాంతిరూపమగు యొకింత సంవిత్తే శరీరత్వముగాని శరీరత్వమనునదివేఱేమియునులేదు

అశ్రితస్వప్న సందర్శస్తథేదం భాసతే జగత్
సమస్త కారణాభావాత్సర్గాదావన్యతాత్ర కా. 6

సృష్ట్యాదియందు జగత్తునుగూర్చిన సమస్త కారణములయొక్క అభావముచే అవశ్యమాశ్రయింపదగిన జగత్ — స్వప్నద్రష్టయగు సంవిదాత్మయే యిట్లు జగద్రూపముగ భాసించుచున్నదగును. ఈ జగత్తునందు స్వప్నముకంటె విలక్షణమైనదేమియును లేదు

ఏవం యదేవ విమలం వేదనం బ్రహ్మసంజ్ఞితమ్
తదేవేదం జగద్భాతి తత్కేవ జగతోఽన్యతా. 7

ఓ రాజా! ఇక్కారణమున బ్రహ్మమను పేరుగల నిర్మలమగు సంవిత్తేదిగలదో, అదియే యీ జగద్రూపముగ భాసించుచున్నది. ఇక జగత్తుయొక్క (బ్రహ్మముకంటె) అన్యత్వమెచట?

ఏవం పూర్వాపరం శుద్ధమవికార్య జగత్స్థితేః
లోకవేదమహాశాస్త్రైరనుభూతముదాహృతమ్. 8

ఈప్రకారముగ అవికారమై సదా ఏకరసమైనట్టి బ్రహ్మమే జగద్రూపముగ స్థితినొంది యున్నదను నివ్విషయమును బ్రహ్మవేత్తలవలనను, వేద, అధ్యాత్మ శాస్త్రములవలనను మేము అనుభూతమొనర్చుకొంటిమి. దానినే నీకు జెప్పితినిగాని, మఱియొకటికాదు

అపలాప్యైవ యే మూఢా అన్ధకూపః భేకవత్
సమస్తభూతసంవిత్తౌ రూఢపూర్ణం మహాత్మభిః. 9

వర్తమానానుభవనమాత్రమోహప్రమాణకాః
శరీరకారణా సంవిదితి మోహముపాగతాః. 10

ఉన్మత్తా ఏవ తేఽజ్ఞాస్తే యోగ్యా నాస్మత్కథాసు తే
అక్షీబక్షీబయోర్యద్వద్ బుద్ధయోః క్వైవ సంకథా. 11

సమస్త ప్రాణులయొక్క సంవిత్తునందు దృఢానుభవసిద్ధమై యున్నదియు, సత్తా రూపముచే సర్వత్ర పరిపూర్ణమైయున్నదియు మహాత్ములచే వచింపఁబడినదియునగు జగత్తుయొక్క నిత్యసంవిన్మాత్రత్వమును నిషేధించి వర్తమానకాలపు నామరూపముల యనుభవమాత్ర ప్రమాణమును మోహముచే స్వీకరించి, సంవిత్తు (చైతన్యము) నిత్యముకాదు శరీరమే సంవిత్తునకు కారణము అని యిట్లు జడవస్తువునే చైతన్యమునకు ఉపాదానకారణముగ నమ్ముచు అంధకారావృతమగుకూపమందలి మండూకము (కప్ప)వలె మోహమునుబొందిన అజ్ఞానులు (నైయాయిక, చార్వాకాదులు) నిక్కముగ ఉన్మత్తులే యగుదురు. వారు ఆధ్యాత్మిక కథలకు అధికారులు కానేరరు. ఏలయనిన, ఉన్మత్తునియొక్కయు, ఉన్మాదరహితునియొక్కయు మఱియు మూఢునియొక్కయు, జ్ఞానియొక్కయు పరస్పర సమ్యక్ కథ యెట్లు సంభవించును?

యయా విపశ్చిత్కథయా సర్వసంశయ సంక్షయః
న భవేత్త్రిషు లోకేషు జ్ఞేయా మూర్ఖకథైవ సా. 12

ఏ పండితునియొక్క కథచే సమస్త సందేహములయొక్క సంక్షయముకాదో, అద్దానిని ముల్లోకములందును మూర్ఖకథయనియే యెఱుగవలయును.

ప్రత్యక్షమాత్రనిష్ఠోఽసౌ మూఢాన్ధ ఇతి వక్తి యత్
తేన నిర్యుక్తినోక్తేన శిలాసదృశ వృత్తినా. 13

ప్రోక్తః సర్వవిరుద్ధేన సోఽజ్ఞః కూపాన్ధదర్దురః
పూర్వాపరధియం త్యక్త్వా వర్తమానే మతిస్థితః. 14

(ఏ చార్వాకాది) మూఢబుద్ధి ప్రత్యక్షమాత్రమందే నిష్ఠ (ప్రమాణము) గలవాఁడై, పూర్వాపర విచారమును త్యజించి వర్తమానమందే తత్పరుఁడై, ప్రత్యక్ష ప్రమాణముకంటె వేఱైన శ్రుత్యాది ప్రమాణములను గ్రహింపరాదు. అను ఈ యుక్తిరహిత వాక్యమును వచించుచుండునో, అట్టి అజ్ఞాని తన యా సర్వవిరుద్ధమై, విజ్ఞులకు కర్ణకఠోరమగుటచే శిలాసదృశమైనట్టి వచనమువలన విద్వజ్జనులందఱిచే అంధకూపమందలి మండూకము (కప్ప) అని చెప్పఁబడెను.

వేదా లోకానయశ్చైతే పృష్టాం స్వానుభవాన్వితామ్
వదన్తి [illegible] దృశం సర్వే యథా నశ్యన్తి సంశయాః. 15

తత్త్వజ్ఞులగు [illegible] నడిగినచో వారు స్వానుభవముతోఁ గూడుకొనిన, ఈ నేను వచించిన సిద్ధాంతదృష్టినే చెప్పుదురు. దానిచే సమస్త సంశయములున్ను తొలఁగును.

సంవిదేవ శరీరం చేచ్ఛవం కస్మాన్న చేతతి
ఇతి యస్య మతిస్తస్మై మూఢాయేదమిహోచ్యతే. 16

ప్రత్యగాత్మ సంవిత్తే దేహాది జగత్తైనచో నపుడు మృతశరీరమున్ను (సంవిత్త్వమువలన చలనాది వ్యవహారము నేల గావించుటలేదని శంకించు మూఢునికొఱకై యిది చెప్పఁబడుచున్నది.

బ్రహ్మణో బ్రహ్మరూపస్య సంకల్పనగరం తతమ్
ఇదం భావజగద్భానం తవ స్వప్నపురం యథా. 17

హిరణ్యగర్భవేషుఁడగు బ్రహ్మముయొక్క సంకల్పనగరమై వ్యాపించియున్న జగత్తు నీయొక్క స్వప్నపురమువలె భాసించుచున్నది.

తత్సమస్తం సదేవేదం చిన్మాత్రాత్మ నిరన్తరమ్
భవత్యత్ర న తే భ్రాన్తిః స్వే స్వప్ననగరే యథా. 18

నీయొక్క స్వప్ననగరము, బ్రహ్మముయొక్క సంకల్పనగరము అంతయు నిరంతరము చిన్మాత్రాత్మయే అయియున్నను, ఇట నీయొక్క స్వప్ననగరమున చేతనత్వమును గూర్చిన భ్రాంతి యెట్లు లేదో, అట్లే శవాది జడవస్తువులందును లేదని యెఱుఁగవలయును.

తత్రతత్రావద్దిశః శైలాః పృథ్వ్యాది నగరాది చ
సర్వం చిన్మయమాకాశమితి తే స్వానుభూతిమత్. 19

అట నీయొక్క స్వప్నము పృథివీ, పర్వత, దిక్ నగరాదులన్నియును చిదాకాశ స్వరూపములే అయియుండుట నీకు స్వానుభవసిద్ధమైయే యున్నది.

సంవిద్వ్యోమ ఘనం బ్రహ్మ తత్సంకల్ప పురం విరాట్
శుద్ధసంవిన్మయో బ్రహ్మ తదిదం జగదుచ్యతే. 20

బ్రహ్మము చిదాకాశఘనమైయున్నది. అద్దాని సంకల్పనగరమే విరాట్టు. ఆ బ్రహ్మ దేవుఁడు శుద్ధ సంవిన్మయుఁడై యొప్పుచున్నాఁడు. ఈ జగత్తున్ను, ఆ ప్రకారముగ శుద్ధసంవిన్మయ మేయని చెప్పఁబడుచున్నది.

బ్రాహ్మే సంకల్పనగరే యద్యత్సంకల్పితం యథా
తథానుభూయతే తత్తత్త్వత్సంకల్పపురే యథా. 21

బ్రహ్మముయొక్క సంకల్పనగరమగు ఈ జగత్తునందు ఏ పదార్థమెట్లు సంకల్పింపఁ బడుచున్నదో. అది నీయొక్క సంకల్పపురమునందువలె ఆ ప్రకారముగనే యనుభవింపఁబడు చున్నది.

సంకల్పనగరే యద్యద్యథా సంకల్ప్యతే తథా
తత్తథాస్త్యేవ చ తదా త్వత్సంకల్పపురే యథా. 22

బ్రహ్మముయొక్క సంకల్పనగరమగు ఈ జగత్తునందేయే పదార్థమేయేప్రకారముగ సంకల్పింపబడుచున్నదో, ఆ యా పదార్థము నీయొక్క సంకల్పపురమునందువలె నా యా ప్రకార ముగనె స్థితినొందియున్నది.

తస్మాద్దేహస్య నియతౌ యథైతౌ బ్రహ్మణా చితా
స్పన్దాస్పన్దౌ కల్పితౌ ద్వౌ స తథైవానుభూతవాన్. 23

కాఁబట్టి దేహముయొక్క నియతియందు బ్రహ్మరూపమగు చైతన్యమెట్లు కల్పించెనో అనగా జీవిత శరీరమునకు చలనము, మృతశరీరమునకు అచలనమునెట్లు కల్పనచేసెనో ఆ ప్రకార ముగనే ఆ చలన అచలనము, లనుభూతములగుచున్నవిగాని తద్విపరీతముగఁగాదు.

మహాప్రలయపర్యన్తే పునః సర్గః ప్రవర్తతే
సమస్తకారణాభావాద్ధ్రువ్యం తావన్న విద్యతే. 24

విముక్తత్వాత్ప్రదేశస్య న చ సంభవతి స్మృతిః
బ్రహ్మైవేయమతో దీప్తిర్జగతిత్యేవ భాసతే. 25

'మహాప్రళయముయొక్క అంతమున సమస్త కారణములయొక్క అభావమువలన సృష్ట్యారంభమునకై పదార్థమేదియును లేదు; కాని మరల సృష్టి ప్రవర్తించుచునేయున్నది; మఱియు; పూర్వప్రళయమునకుఁ బూర్వమే లోకేశుఁడగు బ్రహ్మదేవుఁడు ముక్తుఁడగుటచే నాతని స్మృత్యాదులున్ను సంభవింపనందున నవియును జగత్తునకు కారణము కాఁజాలవు' అనినచో- నిజమే. కావుననే స్వయంజ్యోతియగు బ్రహ్మమే జగత్తుగ భాసించుచున్నదగును. అన్యమగు పదార్థరూపమైన జగత్తు లేనేలేదు.

తస్మాదాద్యాత్మనా భాతం స్వమేవ బ్రహ్మణా స్వతః
జగత్సంకల్పనగరమితి బుద్ధం చ ఖేన ఖమ్. 26

ఇక్కారణమున, బ్రహ్మము స్వయముగనే మొదట బ్రహ్మదేవునిరూపముగ భాసించెను; ఆ పిదప చిదాకాశరూపుఁడగు యా బ్రహ్మదేవుఁడు స్వతః తన సంకల్పనగరమును జగత్తుగ నెఱింగెను. ఇట్లీజగత్తు వాస్తవముగ చిదాకాశరూపమే అయియున్నది.

యథా సంకల్ప నగరం చిన్మాత్రం భాతి కేవలమ్
తథైవాకారణం భాతి చిన్మాత్రోన్మేషణం జగత్. 27

సంకల్పనగరమెట్లు కేవలము చిన్మాత్రముగనే భాసించుచున్నదో, అట్లే యీ జగత్తు చిన్మాత్రముయొక్క స్ఫురణమేఐయి నిష్కారణముగ భాసించుచున్నది.

శరీరమస్తు వా మాస్తు యత్ర యత్రాస్తి చిన్నభః
వేత్త్యాత్మానం తత్ర తత్ర ద్వైతాద్వైతమయం జగత్. 28

శరీరముండినను, లేకుండినను సరియే; ఎచటెచట చిదాకాశముండునో, అచటచట నయ్యది తన స్వరూపమునే ద్వైత, అద్వైతమయమగు జగత్తుగ నెఱుఁగుచున్నది.

తస్మాద్యథా స్వప్నపురం యథా సంకల్పపత్తనమ్
తథా పశ్యతి చిద్వ్యోమ మరణానన్తరం జగత్. 29

కాఁబట్టి, చిదాకాశమెట్లు తన్ను స్వప్న, సంకల్పపురములవలెఁ గాంచుచున్నదో, అట్లే మరణానంతరమది తన్ను జగద్రూపముగను గాంచుచున్నది.

అపృథ్వ్యాదిమయం భాతి పృథ్వ్యాదిమయవజ్జగత్
యథేదమాప్రవర్తమతో మృతస్యాప్యఖిలం తథా. 30

సృష్ట్యాదియందు చిదాకాశము పృథ్వ్యాది రహితమైయున్నను, పృథ్వ్యాదిమయమగు జగత్తువలె నెట్లు భాసించుచున్నదో, అట్లే జీవుని మరణానంతరమున్ను నది పర్వజగద్రూపముగ భాసించుచున్నది.

దేశకాలేవ పర్గేణ ప్రబుద్ధస్యేవ తా యథా
అణుమాత్రమపి వ్యాప్తా తథైవ పరలోకినః. 31

తత్త్వజ్ఞానికిగాని, లేక స్వప్నమునుండి మేల్కొనినవానికిగాని యా స్వప్నజగత్తునందలి దేశకాలములు జాగ్రత్సృష్టిచే నొకింతైనను వ్యాప్తములైనవి యెట్లుకావో, అట్లే పరలోకమును బొందినవానికిన్ని, ఇహలోక దేశకాలములట నొకింతైనను వర్తింపనేరవు.

ఇదం ప్రబుద్ధవిషయే స్వానుభూతమపి స్ఫుటమ్
జగన్న విద్యతే కించిత్కారణం గగనే యథా. 32

అట్లే, జగత్తు ప్రత్యక్షముగ స్పష్టముగ స్వానుభూతమైయున్నను, ఆకాశమందుపకరణమువలె జ్ఞానిదృష్టియందొకింతైనను లేకయేయున్నది.

అప్రబుద్ధస్యాస దేవ యథేదం భాతి భాసరమ్
తథైవ సర్గవద్భాతి వ్యోమైవ పరలోకినః 33

నిద్రించువానికి స్వప్నమందు అసద్రూపమైనను జగత్తెట్లు ప్రకాశమానముగ భాసించుచున్నదో, అట్లే పరలోకమును బొందినవానికి చిదాకాశమే సృష్టివలె భాసించుచున్నది.

ద్యుధరాద్రియమాద్యాఢ్యం ఖమేవ పరలోకినః
అభూతపూర్వమాభాతి భూతపూర్వవదాతతమ్. 34

పరలోకమును బొందినవానికి, ఆకాశ, పృథివీ, యమలోకాదులచేఁ బూర్ణమైనదియు, పూర్వసిద్ధముగాకున్నను, పూర్వసిద్ధమైనట్లు తోచునదియునగు విశాలజగద్రూపముగ చిదాకాశమే భాసించుచున్నది.

మృతోఽయం పునరుత్పన్నో యమలోకే శుభాశుభమ్
భుక్తోఽహమిత్యతిఘనం మృతో భ్రాన్తిం ప్రపశ్యతి. 35

'నేను మరణించితిని మరల యమలోకమున నరకవాసిగ జనించితిని, ఇచట శుభాశుభముల ననుభవించుచున్నాను, ఇత్యాదిరూపమగు మహాభ్రాంతిని మరణించినజీవుఁడు గాంచుచున్నాఁడు.

మోక్షోపాయానాదరిణా మేష మోహో న శామ్యతి
బోధాదవాసనత్వేన మోహ ఏష ప్రశామ్యతి. 36

మోక్షోపాయము (జ్ఞానము)ను అనాదరించువారి కీమోహ మెన్నఁడును శమింపదు బ్రహ్మజ్ఞానమువలన వాసనారాహిత్యముచే నియ్యది పూర్ణముగ శమించిపోవుచున్నది.

అప్రబుద్ధస్య యా సంవిత్సా ధర్మాధర్మవాసనా
ఖ ఏవ భాత్మికా భాతి యత్తదేవ జగత్స్థితమ్. 37

అప్రబుద్ధునియొక్క, ధర్మాధర్మవాసనారూపమైనదియు, విహితనిషిద్ధాచరణయొక్క యనుభవరూపమైనదియునగు సంవిత్తే జగదాకారముగ స్థితినొందియున్నది. కాని వాస్తవముగ ఈ జగత్తు చిదాకాశమే చిదాకాశమున నవ్విధముగ భాసించుచున్నదగును.

న శూన్యరూపం న చ సత్స్వరూపం బ్రహ్మైవిదం భాతి జగత్స్వరూపం
తద్భావరిజ్ఞానవశాదనర్థ భూతం పరిజ్ఞాతవతః శివాత్మ. 38

ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకీయేదేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే ఉత్తరార్ధే మహాప్రశ్నోత్తరం నామ సప్తాధికద్విశతతమః సర్గః ॥ 207 ॥

ఓ రాజా! జగత్తు శూన్యరూపముకాదు. స్వరూపముకాదు. బ్రహ్మమను పేరుగల చైతన్యమే జగత్స్వరూపముగ భాసించుచున్నది. ఆ జగత్తున్ను అజ్ఞానవశముచేతనే అనర్థభూతమైయు, జ్ఞానవంతునకు పరమకళ్యాణరూపమై నిరతిశయానందాత్మకమైనట్టి బ్రహ్మరూపమైయు చెన్నొందుచున్నది.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున నుత్తరార్ధమున మహాప్రశ్నోత్తరమను రెండువందలేడవ సర్గము ॥ 207 ॥

---

## అష్టాధికద్విశతతమః సర్గః

[ దూరదేశగతైర్యత్నైరన్యత్రాపి ప్రజాఫలమ్
యథాప్రాప్నోతి తాదృక్షా ధాతురిచ్ఛాత్ర వర్ణ్యతే.

దూరముననున్న మఱియొక ప్రదేశమునకు ప్రయత్నపూర్వకముగఁ జనినప్పటికిని ప్రజలు తామొనర్చినదానియొక్క ఫలము నెట్లు పొందుచున్నారో, అట్లే హిరణ్యగర్భవేషుఁడగు బ్రహ్మముయొక్క యిచ్ఛచే పరలోకాదులందును జీవునకు దానొనర్చిన కర్మలయొక్క ఫలము లభించుచున్నదను విషయమిచట వర్ణింపఁబడుచున్నది.]

శ్రీ వసిష్ఠ ఉవాచ:—

శుభాశుభం యథోదేతి ప్రజానాం గృహసంగమే
అసంబుద్ధైరప్రతిఘైర్దూరస్థైస్తదిదం శృణు. 1

శ్రీవసిష్ఠుఁడు:-- ఓ ప్రజ్ఞప్తిరాజా! దూరదేశస్థములును, అసంబద్ధములును, అమూర్తములునగు పుణ్యపాపములయొక్క శుభాశుభఫలములు ప్రజలకు గృహమున నెట్లు లభించుచున్నవో వినుము

బ్రహ్మసంకల్పనగరం జగత్తావదిదం స్థితమ్
యద్దృశ్యం దృశ్యబోధేన బ్రహ్మైవ బ్రహ్మబోధతః 2

బ్రహ్మమే అజ్ఞానమువలన దృశ్యబోధముచే దృశ్యమున్ను బ్రహ్మబోధముచే బ్రహ్మమున్ను నగుచున్నందువలన, ఈ జగత్తు బ్రహ్మముయొక్క సంకల్పనగరమే అయియున్నది.

యద్యత్సంకల్పనగరే యదా సంకల్ప్యతే యథా
తథానుభూయతే తత్తత్తాదృగ్విరచనం తదా. 3

సంకల్పనగరమున నేదియేది యెపుడెపుడెట్లు సంకల్పింపఁబడుచున్నదో, అదియది యపుడపుడావిధముగనే, ఆ యారచనలతోనే యనుభవింపఁబడుచున్నది

ఏవమస్మిన్గృహే యాతే సంపన్నైవమియం ప్రజా
ఏవం సంకల్పసంపన్నే జగత్యేవం భవత్యలమ్. 4

ఓ రాజా! నీ యీ సంకల్పనగరమున ప్రజలు నీయొక్క సంకల్పానుసారముగనే యెట్లుందురో, అట్లే బ్రహ్మముయొక్క సంకల్పనగరమగు ఈ జగత్తునందును ప్రజలు బ్రహ్మముయొక్క సంకల్పానుసారముగనే లెస్సగ స్థితినొందియుందురు.

ఏతత్స్వసంకల్పపురే యాదృశం తే తథా స్థితమ్
యథా సంకల్పయసి యత్తత్తథా కిల పశ్యసి. 5

నీ సంకల్పపురమున నీవు దేనినెట్లు సంకల్పించుదువో, దాని నాప్రకారముగనే యట స్థితినొందియుండుటను నీవు గాంచుచున్నావుగదా!

యథైవ వరశాపాభ్యాం శుద్ధసంవిదవాప్యతే
సంవిత్తథైవ భవతి బ్రాహ్మమేవేతి కల్పనమ్. 6

మునులయొక్క యమనియమాదులచే శుద్ధమగు సంవిత్తువరశాపరూపమున నెట్లు వ్యవహారసమర్థముగ బొందఁబడుచున్నదో, అట్లే బ్రహ్మముయొక్క సంవిత్తున్ను పొందఁబడుచున్నది. మఱియు వరశాపాదులచే నేది సంభవించుచున్నదో, అదియును 'తపస్సులకు వరశాపములు సిద్ధించుగాక' అను బ్రహ్మముయొక్క కల్పనవలననే యగుచున్నది. గావున నట్లు వరశాపములు సిద్ధించుటయు బ్రహ్మముయొక్క సత్యసంకల్పనమే యగును.

ప్రజావిధినిషేధాభ్యామేకయాస్థాప్యవస్థయా
తథైవ ఫలమాప్నోతి బ్రాహ్మమేవేతి కల్పనమ్. 7

విధినిషేధశాస్త్రములచే బోధింపఁబడిన ధర్మాధర్మముల యాచరణచే జనులకు సుఖదుఃఖాది ఫలములు లభించుటయు బ్రహ్మముయొక్క సంకల్పకల్పనమే అయియున్నది.

దేహినో యే జగత్యస్మింస్తాన్ప్రత్యనుపలమ్భతః
అనదాసీజ్జగత్పూర్వం సత్యమిత్యుపలభ్యతే. 8

ఈ ప్రపంచమున నెందఱు ప్రాణులున్నారో, వారందఱును సృష్టికిఁ బూర్వము లభింపనందుచే, ఈ జగత్తు సృష్టికిఁ బూర్వము లేదనియు, తరువాత లభించుటచేఁ గలదనియుఁ జెప్పఁబడినది.

చిద్రూపబ్రహ్మసంకల్పవశాదేవైతదప్యసత్
చిదున్మేషనిమేషా యౌ తావేతౌ ప్రలయోదయౌ. 9

ప్రియుఁడవగు రాజా! అసత్తగు ఈ జగత్తుయొక్క యొకింతకాలము సత్తువలె భాసించుట యేదిగలదో, అదియును చిద్రూపబ్రహ్మముయొక్క సంకల్పవశము చేతనే అయియున్నది. కావున బ్రహ్మముయొక్క వికాస, సంకోచములే యీ జగత్తుయొక్క సృష్టి, ప్రళయములైయున్నవి.

రాజోవాచ :—

కిం నోపలభ్యతే పూర్వం కిం పశ్చాదుపలభ్యతే
జగచ్ఛలద్మపురిదం సృష్టిరారమ్భ భావ్వరమ్ 10

రాజు:— మహాత్మా! ఈ జగత్తు బ్రహ్మముయొక్క సంకల్పవశము చేతనే సత్తగుచో నది సుషుప్తి, ప్రళయములం దేల లభించుటలేదు? జాగ్రత్, సృష్టికాలములం దేల లభించు చున్నది? మఱియు సదా వికారవంతమైనట్టి యీ జగత్తు సుస్థిరరూపముగ నేల భాసించుచున్నది.

శ్రీ వసిష్ఠ ఉవాచ:—

అస్మింశ్చిద్వ్యోమసంకల్పపురస్థే భావ ఈదృశః
యద్భూత్వాన భవత్యేవ పునర్భవతి చ క్షణాత్. 11

శ్రీవసిష్ఠుడు:— ఓ రాజా! చిదాకాశము యొక్క మాయిక సంకల్ప నగరము యొక్క, స్వభావమిట్టిదే అయియున్నది. జాగ్రత్, స్వప్నములందున్నదై, సుషుప్తి, ప్రళయములందు లేనిదై, మరల క్షణకాలములో స్వప్నాదులం దావిర్భవించుచు నుండుట యద్దాని స్వభావమే యగును.

బాలసంకల్పపురవద్వ్యోమ కేశోణ్డ్రకాదివత్
కిలైతే సదసద్రూపా భాన్తి సర్గాశ్చిదాత్మని. 12

బాలునియొక్క (సంకల్పకాల మాత్రస్థాయియగు) సంకల్పపురమువలెను, ఆకాశ మండలి (భ్రాంతిజన్యములైన) కేశ, ముక్తాదులవలెను చిదాత్మయందీసదసద్రూపములైన సృష్టులు భాసించుచున్నవి.

త్వం సంకల్పపురం కృత్వా వినాశయసి తత్క్షణాత్
స్వతోఽన్యసంవిద్యశతః స్వస్వభావః స తే యథా. 13
చిద్వ్యోమకల్పనపురే యదున్మజ్జనమజ్జనమ్
స్వభావకచనం తస్య తద్విద్ధి విమలం తథా. 14

ఓ రాజా! నీవు స్వతః సంకల్పపురమును నిర్మించి మరల తత్క్షణమే యద్దానిప్రళయ మునుగూర్చిన సంకల్పవశముచే దానినెట్లు నశింపజేయుచున్నావో, అది నీ యొక్క స ఎ మెట్లయియున్నదో, అట్లే చిదాకాశముయొక్క సంకల్పనగరమును గూర్చిన యుత్పత్తి నాశము లున్నట్టి చిదాకాశముయొక్క నిర్మలస్వభావమనియే యెఱుగుము.

సంవిద్ఘన స్త్వనాద్యన్తవ్యోమైవ త్రిజగన్మయః
తేనాసావద్య యన్నామ కరోత్యపి చ చేతతి. 15
తదనావరణస్యాస్య యోజనానాం శతేష్వపి
యుగైరపి స్వప్న ఇవ కార్యకృద్వర్తమానవత్. 16

కావున, ఈ త్రైలోక్యము అద్యంత రహితమైనట్టి చిద్ఘన బ్రహ్మాకాశమే అయియున్నది. ఇక్కారణమున ఆ పరమేశ్వరుడు జీవరూపముచే నేదేదిచేయునో, ప్రకాశింపజేయునో, ఆ పుణ్య పాపాదికర్మ యంతయును ఆవరణరహితుడగు ఆ పరమేశ్వరుని సత్యసంకల్పబలముచే అనేక యోజనముల దూరమునను, అనేకయుగముల కాలవ్యవధానమందునుగూడ పరలోకాదులందు సమీపమందువలెను వర్తమాన కాలమందువలెను స్వర్గ, నరక, భోగైశ్వర్యాది కార్యములను గావించుచున్నది.

కిల దేశాన్తరే నిత్యమథ లోకాన్తరేఽపి చ
నిరావృతో య ఏకాత్మా స కిం నామ న చేతతి. 17

దేశాంతరమందును, కాలాంతరమందును కర్మ, తత్ఫలరూపములైన అధ్యాసముల యొక్క అధిష్ఠానభూతమైన ఆవరణరహితమైనట్టి చైతన్యము నిత్యము ఏకమే అయియుండుటవలన నట ఆకర్మ, తత్ఫలములు రెండును నిత్యము సమీపముననే యుండుటఁబట్టి జీవుఁడు ఏకర్మ, ఫలమును నటఁబొందకుండును.

యథా మణే ప్రకచతః ప్రోన్మజ్జననిమజ్జనే
పరావర్తః స్వభాసాస్య చిన్మణౌ జగతాం తథా. 18

ప్రకాశించు మణియందు నిజప్రకాశము వలననే కాంతివిశేషముయొక్క ఆవిర్భావ తిరోభావము లనుభూతములగునట్లు, చిదాకాశమను మణియందును నిజప్రకాశమువలననే జగత్తుల యొక్క సృష్టి, ప్రళయరూపమైనదియు, వివిధకర్మఫల వైచిత్ర్యభోగరూపమైనదియునగు పరావర్తనము అనుభూతమగుచున్నది

విధీనాం ప్రతిషేధానాం లోకసంస్థాప్రయోజనమ్
సైవ సంవిది రూఢత్వాత్ప్రేత్యాపి ఫలదా స్థితా. 19

వేద, శాస్త్రములయొక్క విధి, నిషేధముల సాఫల్యమును గలుగఁజేయునట్టి లోకస్థితి బ్రహ్మమందు రూఢిపడియుండుటవలన నదియే జీవుని మరణానంతరమున్ను పరలోకములందు దూరస్థకర్మలయొక్కయు ఫలమును కల్పించుచున్నది.

న కదాచన యాత్యస్తముదేతి న కదాచన
బ్రహ్మ బ్రహ్మచిదాభానం సర్వదాత్మన్యవస్థితమ్. 20

వాస్తవముగ ఆత్మకు (బ్రహ్మమునకు) జనన మరణములు లేవు. అది యెన్నఁడును ఉదయింపదు, అస్తమింపదు; సదా చిద్రూపమగు స్వాత్మయందె నెలకొనియుండును. జనన, మరణములు భ్రమచే కల్పింపఁబడినవేయగును.

యథా తు ద్రష్టృదృశ్యత్వాత్కల్పనా కల్పనాపురమ్
స్వయం జగదివాభాతి జాతమిత్యుచ్యతే తథా. 21

చైతన్యముయొక్క సంకల్పనగరమువంటి కల్పన ద్రష్టృదృశ్యాదులతోఁ గూడియుండుట వలన స్వయముగ జగత్తువలె భాసించుచున్నది. అట్లు భాసించునపుడది ఉత్పన్నమైనది, అని చెప్పఁబడుచున్నది. (అది వాక్కుయొక్క కల్పనామాత్రమేగాని వాస్తవముకాదు.)

యదా స్వభావాత్స్పందనం సంహృత్యాత్మని తిష్ఠతి
బ్రహ్మ చిద్గగనైకాత్మా శాన్త ఇత్యుచ్యతే తథా. 22

ఆప్రకారముగనే, చిదాకాశైకరూపమగు బ్రహ్మము నిజస్వభావమునుండి స్ఫురణము నుపసంహరించి స్వాత్మయందెపుడు నెలకొనియుండునో, అపుడు 'జగత్తు శమించినది' అను వ్యవహారము కలుగుచున్నది.

కచనాకచనే యస్య స్వభావో నిర్మలోఽక్షయః
యథైతావాత్మనో నాన్యోన్యస్పన్దాస్పన్దౌ నభస్వతః. 23

సంచలన, స్థిరత్వములు వాయువుయొక్క స్వభావమైయున్నట్లును, వాయువుకంటె నవి వేఱుకానట్లును, దృశ్యాకారమగు స్ఫురణ, అస్ఫురణములు చిదాకాశముయొక్క నిర్మల, అక్షయ స్వభావమైయున్నది.

జరామరణ హన్తౄణి క్షణాన్యత్ర పృథక్పృథక్
భవన్తీతి యథైతాని సన్తిత్వత్కల్పనాపురే. 24

బ్రహ్మసంకల్పనగరే స్వభావా ఉదితా స్తథా
ఓషధీనాం పదార్థానాం సర్వేషాం చ జగత్త్రయే 25

ఓ రాజా! వార్ధక్య, మరణాదులను నశింపఁజేయునట్టి మణిమంత్రౌషధాదుల యొక్కయు, పదార్థములన్నింటియొక్కయు వేర్వేఱు స్వభావములు నీయొక్క సంకల్పనగరము నందువలెనే బ్రహ్మముయొక్క సంకల్పనగరమగు ఈ త్రైలోక్యమందును 'ఈ మంత్ర, ఔషధాదు లీప్రకారమగు ప్రభావము గలిగియుండుగాక! అను నిట్టి బ్రహ్మముయొక్క సత్యసంకల్పము వలననే యుదయించినవైయున్నవి.

న సంకల్పయితా రాజన్సంకల్పనగరే స్వయమ్
తృణం తృణం కల్పయతి బాలః క్రీడనకా ఇవ. 26

ఓ రాజా! ప్రతిక్షణము ప్రతివస్తువునుగూర్చియు ఈశ్వరుఁడు స్వయముగ తన సంకల్ప నగరమగు ఈ జగత్తునందు స్వభావకల్పన గావించుచునుండఁడు. బాలుఁడు తన క్రీడాసాధనముల నొకేసారి సంకల్పించునట్లు, ఈశ్వరుఁడును ఈ యీజాతివస్తువు ఈ యీ కార్యమునుజేయుగాక! అని యొకేసారి కల్పించును. తదుపరి తత్సంకల్పవశముచే బీజాంకురన్యాయము ద్వారా పూర్వ పూర్వతృణాదు లుత్తరోత్తరతృణాదులను కల్పాంతమువఱకును కల్పించుచునుండును.

స్వయం స్వభావ ఏవైష చిద్ఘనస్యాశ్వ నుస్ఫుటమ్
యద్యత్సంకల్పయత్యాశు తత్ర తేఽవయవా అపి. 27

ఈ చిద్ఘన పరమాత్మ క్షణకాలములో నెచట నేయేపదార్థములను నేయేప్రకారముగ సంకల్పించునో అచట నాయాపదార్థములున్ను, వానిశక్తి, కార్యాది భేదములున్ను వానికార్యపరం పరలున్ను స్పష్టముగ ఆ ప్రకారముగనే యుదయించినవగుచున్నవి. ఇది యా పరమాత్మయొక్క స్వభావమే అయియున్నది.

చిదాత్మకతయా భాన్తి నానాత్మకతయాత్మనా
అప్యేకసారాస్తిష్ఠన్తి నానాకార స్వభావగాః. 28

ఆ సంకల్ప కల్పితపదార్థము లన్నియును స్వభావముగ నానారూపములతో స్థితినొంది యున్నను అధిష్ఠానదృష్టిచే ఏకమగు చిద్రూపముగనే భాసించుచున్నవి. మఱియు వివిధాకార స్వభావములు గల్గియున్నను నవి సద్రూపముచే ఏకమైన పరమాత్మరూపముగనే స్థితినొందియున్నవి

ప్రత్యేకం కిల తత్రాస్తి బ్రహ్మ చిన్మాత్రతాత్మని
సర్వాత్మికా సా యత్రాస్తే యథా స్తర్భాతి తత్తథా. 29

అట నాయాపదార్థములందు ప్రతిదానియందును (అస్తి. భాతి. ప్రియ రూపముచే) బ్రహ్మచిన్మాత్రత్వముగలదు. ఏలయనిన సర్వరూపమగు ఆచైతన్యమెచట నేప్రకారముగనుండునో, అచట నా ప్రకారముగ భాసించుచున్నది.

అనాదిమధ్యాన్తమనన్తవీర్యం కించిచ్చ కించిచ్చసదప్యసత్యమ్
స్థితం యథా యత్ర తథాత్మ తత్ర సర్గాత్మభూత్వాతత్తృణాదిజాతౌ. 30

ఇత్యార్షే శ్రీవాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే ఉత్తరార్ధే మహాప్రశ్నమోక్షణో నామ అష్టోత్తరద్విశతతమః సర్గః ॥ 208 ॥

ఓ రాజా! ఇవ్విధముగ ఆదిమధ్యాంతరహితమై అపరిచ్ఛిన్నశక్తి యుక్తమైనట్టి బ్రహ్మము పదార్థరూపముగను పదార్థ రహితముగను, సత్తుగను, అసత్తుగనుగూడ స్థితినొంది యున్నది. ('సత్యం చానృతం చ సత్యమభవత్' సత్యమగు పరమాత్మ సద్రూపముగను, అసద్రూపముగను గూడనయ్యెను శృతి.) ఏలయనిన ఆ పరబ్రహ్మము సర్వస్వరూపమైయుండుటచే ప్రాణులందును తృణాదిజాతులందును నెచట నేస్వభావము ప్రసిద్ధమై యుండునో, అచట స్వయముగ ఆ స్వభావమే అయి స్థితి నొందియున్నది.

ఇది శ్రీవాసిష్ఠ తాత్పర్యప్రకాశికయందు నిర్వాణప్రకరణమున నుత్తరార్ధమున మహాప్రశ్నమోక్షణమను రెండువందలెనిమిదవ సర్గము ॥ 208 ॥

---

## నవాధికద్విశతతమః సర్గః.

[ యుగపద్భోగ సంప్రాప్తౌ విరుద్ధఫలకర్మణామ్
అవిరోధేన సాఫల్యమిహ యుక్త్యా ప్రసాధ్యతే.

విరుద్ధఫలములనొసంగు కర్మలకొకేసమయమునభోగము (అనుభవము) సంప్రాప్తించ, అవిరోధముచే వానిసాఫల్య మిచటయుక్తిచే సాధింపఁబడుచున్నది ]

శ్రీవసిష్ఠ ఉవాచ :—

ఏకస్య జీవితం పుంసః సుహృతా మరణం ద్విషా
మృత్యార్థితం ప్రయాగాదౌ క్షేత్రే తే యత్తదిదం శృణు. 1

శ్రీవసిష్ఠుఁడు:— 'ప్రయాగాది కామనాప్రద క్షేత్రములం దొకేమనుజునిగూర్చి యాతని మిత్రుఁడు 'జీవింపవలయుననియు.' శత్రువు 'మరణింపవలయుననియుఁ' గోరివారిరువురును మరణించినచో, ఆ పిమ్మట, ఆ విరుద్ధ స్వభావయుక్తములగు కార్యములెట్లు సంభవింపగలవు?' అను నీ ప్రశ్నకు సమాధానమునువినుము.

క్షేత్రాణామర్థధర్మాణాం సర్వేషాం ప్రతి తం ఫలమ్
బ్రహ్మణా కల్పితం సర్గే స్వకే సంకల్పపత్తనే. 2

సమస్తక్షేత్రాదులయొక్కయు, తపస్సుమున్నగువానియొక్కయు ఫలము అధికారికొఱకై సృష్ట్యాదియందు బ్రహ్మముచే తన సంకల్పనగరమగు ఈ జగత్తునందుఁ గల్పింపఁబడియుండెను.

యత్ర పుణ్యం యదర్థం చ క్షేత్రం తాభ్యాం తథాకృతమ్
యది తద్వినియోజ్యస్య తస్యోన్నమతి నిష్కృతాత్. 3

అట్టి యీ జగత్తునందు అధికారియొక్క వాంఛితార్థసిద్ధికొఱకైనట్టి కామనాప్రదములగు ప్రయాగాదిక్షేత్రములందు శాస్త్రానుకూలముగ అధికారి స్నాన, దాన తపోయజ్ఞాది పుణ్యము నాచరించుచో అట్టి విధిపూర్వకకర్మానుష్ఠానముచే నాతనికి ఆప్రయాగాదులందలి మరణాదులు అవశ్యము ఫలదాయకములగును.

తత్తస్మాన్మహతః పాపాద్భాగమేనోఖిలం చ వా
చితిశక్త్యాత్మ తత్పుణ్యం పరిభ్రామ్యోపశామ్యతి, 4

మహాపాపియైనను శ్రద్ధాళుడై ప్రయాగాదులందు మరణించినచో మహాపాతకములను గూడ నశింపఁజేయునట్టి శక్తిగల, చైతన్యమందలి యా (ప్రయాగాది మరణజనితమగు) పుణ్యమపుడా పాపాదులయొక్క యొకభాగమునుగాని, లేక, ఆ సమస్తపాపములనుగాని తత్క్షేత్రమాహాత్మ్యతారతమ్యానుసారము వినాశమొనర్చి స్వయముగ తానును నుపశమించును.

వినేయపాపమల్పం చేత్క్షేత్రధర్మోఽధికస్తతః
తత్పాపం నాశయిత్వా తచ్ఛృద్ధి ఏవ వివల్గతి. 5

శాస్త్రానుసారము (క్షేత్రాదులందు)నడుచునట్టి మనుజునియొక్క పాపమల్పమైయున్నచో, మఱియు (క్షేత్రాదులందాతఁడార్జించునట్టి ధర్మమధికమైయున్నచో నపుడాధర్మ మా పాపమును సంపూర్ణముగ నశింపఁజేసి శ్రుత్యాదిప్రతిపాదితమగు ఫలమునుగూడ నాతనికిఁ గలుగఁజే...ను.

క్షేత్రధర్మేణ తేనాస్య వినేయస్య మహీపతే
ద్వే శరీరే విదా సమ్యక్కచతః ప్రతిభాత్మికే. 6

ఓ రాజా! అట్లు క్షేత్రాదులందు మనుజుఁడార్జించునట్టి ధర్మమాతని పాపమునకు సమానముగనున్నచో, అపుడాతని కాపాపపుణ్యముల రెంటియొక్క భోగముకొఱకై యాతదుపరి రెండుశరీరములున్ను, ఆశరీరములకొఱకై భ్రాంతిప్రతిభారూపములగు యిరువురు చిదాభాసులున్ను లెస్సగ స్ఫురించుదురు.

ఇత్యేవమాదిపాపానాం పుణ్యానాం చ ఫలం మహత్
బ్రహ్మసంకల్పకచితం యథా యద్యత్తథైవ తత్. 7

ఈప్రకారముగ న్యూనాధికభావముతోడ పుణ్యపాపములయొక్క మహత్ఫలము బ్రహ్మముయొక్క సంకల్పముచే నేయేప్రకారముగ స్ఫురించునో, ఆయాప్రకారముగనే యదివ్యవస్థితమైయున్నది.

బ్రహ్మోచ్యతేఽసౌ చిద్ధాతుః సోఽష్టకాద్యహమాది చ
స యథాస్తి తథా తత్తత్తస్య సంకల్పనం జగత్. 8

ఈ చిద్వస్తువగు బ్రహ్మమే హిరణ్యగర్భాది సమష్టిజీవులుగను, అస్మదాది వ్యష్టిజీవులుగను జెప్పఁబడుచున్నది. మఱియునది యెచటెచట నేయేప్రకారముగ సంకల్పించునో, అచటచట నాయాప్రకారముగనే స్థితిగల్గియుండును. అద్దాని సంకల్పనమే యీ జగత్తైయున్నది.

ప్రతిభైవ వినేయస్య క్షేత్రపుణ్యేన తాదృశీ
తథైవోదేతి సా ధాతుర్విపరీతవతో యథా. 9

పాపవంతునకు నరకాదిబుద్ధియుదయించునట్లు, బ్రహ్మముయొక్క సంకల్పానుసారము మనుజునకు తనక్షేత్రార్జితపుణ్యము ననుసరించి తత్ఫలభోగ రూపమగు బుద్ధియే స్వప్నమువలె నుదయించుచున్నది.

ఏకాత్మనాహమద్యైష మృతోఽమీ మమ బాన్ధవాః
రుదన్తీమే పరం లోకం ప్రాప్తోఽయమహమేకకః. 10

'నేఁడు నేనొకఁడనే మరణించితిని; వీరు నా బంధువులు, వీరు నా కొఱకేడ్చుచున్నారు; ఏకాకినై నేను పరలోకమును బొందితిని' అను నిట్టిబుద్ధి జీవునకు మరణానంతర ముదయించుచున్నది.

బన్ధూనామపి తత్రైవ తద్వైవాస్య తథైవ చ
ప్రతిభా తాదృశైవేతి ధాతుక్షోభవతామివ. 11

వాతపిత్తాది ధాతువులక్షోభచే మనుజుని బుద్ధియం దనేక విధములైన భ్రమలుదయించునట్లు మరణానంతరము జీవునకామరణమునుగూర్చిన బుద్ధివలెనే బంధువులరోదనమును గూర్చినట్టియు, శ్మశానగమనదాహాది సర్వవిషయములఁ గూర్చినట్టియు బుద్ధియుదయించుచున్నది.

అత్యగ్రైః పుణ్యపాపైః స్వైర్వా మహాత్మభిరీక్షితే
లక్ష్యాణ్యప్యన్యథా సన్తి నృణాం చిత్కల్పనావశాత్. 12

మనుజునకెపుడు అత్యధికములైన పుణ్యములుగాని, పాపములుగానియుండునో, అపుడాతడాపుణ్య, పాపములచే సంక్షుబ్ధులైన మహాత్ములచే నిగ్రహ, అనుగ్రహదృష్టులచేఁ జూడఁబడ, మహాత్ములకుఁ గానుపించునట్టివియు, తదితరులకు, గానుపింపనట్టివియునగు తత్ఫలములైన శరీరాదులు చైతన్యముయొక్క కల్పనావశముచే నాతనికపుడు కలుగును.

అచేతనం శవీభూతం తేఽపి పశ్యన్తి తం మృతమ్
రుదన్తి తం చ దహనే క్షిపన్తి సహ బాన్ధవైః. 13

ఆ బంధ్వాది ఇతరజనులున్ను నాతనినపుడు అచేతనునిగను, శవీభూతునిగను, మృతునిగను గాంచుదురు. మఱియు నేడ్చుచు వారపుడాతని బంధువులతోఁగూడ శ్మశానమునకేగి యాతనినటదహనము చేసివైతురు.

వినేయః స యథాన్యేన సంవిద్రూపేణ దేహినా
అజరామరఋమాత్మానం వేత్తి స్థితమదుఃఖితమ్. 14

ఒకేమనుజునిగూర్చి ప్రయాగాది కామనాప్రదక్షేత్రములందాతని మిత్రుఁడు 'ఈతఁడు సుఖముగ జీవించుగాక !' అనియు, శత్రువు 'ఈతఁడు మరణించుగాక' అనియు కోరిమరణించినచో నపుడమ్మనుజుఁడు తన మిత్రునిచే స్నేహసంవిద్రూపముతో ప్రార్థింపఁబడిన విధమున తన్ను జరామరణ రహితునిగను, దుఃఖవర్జితునిగను నెఱుఁగును.

యథాస్థితేన దేహేన వేత్త్యసౌ జీవితస్థితమ్
మృతిం త్వదృశ్యేనాన్యేన క్షేత్రపుణ్యవిదేరితః. 15

అట్టి సుఖజీవితస్థితి నాతఁడు తన యీ యథాస్థితమగు దేహముతోనే యెఱుఁగును, కాని క్షేత్రాదులందు పుణ్యమునుగావించిన తనశత్రువుచే మరణించులాగున కోరఁబడుటచే. బంధు మిత్రాదులకు అదృశ్యమైనట్టి మఱియొకదేహమునుదరించి మరణమునున్ను ఆ సమయముననే యాతడనుభవించును

ఆవిలా సంవిదా సంవిచ్చాన్యయా వేద్యతే క్షణాత్
నహి సన్నద్ధగాత్రస్య క్లేశోఽసన్నద్ధభేదనే. 16

శత్రుకృతములగు అభిచార (మరణ) ప్రయోగాదులయొక్క ప్రతీకారమందు అసమర్థమై వ్యాకులమైనట్టి సంవిత్తు క్షణకాలములోనే యపుడు మరణాదుల ననుభవించును. శరీరమున కవచ. ఆయుధాదులను ధరించి సంసిద్ధుఁడైయున్నవానికి, అట్లు కవచాదులను ధరింపక యున్నవానిని బాణ, ఖడ్గాదులచే భేదించుటయందు క్లేశమేమియును లేదుకదా !

పశ్యన్తి బన్ధవోఽప్యేనం తథైవామరతాం గతమ్
ద్వయమిత్యేష లభతే జీవితం మరణం సమమ్. 17

ఈ ప్రకారముగ నాతనిని బంధ్వాదులు మృత్యురహితునిగఁ గాంచినను, వారికి అలక్ష్యమైనట్టి దేహముతో నాతఁడు మరణమునున్ను ననుభవించుచున్నాఁడు. ఇవ్విధమున నాతఁడేక కాలముననె జీవితమును, మరణమునుగూడఁ బొందుచున్నాఁడు.

ఇదమప్రతిఘారమ్యం భ్రాన్తిమాత్రం జగత్త్రయమ్
న సంభవతి కో నామ భ్రాన్తౌ భ్రాన్తివిపర్యయః. 18

స్థిరరూపముగ ప్రాదుర్భవించియున్న యీ ముల్లోకములున్ను భ్రాంతిమాత్రములే అయియున్నవి భ్రాంతియందు విపరీతమైన దేది సంభవింపకుండును ? (స్వప్న, సన్నిపాతాదులం దనేక విరుద్ధకార్యము లేకకాలముననే గాంచఁబడుచున్నవిగదా !)

సంకల్పస్వప్నపురయోర్యా భ్రాన్తిరనుభూయతే
తతోఽధికోఽయం న న్యూనాజ్జాగ్రత్స్వప్నేఽనుభూయతే. 19

సంకల్ప, స్వప్న నగరములందేభ్రాంతి యనుభవింపఁబడుచున్నదో, దానికంటె నెంతయో యధికమైనట్టి భ్రాంతియే యీ జాగ్రద్రూప స్వప్నమందును ననుభవింపఁబడుచున్నదే గాని న్యూనమైనట్టిదికాదు..

రాజోవాచ :—

ధర్మాధర్మౌ కథం బ్రహ్మన్కారణం దేహసంవిదః
తస్యామూర్తౌ కథం చైకో ద్విశరీరత్వమృచ్ఛతి. ౨0

రాజు:– మహాత్మా! ధర్మాధర్మములు దేహమునకు కారణమెట్లగుచున్నవి? మఱియు అధర్మాధర్మములు ఆకారరహితములైయున్నందున జీవుని మరణానంతరము అవి మఱియొక శరీరము నెట్లు పొందగల్గును?

**శ్రీ వసిష్ఠ ఉవాచ :—**

సంకల్పనగరే బ్రాహ్మే జగత్యస్మిన్మహామతే
కిం నామ నో సంభవతి సత్యం వాప్యసమఞ్జసమ్. 21

శ్రీ వసిష్ఠుఁడు.— మహాబుద్ధిమంతుఁడవగు ఓ రాజా! బ్రహ్మముయొక్క సంకల్పనగరమగు ఈ జగత్తునందు అసంగతమైనదేది సత్యము కాకుండును! (బ్రహ్మముయొక్క సత్యసంకల్పము అమూర్తమునున్ను మూర్తముగఁజేయసమర్థమైనదని భావము)

యథైవ సంకల్పపురే యన్న సంభవతీహ హి
తన్నాస్త్యేవ తదేతస్మిన్కింవాస్తు బ్రహ్మకల్పనే. 22

సంకల్పపురమున అసంభవమైన దేదియును నెట్టులేదో, అట్లే బ్రహ్మముయొక్క కల్పనమగు యీ జగత్తునందును అసంభవమైన దెద్దియునులేదు

స్వప్నసంకల్పపురయోరేకో గచ్ఛతి లక్షతామ్
తథా చైత్యైవ చిత్స్వప్నే సేనాత్వముపగచ్ఛతి. 23

స్వప్న, సంకల్పపురములందెట్లు ఒకేచైతన్యము లక్షలకొలఁదిరూపములను ధరించుచున్నదో, అట్లే యీ జాగ్రత్తను స్వప్నమందను నొకేచైతన్యము గొప్పసేనయొక్క రూపమును ధరించుచున్నది.

సహస్రాణ్యేకతాం యాన్తి తథా సైన సుషుప్తకమ్
అన్యథా స్వప్నసంకల్ప సేనానుభవసంస్మృతౌ. 24

సంకల్పస్వప్నపురయోరితి కో నానుభూతవాన్
సంవిదాకాశమాత్రేఽస్మిఞ్జగత్యనుభవాత్మని. 25

ఆవిధముగనే, అనేకరూపములతోఁగూడిన యా స్వప్నసేనయె తిరిగి సుషుప్తియందు ఏకరూపమగుచున్నది. చిదాకాశమాత్రమై, అనుభవరూపమైనట్టి యీ జగత్తునందు, స్వప్న, సంకల్పాను భూతమైన సేనఁగూర్చిన స్మృతియందు నేను జూచిన సేన ఇదియె అను ఈ కల్పనచే ఆ సేనయొక్క ఏకరూపానుభవము సర్వానుభవసిద్ధమైయేయున్నదిగదా!

తస్మాదస్మింశ్చిదాకాశసంకల్పే జగదాత్మని
న సంభవతి కిం నామ తత్సంభవతి వాపి కిమ్. 26

ఇక్కారణమున చిదాకాశముయొక్క సంకల్పమాత్రమగు ఈ జగత్తునందు సంభవింపనిదిగాని, సంభవించునదిగాని యేదియునులేదు.

ఏవమేవమియం భ్రాన్తిర్భాతి భాస్వన్నభోమయమ్
నేహ కించన సన్నాసన్న వాఽసదిహ కించన

ఈప్రకారముగ ఈ జగద్రూపభ్రాంతి ప్రకాశశీలమైన చిదాకాశముగనే భాసించు చున్నది. ఇట సత్తుగాని, అసత్తుగాని, సదసత్తుగాని యొకింతైననులేదు.

యథానుభూయతే యద్యత్తత్తథా తత్త్వదర్శినః
ప్రబుద్ధస్యాత్ర కిం నామ తత్స ఏవాఙ్గతేత్యలమ్. 28

ప్రియుండవగు రాజా! ఏయేపదార్థ మేయేప్రకారముగ ననుభూతమగుచున్నదో, అది యది చిదాకాశమే యాప్రకారముగ నిపవస్తుభావమును బొందియున్నదగును. కావున ప్రబుద్ధుడగు తత్త్వదర్శియొక్క దృష్టియందిట అసమంజసమైన దేదియును లేదు. అట్లే నీకును నేమియు లేకుండుగాక!

ఇహ చేత్ప్రోహితో ధర్మస్తత్స్వర్గేఽమృతపర్వతాః
స్థితా ఇతీహ సంకల్పే కస్మాన్న ప్రాప్తవాన్గిరీన్. 29

దేవతలు నారి భోగ్యవస్తువులగు అమృత రసపూర్ణ సరోవరములు, పుష్పాదులచే బూర్ణములగు పర్వత, వనవాటికలు, అప్సరాసులు స్వర్గమందుగలవని శాస్త్రములద్వారా యెఱిగి తదనుసారమగు సంకల్పముగల్గి ధర్మాదుల నాచరించువాడు, స్వర్గమునకేగి యట నా పదార్థము లన్నింటిని దాను బొందినట్లేల యనుభవింపకుండును? (తప్పక అనుభవించునని భావము)

ఇహ యత్క్రియతే కర్మ తత్పరత్రోపభుజ్యతే
ఇతీహ సంకల్పపురే సర్వమేవానమఞ్జసమ్. 30

ఓ రాజా! మిథ్యాత్వమువలన నిదియంతయును అసమంజసమను బుద్ధి నీవు కల్గి యున్నచో, అప్పుడీలోకమున్ను, ఇటంగావింపబడు ధర్మానుష్ఠానమున్ను, దానిచేగలుగు పరలోక మున్ను, అచటి భోగమున్ను సమస్తము ఈ జగత్తను సంకల్పపురమున అసమంజసమేయగును.

యది స్యాత్పుస్థిరం కించిద్వస్తు తద్దృశ్యకో భవేత్
న్యాయ ఏషోఽఖిలః కింతు సంవిత్త్వాత్స్వస్వకం స్థితః. 31

జగత్తునందు భూత, భువనాది వస్తువొకింత యేదేని సత్యమగుచో, అపుడేదృశ్యము సంభవింపవచ్చును. మఱియు నపుడు ఇది సమంజసము ఇది అసమంజసము అను ఈ న్యాయ మంతయును అకుంఠితముగ నుండును. కాని ద్రష్టయంతయు సంవిద్రూపమై యుండుటచే ఆ యా ద్రష్టయొక్క కల్పనయే దృశ్యరూపముగ స్థితినొందియున్నదేగాని దృశ్యము వాస్తవముగలేదు.

ఇత్యేష కథితో న్యాయః సిద్ధాస్వనుభవస్తతః
యతో జగన్తి సంకల్పశ్చితో బ్రహ్మస్వరూపతః. 32

ఇట్లు సర్వప్రసిద్ధములైన, స్వప్న, సంకల్ప కల్పనలయందలి యే న్యాయమును అసమం జసత్వ దోషపరిహారార్థము మేము వచించితిమో, దానినే యీ సర్వానుభవ సిద్ధమగు జగత్తుయొక్క విషయమందును నుపయోగింపవలయును. ఏలయనిన స్వప్నమువలె ఈ జగత్తులున్ను బ్రహ్మ స్వరూపమగు చైతన్యముయొక్క సంకల్పమే అయియున్నవి.

తవ సంకల్పనగరే నాస్త్యేవాసంభవో యథా
సర్వార్థానాం తథా బ్రహ్మ సంకల్పే నాస్త్యసంభవః. 33

ఓ రాజా! నీయొక్క సంకల్పనగరమున అసంభవమైనదేదియును నెట్లులేదో, అట్లే బ్రహ్మముయొక్క సంకల్పనగరమగు ఈ జగత్తుయొక్క సమస్తపదార్థములందును అసంభవమైన దెద్దియును లేదు.

యద్యథా కల్పితం తత్ర యావత్సంకల్పమేవ తత్
స్వభావేన తథైవాస్తి యత స్తత్సంనివేశవత్. 34

బ్రహ్మముయొక్క సంకల్పమున నేవస్తు వేప్రకారముగ కల్పింపబడినదో, అది యాప్రకారముగనే యట్టియాకారముతోఁ గూడియున్నదానవలె స్వభావముగ స్థితినొందియున్నది.

తతః సంప్రేక్షణమిహ సంకరో న ప్రవర్తతే
వినాన్యచ్చిత్ప్రయత్నేన భవత్యర్థస్తు నాన్యథా 35

పిమ్మట అట్టి యాకారస్వభావ నియమమువలన జ్ఞానేంద్రియములచే అవిరోధపూర్వకముగ సమస్తవస్తువులయొక్కయు నిరీక్షణము ప్రవర్తించుచున్నది. అట్లే కర్మేంద్రియ వ్యవహారమున్ను, సంకరములేకయే ప్రవర్తించుచున్నది. పూర్వకాలమున చైతన్యముయొక్క ప్రయత్నముచేఁ గావింపఁబడిన నిశ్చలాకారియుక్తమగు పదార్థము ఉత్తరకాలమున చైతన్యముయొక్క మఱియొక ప్రబలప్రయత్నము లేనిచో అన్యథాభావమును బొందఁజాలదు.

ఆకల్పమజసంకల్పే యథా భాతం జగత్స్థితమ్
పునరన్యేన సంకల్పరూపేణాన్యదు పైష్యత. 36

(హిరణ్యగర్భవేషుఁడగు) బ్రహ్మముయొక్క సంకల్పముచే నేపదార్థ మేప్రకారముగఁ గల్పింపఁబడినదో, అది ప్రళయమువఱకు నాప్రకారముగనే స్థితినొందియుండును. పిదప ప్రళయానంతరము ఆ కల్పముయొక్క చైతన్య - ప్రయత్నము ననుసరించి అన్యథాభావమును బొందును.

సంకల్పాత్మ స్వయం భాతి కల్పే కల్పే జగత్తథా
ప్రతిజీవం చితి స్వప్నే స్వప్నే స్వాప్నపురం యథా. 37

ప్రతిజీవునకు చైతన్యమందు స్వప్న స్వప్నమందును స్వప్ననగరము భాసించునట్లు బ్రహ్మముయొక్క సంకల్పరూపమగు ఈ జగత్తున్ను కల్పకల్పమందును స్వయముగ భాసించుచున్నది.

సంకల్పసత్తన తనోర్న తదస్తి కించి
ద్యద్యన్న సంభవతి తచ్చ చిదాత్మనోఽస్మాత్
నాన్యత్ప్రకల్పయితు రాద్య వరస్వరూపా
ద్బ్రహ్మైవ తేన సకలం జగదఙ్గ విద్ధి. 38

ఇత్యార్షే శ్రీ వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే ఉత్తరార్ధే సర్వాస్తిత్వానుభూతి దర్శనం నామ నవాధికద్విశతతమః సర్గః ॥ 209 ॥

ప్రియుఁడవగు నో రాజా! బ్రహ్మముయొక్క సంకల్పనగరమగు ఈ జగత్తునందు సంభవింపనిది యొకింతైననులేదు. కావున ఈ సమస్త సంకల్పిత జగత్తున్ను సంకల్పకర్తయైన అద్వి

స్వరూపమగు చిద్రూపపరబ్రహ్మముకంటె వేఱుకాదు. కాఁబట్టి యీ జగత్తంతయును బ్రహ్మమే యని యెఱుఁగుము.

ఇది శ్రీవాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున నుత్తరార్ధమున మహాప్రశ్నోత్తరమున సర్వాస్తిత్వానుభూతిదర్శనమను రెండువందల తొమ్మిదవ సర్గము ॥ 209 ॥



## దశాధికద్విశతతమః సర్గః

[ ఇహ వసిష్ఠప్రశ్నానాం సమాధానం నిరూప్యతే
తథా దేహాదిజగతః సుదృష్ట్యా బ్రహ్మమాత్రతా.

వసిష్ఠమునీంద్రుఁడు రాజడిగిన తక్కిన ప్రశ్నలకు సమాధాన మొసంగుట. ఉత్తమ (జ్ఞాన)దృష్టిచే దేహాదిజగత్తుయొక్క బ్రహ్మమాత్రత్వము - ఇచట వివరింపఁబడుచున్నవి.]

శ్రీవసిష్ఠ ఉవాచ :—

ఫలే క్షయేన్దుఖారూపే ప్రాప్తే ధ్యాతృశతైర్నభః
యథా న శతపూర్ణేన్దు తథేదం కథనం శృణు. 1

శ్రీవసిష్ఠుఁడు:— ఓ ప్రజ్ఞప్తిరాజా ! 'ఆకాశమున నేను పూర్ణచంద్రుఁడగుదును.' అని యిట్లేకకాలమున ననేకులు ధ్యానించుచో, అట్టి ఫలము వారికి సంప్రాప్తింప నపుడాకాశ మనేక పూర్ణచంద్రయుక్తముగ నేలయగుటలేదను నీ ప్రశ్నకు సమాధానమును వినుము

చన్ద్రబిమ్బస్య ధ్యాతారః ప్రాప్తాః ప్రాప్తవ్యసుస్థితాః
నేదం నభస్తలం ప్రాప్తా న చేమం శశినం శ్రితాః. 2

చంద్రబింబమును గూర్చిన అహంభావముగల్గి తద్బింబమును ధ్యానించువారు అట్టి చిరకాల ధ్యానముచే నితరభావమును మఱచుటవలన (ఐందవన్యాయముచే) చంద్రుని రూపమును తప్పక పొందినవారై స్థితినొందియుందురు. కాని వారీయాకాశమునుగాని, ఈ చంద్రునిగాని, పొందుటలేదు.

క్వేవాన్యసంకల్పపురమన్యః ప్రాప్నోతి కథ్యతామ్
సంకల్ప పుర్యామర్థాప్తిస్తజ్జ్ఞస్యైవ నాపరే. 3

ఏలయనిన, ఒకనిసంకల్పపురమును మఱియొకఁడు పొందుటను నెచటఁజూచితివో చెప్పుము. సంకల్పపురమునందలి పదార్థముల ప్రాప్తి యా సంకల్పించుజీవునియందే కలదుగాని యితరునియందుగాదు.

పృథక్పృథక్స్వే సంకల్పసర్గఖేష్వేవ తే స్థితాః
చన్ద్రాస్తపన్తి తత్రైవ కలాక్షయవివర్జితాః. 4

కావున, తమ తమ సంకల్ప సృష్టియందలి యాకాశముననే వారందఱును వేర్వేఱుగ స్థితి నొంది యున్నారు. మఱియు నచటనే కళాక్షయవర్జితులై పూర్ణచంద్రరూపముతో వెలుగుచున్నారు.

విశేయమస్మిన్నే వేన్దావితి ధ్యాతా నిశాక రే
అస్మిన్నేవ విశత్యన్తరాత్మబుద్ధిసుఖోజ్ఝితః. 5

ఏ ధ్యాత 'నిశాకరుఁడగు ఈ చంద్రునియందే నేను ప్రవేశించుదును.' అనిధ్యానించునో, అతఁడు ఆత్మజ్ఞానసుఖరహితుఁడై యీ చంద్రునియందే ప్రవేశించును.

అహమిన్దుం ప్రవిష్టః స్యామిన్దుబిమ్బసుఖాన్వితః
ధ్యాతేతి తాదృక్సుఖ భాగ్యవతీతి వినిశ్చయః. 6

నీ ప్రశ్నయందలి జనులు 'నేను చంద్రబింబ సుఖముతోఁ గూడుకొనినవాఁడనై యాకాశమున చంద్రబింబమున బ్రవేశించుదును' అనియే ప్రత్యేకముగ ధ్యానించువారగుటచే వారవ్విధము ననే చంద్రబింబసుఖాన్వితులై చంద్రునియందు బ్రవేశించుదురనుట నిక్కము. అంతేగాని యీ చంద్రుని యందుఁ బ్రవేశింపరు.

యథాయమనుసంధత్తే స్వభావం సంవిదవ్యయా
తం తథైవానుభవతి భవేచ్చేద్దృఢనిశ్చయః. 7

ఏలయనిన, మనుజుఁడేస్వభావము నేరీతిగ దృఢసంకల్పముతో ధ్యానించునో ఆ స్వభావము నారీతిగనే నాశరహితమగు యాతని సాక్షిసంవిత్తు అనుభవించును.

యథేన్దుత్వం స్వసంకల్పాత్పర్వధ్యాతుః పృథక్పృథక్
భాత్యేవమేవ వనితాలాభః కాల్పనికః స్వతః. 8

ఇవ్విధమున స్వసంకల్పమువలన ధ్యాతలందఱికిని వేర్వేఱుగ చంద్రత్వమెట్లు సంప్రాప్తించునో అట్లే యొకే స్త్రీయు ఆ స్త్రీనిగూర్చి ధ్యానించువారి కందఱికిని తమ తమ కల్పన ననుసరించి వేర్వేఱుగ భాసించును.

యా ధ్యానే ధ్యాతృలక్షణాం సాధ్వీ భార్యాత్వమాగతా
తత్కల్పనానుభవనం తేషాం సత్త్వాత్మని స్థితమ్ 9

ఏ సాధ్వియగు స్త్రీ అనేక ధ్యాతల యొక్క ధ్యానమున భార్యా రూపత్వమును బొంది యున్నదో, ఆమె వారి వారి యొక్క కల్పనానుసారము వేర్వేఱుగ వారి యంతఃకరణోప హిత మగు సాక్షిచైతన్యమున స్థితిగల్గియున్నదగును.

గృహాదనిర్గతో జీవః సప్తద్వీపవరః స్థితః
తస్యాపి తత్కాల్పనికం రాజ్యం వ్యోమ్ని స్వమన్దిరే. 10

అట్లే, నేను గృహమునుండి బయటకు వెడలకుండగనే సప్తద్వీపాధిపతి యగుదును అని ధ్యానించువానికిని తనగృహమున స్వచిత్తాకాశముననే యాకల్పనాసిద్ధమగు రాజ్యము విద్యమానమై యున్నదగును.

సమస్తం కల్పనామాత్రమిదమాద్యజ్ఞజన్మనః
శూన్యమప్రతిఘం శాన్తం తేష్వపి స్యాత్క్రమన్యథా. 11

ఎపుడీ మనదృశ్యరూపమగు జగత్తంతయునుగూడ ఆద్యస్వరూపుఁడును, సర్వజ్ఞుఁడు నగు హిరణ్యగర్భునియొక్క కల్పనామాత్రమై, శూన్యమై, నిరాకారమై, శాంతమై, ఏ పదార్థము యొక్కయు అసమంజసత్వము లేనిదైయున్నదో, అపుడిఁక ఆ యుపాసకుల కల్పితజగత్తులందును అసమంజసత్వ దోషమెట్లుండును ?

దానౌర్ధ్వదేహికతపోజపాదీనాం పరత్ర యత్
అమూర్తానాం ఫలం మూర్తం తదిదం కథ్యతే శృణు. 12

ఓ రాజా ! ఇఁక ఈ ప్రపంచమున మనుజునిచే గావింపఁబడినఁ దాన, (శ్రాద్ధాది) ఔర్ధ్వ దేహిక క్రియా, తపో, జప, దానాది కర్మలయొక్క అమూర్త (నిరాకార)ములగు పుణ్యాదులకు పరలోకమున మూర్తమగు (దేహాదిరూప) ఫలమెట్లు కలుగునను ప్రశ్నకు సమాధానమును జెప్పు చున్నాను వినుము.

దానాదిచిహ్నితధియః పరత్ర స్వప్నవత్ఫలమ్
పశ్యన్త్యమూర్తామూర్తాభమజం చిన్మాత్రకల్పనాత్. 13

దానాదులచే చిహ్నితమైనబుద్ధిగల అమూర్తులగు జీవులు స్వప్నమందువలె పరలోక మున చైతన్యముచేతనే మూర్తాకారముగ కల్పింపఁబడిన ఫలమును బొందుచున్నారు.

వేదనావేదనాకారా స్పన్దాస్పన్దాత్మవై పునః
చిన్మాత్రస్యాస్య తద్భ్రాన్తిశాన్తౌ శాన్తాత్మ నిర్మలమ్. 14

మనస్సుచేతను, జ్ఞానేంద్రియములచేతను, చిన్మాత్రమునకు వేదనా, అవేదనాకారమగు భ్రాంతి కలుగుచున్నది. అట్టి భ్రాంతిచే విషయ ప్రాప్తికొఱకై మరల యా చిన్మాత్రము మన స్సహితములైన కర్మేంద్రియములచే చలన అచలనరూపమగుచున్నది. ఆ భ్రమ శమింప శాంతమై, నిర్మలమైనటి ఆత్మయే శేషించుచున్నది.

చిన్మాత్రాభిమతో దానాదముత్రా త్తమవాప్నుయాత్
సంకల్పాత్మేతి కవయః కథం తన్నోపలభ్యతే. 15

ఈ లోకమున ననుష్ఠింపఁబడిన దానాదులచే పరలోకమున చిత్ప్రతిభాస రూపమగు ఆ యా ఫలమును తత్సంకల్పరూపుఁడగు జీవుఁడు పొందునని అనుభవజ్ఞులగు జ్ఞానులు చెప్పు చున్నారు. కావున అదియేల లభింపకుండును ?

కల్పనాత్మని సంసారే సంకల్పోఽకృత్రిమం ఫలం
చిన్మాత్రమఖితోఽదానాద్దానాద్వాస్తు యథోదితః. 16

కల్పనామయమగు ఈ ప్రపంచమున అకృత్రిమమైన చిన్మాత్రమే (సంకల్పముద్వారా) దానాదులచే భోగైశ్వర్యాది ఫలరూపముగాని, అదానాదులచే దారిద్ర్యాది ఫలరూపముగాని, పర లోకమున నగుగాక ! ఇందేవిరోధమున్ను లేదు

ఏతత్తే కథితం సర్వం యథాపృష్టం మహీపతే
జగద్ప్రతిభం సర్వమిదం చిన్మాత్రకల్పనమ్. 17

ఓ రాజా! ఈప్రకారముగ నీవడిగినదానికి సమాధానపూర్వకముగ ఈజగత్తంత యును నిరాకారమైనదనియు చైతన్యముయొక్క కల్పనామాత్రమైనదియు నీకు వచించితిని.

రాజో ఉవాచ:—

సర్గాదౌ భగవన్దేహమిదం చిన్మాత్రకల్పనమ్
కథం భాతి కథం కుడ్యం వినా దీపః ప్రకాశతే. 18

రాజు:— మహాత్మా! సృష్ట్యాదియందు దేహవర్జితమగు చైతన్యముచేఁ గావింపఁబడిన యీ దేహకల్పన యెట్లు భాసించును? ఏలయనిన దేహమందే చైతన్యముయొక్క అభివ్యక్తిగాంచఁ బడుటవలన కుడ్యాదులులేనిచో దీపప్రకాశము భాసింపనట్లు, దేహములేనిచో చైతన్యము భాసింపదుగదా.

శ్రీ వసిష్ఠ ఉవాచ :—

త్వయార్థో దేహశబ్దస్య యో బుద్ధః స మహామతే
తత్త్వజ్ఞం ప్రతి నాస్త్యేవ శిలానృత్తమివామ్బరే. 19

శ్రీ వసిష్ఠుఁడు:—మహామతివగు ఓ రాజా! 'దేహ' శబ్దమునకు ఏ (జడమను) అర్థమును నీవు గ్రహించితివో; అది ఆకాశమందు శిలయొక్క నృత్యమువలె తత్త్వజ్ఞుని దృష్టియందు లేనేలేదు, జ్ఞానియొక్క దృష్టియందంతయు బ్రహ్మమే అయియున్నది.

య ఏవ బ్రహ్మశబ్దార్థో దేహశబ్దార్థ ఏవ సః
నార్థయోరనయోర్భేదో విద్యతేఽమ్బ్వమ్బునోరివ. 20

ఏది బ్రహ్మశబ్దముయొక్క అర్థమో, అదియే దేహశబ్దముయొక్కయు అర్థమైయున్నది. 'జల, సలిల' శబ్దములయొక్క అర్థములకువలె. ఈ 'బ్రహ్మ, దేహ' శబ్దములయొక్క అర్థముల కున్నుభేదమేమియును లెదు

యదేవ బ్రహ్మదేహోఽసౌ స్వప్నాభః స్వప్న ఏష తు
త్వద్బోధాయోచ్యతే యుక్తిర్న్నతు తత్స్వప్న ఏవ తు. 21

ఓ రాజా! ఏ యీ దేహమును నీవు చూచుచున్నావో, అది స్వప్న దేహమువలె చిద్రూప బ్రహ్మమే అయియున్నది. ఈ స్వప్నదృష్టాంతరూపమగు యుక్తియు నీకు బోధించుటకొఱకే తెలుపఁబడినది గాని, వాస్తవముగ ఆ స్వప్నము స్వప్నముకాదు, బ్రహ్మమే యగును.

స్వప్నస్తవానుభూతార్థస్తేనాత స్త్వం ప్రబోధ్యసే
నతు సర్గే చిదాభాతే సాదృశ్యం స్వప్నభస్మనా. 22

స్వప్నము నీకనుభూతమగు వస్తువైయున్నది కావుననే దానిచే నీకు బోధగావింపఁబడు చున్నది. అంతేగాని వాస్తవముగ స్వప్నమను భస్మము (బాధితవస్తువు) తోడ చిద్రూపముగ భాసించు సృష్టికి సాదృశ్యములేదు.

కస్త్వత్ర నామ దేహోఽయం కస్మైతే స్వప్నధీః క్వ వా
సంక్షేపేణ జ్ఞానబుద్ధేన క్రమేణాజ్ఞోఽవబోధ్యతే. 23

ఎపుడంతయు కేవలము బ్రహ్మమే అయియున్నదో, అపుడిఁక నచట ఈ దేహమేమి? స్వప్నపదార్థము లెవనికి ? స్వప్నబుద్ధి ఎచట? స్వప్నమను మిథ్యారూపభ్రమచే జ్ఞాని అజ్ఞానికి బోధించుచున్నాఁడు; అంతే.

తత్రజాగ్రన్న చ స్వప్నో న సుషుప్తం న చేతరత్
కిమపీత్థమిదం భానం ఖమాత్రం మౌనమోమలమ్. 24

ఆ బ్రహ్మపదమున జాగ్రత్తుగాని, స్వప్నముగాని సుషుప్తిగాని, మఱియేదిగాని లేదు అనిర్వచనీయమై, చిదాకాశమాత్రమై, మౌనరూపమై, విరాడాది పాదత్రయవిలయముచే శేషించు తురీయమను ఓంకారముయొక్క లక్ష్యార్థమై, పరమపురుషార్థరూపమైనట్టి బ్రహ్మమే యిట్లు జగద్రూపముగ భాసించుచున్నది.

అభాతమేవ భాతీవ యదద్యేత్థమిదం తు తత్
ప్రాగ్విభాతం యథాత్యచ్ఛం జాగ్రత్స్వప్నాది నో యథా. 25

ఏ యీజగత్తు ఇపుడివ్విధమున భాసించుచున్నట్లు గోచరించుచున్నదో, అది వాస్తవము భాసింపకయున్నదేయగును. జాగ్రత్స్వప్నాదులు యథార్థముగ లేవు. అతి నిర్మలమగు బ్రహ్మము మాత్రమే కలదు.

దేశాద్దేశాన్తర ప్రాప్తౌ యన్మధ్యే సంవిదో వపుః
తన్మయం సర్వమేవేదం ద్వైతమద్వైతమేవ చ. 26

ఒకప్రదేశమునుండి మఱియొకప్రదేశమునకు నేత్రేంద్రియముద్వారా బుద్ధివృత్తి చనునపుడు ఆ రెండుప్రదేశముల మధ్యనుండు చైతన్యముయొక్క నిర్విషయస్వరూపమేదిగలదో, అద్దానిచే పరిపూర్ణమై యీ ద్వైతాద్వైతరూపమగు జగత్తంతయును వెలయుచున్నది.

అన్యత్ర చిన్మయం స్వప్నం ద్వైతాద్వైతం శుభాశుభమ్
నిరావరణచిన్మాత్రనభసైవోపమీయతే. 27

అజ్ఞానికి బోధించునిమిత్త మాతనిదృష్టియందీజగత్తునకు స్వప్నముతో సాదృశ్యము చెప్పఁబడుచున్నది. జ్ఞానియొక్క దృష్టియందో ద్వైతాద్వైత. శుభాశుభరూపమగు స్వప్నాదిజగత్తంతయును చిన్మయమేఅయియున్నది గావున ఈ సమస్తమునకు నిరావరణమైనట్టి చిన్మాత్రాకాశముతోనే సాదృశ్యము చెప్పఁబడుచున్నది.

శూన్యమర్థోపలమ్భశ్చ భానం చాభానమేవ చ
ద్వైతమైక్యమసత్సచ్చ సర్వం చిద్గగనం పరమ్. 28

శూన్యము, పదార్థప్రాప్తి, పదార్థముల భానము (సృష్టి), అభానము ((ప్రళయము), ద్వైతము, ఏకత్వము, అసత్తు, సత్తు సమస్తము పరమచిదాకాశమే అయియున్నది.

పూర్ణాత్పూర్ణం ప్రసరతి పూర్ణమేవ స్థితం జగత్
నచ భాతం నచాభాతం శిలాబద్ధోదరోపమమ్. 29

పూర్ణమగు పరబ్రహ్మమునుండి పూర్ణమేయగు జగత్తు ప్రసరించుచున్నది. మఱియు ఈ జగత్తు పూర్ణపరబ్రహ్మముగనే స్థితినొందియున్నది. ఇది వాస్తవముగ భాసించుటలేదు. భాసింపకయులేదు; శిలయొక్క ఘనీభూతమగు మధ్యభాగమువలె నిది చిద్ఘనమాత్రమే అయి యున్నది.

యతో జగచ్చిదున్మేషో వ్యోమాత్మప్రతిమం తతః
చిన్మాత్రం యత్ర యత్రాస్తి తత్ర తత్రోదితం జగత్. 30

ఈ జగత్తు చైతన్యము యొక్క స్ఫురణ మాత్రమై యున్నందున నిరాకారమగు చిదాకాశరూపమే అయి వెలయుచున్నది. మఱియు నెచటెచట (మాయాశబలిత) చిన్మాత్రముగలదో, అచటచట జగత్తున్ను నుండుటకు తగియున్నది.

చిద్వ్యోమ చాస్తి సర్వత్ర సర్వం చైతజ్జగన్మయమ్
సర్వం బ్రహ్మమయం శాన్తం జగదిత్యపి శబ్దితమ్. 31

చిదాకాశము సర్వత్రగలదు; ఆ చిదాకాశమే సర్వజగద్రూపముగ వర్తించుచున్నది. జగత్తను శబ్దముచే చెప్పఁబడినప్పటికిని, ఇదియంతయును శాంతమై, బ్రహ్మమయమై యొప్పుచున్నది.

యథాస్థితమిదం విశ్వం తథాసంస్థమనామయమ్
బ్రహ్మైవ నిరవద్యాత్మ చిత్సంకల్పపురాకృతి. 32

చైతన్యముయొక్క సంకల్పనగరమువంటి యాకారముగల యథాస్థితమగు ఈ జగత్తంతయును నిరవద్యమై (ఆక్షేపణలేనిదై) నిర్వికారమైనట్టి బ్రహ్మమే అయియున్నది.

అసంభవాదన్యయుక్తేర్యుక్తిరేషైవ శోభనా
అయుక్త్యనుభవం తూక్తం నార్థినామిహ శోభతే. 33

పరమపురుషార్థమగు మోక్షము నిచ్ఛగించుశ్రోతయెదుట మఱియొకయుక్తి అసంభవమగుటచే ఈ స్వప్న, సంకల్పదృష్టాంత రూపమగు యుక్తియే యట శోభించుచున్నది. యుక్తి, అనుభవరహితమగు కథనము ఉత్తమమైనది కాదు గదా!

లోకే శాస్త్రేఽథ వేదాదౌ యత్స్పష్టం సిద్ధమేవ తత్
సదస్త్వసద్వాత్మని తద్ధాతుం శక్యం న వా క్వచిత్. 34

లోకశిష్టాచార శాస్త్ర, వేదాదులందేది (ప్రమాణయుక్త్యనుభవములద్వారా) స్థాపింపఁబడియున్నదో, అదియట్లే సత్యమైయున్నదగును. అది సత్తగు బ్రహ్మమును గూర్చిన సిద్ధాంతమైనను సరియే, అసత్తగు ద్వైతమునుగూర్చిన సిద్ధాంతమైననుసరియే, ఎచటను ధ్వంసింపఁబడఁజాలద

తదేవేత్థం పరిజ్ఞాతం బ్రహ్మతాముపగచ్ఛతి
యదా తేన సమం విశ్వం స్థితమేవ విలీయతే. 35

జ్ఞానప్రాప్తికి పూర్వము అబ్రహ్మరూపముగ నెఱుఁగఁబడిన యీ జగత్తే, (చరమసాక్షాత్కార వృత్తిరూపమగు) జ్ఞానముచే విలీనమైపోయి బ్రహ్మరూపత్వమును బడయుచున్నది.

న్యాయేనైతదిహోక్తేన లోకవేదాది సిద్ధ్యతి
సర్వం స జీవన్ముక్తత్వమేష ఏవోదితస్తతః. 36

'దేహ, బ్రహ్మశబ్దముల అర్థమొకటియే' ఇత్యాది వాక్యములద్వారా నేనిపుడు తుదకు వచించిన న్యాయముచే జీవన్ముక్తి సహితముగ లోకవేదాది సమస్తజగత్తున్ను బ్రహ్మమేయని సిద్ధించుచున్నది. కాఁబట్టి, ఈ నేను వచించిన న్యాయమే పరమపురుషార్థో పాయమగుటవలన గ్రహింప యోగ్యమైన దగును.

పరిజ్ఞాతం చిదాకాశమపరిజ్ఞాత పాదపే
సోఽహం త్రిజగదిత్యేవ బన్ధ మోక్ష వినిర్ణయః. 37

అపరిజ్ఞాతాత్మ మాత్రరూపమగు ఈ జగత్తను వృక్షమున పరిజ్ఞాతాత్మయగు చిదాకాశముకంటె భిన్నముగ అణుమాత్రమైనను నేమియులేదు. ఆ అపరిజ్ఞాత, పరిజ్ఞాత చిదాకాశమంతయు నేనే అయియున్నాను. (ఆత్మయే అయియున్నది) కావున, త్రైలోక్యము, బంధమోక్షములు సమస్తము నేనే అయియున్నానని నిర్ణయింపఁబడుచున్నది.

యథాస్థితమిదం దృశ్యం పరిజ్ఞానాద్విలీయతే
తజ్జ్ఞస్యాస్తంగతస్యైవ శిలామౌనం తు శిష్యతే. 38

యథారీతి స్థితిగల్గియున్న యీ దృశ్యమంతయును జ్ఞానమాత్రముచే బూర్ణముగ లయించిపోవుచున్నది. అట్లు జ్ఞానికి దృశ్యరూపము అస్తమింప వాగాదులకు అగమ్యమైనట్టి దృఙ్మాత్రమగు చిద్ఘన - ఆత్మయే శేషించుచున్నది

లోకే శాస్త్రే చ వేదే చ యత్సిద్ధం సిద్ధమేవ తత్
సంవేద్యతే తద్దైవాత స్తదేవం ఫలతి స్ఫుటమ్. 39

వేద, శాస్త్రములందును, జీవన్ముక్తులందును, అనేక విచారములచే 'అంతయు బ్రహ్మమయమే. అను ఏ సిద్ధాంతము నిశ్చయింపఁబడియున్నదో, అదియే స్వానుభవముచేతను నెఱుఁగఁబడుచున్నది. కాఁబట్టి యదియే పరమపురుషార్థమగు మోక్షరూపముగ స్పష్టముగ ఫలించుచున్నది.

సకలార్థ నిరాసేన యద్యత్సంవేద్యతే చిరమ్
తదేవ ప్రాప్యతేఽవశ్యం సర్వత్రైవాన్య భావితమ్. 40

ఇతరపదార్థములన్నింటిని త్యజించి బ్రహ్మమునే తదేకనిష్ఠతో చిరకాలము భావించుటచే ఆ బ్రహ్మము తప్పక పొందఁబడుచున్నది. అట్లే లౌకికపదార్థములైనను అనన్యభావనచే తప్పక లభించుచున్నది.

యథానుభూతం యత్తత్తథా నామానుభూయతే
తత్సత్యమస్త్వసత్యం వా యావల్లాభం తథా ను తత్. 41

కాని లౌకిక పదార్థములు అసత్యములున్ను బ్రహ్మముసత్యమున్ను నయియున్నది. ఇంతియే భేదము. సాధన ప్రయత్నమందును తత్ఫలాను భవమందును రెంటి యందును విశేషమేమియును లేదు. కాఁబట్టి సత్యమైనను, అసత్యమైనను, ఎవఁడు దేనినెట్లు భావనచేయునో, అతఁడు దానినట్లే యనుభవించును.

ఇత్థం మహాప్రశ్నవిచారణం తే మయేదముక్తం మతిమన్మహాత్మన్
అనేక గచ్ఛాశు పథా నిరాధిర్నిరామయో నిర్వ్యసనో భవోచ్చైః. 42

ఇత్యార్షే శ్రీవాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే ఉత్తరార్ధే ద్వైతైకోపలమ్భ నిరాసేన మహాప్రశ్నోత్తర వాక్యసమాప్తిర్నామ దశాధికద్విశతతమః సర్గః ॥ 210 ॥

బుద్ధిమంతుఁడవును, మహాత్ముఁడవునగు ఓ రాజా! ఈ ప్రకారముగ నేను నీ మహా ప్రశ్నలకును విచార ఫలనిర్ణయరూపమగు సమాధానము నొసంగితిని. ఈ నేను వచించిన మార్గముననే నీవు పొమ్ము. దానిచే నీవు శీఘ్రముగ శారీరక, మానసిక వ్యధారహితుఁడవై, ఏవ్యసనములును లేక సర్వోత్కృష్టుఁడవగుదువు.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున నుత్తరార్ధమున మహాప్రశ్నోత్తర వాక్యసమాప్తియను రెండువందల పదియవ సర్గము ॥ 210 ॥



## ఏకాదశాధికద్విశతతమః సర్గః

[సిద్ధసాధ్యాదిలోకౌఘ దర్శనోపాయ సంయుతమ్
వర్ణ్యతేఽత్ర పునః స్పష్టం బ్రహ్మైవ సకలం జగత్.

సిద్ధ, సాధ్యాదిలోకములను దర్శించుట కుపాయము చెప్పఁబడుచు, మరల, జగత్తంతయును బ్రహ్మమే యనువిషయ మిచట స్పష్టముగ వర్ణింపఁబడుచున్నది.]

శ్రీ వసిష్ఠ ఉవాచః—

ఇతి తత్రోపవిశ్యాహం పూజితస్తేన భూభుజా
ప్రయోజనం స్వం సంపాద్య స్వర్గస్తుం గగనం ప్లుతః. 1

శ్రీవసిష్ఠుఁడు:— ఓ రామచంద్రా! ఈ ప్రకారముగ, జంబూద్వీపమందలి ఇలావతీ పురమున ఆ రాజునకు జ్ఞానోపదేశముగావించి యా పిమ్మట నాతనిచేఁ బూజితుఁడనై (అతని నను గ్రహించుటయను) స్వకీయప్రయోజనమును సంపాదించి తదుపరి స్వర్గమునకేగుటకై యాకాశ మార్గమున నెగిరితిని.

అద్వైతదృశా ప్రోక్తం మయా మతిమతాం వర
అనయా సుదృశా శాన్తమనాః భూత్వా భవిష్యసి. 2

బుద్ధిమంతులలో శ్రేష్ఠుఁడవగు రామచంద్రా! ఆమోక్షమార్గముసే యిపుడు అయోధ్యా పురమున నీకు వచించితిని. ఇట్టియుత్తమ జ్ఞానదృష్టిచే నీవు ప్రశాంతమనస్కుఁడవును, చిదాకాశ రూపుఁడవును కాఁగలవు.

బ్రహ్మైవ తదిదం సర్వం నిర్నామైవామలం నభః
శమస్యైవాజమాశాన్త మాదిమధ్యాన్తవర్జితమ్. 3

ఈ సమస్తమున్ను, అదిమధ్యాంతరహితమై, జన్మవర్జితమై, మహా కాంతస్వరూపమై, అనిర్వచనీయమై, శబ్దశూన్యమై, ఆకాశమువలె నిర్మలమైనట్టి చిద్రూపబ్రహ్మమే అయియున్నది.

> చిద్వానమాత్రమిత్యుక్తం బ్రహ్మేతి కలితాభిధమ్
> పరాత్పరమితి ప్రోక్తం తత్తు నిర్నామకం పదమ్. 4

పరమాత్మకు 'బ్రహ్మ'మను ఈ పేరున్ను కాల్పనికమేయగును. ఏలయనిన కూటస్థ, పరమాత్మయందు ,బృహ' ధాత్వర్థమగు వృద్ధ్యాదులులేనేలేవు. శబ్దరహితమగు ఆ నిర్మల పరమాత్మపదము చిన్మాత్రమనియు, పరాత్పరమనియుఁగూడఁ జెప్పఁబడుచున్నది.

శ్రీరామ ఉవాచ :—

> సిద్ధసాధ్యయమబ్రహ్మవిద్యాధరదివౌకసామ్
> బ్రహ్మన్కథయ దృశ్యన్తే లోకాలోకధరాః కథమ్. 5

శ్రీరాముఁడు:— మహాత్మా! సిద్ధులు, సాధ్యులు, యముఁడు, బ్రహ్మదేవుఁడు, విద్యాధరులు, దేవతలు మున్నగువారున్ను, వారి ఆధారభూతములగు ఆ యా లోకములున్ను ఏ యుపాయముచేఁగానుపించునో వచింపవేడెద.

శ్రీవసిష్ఠ ఉవాచ:—

> సిద్ధసాధ్యయమబ్రహ్మవిద్యాధరదివౌకసామ్
> అనేషామపి భూతానామపూర్వాణాం మహాత్మనామ్. 6

> ప్రతిరాత్రం ప్రతిదినం పురః పశ్చాదుపర్యథః
> పశ్యస్యాలోకయల్లోకానపశ్యంశ్చ న పశ్యసి. 7

శ్రీ వసిష్ఠుఁడు:— ఓ రామచంద్రా! సిద్ధ, సాధ్య, యమ, బ్రహ్మదేవ, విద్యాధర, దేవతాదులను, తదితరభూతములను, అపూర్వులగు మహాత్ములను, వారి ఆ యా లోకములను ప్రతిరాత్రియు, ప్రతిదినమున్ను, ముందును, వెనుకను, పైనను చూడదలంచుచో (పూర్వాలోపాఖ్యానమందు వచింపఁబడిన ధారణావిశేషములచే) చూడఁగలవు, లేకున్న చూడనేరవు

> ఏతే లోకాః కలై తేషాం నాఖ్యాసః స్థానమూరగాః
> ఏతే సంకల్పలోకాఖ్యా వ్యాప్తమేభిః కిలాఖిలమ్. 8

ఈ సిద్ధాదుల లోకములు రెండువిధములు. మహర్జనస్తపస్సత్యాది దూరస్థలోకములు, సర్వత్ర వెలయునట్టి శ్రుతిసిద్ధములైన సంకల్పలోకములు ఈ రెంటిచేతను ఈ బ్రహ్మాండమంతయును వ్యాప్తమైయున్నది. ఈ ద్వివిధలోకములను దర్శింపవలెనన్న ధారణాభ్యాస మావశ్యకమై యున్నది, అదియో నీకులేదు

> యథైతే కల్పనాలోకా అయం లోకస్తథైవ నః
> యథా కాల్పనికో వాతో లోకాలోకాస్తథైవ తే. 9

ఈ సిద్ధాదులయొక్క లోకములవలెనే యీ మనలోకమున్ను కల్పనామాత్ర సిద్ధమై యున్నది. కల్పనారూపమైనను వాయువెట్లు సర్వత్ర పరిభ్రమించుచున్నదో, అట్లే వారి యా లోకములున్ను పరిభ్రమించుచున్నవి

సంకల్పస్వప్నలోకా యే తవ భాన్తి దివానిశమ్
త ఏవ తాదృశాశ్చాన్యే సంకల్పేన స్థిరీకృతాః. 10

ఓ రామచంద్రా! నీకు సంకల్ప స్వప్నలోకములెయ్యవి అహర్నిశము భాసించుచున్నవో, అట్టివే యా సిద్ధలోకములు అవియును, అట్టివేయగు యితరలోకములున్ను వారిచే రచింపఁబడి సంకల్పముచే స్థిరమొనర్పఁబడినవైయున్నవి.

ధ్యానేన త్వమపీతాం శ్చేత్త్విరతాం సుస్థిరాత్మనా
నయస్యాశు తదేవైతే స్థిరతాం యాన్త్యవిఘ్నతః. 11

ఓ రామచంద్రా! అట్లే నీవున్ను యోగధారణచే స్థిరమొనర్పఁబడిన ధ్యానముద్వారా స్వసంకల్ప ప్రాప్తములగు లోకములను స్థిరములుగాఁజేయుచో నపుడవియు స్థిరత్వమును బొందును.

యథాభిమతవిస్తారా యథాభిమతసంపదః
సంకల్పభావవలితో జనః పశ్యతి సిద్ధవత్. 12

ఆ ప్రకారముగనే యే ధ్యాతయైనను దృఢతర సంకల్పభావముతో గూడియుండుచో నాతఁడున్ను సిద్ధునివలెనే లోకములను తనకభిమతమైన విస్తార సంపదలతోఁగూడినవానినిగను, స్థిరములుగను గాంచును.

కింతు తే స్థిరతాం నీతాః సిద్ధైః స్వర్ధ్యానసంపదా
అస్థిరైర్ధ్యానవిశ్రాన్తా తైర్దుఃఖైస్తదమీ కృతాః. 13

కాని విశేషమేమనఁగా స్వర్గ సిద్ధలోకాదులను బొందించునట్టి పూర్వపుణ్య సంపత్తిచే ఆయా లోకములు ఆ సిద్ధాదులచే అనాయాసముగ స్థిరములుగ జేయఁబడినవి. ఏ యితరులు అనిత్యములైన ప్రస్తుతకాలపు ధారణాభ్యాసములచే ధ్యాన విశ్రాంతియందుఁ బ్రయత్నించుచున్నారో, వారిచే శ్రమచేతనే ఆ యా లోకములు స్థిరములుగఁ జేయఁబడునవి యగును.

జగదప్రతిఘం సర్వం శాన్తచిద్వ్యోమ సర్వదా
యథా దృఢం సంవిదిదం తథైవాభాతి నాన్యథా. 14

ఈజగత్తు సదా శాంతమై నిరాకారమైనట్టి చిదాకాశమే అయియున్నది. ఆ చిదాకాశము జీవుఁడెట్టి దృఢనిశ్చయముతోఁ గూడుకొనియుండునో, ఆ విధముగనే యాతనికి భాసించును మఱియొక విధముగఁగాదు.

న భాత్యేవాసంవిదితమస్తి నాస్తి న చోద్యతా
శూన్యం హ్యప్రతిఘం చైతత్ప్రాంకాశమరోధకమ్. 15

ఏ నిశ్చయమున్ను, సంకల్పమున్ను లేని మనుజునకు కలదు లేదు అనునవిగాని తర్క విషయత్వముగాని యుండవు. ఈ సమస్త జగత్తున్ను దృశ్యశూన్యమై నిరాకారమై ప్రతిబంధరహితమైనట్టి చిదాకాశమే అయియున్నది.

చిత్స్వభావతయా భాతం భారూపమివ దృశ్యతే
అస్మింశ్చిదభిమానశ్చ విద్యతే న స్వభావతః. 16

దృఢవిశ్చయముచే నెయ్యదిభాసించునో, అది అధిష్ఠాన చిత్స్వభావత్వమువలన ప్రకాశమానమైనదానివలె గోచరించుచున్నది. వాస్తవముగ ఈ దృశ్యరూపమగు అసంవిత్తునందు స్వభావముగ చిదభిమానము (చిత్సత్తావ్యాప్తి) లేదు (మిథ్యగనుక).

కార్యకారణభావాచ్చేత్కథై వాత్ర న విద్యతే
వ్యోమ్నోఽనన్తస్య సిద్ధస్య కిం కథం కిల జాయతే. 17

చిదాకాశమున కార్యకారణభావమునుగూర్చిన ప్రసంగమేలేదు. ఏలయనిన అనంతమైనట్టి చిదాకాశమునుండి యేదియెట్లు జనింపఁగలదు?

యచ్చ జాతమివాభాతి వ్యోమ్ని వ్యోమైవ తత్తథా
తత్రైకద్విత్వకలనా కీదృశీ స్యాదరూపిణీ. 18

ఏ యీ భూత భువనాది సమస్తమున్ను ఉత్పన్నమైనదానివలె భాసించుచున్నదో, అది చిదాకాశమున చిదాకాశమే యావిధముననున్నదగును. ఈ ప్రకారముగ రూపరహితమైన యా చిదాకాశమున ద్వైతఏకత్వములఁగూర్చిన కల్పనయే లేకయుండ నిఁక కార్యకారణ భావముయొక్క కల్పన యెట్లు సంభవించును?

తద్ధియాదృశమేవాసీత్తాదృగేవావతిష్ఠతే
నిర్వికారం యథా స్వప్నే వ్యోమైవాచలవద్భవేత్. 19

స్వప్నమున చిదాకాశము పర్వతమువలె అయినను వాస్తవముగ నెట్లు నిర్వికారముగనే వెలయుచున్నదో, అట్లే చిదాకాశమున ఉత్పత్త్యాదులు భాసించినప్పటికిని అది యావిపర్తమునకంతయు అధిష్ఠానమై యుండుటచే నెప్పటియట్లు వర్తించుచు నిర్వికారమునే స్థితినొందియున్నది.

సంకల్పే చిత్తమాకారం యథో దేత్యద్రిలీలయా
న చ సోఽద్రిర్నతద్వ్యోమ తథా బ్రహ్మ జగత్స్థితిః. 20

స్వప్న, సంకల్పములందు చిత్తమే యాకారమునుగల్పించి పర్వతాదిపదార్థలీలగ నుదయించునట్లును, అటనాపర్వత, ఆకాశాదులు వాస్తవముగ లేనట్లును, బ్రహ్మమందీజగత్తున్ను లేకయున్నది.

కాష్ఠవన్మౌనమాస్థాయ రటన్తోఽపి మహాధియః
ఇహ వ్యవహరన్త్యేతే బుధా దారునరా ఇవ. 21

కావుననే మహాబుద్ధిమంతులగు జీవన్ముక్తు లీప్రపంచమున వాగాదీంద్రియములతో వ్యవహరించుచున్నట్లు కన్పట్టినను స్వదృష్టిచే కాష్ఠవిగ్రహములవలె మౌనముగను, నిర్వ్యాపారముగనే వెలయుచున్నారు.

యథా వారిణి వర్తన్తే తరఙ్గావర్తవృత్తయః
అనన్యాః పరివర్తన్తే తథా బ్రహ్మణి సృష్టయః. 22

జలమందు తరంగ, ఆవర్తాదు లేప్రకారముగ అభిన్నరూపముగ వర్తించుచు, పరివర్తము చెందుచున్నవో, అట్లే బ్రహ్మమందీ సృష్టులన్నియుఁగూడ అభిన్నరూపముగ వర్తించుచున్నవి.

యథా వాయౌ పరిస్పన్దా యథా వ్యోమని శూన్యతా
అనన్యాశ్చాప్యమూర్తాశ్చ తథా బ్రహ్మణి సృష్టయః. 23

వాయువునందు సంచలనము, ఆకాశమునందు శూన్యత్వము అభిన్న, అమూర్తరూపములతో నెట్లుకలవో, అట్లే బ్రహ్మమందు సృష్టులున్నగలవు.

యథా సంకల్పనగరం శూన్యమేవ పురం స్థితమ్
సాకారమప్యనాకారం బ్రహ్మణీదం తథా జగత్. 24

సంకల్పనగరము శూన్యమైనను, నిరాకారమైనను, సాకారముగను, సమ్ముఖమునను న్నదిను నెట్లుభాసించుచున్నదో, అట్లే బ్రహ్మమం దీజగత్తున్ను భాసించుచున్నది.

చిరానుభూతమప్యర్థ కార్యపీదం జగత్త్రయమ్
శూన్యమేవ నిరాకారం సంకల్పనగరం యథా. 25

చిరకాల మనుభూతమైయున్నను, లౌకిక, వైదికకార్య సమర్థమైయున్నను, ఈ త్రైలోక్యము సంకల్పనగరమువలె శూన్యమై, నిరాకారమైయే యొప్పుచున్నది.

యదేవ చిత్తసంకల్పస్తదేవ నగరం యథా
తదా తథాయం బ్రహ్మచ్ఛం తదేవ జగదుచ్యతే. 26

సంకల్పనగర వ్యవహార కాలమున ఆ సంకల్పనగరము చిత్తసంకల్ప మాత్రమే యెట్లగును, అట్లే యీ కానుపించు జగత్తున్ను నిర్మలబ్రహ్మ మాత్రమేయగును.

చిరం నిత్యానుభూతోఽపి జగదర్థో న కించన
విద్యతే పురుషస్యేహ స్వప్నే స్వమరణం యథా. 27

చిరకాలము నిత్యమను భూతమైయున్నను ఈ జగత్పదార్థము స్వప్నమందు స్వమరణమువలె మనుజున కొకింతైనను లేకయేయున్నది.

స్వప్నే పుంసా మృతేనాపి స్వదాహో దృశ్యతే యథా
అసదేవ సదాభానం జగద్దృష్టం పరే తథా. 28

స్వప్నమందు మరణించిన మనుజునిచే అసత్యరూపమే అయినట్టి తనదహనక్రియ సత్యముగ నెట్లుగాంచఁబడుచున్నదో, అట్లే పరబ్రహ్మమం దీజగత్తున్ను గాంచఁబడుచున్నది.

జగత్తా చాజగత్తా చ పరస్యైవామలం వపుః
పరాభిధానం చ పరం న చ సత్పరమార్థతః. 29

జగత్తు, అద్దాని అభావము (ప్రళయము) రెండును అధిష్ఠానదృష్టిచే నిర్మల పరమాత్మ యొక్కయే రూపములైయున్నవి. అవి ఆరోపితదృష్టిచే సత్యములుకావు. ఏలయనిన, రజ్జ్వాదులందు గోచరించు సర్పాదులు యథార్థముగ సత్యములుకావు. గదా !

ఇత్థమస్తు యది వాన్యథాస్తు వా మైవ భూద్భవతు కోఽత్ర సంభ్రమః
ముఞ్చ ఫల్గుని ఫలే ఫలగ్రహం బుద్ధవానసి కృతం పరిశ్రమైః. 30

ఇత్యార్షే శ్రీ వాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు
నిర్వాణప్రకరణే ఉత్తరార్ధే పరమార్థోపదేశో
నామైకాదశాధికద్విశతతమః సర్గః ॥ 211 ॥

ఓ రామచంద్రా! సిద్ధలోకాదులయొక్క భోగాదిఫలము ఇట్లు నేను వర్ణించినరీతి కల్పనామాత్రమే అయియుండుగాక, లేక తదితర మునులు వర్ణించినరీతి మఱియొక విధముగనైన యుండుగాక, లేక అట్లు లేకుండుగాక, ఎట్లున్నప్పటికిని జీవన్ముక్తుడవగు నీకు దానియందు ఆదర మేల? నశ్వరములైన సిద్ధ్యాది ఫలములందు పురుషార్థత్వమునుగూర్చిన బుద్ధిని వదలుము. నీవు బ్రహ్మతత్త్వము నెఱిఁగినవాఁడవైయున్నావు. గావున నీకిక మాయామాత్ర రూపములైన సిద్ధలోకాదులయొక్క యైశ్వర్యాదుల నెఱుఁగుటఁగూర్చిన శ్రమ వ్యర్థమేయగును. కావున అది నీకువలదు

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున నుత్తరార్ధమున
పరమార్థోపదేశ మను రెండువందలపదునొకండవ సర్గము ॥ 211 ॥

---

## ద్వా ద శా ధి క ద్వి శ త త మః స ర్గః.

[ బ్రహ్మాహంభావకలనా పరమేష్ఠీ జగత్త్రయమ్
తత్సంకల్పమయం తస్మాద్బ్రహ్మైవేత్యత్ర వర్ణ్యతే.

బ్రహ్మముయొక్క అహంభావకల్పనయే బ్రహ్మదేవుడు; త్రైలోక్యమాతని సంకల్పముచే పరిపూర్ణమై యొప్పుచున్నది. కాఁబట్టి జగత్తు బ్రహ్మమే అనువిషయములిచట వర్ణింపఁబడుచున్నవి.]

శ్రీవసిష్ఠ ఉవాచ :—

చిత్త్వాద్బ్రహ్మ ఖమేవాహమితి వేత్తీవ యత్స్వయమ్
తదేవ పరమేష్ఠిత్వం తస్యోదరమిదం జగత్. 1

శ్రీ వసిష్ఠుఁడు:— ఓ రామచంద్రా! చిత్స్వభావమువలన, చిదాకాశమగు బ్రహ్మము మొదట స్వయముగనే నేను సమష్టి జీవరూపుఁడను అను నిట్టి సమష్టి అహంకారరూపముగ నిజ స్వరూపము నెఱుఁగుచున్నది. పరబ్రహ్మముయొక్క యట్టి స్ఫురణరూపమగు జ్ఞానమే యద్దాని హిరణ్యగర్భ రూపత్వము, ఆ హిరణ్యగర్భుని యుదరమున ఈ జగత్తు కలదు.

ఏవం స్థితే న చ బ్రహ్మా న చ జాతం జగత్స్థితమ్
స్థితం యథాస్థితమజం పరం బ్రహ్మైవ పూర్వవత్. 2

కాఁబట్టి (బ్రహ్మముయొక్క సంకల్పమాత్రమే యీ సమస్తమును అయియున్నందున) వాస్తవముగ బ్రహ్మదేవుఁడుగాని, ఈ జగత్తుగాని యొకింతైనను జనింపకయేయున్నవి. అంతయును

పూర్వమువలెనే యథారీతి స్థితిగల్గియున్న నిర్వికారమైనట్టి జన్మరహితమగు పరబ్రహ్మమే అయియున్నది.

సంవిత్త్వా తు జగద్రూపం భాసతేఽప్యేవమేవ తత్
మృగతృష్ణేవ మిథ్యైవ దృశ్యమానమపి త్వసత్. 3

జీవుని యనుభవమందీజగద్రూపము భాసించుచు ప్రాతిభాసికముగ సత్యమై యొప్పుచున్నది. కాని యది పారమార్థికముగ సత్యముకాదు. కానుపించుచున్నప్పటికిని అది మృగతృష్ణాజలమువలె మిథ్యయే అయియున్నది.

అతః ప్రభృతి శూన్యేయం భ్రాన్తిరభ్యుదితా నవా
కుతః కేవ కిల భ్రాన్తిర్బ్రహ్మైవ తదనామయమ్. 4

ఇక్కారణమున సృష్టికాలమునుండి మొదలుకొని యీ శూన్యమగు దృశ్యరూప భ్రాంతి యుదయించినది. లేక వాస్తవముగ నుదయింపకయేయున్నది. ఏలయనిన అంతయు నిర్వికారమైనట్టి బ్రహ్మమే అయియుండ నిఁక భ్రాంతియేది యెచట సంభవమగును?

జగద్బ్రహ్మజలావర్తో ద్విత్వైకత్వే కిలాత్ర కే
క్వావర్తపయసోర్ద్విత్వం ద్విత్వాభావాత్క్వచైకతా. 5

జగద్బ్రహ్మలందును, ఆవర్త, జలములందును ద్వైత, ఏకత్వములేమి? ఆవర్త, జలములందు ద్వైతమెచట? ద్వైతము లేనిచో ఏకత్వమెచట?

తద్బ్రహ్మ ఘనమాశాన్తం చిత్త్వాచ్చేత్యహం విదత్
నిజం శూన్యత్వమన్తస్థం వ్యోమేవ వితతాన్తరమ్. 6

కావున సమస్తము మహాశాంతమైనట్టి బ్రహ్మ ఘనమైయున్నది. విశాలమగు ఆకాశము తనయందలి శూన్యత్వమును ప్రకాశింపఁజేయునట్లు ఆ బ్రహ్మము చిత్స్వభావమగుటవలన తనయందు సమష్ట్యహంకారరూపము నెఱుఁగుచు నద్దానిని స్ఫురింపఁజేయుచున్నది.

పవనః స్పన్దనమివ హుతాశన ఇవోష్ణతామ్
స్వశైత్యమివ పూర్ణేన్దుః సత్తామర్థ ఇవాత్మనః. 7

వాయువు చలనమును, అగ్ని యుష్ణత్వమును, పూర్ణచంద్రుడు తన శీతలత్వమును ప్రకాశింపజేయునట్లు బ్రహ్మమున్ను స్వయముగ పదార్థసత్తను స్ఫురింపఁజేయుచున్నది.

శ్రీరామ ఉవాచః —

ఏతద్బ్రహ్మన్కదా నామ తన్న చేతితవన్మునే
నిరావృతమనాద్యన్తం కిమిదానీం ప్రచేతతి. 8

శ్రీరాముఁడు:— ఓ మునీంద్రా! ఈ బ్రహ్మచైతన్యము అహంకారాది పదార్థసత్తనెపుడు స్ఫురింపజేయుటలేదు? సదా నిరావరణమై ఆద్యంతరహితమై నిత్యమై వెలయునట్టి యది యెల్లకాలములందును వర్తించుచుండ సృష్ట్యాదినుండియే పదార్థములను స్ఫురింపఁజేయుచున్నదని యేల వచింపఁబడుచున్నది?

శ్రీవసిష్ఠ ఉవాచ :—

ఏవమేతత్ప్రద్వైతదహమాద్యపి చేతతి
నహ్యనాదేరజస్యాస్య కాప్యపేక్షా స్వసంవిదా. 9

శ్రీవసిష్ఠుఁడు:— ఓ రామచంద్రా! నీవుచెప్పినది సత్యమే, యౌక్తిక దృష్టిచే ఈ బ్రహ్మ చైతన్యము అహంకారాది నిజతత్త్వము నెల్లపుడును ప్రకాశింపఁ జేయుచునేయున్నది. ఏలయనిన అనాదియు జన్మరహితమునునగు పరబ్రహ్మమునకు స్వరూపచైతన్యముచేనగు స్వరూపస్ఫూర్తి యందుగాని అవిద్యచేనగు అహంకారాది పదార్థములయొక్క సత్తాస్ఫూర్తియందుగాని మఱియొక దానియొక్క అపేక్షలేదు.

సర్గాసర్గనభోరూపం బ్రహ్మ సర్వత్ర సర్వదా
న కదాచిదిదం నేదం జ్ఞాతం నేదం చ కించన. 10

పవనస్పన్దనం చన్ద్రశైత్యం శూన్యత్వమమ్బరమ్
బ్రహ్మాహంత్వమనన్యాత్మ న కదాచిన్న చేతతి. 11

సృష్టియు అద్దాని అభావమును రెండును చిదాకాశరూపములే అయియున్నవి. ఆబ్రహ్మము సదా సర్వత్ర వెలయుచున్నది అవిద్యాదృష్టిచే ఈ జగత్తుయొక్క యథార్థతత్త్వము (శుద్ధచిద్రూపము) యెఱుఁగఁబడదు విద్యాదృష్టిచే ఈ జగత్తెపుడును నొకింతైనను లేనిదేయగును. అంతయు చిద్రూపమే మిశ్రదృష్టిచే వాయుచలనములు చంద్ర శీతలత్వములు ఆకాశశూన్యత్వ ములు అభిన్నరూపములై యున్నట్లు బ్రహ్మము అహంకారాదిజగత్తు అభిన్నరూపములై యున్నవి. మఱియు ఆ పరబ్రహ్మమెల్లపుడును స్ఫురించుచునే యున్నదగును.

సర్వేద్వైవేదృశీ సత్తా న కదాచిదపీదృశీ
[illegible]గదస్యాస్యాదనాద్యన్తం బ్రహ్మాత్మైవ నిరామయమ్. 12

[illegible] కంటె భిన్నముకానిదియు సమష్టివ్యష్టి జీవకల్పనాను సారమైనదియునగు ఈ ప్రపంచసత్త [illegible] ప్రకారముగనే యుండును. భిన్నముగఁగాదు. ఏలయనిన ఈ ప్రపంచము నిర్వికారమై [illegible]ద్యంతరహితమైనట్టి బ్రహ్మమే అయియున్నది.

కేవలం త్వమబుద్ధత్వాచ్ఛబ్దశ్రవణవేధితః
అద్వయే బ్రహ్మబోధేఽస్మిన్ద్విత్వా మత్యుపగచ్ఛసి. 13

ఓ రామచంద్రా! నీకు అద్వయమగు బ్రహ్మజ్ఞానము కలిగినను అజ్ఞానమును తాత్కాలికముగ స్వీకరించి నా యుపదేశశబ్ద శ్రవణమున ఆసక్తచిత్తుఁడవై మిశ్రదృష్టి లబ్ధమగు ప్రపంచ నిష్ప్రపంచరూపమగు ద్వైతమును బొందుచున్నావేగాని వాస్తవముగ (తత్త్వదృష్టిచే) గాదు.

న కశ్చిత్కించిదేవేహ న కదాచిన్న చేతతి
న కశ్చిచ్చ తదన్యాత్మా న కదాచిచ్చ చేతతి. 14

మిశ్రదృష్టిచే బ్రహ్మము సర్వస్వరూపమైయున్నది గావున, అద్దానియందే జీవుఁడైన యొకింత ప్రకాశింపఁజేయుచో, అది బ్రహ్మమే యాజీవరూపముచే ప్రకాశింపఁ జేయునదగును.

కాఁబట్టి యా బ్రహ్మమెల్లపుడును సమస్తమును బ్రకాశింపఁచేయుచున్నది. నిర్విశేష బ్రహ్మదృష్టిచే నేదియు నెప్పుడును నొకింతైనను బ్రకాశింపఁజేయకయే యున్నది.

ఇదం త్రిభువనాభాసమీదృశం భాతి సర్వదా
శాన్తం రామ సమం బ్రహ్మ నేహ నానాస్తి కించన. 15

ఓ రామచంద్రా! బద్ధుని దృష్టియందలి యీ త్రైలోక్యము యొక్క రూపముచే వాస్తవముగ బ్రహ్మమే సదాభాసించుచున్నది. ముక్తునిదృష్టియందిచట త్రైలోక్యముగాని, నానాత్వముగాని యొకింతైనను భాసించుటలేదు శాంతమై, సమమైనట్టి బ్రహ్మమే కలదు.

న కదాచన జాయన్తే నభసః పాదపాద్రయః
బ్రహ్మణశ్చ జగన్తీతి మత్వా శాన్తిం పరాం వ్రజ. 16

ఓ రామచంద్రా! ఆకాశమునుండి వృక్ష, పర్వతాదు లెన్నఁడును జనింపనట్లు, బ్రహ్మమునుండి జగత్తులెన్నఁడును జనించుటలేదని యెఱిఁగి పరమశాంతిని బొందుము.

ఉపదేశ్యోపదేశార్థం సందేహావసరేఽల్పధీః
యావన్న బుద్ధస్తావత్త్వం భేదమప్యుపగచ్ఛసి. 17

ఉపదేశ్య, ఉపదేశ క్రమముయొక్క ప్రవృత్తికొఱకై సందేహము యొక్క అవసరమున అల్పబుద్ధివై తత్త్వజ్ఞానము నెంతవఱ కెఱుఁగకుందువో - అంతవఱకును భేదమును నమ్ముము.

బోధస్య తు విబుద్ధస్య న శాస్త్రాది న శబ్దధీః
న భేదబుద్ధిర్నో భేదః కిమప్యేవ ప్రజాపతేః. 18

తదనంతరము, అనఁగా జ్ఞాన మావిర్భవించిన పిదప. నీకు శాస్త్రాదులుగాని, శబ్దబుద్ధిగాని, అహంకారముగాని, తత్సంకల్పమయమగు జగత్తుగాని, బ్రహ్మదేవునిగూర్చిన భేదబుద్ధిగాని నిజస్వరూపమున నుండనేరవు.

శ్రీరామ ఉవాచ :—

బుద్ధమేతన్మయా బ్రహ్మన్ప్రకృతం తదుదాహర
వచో మదవబోధార్థం యదుదాహృతవానసి. 19

శ్రీ రాముఁడు :— మహాత్మా! ఇవ్విషయమునైతే నే నెఱిఁగితిని; ఇఁక నా యొక్క బోధకొఱకై సమష్ట్యహంకారాది అధ్యాసమును నిరూపించుటకొఱకై ప్రస్తుత మేవాక్యములను తా ముదాహరించితిరో, వానిఁగూర్చి యిప్పుడు తెలియఁజేయవేడెద.

కిం తస్మి శ్శ్రుతితేఽహంత్వేపదే సంపద్యతే పరే
బుద్ధవానసి శుశ్రూషుర్నాహం తృప్తిముపైమి హి. 20

మునీంద్రా! ఆ పరబ్రహ్మపదమున 'అహంత్వము' స్ఫురించినవెనుక మరల యేమగుచున్నది? సర్వజ్ఞులగుటచే తామంతయును నెఱిఁగియున్నారు; మఱియు, తమ వచనములను వినుటకుఁ గోర్కెగల నేను తృప్తిని బొందకున్నాను. కావున, తెలుపప్రార్థన

శ్రీ వసిష్ఠ ఉవాచ :—

అహంత్వే సత్యథైతస్మిన్వ్యోమసత్తా ప్రవర్తతే
దిక్సత్తా కాలసత్తా చ భేదసత్తాభ్యుదేతి చ. 21

శ్రీవసిష్ఠుఁడు:— ఓ రామచంద్రా! ఈ పరబ్రహ్మపదమున అహంత్వము స్ఫురించిన మీదట ఆకాశసత్త ప్రవర్తించుచున్నది అటు పిమ్మట దిక్ - సత్తయు కాల సత్తయు, భేద సత్తయు (దేశ కాల వస్తుకృత పరిచ్ఛిన్న భేదసత్తయు) నుదయించుచున్నవి.

యదా కిలేహాహమితి తదా నాత్రాహమిత్యపి
భాతీత్యుదేతి నానా భే భాత్యైవ ద్వైతమక్రమమ్. 22

ఈ ఆత్మకెపుడిట దేహాదులందు 'ఇచ్చట నేనుగలను' అను భావనగలుగుచున్నదో, అపుడు దేహరహితస్థలమున 'ఇచట నేనులేను' అని తప్పక భాసించుచున్నది. ఇది దేశకృత పరిచ్ఛేదము. ఈ ప్రకారముగ దేశ, కాల, వస్తుకృత పరిచ్ఛేదములతో స్వాత్మయే నానావిధమైన క్రమహీనమగు ద్వైతరూపమై యుదయించుచున్నది.

వ్యోమాత్మికానామేతాసాం సత్తానామభిధానధీః
భవిష్యత్యుత్తరం కాలం తదా త్వాకాశమేవ తత్. 23

అనంతరము చిదాకాశమయములగు ఆ దేశకాలాది సత్తలయొక్క పరస్పర భేదకములైన జాతి, గుణ, క్రియాదులఁగూర్చిన కల్పనచే నామ (వాచకశబ్ద) భేదముయొక్క అధ్యాసము సంభవించుచున్నది. కాని వాస్తవముగా నదియంతయును చిదాకాశమే అయియున్నది.

ఏతస్మిన్పరిసంపన్నే దిక్కాలకలనాత్మని
అహంభావే నిరాకారే వ్యోమతన్మాత్రవేదిని. 24
ఇదమాభాతి భారూపం వేదనం దృశ్యనామ యత్
భూత్వా బ్రహ్మైవ నిర్బాధమబ్రహ్మేవ విరాజతే. 25

ఈ ప్రకారముగ నిరాకారమగు ఈ పరబ్రహ్మపదమున అహంభావముద్వారా దేశ, కాలాది కల్పన సంభవింప దృశ్యమను పేరుగల ఏ యీ జగత్తు ప్రకాశరూపముగ భాసించుచున్నదో, అట్టి అధ్యస్త జగదాకారముగ బ్రహ్మమే బాధారహితముగ అబ్రహ్మరూపమువలె విరాజిల్లుచున్నది.

బ్రహ్మైవ శాన్తమజమేకమనాదిమధ్యం
వ్యోమైవ జీవకలనామివ భావయిత్వా
వ్యోమ్న్యేవ పశ్యతి నిరావరణే విసారి
దృశ్యం స్వరూపమపి చాన్యదివాత్మవిత్త్వాత్. 26

ఇత్యార్షే శ్రీ వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు
నిర్వాణప్రకరణే ఉత్తరార్ధే పరమార్థ నిరూపణం నామ
ద్వాదశాధికద్విశతతమః సర్గః ॥ 212 ॥

ఓ రామచంద్రా! శాంతమై, జన్మరహితమై, ఏకమై, ఆదిమధ్యాంత శూన్యమై, జీవ, జగద్భావ వర్జితమైనట్టి బ్రహ్మమే జీవాదికల్పనను భావించి (అధ్యసించి) నిరావరణమగు జీవసాక్షిరూపమైన చిదాకాశముననే అతివిశాలమైన యీ దృశ్యమును గాంచుచున్నది. ఆత్మజ్ఞానము కలుగనంతవఱకును అవ్విధమున నది తనశుద్ధచిత్స్వరూపమును మఱియొకదానివలె (దృశ్యమువలె) జూచుచున్నది.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున నుత్తరార్ధమున పరమార్థ నిరూపణమను రెండువందల పండ్రెండవ సర్గము ॥ 212 ॥

## త్రయోదశాధికద్విశతతమః సర్గః

[వర్ణ్యతే పూర్వసంవాద ఇహ రామవసిష్ఠయోః
గురుశిష్యాఖ్యాయికయా సర్వం బ్రహ్మేతి నిశ్చితః

పూర్వకల్పమున శ్రీరామచంద్ర, వసిష్ఠమునీంద్రులయొక్క సంవాదమున 'సమస్తము బ్రహ్మమే' అని నిశ్చయింపబడిన విషయము గురుశిష్యాఖ్యాయికారూపమున నిచటవర్ణింపఁబడుచున్నది ]

**శ్రీ వసిష్ఠ ఉవాచ:—**

యథా యత్పృష్టవానద్య త్వం మామరినిషూదన
శిష్యేణైవ సతా పూర్వమహం పృష్టో గురుస్త్వయా. 1

శ్రీవసిష్ఠుఁడు :— శత్రువులను నశింపజేయునట్టి ఓ రామచంద్రా! నీవిపుడు ఏ జగత్తత్త్వమునుగూర్చియు, ఆత్మతత్త్వమునుగూర్చియు, నన్నడిగితివో, ఆ విషయమునే పూర్వమొకానొక రామావతారమున నీవు నన్నడిగితివి. అపుడు నేను గురువును, నీవు శిష్యుఁడవును నయియుంటిమి.

పురాకల్పే హి కస్మింశ్చిత్తత్త్వమాత్మాదికాత్మికా
ఆసీదియం చిత్రశిఖా గురుశిష్యాత్మనా వనే. 2

పూర్వకల్పమున నొకానొక జగత్తునందు నీవు రాముఁడవైయుంటివి. నేను వసిష్ఠుఁడనైయుంటిని. అంత, ఒకపుడు నీవు వైరాగ్యము కలుగగా, నేను నీ సమీపమునకేతెంచ, ఒకానొక వనమున గురుశిష్య సంవాదరూపమున మన యిరువురికిని ప్రశ్నోత్తరములు జరిగెను. అట్టి యీ చిత్రశిఖ యంతయు నిపుడు జరిగినట్లే యున్నది.

గురుస్తత్రాహమభవం శిష్యస్త్వమభవస్తదా
పృష్టవాన్మాం త్వమగ్రస్థ ఇదముద్దామధీరధీః. 3

ఆ సమయమున నేనచట గురువునయితిని. నీవు శిష్యుఁడవైతివి. అపుడు నా యెదుటనున్న ఉదారబుద్ధివగు నీవు నన్నివ్విధమున నడిగితివి.

**శిష్య ఉవాచ :—**

సర్వస్య భగవఞ్ఛింధి మమేమమతిసంశయమ్
కిం నశ్యతి మహాకల్పే కిం వస్తు న వినశ్యతి. 4

శిష్యుఁడు:— మహాత్మా ఈ సమస్త జగత్తుయొక్క విషయమున నాకి గొప్పసంశయముకలదు. దానిని తాము ఛేదించివేయ ప్రార్థన — మహాకల్పమున నేది నశించును? ఏది నశింపక యుండును?

గురురువాచ:—

పుత్ర శేషమశేషేణ దృశ్యమాశు వినశ్యతి
యథా తథా స్వప్నపురం సౌషుప్తీం స్థితిమీయుషః. 5

గురువు:— పుత్రకా! సుషుప్తిదశను బొందిన స్వప్నపురమెట్లు సంపూర్ణముగ నశించునో, మఱియు ఆత్మమాత్రముగశేషించునో, అట్లే మహాప్రళయమున ఈ దృశ్యజగత్తంతయును శీఘ్రముగ నశించును.

నిర్విశేషేణ నశ్యన్తి భువః శైలా దిశో దశ
క్రియా కాలః క్రమశ్చైవ న కించిదవశిష్యతే. 6

అపుడు పృథివి పర్వతములు దశదిశలు క్రియాకాలాది క్రమము — సమస్తము పూర్ణముగ నశించును. ఒకింతైనను మిగులదు.

నశ్యన్తి సర్వభూతాని వ్యోమాపి పరిణశ్యతి
ససర్వజగదాభాసముపలబ్ధురసంభవాత్. 7

మఱియు నత్తఱి సమస్తభూతములున్ను నశించును. సమస్తజగత్తుయొక్క ఆభాససహితమగు ఈ యాకాశమున్ను అవ్యాకృతమున లయించినదై నశించిపోవును. ఏలయనిన ప్రళయకాలమున భోక్తయే లేకయుండుటచే నిఁక తదధీనమగు భోగ్యమెట్లుండును?

బ్రహ్మవిష్ణ్వీన్ద్రరుద్రాద్యా యే హి కారణకారణమ్
తేషామప్యతికల్పాన్తే నామాపీహ న విద్యతే. 8

కారణములకున్ను కారణరూపములగు బ్రహ్మ, విష్ణు, రుద్ర, ఇంద్రాదులయొక్కయు పేరైనను మహాకల్పాంతమున నిట నుండనేరదు.

శిష్యతే హి చిదాకాశమవ్యయస్యాను మీయతే
తత్కాలశేషతానేన సర్గానుభవహేతునా. 9

అవ్యయమగు చిద్వస్తువుయొక్క వివర్తమగు ఈ దృశ్యజగత్తు నశింప అపుడు కేవలము చిదాకాశమే శేషించుచున్నదని యనుమానింపఁబడుచున్నది. ఏలయనఁగా నిజస్వరూపమున అధ్యస్తములైన సృష్టులయొక్క అనుభవమునకు హేతువైనట్టి సాక్షియగు ఈ చిదాత్మచేతనే సర్వప్రపంచశూన్యత్వరూపమగు ప్రళయము సిద్ధించుచున్నది. అదియును నశించుచో, అపుడు సాక్షి లేనందున ప్రళయమే సిద్ధింపక యుండును.

శిష్య ఉవాచ —

నాసతో విద్యతే భావో నాభావో విద్యతే సతః
ఇదం తత్కథమాభోగి విద్యమానం క్వ గచ్ఛతి. 10

శిష్యుఁడు:— మహాత్మా! అసత్పదార్థమునకు ఉనికిలేదు. సత్పదార్థమునకు లేమి లేదు. కావున యీ విశాలముగ విద్యమానమైయుండు జగత్తు ప్రళయకాలమున నెచటికేగుచున్నది!

గురురువాచః—

న వినశ్యత ఏవేదం తతః పుత్ర న విద్యతే
నాసతో విద్యతే భావో నాభావో విద్యతే సతః. 11

గురువు:— పుత్రకా! శ్రుత్యాదులు మాయాసిద్ధమైన జగత్తుయొక్కయే అభావమును దర్శింపజేయుచున్నవిగాని సత్యమైనజగత్తుయొక్క అభావమునుగాదు, అవయవసహితమగు పదార్థము యొక్క నాశము ప్రత్యక్షాది ప్రమాణములచేఁ ప్రసిద్ధమైయున్నదిగావున, ఈ మాయా సిద్ధమగు జగత్తు నశించుచు వాస్తవముగా లేకయేయున్నది. కాఁబట్టి నీవు వచించినదియు క్షమే - అసత్తగు దానికి (మాయాసిద్ధ జగత్తునకు) ఉనికిలేదు. సత్తగుదానికి (బ్రహ్మమునకు) లేమిలేదు.

యత్తు వస్తుత ఏవాస్తి న కదాచన కించన
తదభావాత్మ తద్రామ కథం నామ వినశ్యతి. 12

ఓ రామచంద్రా! ఏది వాస్తవముగ కలదో, అది యెకింత్తైనను అసత్తైన్నటికిని గాదు సద్వస్తువెట్లు నశించును?

క్వ స్థిరం మృగతృష్ణామ్బు క్వ స్థిరో ద్వీన్దువిభ్రమః
క్వ స్థిరా కేశదృగ్వ్యోమ్ని క్వ భ్రాన్త్యనుభవః స్థిరః. 13

ఓ రాఘవా! మృగతృష్ణాజల మెచటస్థిరమై (పదార్థప్రతిష్ఠగల్గి) యున్నది? చంద్రద్వయ మునుగూర్చిన భ్రమయెచట స్థిరముగనున్నది? ఆకాశమందలి కేశాదులెచట స్థిరములుగ (సత్యములుగ) నున్నవి? వెయ్యేల, భ్రమసిద్ధమగు యనుభవమెచట స్థిరముగనున్నది.

సర్వం దృశ్యమిదం పుత్ర భ్రాన్తిమాత్రమసన్మయమ్
స్వప్నే పురమివాభాతి కథమేతన్న శామ్యతి. 14

పుత్రకా! ఈ దృశ్యమంతయును భ్రాంతిమాత్రమై, అసన్మయమైయున్నది. ఇయ్యది స్వప్నపురమువలె భాసించుచున్నది. కావున నిదియేల నశింపకుండును?

శామ్యతీదమశేషేణ తథా సర్వత్ర సర్వదా
యథా జాగ్రద్విధౌ స్వప్నః స్వప్నే వా జాగరో యథా. 15

జాగ్రత్తునందు స్వప్నమున్ను, స్వప్నమందు జాగ్రత్తున్ను నెట్లు బాధితములగుచున్నవో, అట్లే యీ దృశ్యమంతయును గూడ ఆత్మ జ్ఞానముచే సర్వత్ర సర్వదా సంపూర్ణముగ శమించి పోవుచున్నది.

యథా స్వప్నపురం శాన్తం న జానే క్వాశు గచ్ఛతి
శాన్తం తథా జగద్దృశ్యం న జానేక్వాశు గచ్ఛతి. 16

స్వప్ననగరము జాగ్రత్తునందు శమించినదై యెచటికో శీఘ్రముగఁ బోవునట్లు, ఈ దృశ్య జగత్తున్ను ఆత్మజ్ఞానముచే శమించినదై యెచటికో శీఘ్రముగఁ బోవుచున్నది.

శిష్య ఉవాచ:—

కిమిదం భాతి భగవన్న విభాతి చ కిం పునః
కస్యేదం వస్తునో రూపం చిద్వ్యోమ్నో వితతాకృతేః. 17

శిష్యుఁడు:— మహాత్మా! దృశ్యములేనిచో, ఒకింతకాల మీదృశ్యరూపముగ భాసించున దేది? మరల జ్ఞానప్రాప్త్యనంతరమట్లు భాసింపకుండునదేది? ఆ భాసించుట, భాసింపకుండుట దేనియొక్క రూపములై యున్నవి? విశాలాకారయుక్తమగు చిదాకాశముయొక్క యా యేమి?

గురు రువాచ:—

చిదాకాశమిదం పుత్ర స్వచ్ఛం కచకచాయతే
యన్నామ తజ్జగద్భాతి జగదన్యన్న విద్యతే. 18

గురువు:— పుత్రకా! శుక్తి (ముత్తెపుచిప్ప) తన చాకచక్యముచే రజతము (వెండి) వలె స్ఫురించునట్లు, నిర్మలమగు చిదాకాశమే నిజ చిత్స్వభావముచే నిట్లు జగద్రూపముగ స్ఫురించుచున్నది అంతేగాని జగత్తనునది వేఱుగలేదు

అస్యైతద్వస్తునో రూపం చిద్వ్యోమ్నో వితతాకృతేః
రూపమత్యజదేవాచ్ఛం యదిత్థమవభాసతే. 19

తన నిర్మల చిత్స్వరూపమును త్యజింపకయే యిట్లు జగత్తువలె భాసించుట, ఈ విశాల చిదాకాశవస్తువుయొక్క స్వభావమే అయియున్నది.

కచనాకచనం సర్గక్షయాత్మాస్య నిజం వపుః
వ్యోమాత్మ శుక్లకృష్ణం స్యాద్యథావయవినో వపుః. 20

ఆకాశమునకు శుక్ల (తెలుపు) కృష్ణ (నలుపు) వర్ణములవలెను, అవయవికి అవయవ ములవలెను, (దృశ్యరూప) స్ఫురణ అస్ఫురణములున్ను, సృష్టిప్రళయములున్ను, ఈ చిదాకాశము యొక్క స్వరూపములైయున్నవి.

యథాయం త్వం సితోదాన్తరేక ఏవాదితః కచైః
తథా బ్రహ్మైవమచ్ఛాత్మ సర్గే సర్గక్షయేఽక్షయమ్. 21

ఓ రామచంద్రా! నీవు నిర్మలోదకముగల జలాశయమునఁ బ్రవేశించుటకు పూర్వ మున్ను, ప్రవేశించినపుడున్ను, అనంతరము బింబప్రతిబింబభేదము క్షయించినపుడున్ను అక్షయ మైన ఉదయముగల ఒకేరూపమెట్లు కలిగియుండునో, అట్లే నిర్మలమగు బ్రహ్మమున్ను, సృష్టి ప్రళయములందు అక్షయమైన ఏకరూపమే గల్గియున్నది.

యథా స్వప్నే సుషుప్తే చ నిద్రైకైవాక్షయానిశమ్
సర్గేఽస్మిన్ప్రలయేచైవం బ్రహ్మైకం చితిరవ్యయమ్. 22

స్వప్నమందును, సుషుప్తియందును నిద్ర సదా యేకరూపముగనే యుండునట్లు ఈ సృష్టియందును, ప్రళయమందుమ, అక్షయమగు చిద్రూపబ్రహ్మము సదా యేకరూపముగనే వర్తించుచున్నది.

యథా స్వప్నే జగద్ద్రష్టుః శాన్తం శామ్యత్యశేషతః
తద్వదస్మజ్జగదిదం శాన్తం శామ్యత్యశేషతః. 23

స్వప్నమందలి జగత్తు జాగ్రత్తునందెట్లు మేల్కొనువానికి బూర్ణముగ శమించుచున్నదో, అట్లే ఈ మనజగత్తున్ను బోధదశయందు బూర్ణముగ శమించిపోవుచున్నది.

తదన్యత్రాస్తి ఖేఖాఖ్యం తథేత్యత్ర న విద్మహే
అశక్యం పరఖే త్వేతదస్మచ్చిద్వ్యోమ్ని సంభవాత్. 24

ప్రియుడవగు రామచంద్రా! బాధితమైనదియు, కావుననే శూన్యమను పేరుగలదియు నగు ఆ స్వప్నజగత్తు మఱియొకచోట (దేశాంతరమున) ఆ విధముగనే యుండియున్నదను విషయమును బోధదృష్టిచే మేమెఱుగము. లేక అన్యజీవులయొక్క జీవాకాశమున నుండునను శంక కేవలము అయోగ్యమైనదేయగును. ఏలయనిన మనయొక్క వాసనామయమగు ప్రపంచము మన జీవాకాశముననే సంభవమగునుగాని అన్యులయందుగాదు.

యథేహాస్మచ్చిదాకాశకచనం సర్గసంక్షయే
తథాన్యత్వంవిదాకాశం నైవమిత్యత్ర కా ప్రమా. 25

మన చిదాకాశముయొక్క జగద్రూప స్ఫురణము ప్రబోధముచే బాధితమై యెట్లు లేకయున్నదో, అట్లు తక్కినవారి (అప్రబుద్ధుల)యొక్క జగద్రూప స్ఫురణమున్ను లేదనుటయందేమి ప్రమాణముగలదు? మనకు బాధితమైన జగత్తు తక్కినవారి చిదాకాశమునఁ బ్రవేశింపదు.

**శిష్య ఉవాచ :—**

ఏవం చేత్తద్యథా స్వప్న ద్రష్టురన్యః న దృశ్యధీః
విద్యతే తద్వదన్యత్ర మన్యేఽస్తి జగదాదిధీః. 26

శిష్యుఁడు:— మహాత్మా! ఈ ప్రకారముగ మన సంవిత్తుయొక్క విషయము మఱియొకని సంవిత్తునందుఁ బ్రవేశింపనిచో, స్వప్నమును గాంచువానికంటె వేఱైనట్టి జాగ్రత్పురుషునకు జాగ్రద్దృశ్యబుద్ధి యుండునట్లు ఒకనియొక్క ప్రళయకాలమందును, మఱియొకనికి జగదాదిబుద్ధి యుండునని తలంచుచున్నాను.

**గురు రువాచ:—**

ఏవమేతన్మహాప్రాజ్ఞ స్వరూపం తు న తజ్జగత్
చితి భాతి స్వరూపం తత్తద్వదేవ న భాతి చ. 27

గురువు:— మహాప్రాజ్ఞుఁడవగు రామచంద్రా! నీవుచెప్పినది సత్యమే. జగత్తు వాస్తవముగ చైతన్యముయొక్క స్వరూపమగుచో, అది సర్వసాధారణముగ నొకేరూపమైయుండును; కాని యిట్లుకాదు. చైతన్యమున అధ్యస్తమై జగత్తుతన్ను గాంచువారికి వారివారి సంకల్పానుసారము భాసించుచున్నది. తదితరులకుఁగాదు. కావున వారివారి సంకల్పానుసారమే జగత్తుయొక్క స్వరూపము వ్యవస్థితమై యున్నదగును.

న భాతి న చ తత్కించిన్న చ తత్కించిదేవ సత్
తచ్చిదాకాశకచనం కే తత్ర సదసద్దృశౌ. 28

ఈ జగత్తు సర్వులకు సాధారణముగ నొకేరూపముతో భాసింపదు. కావుననే తుచ్ఛమైనది. ఒకింతైనను సత్తుకాదు; అది ఆ యా జీవుల చిదాకాశముయొక్క స్ఫురణమాత్రమే యగును. కాఁబట్టి యిఁక నచట సదసద్దృష్టులేమి?

విద్యతే తద్ధి సర్వత్ర సర్వం సర్వేణ సర్వదా
న విద్యతే తద్ధి చ తత్కించిత్సర్వం సర్వత్ర సర్వదా. 29

ఒకవేళ జగత్తు అధిష్ఠాన చిదాకాశరూపముచే 'కలదు' అని చెప్పఁబడుచో నప్పుడది సర్వవిధముల సర్వత్ర సర్వదా విద్యమానమైయే యున్నదగును. నిజదృశ్యరూపముచే నది యంతయు నొకింతైనను నెచటను నెప్పుడును లేకయేయున్నది.

తత్సత్తత్సర్వదా సర్వమసచ్చాసదివాఖిలమ్
తన్మయం చిచ్చిదాకాశం న నాశి న చ నాశి తత్. 30

బ్రహ్మము పరమార్థరూపముచే సత్తుగను, వృత్తులచేఁ గప్పఁబడుటవలన అసత్తుగను నుండుటబట్టి, ఈ జగత్తంతయునుగూడ నట్లే సదసద్రూపముగ భాసించుచున్నది. మఱియు చిదాకాశరూపమగు ఆ బ్రహ్మము నాశరహితమై యుండుటవలన తన్మయమగు ఈ జగత్తున్ను నాశరహితమే అయియున్నది.

యన్నామ సచ్చిదాకాశం సర్గప్రలయరూపి తత్
తద్దుఃఖాయాపరిజ్ఞాతం పరిజ్ఞాతం పరః శమః. 31

సద్వస్తువగు చిదాకాశమే సృష్టి ప్రళయరూపమైయున్నది. ఆ చిదాకాశమే యెఱుగఁబడనిచో దుఃఖప్రద (సంసార) రూపమున్ను ఎఱుగఁబడినచో పరమశాంతి (మోక్ష) రూపమున్ను అయియున్నది.

విద్యతే సర్వథైవేదం సర్వం సర్వత్ర సర్వదా
న విద్యతే సర్వథా చ సర్వం సర్వత్ర సర్వదా. 32

జ్ఞానికిబ్రహ్మము సర్వరూపమై, సదా, సర్వథా, సర్వత్ర వెలయుచున్నదగును అజ్ఞానికిది సర్వదా యెన్నఁడును నెచటను లేనిదేయగును.

ఏష దేవో ఘటః శైలః పటః స్ఫోటస్తతో వటః
తృణమగ్నిః స్థావరం చ జంగమం సర్వమేవ చ. 33

ఈ బ్రహ్మమే దేవ, ఘట, పట, సర్వత, స్ఫోట (భేదన,) తట, వట, తృణ, అగ్ని, స్థావర, జంగమాది సమస్తమున్ను అయియున్నది.

అస్తి నాస్తి చ శూన్యం చ క్రియా కాలో నభో మహీ
భావాభావౌ భవో భూతిర్నాశాః పాశాః శుభాశుభాః. 34

'కలదు'. 'లేదు', శూన్యము, క్రియ, కాలము, ఆకాశము, భూమి, భావాభావములు జన్మ, ఐశ్వర్యము, నాశము, పాశము, శుభాశుభములు మున్నగునవి యన్నియును ఆ పరబ్రహ్మమే అయియున్నవి.

తన్నాస్త్యేవ న యన్నామ నిత్యమేక స్తథా బహిః
ఆదిమధ్యమథాన్తం తు కాలత్రితయమేవ చ. 35

ఏకమై. నిత్యమైనట్టి పరమాత్మలేని పదార్థము బాహ్యాభ్యంతరములందును, ఆదిమధ్యాంతములందును, కాలత్రయమందును ఎద్దియునులేదు.

సర్వం సర్వేణ సర్వత్ర సర్వదైవాత్ర విద్యతే
సర్వం సర్వేణ సర్వత్ర సర్వదాత్ర న విద్యతే. 36

అధిష్ఠానరూపమున ఈ పరబ్రహ్మమందు సర్వము. సర్వరూపములచే. సర్వత్ర, సర్వదా గలదు. దృశ్యరూపమున ఈ పరబ్రహ్మమందేదియు నే రూపముచేతను నెచటను నెప్పుడును లేదు.

యదైవం రామ సర్వాత్మ సర్వమేవాస్తి సర్వదా
బ్రహ్మాత్మత్వాత్స్వప్నసంవిత్పురన్యాయేన వై తదా. 37

ఓ రామచంద్రా! ఈప్రకారముగ స్వప్నపగరములయొక్క దృష్టాంతముచే సర్వము బ్రహ్మమయమైయుండుటవలన సమస్తపదార్థములున్ను సర్వరూపములేయై యొప్పుచున్నవి.

తృణం కర్తృ తృణం భోక్తృ బ్రహ్మాత్మత్వాత్తృణం విభుః
ఘటః కర్తా ఘటో భోక్తా ఘటః సర్వేశ్వరేశ్వరః. 38

బ్రహ్మరూపమగుటవలన తృణమున్ను కర్తయు, భోక్తయు, సర్వవ్యాపకమున్ను నగుయున్నది. అట్లే ఘటమున్ను కర్తయు. భోక్తయు, ఇంద్రాదీశ్వరులకున్ను ఈశ్వరుడునైయున్నది.

పటః కర్తా పటో భోక్తా పటః సర్వేశ్వరేశ్వరః
దృశిః కర్తా దృశిర్భోక్తా దృశిః సర్వేశ్వరేశ్వరః. 39

గిరిః కర్తా గిరిర్భోక్తా గిరిః సర్వేశ్వరేశ్వరః
నరః కర్తా నరో భోక్తా నరః సర్వేశ్వరేశ్వరః. 40

ఆ విధముగనే పటము (వస్త్రము) నేత్రము. పర్వతము, మనుజుడు — ఇత్యాది సమస్తపదార్థములున్ను ప్రత్యేకముగ కర్తయు, భోక్తయు, ఇంద్రాదీశ్వరులకున్ను, ఈశ్వరుడునై వెలయుచున్నవి.

ప్రత్యేకం సర్వవస్తూనాం కర్తా భోక్తా పరాత్పరః
అనాదినిధనో ధాతా సర్వం బ్రహ్మాత్మకం యతః 41

సమస్తము బ్రహ్మస్వరూపమగుటచే సర్వవస్తువులందును ప్రత్యేకముగ ఒక్కొక్కవస్తువున్ను కర్తయు, భోక్తయు, పరాత్పరుడును ఆదిమధ్యాంతరహితుడును బ్రహ్మదేవుడునైయున్నది.

తృణకుమ్భాదయస్త్వేతే స్వయా విభుతయా విభుః
ఏవంరూపా స్థితా రూపం యద్విభాతః క్షయోదయౌ. 42

ఈ తృణ, ఘటాది పదార్థములన్నియు నిజసాక్షియై సర్వవ్యాపకమైనట్టి ప్రత్యగాత్మ రూపముతో నే స్థితి నొందియున్నవి? మఱియు, దేనియందు వానియుత్పత్తి, వినాశములు భాసించుచున్నవో, ఆ సమస్తరూపముచే సర్వవ్యాపకమగు బ్రహ్మమే వెలయుచున్నది,

బాహ్యోఽర్థోఽస్తి స ఏవేహ కర్తా భోక్తా తథావిధః
విజ్ఞానమాత్రమేవాస్తి కర్తృభోక్తృ తథావిదామ్. 43

ఎవరిమతమందు బాహ్యమందలి పదార్థము విజ్ఞానముకంటె భిన్నమైయున్నదో, అట్టివారికి (వైశేషిక సౌత్రాంతికాదులకు) ఆ విజ్ఞానేతరపదార్థమే కర్తయు, భోక్తయునైయున్నది. మఱియు ఏ వాదులయొక్క మతమందు విజ్ఞానమాత్రమే సమస్తమునయియున్నదో. అట్టివారికి (బౌద్ధులకు) ఆ విజ్ఞానమే కర్తయు, భోక్తయునయి యొప్పుచున్నది.

న కశ్చిచ్చైవ కర్తేహ న చ భోక్తా తథావిదామ్
కశ్చిదీశ్వర ఏవేహ కర్తా భోక్తా తథావిదామ్. 44

శూన్యవాదుల మతమందిచట కర్తకాని, భోక్తగాని యెవఁడునులేడు. అంతయు శూన్యమే అయియున్నది. పాశుపతాదుల మతమందు ప్రక్రియాప్రసిద్ధుఁడగు ఈశ్వరుడే కర్తయు భోక్తయునై యున్నాఁడు.

సర్వమేవ పదే తస్మిన్సంభవత్యుత్తమోత్తమే
విధయః ప్రతిషేధాశ్చ కే తే సన్తి న సన్తి కే. 45

ఈ ప్రకారముగ ఆ సర్వశక్తివంతమై, సర్వరూపమై, సర్వోత్కృష్టమైనట్టి బ్రహ్మపదమున సమస్తము సంభవించుచున్నది. మఱియు, ఆ బ్రహ్మమందు ఆయా వాదుల కల్పితమములైన పరస్పర విలక్షణములగు విధి, నిషేధములున్ను అవిరోధపూర్వకముగ సంభవించుచున్నవి. కావున, సమస్తవివర్తములకు అధిష్ఠానమైన యా చిదాకాశమున సంభవింపనిదేదిగలదు?

శుద్ధే ద్రష్టేవ చిద్వ్యోమ దృశ్యతామివ భానయత్
స్వమాత్మానం జగదితి పశ్యత్యేత్తిష్ఠేదనామయమ్. 46

ఆయా యుపాధులలో చిదాకాశము శుద్ధస్వాత్మయందు ఆయా వాసనల ననుసరించి దృశ్యమును భావనచేయుచు ద్రష్టవలెనయి తన్ను జగద్రూపముగఁ గాంచుచున్నను, వాస్తవముగ తన నిర్వికారరూపముతోనే స్థితినొందియున్నది.

సర్వా దృశో విధినిషేధదృశశ్చ సర్వాః
సంకల్పవేదన విశేష సశేషపూర్వాః
సత్యాత్మికాః సతతమేవ నచైవ సత్యా
రూపం యథానుభవమాత్ర యతః స్వరూపమ్. 47

సమస్తజీవులయొక్కయు తమతమ స్వానుభవసిద్ధములైన పదార్థములయొక్క దృష్టులున్ను, పరస్పరవిలక్షణములైన సమస్తవిధినిషేధములఁ గూర్చిన దృష్టులున్ను, వారివారి సంకల్ప అనుభవవిశేష, వాసనా, కామ, కర్మాదులననుసరించి వర్తించుచు ఆ యా వ్యవహారములందు నిరంతరము అర్థక్రియాసమర్థములగుటఁబట్టి సత్యరూపములైయున్నవి. కాని ఆత్మదృష్టిచే నవి యన్నియును, శశశృంగము (కుందేటికొమ్ము)వలె అసత్యములే అయియున్నవి. ఏలయనిన ఈ పరబ్రహ్మమందు సమస్త వస్తువులయొక్కయు రూపము, జీవుల నిజసంకల్ప. అనుభవానుసారము కల్పింపఁబడుచున్నదేగాని వాస్తవముకాదు.

ఇతి త్వయా శిష్యతయా మదన్తికా చ్ఛ్రుతం వరా తేన న చాపి బుద్ధవాన్
తతోఽనుభూయామ్యజగద్భ్రవాద్భ్రహా నిహోద్య జాతోఽసిత దేవ పృచ్ఛసి. 48

ఓ రామచంద్రా! ఈ ప్రకారముగ పూర్వయుగమున నీవు నావద్ద శిష్యుఁడవుగనున్న వాఁడవై ఈ నా యుపదేశమునంతయు వింటివి. కాని దానిచే నీవపుడు ప్రబుద్ధుఁడవు కాక యుంటివి. అందుచే మరల ఇపుడీ త్రేతాయుగమున నీవిచట దశరథుని గృహమున జన్మించి మరల ఆ విషయమునుగూర్చియే నన్నడుగుచున్నావు.

జ్ఞానం సదేతదఖిలం శ్రుతముత్తమం చి
త్సంసారదీర్ఘరజనీసితరశ్మిబిమ్బమ్
జాతస్త్వమభ్యుదయవానమలైకబోధ
ఉత్పార్య మోహమనుతిష్ఠ యథాగతం త్వమ్. 49

ఈ జన్మయందు నాచే నుపదేశింపఁబడినదియు, ఉత్తమమైనదియు, పరమార్థవస్తు గోచరమైనదియు సంసారమును దీర్ఘమైన రాత్రియొక్క తాప, అంధకారములను నశింపఁజేయుట యందు చంద్రబింబమువంటిదియునగు జ్ఞానమునంతయును నీవువింటివి. దానిచే నీవిపుడు అజ్ఞానమును దొలగించివైచి, నిరతిశయానంద రూపమైన పరమపురుషార్థ (మోక్ష) లాభమను అభ్యుదయమునొంది నిర్మల బోధైకరూపుఁడవై చెన్నొందుచున్నావు, ఈ ప్రకారముగ కృతకృత్యుఁడవైన నీవు ఇఁక మీదట యథాప్రాప్తమగు రాజ్యాధికారమును నిర్వహించుచు సుఖముగ నుండుము.

తిష్ఠం స్తదాత్మని పరే విమలస్వభావే సర్వాత్మకే తవతి సర్వపదార్థముక్తః
నిర్వాణశాన్తమతిరమ్బరకోశకాన్తో ధర్మేణ రాజ్యమనుపాలయతీర్ణతృష్ణః. 50

ఇత్యార్షే శ్రీ వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు
నిర్వాణప్రకరణే ఉత్తరార్థే ప్రాక్తనరామశిష్యత్వోపాఖ్యానం
నామ త్రయోదశాధికద్విశతతమః సర్గః ॥ 213 ॥

ఓ రామచంద్రా! నిర్మలస్వభావయుక్తమైనదియు, సర్వత్ర ప్రకాశమానమైనదియు, సర్వ రూపమునగు పరమాత్మపదమున స్థితినొందియున్నవాఁడవై, సర్వదృశ్యపదార్థరహితుఁడవై, నిర్వాణ రూపమగు నిరతిశయానందమున మగ్నుఁడవై, కాషనచే శాంతచిత్తుఁడవై ఆకాశకోశమువలె

మనోహరముగ నున్నవాఁడవై, తృష్ణావివర్జితుఁడవై నీవు సమదృష్టితోడ ధర్మ పూర్వకముగ రాజ్యమును బాలింపుము.

ఇతి శ్రీవాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున నుత్తరార్థమున ప్రాక్తనరామశిష్యత్వోపాఖ్యానమను రెండువందల పదమూఁడవ సర్గము ॥ 213 ॥

## చతుర్దశాధికద్విశతతమః సర్గః

[ఉపదేశప్రశంసాత్ర శ్రోతౄణాం కృతకృత్యతా
దివ్యశ్చ మానుషశ్చాన్తే వర్ణ్యతే సుమహోత్సవః.

అంత్యమున వసిష్ఠోపదేశముయొక్క ప్రశంస శ్రోతలయొక్క కృతకృత్యత్వము దేవాదులయొక్కయు మనుష్యులయొక్కయు మహోత్సవము ఇచట వర్ణింపఁబడుచున్నవి.]

శ్రీ వాల్మీకిరువాచ:—

ఇత్యుక్తవత్యథ మునౌ నభసో ననాద
వర్షామృతాభ్రమివ దున్దుభిరామరో ద్రాక్
శుక్లీకృతాఖిలకకుబ్వద నాతుషార
వర్షోపమా భువి పపాత చ పుష్పవృష్టిః. 1

శ్రీవాల్మీకి:— ఓ భరద్వాజా! వసిష్ఠమునీంద్రుఁడిట్లు వచింప అంత అమృతపరిపూర్ణమగు మేఘముయొక్క గంభీరశబ్దమువలె దేవతల దుందుభులు మ్రోగెను. వెనువెంటనే హిమవృష్టివలె దిక్కులన్నింటిని దెల్లగఁ జేయునట్టి పుష్పవర్షము ఆకసమునుండి భూమిపైఁ బడెను.

కింజల్కజాలదివసాన్తఘనాఙ్గరాగా వాతావధూతసితకేసరగౌరహారా
పుష్పోదరోత్థమృదుశీకరశీతలాఙ్గా ప్రాప్తా స్వయం సురపురాదివ పుణ్యలక్ష్మీః.

సాయంకాలమేఘమువలె నెఱ్ఱనైనట్టి పుష్పపరాగసమూహమను అంగరాగము (గంధపుపూఁత) చే మనోహరమై వాయువుచే కంపితములైన తెల్లని పుష్పకేసరములను శ్వేత-హారములచే భూషితమై పుష్పములనుండి వెలువడిన కోమల జలకణములను శీతలావయవములచే శోభించుచు అపుడా పుష్పవర్షమను పుణ్యలక్ష్మి దేవతల నగరమునుండి ఆయుత్సవమును వీక్షించుటకై స్వయముగనట కేతెంచినదా యనునట్లుండెను.

కల్పాన్తకాలకపికమ్పితశుష్కశాఖా
స్వర్గద్రుమాత్పతితమాశు విడమ్బయన్తీ
తారాగణం ప్రథితభాసమనల్పహాస
మాశామఖప్రసృతభైరవమప్యరస్తా. 8

మఱియు ఆపుష్పవృష్టి కల్పాంతకాలమను మర్కటము (కోఁతి)చే కంపింపఁజేయఁ బడిన శుష్కములైన కల్పవృక్ష దిక్పాలపురములను శాఖలుగల స్వర్గమను వృక్షమునుండి పడిన

దానివలెను, దిక్కులందు శీఘ్రముగఁ బ్రసరించిన సంహారరుద్రుని గొప్ప యట్టహాసమువలెను, ప్రకాశమానములైన నక్షత్రములతోఁగూడిన యాకాశము ననుకరించుచున్నదానివలెను, నొప్పుచుండెను.

> సా పుష్పవృష్టిరథ దున్దుభినాదగర్జ
> త్కింజల్కపుఞ్జ జలదా శమమాజగామ
> ఆపూరితాఖిలసభా హిమహారి పుష్ప
> పూరేణ కౌతుకవికాసకరీ క్షణేన. 4

దుందుభినాదములతో గర్జించుచున్న పుష్పపరాగసమూహమను మేఘములచే శోభించునదియు, మంచువలెఁ దెల్లనైనట్టి పుష్పముల ప్రవాహముచే నా సభనంతయుఁ బూర్ణమొనర్చునదియు కావుననే దర్శనమాత్రముచే సర్వులకు నధికానందమును గొల్పునదియునగు ఆ పుష్పవర్షము పిమ్మట కొంతసేపటికి శమించెను.

> తాని దివ్యాని పుష్పాణి యథాస్థానమధః స్థితాః
> వసిష్ఠాయ నమస్కృత్వా సభ్యాః సంశోకితా జహుః. 5

అటుపిదప సర్వోన్నతస్థానముననున్న యావసిష్ఠమునీంద్రునకుఁ గ్రింద యథాస్థానములందుఁ గూర్చొని యున్న మునిగణ దశరథాది సభాసదులెల్లరును దివ్యపుష్పములనుగైకొని వసిష్ఠభగవానుని చరణకమలములందు సమర్పించి నమస్కరించి జననమరణాదిశోకము వ్యజించివైచిరి.

దశరథ ఉవాచ:—

> అహో ను సువిశాన్తా నః సంసారవితతాకృతేః
> విశ్రాన్తాస్తశ్చిరం శ్రాన్తాః శుద్ధా మేఘా ఇవాచలే. 6

దశరథుఁడు:— అహా! మహాత్మా! జడత్వ కృష్ణత్వరహితములగు శుద్ధ శరత్కాల మేఘములు పర్వతముపై విశ్రమించునట్లు సంసారమను అతిదీర్ఘమైన యరణ్యమందుఁ చిరకాలము శ్రమనొందియున్న మేము తమయనుగ్రహపూర్ణమగు యుపదేశమువలన సులభముగ ఆత్మయందుఁ బ్రవేశించినవారమై యట్టి యుత్తమమగు ఆత్మపదమున శాశ్వతముగ విశ్రమించినవారమైతిమి.

> కర్మణామవధిః పూర్ణో దృష్టః సీమాన్త ఆపదామ్
> జ్ఞాతం జ్ఞేయమశేషేణ విశ్రాన్తాః స్మః పరే పదే. 7

మఱియుఁ ఓ మునీంద్రా! పురుషార్థసిద్ధికై అవశ్యమాచరింపఁదగిన కర్మలయొక్క అవధి మాకిపుడు పరిపూర్ణమైనది. (కృతకృత్యులమైతిమనిభావము) ఆపదలయొక్క పరమావధిని గాంచితిమి. జ్ఞేయమగు ఆత్మవస్తువును పూర్ణముగ నెఱిఁగితిమి. పరమపదమున (బ్రహ్మమందు) విశ్రాంతినొందితిమి.

> ధ్యానలబ్ధపరవ్యోమచిరానుభవన్రభమైః
> ధారణాధ్యాసవిశ్రాన్త్యా దేహసన్త్యజనక్రమైః. 8
> సంకల్పనవనిర్మాణైః స్వప్నదృష్టి జగజ్వరైః
> శుక్తిరూప్యానుభవనైః స్వప్నాత్మమృతిదర్శనైః. 9

అనన్యైః పవనస్పన్దైరనన్యైః సలిలద్రవైః
ఇన్ద్రజాలపురాపూరైర్గన్ధర్వనగరోత్కరైః. 10

మాయాపూర్ణపురాభోగైర్మృగతృష్ణానదీరయైః
ఆయతౌ పవనస్పర్శైర్ద్విచన్ద్రానుభవోదయైః. 11

మదభ్రంశపురస్పన్దైర్మృదా త్వవనికమ్పనైః
బాలయక్షాద్యనుభవైః ఖకేశోణ్డ్రకదర్శనైః. 12

ఏవమాదిభిరన్యైశ్చ దృష్టాన్తైః స్వానుభూతిదైః
అహో ను మార్జితా దృశ్యదృష్టిర్భగవతా మమ. 13

మహాత్మా! ధ్యానముచేఁ గల్పింపఁబడిన మతియొక్క ఆకాశమందలి చిరకాలానుభవములను భ్రమలఁగూర్చిన యుపదేశములచేతను యోగధారణచే సర్వాధారమగు బ్రహ్మమందలి విశ్రాంతిద్వారా యీ దేహమును త్యజించుటఁగూర్చిన క్రమములచేతను. సంకల్ప స్వప్నాదులందు నూతనముగ నిర్మితములైన జగత్సమూహములను జ్వరములఁగూర్చిన యుపదేశములచేతను, శుక్తి రజతాద్యనుభవములచేతను, స్వప్నమందలి స్వమరణదర్శనములచేతను, అభిన్నములైన వాయు చలనములయొక్కయు, జలద్రవత్వములయొక్కయు దృష్టాంతములచేతను, ఇంద్రజాలపుర, గంధర్వనగర సమూహాదులఁగూర్చిన యుపదేశములచేతను, మాయాపూర్ణములైన విశాలపురముల యొక్కయు, మృగతృష్ణానదీ ప్రవాహములయొక్కయు నుదాహరణములచేతను, ప్రళయకాలపు ప్రచండవాయు స్పర్శలగూర్చిన బోధలచేతను, చంద్రద్వయమునుగూర్చిన యనుభవములచేతను, మదముచే వివేకము నాశముకాఁగా ప్రతీతములగు నగరాదుల సంచలనములయొక్కయు, శుభాశుభసూచనములేకయే భ్రాంతిచే గోచరించు భూకంపములయొక్కయు నుపదేశముచేతను, బాలుని బేతాళాద్యనుభవములచేతను, ఆకాశమందలి కేశాదుల దర్శనములచే ఇంకను ఈ ప్రకారములైన యనేక స్వానుభూతి ప్రదములగు దృష్టాంతముల చేతను మహాత్ములగు తాము మాదృశ్యదృష్టిని తుడిచివైచితిరి! అహా! ఎంత సంతోషకరమైన విషయము!

**శ్రీ రామ ఉవాచ :—**

నష్టో మోహః పదం ప్రాప్తం త్వత్ప్రసాదాన్మునీశ్వర
సంపన్నోఽహమహం సత్యమత్యన్తమవదాతధీః. 14

శ్రీరాముఁడు:— మునీశ్వరా! తమ యనుగ్రహముచే నా మోహము (అజ్ఞానము) నశించినది ఆత్మపదమును నేను బొందితిని; అత్యంత శుద్ధబుద్ధిగలవాఁడనై నేనిపుడు సాక్షాత్ బ్రహ్మరూపుఁడనే అయితిని.

స్థితోఽస్మి గతసందేహః స్వభావే బ్రహ్మరూపిణి
నిరావరణవిజ్ఞానః కరిష్యే వచనం తవ. 15

గురువర్యా! నేనిపుడు సందేహరహితుఁడనై, ఆవరణరహితమగు పరమాత్మ విజ్ఞానము గలవాఁడనై బ్రహ్మస్వభావమున స్థితినొందియున్నాను ఇఁక తమ యాజ్ఞ ప్రకారము (ఆసక్తిరహితముగ రాజ్యపాలనాది కార్యములను) ఆచరించెదను.

స్మృత్వా స్మృత్వాఽమృతానేకసౌఖ్యదం వచనం తవ
అర్చితోఽపి చ శాన్తోఽపి హృష్యామీవ ముహుర్ముహుః. 16

మహాత్మా! అమృతముచేఁ దడుపఁబడినదానివలె సౌఖ్యదాయకములగు తమ వచనములను మరల మరల స్మరించి పూజితుఁడనైనను, అవమానింపబడినను హర్ష, శోకములయొక్క అనుదయముచే శాంతుఁడనై మాటిమాటికి ఆనందమును బొందుచునున్నాను.

నైవ మేఽద్య కృతేనార్థో నాకృతేనేహ కశ్చన
యథా స్థితోఽస్మి తిష్ఠామి తథైవ విగతజ్వరః. 17

దేవా! ఇపుడు నాకీప్రపంచమున కార్యములఁ జేయుటచేగాని, చేయకుండుటచేగాని యేప్రయోజనమున్నులేదు. పూర్వమెట్లు నేను వ్యవహారమున స్థితిగల్గియుంటినో, అట్లే యిపుడును తద్వ్యవహారజనితసంతాపరహితుఁడనై యందు స్థితిగల్గియున్నాను.

ఉపాయస్తు తథా తేన దృష్టిర్వాస్తీహ కీదృశీ
అహో ను వితతా భూమిః కష్టమేతాదృశీ దశా. 18

తమవచనములచే నెట్టి విశ్రాంత్యుపాయము లభించినదో, అట్టియుపాయముగాని, దృష్టిగాని మఱియొకటి యేదియుండగలదు? అహా! అపరిచ్ఛిన్నమైన విశ్రాంతి సుఖభూమిని నేను బొందితిని. అయ్యో! కష్టము! తమయుపదేశములేని ప్రాణులయొక్క జననమరణాద్యనర్థపూర్ణ మగు సంసారదశ అతిభయంకరమైనది.

న శత్రుర్న చ మిత్రం మే న క్షేత్రం దుర్జనో జనః
దుర్బోధైషా జగత్త్రుష్టా శాన్తా సర్వార్థసున్దరీ. 19

మహాత్మా! నాకిపుడు శత్రువుగాని, మిత్రుఁడుగాని, క్షేత్రము (శరీరము, బాహ్యప్రపంచము) గాని, దుర్జనుఁడుగాని, సజ్జనుఁడుగాని యెవ్వఁడునులేఁడు. ఈ స్వాత్మచైతన్యమే అజ్ఞానమున్నంతవఱకును సంక్షుబ్ధమై దుఃఖప్రదముగ జగత్తుగ వర్తించెను ఇపుడట్టి యజ్ఞానము బాధితమగుట వలన ప్రశాంతముగను, సర్వార్థసుందరముగను నయ్యది వెలయుచున్నది

కథమేతాం జనో వేత్తి వినా భవదనుగ్రహమ్
వినైవ సేతుం పోతం వా బాలోఽబ్ధిం లఙ్ఘయేత్కథమ్. 20

గురుదేవా! తమయనుగ్రహములేక యిట్టి శుద్ధమగు ఆత్మదృష్టిని మనుజుఁడెట్లెఱుఁగఁగలఁడు? వంతెనగాని, నావగాని లేక బాలుఁడు సముద్రము నెట్లుదాఁటఁగలఁడు?

లక్ష్మణ ఉవాచ:—

జన్మాన్తరోపచితసంశయనాశనేన జన్మాన్తరోపచితపుణ్యశతోదితేన
జాతోఽద్యమే మునివచః పరిబోధనేనజాతోఽద్యమే మనసిచన్ద్ర ఇవప్రకాశః.

లక్ష్మణుఁడు:– మహాత్మా! అనేకజన్మలందు సంచితమొనర్పఁబడిన దుర్వాసనలవలన గలిగినట్టి సంశయములయొక్క వినాశముచేతను, అనేకజన్మలందు సంచితమొనర్పఁబడిన పెక్కు

పుణ్యములయొక్క యుదయము (బోధోన్ముఖత్వము) చేతను, ఇపుడు (వసిష్ఠ)మునీంద్రుని వచనములచే గావింపఁబడిన బోధచే నుత్పన్నమైనట్టి ఆత్మవిచారముగల నా మనస్సునందు నేఁడు చంద్రునివలె పరమ ఆహ్లాదకరమగు ప్రకాశముదయించినది.

ఈదృశ్యాం దృశ్యమానాయాం దృశి దోషదశాశతైః
కాష్ఠవద్దహ్యతే లోకః స్వదుర్భగతయా తయా. 22

మునీంద్రా! తమవంటి మహానుభావులయొక్క యుపదేశమువలన ఇట్టి, నిరతిశయానందరూపమగు ఆత్మదృష్టి నిత్యము అపరోక్షముగ వర్తించుచున్నను జనులు తమ దౌర్భాగ్యవశమున మహాత్ముల సేవా, శుశ్రూషారహితులై రాగ, ద్వేష, అహంకార, జనన, మరణాద్యనేక దోషములచే కాష్ఠము (కొయ్య) వలె అహర్నిశము దహింపఁబడుచున్నారు! ఆశ్చర్యము!

విశ్వామిత్ర ఉవాచః—

అహో బత మహత్పుణ్యం శ్రుతం జ్ఞానం మునేర్ముఖాత్
యేన గఙ్గా సహస్రేణ స్నాతా ఇవ వయం స్థితాః. 23

విశ్వామిత్రుఁడు:— ఆహా! మహాసంతోషకరమైన విషయము! అతిపవిత్రమైన జ్ఞానమును (వసిష్ఠ) మునీంద్రుని ముఖతఃవింటిమి; దానిచే, వేలకొలఁది గంగానదులందు స్నానము చేసిన చందమున మేము పరమపవిత్రులమై యలరుచున్నాము.

శ్రీరామ ఉవాచ :—

సంపదామథ దృష్టీనాం శాస్త్రాణామాపదాం గిరామ్
దేశానామథ దృష్టానాం దృష్టః సీమాన్త ఉత్తమః 24

శ్రీరాముఁడు:— గురువర్యా! సమస్తసంపదలయొక్కయు, దృష్టులయొక్కయు, శాస్త్రములయొక్కయు పశుపుత్రధనాది రూపమగు సంసారము యొక్క నాశము యొక్కయు, వాక్కులయొక్కయు. సుఖవిశ్రాంతి హేతువులగు ప్రాసాద, ఆరామ, గిరి, నద్యాది ప్రదేశముల యొక్కయు ఉత్తమ అవధి (ఆత్మ) యిపుడు మాచేఁ గాంచఁబడినది.

నారద ఉవాచః—

యన్న శ్రుతం బ్రహ్మలోకే స్వర్గే భూమితలే తథా
కర్ణౌ తజ్జ్ఞా సమాకర్ణ్య యాతౌ మేఽద్య పవిత్రతామ్. 25

నారదుఁడు:— మునీంద్రా! ఏ జ్ఞానమును బ్రహ్మలోకమందుగాని, స్వర్గమునగాని, భూతలముపైఁగాని యింతవఱకు వినియుండలేదో అట్టి జ్ఞానమునువిని నేఁడు నా చెవులు పరమ పవిత్రత్వము నొందినవి

లక్ష్మణ ఉవాచః—

హార్దం బాహ్యం చ తిమిరమపమృష్టవతా త్వయా
మునే పరమభానుత్వం నూనం నః సంప్రదర్శితమ్. 26

లక్ష్మణుఁడు:— మునివర్యా! బాహ్యాభ్యంతరములందలి అంధకారము (అజ్ఞానము)ను నశింపఁజేయునట్టి తాము నేఁడు మాకు సర్వోత్కృష్టమగు సూర్యత్వమును నిక్కముగఁ బ్రదర్శింపఁ జేసితిరి.

**శత్రుఘ్న ఉవాచ:—**

నిర్వృతోఽస్మి ప్రశాన్తోఽస్మి ప్రాప్తోఽస్మి పరమం పదమ్
చిరాయ పరిపూర్ణోఽస్మి సుఖమాసే చ కేవలమ్. 27

శత్రుఘ్నుఁడు:— మహాత్మా! తమ యనుగ్రహముచే నేను పరమతృప్తిని బొందితిని; ప్రశాంతుఁడనైతిని; పరమాత్మపదమును బడసితిని; శాశ్వతముగ పరిపూర్ణుఁడనైతిని. కేవలము నిరతిశయానంద రూపమగు ఆత్మస్వరూపమున నేనిపుడు సుఖముగ వెలయుచున్నాను.

**దశరథ ఉవాచ:—**

బహుజన్మోపలబ్ధేన పుణ్యేనాయం మునీశ్వరః
ధీరః కథితవాన్నస్తద్యేన పావనితాం గతాః. 28

దశరథుఁడు:— అనేకజన్మలందు లభించిన పుణ్యముచే మనకు నేఁడీ ధీరుఁడగు మునీశ్వరుడు బ్రహ్మజ్ఞానమునుగూర్చి యుపదేశించెను. దానిచే మనము పరమపవిత్రత్వమును బొందితిమి.

**శ్రీ వాల్మీకి రువాచ:—**

ఇతి తేషు వదత్స్వత్ర సభ్యేషు సహ భూభృతా
వసిష్ఠః స ఉవాచేదం జ్ఞానపావనయా గిరా. 29

శ్రీవాల్మీకి:— ఓ భరద్వాజా! ఈ రీతిగ నచట దశరథుఁడున్ను, అతని పుత్రులున్ను, ఋషులున్ను, మునులున్ను, సభాసదులున్ను స్తుతివాక్యములఁ బల్కుచుండ, అంతవసిష్ఠ మునీంద్రుఁడు జ్ఞానముచే పవిత్రమైనట్టి వాక్కుతో నిట్లు నుడివెను.

రాజన్రఘుకులైకేన్దో యదహం వచ్మి తత్కురు
ఇతిహాసకథాన్తే హి పూజనీయా ద్విజాతయః. 30

రఘుకులచంద్రుఁడవగు ఓ దశరథమహారాజా! ఇపుడు నేనేదిచెప్పుదునో దాని నాచరింపుడు. అధ్యాత్మమయమగు ఇతిహాస కథయొక్క యంతమున బ్రాహ్మణులను (బ్రహ్మనిష్ఠులను) బూజింపవలయును.

తదద్య బ్రాహ్మణౌఘాం స్త్వం సర్వకామైః ప్రపూరయ
వేదార్థసమనుష్ఠానఫలం ప్రాప్స్యసి శాశ్వతమ్. 31

కాఁబట్టి నేఁడు బ్రాహ్మణసమూహములను సర్వకామనలచే పరిపూర్ణులుగఁ జేసిన అంగములతోఁగూడిన యనుష్ఠానమువలన ఈ వేదార్థశ్రవణవిధియొక్క శాశ్వతఫలమును మీరుబొందఁగలరు.

మోక్షోపాయకథావస్తు సమాప్తౌ ద్విజపూజనమ్
శక్తితః కిఙ్కరేనాపి కార్యం కిము మహీభృతా. 32

ఈ మోక్షోపాయ (యోగవాసిష్ఠ) కథయొక్క సమాప్తియందు అతిదరిద్రుఁడైనను తన శక్తికొలఁది బ్రాహ్మణపూజనము గావింపవలయును. ఇఁక రాజుయొక్క విషయమైతే వేఱుఁగజెప్ప వలయునా ?

ఇతి మౌనం వచః శ్రుత్వా సహస్రాణి నృపో దశ
దూతై రాకారయామాస ద్విజానాం వేదవాదినామ్. 33

ఈ ప్రకారములగు అమ్మునీంద్రుని వచనములను విని నిరుత్తరుఁడై దశరథమహారాజంతగుర్వాజ్ఞను శిరసావహించి దూతలద్వారా వేదవాదులగు బ్రాహ్మణుల నాహ్వానించెను.

మథురాయాం సురాష్ట్రేషు గౌడేషు చ వసన్తియే
తేభ్యః కులేభ్యః సోఽభ్యర్చ్య సమానీయ ద్విజన్మనామ్. 34

మథురయందును, సౌరాష్ట్రదేశమందును, గౌడాది దేశములందును నేయే శ్రేష్ఠకులము లందలి బ్రాహ్మణులు వసించుచుండిరో వారినందఱిని ఆహ్వానించి యారాజుపూజించెను.

అధికాత్యధిక జ్ఞానప్రకృత ద్విజ భోజనః
తదా దశ సహస్రాణి భోజయామాస భూపతిః. 35

సర్వోత్తమజ్ఞానియగు బ్రాహ్మణుని మొదలుకొని సామాన్యబ్రాహ్మణుని వఱకుగల పది వేలమంది బ్రాహ్మణులకు అపుడారాజు భోజనము పెట్టించెను.

యథాభిమత భోజ్యాన్నదాన దక్షిణయా తయా
ఏవం సంపూజ్య తాన్విప్రాన్పితౄన్దేవాన్నృపాం స్తథా. 36

వారివారికి అభిమతములైన భోజ్య అన్నదాన, దక్షిణాదులచే బ్రాహ్మణులను, శ్రాద్ధాదులచే పితరులను, యజ్ఞాదులచే దేవతలను గంధమాల్యరత్నోపహారాదులచే రాజులను ఆ దశరథ మహారాజపుడు లెస్సగఁబూజించెను.

పౌరామాత్యాం స్తథా భృత్యాన్దీనాన్ధకృపణాంశ్చ తాన్
తస్మిన్దశరథో రాజా దినే సహ సుహృజ్జనైః. 37

అట్లే నగరనివాసులను, మంత్రులను, సేవకులను, దీనులను, అంధులను దరిద్రులను, భోజనదానాదులచే తృప్తిపఱచి సంసారముయొక్క అవధిని (హద్దును) బొందినట్టి యాదశరథ మహారాజు అదినమున బంధుమిత్రాదులతోసహా గొప్పయుత్సవమును గావించెను.

లబ్ధసంసృతి సీమా స్తశ్చకారోత్సవముత్తమమ్
తథా నృపగృహే తస్మిన్కౌశేయ మణికాఞ్చనే. 38

భూషితే నగరే చైవ గీర్వాణ నగ సున్దరే
ననృతుర్మత్తకామిన్యో విలాసిన్యో గృహే గృహే. 39

మఱియు నత్తఱి పట్టువస్త్రములతోడను, మణులతోడను, సువర్ణముతోడను, బాగుగ నలంకరింపఁబడినదై మేరుపర్వతము (లేక, కల్పవృక్షము)వలె సుందరమై యలరుచున్న యా రాజ గృహమందును నగరనివాసుల గృహగృహమందును, మదించిన విలాసినులైన స్త్రీలునృత్యముచేసిరి.

లసద్వంశలతాకాంస్య వీణామురజమర్దలమ్
తాణ్డవేనోద్ధతారావ మన్యోన్యేతర శేఖరాః. 40

ఋద్ధీకృతాపణ కరభ్రాన్తిపల్లవితామ్బరాః
ముగ్ధాట్టహాసవిక్షిప్తద న్తేన్దు కిరణచ్ఛటాః. 41

మదాకులితహుంకారా లీలాను తరలస్వరాః
ఏకపాదతలాఘాత హేలాహతధరాతలాః. 42

స్రగ్దామతార విగలత్కుసుమా సారపాణ్డురాః
ధారాపాతితవిచ్ఛిన్నహార ముక్తాస్థలత్పదాః. 43

లోలాభరణ సాకారం కామం నన్నృతురఙ్గనాః

ఆ విలాసినులగు స్త్రీలు మనోహరములైన మురళీ వీణా మర్దల (మద్దెల) మృదంగాది వాద్యములను వాయించుచు తాండవ (నృత్య) సహితముగ ఉన్నతస్వరముతో పాడుచు పరస్పర విలక్షణములైన కేశబంధములచేతను వస్త్రాలంకారాదులచేతను నలంకరింపఁబడియున్నవారును, ఇటు నటు చలించునవియు వివిధప్రకారములైన అభినయ (దర్శన)ములతోఁ గూడియున్నవియు నగు హస్తముల పరిభ్రమణములచే నలువైపులయాకాశమును వస్త్రములను పల్లవయుక్తములుగ గావించువారును హాస్యరసముయొక్క అభినయమున సుందర అట్టహాసములచే నంతటను తమ దంతములను చంద్రునియొక్క కిరణకాంతులను ప్రసరింపఁజేయువారును, వీరరసముయొక్క అభినయమున గర్వయుక్తములైన హుంకారశబ్దములను గావించువారును, కరుణ, అద్భుతరసముల అభినయ లీలలందు చంచలస్వరముతోఁ గూడియుండువారును, శృంగారమానాదుల అభినయ (దర్శన)మున ఏకపాదముచే ధరాతలమును లీలాపూర్వకముగఁదన్నువారును, శృంగార, కోపాదుల అభినయమున పుష్పమాలాదులు చలించుటచే నక్షత్రములవలెఁ బడుచుండు పుష్పవర్షములచే పాండుర (తెలుపు) వర్ణముగలవారును, జలధారలవలెఁ గ్రిందఁబడివిచ్ఛిన్నములైన హార, ముక్తాదులపై పొరపాటున కాలిడుటచే జారునట్టి పాదములు గలవారును, చంచలములైన యాభరణములతోఁగూడి ఆకారసహితుఁడగు మన్మథుని దర్శింపఁజేయువారునయియొప్పుచు నృత్యముచేసిరి.

పేఠుః స్ఫుటపదం విప్రా వన్దినోఽవ్యఙ్గనాశ్చ తాః. 44

మఱియు నపుడు బ్రాహ్మణులు స్ఫుటమైన యుచ్చారణతో వేదపాఠమును గావించిరి. వందిజనులు స్తోత్రములనుజేసిరి; స్త్రీలు ఆనందసూచకములైన గానాదులను సల్పిరి.

వపురుత్తాణ్డవం పానం పానపా మదశాలినః
భోజ్యం బుభుజిరే చిత్రం భూషితా భోజనార్థినః. 45

ఆ యుత్సవమునఁ గొందఱు (ద్విజులుకానివారు) శ్రేష్ఠమగు మద్యమును త్రావిరి; భోజనార్థులు చిత్రవిచిత్రములైన యుత్తమ భోజ్యపదార్థములను భుజించిరి

సుధాదిపరిలేపేన రఞ్జితా గృహభిత్తయః
రేజూ రామేన్దుఖానేన పుష్పధూపవిలేపనైః. 46

సున్నము మొదలగువానిచేఁ బూయఁబడి బాగుగ నలంకరింపబడినట్టి యింటి గోడ లన్నియును శ్రీరామచంద్రుఁడను చంద్రునియొక్క ప్రకాశముచేతను, పుష్పధూపాదుల విలేపనములచేతను మిగుల శోభను బొందెను.

వాసాంసి వసితాశ్చిత్రాణ్యుత్తమస్రగ్విభూషణాః
చేరుః పరిచరాశ్చేట్యశ్చారుగన్ధా నృపాధ్వరే. 47

విచిత్రములైన వస్త్రములను ధరించి, ఉత్తమ హార, విభూషణాదులచే నలంకరించుకొని మనోహరములైన గంధ మాల్యాదులచే సుశోభితులై దాస, దాసీజనులు దశరథుని యా యుత్సవమను యజ్ఞమున నిటునటు తిరుగుచుండిరి.

దేహయష్టిషు సంయోజ్య వనితా యక్షకర్దమమ్
జగ్ముస్తాణ్డవనర్తక్యః శృఙ్గారాత్మగ్గణాన్తరమ్. 48

కర్పూరము, అగురు, కస్తూరీ మున్నగువానితోఁగూడ మర్దింపఁబడిన దేవచందనమును తమతమ దేహలతలకుఁ బూసికొని యుత్తమ నృత్యము గావించు స్త్రీలు శృంగారరూపమైనదియు, బాగుగ నలంకరింపఁబడినదియునగు రాజభవన మధ్యమును బొందిరి.

భవబహుల నిశావసానహర్షా దితి ఘనముత్సవమేవ సప్తరాత్రమ్
దశరథ నృపతిః సదా సభోగ శ్రియమకరోత్పదమక్షయం సమేతః. 49

ఇత్యార్షే శ్రీ వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు
నిర్వాణప్రకరణే ఉత్తరార్ధే మహోత్సవ వర్ణనం నామ
చతుర్దశాధికద్విశతతమః సర్గః ॥ 214 ॥

భరద్వాజా! అక్షయమగు బ్రహ్మపదమును బొందినవాఁడై దశరథమహారాజు, సంసారమను కృష్ణపక్షరాత్రి జ్ఞానసూర్యోదయముచే నశింప, తజ్జనితమగు ఆనందమువలన ఏడురోజుల వఱకును నివ్విధమున దాన భోగాది శోభాసహితమైనట్టి మహోత్సవమును జరిపెను.

ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున నుత్తరార్ధమున
మహోత్సవ వర్ణనమను రెండువందల పదునాల్గవ సర్గము ॥ 214 ॥



## పఞ్చదశాధికద్విశతతమః సర్గః

[రామాదివత్ప్రబుద్ధస్త్వం జీవన్ముక్తః సుఖీ వస
ఇతి వాల్మీకినా శిష్యో భరద్వాజోఽత్ర శిక్ష్యతే.

'శ్రీరామచంద్రాదులవలె ప్రబుద్ధుఁడవై, జీవన్ముక్తుఁడవై నీవున్ను (ప్రపంచమున సంగము లేనివాడవై) సుఖముగ వసింపుము' అని యివ్విధమున వాల్మీకి మహర్షిచే భరద్వాజుఁడు బోధింపఁబడుట యిచటఁ గాననగును.]

శ్రీ వాల్మీకి రువాచ :—

భరద్వాజ మహాబుద్ధే మమ శిష్యాధినాయక
ఇతి రామాదయో జ్ఞాతజ్ఞేయా నిఃశోకతాం గతాః. 1

శ్రీవాల్మీకి:- నా శిష్యులయొక్క నాయకుఁడవును, మహాబుద్ధిమంతుఁడవునగు ఓ భరద్వాజా! ఈ ప్రకారముగ రామచంద్రాదులుజ్ఞేయము (ఆత్మ) నెఱిఁగినవారై దుఃఖరాహిత్యము నొందిరి.

ఏతామేవ దృశం కాన్తామవష్టభ్య యథా సుఖమ్
నీరాగస్తిష్ఠ నిఃశఙ్కో జీవన్ముక్తః ప్రశాన్తధీః. 2

అట్లే నీవున్ను ఈ యుత్తమమగు పూర్ణబ్రహ్మాత్మ దృష్టిని దృఢముగ నవలంబించి రాగరహితుఁడవై, దుఃఖవర్జితుఁడవై, ప్రశాంతబుద్ధిగల్గి, జీవన్ముక్తుఁడవై సుఖముగ వసింపుము.

ధీరనభ్యస్తసఙ్గా హి రామాదీనామివానఘ
ఘనమోహనిమగ్నాపి విమూఢాపి న ముహ్యతి. 3

పాపరహితుఁడగు ఓ భరద్వాజా! ఇట్టి బుద్ధి (జ్ఞానము) రామాదులయొక్క బుద్ధివలెనే భోగములయొక్క సంగమునుగూర్చిన యభ్యాసములేకుండ రక్షింపఁబడినచో, మహామోహమయమగు సంసారమున నిమగ్నమైనను మోహమెన్నటికిని బొందనేరదు

ఏవమేతే మహాసత్వా జీవన్ముక్తపదం గతాః
రాజపుత్రా రాఘవాద్యా రాజా దశరథాదయః. 4

ఈ ప్రకారముగ మహాత్ములైన యా దశరథాది రాజులున్ను, రామచంద్రాది రాజపుత్రులున్ను జీవన్ముక్తపదమును బొందినవారైరి

త్వం చ పుత్ర భరద్వాజ స్వయమేవాసి ముక్తధీః
సత్యం ముక్తతరోఽస్యద్య శ్రుత్వేమాం మోక్షసంహితామ్. 5

పుత్రకా! భరద్వాజా! నీవున్ను స్వవిచారణచే పూర్వమే రామచంద్రునివలె ముక్తబుద్ధివై యుంటివి. ఇపుడీ మోక్షోపాయసంహితనువిని నిక్కముగ అత్యంతముక్తుఁడవైతివి.

మోక్షోపాయానిమాన్పుణ్యాన్ప్రత్యక్షానుభవార్థదాన్
బాలోఽప్యాకర్ణ్య తత్ జ్ఞత్వం యాతి కా త్వాదృశే కథా. 6

ఓ భరద్వాజా! ప్రత్యక్షానుభవమును గలుగఁజేయునట్టి యీ పవిత్రములైన మోక్షోపాయములనువిని బాలకుఁడున్ను (మంధాధికారియు) ఆత్మజ్ఞానము నొందుచున్నాఁడు. ఇఁక నీవంటి విచారపరుల (ముఖ్యాధికారుల) విషయమై వేఱుచెప్పవలెనా?

యథా పదం పుణ్యమనుప్రయాతా మహానుభావా రఘవో విశోకాః
వసిష్ఠవాక్యప్రసరేణ సాధో గన్తవ్యమాద్యం పదమేవమేవ. 7

ఓ సాధూ! వసిష్ఠమునీంద్రునియొక్క వాక్యములు హృదయములందు ప్రసరించుటచే కర్తృభావముచే సర్వసంశయ సహితముగ అజ్ఞానము నశించుటవలన రామాదులు పవిత్రజీవన్ముక్త

పదమునుబొంది దుఃఖరహితులైరి అట్లే నీవున్ను అద్వయమై, నిత్యసిద్ధబ్రహ్మ భావరూపమైనట్టి యట్టి జీవన్ముక్త పదమునేపొంది దుఃఖరహితముగ వెలయుము.

సతాం నయేనోత్తమసేవయా చ ప్రశ్నేన చోదారకథాగతేన
విన్దన్తి వేద్యం సుధియోఽప్రమత్తా వసిష్ఠసఙ్గాదివ రాఘవాద్యాః. 8

వసిష్ఠమునీంద్రుని సాంగత్యముచే శ్రీరామచంద్రాదులు జ్ఞేయమగు ఆత్మతత్త్వమును బొందగల్గినట్లు సజ్జనులగు మహాత్ములయొక్క శిక్షణచేతను ఉత్తమసేవచేతను, ఆదరపూర్వకముగ గావించు ప్రశ్నలచేతను, బోధోపాయభూతములైన గంభీరకథలచేతను, అప్రమత్తులగు ఉత్తమబుద్ధిగల అధికారులు ఆత్మతత్త్వమును బొందుచున్నారు.

తృష్ణావరత్రాదృఢబన్ధబద్ధా యే గ్రన్థయోఽజ్ఞస్య హృది ప్రరూఢాః
సర్వే హి తే మోక్షకథావిచారాద్బాలా హ్యబాలా ఇవ యాన్త్యభేదమ్.9

బాల్యావస్థయందు క్రీడలందాసక్తి గల్గియుండుటచేతను, (అనురాగము) నెఱుగకయుండుటచేతను స్త్రీలు తమ భర్తలందు వైరస్యముగల్గియున్నను, ప్రౌఢవయస్సురాగానే యా తమ భర్తలతోడ అభేదరూపత్వమును బొందునట్లు తృష్ణయను చర్మ, రజ్జువు (త్రాడు)చే దృఢముగ బంధింపఁ బడినవియు, అజ్ఞానియొక్క హృదయమున బాగుగ రూఢినొందియున్నవియునగు దేహేంద్రియాది తాదాత్మ్యధ్యాసరూపములును గృహపుత్ర ధనదారాదులందలి మమత్వరూపములును, సర్వభూతములందును నొకే ఆత్మగలదను అనుభవము కలుగింపమి రాగద్వేషాదులకు హేతుభూతములునైన గ్రంథులెవ్వియో అవియన్నియును ఈ మోక్షోపాయ కథావిచారముచే ఆత్మయందు విలీనములై సర్వభూతములతోడ అభేదము (ఏకరసత్వము)ను బొందుచున్నవి.

మోక్షాఖ్యుపాయాన్సుమహానుభావాన్జ్ఞాస్యన్తి యే తత్త్వవిదాం వరిష్ఠాః
పునః సమేష్యన్తి న సంసృతిం తే కోఽర్థః సుతాఽన్యేన బహూదితేన.10

పుత్రకా! భరద్వాజా! అధికముగఁ జెప్పనేల! మందాధికారులైనను ఎవరు అజ్ఞాననాశకరములగుటవలన మహానుభావరూపములైన యీ మహత్తరములగు మోక్షోపాయములను గురుముఖతఃశ్రవణముచేయుటద్వారా యెఱుఁగుదురో వారున్ను తత్త్వవేత్తలలో శ్రేష్ఠులై మరల యీ సంసారము నెన్నటికిని బొందకయుందురు

బహుశ్రుతా యే ప్రవిచార్య సమ్యక్ప్రబోధితార్థే కథయా జనాయ
సన్తో వరిష్యన్తి పునః శిశుత్వం న తే ప్రయాస్యన్తి కిమన్యవాక్యైః. 11

ఏ సజ్జనులీమోక్షోపాయగ్రంథమును బహుశ్రుతులకు (మహావిద్వాంసులగు) గురువుల యెదుట స్వయముగ లెస్సగ విచారించి అట్టి సంవాదముద్వారా యద్దాని అర్థమును బాగుగ నెఱిఁగిన మీదట తదుపరి స్వయముగ ముముక్షువులకు దానిని (గురుసంప్రదాయరీతిగ) వచింతురో, అట్టివారు అజ్ఞానమునుగాని, పునర్జన్మనుగాని బడయునేరరు అట్టి బ్రహ్మాత్మజ్ఞానముకంటె వేఱైనట్టి ఇతర వాక్యములచే నేమి ప్రయోజనము?

యే వాచయిష్యన్త్యనపేక్షితార్థా యే లేఖయిష్యన్తి చ పుస్తకం వా
యేకారయిష్యన్త్యపి వాచకం వా వ్యాఖ్యాతృయుక్తం శుభమార్యదేశే.12

తే రాజసూయస్య ఫలేన యుక్తా ముహుర్ముహుః స్వర్గముదారసత్త్వాః
మోక్షం ప్రయాస్యన్తి తృతీయ జన్మ లాభేన లక్ష్మీమివ పుణ్యవన్తః. 13

ఎవరు అర్థమునెఱుఁగక కేవల మీ మోక్షోపాయ గ్రంథముయొక్క పారాయణము మాత్రము చేయుదురో, లేక ద్రవ్యాదుల నపేక్షింపక నిద్దానిని లిఖింతురో, లేక ఉత్తమమైన ఆర్యదేశమున దీని నితరులకు వ్యాఖ్యానముచేసి చెప్పుచు తద్వారా జీవికను కల్పించుకొందురో, వారందఱును సకాములగుచో రాజసూయయజ్ఞముయొక్క ఫలముతోఁ గూడుకొనినవారై లక్ష్మివలె పుణ్యవంతులై మరల మరల స్వర్గమును బొందుదురు. నిష్కాములగుచో ఉత్తమజన్మలను బడయుచు క్రమముగ మూఁడవజన్మయందు జ్ఞానులై మోక్షమునొందుదురు.

ఇమాం పురా మోక్షమయీం విచార్య సుసంహితాం సద్వచనాద్విరిఞ్చః
ప్రయుక్తవానేతదచిన్త్యరూపో భవన్త్వసత్యాశ్చ న తస్య వాచః. 14

ఓ భరద్వాజా! నాచే రచింపఁబడిన యీ మోక్షమయమగు సంహిత (శాస్త్రము)ను పూర్వకాలమున అచింత్యరూపుఁడగు బ్రహ్మదేవుఁడు మునులయొక్క సమాజమున ఆమూలాగ్రముగ స్వయముగ విచారించి 'సత్యవక్తలగు వాల్మీకియొక్కయు వసిష్ఠమునీంద్రునియొక్కయు వాక్కు ఎన్నఁడును అసత్యముకాదు'. * అనునీవాక్యము నట సర్వులకును దెలిపెను.

మోక్షాభ్యుపాయాఖ్య కథాప్రబన్ధే యాతే సమాప్తిం సుధియా ప్రయత్నాత్
సువేశ్మ దత్వాఽభిమతాన్నపానదానేన విప్రాః పరిపూజనీయాః 15

ఈ మోక్షోపాయకథయొక్క సమాప్తియందు ఉత్తమబుద్ధిగల మనుజుఁడు శ్రేష్ఠగృహాదులను అభిమతములైన అన్నపానాదులను దానమొసంగుటద్వారా వాచకుని (తద్గ్రంథమునుజెప్పువానిని) తదితర బ్రాహ్మణాదులను పూజింపవలయును.

దేయం చ తేభ్యః ఖలు దక్షిణాది చిత్తేప్సితం స్వస్య ధనస్య శక్త్యా
మత్వానురూపం కృతమేవ సర్వ పుణ్యం యథాశాస్త్రముపైత్యసౌ తత్. 16

అట్లు దానాదులఁ జేయువాఁడు దాను గావించు సుకృతముయొక్క ఫలమును శాస్త్రానుసారము అవశ్యము తానుబొందునని నిశ్చయించి తన ధనములోనుండి శక్త్యనుసారము ఆ బ్రాహ్మణులకును దీనాదులకును వారికభిమతములైన దక్షిణాదుల నొసంగవలయును.

ఏతత్తే కథితం కథాక్రమశతైరోఘాయ బుద్ధేర్భృశం
వ్యాప్తం బృంహితబ్రహ్మతత్త్వమమలం దృష్టాన్తయుక్త్యాశ్రితమ్
శ్రుత్వైతచ్చిరనిర్వృతిం భజ భృశం జీవద్విముక్తాశయో
లక్ష్మీం జ్ఞానతతః క్రియాక్రమయుతాం భుక్త్వా క్షయామక్షయః. 17

---

* పూర్వరామాయణము రచించునపుడు బ్రహ్మదేవుఁడు వాల్మీకిపరమొసంగెను — "నతే వాగనృతా కావ్యే కాచిదత్ర భవిష్యతి" — (కావ్యమునందు నీవాక్కు ఎన్నఁడును అసత్యముకాదు)

ఇత్యార్షే శ్రీవాసిష్ఠమహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే ఉత్తరార్ధే గ్రన్థప్రశంసాతద్వాచనాది విధిర్నామ పఞ్చదశాధికద్విశతతమః సర్గః ॥ 215 ॥

ఓ భరద్వాజా! ఇట్లు యథాక్రమముగ అనేక యుపాఖ్యానములద్వారా వృద్ధినొందింపఁబడినదియు అనేక దృష్టాంతములతోను యుక్తులతోను గూడియున్నదియునగు ఈ బ్రహ్మతత్త్వ ప్రతిపాదకమగు మోక్షోపాయమను నిర్మలశాస్త్రమును నీయొక్క బోధకొఱకై నేను జెప్పితిని. దీనిని విని జీవించియున్నను విముక్తభావముతోఁ గూడుకొనియున్నవాఁడవై లోకానుగ్రహముకొఱకై జ్ఞాన తపః క్రియాఫలయుక్తమైనదియు ప్రారబ్ధభోగసత్కర్మ ఫలభూతమైనదియు చిరస్థాయియనగు యోగజ్ఞానసిద్ధైశ్వర్యలక్ష్మిని అనుభవించి పిమ్మట దేహసహితుఁడవైయున్నను దేహరహితుఁడవై యున్నను శాశ్వతమై ప్రశాంతమై నిరతిశయానందరూపమైనట్టి ముక్తిని పూర్ణముగ సంప్రాప్తి నొందుము.

ఇతి శ్రీవాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున నుత్తరార్ధమున గ్రంథప్రశంసా తద్వాచనాదివిధియను రెండువందల పదునైదవ సర్గము ॥215॥

## షోడశాధికద్విశతతమః సర్గః.

[ అరిష్టనేమిసురుచికారుణ్యాదికృతార్థతా
వర్ణ్యతేఽత్ర గురుభ్యశ్చ శిష్యైరాత్మనివేదనమ్.

అరిష్టనేమిరాజుయొక్కయు సురుచియను అప్సరసయొక్కయు కారుణ్యాదులయొక్కయు కృతార్థత గురువులకు శిష్యులయొక్క ఆత్మనివేదనము అను విషయములిచట వర్ణింపఁబడుచున్నవి.]

**శ్రీ వాల్మీకిరువాచ:—**

ఏతత్తే కథితం రాజన్నుక్తమ్పృయోనేః సుభాషితమ్
అమునా తత్త్వమార్గేణ తత్పదం ప్రాప్స్యసి ధ్రువమ్. 1

శ్రీ వాల్మీకి:— ఓ అరిష్టనేమిరాజా! ఈప్రకారముగ వసిష్ఠమునీంద్రుఁడు శ్రీరామచంద్రునకును, అగస్త్యమునీంద్రుఁడు సుతీక్ష్ణునకును నుపదేశించినట్టి యీ మోక్షోపాయమను సుభాషితమును నేను నీకుఁజెప్పితిని. తత్త్వమార్గమును బోధించునట్టి యీ గ్రంథముద్వారా నీవు తప్పక యా బ్రహ్మపదమును బొందగలవు.

**రాజోవాచ:—**

భగవన్భవతో దృష్టిర్భవబన్ధవినాశనీ
ఆలోకితో యయా చాహముత్తీర్ణోఽస్మి భవామ్బుధేః 2

రాజు (అరిష్టనేమి):— మహాత్మా! తమ కృపాకటాక్షము సంసారబంధమును నశింపఁజేయునదైయున్నది. అద్దానిచేఁ గాంచఁబడిన నేనున్ను సంసారసముద్రమును దాటఁగల్గితిని.

**దేవదూత ఉవాచ:—**

ఇత్యుక్త్వాప్సరో తతో రాజా విస్మయోత్ఫుల్లలోచనః
ఉవాచ వచనం మాం తు మధురం శ్లక్ష్ణయా గిరా. 3

దేవదూత:— ఓ అప్సరసా! ఆశ్చర్యముచే వికసించినట్టి నేత్రములుగల యా రాజిట్లు వచించి, ఆ పిమ్మట కోమలమై, మధురమైనట్టి వాక్కుతో నాతో నిట్లుపలికెను.

**రాజోవాచ:—**

దేవదూత నమస్తుభ్యం కుశలం చాస్తు తే విభో
సతాం సాప్తపదం మైత్రమిత్యుక్తం తత్త్వయా కృతమ్. 4

రాజు:— ఓ దేవదూతా! ప్రభూ! మీకు నమస్కారము. మీకు కుశలమగుగాక! సజ్జనులయొక్క మిత్రభావము ఏడుపదములు వారితో మాట్లాడుటచేగాని, ఏడడుగులు వారితో గూడ నడచుటచేగాని లభించునని పెద్దలు చెప్పినదానిని మీరు సత్యముగ నొనర్చితిరి.

ఇదానీం గచ్ఛ భద్రం తే దేవరాజనివేశనమ్
అనేన శ్రవణేనాహం నిర్వృతో ముదితోఽపి చ. 5

ఇక మీరిపుడింద్రలోకమున కేగుడు. మీకు శుభమగుగాక! ఈ మోక్షోపాయ కథయొక్క శ్రవణముచే నేను (సర్వతాపశమనమువలన) శాంతిని, పరితృప్తిని (నిరతిశయానంద లాభమువలన) మహా ప్రసన్నత్వమును బొందితిని.

శ్రుతార్థం చిన్తయన్నత్ర స్థాస్యామి విగతజ్వరః
ఇత్యుక్తోఽహం తతో భద్రే పరం విస్మయమాగతః. 6

వినినదానియొక్క అర్థమునంతయు విచారించుచు సంతాపరహితుడనై నేనిచటనే యుండెదను — ఓ మంగళస్వరూపిణీ! ఈ ప్రకారముగ ఆ రాజు వచింప అపుడాతని వినయ, వైరాగ్యాది గుణములజూచి నేను పరమాశ్చర్యము నొందితిని.

న శ్రుతం పూర్వమేవైతజ్ఞానసారం శ్రుతం మయా
తేనైవ ముదితశ్శాన్తః పీతామృత ఇవాధునా. 7

ఓ అప్సరసా! పూర్వము నేనెన్నడును వినియుండనట్టి జ్ఞానసారము నిపుడు (సత్సంగమువలన) వినగల్గితిని. దానిచే అమృతమును త్రాగినచందమున నేననంతరంగమున పరమానందమును; సంతృప్తిని బడయుచున్నాను.

తతో వాల్మీకిమాపృచ్ఛ్య ఆగతోఽస్మి త్వదన్తికే
ఏతత్తే సర్వమాఖ్యాతం త్వయా పృష్టం మమానఘే
ఇతః పరం గమిష్యామి శక్రస్య సదనం ప్రతి. 8

పాపరహితవగు ఓ అప్సరసా! అటుపిదప వాల్మీకిమహర్షి వద్దనుండి సెలవుగైకొని నేను నీసమీపమున కేతెంచితిని. ఈ ప్రకారముగ నీవడిగినదానినంతయు నేను చెప్పితిని. ఇక నేనిపుడింద్రలోకమునకు బోవుచున్నాను.

అప్సరా ఉవాచ :—

నమోఽస్తు తే మహాభాగ దేవదూత త్వయా మమ
శ్రావితాదర్థవిజ్ఞానాత్పరాం నిర్వృతిమాగతా. 9

అప్సరస-మహాభాగ్యశీలుండవగు ఓ దేవదూతా! నీకు నమస్కారము. నీవు వినిపించిన యీ శాస్త్రార్థవిజ్ఞానముచే నాకు పరమశాంతి గలిగినది.

కృతార్థా వీతశోకాస్మి స్థాస్యామి విగతజ్వరా
ఇదానీం గచ్ఛ భద్రం తే యథేచ్ఛం శక్రసన్నిధౌ. 10

ఇపుడు నేను కృతార్థురాలనైతిని నా దుఃఖము శమించినది. నేనింక సంతాపవర్జితనై యుందును. ఓ దేవదూతా! నీ యిష్టాను సారమిప్పుడు నీ విం్రదుని సన్నిధికేగుము. నీకు శుభమగుగాక!

అగ్నివేశ్య ఉవాచ :—

తతః సా సురుచిః శ్రేష్ఠా తమేవార్థమచిన్తయత్
స్థితా సా హిమవత్పృష్ఠే సమీపే గన్ధమాదనే. 11

అగ్నివేశ్యుడు:- పుత్రకారుణ్యా! అటుపిమ్మట ఆ శ్రేష్ఠవనితయగు సురుచి దేవదూతోక్తమగు ఆబ్రహ్మైక్యరూపమైన యర్థమునే చింతించుచు గంధమాదనపర్వత సమీపమున హిమాలయపర్వతసమీపముపై నివసించుచుండెను.

కచ్చిదేతచ్ఛ్రుతం పుత్ర వసిష్ఠస్యోపదేశనమ్
తత్సర్వమవధార్యాథ యథేచ్ఛసి తథా కురు.

పుత్రా! ఈ ప్రకారముగ నీవు వసిష్ఠమునీంద్రునియొక్క యు[illegible] గాని నంతయును బాగుగ విచారించి (మోక్షమునకు సాధనము కర్మయా, జ్ఞా[illegible] అను విషయమును నిశ్చయించి) ఆ తదుపరి నీకెట్లిష్టమో యట్లాచరింపుము.

కారుణ్య ఉవాచ :—

స్మృతిర్వాగ్దృష్టిసత్తా చ స్వప్నే వన్ధ్యాసుతేఽఖిలే
మరీచికా యథా తద్వజ్ఞానాత్సాంసారికీ స్థితిః. 13

కారుణ్యుడు:- తండ్రీ! భూత, భవిష్యత్, దూరస్థపదార్థములగూర్చిన స్మృతియు వాగ్వ్యవహారమున్ను, వర్తమానవిషయమునుగూర్చిన ప్రత్యక్షమైన దృష్టిసత్తయు, మెయ్యేల ఈ సంసారస్థితియునుగూడ తత్త్వజ్ఞానముచే నాకిపుడు స్వప్నప్రాయముగను, వంధ్యాపుత్రునివలెను, జలరహితమగు మరుభూమియందలి మృగతృష్ణవలెను మిథ్యామాత్రముగను నిర్విషయముగను భాసించుచున్నది.

మమ నాస్తి కృతేనార్థో నాకృతేనేహ కశ్చన
యథాప్రాప్తే తిష్ఠామి హ్యకర్మణి క ఆగ్రహః. 14

పూజ్యుండవగు తండ్రీ! ఇపుడు నాకీప్రపంచమున కర్మలఁజేయుటచేఁగాని, చేయకుండుటచేఁగాని యే ప్రయోజనమున్ను లేదు. కావున (శ్రీరామచంద్రునివలెనే) యథాప్రాప్తములగు

వర్ణాశ్రమవ్యవహారములనిట చేయుచునుందును. కర్మాచరణము. కర్మత్యాగము (అకర్మ) రెండును సమానమైయున్న నా కిఁక కర్మత్యాగమందే పట్టుదలయేల ?

అగస్తి రువాచ :—

ఇత్యుక్త్వా సౌమ కారుణ్య అగ్నివేశ్యసుతః కృతీ
ప్రాప్తకర్మా యథాన్యాయం కాలేకాలే వ్యవాహరత్. 15

అగస్త్యుఁడు:— ఓసుతీక్ష్ణా! జ్ఞానముచే కృతార్థుఁడైన అగ్నివేశ్యతనయుఁడగు కారుణ్యుఁ డివ్విధముగఁబల్కి పిమ్మట అగ్నిహోత్రాది కర్మాధికారమునొంది యథోచితకాలమున స్నాన, దాన, అగ్నిహోత్రాది యథాప్రాప్తములగు కర్మలను ధర్మపూర్వకముగ నాచరించుచునుండెను.

సందేహోఽత్ర న కర్తవ్యః సుతీక్ష్ణ జ్ఞానకర్మణి
సంశయాద్దృశ్యతే స్వార్థాత్సంశయాత్మా వినశ్యతి. 16

ఓ సుతీక్ష్ణా! కావున ఈ జ్ఞానకర్మల విషయమై నీవు సంశయింపవలదు. (జ్ఞానప్రాప్త్యనంతరము కర్మానుష్ఠానము బంధమును గల్గించునని సందేహింపకుము) సంశయముచే మనుజుఁడు నిజప్రయోజనమునుండి చ్యుతుఁడగును మఱియు సంశయములుగలవాఁడు (లక్ష్యప్రాప్తినొందక) నశించును.

ఏతచ్ఛ్రుత్వా మునేర్వాక్యమనేకార్థైక్యబోధనమ్
నమస్కృత్య గురుం ప్రాహ అన్తికే వినయాన్వితః. 17

అనేకకోటి సంసారికపదార్థములయొక్క, బ్రహ్మముతోటి సర్వవిరోధత్యాగపూర్వకమైన యేకత్వమును బోధించునట్టి అగస్త్యమునీంద్రుని యీమోక్షోపాయకథారూపమైన వాక్యమును విని వినయముతోఁగూడుకొనియున్న సుతీక్ష్ణుఁడు సమీపముననున్న గురువునకు నమస్కరించి యిట్లనెను.

సుతీక్ష్ణ ఉవాచ :—

నష్టమజ్ఞాన తత్కార్యం ప్రాప్తం జ్ఞానమనుత్తమమ్
సాక్షిణి స్ఫురితాభాసే ధ్రువే దీప ఇవ క్రియాః 18
సతి యస్మిన్ప్రవర్తన్తే చిత్తేహాః స్పన్దపూర్వికాః

సుతీక్ష్ణుఁడు:— గురుదేవా! నాయొక్క అజ్ఞానము కార్య (సంసార) సహితముగ నశించినది. సర్వోత్తమమగు (ఆత్మ) జ్ఞానము లభించినది. దీపముండియు నది అద్దానిచే ప్రకాశితములై నాట్యశాలయందు నట నర్తకాదుల క్రియలన్నియును ప్రవర్తించునట్లు, సర్వసాక్షియై, స్వయంజ్యోతి స్వరూపమై, నిత్యప్రకాశరూపమై, నిశ్చలమై, నిష్క్రియమైనట్టి పరమాత్మస్థితినొంది యుండ, అద్దానిచేఁ ప్రకాశింపఁబడినదై చిత్త, దేహాదుల చేష్టలన్నియును, సమస్త లౌకిక, వైదిక క్రియలును ప్రవర్తించుచున్నవి.

కటకాఙ్గదకేయూరనూపురైరివ కాఞ్చనమ్. 19
పయసీవ తరఙ్గాలీ యస్మాత్స్ఫురతి దృశ్యభూః
తదేవేదం జగత్సర్వం పూర్ణే పూర్ణం వ్యవస్థితమ్. 20

మఱియు సువర్ణమందు కటక, అంగద, కేయూర, నూపురాద్యాభరణములున్ను, జలమందు తరంగాదులున్ను స్ఫురించునట్లు, ఆ పరమాత్మయందే యీ దృశ్యజగత్తంతయును స్ఫురించుచున్నది. ఈ జగత్తంతయును ఆ పరమాత్మయే అయియున్నది. దానికంటెనిది అణుమాత్రమైనను భిన్నముకాదు పూర్ణమగు జగత్తు పూర్ణమగు పరమాత్మయందు నెలకొనియున్నది.

యథాప్రాప్తోఽనువర్తామి కో లఙ్ఘయతి సద్వచః

మహాత్మా! ఈ ప్రకారముగ నిశ్చయించి యథాప్రాప్తములగు వ్యవహారములనాచరించుచు నుండెద. ఏలయనిన, తమవంటి సజ్జనులయొక్క సద్వచనముల నెవఁడుల్లంఘింపఁగలఁడు?

భగవంస్త్వత్ప్రసాదేన జ్ఞాతజ్ఞేయోఽస్మి సంస్థితః. 21
కృతార్థోఽహం నమస్తేఽస్తు దణ్డవత్పతితో భువి

మహాత్మా! తమ యనుగ్రహముచే నేనిపుడు జ్ఞేయమగు ఆత్మనెఱిఁగినవాఁడనై యున్నాను. నేనిఁకకృతార్థుఁడనైతిని; నన్ను పరిరక్షించిన తమకు భూమిపై సాష్టాంగవందన మాచరించుచున్నాను.

గురోరుత్తీర్ణతా కేన శిష్యాణామస్తి కర్మణా. 22
కాయవాఙ్మనసా తస్మాచ్ఛిష్యైరాత్మనివేదనమ్

గురోరుత్తీర్ణతా సైవ నాన్యా కేనాపి కర్మణా. 23

పరమపురుషార్థ (మోక్ష) ప్రదమగు ఆత్మ జ్ఞానము నుపదేశించిన గురువు యొక్క యట్టి మహోపకారమునకుఁదగిన ప్రత్యుపకారము నేకర్మచే శిష్యులుచేయఁగలరు? కాఁబట్టి మనోవాక్కాయ కర్మలచే శిష్యులు గురువునకు ఆత్మ నివేదనము (తమ్ములను గురుచరణములందు సమర్పించుకొనుట) గావింపవలయును అదియే గురువునకుఁదగిన ప్రత్యుపకారము అంతేగాని మఱియేయితర కర్మచేతను ప్రత్యుపకారము కానేరదు.

స్వామింస్తవ ప్రసాదేన తీర్ణోఽహం భవామ్బుధేః
అపూరితజగజ్జాలం స్థితోఽస్మి గతసంశయః. 24

స్వామీ! తమయనుగ్రహముచే నేనిపుడు సంసారసముద్రమును దాఁటినవాఁడనైతిని. మఱియు నిజసచ్చిత్పూర్ణానందరూపముచే బ్రహ్మాండసమూహమునంతయు పరిపూర్ణమొనర్చి వెలయుచున్నాను.

యత్సర్వం ఖల్విదం బ్రహ్మ తజ్జలానితి చ స్ఫుటమ్
శ్రుత్వా వ్యాదీర్యతే సామ్ని తస్మై బ్రహ్మాత్మనే నమః. 25

ఏ బ్రహ్మము సామవేదమునందలి ఛాందోగ్యోపనిషత్తునందు 'సర్వంఖల్విదం బ్రహ్మ తజ్జలానితి శాంత ఉపాసీత' - (ఈ సమస్త ప్రపంచమున్ను బ్రహ్మమునుండియే యుత్పన్నమై, బ్రహ్మమందే స్థితిగల్గి, బ్రహ్మమందే లయించుచున్నది. కావున, ఈ జగత్తంతయును బ్రహ్మమే అట్టి బ్రహ్మమునే శమదమాదులుగల ముముక్షువు ఉపాసింపవలయును) - అను శ్రుతిచేతను, ఇతర శ్రుతులచేతను స్పష్టముగ (కరతలామలకమువలె ప్రత్యక్షముగ) తెలుపఁబడుచున్నదో, అట్టి బ్రహ్మ స్వరూపమునకు నమస్కారము!

బ్రహ్మానన్దం పరమసుఖదం కేవలం జ్ఞానమూర్తిం
ద్వన్ద్వాతీతం గగనసదృశం తత్త్వమస్యాదిలక్ష్యమ్
ఏకం నిత్యం విమలమచలం సర్వధీసాక్షి భూతం
భావాతీతం త్రిగుణరహితం శ్రీవసిష్ఠం నతాః స్మః. 26

**ఇత్యార్షే శ్రీ వాసిష్ఠ మహారామాయణే వాల్మీకీయే దేవదూతోక్తే మోక్షోపాయేషు నిర్వాణప్రకరణే ఉత్తరార్ధే బాలకాణ్డేద్వా త్రింశచ్ఛతసాహస్ర్యాం సంహితాయాం గురుభ్యః శిష్యైరాత్మనివేదనమ్ నామ షోడశాధికద్విశతతమః సర్గః ॥ 216 ॥**

నిర్వాణ ప్రకరణోత్తరార్ధమ్ సమాప్తమ్

**ఓం తత్ సత్**

బ్రహ్మానందరూపుఁడును, జ్ఞానోపదేశముద్వారా పరమసుఖదాయకుఁడును, కేవలము జ్ఞాన స్వరూపుఁడును సుఖదుఃఖాది ద్వంద్వములకన్నిటికిని అతీతుఁడును, ఆకాశమువలె నిర్మలుఁడును, సర్వవ్యాపకుఁడును, 'తత్త్వమసి' మున్నగు మహావాక్యములకు లక్ష్యభూతుఁడును, ఏక (అద్వైత) రూపుఁడును, నిత్యుఁడును, సంసారమలరహితుఁడును, కూటస్థుఁడు (నిశ్చలుఁడు)ను సమస్త ప్రాణులయొక్క బుద్ధివృత్తులకు సాక్షిభూతుఁడును, భావములన్నిటికిని అతీతుఁడును, త్రిగుణ రహితుఁడునగు శ్రీవసిష్ఠమునీంద్రునకు (తద్రూపబ్రహ్మమునకు) మేమందఱమును నమస్కరించుచున్నాము.

**ఇది శ్రీ వాసిష్ఠ తాత్పర్య ప్రకాశికయందు నిర్వాణప్రకరణమున నుత్తరార్ధమున 'గురువులకు శిష్యులయొక్క ఆత్మనివేదనము' అను రెండువందల పదునాఱవ సర్గము ॥ 216 ॥**

శ్రీ యోగవాసిష్ఠము సమాప్తము

ఓం తత్ సత్.





శ్రీ వేదవ్యాస ముద్రాక్షరశాల, చిత్తూరు ఫోన్ నెం. 554.

